వంద వసంతాల నరసరావుపేట పురపాలక సంఘం

# నాటి నుండి నేటి దాకా... ఓ సమీక్ష



ఎం.ఆర్.కె. మూర్తి, విశ్రాంత ప్రాచార్యులు

స్థానికులచే స్థానికసమస్యల పరిష్కారానికి ఉద్దేశించబడింది స్థానిక పరిపాలన. అది ప్రజాస్వామ్యానికి పట్టుగొమ్మ, స్వపరిపాలనలో ఒక అపూర్వ, అద్భుతప్రయోగం. నిజానికి ఇదేమీ వినూత్న విషయంకాదు. వేదకాలంలోనే (క్రీ॥పూ॥ 1700) గ్రామాలలో సమితి, సభ, గ్రామా అని వుండేవి. పరాయిపాలన పుణ్యమాఅని క్రమంగా అవి కనుమరుగయ్యాయి.

ఆంగ్లేయుల పాలనాకాలంలో లార్డ్ రిప్పన్ వైస్రాయిగా నియమింపబడటంతో (1880) స్థానికపాలనలో నూతన అధ్యాయం ప్రారంభం అయింది. భారతీయులకు స్వపరిపాలనలో ప్రవేశం కల్పించాలన్న ఆశయంతో, దృఢసంకల్పంతో ఆయన పల్లెల్లో పంచాయితీలు, పట్టణాల్లో మునిసిపాలిటీలు ఏర్పాటు గావించారు (1882 తీర్మానం).

**చారిత్రక ఘట్టం :** ఆ నేపథ్యంలో 1915లో నరసరావుపేట పురపాలక సంఘం ఆవిర్భవించి నేటికి శతవసంతాలు పూర్తి చేసుకోవడం పట్టణచరిత్రలో ఒక అద్భుతఘట్టం. ఈ అంశాన్ని ఒక చారిత్రక సంఘటనగా, ఒక గొప్ప ఉత్సవంగా, పట్టణానికే పండుగగా మలచిన కీర్తి నవ్యాంధ్రప్రదేశ్ ప్రథమ సభాపతి డా॥ కోడెల శివప్రసాదరావుగారికే దక్కుతుంది. ఈ శుభ సమయంలో పారిశుద్ధ్యం, ప్రజలకు మంచినీటి సౌకర్యం కలుగజేయడం మొదలగు అంశాల ఆధారంగా మన పురపాలక సంఘానికి రాష్ట్రంలో రెండవ స్థానం, దేశంలో 59వ స్థానం లభించడం పట్టణానికి గర్వకారణం.

**అద్భుత అంశాలు :** పురపాలక సంఘం వందవసంతాల ఉత్సవాలను వైభవంగా జరుపుకోవడం ఎంతవిశేషమో, ఒక శతాబ్ది కాలపు మునిసిపాలిటీ రికార్డులు చక్కగా 104 సంపుటాలలో భద్రపరచబడి, లభించడం అంతకన్నా విశేషం. అవి పట్టణ ప్రగతికి గొప్పఆధారాలుగా, వలసపాలనాకాలం నుండి నేటిదాకా పట్టణంలో చోటుచేసుకున్న పురోగతిని సాధికారికంగా, సంపూర్ణంగా సమకూర్చడంలో అమూల్యమైన ఆధారాలుగా నిలుస్తాయి. ఆ సంపుటాలను పరికిస్తుంటే చరిత్రగుండా పయనిస్తున్న భావన కలుగుతుంది. నాటి పాలకుల ముందుచూపు మనకు ఆశ్చర్యంతోపాటు ఆనందం కలిగి స్తుంది. క్లుప్తంగా ముఖ్య అంశాలు ఇవి...

1) ఆ కార్యకలాపాలను (ప్రొసీడింగ్స్) చదువుతుంటే వలస పాలనా వాసనలు సోకి, ఒక విచిత్ర పరిసరాలలో పయనిస్తున్న అనుభూతి కలుగుతుంది. మునిసిపల్ ఛైర్మన్‌ను, వైస్‌ఛైర్మన్‌ను MRRY (మహారాజ రాజశ్రీ) అని సంబోధించడం (23-11-1917), కార్యకలాపాలన్నీ ప్రాంతీయభాషను కాదని చక్కని ఆంగ్లంలో, అందునా ముద్దులొలికే దస్తూరితో రాయడం, ఆంధ్ర విశ్వవిద్యాలయంశాఖను గుంటూరులో 'స్థాపించుటకు దొరతనము వారిని వేడుకుంటూ కవున్సిల్ తీర్మానము' (21-8-1926) చేయడం కొన్ని ఉదాహరణలు. అయితే, 1926 నుండి ఆంగ్లంతో బాటు ఆంధ్రంలో కూడా ప్రొసీడింగ్స్ రాయడం, ఆ తర్వాత పూర్తిగ తెలుగులోనే కొనసాగించడం జరిగింది.

2) నాటి పాలకులు ఎంత ముందుచూపుతో ఆలోచించారో, ఎంత ఆలోచనాత్మకంగా వ్యవహరించారో చూడండి!

అ) ఆంధ్రుల సమస్యల సత్వర పరిష్కారానికి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటుకు తక్షణచర్యలు తీసుకోవాలని మద్రాసు ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ తీర్మానం (14-11-1947).

ఆ) జన సంఖ్యనుబట్టి కౌన్సిల్‌లో అన్నివర్గాలకు భాగస్వామ్యమివ్వాలనడంతో బాటు, అందులో మహిళలకు ఎక్కువ

సీట్లు కేటాయించాలని తీర్మానించడం (11-11-1946).

ఇ) విద్యార్థుల ప్రగతికి ఉన్నత పాఠశాలల్లో సెక్రటేరియట్ కోర్సులు ప్రారంభించాలని ఉన్నతాధికారులకు దరఖాస్తు పెట్టడం (1951) కొన్ని ఉదాహరణలు.

3) గుంటూరు రోడ్‌లో పబ్లిక్ లెట్రిన్ నిర్మించాలి (1917), "ఎండాకాలంలో ప్రజారోగ్యంకు భంగం లేకుండా, మోటారు ట్రాఫిక్ ఎక్కువగా ఉండే రోడ్లపై దుమ్ము బాధ లేకుండా చేయుటకు వీధులలో నీళ్ళు చల్లాలి" (1957); గోవుల, గేదెల వధ అరికట్టాలి (1958); పెరుగుచున్న జనాభాను దృష్టిలో ఉంచుకుని కొత్త వార్డులు ఏర్పాటు చేయాలి (3-3-1918); వైస్ చైర్మన్ ఎన్నిక అంశంపై సుదీర్ఘ చర్చ (24-1-18 మరియు 27-2-28); శివరాత్రి సందర్భంగా రు. 934 ఖర్చుతో 3 రాత్రులు, 11 ప్రదేశాలలో గ్యాస్ లైట్లు ఏర్పాటు చేయడం (30-9-1933); ఫలానా వ్యక్తుల మరణం, జననం ఎందుకు రికార్డు చేయలేదని ఉద్యోగస్థులను ప్రశ్నించడం (4-8-1918); అద్దెదారుడు ఖాళీచేసినపుడు ఇంటి యజమానికి ఆదాయం తగ్గుతుంది గనుక పురపాలకసంఘం పన్ను తగ్గించాలి; మహాశివరాత్రి ఉత్సవాల సందర్భంగా ప్రత్యేక రైళ్ళను నడపాలని రైల్వేఅధికారులను కోరడం (1948), రోడ్లకు ప్రముఖుల పేర్లు పెట్టాలని - శ్రీ ప్రకాశం రోడ్డు, పట్టాభిరోడ్డు-(5-1-1948) తీర్మానాలు చేయడం ఆసక్తి కరంగా కనిపిస్తాయి.

అలానే మరికొన్ని ఆసక్తికర విషయాలు చూద్దామా! కాలంచెల్లిన వస్తువులను బహిరంగ వేలంలో అమ్మాలని, కన్పించకుండా పోయిన వస్తువులన్నింటిని, ఒక్క కలం తప్ప, రద్దు చేయాలన్న (Write off) **తీర్మానంలో (24-10-1926) ఆ పెన్నుకు అంత ప్రాధాన్యం ఇవ్వడం ఎందుకో అర్థం కాదు!** బరంపేటను ఫెయిర్ బరన్‌పేట (Fair Burnpet) అని పిలిచారు (1-2-1921). ఉన్నత పాఠశాలల్లో ఎండా కాలంలో ఫ్యాను వేసుకుంటే రోజుకు ఒక రూపాయి ఖర్చవు తుంది. కనుక ఫ్యాను వేయరాదని తీర్మానించిన ఆ రోజుల లోనే ఉపాధ్యాయుల జీతం రూ.60/- నుండి 70/- స్థాయిలో వుండడం (1926) ఆశ్చర్యం కలిగిస్తుంది! ఉద్యోగనిర్వహణలో భాగంగా మోటారువాహనాలు వాడుతున్న తమకు దారి సుంకం నుండి రాయితీ ఇవ్వాలన్న స్థానిక డి.ఎస్పీ., పోలీస్ ఇన్‌స్పెక్టర్ల అభ్యర్థన తిరస్కరణ (29-3-1928)- ఇలా ఎన్నో విషయాలు తెలుసుకోవచ్చు. ఒక ప్రముఖవ్యక్తికి ఎంత ఘనంగా శ్రద్ధాంజలి ఘటిస్తూ తీర్మానించారో చదువుతుంటే వాళ్ళ రచనా నైపుణ్యాన్ని మెచ్చుకోకుండా ఉండలేము. 'భారత దేశ దాస్యవిముక్తి కొరకు జరిగిన అసహాయ పోరాటంలో మహాత్మాగాంధీకి ప్రథమ అనుచరుడుగ, స్వతంత్రభారత నిర్మాణ కృషిలో ప్రధాని నెహ్రూకు కుడిభుజంగా మెలిగి, జాతి మత భేదరహిత, సర్వస్వతంత్ర దేశముగ ప్రపంచమున మన్ననలు బొందుటకు కృషిచేసి కృతార్థుడైన అబ్దుల్ కలామ్ ఆజాద్‌గారి నిర్యాణమునకు ఈ సభవారు తమ సంతాపము వెలిబుచ్చుతున్నారు. ఈ తీర్మానము వారి కుటుంబసభ్యులకు, భారతరాష్ట్రపతి శ్రీ బాబూ రాజేంద్రప్రసాద్ గారికి, కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ యు.ఎన్. ఢేబర్ గారికి, భారత ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ గారికి పంపడమైంది' (25-2-1958). అయితే ప్రొసీడింగ్స్ వ్రాసే పద్ధతిలో క్రమంగా కొంత అలసత్వం ఏర్పడడం బాధ కలిగిస్తుంది. పేరాలకు పేరాల కొట్టివేతలు, మధ్యలో కొన్ని ఖాళీపేజీలు వదలడం, చాలా అస్పష్టంగా వ్రాయడం లాంటివి ఆ వాల్యూమ్స్‌లో కన్పిస్తాయి.

**చైర్‌పర్సన్‌లు - ఒక సమీక్ష :**

ఒక శతాబ్దికాలంలో నరసరావుపేటకు 48మంది చైర్ పర్సన్‌లు సేవలందించారు. వారిలో 6 సంవత్సరాలు పాలిం చిన మొదటి 8 మంది (1915-1921) పదవిరీత్యా (Ex. Officio) చైర్ పర్సన్‌లు కాగా, పానల్ చైర్మన్‌లుగా నల్గురు ఒక్కొక్క రోజు చైర్‌పర్సన్‌లుగా వ్యవహరించారు. శ్రీ వి. పర బ్రహ్మ శాస్త్రి స్పెషల్ ఆఫీసరుగా ది. 18-1-1915న బాధ్యతల స్వీకరణతో నరసరావుపేట మునిసిపాలిటి ఆవిర్భావం జరి గింది. శ్రీ కొక్కు పార్థసారథి నాయుడు చైర్మన్‌గా ది. 8-1- 1928న ఎన్నిక అవటంతో దాని చరిత్రలో నూతన అధ్యాయం ప్రారంభమైంది. 31-3-1947



పార్థసారథి నాయుడు



నాగసరపు కృష్ణమూర్తి



నరసింహారావు



కొండలరావు

నుండి 27-9-1947, 1964 నుండి 1981, 1986 నుండి 1987, 1992 నుండి 1995, 2010 నుండి 2014 దాకా దాదాపు 36 సంవత్సరాలు స్పెషల్ ఆఫీసర్ల పాలన క్రింద ఉన్నది. ఇంక ఎన్నికైన వారిలో నాగసరపు కృష్ణమూర్తిగారు సుమారు 13 సంవత్సరాల 7 మాసాలు చైర్ పర్సన్‌గా కొనసాగి చరిత్ర సృష్టించగా, శ్రీ రాజామల్రాజు వెంకట రామకృష్ణ కొండలరావు గారు ఛైర్ పర్సన్‌గా (ఆరున్నర సంవత్సరాలు), కౌన్సిలర్‌గా-మొత్తం 23 సంవత్సరాలు సేవలందించి రికార్డు నెలకొల్పారు. శ్రీ రాజా మల్రాజు వెంకట నరసింహారావు బహదూర్ 5 సంవత్సరముల 10 మాసాలు, శ్రీయుతులు కొత్తూరి వెంకటేశ్వర్లు 3 సంవత్సరాలు, టి.రామకోటయ్య 7 మాసాలు, షేక్ ఫరీద్ సుమారు 2 సంవత్సరాలు, షేక్ మహబూబ్ సుభాని 2 సంవత్సరాల 3 మాసాలు, క్రోసూరి రంగారావు, వనమా సుబ్బారావు, శ్రీమతి గోనుగుంట్ల జోగేశ్వరమ్మ, శ్రీమతి కుంచాల రోశమ్మగార్లు ఒక్కొక్కరు 5 సంవత్సరాలు పాలన సాగించారు. సుదీర్ఘ పురపాలకసంఘం చరిత్రలో ప్రప్రథమ మహిళా చైర్‌పర్సన్‌గా ఎన్నికైన కీర్తి శ్రీమతి జోగేశ్వరమ్మకే దక్కింది. శ్రీ వనమా సుబ్బారావు పాలనా కాలంలో ద్విశతాబ్ది ఉత్సవాలు జరిగి, పట్టణ అభివృద్ధి విశేషరీతిలో జరగడం ఒక ప్రత్యేక అంశం కాగా, ప్రస్తుత చైర్‌పర్సన్ శ్రీ నాగసరపు సుబ్బరాయగుప్తాగారి కాలంలో పురపాలక సంఘ శతాబ్ది ఉత్సవాలు అద్భుతరీతిలో జరుగు తుండడం ఒక అపూర్వ సంఘటన.

**ప్రగతిపథంలో పురపాలకసంఘం :** ఈ శతాబ్దికాలంలో పురపాలకసంఘ ప్రగతిని 3 భాగాలుగా విభజించి పరిశీలిద్దాం. 1) స్వాతంత్ర్యానికి పూర్వదశ, 2) స్వాతంత్ర్యానంతర దశ, 3) 21వ శతాబ్ది ప్రవేశదశ.

**స్వాతంత్ర్యానికి పూర్వదశ (1915-1947) :** శైశవ దశలో ఉన్న పురపాలకసంఘం ఆర్థిక పటిష్టతను పుంజుకుని అభివృద్ధిపథంలో ఎలా పయనించిందో క్లుప్తంగా తెలుసుకుందాం. 1915లో 6,700. 1930లో 22 వేలు జనాభాగల మునిసిపాలిటీ పరిమిత వనరులతో ఆనాడు సాగించిన పాలన ప్రజలకు మౌలిక సదుపాయాలు సమకూర్చడం వరకే పరిమితం అయింది. వాహనాలు, ఇళ్ళపన్ను, జంతువులపై పన్ను, నగర సుంకం (అక్టాయి పన్ను)లతో బాటు టోల్‌గేట్ వసూలు 1921-22లో ప్రారంభించారు. పురపాలక సంఘాన్ని వార్డు లుగా విభజించి కౌన్సిలర్‌ల ఎన్నిక జరగాలని ప్రభుత్వం నిర్ణయించింది (29-5-1919). గారేజికి నెల అద్దె ఒక రూపాయి ఉన్న ఆ రోజులలో కన్యకాపరమేశ్వరి లైబ్రరీకి గ్రాంటు రూ.300/-(13-7-1926) అందజేయడం గమనార్హం. క్రమంగా ఆదాయం పెరగడంతో బరంపేటలో రూ. 200తో అతికష్టం మీద మట్టి రోడ్డు వేశారు. నాలుగు నెలలకు నీటిపన్నును రూ.4 వసూలు చేసినప్పటికీ మార్కెట్ రేటుకు మునిసిపల్ బంగళా స్థలం కొనుగోలుకు తీర్మానించారు (31-3-1928).

**స్వాతంత్ర్యానంతరదశ :** పురపాలకసంఘ చరిత్రలో అత్యధిక కాలం చైర్మన్‌గ సేవలందించిన నాగసరపు కృష్ణమూర్తిగారు దేశస్వాతంత్ర్యానికిపూర్వం, అనంతరం కూడా అధికారపీఠంపై ఉండడం విశేషం (29-11-1941 నుండి 31-10-1956 దాకా మధ్యలో కొన్ని విరామాలతో). ఆయన హయాంలో అనేక అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడం ఆనందదాయక విషయం. మునిసిపల్ కార్యాలయంలో మొత్తం సిబ్బంది 7 క్లర్కులు, 1 అటెండర్ (28-2-1847) ఉన్న ఆ రోజులలో కత్తుల చెరువువద్ద కల్వర్టు, నిమ్మతోటలో కంకరరోడ్డు నిర్మాణానికి పూనుకున్నారు. మశూచి నిరోధ

కానికి ప్రత్యేకచర్యలు తీసుకోవడం, నీటికరువు ఎదుర్కోవ దానికి రూ.5,000/-లతో పాత లారీ కొనుగోలు, ట్యాప్‌ల ద్వారా నీటి సరఫరాకు రూ. 70 వేలతో ఆయిల్ ఇంజన్ కొనడం, 16 ఎం.ఎం. ప్రొజెక్టరుకు అనుమతి (1-2-1951), మునిసి పల్ భవనాల విస్తరణకు, ఆట స్థలమునకై భూమి కొనుగోలుకు రూ.50 వేలు ప్రభుత్వ రుణం పొందడం, పెట్రొమాక్స్ లైట్ల స్థంభాలు విక్రయించి కరెంటు స్ట్రీటు లైట్ల ఏర్పాటు (1951-52), ఫైర్ సర్వీసుకు ఒక ఎకరాభూమి ఉచితంగా ఇవ్వడం (1-1-1956), ఎయిడెడ్ స్కూల్‌ను మునిసిపల్ స్కూల్‌గా మార్చడం వీరికాలంలో జరిగిన ప్రగతికి కొన్ని ఉదాహరణలు.

**శ్రీ కొత్తూరి వెంకటేశ్వర్లు** (10-8-1956 నుండి 30-9-1959) పాలనాకాలంలో మునిసిపల్ కార్యాలయంలో ఒక సీలింగ్ ఫాన్, కొంతకాలం తర్వాత టెలిఫోన్ (28-2-1958) ఏర్పడ్డాయి. చెరువులో చేపలు పట్టనిచ్చి నందుకు రూ. 3,000/- ఆదాయం రావడం, మునిసిపల్



స్కూల్‌లో పిల్లలు 1100కు చేరడం (1956) ఆనందదాయకం. హై స్కూల్ బిల్డింగ్, రోడ్లు అభివృద్ధి, లెట్రిన్‌ల పారిశుధ్యంపై ప్రత్యేకశ్రద్ధ పెట్టారు. అయితే నిధులకొరత మూలంగా ఫైర్‌స్టేషన్ నిర్మాణం ఆగినప్పటికి కూరగాయల మార్కెట్ కట్టుబడి జరిగింది (9-1-1959). సైరన్ ఏర్పాటు, నష్టాలలో నడుస్తున్న రుక్మిణి స్త్రీ సమాజంకు పన్నులేకుండా చేయడం, ఆయుర్వేద డిస్పెన్సరీ నెలకొల్పడానికి తీర్మానం (30-2-1958) చేయటం, ఆర్థిక, లైటింగ్, పనులు మొదలగు కమిటీల సాయంద్వారా పాలన జరగడం (1957) మరికొన్ని విశేషాలు.

**శ్రీ షేక్ ఫరీద్** (22-10-1981 నుండి 30-9-1983) అధ్యక్షకాలంలో రూ. 5.25 లక్షల వ్యయంతో రెండవ ఫిల్టరు ప్లాంటు, వరవకట్ట షాపుల నిర్మాణం (31-12-1981), రైల్వే గూడ్స్‌షెడ్ సమీపంలో 5 ఎకరాల 35 సెంట్లు కొనుగోలు జరిగిన ఆ రోజులలో చైర్మన్‌కు రూ. 500, వైస్ చైర్మన్ కు రూ.200, కౌన్సిలర్‌కు రూ.100 గౌరవవేతనం ఉందని



గుర్తుంచుకోవడం అవసరం. వీరి హయాంలో మురికివాడల అభి వృద్ధికి కేంద్రప్రభుత్వ పథకాలు (ఇ.ఎస్.ఐ.) ద్వారా మునిసిపాలి టీకి కొన్ని ప్రత్యేకగ్రాంటులు అంద డంతో కాలవల మరమ్మత్తులు, వెనుకబడిన వర్గాల కాలనీల అభివృద్ధి వంటికార్యక్రమాలు చేపట్టారు. జనాభా పెరుగుదల ఫలితంగ క్రమంగ పురపాలకసంఘ ఆర్థికస్థితి మెరుగు పడింది. అంతేగాక 1980 దశకంనుండి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుండి అధికమొత్తంలో గ్రాంటులు రావడంతో పురపాలక సంఘం భారీవ్యయంతో కూడిన అభివృద్ధి కార్య క్రమాలు చేపట్టే అవకాశం లభించింది. అలానే 1981 నుండి అపాయింట్ మెంట్, టౌన్ ప్లానింగ్ మొదలగు అనేక కమిటీలు ఏర్పడ్డాయి. అప్పటిదాకా రెండవ గ్రేడ్‌గా వున్న మునిసిపాలిటీ (1-4-1960నుండి), 28-4-1980 నుండి మొదటిగ్రేడ్ పురపాలక సంఘంగ గుర్తింపు పొందడం గమనార్హం.

**శ్రీ షేక్ సుభాని** (30-11-1983 నుండి 28-2-1986)



పాలనాకాలంలో కంభంపాలెం స్వీపర్ల కాలనీ, మునిసిపల్ హై స్కూలు, ఇక్కుర్తి సిద్ధార్థస్కూలు అభివృద్ధికి సుమారు రు. 1,45,000/-, ప్రాథమికోన్నత పాఠశాలకు 8వ తరగతి రావడం, మెర్క్యూరీలైట్లకు, పారిశుధ్య పరిక రాలకు, మలేరియా ఆయిల్, ట్రాక్టర్ల ఆయిల్‌కు రూ. 1,54,500/- మంజూరు కావడం పురపాలకసంఘ ఆర్థిక పటిష్ఠతకు సంకేతం. మరొక విషయం 1956లో 19 మంది ఉన్న కౌన్సిలర్ల సంఖ్య 1983 నాటికి 29కి చేరటం పట్టణ వ్యాప్తికి ఒక చిహ్నం.

**శ్రీ క్రోసూరిరంగారావు** (30- 3-1987 నుండి 28-3-1992). కలిసొచ్చేటప్పుడు నడిచొచ్చే కొడుకు పుడతాడన్నది సామెత. లాల్‌బహదూర్, సంగ్రీ మార్కెట్‌ల క్రింద రు. 3 లక్షల 77 వేలు ఆదాయంరాగా, వివిధ పథకాల క్రింద



ఎస్.సి., ఎస్.టి.లకు రు.7 లక్షలు, ఆరు పాఠశాలల అభివృద్ధికి రు.7 లక్షలు, దోభీ ఘాట్‌ల నిర్మాణానికి రు.1 లక్ష, ఎన్.ఆర్.వై. పథకాల కింద ప్రభుత్వం నుండి నిధులు దండిగా అందడంతో అభివృద్ధి కార్యక్రమాలు ఊపందుకున్నాయి. వరవ కట్ట రోడ్డులో 19 షాపులు, 5 పాఠ శాలల్లో అదనపు తరగతి గదులు, ఎల్.బి. మార్కెట్‌లో 24 షాపుల నిర్మాణానికి మొత్తం రు.13 లక్షలు వెచ్చించారు. గాంధీ పార్కులో రీడింగు రూమ్, అన్ని పార్కులలో టి.వి.లు ఏర్పాటుచేశారు. కల్వర్టులు, బోర్‌వెల్స్, రోడ్లు, కుళాయిలు, కాలవల నిర్మాణం, చిలకలూరిపేటరోడ్‌లో లారీ స్టాండ్ ఏర్పాటుకు 2 ఎకరాలు కేటాయింపు (1990), పట్టణం లోని 1929 విద్యుద్దీపాలకు చెందిన 41 కటౌట్‌ల నిర్వహణకు నలుగురు హెల్పర్స్ నియామకం (1991) ఇందుకు మరికొన్ని ఉదాహరణలు. ధ్వని కాలుష్య నివారణకు తగు చర్యలు తీసుకొనుటకు తీర్మానం చేయడం గమనార్హం. అన్నట్లు 1991 నాటికి పురపాలకసంఘ జనాభా 88,726కి చేరడం పట్టణ ప్రగతికి ఒక సంకేతం.

**21 శతాబ్ది ప్రవేశదశ :** నూతన శతాబ్ది ప్రారంభంతో పట్టణ ప్రగతి పరుగులందుకుంది.



మంత్రివర్యులు డా॥ కోడెల శివ ప్రసాదరావుగారి మార్గదర్శనంలో వనమా సుబ్బారావుగారి చైర్‌పర్సన్ హయాంలో(29-3-1995 నుండి 28-3- 2000) ద్విశతాబ్ది ఉత్స వాలు (1997) వినూత్నరీతిలో జరగ డంతో పట్టణంలో విశేష ప్రగతి చోటు చేసుకుంది. ప్రభుత్వ ఆస్పత్రి 100 పడకలతో తీర్చదిద్దబడడం, సెంట్రల్ లైటింగ్, రోడ్లవిస్తరణతో పట్టణానికి నూతనశోభ చేకూరింది. సుమారు రు. 20 కోట్లతో NTR మంచినీటి పథకం ప్రారంభించడంతో మండు టెండల్లో కూడా రెండు పూటలా నీరు అందించిన ఏకైక పురపాలక సంఘంగా ఎదిగింది. ముఖ్యమంత్రి చంద్ర బాబు నాయుడు గారిచే భువన చంద్ర టౌన్‌హాల్, శ్రీ కోడెల శివ ప్రసాదరావు క్రీడాప్రాంగణం కు శంకుస్థాపన (28-6- 1997) జరిగింది. గవర్నరు శ్రీ కృష్ణకాంత్ ఆ ఉత్సవాల లో విశిష్ట అతిథిగా పాల్గొనడంతో పట్టణానికి రాష్ట్రస్థాయి గుర్తింపు లభించింది. నాటి పంచాయితీరాజ్, గ్రామీణాభివృద్ధి శాఖామాత్యులు డా॥ కోడెల శివప్రసాదరావు గారు షాదీఖానాను ప్రారంభించడం (4-7-1997), గాంధీ పార్కు వన్నూరుకుంట పార్కు అభివృద్ధి మొదలగు అనేక విశిష్ట కార్యక్రమాలు చోటుచేసుకున్నాయి.

ఆ తరువాత పట్టణచరిత్రలో తొలిసారిగా డా॥ కోడెల శివప్రసాదరావుగారి ప్రోత్సాహంతో ఓ మహిళ చైర్‌పర్సన్‌గా **శ్రీమతి గోనుగుంట్ల జోగేశ్వరమ్మ** ఎన్నిక (29-3-2000 నుండి 28-3-2005) అవడం చరిత్రలో ఒక మైలురాయి. వారి హయాంలో భువనచంద్ర టౌన్‌హాలు, డా॥ కోడెల శివప్రసాదరావు క్రీడాప్రాంగణం, చంద్రబాబు నాయుడు కాలనీలకు గౌ॥ ముఖ్యమంత్రివర్యులు చంద్రబాబు



నాయుడు గారిచే ప్రారంభోత్సవం జరపడం (17-2-2001) పట్టణ ప్రగతిలో ఒక గొప్ప అధ్యాయం. డా॥ కోడెల శివప్రసాదరావు ఓపెన్ థియేటర్ ప్రారంభం (2004), నకరికల్లు రెండవ పైపులైన్, ఓవర్‌హెడ్ ట్యాంకుల నిర్మాణం, విద్యుత్ ఉప కేంద్రం స్థాపన, ప్రఖ్యాత శివక్షేత్రం కోటప్ప కొండపైకి రోడ్డు, మ్యూజియం, ఇంకా మరిన్ని హంగులతో రాష్ట్రం లోనే అదొక అద్భుతఆలయంగా ఎదగడం పట్టణానికే గర్వకారణం. ఈ ఆధ్యాత్మిక క్షేత్రాన్ని అపురూప క్షేత్రంగా తీర్చిదిద్దిన ఘనత డా॥ కోడెలకే దక్కుతుంది. పట్టణంలో ప్రథమ ఓవర్ బ్రిడ్జ్, అతి సుందరంగా కౌన్సిల్ మీటింగ్‌హాల్ నిర్మాణం, మునిసిపల్ హైస్కూల్ ఆధునీకరణ వీరి హయంలో జరిగిన మరికొన్ని కార్యక్రమాలు.

అనంతరం మంత్రి వర్యులు కాసు వెంకటకృష్ణా రెడ్డిగారి ప్రత్యేక కృషితో ప్రథమ బి.సి. మహిళ **శ్రీమతి కుంచాల రోశమ్మ** (30-9-2005 నుండి 29-9-2010) చైర్ పర్సన్‌గా ఎన్నిక అయ్యారు. సుమారు రూ. 40 కోట్ల వ్యయంతో అండర్ గ్రౌండ్ డ్రైనేజి వ్యవస్థకు రూపకల్పన,



రూ. 142 లక్షల అంచనాతో మెయిన్‌రోడ్డులో శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి షాపింగ్ కాంప్లెక్స్‌ల నిర్మాణం, ఆరు ఓవర్‌హెడ్ టాంకుల ఏర్పాటు, ఓవర్‌బ్రిడ్జ్ ప్రారంభం, దాదాపు దశాబ్ద కాలంగ కొనసాగుచున్న పట్టణంలోని సిమెంటురోడ్లు నిర్మాణం పూర్తి అవడం, పార్కుల అభివృద్ధి మొదలగు కార్యక్రమాలు చేపట్టడం విశేషం. ఆ తర్వాత సుమారు 4 సంవత్సరాల కాలం మునిసిపాలిటి ఆర్డీవో పాలన క్రిందకు వచ్చింది.

మునిసిపాలిటీకి సంబంధించిన తాజా సమాచారం సంక్షిప్తంగా ఇది. 2011 లెక్కల ప్రకారం జనాభా 1,17,489, 29 వేల గృహాలతో, 7.65 చ.కి.మీ. విస్తీర్ణంతో, 34 వార్డులతో, రు.17 కోట్ల ఆదాయం, 160 రెగ్యులర్, 263 కాంట్రాక్టు సిబ్బందితో, 15,955 గృహాలకు టాప్‌లద్వారా నీరు అంది స్తూ, ప్రతినిత్యం సుమారు 65 టన్నుల చెత్తను శుభ్రం చేస్తున్నారు. ఇప్పుడు మొత్తం 29 ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు వున్నాయి.

అనంతరం జరిగిన ఎన్నికలలో **శ్రీ నాగసరపు సుబ్బరాయగుప్తా** డా॥కోడెల ఆశీస్సులతో 3-7-2014న చైర్‌పర్సన్‌గా బాధ్యతలు స్వీకరించారు. ఆరు కమ్యూనిటీ హాల్స్ ఏర్పాటు, పుష్ కార్టులుతో వార్డుకు ఇద్దరు నగరదీపికలు ఇంటింటికి వెళ్ళి చెత్తను తీసుకురావడం, వార్డువార్డుకు తాను అవిశ్రాంతంగా తిరుగుచూ పట్టణ ప్రజల సమస్యల పరిష్కారానికి కృషిచేయడం మొదలగు కార్యక్రమాలు చేపట్టారు. నవ్యాంధ్రప్రదేశ్ తొలి శాసన సభాపతి డా॥ కోడెల శివప్రసాద రావుగారి సారధ్యంలో మునిసిపాలిటిశతవసంతాల ఉత్సవాలు అద్భుతరీతిలో ప్రారంభింప బడడం పురపాలక సంఘ చరిత్ర లో చారిత్రాత్మక ఘట్టం. పట్టణాన్ని శోభాయ మానంగా తీర్చిదిద్దడానికి ఎంతో ఆలోచనాత్మకంగా రోడ్లు విస్తరణ, ప్రతి ఇంటికీ మరుగుదొడ్డి ఏర్పాటు చేయాలన్న సంకల్పం, శ్మశానవాటికల ఆధునీకరణ- ఇలా ఎన్నెన్నో అభివృద్ధి కార్యక్రమాలు విలక్షణ రీతిలో అమలుకు సమాయత్త మవడంతో ఈ ఉత్సవాలు పట్టణానికే ఒక పండుగలా మారాయి.



భారతదేశ చరిత్రలో గుప్తుల యుగం స్వర్ణయుగం అని పేరు గాంచినట్లు స్పీకరుగారి ఆశీస్సులతో గుప్తాగారి పాలనాకాలం నరసరావుపేట పురపాలకసంఘ చరిత్రలో స్వర్ణయుగంగా మారుతుందని ఆశిద్దాం.

**స్థానిక స్వపరిపాలన - ఒక సమీక్ష :** చివరగా ఒక్కమాట. స్థానిక స్వపరిపాలనా విధానం ప్రజలలో నూతన స్ఫూర్తిని తెస్తుందని పట్టణంలో ఉన్న నలుగురు ఛైర్‌పర్సన్‌లతో మేము జరిపిన ముఖాముఖిల (ఇంటర్వ్యూ) ద్వారా స్పష్టం అయ్యింది. చైర్మన్‌గ ఎందరో ప్రముఖులను కలిసే అవకాశం అదృష్టం కలిగిందని, తన పదవీకాలంలో పట్టణానికి రాష్ట్ర స్థాయిలోనే గుర్తింపు వచ్చిందనీ, ఆ కారణంగానే నాగార్జున విశ్వవిద్యాలయం నుండి తనకు ప్రతిభాపురస్కారం లభించిందని శ్రీ వనమా హర్షం వెలిబుచ్చగా, ఆ అరుదైన పదవి కారణంగా భావవ్యక్తీకరణ బాగా అభివృద్ధి చెందిందని, అధికారులతో నిర్భీతితో మాట్లాడే అవకాశం ఏర్పడిందని, పాలన అంటే ఏమిటో అర్థం అయిందని శ్రీమతి జోగేశ్వరమ్మ ఆనందం వెలిబుచ్చారు. ఆ పదవి మూలంగా పాలనలోని సాధక బాధకాలు తెలిసొచ్చాయని, రాజశేఖరరెడ్డి, రోశయ్య లాంటి ప్రముఖులను కలిసే అదృష్టం తనకు లభించిందని శ్రీమతి కుంచాల రోశమ్మ అన్నారు. ప్రస్తుత చైర్‌పర్సన్ శ్రీ సుబ్బరాయగుప్త శతవసంతాల వేడుకల కాలంలో ఈ సదవకాశం తనకు రావడం ఒక వరంగా, ఒక గొప్ప అదృష్టంగా భావిస్తున్నానని, ఎన్నో సంక్షేమ కార్యక్రమాలు గౌ॥ స్పీకర్ డా॥ కోడెల శివప్రసాదరావుగారి నేతృత్వంలో నిర్వ హించే అవకాశం రావడం గొప్ప స్ఫూర్తి నిస్తుందన్నారు. ఈ కొద్ది కాలంలోనే పాలనలోని సంక్లిష్టత కొంతవరకు అర్థం ఐందని, పట్టణ ప్రథమ పౌరునిగా తన విధులను నిజాయితీగా, అంకిత భావంతో నిర్వహిస్తూ పట్టణ ప్రజలందరి అభిమానాన్ని చూరగొంటానన్న ఆశాభావం వెలి బుచ్చారు. స్థానిక స్వప[రి]పాలనలో ప్రథమ శిక్షణాలయం అని విజ్ఞులు ఉద్ఘాటించే[ది] ఇందుకే!

# చరిత్ర పుటల్లో...




డా॥ మదకా సత్యనారాయణ

తెలుగు లెక్చరర్ (రిటైర్డ్)


నరసరావుపేట పట్టణ నిర్మాణం జరగకముందే ఇక్కడ అట్లూరు అనే గ్రామం ఉండేది. అదే ఇప్పటి పాతూరు. కటికనేని నారన్న, రామయ్యలు ఆ గ్రామానికి మొఖాసాదార్లు. అట్లూరులో భీమేశ్వరాలయం, వేణుగోపాలస్వామి ఆలయం, ఆంజనేయస్వామి ఆలయం ఉండేవి. అట్లూరు భీమేశ్వరా లయంలో క్రీ.శ.1159, క్రీ.శ.1244, క్రీ.శ.1262 సంవత్స రాలనాటి మూడు శాసనాలున్నాయి. వీటిని బట్టి 1159కి పూర్వమే ఇక్కడ అట్లూరు ఉన్నట్లు స్పష్టమవుతుందని శ్రీ విష్ణుభొట్ల సూర్యనారాయణ, శ్రీవేదాంతం రంగాచార్యులు అనే న్యాయవాదులు 'నరసరావుపేట తాలూకా చరిత్ర'లో పేర్కొన్నారు. రాబర్ట్ నూయెల్ వ్రాసిన గ్రామచరిత్రలు, మెక్లీన్ 'కృష్ణాజిల్లా మాన్యూల్, కల్నల్ మెకంజీ 'కైఫీయత్తుల' (లోకల్ రికార్డ్స్)ను పరిశీలించి, తాము ఈ అంశాన్ని నిర్ధా రించినట్లు వారు స్పష్టం చేశారు. అయితే అట్లూరుకు ముందే ప్రస్తుతం పెద్దచెర్వు (లెనిన్‌నగర్)ఉన్న ప్రాంతంలో బోయపల్లి వుండేదనీ, కాపలాదారులైన కొందరు బోయలు తమ కుటుంబాలతో అక్కడ నివసించే వారని ప్రతీతి. కాగా ఈ అట్లూరు గ్రామం ద్వాపరయుగాంతం వరకు బోయపల్లి అని విద్వాన్ భాగవతుల వేంకట సుబ్బారావుగారు 'నరసరావుపేట – శ్రీ భీమలింగేశ్వర స్వామివారి చరిత్ర'లో పేర్కొన్నారు. అయితే ఇది కేవలం ఆధ్యాత్మిక దృష్టితో వర్ణించిన విషయమే గాని దీనికి ఎలాంటి చారిత్రక ఆధారాలుగానీ ఇతర ప్రమాణాలుగానీ లేవు. అట్లూరును అట్టలూరు అనేవారని కృష్ణా జిల్లా మాన్యూలు స్పష్టం చేస్తోంది. శాసనాల్లో కూడా 'అట్టలూరి భీమేశ్వర మహాదేవరకు...' అని వుండటం వల్ల అట్టలూరు క్రమంగా వాడుకలో అట్లూరుగా మారిందని చెప్పవచ్చు.

అట్లూరు 1797లో నరసరావుపేటగా అవతరిం చింది. చారిత్రాత్మకమైన ఈ మార్పు రాజా మల్రాజు వేంకట పెదగుండా రాయణింగారి హయాంలో జరిగింది. వీరిది విరియాల గోత్రం. వీరి ఇంటి పేరు మల్రాజు. చరిత్ర ప్రకారం మల్రాజులు కాకతీయుల పాలనలో మహాసామంతులుగా, దళాధ్యక్షులుగా ప్రసిద్ధులు. గుంటూరు వంకి దేవరను జయించి గుంటూరు మండలాన్ని పాలించిన వీరులు. కాకతీయరాజ్య పతనానంతరం రాచకొండ ప్రభువుల ఆశ్రయంలో కొల్లాపుర సంస్థానాధీశులుగా వ్యవహరించారు. రాచకొండరాజులు కొండవీడును జయించిన తరువాత మల్రాజులు గుంటూరు సీమకు వచ్చి బెల్లంకొండ, వినుకొండ దుర్గపాలకులుగా అధికారం చేపట్టారు. బెల్లంకొండ సంస్థానా ధీశులుగా ప్రసిద్ధికెక్కి, 'ఏడు కొండల ప్రభువులు'గా వర్ధిల్లారు. బెల్లంకొండ, కొండవీటి కొండ, వినుకొండ, కోటప్ప కొండ,



రాజాగారి కోట

గుత్తికొండ, సింగరకొండ, నందికొండ- ఈ ఏడు కొండలూ ఆనాటి మల్రాజుల పాలనలో ఉండేవి. మల అంటే కొండ. దీనివల్ల కూడా వీరు మల్రాజులుగా విశేషఖ్యాతి పొందినట్లు వాడుక. వీరికి బెల్లంకొండ, వినుకొండ, అగ్నిగుండాల వద్ద కోటలు వుండేవి. ఆ రోజుల్లో బెల్లంకొండ నుండి అగ్ని గుండాల వరకు చిట్టడవులు కొండ గుట్టల మధ్య ప్రయాణం అసౌకర్యంగా ఉండేది. బెల్లంకొండ, వినుకొండ అగ్నిగుండా లకు మధ్యస్థంగా ఉన్న అట్లూరు గ్రామం వద్ద కోటపేటలు నిర్మిస్తే అది అన్నివిధాల ప్రయోజనకరంగా వుంటుందని రాజా మల్రాజు పెదవేంకట గుండా రాయణింగారు భావించారు. ఈ ఆలోచన గుండా రాయణింగారి తండ్రి రాజా మల్రాజు వేంకటనరసింహారావు (వాడుక పేరు నరసారావు) గారికి కూడా ఉండేదనీ, దీనిని ఆయన కుమారుడైన గుండా రాయణింగారు అమలు జరిపారని కొందరి అభిప్రాయం. కోట పేటల నిర్మాణం కోసం, అట్లూరు మొఖాసాదార్లయిన కటికనేని నారన్న, రామయ్యలకు 'పెట్లూరివారిపాలెం'ను జాగీరుగా ఇచ్చి అట్లూరును గుండారాయణింగారు స్వాధీనం చేసుకున్నారు.

క్రీ॥శ॥ 1797 పింగళ నామ సంవత్సర శ్రావణ శుద్ధ పంచమి శుక్రవారంనాడు, తమ తండ్రి నరసారావుగారి పేరుతో కోటపేటల కట్టుబడికి శంకుస్థాపన జరిపించారు. కొప్పరపు సిద్ధాంతి బ్రహ్మశ్రీ చింతలపాటి కనకాద్రి, బ్రహ్మశ్రీ మేళ్లచెర్వు సాంబయ్య, శ్రీ రంగా వెంగమశెట్టి ఈ నిర్మాణాలకు వాస్తు సలహాలు ఇచ్చినట్లు తెలుస్తుంది. కోటకు తూర్పున ఎంతో పటిష్ఠంగా, అందమైన చెక్కడాలు, ఇనుప గుబ్బలు అమర్చిన 24 అడుగుల ఎత్తు, 16 అడుగుల వెడల్పుగల దారు నిర్మిత సింహద్వారం, వాయవ్యదిశగా పాలగచ్చుతో తళతళలాడే ఒంటి స్తంభం అద్దాలమేడగా ఐదు అంతస్తుల రాజభవనం చూపరులకు కనువిందు చేసేలా నిర్మించారు. రాణివాసం, దర్బారు హాలు, క్రీడామందిరం, రాజోద్యాన వనం, ఖిలాఖానా, ఆయుధాగారం, దివానా ఖానా, సువా రములు(భోజనశాలలు), అంబరుఖానా, అశ్వశాల తదితర నిర్మాణాలు జరిగాయి. పట్టణం నలు వైపులా అన్నిరకాల పండ్ల తోటలు కళకళలాడుతూ కనుపించేవి. పండుగ రోజులలో గుండా రాయణింగారు తన పట్టపు రాణులైన రాణి లక్ష్మయ్యమ్మారావు, రాణి రమణయ్యమ్మారావులతో సింహద్వారం పైన మూడవ అంతస్తులో వుండి ప్రజలకు దర్శనం ఇచ్చేవారు. ఏనుగుల ఈదులాటకు 105 ఎకరాల విస్తీర్ణంలో పెద్ద చెరువు, కోటకు అవసరమైన నీటి కోసం మానికలబావి త్రవ్వకం ఇతర నిర్మాణాలు జరిగాయి. కాగా తెలగ ఉప్పరి కులస్థుడైన పరమయ్యయోగి పేటకు ఈశాన్య దిక్కున పెద్ద కత్తువ చెరువు త్రవ్వించాడు. శాస్త్రప్రకారం గుండా రాయణింగారు నరసారావుపేట గ్రామంమధ్య బొడ్రాయి ప్రతిష్ఠ నిర్వహించారు. పేట నాలుగు దారులు కలిసేచోట 'చౌతరా' అనే ఒక పెద్ద మందిరాన్ని కూడా ఎంతో అందంగా నిర్మించారు. అయితే సుమారు 94 సంవత్సరాలు తరువాత 1891 నవంబరు 20వ తేదీన రహదారుల వెడల్పుకోసం 'చౌతరా'ను ఆనాటి దొరతనంవారు పడగొట్టించారు.

నూతనంగా నిర్మించిన నరసరావుపేటలో నివసించ టానికి పమిడిపాడు నుండి మేళ్లచెర్వువారు, తొండపి నుండి రామడుగువారు, బెల్లంకొండ నుండి కేతవరంవారు, మార్కా పురం నుండి తీగవరపువారు, మొవ్వ నుండి పువ్వాడవారు, ఈదర నుండి మంచెళ్లవారు, కొమ్మాలపాడు నుండి పాలుట్ల వారు, ప్రత్తిపాటివారు, ఏకావారు, కావూరు నుండి కావూరు వారు, యల్లమంద నుండి వేదాన్తంవారు మొదలైన బ్రాహ్మణ కుటుంబాలవారు వచ్చారు. అలాగే వైశ్యులు గురవాయపాలెం నుండి నాగసరపువారు, ములకలూరు నుండి ఊటుకూరు వారు, కొచ్చెర్ల నుండి రెడ్డివారు, వినుకొండ నుండి బత్తుల వారు, సత్తెనపల్లి నుండి మండవవారు, అనుపాలెం నుండి కొత్తవారు, పోతవరం నుండి కాకుమానువారు, కొత్తవరం నుండి దేసు వారు, పమిడిపాడు నుండి జుజ్జూరువారు, చిలకలూరిపేట నుండి మేళ్లచెర్వువారు, జొన్నలగడ్డ నుండి చిలకలవారు నరసరావుపేట చేరుకున్నారు. తాము కబురు పంపిన బ్రాహ్మణ వైశ్య కుటుంబాలకు గుండారాయణింగారు ఇళ్ల స్థలాలు, వ్యాపార దుకాణాలకు స్థలాలను ఉచితంగా ఏర్పాటు చేశారు. కాలక్రమంలో దొడ్లావారు, కూకుట్లవారు, పబ్బతి వారు, రంగావారు, గిరిదాసు, గోవర్ధనదాసు అనే మార్వాడీలు, వివిధ వృత్తులకు సంబంధించిన వివిధ కులాలవారు నరసరావుపేటలో నివాసం ఏర్పాటు చేసుకున్నారు.



రాజాగారి కోట - రేఖాచిత్రం



శ్రీ రాజా మల్రాజు వేంకట గుండారాయణింగారు

నరసరావుపేట సంస్థానంలో సుమారు 420 గ్రామాలు ఉండేవి. అంతేగాక నెల్లూరు జిల్లాలోని సైదాపురం జమీం దారీని, గుంటూరు మండలం రేపల్లె జమీందారీలోని రాచూరు భాగాన్ని, గోదావరి మండలం పెద్దాపురం సంస్థానంలోని కడలి ముఠాను కూడా కొనుగోలు చేసి నరసరావుపేట సంస్థానాన్ని విస్తరింపచేశారు. ఈ సంస్థానం మూలపురుషుడు వల్లభరాయడు. ఈయన ఢిల్లీపాదుషాను మెప్పించి కొండవీటి సీమలో కొంతభాగాన్ని స్వాధీనం చేసుకున్న పరాక్రమ వంతుడు. ఈయన తరువాత కొండలరాయుడు, రామరాయణింగారు, వారి సంతతి ప్రసిద్ధులు. అలాగే రాజా మల్రాజు వేంకటనరసింహారావు (ఈయన పేరే నరసరావుపేటకు పెట్టింది, క్రీ.శ. 1769-1819), ఈయన కుమారుడు రాజా మల్రాజు వేంకటపెదగుండారావు (కోటపేటల నిర్మాత, క్రీ.శ. 1769-1819), ఈయన పట్టపురాణి లక్ష్మయ్యమ్మారావు (క్రీ.శ.1826-1855) నరసరావుపేట సంస్థాన పాలకులుగా ప్రజల మన్ననలు పొందారు.

1832 నందన సంవత్సరంలో తీవ్రమైన కరవు రాగా రాణీలక్ష్మయ్యమ్మారావు ఆర్తులను అన్నార్తులను ఆదుకున్నారు. ఖజానా శూన్యమైనా ధాన్యపు కొఠారులు తెరిపించి ప్రజలకు ధాన్యం పంపిణీ చేశారు. ఎక్కువ మొత్తం చెల్లించి దూర ప్రాంతాల నుండి ధాన్యం తెప్పించి, నందన కరవు నుండి ప్రజలను కాపాడారు. అయితే తెల్లదొరతనానికి చెల్లించాల్సిన కప్పం బకాయిలు పేరుకుపోవటంతో క్రీ.శ. 1833-1846 సంవత్సరాల మధ్యకాలంలో నరసరావుపేట సంస్థానం కుంఫిణీ వారి పాలనలో ఉంది. గుండారాయణింగారు, రాణి లక్ష్మయ్యమ్మారావు దంపతులు గొప్పదానగుణం కలవారని స్థానిక చరిత్రలు వివరిస్తున్నాయి.

రాజా మల్రాజులు గొప్ప పరాక్రమవంతులనే విష యాన్ని గుంటూరు వంకిదేవర సంహరణ, బీరవల్లిపాయ యుద్ధం, పిండారీల దండును కకావికలు చేసి వధించి పార ద్రోలటం తదితర సంఘటనలు నిర్ధారిస్తున్నాయి. క్రీ.శ. 1815-1816 సంవత్సరాలలో పిండారీల దండు కృష్ణా గుంటూరు ప్రాంతాలను దారుణమైన దోపిడీలు హత్యలతో గడగడలాడించింది. పిండారీల ఆకస్మిక దాడులకు భయపడి అప్పటి గుంటూరు కలెక్టరు ఓక్స్ దొర ఇతర ఉద్యోగులతో కుటుంబసమేతంగా వచ్చి నరసరావుపేట కోటలో రక్షణ పొందాడు. గుండారాయణింగారు వారికి అభయమిచ్చి పెట్లూరివారిపాలెం సమీపంలో ఓగేరు వద్ద మకాం వేసిన పిండారీల దండుపై దాడిచేసి, అశ్వికదళాలతో వెంటాడి అందినంతవరకు సంహరించి, పిండారీలను పారద్రోలటం, నరసరావుపేట సంస్థానచరిత్రలో చిరస్మరణీయ సంఘటన. ఇది 1816 మార్చి నెలలో జరిగినట్టు లోకల్ రికార్డులు వివరిస్తున్నాయి. గుండారాయణింగారు తన 99 ఏనుగులను,

300 అశ్వాలను, రెండెడ్ల బండ్లపై ఫిరంగులను పెట్టించి కవచ శిరస్త్రాణాలను ధరించి ఈటె పట్టుకొని పట్టపుటేనుగు ఖండేరావుపై కూర్చొని పిండారీలను పారద్రోలిన సంఘటనను ప్రజలు గొప్ప వీరగాథగా నేటికీ గుర్తుచేసు కోవటం విశేషం. కటికనేని కృష్ణమ్మ, కొండమల్లుడు, పెద్ద ఫౌజు అవుతా రాయుడు, మిన్నెకంటి బుచ్చిరాజు సోదరులు తదితరులు ఈ పోరులో పాల్గొని పిండారీలను చంపుతూ తరిమికొట్టారు. కుంఫినీ ప్రభుత్వంగాని, మరే సంస్థానాధీశుడుగానీ ఎదుర్కొన లేని పిండారీలను పారద్రోలిన ఘనకీర్తి నరసరావుపేట సంస్థానానికి లభించింది. ఈ సంస్థానంలో 99 ఏనుగులు, 100 ఒంటెలు, 500 గుర్రాలు, గొప్ప కాల్బలము ఉన్నట్లు స్థానికచరిత్రలు వివరిస్తున్నాయి.

చరిత్రలో నరసరావుపేట సంస్థాన ప్రాధాన్యాన్ని నేటికీ వారి ధర్మకర్తృత్వంలోని కొన్ని దేవస్థానాలు గుర్తు చేస్తున్నాయి. అప్పటి శ్రీప్రసన్న రామలింగేశ్వరస్వామి ఆలయం (వినుకొండ), శ్రీకపోతేశ్వరస్వామి ఆలయం (చేజర్ల), శ్రీభావనారాయణస్వామి ఆలయం (ఇనుమెళ్ల), అలాగే సత్తెనపల్లికి దగ్గరలో గల భృగుబండలోని శ్రీజగన్నాథస్వామి ఆలయం, నరసరావుపేటకు దగ్గర ఉన్న కోటప్పకొండపై వేంచేసిన శ్రీత్రికోటేశ్వరస్వామి ఆలయం, రేపల్లె ప్రాంతం ములుకుదురులోని శ్రీచెన్నకేశవ స్వామి ఆలయం, అరవపల్లి శ్రీబాలకోటేశ్వరస్వామి ఆలయం, సత్తెనపల్లి ప్రాంతం నెమలిపురిలోని శ్రీ గోపాలస్వామి ఆలయం రాజా మల్రాజుల దైవభక్తినీ, పూర్వవైభవాన్ని వెల్లడిస్తున్నాయి. దేవాలయాలు, విద్యాలయాలు, ప్రజాహిత కార్యక్రమాలకు విరివిగా దానధర్మాలు చేసిన మల్రాజులు ప్రజల ప్రశంసలు పొందడం చారిత్రక సత్యం. రాజా గుండా రావు దత్తపుత్రులు రాజా వేంకటనరసింహారావు, రాజా కొండలరావు, కొండలరావు కుమారులైన రాజా వేంకట నరసింహారావు, రాజా వేంకటరామకృష్ణ కొండలరావు యథాశక్తి ప్రజాహిత కార్యక్రమాలు నిర్వహించారు. అలాగే రాజా విజయకృష్ణ గుండారావు, యువరాజు మల్రాజు వేంకట రామకృష్ణ కొండలరావు, ప్రశాంతరావు తమ పూర్వీకుల అడుగు జాడలలో ధర్మకర్తృత్వం నిర్వహిస్తున్నారు. ●



గంధ గజేంద్ర ద్వారం - కోట ముఖద్వారం

# వాస్తు పథం




## అన్నె సాంబశివరావు

డివిజనల్ ఎలక్ట్రికల్ ఇంజనీర్ (రిటైర్డ్)


నరసరావుపేట పట్టణము నల్లమలకనుమల- మైదానము ప్రారంభప్రదేశములో ఒక ముఖ్యపట్టణముగా సుమారు 200 సంవత్సరముల క్రిందట కట్టబడినది. జమీందారు గుండారావుగారు త్రికాలసర్వజ్ఞులైన మేళ్లచెఱువు సాంబయ్య శాస్త్రి మొ॥ ఉద్దండజ్యోతిష శాస్త్రవేత్తలను, పంచాంగకర్తలను, ఆలూరి శరభయాచారి, రంగా వెంకమశెట్టి యను ప్రసిద్ధవాస్తు శాస్త్రవేత్తలను సంప్రదించగా వారు పింగళి నామ సంవత్సర శ్రావణ శుద్ధపంచమినాడు ముహూర్తము పెట్టి వాస్తునిర్ణయము చేసినారు. మెకంజీ సేకరించిన గ్రామకైఫియతులు మరియు సనత్ ఆధారముల వలన ఆ శంకుస్థాపన స్థలము కొనకంచు వెంకటేశమను రైతుపట్టాభూమి. సుమారు 30 ఎకరములు. రంగా వెంకమచెట్టి యను వాస్తుశాస్త్రవేత్త భూత, భవిష్యకాలములు తెలిసిన గొప్పజ్ఞాని. ఆయన శంకుస్థాపన స్థలమును మార్చి అప్పటికే ఉన్న అట్లూరుగ్రామ పొలిమేర్లలో మరియొక గ్రామనిర్మాణము, చోళగ్రామ నిర్మాణ ప్రకారము ఈశాన్య శివగురుదేవ పద్ధతి (1036) గ్రంథము ప్రకారము బొడ్డురాయిని గ్రామమునకు నడిమధ్య స్థాపించి కోట నైరుతి యందుండునట్లు రూపుదిద్దినారు. ప్రస్తుతం ఈ బొడ్డురాయి అంకమ్మగుడికి ఈశాన్యములో అడ్డముగా ఆనించి క్రింద పెట్టబడి యున్నది.

200 సంవత్సరముల క్రిందట నిర్మించిన కోట యందు, కోట చుట్టు గృహములు 18వ శతాబ్ద నగరనిర్మాణ కట్టడముల, ఆధునిక నిర్మాణ కట్టడములతో పోటీబడుచున్నవి. రాతికట్టడముల ఆయుఃప్రమాణము 500 సంవత్సరములు. సుర్కీ సున్నపు కట్టడము ఆయుఃప్రమాణము 150-200 సంవత్సరములు. భవన నిర్మాణపద్ధతులు కోటచుట్టు రాతి కట్టడములకు, కాంక్రీటు కట్టడములకు పోలిక తెలుపుచున్న కోటలోని పెక్కుగదులలో అనేక చిత్రములు కలవు. ఈ కోట మరియు భవనములు హిందూ మహ్మదీయ శిల్పశాస్త్రముల యొక్క 18వ శతాబ్దిలోని రీతుల కలయిక. రంగా వెంగమ శ్రేష్ఠి ప్రసిద్ధవాస్తుశాస్త్రవేత్త మరియు సిద్ధాంతవేత్త. 'నరసరావు పేట' పట్టణ ఆయుర్దాయము 1,500 సంవత్సరములుగా నిర్ణయించినారు.

వాస్తురీత్యా నల్లమడ పర్వతములు నరసరావుపేట పట్టణమునకు దక్షిణ, నైరుతి మరియు పడమర దిశలయందు కలవు. నైసర్గిక వాస్తు ఎక్కువ అనుకూలముగానే యున్నది. సుమారు 60, 65 మైళ్ల దూరములో తూర్పుగా చిలుమూరిలో కృష్ణానది, ఉత్తరము 40, 45 మైళ్ల దూరములో వేదాద్రి దగ్గర కృష్ణానది, తూర్పు ఆగ్నేయము 60 మరియు 70 మైళ్ల దూరములో సముద్రతీరము నిజాము పట్టణము వున్నది. గుంటూరు జిల్లాలో మధ్యప్రదేశముగా ఉన్న నరసరావుపేట పట్టణము వాస్తునైసర్గిక అనుకూలముగా రూపుచెంది యున్నది. కొద్దిమంది ఆధునిక వాస్తుశాస్త్రవేత్తలు నైసర్గిక పరిస్థితులను ఎక్కువగా తీసుకొనరు. జ్యోతిష్యశాస్త్రములో ప్రపంచదేశ జ్యోతిష్యశాస్త్రము ఎంతో గొప్పది. నైసర్గిక వాస్తు ఆయా ప్రజల, నివాసులు ఆలోచనల సరళిపై ప్రభావము ఎక్కువగా ఉండును.

గుంటూరు జిల్లాలో 1833లో వచ్చిన డొక్కల కరువులో బ్రౌన్‌దొర గుంటూరుజిల్లా ప్రజలకు- అందునా నరసరావుపేట డివిజన్ ప్రజలను ఆదుకొనినారు. కావున ఈ డివిజను ప్రజలు బ్రౌన్‌దొరను గుర్తుంచుకొనవలెను.

ఇప్పటి పట్టాభిరామాలయము దగ్గర 200 సం॥ క్రితం స్థాపించిన బొడ్డురాయి ప్రమాణముగా తీసుకొని దక్షిణము మరియు పడమర దిశలతో ఎక్కువ పట్టణము పెరిగినది. క్రితము పది సంవత్సరముల నుండి ఉత్తరదిశ,

తూర్పుదిశలలో సత్తెనపల్లి రోడ్డు మీదగా సరియైన వాస్తురీతిలో పట్టణాభివృద్ధి జరుగుచున్నది. దక్షిణమున వినుకొండరోడ్డు మరియు కోటప్పకొండరోడ్డు వైపు పట్టణము పెరిగియున్నది. రైస్‌మిల్లులు, ఆయిల్ మిల్లులు మరియు డాల్‌మిల్లులు దక్షిణ దిశలోనే స్థాపించబడి పట్టణ ఆర్థికాభివృద్ధికి దోహద పడు చున్నవి. ఆగ్నేయము నుండి నైరుతిదిశలు లోపము. పట్టణ ఆర్థికాభివృద్ధికి మరియు సహజ ప్రస్తుత బైపాస్ ఫ్లై ఓవరురోడ్డు పట్టణమునకు అదనముగా 5 శాతం వాస్తురూపు అదనముగా కలిసి 95 శాతం వాస్తు ఉన్న పట్టణముగా సర్వతోముఖాభివృద్ధి చెందగలదు.

నరసరావుపేట పట్టణములో ఈశాన్యమున కత్వా చెఱువు ఉండుట నరసరావుపేట పట్టణవాస్తుకు ఎంతో దోహదపడినది. వాయవ్యదిశ తగ్గుటవలన పట్టణజానాభా లో అధికభాగము వైశ్యులు, మహమ్మదీయులు ఇతర వర్గముల వారు కలతలను, తగాదాలను మరియు లిటిగేషను సమస్య లను, కోర్టులకు వెళ్లకుండా తమలోతాము పరిష్కరించుకొం దురు. పట్టణపౌరులు సామాన్యముగా వినయవంతులు మరియు కష్టజీవులై సహజీవనము చేయుదురు. ఏ విధమైన అన్యాయ ప్రవర్తన ఉండదు. రైల్వేస్టేషను పట్టణమునకు నైరుతి దిశలో ఉండి పట్టణము కూడలి రహదారులైన గుంటూరు రోడ్డు, సత్తెనపల్లిరోడ్డు, వినుకొండరోడ్డు కోటప్పకొండరోడ్డు, చిలకలూరిపేటరోడ్డు మొదలగు రహదార్లు పట్టణమునకు అనుగుణముగా రూపుచెంది వాస్తుపరముగా మంచిఫలితము ఇచ్చుటకు ఆస్కారము ఏర్పడినది. నరసరావుపేట పట్టణవాస్తు 90 శాతం బాగుగా ఉన్నది. కొద్దిభాగమే వాస్తువక్రతలు ఉన్నవి. అవి రైల్వేమార్గము, తూర్పుగా ప్రవేశించి నైరుతి మార్గముగా వెలుపలికి వెళ్లుచున్నది. కావున నరసరావుపేట వృద్ధిచెందిన సంపద కొంతభాగము, సాంఘికముగా ఆర్థిక ముగా బయటిప్రదేశముకు బదిలీ జరుగును. మరియు కొంత వృథా యగును.

ఖచ్చితమైన పట్టణ దక్షిణప్రదేశము కోటప్పకొండ రోడ్డు. అది నరసరావుపేట వాసులకు రాజకీయ ఆర్థిక అధికా రములను చేకూర్చుచున్నది. స్వాతంత్ర్యమునకు పూర్వము నరసరావుపేట జమీందార్లు జిల్లాఅధికారము చెలాయించి నారు. స్వాతంత్ర్యానంతరము నల్లపాటి వేంకట్రామయ్యగారు స్పీకరుగాను, కాసు బ్రహ్మానందరెడ్డిగారు ఆర్థిక మరియు ముఖ్యమంత్రిగా, కేంద్రమంత్రిగాను పదవుల నలంకరిం చారు. కాసు వేంకటకృష్ణారెడ్డిగారు రాష్ట్రమంత్రి అయ్యారు. డా॥ కోడెల శివప్రసాదరావుగారు ఇదివరలో అనేక మంత్రి పదవుల నలంకరించి, ప్రస్తుతం నవ్యాంధ్ర ప్రథమ శాసన సభాపతి అయ్యారు. వీరందరికీ దేశ, రాష్ట్ర రాజకీయములలో కీలకపదవులు లభించుటకు ఈ కోటప్పకొండ రహదారి పట్ట ణమునకు ఖచ్చితమైన దక్షిణములో ఉండుటయే కారణము. ఖచ్చితమైన దక్షిణప్రదేశము రాజకీయ అధికారము కలుగ చేయును.

పాతఊరికి నైరుతీదిశలో ఉన్న పాతూరు శివాల యము చెక్కుచెదరకుండా ఉన్నది. పట్టణములో కళ్యాణమండ పములు మరియు దేవాలయములు, మసీదులు మరియు చర్చీలు ఉండవలసిన చోటే యున్నవి. ఆ కట్టడములు నరస రావుపేట ప్రశాంత వాతావరణమునకు ప్రజల అన్యోన్యతకు దోహదము చేయుచున్నవి. •

## మంచి ఉద్యోగికి ప్రోత్సాహం!

**తన యజమాని తనకు అప్పగించిన పనిని ఒక ఉద్యోగి మంచి సమర్థతతో నిర్వర్తించినట్లయితే ఆ యజమాని ఆ పని విలువ తెలిసిన, సహృదయులైన ఇతర ఉద్యోగులను సమావేశపరచి ఆ సభలో ఇతడిని ప్రస్తుతించాలి. తగిన రీతిలో సన్మానించాలి. అటువంటి యజమాని మాత్రమే తన సంస్థను చక్కగా పరిపాలించగలడు.**

**- భారతం, సభాపర్వం**

# నాటి - నేటి నిర్మాణాలు




## వేదాంతం వేంకట అంజనీకుమార్

జర్నలిస్ట్


పురాతన కట్టడాలు, శిలాశాసనాలు, నాణేలు ప్రాచీనగ్రంథాలు మన చారిత్రక సంపదలు. ఆధునిక కట్టడాలు మారుతున్న చరిత్రకు ప్రతిబింబాలు. నరసరావుపేటలో కూడా పాతూరు శివాలయం, రాజాగారి కోట గతచరిత్రకు నిదర్శ నాలు. స్టేడియం, భువనచంద్ర టౌనుహాలు, షాదీఖానా, భారీ బహుళ అంతస్తులు, అధునాతన కళాశాల భవనసముదా యాలు అభివృద్ధికి సంకేతాలు.

పాతూరులోని వేయి సంవత్సరాల పైబడిన చరిత్ర గల శివాలయాన్ని శృంగేరి మఠంవారు 3 కోట్ల రూపాయల వ్యయంతో అత్యంత ఆధునికంగా పునర్నిర్మిస్తున్నారు. దీనికి శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామివారు శిలాన్యాసం చేశారు. పాతూరులోని వీరాంజనేయస్వామి ఆలయం, వినుకొండరోడ్డు లోని భావనారాయణస్వామి ఆలయం పునరుద్ధరింప బడినవే!

రాజాగారికోట 1797లో 11.13 ఎకరాల విస్తీర్ణం లో శత్రుదుర్భేద్యంగా నిర్మితమైంది. 24 అడుగుల ఎత్తు, 16 అడుగుల వెడల్పుతో సింహద్వారం నిర్మించారు. అదే గంధగజేంద్ర ద్వారం. పట్టపుటేనుగును అధిరోహించిన మల్రాజు వేంకటగుండారాయణింగారు ఈ ద్వారం గుండా రాకపోకలు సాగించేవారు. కోట మీద 5 బురుజు లుండేవి. కోటలో పాలగచ్చుతో నిర్మించిన భవనాలు నాటి పనితనానికి అద్దంపడతాయి. ఈ భవనాలలో అద్దాల మేడ ఆకర్షణీయ మైనది. అయిదు అంతస్తులుగా ఉన్న ఈ భవనానికి వృత్తా కారపు మెట్లుగల స్తంభం నిర్మించటంవల్ల దీనిని ఒంటిస్తంభం మేడ అనికూడా పిలిచేవారు. ఈ భవనపు గోడలను వినూత్న ప్రక్రియతో తళతళలాడే విధంగా చూపరుల ప్రతిబింబాలు కనిపించే విధంగా నిర్మించారు.

ఆయుధాగారం, అశ్వశాల, మానికల బావి మంచి నిర్మాణాలు. జమిందారీ వ్యవస్థ పతనానంతరం కాలక్రమంలో అన్నీ కాలగర్భంలో కలిసి, ఈ కోట ప్రభుత్వ కార్యాలయాలు, ఆసుపత్రులు, వ్యాపార వాణిజ్య విద్యాసంస్థలు, బహుళ అంతస్తుల నివాసగృహసముదాయాలుగా మారిపోయింది. ప్రస్తుతం కోటకు ఆనవాలుగా జమీందారుగారి నివాసగృహం మాత్రమే మిగిలి ఉంది.

రెవిన్యూ డివిజన్‌వారి కార్యాలయం/ఖజానా కార్యా లయం, ఎమ్.ఆర్.ఓ. కార్యాలయం మొదలైనవి పాత కట్ట డాలే! ఎత్తుగా ఉన్న భవనాల పైకప్పు పెంకుతో అమర్చబడి ఉంటుంది. వేసవిలో ఈ భవనాలు ఎంతో చల్లగా వుంటాయి. జుమ్మా మశీదు కూడా పాతకట్టడమే! వంద సంవత్సరాల ప్రాచీనచరిత్ర గల పాతచర్చి స్థానంలో ప్రస్తుతం కొత్తచర్చి నిర్మాణం జరుగుతున్నది. మన పట్టణం టూరింగ్‌టాకీసు స్థాయి నుండి అధునాతన సినిమాహాళ్లను ఎన్నింటినో సంత రించుకుంది. మారుతున్న కాలంతో పాటు నరసరావుపేట పట్టణంలో కూడ ఆధునిక కట్టడాలు శరవేగంతో పెరుగుతు న్నాయి. అత్యాధునిక సౌకర్యాలతో ఉన్న భువనచంద్ర టౌనుహాలు, డా॥ కోడెల శివప్రసాదరావు ఓపెన్ ఎయిర్ థియేటర్, డా॥ కోడెల శివప్రసాదరావు క్రీడాప్రాంగణం సామా జిక సౌకర్యాలకు నెలవులు.

ఇవేకాకుండా మునిసిపల్ ఆఫీసు, న్యాయస్థాన భవ నాలు, హెడ్‌పోస్టాఫీసు, రైల్వేస్టేషను, శివా గెస్టుహౌసు, షాదీ ఖానా భవనాలు, ప్రభుత్వ ఆసుపత్రి మునిసిపల్ బాలుర/ బాలికల ఉన్నతపాఠశాలలు, శృంగేరీ శంకరమఠం, కృష్ణ చైతన్యవారి ఇస్కాన్ కృష్ణమందిరం, ఆర్.టి.సి. వంటి కట్ట డాలు, పలువురి సంపన్నగృహాలు మన పట్టణానికి పెట్టని సొమ్ములుగా ప్రకాశిస్తున్నాయి. విశాలమైన రోడ్లు, ఫ్లైఓవర్లు, డివైడర్లు, వీథుల కూడళ్లలోని విగ్రహాలు చివరకు ఆధునీక రించిన శ్మశానవాటికలో పార్కులు అన్నీ మన పట్టణానికి వన్నె తెచ్చేవే!

# స్టాంపుల కోట - నాణాల వేట




## ఎం. అనిల్ కుమార్

పొలిటికల్ సైన్స్ లెక్చరర్, యస్.యస్. & యన్. కాలేజి


ఖాళీ సమయాన్ని కొందరు క్రియాశీలంగా, వినోద, విజ్ఞాన సంబంధకార్యాలు నిర్వహిస్తూ ఆనందిస్తుంటారు. కొందరు పెన్నులు, అగ్గిపెట్టెలు, పురాతన వస్తువులు సేకరిస్తే మరికొందరు స్టాంపులు, నాణాలు సేకరిస్తారు. ఈ సేకరణనే ఆంగ్లంలో హాబీ అంటారు. తెలుగులో మనం 'సరదా' అని అందాం.

ప్రపంచంలో మేటి హాబీ స్టాంపుల సేకరణ. బ్రిటిష్ అధినేత 4వ జార్జి, అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్టు, రుమేనియా రాజు కెరాల్- ఇలా ఎందరో ప్రముఖులు స్టాంపుల సేకరణ ద్వారా అమితానందం పొందేవారు.

రౌలండ్‌హిల్ అన్న ఆంగ్లేయుడు స్టాంపు రూపశిల్పి. బ్రిటిష్ రాణి ముఖంతో ప్రపంచంలో ప్రథమంగ 1-5-1840న స్టాంపు విడుదల అయ్యింది. దానినే పెన్నీ బ్లాక్ స్టాంపు అంటారు. నాటి నుండి స్టాంపుల సేకరణ ప్రారంభం అయి క్రమంగ అది విశ్వవ్యాప్త సరదా అయింది. స్టాంపులతో బాటు ప్రథమ దినకవర్లు (FDC), విమాన కవర్లు, నినాద ముద్రలు - ఇలా ఎన్నో ఉపశాఖల సేకరణతో అది పరిపుష్టి చెందింది. త్రిడి, సిల్కు, స్టీలు, సెంటెడ్, మాట్లాడే స్టాంపులు విడుదలతో అదెన్నో విచిత్ర రూపాలు ధరించింది. ఎగ్ ఇయర్ సందర్భంగ 2007లో చైనా విడుదల చేసిన స్టాంపును ఒకవైపు నాకితే వంట వాసన, మరోవైపు దాని రుచి తెలుస్తుంది!

చిన్న పెద్ద అన్న తేడాలేకుండ అందరి అభిమానాన్ని చూరగొన్న సరదా ఫిలాటలి. ఆ సరదాతో ఆకర్షితుడయిన ఎస్.ఎస్. &ఎన్. కళాశాల రాజనీతిశాఖాధిపతి **శ్రీ ఎం.ఆర్.కె. మూర్తి** కేవలం నలుగురు సభ్యులతో నరసరావుపేట కేంద్రంగా 1973 జనవరిలో **జాతీయ స్టాంపులసేకరణ సంఘం (NPS)** నెలకొల్పారు. దానికి ప్రధాన కార్యదర్శిగా సేవ లందిస్తూ 'ఫిలాటిన్' అనే ఆంగ్ల పత్రికను నడిపారు. ఆంధ్రజ్యోతి వార పత్రికలో ఏకంగా 30 వారాలు 'స్టాంపులసరదా' పై వ్యాసాలు ప్రచురించారు. ఫిలాటలి వ్యాప్తికి అనేక రేడియో ప్రసంగాలు చేశారు. తెలుగులో ప్రప్రథమంగా 'స్టాంపుల సరదా' అన్న విస్తృత గ్రంథాన్ని 230 పేజీలతో ప్రచురించారు. అనేక జాతీయ, అంతర్జాతీయ స్టాంపుల ప్రదర్శనలలో పాల్గొని ఎన్నో బహుమతులు పొందారు. తానే అనేక ప్రదర్శనలకు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు. రాష్ట్రంలో పేరెన్నికగన్న ఫిలాటలిస్టుగా కొనియాడబడ్డారు.

దేశం నలుమూలల నుండి స్టాంపు ప్రియులు NPSలో సభ్యులుగా చేరడంతో అనతికాలంలోనే అది



దేశంలో రెండవ అతిపెద్ద సంస్థగా ఎదిగింది. మూర్తిగారి నేతృత్వంలో అది సాధించిన రెండు అపూర్వవిజయాలు మీదృష్టికి తెస్తాను.

1. ప్రముఖ వ్యక్తుల గౌరవార్థం తపాలాశాఖ స్మృత్యర్థ స్టాంపు, దానితో ఒక కవరు (FDC) విడుదల చేస్తూ, దానిపై ప్రథమదిన కాన్సలేషన్ ఇస్తారు. మహాత్మాగాంధి స్టాంపును ఏదో ఒక ఊరిలో కాన్సిల్ చేసేకన్న ఆయన జన్మస్థలమైన పోరుబందరులో కాన్సిల్ చేయిస్తే అది ఎంత విజ్ఞానవంత మైన సేకరణ అవుతుంది! వాటికి జన్మస్థల కవర్లు అని పేరుపెట్టారు. ఒక్క ఉదాహరణ. రాణి చన్నమ్మ కర్నాటక లోని కిట్టూరు పాలకురాలు. ఆమె స్టాంపు 23-10-1977న విడుదలయింది. ఆమె జన్మస్థలం బెల్గాం జిల్లాలోని కాక్టి. రాణి FDCపై ఒకేరోజు కాక్టి, కిట్టూరుల పోస్టు ముద్రలు సేకరిస్తే ఎంత అద్భుతంగ ఉంటుంది! ఆ రోజు ఆదివారం అవడంతో ఖుర్జా (ఉత్తరప్రదేశ్) సభ్యుడు ఎస్.కె. జైన్ బెంగుళూరు సర్కిల్ PMGని అభ్యర్థిస్తూ కిట్టూరు, బెల్గాంలలో ఆరోజు తపాలముద్ర ఏర్పాటు చేయవలసిందిగా జాబువ్రాయడం, దానికి PMG అనుమతి ఇవ్వడంతో మొదటి ఘట్టం ముగిసింది. ఆ ప్రదేశాలకు వెళ్ళి కవర్లపై ముద్రలు వేయించడానికి గోవావాసి సుధాగారు పూనుకున్నారు. ఆ రోజు సాయం త్రం 4 గంటలకు అధికారికంగా ఆ స్టాంపు విడుదల అవుతుందని తెలుసుకుని అతి కష్టంతో 5 గంటలకు సుమారు 300 కవర్లపై ముద్రలు సేక రించారు. ఇంతలో బెల్గాంలో 6 గంటలు తర్వాత కాన్సలేషన్ ఇవ్వరన్న వార్త విని, ఒక టాక్సీ తీసుకుని హుటా హుటిన 6 గంటలలోపు బెల్గాంచేరి అదే కవర్లపైన కాన్సలేషన్ సేకరించగలిగారు. ఇలా ప్రతి కవరు తయారీకి ఎంతో స్టడీ, ఎంతో ప్లానింగ్, దేశం నలు మూలల నుండి ఎందరో సహకారం అవసరం ఔతుంది. అక్కడే NPS ప్రత్యేకత, దానిని నడిపించే మూర్తిగారి విశిష్టత కన్పిస్తుంది.

2. ఒక కొత్త పరికరాన్ని, అంశాన్ని గురించి ప్రజలకు తెలియజెప్పడానికి తపాలాశాఖ నినాద ముద్రలను ఇస్తుంది. ఆనాడు ప్రజలందరకు నిత్యఅవసరమైనది తపాలాశాఖ కనుక ఆరోజులలో అదే గొప్ప ప్రచార సాధనం అయింది. 1933లో నూతనంగ ప్రవేశ పెట్ట బడిన టెలిఫోన్లను గురించి ప్రచారం చేయడానికి "జీవితాన్ని సుఖప్రదం చేసేది టెలిఫోన్" (9-5-1933), "ఫోనులో నిన్ను పిలుస్తున్నారు" (12-5-1933) లాంటి ముద్రలు తపాలాశాఖ కార్డులపైన వేసింది. ఎన్నో వ్యయప్రయాసలకోర్చి మూర్తిగారు 1917 నుండి 1974 వరకు నినాద ముద్రల జాబితా దేశంలో ప్రథమంగ తయారుచేసి **ఫిలాటిక్**లో ప్రచురించడం స్టాంపుల సామ్రాజ్యంలో ఓ అద్భుతంగ అనేకమంది కొనియా డారు. ప్రపంచ స్టాంపు సేకరణదారుల సంస్థ అధ్యక్షు డయిన శ్రీ డి.ఎన్. జాటియా ఫిలాటలీకి మూర్తిగారు చేస్తున్న సేవలను బహుధా ప్రశంసించడం నరసరావు పేటకే గర్వకారణం.

మన పట్టణానికే చెందిన **శ్రీ పి.ఎన్. చంద్రకుమార్** భారతదేశంలోని అతి ప్రాచీన విమాన కవర్లు (1911-1947), లయన్స్ కవర్లు సేకరించారు. స్టాంపుల సేకరణతో బాటు విశేష ప్రజాదరణపొందిన హాబీ నాణాల సేకరణ. అలానే మన దేశానికి చెందిన వెండి నాణాల సేకరణలో ఆయన కృషి ప్రశంసనీయమైంది.

**శ్రీ మామిళ్ల కృష్ణయ్య :** ఉపాధ్యాయులుగా తమవృత్తిని ఎంతో



సమర్ధ వంతంగా నిర్వహించి, ఎం దరో విద్యార్థులను ఉన్నత శిఖరాలు అధిరోహింప జేసిన వీరు ప్రవృత్తిగా ఈ అభిరుచి కలిగివున్నారు. హాబీ లలో రారాజు అయిన స్టాంపుల హాబీ విశిష్టత గురించి వీరి మాటల లో "ఐరోపా చరిత్ర" వంటి చారిత్రక అంశాలను అధ్యయనం చేసే సమయంలో కాని, భారత స్వాతంత్ర్యో ద్యమం గురించి వివరించే సమయంలో కాని స్టాంపుల ప్రాముఖ్యం అటు విద్యార్థులకు ఇటు అధ్యాపకునికి ఎంతో ఉపయుక్తంగా వుంటుంది. ఈ హాబీ బొమ్మల రూపంలో వుండటం వలన ఒక దేశచరిత్ర, సంస్కృతి, నాగరికత, ఆచార వ్యవహారాలు, ప్రభుత్వ పథకాలు, ఫస్ట్‌డే కవర్స్, పక్షులు, జంతువులు,

వాయు రవాణా బొమ్మలు, వివిధ దేశాల ఆటలు గురించి కళ్ళకు కట్టినట్లు ఉంటాయి. స్టాంపులతోపాటుగా దేశాల సార్వభౌమత్వానికి ప్రతీక అయిన కరెన్సీని, నాణాలను, నోట్లను దాదాపుగా 200 సేకరించి ఎంతో జాగ్రత్తగా భద్రపరచారు. వీటిలో ఈస్ట్ ఇండియా కంపెనీ నాణాలు, క్వీన్ విక్టోరియా, ఎడ్వర్డ్-VII, జార్జ్-V, జార్జ్-IV నయా పైసలు కూడా ఉన్నాయి. అక్షర క్రమంలో అల్బేనియా నుండి ఉగాండా వరకు మొత్తం 65 దేశాలకు చెందిన నాణేల సేకరణ ఆయన మరో అద్భుత సేకరణ. వీటినన్నింటిని వివిధ పాఠశాలల్లో ప్రదర్శనలు నిర్వహించడం ద్వారా విద్యార్థినీ విద్యార్థులకు అనేక అంశాలపై అవగాహన కల్పించే అవకాశం కలిగింది. 2-12-2014న ETVలో ఆయన సేకరణ గురించి ప్రసారం జరగడం విశేషం.

**శ్రీ కంబాల తిరుపతయ్య** దాదాపుగా ఓ దశాబ్దం నుండి



150 దేశాల నాణేలు, నోట్లు, పురాతన నాణాలు సేకరించారు. భారత దేశంలో నాణాలు వినియోగం మొదలైనప్పటి నుండి నేటి వరకు గల కరెన్సీని ఏ ఏ సమయంలో, ఏ ఏ రూపంలో ముద్రించారన్న సమగ్ర వివరాలను చక్కగా పుస్తక రూపంలో పొందుపరచిన ఘనత వీరికి దక్కుతుంది. ఈ హాబీతోపాటుగా నాటి గ్రామ్ ఫోన్ రికార్డుల నుండి నేటి కాలపు మెమోరీ కార్డుల వరకు సేకరించడం వీరి సరదా.

**శ్రీ గౌస్ బేగ్ :** శంకరభారతీపురంలోని జిల్లాపరిషత్ ఉన్నత



పాఠశాలలో ఫిజికల్ డైరెక్టర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. శ్రీగౌస్ బేగ్ నరసరావుపేటలో నాణాల సేకరణ గావిస్తూ వివిధదేశాల ఆచార వ్యవహారలకు సంబంధించిన ప్రతి చిన్న అంశాన్ని ప్రదర్శనల ద్వారా ఎన్నోవేల మందికి విషయ పరిజ్ఞానాన్ని అందించారు. వీరివద్ద 2వ శతాబ్దంనాటి 'రాజరాజచోళుడు', అల్లాఉద్దీన్ ఖిల్జి, ఘజనీమహమ్మద్, మహమ్మద్ బీన్ తుగ్లక్ కాలపు 'విద్వంకర', బ్రిటీష్ ఇండియా వెండి రూపాయలు, స్వతంత్ర భారత ప్రభుత్వ మింట్‌లు, కరెన్సీకి రెండు వైపుల రాజముద్ర గల విలక్షణ రూపాయి నాణెం, అచ్చు తప్పులతో ముద్రితమైన 'మిస్ ప్రింట్', 32 దేశాలకు చెందిన 41 కరెన్సీ నోట్లు, నూరు సంవత్సరాలనాటి రెవెన్యూ స్టాంపులు సేకరించి వాటిని ఎంతో అపురూపంగా భద్ర పరచారు. ఎంతో కష్టమైన వాటిని మరెంతో ఇష్టంగా సేకరించడం జరిగింది. అలాగే వీరు పాత రాతియుగపు పని ముట్లను సేకరించడం వీరి సేకరణలలో ఓ కొసమెరుపు.

లక్ష్మీ సెట్టి వెంకటరమణరావు గారు 1896 నుండి 1947 వరకు వచ్చిన తెలుగు అణాలను అధిక సంఖ్యలో సేకరించారు. ●

## నరసరావుపేట పురపాలక సంఘం వంద వసంతాల సందర్భంగా తపాలాశాఖ విడుదల చేసిన ప్రత్యేక కవరు



నరసరావుపేట ప్రగతి పథంలో....

# అప్పుడు... ఇప్పుడు!!




**జి. కోటేశ్వరరావు**

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు (రిటైర్డు)


**మన స్టేడియం కథ :**

ఒక గొప్ప ఆలోచన ఒక అద్భుత నిర్మాణానికి ఎలా దారితీస్తుందో తెలుసుకోవాలంటే మన స్టేడియం నిర్మాణమే ఒక చక్కని ఉదాహరణ. అది 2002వ సంవత్సరం. ఆ సంవత్సరంలోనే ఓ ప్రత్యేకత ఉందేమో! ఎటు తిప్పి చదివినా ఆ సంవత్సరం అలానే ఉంటుంది! అందుకే తలమానికమైన కట్టడం సమకూరింది. సత్తెనపల్లిరోడ్డు, పెద్ద పోరంబోకు, ప్రక్కనే గొప్పవాగు. వర్షాలు వచ్చాయంటే చాలు ఆ వాగు విజృంభించేది. పొంగి పొరలి ఆ ప్రాంతాన్నంతా ఓ ఏరులా మార్చేది. ఆ నీళ్లు అలా నిల్వ ఉండడం వల్ల ఆ ప్రాంతం దుర్గంధనిలయంగా మారేది. అది భరించలేని, చిరాకు పుట్టించే ప్రదేశంగా తయారయేది. ఏం చేస్తే బాగుంటుందని డా॥ కోడెల శివప్రసాదరావుగారు ఆ నాడు ఇ.ఇ.గా పనిచేస్తున్న నన్ను విశేషాదరణతో సంప్రదించారు. వల్లపచెరువులో మట్టిని తవ్వి ఆ మురుగుకుంటను పూడిస్తే అటు ఆ చెరువుకూ పూడిక తీసినట్లవుతుంది, ఇటు ఈ గుంటా పూడుతుంది అన్నాను. ఒక్క దెబ్బకు రెండు పిట్టలంటే ఇదే! అంతే! ఇంక పని ప్రారంభం అయింది.

ఆ మురుగుగుంటను పూడ్చారు. నీళ్లుపోవడానికి ప్రక్కనే చక్కగా కాలువ కట్టారు. ఇంకేముంది! ఏకంగా 19 ఎకరాల సువిశాల ప్రదేశం ఏర్పడింది. అక్కడే స్టేడియం ఏర్పాటుకు పెవిలియన్ భవనాలు, కాంపౌండ్ వాల్ నిర్మాణం, క్రికెట్ గ్రౌండ్, వాలీబాల్, బాస్కెట్‌బాల్ కోర్టుల ఏర్పాటు అన్నీ చకచకా జరిగాయి. ఆ తర్వాత 1.3 కి.మీ.లలో అద్భుతంగా వాకర్స్ ట్రాక్ నిర్మించారు. అలా ఒక దుర్గంధ భరితమైన మురుగుప్రదేశం అధునాతన వసతులతో కూడిన అద్భుత క్రీడాప్రాంగణంగా మారింది. శతవసంతాల వేడుకలలో భాగంగా మూడు కోట్ల రూపాయలతో ఆధునిక తరహాలో స్విమ్మింగ్ పూల్ ఏర్పాటుకు రంగం సిద్ధం అయింది. కృష్ణాజిల్లా స్పోర్ట్స్‌మీట్‌ని అందులో జరపాలని చూస్తున్నారంటే ఆ ప్రాంగణం ఎంతగా అభివృద్ధి చెందిందో చెప్పకనే చెబుతుందిగా? ఇదండి. డా॥ కోడెల శివప్రసాదరావు క్రీడా ప్రాంగణం కథ!



నాటి మురికి గుంట



నేటి సుందర క్రీడా ప్రాంగణం!



నాటి గొడవల కుంట



నేటి అందమైన ఉద్యానవనం

**ప్రకాష్ నగర్ పార్కు :**

దాని అసలు పేరు వన్నూరు కుంట. ఆచరణలో దానిని గొడవలకుంట అని పిలుస్తుంటారు! అన్నట్లు అది 2000వ సంవత్సరం. వర్షంవస్తే అది మురుగునీరు కేంద్రం ఔతుంది. దాంతో దోమలకు నిలయంగా మారి అనారోగ్యానికి చిరు నామాగా తయారయింది. అంతేకాదు. ఆ కుంటకు ఎగువ, దిగువ ఉన్న కుటుంబాల మధ్య గొడవలే గొడవలు. మురుగు మా ఇంటివైపు వస్తుందంటే, మా ఇంటి వైపుకు కావాలనే మార్చారని మాటల తూటాలు పేలేవి. దాంతో వన్నూరు కుంటకు గొడవలకుంట అన్న పేరు సార్థకనామం అయింది. డాక్టరుగారు ఆ ప్రాంతానికి వచ్చినపుడు ఆ ప్రాంతవాసులు తమ గోడు వినిపించారు. తమ సమస్యల చిట్టా విప్పారు. అంతా విన్న ఆయన తనచుట్టూ మూగిన పిల్లలతో 'అరేబాబు! ఇక్కడ ఏం ఉంటే మీకు బాగుంటుంది?' అని అడగడంతోనే 'పార్కు సర్! పార్కు అండి' అని అరిచారు. పెద్దలను అడిగితే 'పార్కు అయితే ఎంచక్కా ఉదయం, సాయంత్రం కూర్చోడానికి వీలుంటుంది. ఈ ప్రదేశం అంతా ఆహ్లాదకరంగా తయా రవుతుం'దన్నారు. వెంటనే డాక్టరుగారు ఇ.ఇ.గా ఉన్న నన్ను సంప్రదించారు. గత అనుభవం వలన డాక్టర్‌గారి దృష్టిలో నేను చేపట్టిన మంచి పనిని అంకితభావంతో అవిశ్రాంతంగా పనిచేస్తూ పూర్తిచేసే ఉద్యోగిని. కనుక డాక్టర్‌గారు నన్నుఎంతో ఉత్సాహపరిచారు. వెంటనే ప్లాన్ ప్రారంభం అయింది. గుంటను పూడ్చారు. ప్రక్కనే కాలువ కట్టి నీళ్లు పోవడానికి మార్గం ఏర్పరిచారు. పార్కును నిర్మించి సుందరంగా తీర్చిదిద్దారు. ప్రక్కనే నీళ్ల ట్యాంకు నిర్మాణం జరిగింది. ఆవిధంగా చక్కని ఆరోగ్యకర వాతావరణం ఏర్పడింది. ప్రకాష్ నగర్‌లోని పిల్లల ఆటలకు, పెద్దల విశ్రాంతికి శుభ్రమైన కేంద్రం ఏర్పడింది. ఆవిధంగా గొడవలకుంట గొప్ప పార్కుగా, ప్రశాంత ప్రదేశంగా రూపాంతరం చెందింది.

**నకరికల్లు చెరువు :**

శతాబ్దాల తరబడి నరసరావుపేట అంటేనే నీళ్లకు 'కటకటలపేట' అన్న పేరుంది. క్యూలు కట్టి, బిందెలు బారులు తీరే పేట అది. పిల్ల నివ్వాలంటే అమ్మాయిల తండ్రుల గుండెల్లో దడ. బంధువులు వచ్చారంటే 'నీళ్లు ఎలా?' అని ఇంటావిడ ఎదలో గడబిడ. ఒక ప్రక్క ఊరు పెరుగుతూ ఉంది. మరో ప్రక్క నిత్యజీవన అవసరం అయిన నీటి కరువు మరింత అధిక మవుతూంది. 'ఏంచెయ్యాలి? తక్కువ వ్యయంతో పట్టణ ప్రజలకు నీళ్లు ఎలా అందించా?'లని డాక్టరుగారి ముందున్న సమస్య. దీన్ని గురించి కూడా చర్చించాం. దీనితో డాక్టర్‌గారు ఒక నిర్ణయానికి వచ్చారు.

అది 1998వ సంవత్సరం. పట్టణానికి చేరువలో వున్న నకరికల్లు చెరువు 250 ఎకరాల సువిశాల ప్రాంతంలో విస్త రించి ఉంది. నాగార్జునసాగర్ పుణ్యమా అని నీరు సమృద్ధిగా సమకూరే అవకాశం. ఆ ప్రాంతం చాలా ఎత్తులో ఉండడంతో ఏ మాత్రం ఖర్చు లేకుండా కేవలం గ్రావిటేషన్ ఫుల్ ద్వారా పట్టణంలోని ఓవర్‌హెడ్ ట్యాంక్‌కు నీళ్లు ఎక్కే చక్కని అవకాశం. ఆ విధంగా పురపాలకసంఘానికి ఎంతో ఆదా. ఆ చెరువును నింపి నీళ్లు వదిలితే ఇంక నరసరావుపేట నుండి నీళ్ల కరువే పారిపోయే అరుదైన అదృష్టం. అయితే ఒక్కటే ఇబ్బంది. ఆ విశాలమైన చెరువు క్రమంగా ఇటుకల బట్టీలకు కేంద్రంగా మారడం ఒక సమస్యగా తయారయింది. అక్కడి నుండి ఇటుకల బట్టీలు తీసివేస్తే తమ ఉపాధి పోతుందని,



నాడు ఇటుకల బట్టీలు



నేడు ఇంటింటికి మంచి నీళ్ళు

తమ బ్రతుకులు బజారున పడతాయని బట్టీల యజమానుల ఆర్తనాదాలు. 'మా కేదైనా ప్రత్యామ్నాయం చూపండి సార్!' అని బాధితుల వేడుకోళ్లు. డాక్టరుగారు వెంటనే స్పందించారు. 'ఏ ఒక్కరికీ ఎలాంటి ఇబ్బందీ లేకుండా చూస్తా!'నని హామీ ఇచ్చారు. వాళ్లకు బ్యాంకు'లోను' పెద్దమొత్తాలలో ఇప్పించారు. ఆ విధంగా ప్రత్యామ్నాయం చూపడంతో ఆ సమస్య తీరింది. ఆ వెంటనే రూ.14 కోట్లు మంజూరు చేయించి పనులు ప్రారంభింపజేశారు. ఆ చెరువుకు అవసరమయిన మరమ్మత్తులు చేయించారు. పైపులైన్లు వేయించారు. 4,450 మి. లీటర్లు పట్టే సువిశాలమైన చెరువు తయారయింది. అంటే లీటరు నీళ్లకు ఒక్క పైసా ఖర్చవుతుందన్నమాట! ఆ విధంగా అది పట్టణానికే ఒక వరంగా మారింది. మండు టెండల్లోనూ పట్టణ ప్రజలకు రెండు పూటలా కావలసినంత నీరు సమకూర్చగల ఏకైక మునిసిపాలిటీగా నరసరావుపేట రాష్ట్రంలోనే పేరుగాంచింది. దాంతో డాక్టరుగారికి అపర భగీరథుడన్న కీర్తి లభించింది. ఆ బృహత్తర పథకం అమలులోకి రావడంతో ఇంటింటికీ టాపులు ఇవ్వడం ప్రారంభించారు. ఇంతటి కార్యక్రమాన్ని అంకితభావంతో అమలు పరచాం. దానితో నన్ను నాటి నుండి 'నీళ్ల కోటేశ్వరరావు' అని అందరూ అభిమానంతో పిలిచారు. ధన్యుణ్ణి. చక్కని ఆలోచన, కార్యదీక్ష ఉంటే పాలకులు అద్భుతాలు సాధించవచ్చు అన్న దానికి ఇదొక గొప్ప ఉదాహరణ!

**చంద్రబాబునాయుడు కాలనీ:**

సత్తెనపల్లిరోడ్డులో దుర్భర జీవితానికి సజీవసాక్ష్యంగా కన్పించే దానిపేరే వీరముష్టి కాలని. అసాంఘిక కార్యాలకు అది కేంద్రం. బాధామయ జీవితాలకు అది నిలయం. అక్కడ కరెంటు లేదు. నీటి సదుపాయమూ లేదు. ఇంక రోడ్ల సంగతి చెప్పనవసరమే లేదుగా! చీకటిలోనే జీవితం. బాధలతోనే బ్రతుకుబండిని నెట్టుకొస్తున్న అభాగ్యులు. కోడెలగారు ప్రత్యేక శ్రద్ధ తీసుకుని 2001వ సంవత్సరంలో ప్రఖ్యాత దాత డైక్‌మన్‌ను నరసరావుపేటకు ఆహ్వానించారు. డైక్ మన్‌గారు నరసరావుపేట చేరేటప్పటికీ ప్రొద్దుగూకడంతో పెట్రోమాక్స్ లైట్లతో ఆ ప్రదేశాన్ని ఆ అరుదైన దాతకు చూ పెట్టారు. ప్రతి మహిళా, ప్రతి పురుషుడు ఆయనకు చేతులెత్తి నమస్కారాలు



నాటి వీరముష్టి కాలని



నేటి సుందర చంద్రబాబునాయుడు కాలని

చేశారు. వాళ్ల దయనీయస్థితిని చూచి చలించిన డైక్‌మన్ వెంటనే కోటిరూపాయలు విరాళం ప్రకటించారు. తక్షణం పని ప్రారంభించారు. అక్కడ వున్న గుడిసెలు వెంటనే తొలగించి, వారికి నివాస స్థలాలు, పట్టాలు ఇస్తామని చెప్పడంతో పనులలో వేగం పుంజుకుంది. ఇళ్లు నిర్మించారు. రోడ్లు వేసారు. కరెంటు తెచ్చారు. ఆ విధంగా చక్కని నివాస ప్రదేశం ఏర్పడింది.

అక్కడ నివసించే వృద్ధులు, పిల్లలు రెండు పూటలా తిండికి నోచుకోలేదని తెలుసుకున్న జాన్ డేవిడ్ చలించి పోయారు. ఎందరో అభాగ్యులను ఎన్నో విధాలుగా ఆదుకొంటున్న ఆయన 'తన ఎం.ఎం.జి.సంస్థ నుండి ప్రతినిత్యం రెండుపూటలా ఆహారం, పిల్లలకు పాలు పంపుతా'నన్నారు. వెంటనే వాళ్లకు గుర్తింపుకార్డులు ఇచ్చారు. నాటినుండి నేటిదాకా ఆ అద్భుత సేవాకార్యక్రమం అలానే కొనసాగుతూ ఉండడం విశేషం. అలా ఏర్పడిన నివాస సముదాయానికి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారు ది. 17-1-2001న ప్రారంభోత్సవం చేయడం మరో విశేషం.

**భువనచంద్ర టౌన్‌హాల్ :**

ఒకనాడు మూగజీవుల ఆస్పత్రి - పశువుల ఆస్పత్రి అది. సువిశాల ప్రాంతంలో అందునా పట్టణం నడిబొడ్డున ప్రకాష్‌నగర్‌లో పనిచేస్తుంది అది. నిజానికి సంపన్నులు జీవించే ప్రాంతం, పోష్ లొకాలిటి అది. గేదె గ్రట్ర మేపుకొనే వారు సామాన్యంగా పట్టణానికి దూరంగా నివాసం ఉంటారు. పశువులను అంత దూరంనుండి తోలుకొచ్చి వాటికి తగిన వైద్యం చేయించి, తిరిగి తీసుకుపోవటం చాలా వ్యయప్రయాసలతో కూడిన పని. రైతులు ఎక్కువమంది నివసించే పెద్ద చెరువు ప్రాంతానికి ఆ ఆస్పత్రినే తరలించితే? అలా ఖాళీ అయిన ప్రదేశంలో అధునాతన సౌకర్యాలతో ఒక సమావేశ మందిరం- టౌన్‌హాల్ నిర్మిస్తే బాగుంటుంది కదా!' అని ఆలోచించారు డాక్టరుగారు. అనతికాలంలో అక్కడ పట్టణానికే శోభ తెచ్చే అత్యాధునిక భవనం 'భువనచంద్ర టౌన్‌హాల్' వెలసింది. క్రమంగా నరసరావుపేటకే అది సాంస్కృతిక కేంద్రం గా ఎదిగింది. ఆతరువాత 2004లో **డాక్టర్ కోడెల శివప్రసాద రావు ఓపెన్ ఎయిర్‌థియేటర్** ప్రారంభం అవటంతో టౌన్ హాల్‌కు పరిపూర్ణత చేకూరింది. ●



**ఆనాటి పశువుల ఆసుపత్రి**



**ఈనాటి అద్భుత భువనచంద్ర టౌన్‌హాల్**

# ఏది - ఎప్పుడు?!




## లక్ష్మిశెట్టి అనంత వెంకటరమణారావు

బిల్డింగ్ కన్‌స్ట్రక్టర్


| | | | |
|---|---|---|---|
| రైలుమార్గం (మీటర్ గేజ్) | : 1886 | లూథరన్ ఎలిమెంటరీ స్కూల్ | : 1880 |
| బ్రాడ్‌గేజ్‌గా మార్పు | : 1994 | లూథరన్ హైస్కూల్ | : 1958 |
| ప్రభుత్వ ఆసుపత్రి స్థాపన | : 1943 | సెకండరీ ట్రయినింగ్ స్కూల్ (తరువాతతీసేశారు) | : 1958 |
| పోలీసు స్టేషన్ | : 1895 | లూథరన్ అంధుల పాఠశాల | : 1973 |
| మున్సిఫ్ మెజిస్టేట్ కోర్టు | : 1892 | హర్డు మహిళా జూనియర్ కళాశాల | : 1980 |
| పశువైద్యశాల | : 1892 | నీటి కుళాయిలు ఏర్పాటు | : 1972 |
| జిల్లాగ్రంథాలయ శాఖ | : 1954 | ఆఫీసర్స్ క్లబ్ | : 1966 |
| వ్యవసాయ పరపతిసంఘం సహకార అర్బన్‌బ్యాంక్ | : 1974 | ఎ.పి.ఎస్.ఆర్.టి.సి. | : 1960 |
| ఏంజెల్ టాకీస్ | : 1938 | బరన్ పేట ఏర్పడినది | : 1923 |
| అరండల్‌పేట | : 1893 | బరన్ దొర స్కూల్ | : 1929 |
| శ్రీరాంపురం | : 1947 | బరన్‌దొర హైస్కూల్ (ఇప్పటి బ్రహ్మానందరెడ్డిహైస్కూల్) | : 1965 |
| గాంధీజీ నరసరావుపేటను సందర్శించినది | : 1930 | గాంధీ పార్కు (గాంధీగారు ప్రసంగించిన స్థలం) | : 1940 |
| కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభం | : 1938 | ప్రప్రథమ తారు రోడ్ (రైల్వేస్టేషన్ రోడ్) | : 1947 |
| నెహ్రూగారు నరసరావుపేటను సందర్శించినది | : 1951 | కరువు వలన ఎక్కువమంది చనిపోయినది | : 1884 |
| సాగర్ కుడికాలువ నీరు వచ్చినది | : 1963 | త్రాగునీరు వచ్చినది | : 1964 |
| ఎస్.ఎస్. & ఎన్. కళాశాల స్థాపన | : 1950 | త్రాగునీరుకు శాంతినగర్‌లో చెరువు ఏర్పాటు | : 1968 |
| మార్కెట్ యార్డు ఏర్పాటు | : 1968 | రెడ్ క్రాస్ బిల్డింగ్ | : 1966 |
| పి.డబ్ల్యు.డి. ఎ.డి.సి. కార్యాలయం ఏర్పాటు | : 1935 | స్కౌట్ & గైడ్స్ బిల్డింగ్ | : 1972 |
| 13 రాజకీయ పార్టీలు ఉన్న సంవత్సరం | : 1935 | స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా | : 1973 |
| విక్టోరియా మెమోరియల్ థియేటర్ కంపెనీ | : 1890 | వ్యవసాయ శాఖ కార్యాలయం | : 1953 |
| మున్సిపల్ హైస్కూల్ | : 1901 | పాల ఉత్పత్తిదారుల సహకార సమితి | : 1978 |
| ఆవుల సత్రం | : 1925 | ఎ.పి.ఎస్.ఆర్.టి.సి. | : 1959 |
| టెలిఫోన్ సౌకర్యం | : 1943 | ఎన్.జి.ఓ. హోమ్ | : 1966 |
| గురజాడ కళామందిర్ | : 1976 | 4వ తరగతి ఉద్యోగుల భవనం | : 1969 |
| కరెంట్ ఆఫీస్ ఏర్పాటు | : 1935 | పంచాయితి సమితి | : 1963 |
| జుడిషియల్ ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టు | : 1958 | పంచాయితి ఎన్నికలు | : 1968 |
| అడిషినల్ ఫస్ట్ క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టు | : 1970 | లయన్స్ క్లబ్ | : 1956 |
| పురపాలక బాలికోన్నత పాఠశాల | : 1960 | రోటరీ క్లబ్ | : 1968 |

శ్రీరామకృష్ణ ఓరియంటల్ హైస్కూల్ : 1961
శ్రీరామకృష్ణ ఓరియంటల్ కళాశాల : 1967
కో-ఆపరేటివ్ సొసైటి కార్యాలయం : 1955
నూతన శృంగేరి శంకరమఠం : 1989
మొదటి బస్సు తెచ్చింది : శౌరయ్య బ్రదర్స్ : 1916
మొదటి సీతారామాంజనేయ మోటార్ షాప్ : 1935
వ్యాయామ కళాశాల (ఇప్పుడు లేదు) : 1880
జాతీయస్థాయి కుస్తీ పోటీలు జరిగింది : 1939
హేతువాద సంఘం ఏర్పడినది : 1979
రుక్మిణీ స్త్రీ సమాజం : 1939
కన్నెల ఆసుపత్రి : 1960
ది ఛాంబర్ ఆఫ్ కామర్స్ & ఇండస్ట్రి : 1986
మొదటి ఫొటో గ్రాఫర్-యేలూరి హనుమంతరావు : 1933
మొదటి స్టూడియో-ఛాయాచిత్రశాల : 1935
శ్రీ నరసింహ కాటన్ ప్రెస్ : 1916
శ్రీ రాధాకృష్ణ వాసుకీ ఆశ్రమము : 1956
ఇస్కాన్ టెంపుల్ : 2013
భగవాన్ శ్రీ సత్యసాయి సేవాసమితి : 1964
నరసరావుపేట ఫర్నీచర్ (కుర్చీలు) : 1910
మొదటి మహిళా వైస్ ఛైర్మన్ శ్రీమతి మాలినీదత్తు: 1981
మొదటి మహిళా కౌన్సిలర్ (మన్నేపల్లి సావిత్రమ్మ): 1959
వినుకొండ రోడ్‌లో హర్డు క్రైస్తవ దేవాలయం : 1883
మేరి కర్జ్ మెమోరియల్ బాప్టిస్టు చర్చి : 1915
కన్నెల ఆసుపత్రిలో కాథలిక్ చర్చి : 1958
సెయింట్ పాల్స్ లూథరన్ చర్చి : 1929
జుమ్మా మసీదు (పెద్ద మసీదు) : 1797
జామియ మసీదు (శ్రీరాంపురం) : 1938
ఈద్గా మైదానం : 1938
పులుపులవారివీథి-ఆంజనేయస్వామి మందిరం : 1870
పులుపులవారివీథి-శ్రీలక్ష్మీనరసింహస్వామిగుడి : 1983
బరంపేట ఆంజనేయస్వామి ఆలయం : 1932
స్టేషన్ రోడ్-ఆంజనేయస్వామి దేవాలయం : 1938
బరంపేట-శ్రీరాజరాజేశ్వరి వాయులింగేశ్వరస్వామి గుడి: 1936
శ్రీరాంపురం-శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామిగుడి : 1948

ప్రకాష్‌నగర్-శ్రీవీరాంజనేయస్వామిగుడి : 1964
ప్రకాష్‌నగర్-శ్రీవేంకటేశ్వరస్వామిదేవాలయం : 1985
సత్తెనపల్లిరోడ్-శ్రీసంతాన వేణుగోపాలస్వామిగుడి: 1975
గీతామందిరం : 1985
పాతూరు-శ్రీవేంకటేశ్వరస్వామి గుడి : 1982
సత్తెనపల్లిరోడ్-శ్రీఅయ్యప్పస్వామివారిదేవస్థానం : 1988
పాతూరు : శ్రీచౌడేశ్వరి అమ్మవారిదేవస్థానం : 1990
సత్తెనపల్లిరోడ్-శ్రీషిర్డిసాయిబాబామందిరం : 1992
శ్రీ పాండురంగస్వామివారి దేవస్థానం : 1936
శ్రీ భావనారాయణస్వామి దేవస్థానం : 1783
శ్రీ సీతారామస్వామివారి దేవస్థానము : 1905
కోటబజారు-శ్రీమహాలక్ష్మమ్మ చెట్టు : 1895
శ్రీకృష్ణదేవరాయలు దండయాత్రకు వచ్చినది: 1515-16
1915 నరసరావుపేట జనాభా : 6,700
1961 నరసరావుపేట జనాభా : 24,744
1972 నరసరావుపేట జనాభా : 43,000
2015 నరసరావుపేట జనాభా : 1,21,887
నరసరావుపేట రంగస్థలి : 1980
మొఖాసా గ్రామం అట్లూరుగా ఏర్పడినది : 1159
2వ శాసనం ద్వారా తెలిసినది : 1244
3వ శాసనం ద్వారా తెలిసినది : 1262
రుద్రమదేవి వచ్చినది : 1265
ప్రతాపరుద్రుడు వచ్చినది : 1297
విరియాల మల్రాజువారు వచ్చినది : 1300
వెలనాటిచోళుడైన రాజేంద్రుడు వచ్చినది : 1126
నరసరావుపేట ఏర్పాటుచేసినది గుండారాయుడు-
తన తండ్రి నరసింహరాయునిపేరుతో : 1797
అట్లూరి గ్రామం మొఖాసాదారులుగా చివరగా
ఉన్నవారు కటికినేని వారు : 1795
ఈస్ట్ ఇండియా కంపెనీవారు వచ్చినది : 1788
నరసరావుపేట తాలూకా కచేరి ఏర్పాటుచేసినది : 1884
కచేరి నుండి పంచాయితీ యూనియన్‌గా ఏర్పడినది : 1885
డిప్యూటి కలెక్టర్ గారి కచేరి ఏర్పడినది : 1896
తాలూకా కార్యాలయం : 1894

| | |
|---|---|
| అర్.డి.ఓ. కార్యాలయం | : 1895 |
| ట్రెజరీ కార్యాలయం | : 1894 |
| సబ్ ట్రెజరీ కార్యాలయం | : 1895 |
| డివిజనల్ పంచాయితి రెవిన్యూ కార్యాలయం | : 1959 |
| బీరవల్లిపాయ యుద్ధము | : 1747 |
| పాతూరు శ్రీ భీమలింగేశ్వరదేవాలయం (పునరుద్ధరణ ధర్మకర్త : అట్లూరి కోటంరాజు) | : 1802 |
| కోటబజారు-శ్రీరామలింగేశ్వరస్వామిగుడి | : 1797 |
| కోటబజారు-శ్రీ వేణుగోపాలస్వామి గుడి | : 1797 |
| పిండారులు నరసరావుపేటపై దాడి | : 1815 |
| పిండారులను జమీందారు పారద్రోలింది | : 1816 |
| కోటబజారు-శ్రీసత్యనారాయణస్వామిగుడి | : 1918 |
| మల్లమ్మసెంటర్-విఘ్నేశ్వరస్వామిగుడి | : 1834 |
| శ్రీకన్యకాపరమేశ్వరిదేవస్థానము | : 1906 |
| శ్రీపట్టాభిరామస్వామిదేవస్థానము-కాకతీయ ప్రతాపరుద్రుడు | : 1297 |
| పునః ప్రతిష్ఠ గావించినది | : 1862 |
| రథం సమర్పించినది | : 1868 |
| శ్రీ పట్టాభిరామస్వామి దేవస్థానం (జీర్ణోద్ధరణ జరిగినది) | : 1938 |
| అరండల్‌పేట - శ్రీ ప్రసన్నాంజనేయస్వామిగుడి | : 1898 |
| పాత శ్రీ శృంగేరి శంకరమఠం (పల్నాడు రోడ్) | : 1923 |

ఆనాటి మన నరసరావుపేట జమీందారిణి శ్రీమతి లక్ష్మీవెంకాయమ్మరావు గారు తమ కోటలో హిందూ ఎలిమెంటరీ స్కూల్ 1889లో ప్రారంభించారు. తరువాత దానిని తాలూకా బోర్డువారికి అప్పగించినది-1891. తరువాత మిడిల్ స్కూల్‌గా నడిపించినది 1907. దానిని తాలూకా బోర్డు ఇన్ కంప్లీట్ సెకండరీ స్కూల్‌గా నడిపిన కాలం 1908 నుండి 1912 వరకు. తదనంతరం యూనియన్ పంచాయితీ నుండి స్కూల్‌గా నడిపిన కాలం 1912 నుండి 1914 వరకు. ఆ తదనంతరం 1917 నుండి నేటి పురపాలకోన్నత పాఠశాలగా రూపుదిద్దుకొన్నది. •

## పుష్పగిరి !

ఒకసారి పుష్పగిరి స్వాములవారు నరసరావుపేటకు వచ్చారు. పాదపూజలు జరుగుతున్నాయి. ఎందరో పెద్దలు, ధనవంతులు 'నేను ముందు అంటే నేను ముందు' అని పూజలు చేస్తున్నారు.



జగర్లపూడి కృష్ణావధానులుగారి వద్ద స్మార్తం నేర్చుకొంటున్న 'ఎనిమిది మంది' విద్యార్థులు పుష్పగిరి పీఠాధిపతుల సహాయకులైన అధికారుల్ని కలిశారు. 'పాదపూజ చేసే అవకాశం ఇవ్వ'మని ప్రార్థించారు. వాళ్లు ఈ చిన్నవాళ్లను చిన్నచూపు చూచారు. పట్టించుకోలేదు. ఈ విద్యార్థులు పట్టువీడని విక్రమార్కులు. తమ ప్రయత్నాన్ని ఆపలేదు. చివరకు అధికారులు అంగీకరించారు.

మరుసటి రోజు ఉదయమే కార్యక్రమం. కొందరు అందమైన వేదికను సిద్ధంచేశారు. కొందరు ఎక్కడెక్కడి పూలు కోసుకొని వచ్చి దండలు కట్టి అలంకరించారు. కొందరు విడిపూలను కుప్పలు పోశారు. పూలకొండ అని పిస్తున్నది వేదికంతా. స్వామివారి పాదపూజ శాస్త్రోక్తంగా వైభవోపేతంగా జరిగింది.

అధికారులు ఆశ్చర్యచకితులయ్యారు. స్వామివారు ప్రసన్నులయ్యారు. 'మా 'పుష్పగిరి'నామాన్ని మీరు సార్థకం చేశారు. ఇటువంటి పూజను నేను ఇంతకుముందు చూడలేదు!' అంటూ ఆశీర్వదించారు ఆ విద్యార్థులందరినీ. ఆధ్యాత్మీకరణానికి యువశక్తి, నవశక్తి కూడ అవసరమని పెద్దలంతా గుర్తించారు. •

తమ స్వప్నాలలోని సౌందర్యాన్ని విశ్వసించే వారికే భవిష్యత్తు చెందుతుంది. - ఎలినార్ రూజ్‌వెల్ట్
మనతో మనం సఖ్యతగా ఉండకపోవడాన్ని మించిన ఒంటరితనం లేదు. - మార్క్ ట్వయిన్

# పేటలు - వీధులు




## నసీమారాజశేఖర్

అడ్వకేట్


1915వ సంవత్సరములో నరసరావుపేట మున్సిపాలిటి అయింది. 1980లో ఫస్ట్ గ్రేడ్ మునిసిపాలిటి అయింది. కేంద్రమైన రెవెన్యూ డివిజన్ నరసరావుపేట గంటూరు జిల్లాలో అతి పెద్ద పట్టణం. దాదాపు 9.65 కి.మీ॥ విస్తరించి ఉంది. 2000 సంవత్సరం జనాభా లెక్కల ప్రకారము చదరపు కిలోమీటరులో 12,742 మంది ప్రజలు జీవిస్తున్నారు. పడమరన పల్నాడు రోడ్డు, దక్షిణాన వినుకొండ రోడ్డు, తూర్పున చిలకలూరిపేట రోడ్డు, ఉత్తరాన సత్తెనపల్లి రోడ్డు నరసరావుపేట చుట్టూ ఉన్నాయి.

నరసరావుపేటను స్థానిక మున్సిపాలిటి వారు 34 ఎలక్షన్ వార్డులుగా విభజించారు. ఈ వార్డులలోని రోడ్లకు వివిధ వీధులకు పేర్లను పెట్టేరు. వార్డుల వారీగా సదరు వీధులను, ఆయా ఏరియాలను చూద్దాం.

**1వ వార్డు :** 1. రంగావారి వీధి 2. గానుగల బజారు 3. ఆంజనేయస్వామి వారి వీధి 4. సత్తెనపల్లి రోడ్డు 5. చంద్రబాబునాయుడు కాలని 6. సాయినగర్

**2వ వార్డు :** 1. బాబా సాహెబ్ రోడ్డు 2. పురుషోత్తమాచారి వీధి 3. రంగావారివీధి 4.గానుగల బజారు 5. ఐలాబజారు 6. వేణుగోపాలస్వామిగుడి వీధి.

**3వ వార్డు :** 1. వినుకొండ రోడ్డు 2. చిలకలూరిపేట రోడ్డు 3. మేదరబజారు 4. కుమ్మర బజారు 5. పెద్ద మసీదు రోడ్డు 6.నిమ్మతోట 7.గుంటూరురోడ్డు.

**4వ వార్డు :** 1. వినుకొండ రోడ్డు 2. చిలకలూరి పేట రోడ్డు 3.పనస తోట.

**5వ వార్డు :** 1. చిలకలూరి పేట రోడ్డు 2. క్రిష్టియన్ పాలెం-చిలకలూరిపేట రోడ్ పక్క నుండి మొదలౌతుంది 3.గుంటూరు రోడ్డు 4.శివసంజీవకాలని- బ్రిడ్జి పక్క నుంచి మొదలౌతుంది.

**6వ వార్డు :** 1. చిలకలూరి పేట రోడ్డు 2. బాబాపేట 3. రహంతుల్లా నగర్ 4. మోహిద్దిన్ నగర్ 5. వెంకటరెడ్డి నగర్

**7వ వార్డు :** 1. ఇస్లాంపేట 2. వెంగళరెడ్డి నగర్ -కృష్ణచిత్రాలయ వెనుకవైపు

**8వ వార్డు :** 1. కోటప్పకొండ రోడ్డు నుండి మొదలౌతుంది.

**9వ వార్డు :** 1. ఎరుకల కాలనీ 2. శ్రీనివాసనగర్ 3. సాంబశివపేట 4. వినుకొండ రోడ్డు 5. కోటప్ప కొండ రోడ్డు -ఆర్.టి.సి బస్టాండు ఎదురు రోడ్డులోని లొకాలిటి.

**10వ వార్డు :** 1. ప్రకాశ్‌నగర్ 2. వినుకొండ రోడ్డు.

**11వ వార్డు :** 1. ప్రకాశ్‌నగర్ లోని 60 అడుగుల రోడ్డు.

**12వ వార్డు :** 1.బాపనయ్యనగర్-రైల్వేస్టేషన్ ఎదురు రోడ్డు, షాలెంనగర్-రైల్వేస్టేషన్ పక్కరోడ్డు నుండి లింగంగుంట్ల వెళ్ళేదారి.

**13వ వార్డు :** 1. ప్రకాశ్‌నగర్ రిజిస్ట్రార్ ఆఫీసు; ఏరియా కోడెల శివప్రసాదరావు రహదారి; పాత పోస్టాఫీసు రోడ్డు.

**14వ వార్డు :** 1. కంబం పాలెం 2. వినుకొండ రోడ్డు.

**15వ వార్డు :** 1.వివేకానంద రోడ్డు 2.వరవకట్ట వీధి మున్సిపల్ ఆఫీసు పక్కన 3. వరవకట్ట బావి 4.హనుమయ్య సందు 5.దివ్వెల వారి వీధి 6. వినుకొండ రోడ్డు 7. పరిమి వారి వీధి 8.కొండలరావు పేట.

**16వ వార్డు :** 1.పల్నాడు రోడ్డు, మల్లమ్మ సెంటర్ నుండి నరసరావుపేట శివారు వరకు 2. శ్రీరాంపురం రోడ్డు, శివుడి బొమ్మ ఎదురు రోడ్డువరకు

3. మాజేటివారి వీధి 4. కాకుమానువారి వీధి, మల్లమ్మ సెంటర్ దగ్గర 5. అరకాలవారి వీధి, ఓవర్ బ్రిడ్జి పక్కన, 6. నంబూరివారి వీధి.

**17వ వార్డు :** 1. పల్నాడురోడ్డు, 2. శ్రీరాంపురం, 3. ఆంధ్ర రత్న రోడ్డు, 4. వివేకానంద రోడ్డు, మల్లమ్మ సెంటర్ ఏరియా 5. నంబూరి వారి వీధి 6. వరవకట్ట.

**18వ వార్డు :** 1.రావిపాడు వారి వీధి 2.రామరాజు వారి వీధి 3. సీతమ్మరాజువారివీధి 4.పంగనామాల వారి వీధి 5.రైల్వేస్టేషన్ రోడ్డు 6. తాడేపల్లి వారి వీధి 7. గట్టిపాటి వారి వీధి 8. ఆంధ్రరత్న రోడ్డు 9. పల్నాడు రోడ్డు, చర్చి వీధి, మంద వారి వీధి, రూపెనగుంట్ల వారి వీధి, అరండల్ పేట, మహ్మద్ మొహిద్దీన్ రహదారి, పి.వి. నరసింహారావు రోడ్డు, రామిరెడ్డి పేట

**19వ వార్డు :** 1.పల్నాడు రోడ్డు నుండి రామిరెడ్డి పేట వరకు 2. రాయపాటివారి వీధి 3. చింతలపాటివారి వీధి 4. నడింపల్లివారి వీధి 5.రాధాకృష్ణవారి వీధి 6.సీతంరాజువారివీధి 7. అరండల్‌పేట.

**20వ వార్డు :** 1.పల్నాడురోడ్డు 2. గడియారంవారివీధి 3. రాయపాటివారి వీధి 4. అరండల్‌పేట 5. రామిరెడ్డిపేట

**21వ వార్డు :** 1. రైల్వేస్టేషన్ రోడ్డు 2. ప్రింటింగ్‌ప్రెస్ వారి వీధి 3. వీరేశలింగంగారి వీధి 4. రాయపాటి వారివీధి 5.రామిరెడ్డి పేట 6. అరండల్ పేట.

**22వ వార్డు :** 1. పాత పెద్దపోస్టాఫీస్ రోడ్డు, 2. ఇక్కుర్తిరోడ్, 3. రామిరెడ్డిపేట.

**23వ వార్డు :** 1. రైల్వేస్టేషన్ రోడ్, 2. డొంకరోడ్డు, 3. ఇక్కుర్తి రోడ్, 4. నవోదయనగర్.

**24వ వార్డు :** 1. డొంక రోడ్, 2. పాలపాడు రోడ్, 3. ప్రశాంతి నగర్, 4. హరికృష్ణ నగర్, 5. రామిరెడ్డిపేట, 6. పాత సమితి ఆఫీస్ రోడ్.

**25వ వార్డు :** 1. పల్నాడు రోడ్, 2. ఎన్.జి.ఓ. కాలనీ, రెడ్డి కాలేజి వెనుక వైపు, 3. పెద్ద చెరువు

**26వ వార్డు :** 1. పల్నాడు రోడ్, 2. పెద్ద చెరువు, 3. చెరువు కట్ట రోడ్డు, 4. ప్రత్తిపాటివారివీధి, 5. రాళ్ల బండివారివీధి, 6. భీమలింగేశ్వరస్వామి వారి వీధి, 7. ఆంజనేయస్వామిగుడివీధి, 8. వంగలవారి వీధి.

**27వ వార్డు :** 1. గోగులవారి వీధి, 2. శిఖాకొల్లి వారి వీధి, 3. ఆంజనేయస్వామివారి వీధి, 4. మంగళ వారివీధి, 5. పరమయ్యగారివీధి, 6. అట్లూరి వారివీధి, 7. నౌరోజీరోడ్డు, 8. పల్నాడురోడ్.

**28వ వార్డు :** 1. నౌరోజి రోడ్డు, 2. భీమలింగేశ్వరస్వామి వారి వీధి, 3. శిఖాకొల్లివారి వీధి, 4. మండవ వారి వీధి, 5. రెడ్ల బజారు, 6. అట్లూరివారి వీధి 7. ఆంజనేయస్వామి గుడివీధి.

**29. వార్డు :** 1. ఏనుగులబజారు, 2. బాబాసాహెబ్‌రోడ్డు, 3.పట్టాభిరామస్వామి వారివీధి. 4.నౌరోజి రోడ్, 5.సత్తెనపల్లిరోడ్,6.పెద్దమసీదురోడ్.

**30వ వార్డు :** 1. నౌరోజీ రోడ్, 2. ఏనుగుల బజారు, 3. రామయ్యతోట మెయిన్ రోడ్,4. సత్తెనపల్లి రోడ్.

**31వ వార్డు :** 1.మౌళిపేట, 2.గుండురావుపేట, 3. చెరువు కట్ట రోడ్, 4. పెద్ద చెరువు.

**32వ వార్డు :** 1. బైపాస్ రోడ్, 2. బరంపేట,

**33వ వార్డు :** 1. బరంపేట, 2. సత్యనారాయణపురం, 3. చాకిరాల మిట్ట.

**34వ వార్డు :** 1. సత్తెనపల్లి రోడ్, 2. ఇందిరా నగర్, 3. రామా నగర్, 4. బి.సి. కాలనీ.

పై వీధులే కాక చాలా వీధులకు పేర్లు ఉన్నాయి. కాని అవి నరసరావుపేట మున్సిపాలిటి వారు గుర్తించనివి.

**మరికొన్ని పురాతన వీధులు :**

1. ప్రాంతాల వారీగా చూస్తే మొదట ఏనుగుల బజారును చెప్పుకోవాలి. ప్రస్తుతం మన మున్సిపల్ లెక్కల మేరకు విద్యుత్ బోర్డు ఆఫీసు నుండి సత్తెనపల్లి రోడ్ వరకు

వీధి గతచరిత్రను పరిశీలిస్తే, శ్రీ రాజా వేంకట గుండా రాయుని గారికి ఈ పేటలో 99 ఏనుగులు ఉండేవని పెద్దలు చెబుతున్నారు.వాటిని కట్టివేసే స్థలానికే 'ఏనుగుల బజారు' అని పేరు వచ్చింది.

2. **మానికల బావి వీధి :** కుసుమహరనాథ్ మందిరం నుండి శ్రీరస్తు ఫంక్షన్‌హాలు (వేంకటేశ్వరటాకీస్) వరకు ఉన్న వీధిని మానికలబావి వీధిగా వ్యవహరిస్తున్నారు. కోట లోని అద్దాల మేడ ముందు ప్రభువులవారు కూర్చునేం దుకు విలాసవంతమైన వేదిక ఉంది. దాని మీద ప్రభువు సుఖాసీనులైనపుడు పై నుండి పూలవాన కురిసి నట్టుగా సన్నటి నీటి తుంపరలు కురిసే విధంగా ఏర్పరచబడింది.

   **మానికల బావి :** ఈ బావిలోని నీరు మానికల వంటి బక్కెట్లతో మేడపైన గల ట్యాంక్‌లోకి చేరుస్తారు. తిరిగి నీటి తుంపరలు మేడ ముందు కూర్చున్న వారిపైన చల్లగా పడుతుండేవి. మేడ ముందరి భాగమంతా చల్లని నీటి తుంపర పడే విధంగా అమర్చిన నాటి తరం నైపుణ్యం మెచ్చుకోతగింది.

3. **కోట బజారు :** శ్రీ రాజావారికి చాలామంది కాల్బలం నాయకులు, అనేక దాసదాసీ జనులుండేవారు. వారంద రికీ తగినరీతిలో నివాసగృహాలుండటంవల్ల ఈ బజారుకు కోట బజారు అనే పేరు నిలిచిపోయింది.

4. **పాతూరు అంజనేయస్వామి గుడివీధి :** పూర్వపు అట్లూరి గ్రామంలోని గోపాలస్వామి గుడి శిథిలం అయింది. దాని ముందు భాగాన ఉన్న వీరాంజనేయ స్వామి విగ్రహాన్ని అట్లూరులోని ప్రత్యేక ఆలయంలో ప్రతిష్ఠించారు.అదే పాతూరు అంజనేయస్వామి గుడి. పాతూరుకు గుర్తుగా నిలచిన ఈ గుడిపేరుతో పాటు వీధిపేరు కూడా శాశ్వతంగా నిలిచింది.

5. **రెడ్ల బజారు :** మున్సిఫ్‌గా పనిచేసిన కాకుమాను హనిమిరెడ్డి, మాజీ మున్సిపల్ వైస్ ఛైర్మన్‌గా ఉన్న శ్రీ కాకుమాను పెద్దిరెడ్డి వంటి ప్రముఖుల కారణంగా ఆ వీధి రెడ్ల బజారుగా పేరొందింది.

6. **పట్టాభిరామస్వామి గుడివీధి :** పూర్వం తహశిల్దారుగా పనిచేసిన కీ॥శే॥ పంగనామాల లక్ష్మీనారాయణప్ప పంతులు గారు కోటకు దక్షిణాన కట్టిన ఆలయం. ఆ స్వామివారి పేర వెలసిన వీధి ఇప్పటి పట్టాభిరామస్వామి గుడివీధి.

7. **బలా బజారు :** కోటకు ఎదురుగా ఉన్న వీధిలో బలా బజారు ఉంది. బలావారి కుటుంబాల రాకతో ఈ పేరు స్థిరపడింది.

8. **అత్తరు బజారు :** రాజాగారి కాలంలో కొందరు మహమ్మ దీయులు అత్తరు తయారు చేసి రాజావారి అభిమానానికి పాత్రులయ్యారు. ప్రజల ఇంటి పేరు కాకుండా అత్తరు ద్వారా వీధి ఏర్పడటాన్ని చాలా ఆశ్చర్యంగా ఆ రోజుల్లో చెప్పుకునేవారు.

9. **నడింపల్లి వారి, నల్లపాటి వారి వీధులు :** అప్పటికీ ఇప్పటికీ న్యాయవాదుల వంశాలుగా పేరొందిన నడింపల్లి వారు, నల్లపాటి వారి పేరు మీదుగా ఆ వీధులకు వారి పేర్లు వచ్చినాయి.

## సుభాషితం

ఆపదలు వచ్చినప్పుడు ధైర్యంగా ఉండటం, గొప్ప సంపదలు సమకూరినపుడు మిడిసి పడకుండా ఉండటం, రాజసభలలో సముచిత రీతిలో నిరాఘాటంగా ప్రశంసించటం దేశ రక్షణ కోసం జరిగే మార్గంలో బుద్ధి బలాన్ని, భుజబలాన్ని ప్రదర్శించటం సత్కీర్తిని పొందాలనే కోరిక కలిగి ఉండటం, ఇవన్నీ సత్పురుషుల సహజలక్షణాలు.

– భర్తృహరి

# అడుగడున గుడి ఉంది...



డా॥ వేదాన్తం సత్యశ్రీనివాస అయ్యంగార్
విశ్రాంత సంస్కృత ప్రవాచకులు

మన భారతీయుల వైజ్ఞానిక సాంస్కృతిక వైభవానికి నిలువుటద్దాలు మన దేవాలయాలు.

**పాతూరు శివాలయం :** మన నరసరావుపేటకు పూర్వం అట్లూరు అనే పేరు ఉండేది. కటికినేని నారన్న, వెంకన్న అనే మన గ్రామమొఖాసాదార్ల ఆవులదొడ్డిలో ఒక పెద్ద పాముపుట్ట ఉన్నది. ఒక సమయంలో వాళ్లు ఆ పుట్టను త్రవ్వారు. అందులో నుండి పానవట్టంతో కూడిన ఒక శివ లింగం బయటపడ్డది. దానిక్రింద మరొక ఆరుపానవట్టాలు ఉన్నాయి. దీనితో పాటుగా క్రీ॥శ॥1159, 1244, 1282 సంవత్సరాలనాటి శాసనములు కూడా బయట పడినై. ఆ శివలింగము పేరు భీమలింగేశ్వర స్వామి. సంగయ్య అనే లింగబలిజ ఆ శివలింగాని కొక మట్టిగోడల ఆలయాన్ని కట్టాడు. తర్వాత అనేక సంవత్సరాలకు ఆ శివాలయం శిథిలమౌతుంటే కోటంరాజు వేంకటాచలం పంతులు, చిలకలపూడి రామస్వామి గట్టిఆలయాన్ని నిర్మించారు. కాలాంతరంలో పార్వతీదేవి, వీరభద్ర, భద్రకాళి, విఘ్నేశ్వర, నవగ్రహ, ఆంజనేయ, ఉమామహేశ్వర, కాత్యాయని, మల్లి కార్జున, కోటేశ్వరాది విగ్రహ ప్రతిష్ఠలు జరిగినై. 1802లో



పాతూరు లోని పాత శివాలయం

అట్లూరి కోటంరాజుగారు ఈ ఆలయానికి ధర్మకర్తగా ఉండే వారు. ఆ తర్వాత మద్ది వీరరాఘవయ్యగారు, వారి అనంతరం వారి కుమారులు మద్ది రామబ్రహ్మానందంగార్లు ధర్మకర్తలుగా ఉండి ఆలయాన్ని అన్నివిధాలుగా వృద్ధి చేశారు. గంగాపార్వతీ సమేత భీమలింగేశ్వ రాలయమైన ఈ శివాలయం పాతూరు శివాలయంగా ప్రసిద్ధిని పొందింది.

శ్రీ భారతీతీర్థ దక్షిణామ్నాయ శృంగేరి శారదాపీఠం మహాస్వామివారి ఆశీస్సులతో ఈ స్వామివార్లకు ఈ స్థలంలోనే మహావైభవోపేతంగా నూతన ఆలయాన్ని నిర్మిస్తున్నారు.

**వేణుగోపాలస్వామి ఆలయం :** భీమలింగేశ్వరస్వామి ఆలయ ముతోబాటు పాతూరులో ఉండేది.ఆ వేణుగోపాలస్వామి ఆలయం ఏనాడో కనుమరుగైనది. తురుష్కుల దండయాత్రలో ఈ ఆలయం ధ్వంసమైనట్లు చెబుతారు. మా చిన్ననాటి కాలమున కూడా కాలు చేతులు విరిగియున్న వేణుగోపాల స్వామి విగ్రహము పాతూరు వీరాంజనేయస్వామి గర్భా లయము వెనుకనున్న రావిచెట్టుక్రింద అరుగుపై చూసేవాళ్లం.

**పాతూరు ఆంజనేయస్వామిగుడి :** భీమలింగేశ్వరస్వామి ఆలయానికి ఆగ్నేయదిక్కున వీరాంజనేయస్వామి ఆలయ మున్నది. ఈయననే అట్లూరి వీరాంజనేయస్వామి అని, పాతూరు వీరాంజనేయస్వామి అని నేడు వ్యవహరిస్తున్నారు. 1975లో వేదాన్తం రామకృష్ణమాచార్యులవారి ఆధ్వర్యవంలో భక్తుల సహకారంతో జీర్ణోద్ధరణం వైభవంగా జరిగింది.

**భావనారాయణస్వామిగుడి :** ఈ ఆలయము నరసరావుపేట కట్టక ముందే ఉన్నట్లు 1784వ సంవత్సరమున రాజా మల్రాజు వెంకటగుండారాయణింగారు కళ్లగుంట రంగా చార్యులుగారికి వ్రాయించి యిచ్చిన సనదును బట్టి తెలు స్తున్నది. ప్రస్తుతం వినుకొండరోడ్డులో ఉన్న ఈ పెద్ద



భావనారాయణస్వామి గుడి



పట్టాభిరామస్వామి గుడి

గోపురముకాక, ఉత్తరాన కూడా ఎత్తైన గాలిగోపురం ఉండేది. పట్టణ వీధుల విశాలీ కరణలో భాగంగా ప్రాచీన ఆలయం కనుమరుగై పోయింది. భక్తుల సహకారంతో నూతన ఆలయం లో ఆస్థాన మండపం, ఘంటామండపం నిర్మించ బడ్డాయి.

**కొప్పురావూరి గుళ్లు :** క్రీ॥శ॥ 1797లో పరమయ్య అను యోగి గ్రామమునకు ఈశాన్య దిక్కున పెద్దకత్తువచెరువును త్రవ్వించెను. పిమ్మట వేణుగోపాల స్వామి దేవాలయమును, రామలింగేశ్వరస్వామి ఆలయమును కట్టించి స్వామివార్లను ప్రతిష్ఠింపజేసెను. పిదప శా॥శ॥ 1834 (క్రీ॥శ॥ 1912) సంవత్సరమున కొప్పురావూరి వెంకటప్పయ్య, బాలప్రసాదం, బాలకోటయ్యలు ఈ రెండు దేవాలయాల గోపురాదికములు నిర్మింపజేసి జీర్ణోద్ధరణ చేశారు. శా॥శ॥ 1840 (క్రీ॥శ॥ 1918) సంవత్సరాన వేణుగోపాలస్వామి ఆలయాన్నికట్టించి ప్రతిష్ఠించారు. కొప్పురావూరి వంశస్థులనిర్వహణలో ఉన్నందు వలన ఈ గుళ్లకు 'కొప్పురావూరివారి గుళ్లు' అని వ్యవహార మేర్పడ్డది.

**వినాయకుడి గుడి :** క్రీ॥శ॥ 1840 ప్రాంతంలో ప్రస్తుతం మెయిన్ రోడ్డులో సేఠ్‌శివలాల్ కుమారుడు శివభక్తు విఘ్నేశ్వ రాలయాన్ని నిర్మించాడు. 1906లో ఆర్యవైశ్య సంఘంవారు గుడి కట్టించి గణపతి ప్రతిష్ఠను చేయించారు.

**పట్టాభిరామస్వామి గుడి :** నరసరావుపేటలో పూర్వము తహశీల్దారుగా ఉన్న పంగనామముల లక్ష్మీనారాయణపం తులు గారు రాజాగారి కోటకు దక్షిణభాగాన కోదండరామ స్వామి ఆలయాన్ని నిర్మించాలనుకున్నారు. శ్రీరామచంద్ర స్వామి ఆయనకు స్వప్నములో దర్శనమిచ్చి, సత్తెనపల్లి తాలూకా కొల్లూరి గ్రామమున భూస్థాపితమైయున్న తమ విగ్రహాలను తెచ్చి ప్రతిష్ఠించుమని చెప్పాడు. పంతులుగారు కృష్ణానదీతీరంలో త్రవ్విస్తుండగా ఒక శ్వేతగరుడపక్షి కాళ్లతో ఇసుకను లాగుచూ కన్పించింది. పంతులుగారు ఆ ప్రదేశము లో త్రవ్వగా కొద్దిలోతులోనే సీతమ్మవారు, భరత శత్రుఘ్న హనుమంతులతో కూడిన పట్టాభిరాముని ఏకశిలా విగ్రహము సాలగ్రామములతో సహా కన్పించెను. ఆయన ఈ విగ్రహము లను తెచ్చి 1862 ఫిబ్రవరి 4వ తేదీన ప్రతిష్ఠించారు.

తరువాత కొంతకాలమును నాగసరపు పున్నయ్యగారి కుమారుడు సుబ్బరాయశ్రేష్ఠిగారు వేదాంతం రంగాచార్యుల వారి ప్రోత్సాహముతో పట్టాభిరామస్వామివారికి ఆలయ ప్రాకార గోపురాదులను నిర్మించి సువర్ణ కలశము లెత్తించి 26-4-1939న ప్రతిష్ఠాకలాపములు నిర్వహించారు. పిదప వారి పుత్రుడు నాగసరపు రామారావు తండ్రి ఆశయాలకు అనుగుణంగా స్వామికి కైంకర్యములను శ్రద్ధగా కొనసా గించారు. నేడు వారి కుమారుడు నాగసరపు సుబ్బరాయ గుప్తా తాతతండ్రుల మార్గములో పట్టాభిరాముని కైంకర్యము లను శ్రీరంగాది దివ్యక్షేత్రములలో జరిగినట్లే అంగరంగ వైభవముగా జరుపుచున్నారు.

**సీతారామస్వామిగుడి :** వంగల రామస్వామి భార్య ఆది లక్ష్మమ్మగారు 1905లో సీతారామస్వామికి ఆలయం నిర్మిం చారు. కొంత భూవసతి సమకూర్చి 1907 ఆగష్టు 9న కొప్పురావూరి వెంకటప్పయ్యకు అప్పగించారు. కొంపల్లి హనుమంతరావు కాకుమాను హనుమయ్యగార్లు చాలా కాలం ఆలయంలో పూజాదికాలు నిర్వహించారు. తరువాత మందవ వెంకటరెడ్డి శ్రేష్ఠి దేవాలయాన్ని వృద్ధిపరచారు. తరువాత వీరి



సీతారామస్వామి గుడి

కుమారుడు మండవ ఆదినారాయణరావు 1977లో గాలి గోపురం, కలశ ప్రతిష్ఠలతో మహాకుంభాభిషేకం నిర్వహించారు. ఆలయ సింహద్వారానికి ఇరుప్రక్కల ఏర్పరచిన నల్లని గున్నఏనుగుల శిలా విగ్రహాలు నేటికి చూపరులను ఆకట్టుకుంటున్నాయి. ప్రస్తుతం వారి కుమారులు ఆలయ నిర్వహణం చేస్తున్నారు.

**పాండురంగస్వామిగుడి :** గుగ్గిలం వెంకటసుబ్బయ్య పాండు రంగస్వామిగుడి కోసం స్థలం సంపాదించి శంకుస్థాపనచేసి దివంగతులైనారు. వీరి సతీమణి రాఘవమ్మగారు శ్రీ తాటి కొండ కోటేశం ద్వారా ఆలయగోపురాది నిర్మాణాలు చేయించి 1-4-1936న స్వామి ప్రతిష్ఠాకార్యక్రమములు నిర్వహింప జేశారు. 16-4-1960న తాటికొండ రామపోలిశెట్టి, శ్రీదోరడ్ల రామయ్యలు పరిపాలనా బాధ్యతలు స్వీకరించారు.

**కన్యకాపరమేశ్వరి గుడి :** 1896లో మాజేటి శ్రీరాములు ఆధ్వర్యంలో నెల్లూరుకు చెందిన వాసవీకన్యకాపరమేశ్వరి భక్తుడు కొత్తమాసు కోటప్ప ఈ ఆలయాన్ని నిర్మించాడు. నగరేశ్వర స్వామిని, కన్యకాపరమేశ్వరిని, పార్వతీదేవిని ప్రతిష్ఠింపజేసి 1896 సంవత్సరం ఆగష్టు 25వ తేదీన మాజేటి శ్రీరాములుకు బాధ్యతలు అప్పగించారు. ప్రస్తుతం నరసరావు పేట ఆర్యవైశ్య సంఘం ఆలయ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నది.

**నరసింహస్వామి గుడి :** శ్రీ అధరాపురపు పురుషోత్తమా చార్యులువారు తమ గృహాన్నే ఆంజనేయస్వామికి మందిరంగా చేసి తామే ఆరాధన జరుపుతుండేవారు. కొలది సంవత్స రముల క్రితం ఆలయార్చకులుగా వచ్చిన పళ్ళె శ్రీధరస్వామి ఇందులో నరసింహస్వామిని ప్రతిష్ఠించారు. నేడు ఈ ఆలయము నరసింహస్వామిగుడిగానే పిలవబడుచున్నది.

**పాత శంకరమఠం :** శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రిగారు శంకరమఠమును కట్టించి, అందులో పుష్పగిరిపీఠాధిపతులైన శ్రీవిద్యానృసింహభారతీ స్వాములవారిచే ది. 7-7-1923న ఆదిశంకరాచార్యస్వామిని ప్రతిష్ఠింపజేశారు.

**అరండల్‌పేట ఆంజనేయస్వామి గుడి :** అరండల్‌పేటలోని కొంతభాగానికి 1893 సం॥లో పోతురాజు వెంకట ప్పయ్య గారు రాధాకృష్ణనగరమని పేరుపెట్టిరి. ఇందొక ఆంజనేయ స్వామి దేవాలయము కలదు. ఈ ఆలయావరణలోనే బ్రహ్మయ్యగారు రంగనాయకస్వామివారిని ప్రతిష్ఠింపజేశారు.

**బరంపేట ఆంజనేయస్వామిగుడి :** బరంపేటలోని పాటిమళ్ల రంగయ్యతోట యజమాని రంగయ్యకు ఆంజనేయస్వామి స్వప్నదర్శన మిచ్చి తోటలో బావిని త్రవ్వవలసిందిగా చెప్పాడు. రంగయ్య బావిని త్రవ్వించారు. అందులోనే శ్రీ ప్రసన్నాంజ నేయస్వామి విగ్రహం లభ్యమైంది. దానిని ఆయన 1932లో ప్రతిష్ఠ చేశాడు. ప్రస్తుతం ఈ ఆలయాన్ని వారి కుటుంబికులు వసుంధరాదేవి నిర్వహిస్తున్నారు.



మంచికంటివారి సత్రంలోని ఆంజనేయస్వామి గుడి

**స్టేషన్‌రోడ్డు ఆంజనేయస్వామి గుడి :** 1938లో ప్రముఖ కాంట్రాక్టరు మంచికంటి వెంకట్రామయ్య రైల్వేస్టేషన్‌రోడ్డులోని తమ సత్రంలో ప్రసన్నాంజనేయస్వామి మందిరం నిర్మించారు. అరిపిరాల సుబ్రహ్మణ్యంగారు ఇందులో అనేక సంగీత ఆధ్యాత్మిక సాహిత్య కార్యక్రమాలను జరిపారు.

**రామిరెడ్డిపేట ఆంజనేయస్వామిగుడి :** రామిరెడ్డిపేటలో 1938లో శ్రీ కాకుమాను చినపేరిరెడ్డి సంకల్పంతో బెల్లం

కొండ స్వామి ఆధ్వర్యంలో వీరాంజనేయస్వామి విగ్రహ ప్రతిష్ఠ ఆలయనిర్మాణం జరిగింది. వీరి అల్లుడు సాంబిరెడ్డి ధర్మకర్తగా ఉండేవారు. 1997లో వీరి మనుమడు అయోధ్య రామిరెడ్డి ఆలయజీర్ణోద్ధరణ చేశారు.

**శృంగేరి శంకరమఠం :** 1989 మే 21న శృంగేరి పీఠాధిపతి జగద్గురు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ స్వామివారు శంకరమఠాన్ని నిర్మించారు. శారదా శంకరాచార్యుల ప్రతిష్ఠలు చేశారు.



శృంగేరి శంకరమఠం

**ఇస్కాన్ కృష్ణమందిరం :** పూర్వం బరంపేటలో వాసుకీక్షేత్రం పేరుతో సుమారు ఎకరము ఇరవై ఐదు సెంట్ల సువిశాలమైన రాధాకృష్ణ మందిరం ఉండేది. దీనిని రిటైర్డు తహసీల్‌దార్ కత్తుల రాజసింహుడుగారు నిర్మించారు. ఈ స్థలంలోనే అంతర్జాతీయ కృష్ణచైతన్య సంఘం (ఇస్కాన్) ఆధ్వర్యంలో రాధాగోవింద చంద్రమందిరం నిర్మింపబడింది. ప్రస్తుతం దీనిని శ్రీ వైష్ణవకృపాదాస్ నిర్వహిస్తున్నారు. ప్రపంచవ్యాప్తంగా తాలూకాస్థాయిలో ఇస్కాన్ వారిచే నిర్మింపబడిన మందిరం ఇదీ ఒక్కటే.

1936-1938లో బరంపేటలో లలితానంద స్వామివారు రాజరాజేశ్వరీసమేత వాయులింగేశ్వరస్వామిని, 1945- 1946లో వాయుమల్లేశ్వరస్వామిని, పార్వతీ అమ్మవారిని, నవగ్రహాలను ప్రతిష్ఠింపజేశారు. స్వామి సిద్ధిపొందిన తరువాత మేళ్లచెర్వు వీరాంజనేయులు, గోపరాజు వేంకటేశ్వర్లు, బండ్లమూడి రామయ్యగారలు దీనిని పర్యవేక్షించేవారు. నాగసరపు నారాయణ ఆలయమునకు స్థలదానం చేశారు. కోర్టుఉద్యోగి పబ్బరాజు వేంకట లక్ష్మీ నరసింహరాజు సన్యాసిగా మారి ఎస్.వి.ఎస్. స్వాములుగా 1964లో వేంకటేశ్వర భక్తసమాజం ఏర్పరచి వేంకటేశ్వర స్వామి ఆలయాన్ని నిర్మించారు.

1948లో శ్రీరాంపురంలో పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి భక్తులు జెండాను ప్రతిష్ఠించి, 1974లో శిష్యులతో కూడిన వీరబ్రహ్మేంద్రస్వామి పాలరాతి విగ్రహాలను ప్రతిష్ఠించారు. 1964లో ప్రకాశ్‌నగర్‌లో వీరాంజనేయస్వామి ఆలయనిర్మాణం జరిగింది. జొన్నలగడ్డ వెంకట సుబ్బారావు గారు అదే ఆవరణలో 1985లో వేంకటేశ్వర స్వామి, పద్మావతి, ఆండాళ్లు విగ్రహాలను ప్రతిష్ఠించారు. సత్తెనపల్లి రోడ్‌లో ఉన్న కన్యకాపరమేశ్వరి దేవస్థాన గోశాల ఆవరణలో 1975లో జైపూర్ నుండి వచ్చిన సంతాన వేణుగోపాలస్వామి పాలరాతి విగ్రహాల ప్రతిష్ఠ జరిగింది. 1962లో అగరం శ్రీనివాస ఆశ్రమ స్థాపకులు సేగు కృష్ణదాసుగారు కన్యకా పరమేశ్వరి ఆలయమునందు 'గీతాపారాయణ' సంఘాన్ని స్థాపించారు. 1985లో దోగిపర్తి సత్యనారాయణ గీతా మందిరానికి శంకుస్థాపన చేశారు. తరువాత నాగసరపు ఆంజనేయులు, ఊటుకూరి సత్యనారాయణ, నాటి శాసన సభ్యులు డా॥ కోడెల శివప్రసాదరావుగారు, ఆర్యవైశ్య యువజన సంఘం, ఆర్యవైశ్య సంఘపు పెద్దల సహకారంతో భవన నిర్మాణాలు జరిగినవి. 1982లో పాతూరులో వేంకటేశ్వరస్వామి ఆలయ నిర్మాణం మువ్వల ఆంజనేయులు గారి పర్యవేక్షణలో జరిగింది. 1988-'89 కాలంలో సత్తెనపల్లిరోడ్‌లో అయ్యప్పస్వామి ఆలయ నిర్మాణం జరిగింది. సత్తెనపల్లి రోడ్‌లోనే భీమా బలరామమూర్తి, రాఘవమ్మ దంపతులు స్థలవసతి కల్పించి, 1992లో షిర్డిసాయిబాబా మందిర నిర్మాణం చేశారు. పాతూరు చెరువుగట్టుపై మెహర్ బాబా పాలరాతి విగ్రహంతో ఆలయం నిర్మించారు. ఆ చెరువు కట్టమీదనే, చౌడేశ్వరి దేవాలయం, విజయచాముండేశ్వరీ దేవాలయాలు నిర్మించబడినాయి. ఎన్.జి.ఓ. కాలనీలో వేంకటేశ్వరస్వామి, షిరిడి దేవాలయం, ప్రకాష్‌నగర్‌లో షిరిడి సాయిబాబా మందిరం, చినచెరువుదగ్గర సాయిబాబా మందిరం, కోటప్పకొండరోడ్‌లో కల్యాణవేంకటేశ్వరస్వామి దేవస్థానము, పలు ప్రాంతాలలో గంగానమ్మ, పోలేరమ్మ వంటి గ్రామదేవతల గుళ్లు ఉన్నాయి.

ఊరు పుట్టక పూర్వము నుండి మహత్తర దేవాలయములతో విలసిల్లి, మహనీయుల పాదస్పర్శతో పునీతమైన ఈ నేల త్వరలో విశ్వసమాజానికి శాంతి సౌభాగ్యాలను అందించే పవిత్రక్షేత్రంగా మారటం తథ్యము. •

# నగర సంకీర్తన




వజ్రాల విజయలక్ష్మి పండిట్
కామర్స్ లెక్చరర్


పట్టణ సంక్షేమం కోసం, ప్రజాశ్రేయస్సుకోసం, లోకకళ్యాణం కోసం, కరువుకాటకాల నుండి ఈతిబాధల నుండి ప్రజలను కాపాడటం కోసం నిత్యం చేసే భగవద్ధానం నగరసంకీర్తన. నరసరావుపేట పట్టణంలో అఖండంగా ప్రతి ఉదయమున సాగే నగరసంకీర్తనను నాకు నాలుగు సంవత్స రాల వయస్సు నుండి నేను ప్రతి నిత్యము ప్రత్యక్షంగా చూస్తు న్నాను. నగర సంకీర్తనాచార్యులకు తెల్లవారుజామున స్వాగతం పలికి పాండురంగస్వామి గుడివద్ద హారతులివ్వడం నాకు ఇప్పటికీ జ్ఞాపకం. భగవంతుని మేలుకొలుపు పాడటం, ప్రజలకు మేలుకొలుపు పాడటం అనేవి నగరసంకీర్తనలో ముఖ్య అంశాలు.

నరసరావునేట పట్టణంలో కూకుట్ల చిననరసిం హయ్యగారు 1933 మాఘమాసం శుద్ధఏకాదశి అనగా ది. 17-2-1933న భక్తశిఖామణి వాసుదాసస్వాములవారి చేతుల మీదుగా నీళ్లు వదిలి '100 సం॥ల పాటు పట్టణంలో అఖండంగా తెల్లవారుజామున నగరసంకీర్తన కార్యక్రమము చేస్తా'మని ప్రమాణం చేశారు. ఈ కార్యక్రమానికి ది. 17-2-2003 నాటికి 75 సం॥లు పూర్తిఅయినవి. ప్రస్తుతం 83వ సం॥ జరుగుచున్నది. అప్పట్లో కూకుట్ల చిననరసింహయ్య గారికి ఒక సపోటాతోట ఉండేది. ప్రతిరోజు ఒక వ్యక్తి నాలుగు అణాలు అనగా పావలా ఇచ్చి సాయంత్రానికి గన్నేరు, మా రేడు, తులసి మొదలగు పవిత్ర వృక్షముల పత్రిని మరియు అందమైన పూలను తెప్పించేవారు. వారు ఆ పత్రితోను, పూల తోనూ ఒక మాలను కట్టి నగర సంకీర్తనలో పెట్టే పెద్ద పటానికి వేస్తారు.

నగర సంకీర్తనలో పూజించే పటం 'గజేంద్ర మోక్షం' కలంకారీ డిజైనులో చిత్రంచబడి ఉంటుంది. ప్రతిరోజు సంకీర్తనాపరులు బ్రహ్మముహూర్తానికి అనగా సరిగా గం॥ 4-10 ని॥లకు గాంధీచౌక్‌లో కలుసుకొంటారు. పటాన్ని పట్టుకొని స్వామివారిని అర్చించి పత్రి, పూలమాలలను స్వామి వారికి అలంకరించి బయలుదేరతారు. అప్పట్లో ఇద్దరు మను షులు కాగడాలు ధరించేవారు. ప్రస్తుతం లాంతరును ఉప యోగిస్తున్నారు. ఒక భక్తుడు సాంబ్రాణి కడ్డీలను పట్టుకొం టాడు. పూర్వం నగరపర్యటన సంకీర్తనలతో పాండురంగ స్వామిగుడి, పట్టాభిరామస్వామిగుడి, కోటబజారు, మల్లమ్మ సెంటర్, శ్రీరాంపురం మీదుగా నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠి గారి ఇంటి ప్రక్కన ఉండే రామాలయానికి చేరి పర్యటన ముగించేవారు. ఇప్పుడు పట్టాభిరామస్వామివారి దేవస్థానానికి చేరుతున్నారు. సూర్యోదయానికి ముందే నగరసంకీర్తన పూర్తి చేయటం ఇందులో ముఖ్యవిషయం.

నగరసంకీర్తనలో మొదటగా విఘ్నేశ్వరుని మీద రెండు మూడు పాటలు పాడతారు. విష్ణుమూర్తి మీద మేలు కొలుపుపాట 'వైకుంఠవాస లక్ష్మీసమేతుడ హరినారాయణ మేలుకో!...' అని పాడుతారు. తర్వాత 'హరే రామ, హరే రామ రామ రామ హరే హరే' అనీ, 'ప్రజలందరికీ దేవుడే శ్రీ కృష్ణుడు...' అనీ పాటను ఆలపిస్తారు. తదుపరి 'లేవండ య్యా! నిదుర లేవండయ్యా! లేచి రాముని సేవ చేయండ య్యా!, ఎప్పటి కేమౌనో ఎవరెరుగుదురయ్యా! లేచి రాముని భజన చేయండయ్యా!...' అని పాడి మంగళహారతితో మేలు కొలుపు పాటలు పూర్తిచేస్తారు. ప్రజాసౌఖ్యం కోసం భగవం తుడ్ని ప్రార్థించడం వీరి నిస్వార్థసేవకు నిదర్శనం.

శ్రీ పబ్బత్తి వెంకటేశ్వర్లు, పబ్బత్తి కోటేశం, రెడ్డి ఆంజ నేయులు, నాగసరపు కోటయ్యగార్లు, ఇంకను మందవవారు, నాగసరపువారు, కొలిశెట్టివారు, బత్తులవారు, కాకుమాను వారు, వారి కుటుంబ సభ్యులు ఇందులో పాల్గొని సేవ లందిం చారు. నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారు వీరిని బాగా ప్రోత్స

హించేవారు. ప్రస్తుత సంకీర్తనాసమాజంలో కొత్త హరనాథ బాబు, రాఘవరపు శ్రీనివాసరావు, సన్నిధి రామకోటేశ్వరరావు, కొప్పురావూరి లక్ష్మీనారాయణ గార్లు, కొలిశెట్టి వెంకటేశ్వర్లు, కొలిశెట్టి కోటేశ్వరరావు, పొట్టి కోటేశ్వరరావు, కొలిశెట్టి వేంకటేశ్వర్లు, బచ్చు బసవేశ్వరరావు, దింటకర్తి కోటేశ్వరరావుగార్లు, మరికొందరు భక్తులు పాల్గొంటున్నారు.

భగవన్నామ సంకీర్తనాప్రభావం 60 ఆమడల దూరం వరకు చూపుతుందని, ప్రజలను కరువు కాటకాల బారిన పడకుండా రక్షిస్తుందని సంకీర్తనాపరులు తెలిపారు. పెనుతుఫానులు సంభవించినాయి. నరసరావుపేట పట్టణం జలమయం అయింది. ఇన్ని ఆటంకాలు ఎదురైనా నగరసంకీర్తన మాత్రం ఇంతవరకు ఆగలేదు. ఇది వారి ఆత్మబలానికి, దీక్షకు, పట్టుదలకు, భగవంతునిపైగల భక్తికి నిదర్శనం. ●



## సాధారణం - అసాధారణం

ఒక సాధారణ విషయాన్ని, అతి సాధారణ అంశాన్ని అసాధారణంగా తీర్చిదిద్దటంలోనే నాయకత్వ పటిమ దాగి వుంది. పురపాలకసంఘం 100 వసంతాలు పూర్తిచేసుకోవటం నిజానికి సామాన్య విషయం. అయితే నరసరావుపేట పురపాలకసంఘం శతవసంతాల వేడుకలను డాక్టర్‌గారు ఎంత అద్భుతంగా మలిచారో ఈ ప్రత్యేక సంచికలోని వ్యాసాలు స్పష్టం చేస్తాయి. మరో ప్రత్యేకత : ఆ ఉత్సవాలకు అంతర్జాతీయ గుర్తింపు తీసుకు రావటానికి ఒక వెబ్‌సైట్ *www. narasaraopetamunicipality.com* ను ప్రారంభింపజేశారు. పట్టణచరిత్ర, జరుగుచున్న కార్యక్రమాలను దేశవిదేశాలలో నివసిస్తున్న నరసరావుపేట వాసులకే కాక ఆసక్తిపరులైన వీక్షకు లందరకూ అందజేశారు. ఈ విధంగా తమ జన్మస్థలంలో జరిగే ఉత్సవాలను తిలకించటానికి, వీలైతే భాగస్వాములు కావటానికి అందరకు గొప్ప అవకాశం కల్పించారు.

అలానే జాతీయ స్థాయిలో ఈ ఉత్సవాలకు ఒక గుర్తింపు, చిరకాలం గుర్తుండేలా చేయటానికి ఒక ప్రత్యేక కవరును ముద్రించి, ఒక ప్రత్యేక కాన్సలేషన్‌ను తపాలశాఖ వారి ద్వారా ఏర్పాటు చేశారు. ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారి చేత ఉత్సవాల తొలిరోజున చక్కని సాయంసంధ్యా సమయంలో వేలాది వీక్షకుల కరతాళ ధ్వనుల మధ్య అట్టహాసంగా దానిని విడుదల చేయించారు. ప్రపంచంలో గొప్ప హాబీ ఫిలాటలీ- స్టాంపుల సేకరణ. నేటి నుండి ఈ కవర్లు అనేక ప్రదర్శనలలో చోటు చేసుకుంటాయి కనుక ఈ వేడుకలకు ఒక శాశ్వతత్వం ఏర్పడింది. ఈ ఉత్సవాల రూప శిల్పి అయిన డా॥ కోడెల శివప్రసాదరావుగారు, నేటి మున్సిపల్ ఛైర్‌పర్సన్ అదృష్టశాలి నాగసరపు సుబ్బరాయగుప్త గార్ల సంతకాలతో ఈ ప్రత్యేక కవర్‌కు ఫిలాటలిస్టుల భాషలో చెప్పాలంటే అద్భుత పరిపుష్టత ఏర్పడింది. ●

# ఉపాసకులు

డా॥ తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రి, విశ్రాంత ఆంధ్రప్రవాచకులు



మద్దిరాల గోపన్న : మహామహిమోపేతమైన దివ్యచరిత్ర కలిగి మన ఊరి దేవ్యుపాసకుల కందరికీ ఆచార్యపీఠంగా అలరారినవారు మద్దిరాల గోపన్నగారు. శ్రీవిద్యలో పాదు కాంత దీక్షాపరులై, దేవీసాక్షాత్కారాన్ని పొందిన మహనీయులు. మన నరసరావుపేటలోని పాతూరు శివాలయంలోని పార్వతీ దేవి సన్నిధిలో అనేక శరన్నవరాత్రి ఉత్సవాలను సశాస్త్రీయంగా నిర్వహించినవారు. గొప్ప మంత్రశాస్త్ర ప్రవీణులు.

**చింతలపాటి సుందరరామ సోమయాజులు :** చింతలపాటి సుందరరామ సోమయాజులుగారు 1909 సం॥లో కొప్పరం గ్రామంలో జన్మించారు. త్రిపురసుందరమ్మగారు, కృష్ణావధానులుగారు వీరి తల్లిదండ్రులు. సోమయాజులుగారి భార్య శ్రీలక్ష్మీసోమిదమ్మగారు. సుందరరామయ్యగారు శ్రీవిద్యలో గొప్పఉపాసకులుగా లబ్ధప్రతిష్ఠులు. ఇతర దేవతోపాసనలతో కూడా జీవితాన్ని పండించుకొన్న సోమయాజులుగారు గొప్ప శిష్యబృందాన్ని తయారుచేశారు. వీరు గొప్ప పంచాంగకర్తలుగానూ, పురోహితులుగానూ పేరుగడించినవారు.

**చింతలపాటి గంగాధర సూర్యనారాయణ :** చింతలపాటి సుందరరామ సోమయాజులుగారి జ్యేష్ఠపుత్రులు గంగాధర సూర్యనారాయణగారు. చిన్నతనంలోనే తండ్రిగారి వద్ద శ్రీవిద్య మంత్రోపదేశాన్ని పొంది ఆ విద్యలో తండ్రిని మించిన తనయుడనిపించుకొన్నారు. గొప్ప అనుష్ఠాతలు. యజ్ఞ యాగాదులను చేయించటంలో సాధికారిక ప్రజ్ఞ కలిగినవారు.

**సాగి సాంబమూర్తి :** సాగి సాంబమూర్తిగారు క్రీ॥శ॥ 1916వ సంవత్సరంలో రొంపిచర్ల మండలం, అలవాల గ్రామంలో జన్మించారు. లక్ష్మీతులశమ్మగారు, సూర్యనారాయణగారు వీరి తల్లిదండ్రులు. సాంబమూర్తిగారి పెద్దనాన్న గుంటుపల్లి మల్లయ్యగారు వీరిని ఆధ్యాత్మిక రంగప్రవేశం చేయించారు. శ్రీవిద్యామూర్తులు మద్దిరాల గోపన్నగారు సాంబమూర్తిగారికి శ్రీవిద్య నుపదేశించి 'సదాశివా నందనాథ' అని దీక్షానామాన్నిచ్చారు. సాంబమూర్తిగారు అకుంఠిత దీక్షతో మంత్రానుష్ఠానం చేసి పరదేవతానుగ్రహానికి పాత్రులైనారు. సాంబమూర్తిగారి ధర్మపత్ని సీతారామమ్మ గారు. వీరు సహధర్మచారిణి అన్న పదానికి ప్రత్యక్ష నిదర్శనంగా వాసి కెక్కినవారు. సాంబమూర్తిగారు మన పాతూరి శివాలయంలోని పార్వతీ దేవి సన్నిధిలో 75 సంవత్సరాలు



సాగి సాంబమూర్తి

దేవీనవరాత్ర ఉత్సవాలను సంప్రదాయబద్ధంగానూ, నిష్కామంగానూ నిర్వహించారు. అదేవిధంగా ఈ శివాలయంలోనే వినాయకుడి సన్నిధిలో 50 సంవత్సరాలు గణపతి నవరాత్రులను జరిపారు. మన పట్టణంలోనూ, పరిసర గ్రామాలలోనూ, పట్టణాలలోనూ వీరి ఆధ్వర్యవంలో సహస్రా ధికంగా ఆలయ ప్రతిష్ఠలు జరిగినై. సాంబమూర్తిగారు 2008 సంవత్సరం ఆగష్టు 24వ తేదీన నిర్యాణం చెందారు.

**'కంఠమాల' సుబ్బయ్య :** వెలమకన్ని సుబ్బావధానులుగారు రక్తాక్షినామ సంవత్సర శ్రావణ శుద్ధ పాడ్యమి రోజున జన్మించారు. వీరి జన్మస్థలము ఇనిమెట్ల గ్రామము. తల్లి జానకమ్మగారు, తండ్రి కోనయ్యగారు. వీరికి ఇద్దరు కుమారులు. ఒకరు శివానందశాస్త్రిగారు. వీరు లలితోపాసకులు. ఒక్క రోజులోనే లలితా అమ్మవారి అనుగ్రహము పొందినవారు. రెండవవారు సుబ్బయ్యగారు. సుబ్బయ్యగారు తమ మేనమామ రావిపాడు గ్రామవాస్తవ్యులైన రాచర్ల నరసింహయ్యగారి వద్ద ధర్మశాస్త్రమును చదివారు. రామిరెడ్డిపేట చౌడేశ్వరి అమ్మవారి దేవాలయములో అమ్మవారి సేవ చేస్తూ కాలం గడిపేవారు. వేదవిద్య పట్ల గల అభిలాషతో నరసరావుపేట నుండి నడచుకుంటూ నెల్లూరు జిల్లా, పంట్ల అల్లూరు గ్రామంలో ఉన్న వాళ్ల పెద్దమ్మగారి వద్దకు వెళ్లి అక్కడి పండితులు ఇలకాల సీతారామశాస్త్రి, మైలవరపు మహాదేవయ్యగార్ల వద్ద 200 ఘనపనసలను, వేదవిద్యను అభ్యసించారు. నరసరావుపేటలో సాగి సాంబమూర్తిగారివద్ద శ్రీవిద్యనూ, మంత్రశాస్త్రమును అభ్యసించారు. అనేక ప్రాంతాలలో దేవీ, దేవత, నాభిశిలా ప్రతిష్ఠలు గావించారు. నైజాం ప్రాంతమందు మానసిక రోగు లనేకులకు తమ ఉపాసనాబలంతో స్వస్థత చేకూర్చారు. అనేకమంది మహిళలచే చాలాకాలం సావిత్రీ వ్రతాలు

చేయించి 'సావిత్రి సుబ్బయ్యగారు'గా పేరుగాంచారు. వీరి ధర్మపత్ని వచ్చినవారికి లేదనకుండా అన్న, వస్త్ర, దానాదులు చేసి అన్నపూర్ణగా పేరుగాంచింది.

సుబ్బయ్యగారు గురువుగారైన సాంబమూర్తిగారితో కలసి అమరావతి, శ్రీశైలం, నరసరావుపేట శివాలయలలో లక్షబిల్వార్చనలు, కుంకుమార్చనలు, లలితా యాగములు, గణపతి నవరాత్రులు, దేవీ శరన్నవరాత్రులు, కార్తికమాస నక్తదీక్షలు చేశారు. గద్వాల సంస్థాన పండితులచే 'కంఠమాల' బిరుదును పొందినారు. వేద, పురాణ, ఇతిహాస, మహాకావ్య, ధర్మశాస్త్ర, తత్త్వ, జ్యోతిష, ప్రశ్న, మంత్ర, తంత్ర శాస్త్రాలలో సంస్కృత, వేదాంత పురాణ ప్రవచనాలలో గొప్ప ప్రజ్ఞకల వారు. వీరు 2005 నవంబర్ కార్తికశుద్ధ పాడ్యమినాడు పరమ పదించారు. గురువుల వద్ద విద్య నభ్యసించేటప్పుడు 'ఏకసంధా గ్రాహి' అని పేరు పొందారు. చాలామందికి మంత్రోపదేశాలు చేశారు. వీరిశిష్యులు అనేకులు దేశ, విదేశాలలో ఉన్నారు.

**కోట కోటిసుబ్బరామయ్య :** సంతమాగులూరు మండలం మిన్నికల్లులో జన్మించిన కోటిసుబ్బ రామయ్యగారు నరసరావుపేటలో స్థిరనివాస మేర్పరచుకొన్నారు. వీరు ది.16-08-1932న జన్మించారు. కోట బ్రహయ్య, భ్రమరాంబగార్లు వీరి తల్లిదండ్రులు. వీరి తొమ్మిదవ యేట ఉపనయనం చేసుకొని అలుగుమల్లిపాడు అగ్రహారం లోని వీరి బావగారైన తంగిరాల వేంకటేశ్వర అవధానులుగారి వద్ద స్మార్తవిద్యను అభ్యసించారు. నరసరావుపేటలో పౌరోహిత్యం చేస్తూ, చింతలపాటి సోమయాజులగారి వద్ద శిష్యరికం చేసి శ్రీవిద్యోపదేశాన్ని పొందారు.



కోట కోటిసుబ్బరామయ్య

కోటిసుబ్బరామయ్యగారు మద్దిరాల గోపన్నగారివద్ద దేవీఉపాసన, నవావరణార్చన, పాదుకాంతదీక్ష, ప్రసాద దీక్షలు తీసుకొని 'వీరానంద' నామధేయమును పొందారు. 1970వ దశకంలో మైసూరు మహారాజావారి ఆస్థానంలో జగద్గురు శ్రీ దక్షిణామ్నాయ శృంగేరిశారదాపీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ అభినవవిద్యాతీర్థ మహాస్వామివారు నిర్వహించిన సహస్రచండీ యాగంలో ఆంధ్రప్రదేశ్ నుంచి పాల్గొన్న ఋత్విక్కులలో కోట కోటయ్యగారు ఒకరు. అక్కడ స్వామివారి అనుగ్రహాన్ని పొంది తదుపరి శృంగేరిలో జరిగిన ప్రతి సహస్ర చండీయాగమునకు ఋత్విక్కుగా ఆహ్వానించబడినవారు.

కోటిసుబ్బరామయ్యగారు నరసరావుపేట శృంగేరి శంకరమఠం నిర్మాణ, నిర్వహణలలోనూ 1989లో జరిగిన కుంభాభిషేకంలోనూ ప్రముఖపాత్ర వహించారు. దాదాపు 11 సంవత్సరాలు శంకరమఠానికి ధర్మాధికారిగా సేవ లందించారు. కోటప్పకొండ త్రికోటీశ్వరస్వామివారి ఆలయ జీర్ణోద్ధరణ కమిటీలో సభ్యునిగా ఉండి ఆగమశాస్త్ర సలహాల నందించారు.



శివరామకృష్ణమూర్తి శాస్త్రి

ఎస్.ఎస్.& ఎన్. కళాశాల ఆంధ్రశాఖాధ్యక్షులు తూములూరి శివరామకృష్ణమూర్తి శాస్త్రిగారు పాదుకాంత దీక్షా పరులు. నిత్యశివాభిషేచనా తత్ప రులు. మన నరసరావు పేట లోని రామిరెడ్డిపేటలో నివసించిన కవితా సుబ్రహ్మణ్యంగారు శ్రీవిద్యాతత్పరులు. వివిధ మంత్రోపాసకులైన శ్రీ సుబ్రహ్మణ్యంగారు నిష్ఠాగరిష్ఠులు. శ్రీశివరామయ్యగారు మంచి ఉపాసనాపరులు. నరసరావుపేట సభాపతి మేళ్లచెర్వు యజ్ఞనారాయణగారి కుమారుడు మేళ్లచెర్వు శేషాచలంగారు హనుమదుపాసకులు గానూ, శ్రీవిద్యోపాసకులుగానూ లబ్ధప్రతిష్ఠులు. శతాధికంగా నిష్కామ సుందరకాండ పారాయణలు చేసినశేషాచలంగారికి హనుమత్సాక్షాత్కారంలభించింది. అగ్రికల్చర్ ఆఫీసులో ఉద్యోగ నిర్వహణం చేసిన దోనెపూడి లక్ష్మీప్రసాదరావుగారు శ్రీవిద్యోపాసకులై మన పాతూరు శివాలయంలోని పార్వతీపరమేశ్వరులను సేవించారు. శ్రీ బందారు శివరామకృష్ణశర్మగారు, శ్రీ సూరుమంచి సాంబశివ శర్మగారు పాదుకాంతదీక్షాపరులు. వర్తమానంలో వివిధరంగాలకు సంబంధించిన ఉద్యోగాలను నిర్వహించినవారు, నిర్వహిస్తూ ఉన్నవారు, గృహిణులు అనేకులు ఈ ఉపాసనా మార్గంలో పయనిస్తూ మన పట్టణ శ్రేయస్సుకు కారణభూతు లవుతున్నారు. •

# పంచాంగ కర్తలు - జ్యోతిషకులు




## ఘటం రామలింగశాస్త్రి

పంచాంగ కర్త, జ్యోతిష పండితులు


తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం- ఈ ఐదింటికి 'పంచాంగములు'అని పేరు. ప్రతి దినమూ ఇవి ఏ సమయం నుండి ఏ సమయం వరకు ఉంటాయో తెలిపే గ్రంథానికి పంచాంగము అనిపేరు. ఈ పంచాంగ శాస్త్రము ఖగోళగణితం మీద ఆధారపడిఉన్నది. ఈ పంచాంగ రచనలో మన పట్టణానికి ప్రముఖప్రచారాన్ని కల్పించిన సిద్ధాంతులనేకు లున్నారు. వారిలో ప్రముఖులను గురించి ప్రస్తావించుకొందాం!



**చింతలపాటి సుందరరామ సోమయాజులు సిద్ధాంతి :** చింతలపాటివారు కొండవీటిరాజుల ఆస్థాన దైవజ్ఞులు. వీరు తరతరాలుగా పంచాంగ రచన చేస్తూ, 'తాము వినిపించిన భవిష్యవాణి సత్యమే!' అని అనేక సందర్భాలలో నిరూపించిన మహనీయులు. సుందరరామ సోమయాజులుగారు మన నరసరావుపేటలోని అరండల్‌పేటలో నివసిస్తుండేవారు. వీరి నివాసం కారణంగానే ఆ వీధి చింతలపాటివారి వీథిగా పేరు తెచ్చుకొన్నది. సోమయాజులు గారు పుష్పగిరి సంస్థాన సిద్ధాంతిగా ఉండేవారు. 1909లో జన్మించిన వీరు 1962లో నిర్యాణం చెందేవరకు సుమారుగా నాలుగు దశాబ్దాలకు పై బడిన కాలం పంచాంగరచన చేశారు. రెండు పర్యాయాలు ఉన్నతస్థాయిలో యజ్ఞాలు చేశారు.

**చింతలపాటి గంగాధర సూర్యనారాయణ :** చింతలపాటి సుందరరామసోమయాజులుగారి జ్యేష్ఠ కుమారులు గంగాధర సూర్యనారాయణగారు 1933లో జన్మించారు. పంచాంగ రచనలో సిద్ధహస్తులు. ఒకానొక సమయంలో వీరు రాబోయే 5 సంవత్సరాల 'అడ్వాన్సు పంచాంగాన్ని' రచించి దైవజ్ఞ శేఖరుల మెప్పును పొందారు.

**గొట్టిముక్కల సుందరరామ సిద్ధాంతి :** గొట్టిముక్కల వారు మన నరసరావుపేట జమీందారులకు ఆస్థాన సిద్ధాంతులు. సుందరరామ సిద్ధాంతిగారు సహస్రమాసజీవి. యావజ్జీవం పంచాంగ రచన చేసిన మహనీయులు.



**గొట్టిముక్కల వీరరాఘవశర్మ :** వీరరాఘవశర్మగారు శ్రీరాజా మల్రాజు విజయకృష్ణగుండారావు బహద్దర్ వారి ఆదరాభిమానాలను అతిశయంగా అందుకొన్నవారు. వాస్తు జ్యోతిష విద్యాప్రవీణులు. తంత్రోపాసకులు.



**గడియారం రాధాకృష్ణమూర్తి :** అరండల్‌పేటలో స్థిరనివాసమేర్పరచుకొన్న రాధాకృష్ణమూర్తిగారు క్రొత్తపాతల మేలుకలయికగా గంటల పంచాంగాన్ని రూపొందించారు. తిథి, నక్షత్ర, వర్జ్యముల ప్రవేశాది కాలాలను సామాన్యులకు సైతం అర్థమయ్యే విధంగా గంటలు, నిమిషాలలో సూచించటం వీరి పంచాంగంలోని ప్రత్యేకత. ఈ విధానమే తరువాతి వారికి మార్గదర్శకమైంది.

**వెలమకన్ని హనుమయ్య :** హనుమయ్యగారు జ్యోతిషంలోనూ, ప్రశ్నశాస్త్రంలోనూ విశేషమైన ప్రజ్ఞను ప్రదర్శించిన మహనీయులు. మంచి వాక్శుద్ధి కలిగినవారు.

**మద్దులపల్లి సత్యనారాయణశాస్త్రి :** మద్దులపల్లి సత్యనారాయణశాస్త్రిగారు వాస్తు, ముహూర్త శాస్త్రాలలో విశేషమైన కృషిని సల్పినవారు. శిష్య వాత్సల్య పరిపూర్ణ హృదయులు. వీరి కుమారులు సుబ్రహ్మణ్యంగారు కూడా

సంప్రదాయ ఆధునిక పద్ధతుల మేళవింపుతో ఈ రంగంలో పేరును గడించారు.

**జన్నాభట్ల వీరభద్రయ్య :** వీరభద్రయ్యగారు జ్యోతిష శాస్త్రాన్ని



జన్నాభట్ల వీర భద్రయ్య

ఒక ఉద్యమంగా నడిపి, శిష్యబృందాన్ని తయారు చేశారు. 'వీరు పలికిందే శాస్త్రం' అన్న ప్రఖ్యాతిని గడించారు. వాస్తు, ప్రశ్న శాస్త్రాలలో లబ్ధప్రతిష్ఠులైన వీరభద్రయ్యగారు ఉదార స్వభావులై జనసామాన్యానికి చేరువైనారు. వాస్తుడమరుక గ్రంథకర్త. వీరి కుమారులు గోపాల కృష్ణమూర్తిగారు తండ్రికి తగ్గని తనయులు.

**సూరుమంచి సాంబశివశర్మ :** వీరు సంస్కృతాంధ్ర భాషా ప్రవీణులు. జ్యోతిష, ముహూర్త భాగాలను సంప్రదాయ రీతిలో క్షుణ్ణంగా అధ్యయనం చేసి, అధ్యాపనం చేసి రాణిస్తున్నారు.

**మేళ్లచెర్వు గురునాథశర్మ :** గురునాథశర్మగారు జన్నా భట్ల వీరభద్రయ్యగారి ప్రియశిష్యులు. గురుమార్గంలో పయనిస్తూ మంచిపేరును గడించుకొంటున్నారు. ప్రస్తుతం వీరు మన నరసరావుపేటకు సభాపతిగా వ్యవహరిస్తు న్నారు.

**చేరెడ్డి వెంకటేశ్వరరెడ్డి :** వేంకటేశ్వర రెడ్డిగారు శనగవరపు



చేరెడ్డి వేంకటేశ్వరరెడ్డి

లక్ష్మీనారాయణశాస్త్రిగారి వద్ద ముహూర్త, వాస్తు విషయాలను నేర్చుకున్నారు. శాస్త్రబద్ధజ్యోతిషాన్ని ప్రజాజీవితంతో పోల్చిచూచి నిజాన్ని నిగ్గుదేల్చిన అనుభవం వీరిది. నిరాడంబరజీవి. సత్త్వగుణ సంపన్నులు.



పాండురంగారావు

**బొగ్గరం హరనాథపాండురంగా రావు :** పాండురంగారావు గారు జ్యోతిర్వాస్తు విద్యాప్రవీణులు. నరసరావుపేట పరిసర గ్రామ ప్రజలకు అందుబాటులో ఉంటూ వారి అభిమానాన్ని చూర గొన్నారు.

**ఘటం రామలింగశాస్త్రి :** రామలింగశాస్త్రిగారు 2005 సంవత్సరంనుండి పంచాంగరచన చేస్తున్నారు. పాదుకాంత దీక్షాపరులైన వీరు వాస్తు, జ్యోతిష శాస్త్రాలలో కూడా నిష్ణాతులై రాణిస్తున్నారు.

**క్రోసూరి ప్రసాదరావు :** ప్రసాదరావు చైనావాస్తు, సంఖ్యా శాస్త్రాలలో దిట్ట. వాస్తు, తదితర దోషాలన్నింటికీ సులభమైన తరణోపాయాలను సూచించటం వీరి ప్రత్యేకత.

**దోనెపూడి వెంకయ్య :** వెంకయ్యగారు సంఖ్యాశాస్త్ర ప్రవీణులు. కొన్ని వందలమంది ప్రసిద్ధ వ్యక్తుల జాతకాలను సంఖ్యాశాస్త్ర రీత్యా పరిశీలించి తమ వద్దకు వచ్చిన వారికి తనదైన శైలిలో శాస్త్రోక్తమైన సూచనల నుచితంగా ఇస్తున్నారు.

**గుంటుపల్లి వేంకట సత్య సాయిరామ్ :** సాయిరామ్ వర్ధమాన శాస్త్రవేత్త. వీరు ప్రాచీన జాతకశాస్త్రాన్ని, నవీన సంఖ్యాశాస్త్రాన్ని గుణాత్మకంగా పరిశీలించి ఫలితాలను చెబుతున్నారు.

మనఊరి న్యాయస్థాన భవనాలకెదురుగా ఉన్న చింత చెట్ల క్రింద కూర్చొని, చిలకజోస్యాన్ని చెప్పుకొనేవారు, గవ్వలు వేసి ఫలితాలను చెప్పేవారు కొంతమంది ఉన్నారు. వారు కూడా గ్రామీణ ప్రజలనేకులకు జ్యోతిష్యం చెబుతూ, మనః స్థైర్యాన్ని కలిగిస్తున్నారు. వారి కృషి, విద్య అభినందనీయాలు.

**మంచి మిత్రుడు**

మంచి మిత్రుడు తన మిత్రుడిని పాపకార్యాలవైపు వెళ్లనివ్వడు. అతని చేత సత్కార్యాలను మాత్రమే చేయిస్తాడు. అతడి రహస్యాలను రహస్యంగానే ఉంచుతాడు. అతనిలోని సుగుణాలను పెంపొందింపచేస్తాడు. అతడు ఆపదలో ఉంటే అతడిని విడిచి వెళ్లడు. అతడు పేదరికంలో ఉంటే ఆర్థిక సహాయం చేస్తాడు. మంచి మిత్రుడి లక్షణాలు ఇవి.

- భర్తృహరి సుభాషితం.

లెమ్ము, మేల్కొను. గమ్యం చేరేదాక విశ్రమించకు. - వివేకానంద.

విజయ సాధనకు స్పష్టత, లక్ష్యం, పట్టుదల అవసరం. - ఎం.ఆర్. కాప్ మెయర్



# పురోహిత ప్రముఖులు



కోట వేంకటకోటినాగరాజు, కోట దుర్గామల్లేశ్వరప్రసాద్

పురానికి సంబంధించిన, పురప్రజలకు సంబంధించిన సమస్త విషయాలను గురించి హితాన్ని అభిలషించే వ్యక్తి, పురోహితుడు. నామకరణం, ఉపనయనం, వివాహాదుల నుండి చిట్టచివరి వరకు ప్రతివ్యక్తి జీవితానికి సంబంధించిన సమస్త సంస్కారాలూ పురోహితుడి పర్యవేక్షణలోనే జరుగుతై.

క్రీ॥శ॥1870 ప్రాంతంలో బ్రహ్మశ్రీ మేళ్లచెర్వు రామయ్యగారు మన నరసరావుపేటలోని పురోహిత బృందానికి 'సభాపతి'గా వ్యవహరిస్తూ ఉండేవారు. వారు స్మార్త విద్యా ప్రవీణులు. షోడశ సంస్కారాలను సాధికారికంగా చేయించగల సమర్థులు. సదాచార సంపన్నులు. శ్రీ రామయ్యగారి అనంతరం మేళ్లచెర్వు సుబ్బయ్యగారి కుమారులైన బ్రహ్మశ్రీ మేళ్లచెర్వు యజ్ఞనారాయణగారు సభాపతి స్థానానికి వచ్చి 1953 వరకు తమ బాధ్యతలను సమర్థతతో నిర్వహించారు. యజ్ఞనారాయణ తండ్రికి తగిన తనయులు. నిండైన విగ్రహంతో, రాజసం ఉట్టిపడే ముఖవర్చస్సుతో వేదమూర్తిలాగా విరాజిల్లుతూ ఉండేవారు.

1953 నుండి 1983 వరకు యజ్ఞనారాయణగారి పెద్దకుమారుడు మేళ్లచెర్వు జగన్నాథంగారు సభాపతులై తండ్రి తాతల బాధ్యతలను స్వీకరించి మంచిపేరును తెచ్చుకున్నారు. 1984లో మేళ్లచెర్వు రామశాస్త్రిగారు సభాపతులైనారు. వారి అనంతరం వారి పెద్దకుమారుడు గురునాథశర్మగారు 1984లో సభాపతులై, ఆ బాధ్యతలను నిర్వర్తిస్తూ ఉన్నారు. గురునాథ శాస్త్రిగారు స్మార్త, వాస్తు, ముహూర్త, జ్యోతిషశాస్త్ర నిష్ణాతులు. వీరు సుగృహీత నామధేయులైన జన్నాభట్ల వీరభద్రయ్యగారి వద్ద వాస్తు, జ్యోతిషవిద్యలను నేర్చుకొన్నారు. విద్యావినయ సంపన్నులైన శర్మగారు గొప్ప శిష్యగణాన్ని తీర్చిదిద్దుతున్నారు.



గోపాలకృష్ణావధానులు

జగర్లపూడి గోపాలకృష్ణావధానులుగారు నిత్య నైమిత్తిక కామ్యకర్మానుష్ఠాన నిష్ణాగరిష్ఠులు. వీరు గురుకుల పద్ధతిలో విద్యార్థులనేకులను స్మార్త విద్యాప్రవీణులుగా తీర్చిదిద్దారు. తంగిరాల వేంకటేశ్వరావధాని గారు దక్షిణామ్నాయ శృంగేరి శారదా పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ మహాస్వామివారికి పూర్వాశ్రమంలో పితృపాదులు. వీరు స్మార్తంతోబాటుగా వేదాన్ని గూడా అభ్యసించి, శిష్యులనేకులకు విద్యాదానం చేసిన విశిష్టవ్యక్తులు. మేళ్లచెర్వు దుర్గయ్యగారు మన జమీందార్‌గారి ఇంటి పురోహితులు.



వేంకటేశ్వరావధాని

మాధవభట్ల వేంకటేశ్వర్లుగారు, కోటిరావుగారు, రాచకొండ సుబ్రహ్మణ్యంగారు, మార్తి సీతారామాంజనేయులుగారు, భువనగిరి సుబ్బయ్యగారు, లంకా అనిల్‌కుమార్‌గారు పౌరోహిత్యాన్ని ఉదాత్తంగా నిర్వహించి ఉత్తము లనిపించుకొన్నారు.



లంకా అనిల్ కుమార్

పోలేపెద్ది వేంకటేశ్వర్లుగారు పాతూరులోని శివాలయంలో దేవస్థాన ఋత్విజులుగా ఉండి దాదాపుగా అరవై సంవత్సరాల కాలం భీమలింగేశ్వరస్వామివారిని మహన్యాసాభిషేకాదులతో సేవించారు. అందరూ వేంకటేశ్వర్లుగారిని 'శివుడికి పెద్దకొడుకు' అంటూ గౌరవించేవారు.



పోలేపెద్ది వేంకటేశ్వర్లు

సూరుమంచి రామశాస్త్రిగారు ఉదారస్వభావులు, పేదలపాలిటి పెన్నిధి. సూరుమంచి సాంబశివశర్మగారు సంస్కృతాన్ని, స్మార్తాన్ని క్షుణ్ణంగా చెప్పుకొన్నారు. మేళ్ళచెర్వు పట్టాభిరామశాస్త్రి (అబ్బులు) పౌరోహిత్యంలో ప్రశస్తిని పొందారు. ప్రస్తుతం సుమారుగా 200 మంది పురోహితులు వైదికవృత్తిలో రాణిస్తూ పురహితం కోసం కృషిచేస్తున్నారు. ●

# ఇస్లాం : మొరాకో నుండి...




## షేక్ బాజీ మస్తాన్

స్టేట్ ఆడిట్ డిపార్ట్‌మెంట్


ఇస్లాం చరిత్రకారుల ప్రకారం ఇస్లాం ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) క్రీ.శ.571 ఏప్రియల్ 20న జన్మించారు. ఆ పేరుకు అర్థం 'అత్యంత ప్రశంసనీయుడు' అని. ఆయన జన్మించే నాటికి అరేబియా నేల ఓ ఎడారి - శూన్యం. ఆ శూన్య ఎడారి నుండి శక్తిమంతమైన ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆత్మబలం ఓ కొత్త ప్రపంచాన్ని సృజించింది. అది ఓ కొత్త జీవితం ఓ కొత్త సంస్కృతి, నాగరికత! అదీ ఇస్లాం మతం. ఇస్లాం మొరాకో నుండి క్రీ.శ.711-712 ప్రాంతంలో భారత భూభాగంలోని దక్షిణాపథం చేరింది. అప్పటికే దక్షిణాపథంలో పరిపాలన సాగిస్తున్న రాష్ట్రకూటులు అరేబియాదేశం నుండి వచ్చిన అరబ్బు వర్తకులకు తమ సామ్రాజ్య నగరాలలో ప్రార్థనలు చేసుకోవటానికి మస్జీదులు నిర్మించారు. క్రీ.శ.1347లో బహమనీ రాజ్యస్థాపనతో దక్షిణాపథంలో ఇస్లాంచరిత్రలో ఒక ముఖ్యఘట్టం ప్రారంభమయింది. గుల్బర్గా, బీదర్ నగరాలలో మస్జీద్‌లు నిర్మింపబడ్డాయి. తరువాత బహమనీ రాజ్యపతనంతో తెలుగునేలపై కుతుబ్‌షాహిలు బలవంతులై గొల్కొండ రాజ్యస్థాపన ఆంధ్రదేశమంతా ఇస్లాం మతం విస్తరించింది.

ఆ క్రమంలో భాగంగా మన నరసరావుపేటకు అప్పటి జమీందార్ ఆహ్వానం మేరకు హనుమకొండ నుండి క్రీ.శ. 1797 ప్రాంతంలో యుద్ధసామగ్రి తయారుచేయడానికి మహమ్మదీయులు వచ్చారు. వారిలో కొందరు ఏనుగులు, గుర్రాల పోషణ చేయగా, కొందరు రాజాగారికోట సంరక్షణ చేసేవారు. జమీందార్, సుబేదార్‌ల యుద్ధాలలో పాల్గొనేవారు.

మసీదు అనగా దైవప్రార్థన చేసే ప్రదేశం. లేదా దేవుని నిలయం. మసీదులో ఇమామ్ ఆధ్వర్యంలో ముస్లిం సోదరులు ప్రతిరోజు 5 పూటలా సామూహికంగా దైవప్రార్థన (నమాజ్) చేస్తారు. ఈ ప్రార్థన సౌదీఅరేబియాలోని పవిత్ర మక్కా నగరంలోగల పవిత్ర 'కాబా' దిక్కుకు తిరిగి చేస్తారు. ప్రతి నమాజ్‌కు ముందు ప్రార్థనకు మౌజన్ ఇచ్చే పిలుపును 'అజాన్' -ప్రార్థనకు పిలుపు అంటారు. అజాన్ తరువాత ముస్లిం సోదరు లందరూ కలిసి తరతమ భేదాలు వీడి ఒకరి కొకరు భుజం భుజం ఆనుకొని నిలబడి ప్రార్థన (నమాజ్)లో నిమగ్న మౌతారు. శుక్రవారం ముస్లింలకు ప్రత్యేకమైన రోజు కాబట్టి ఆ రోజు ప్రతి మసీదులో ప్రత్యేకప్రార్థన (నమాజ్) జరుగు తుంది.

నరసరావుపేటలో గుంటూరురోడ్‌లో నాయబ్ బజార్‌లో మస్జిదే అహ్లె సున్నత్ పేరుతో మొట్టమొదటిసారిగా మస్జిద్ నిర్మాణం జరిగింది. ఆ మస్జిద్‌నే బడే మస్జిద్ అని పిలుచు కుంటారు. తర్వాత వరవకట్టకు సమీపాన జనాబ్ షేక్ ఖాసిం సాహెబ్, జనాబ్ బాబాసాహెబ్, జనాబ్ మొహిద్దీన్ సాహెబ్‌ల వితరణతో జామియా మసీదును నిర్మించారు. ఈ మసీదు 60 సెంట్ల స్థలాన్ని కలిగి నరసరావుపేట నడిబొడ్డున కలదు. పట్టణంలో అన్ని మసీదులను దిశానిర్దేశం చేసేది మస్జిద్ మస్జిదే అఖ్‌సా. దీనినే మర్కస్ మసీదు అంటారు. ఇది ఇస్లాం పేటలో కలదు. ఇక్కడ ప్రతి ఆదివారం సాయంత్రం ఇజ్‌తిమా (సన్మార్గంలో నడిపించే విషయాలలో అవగాహన) జరుగు తుంది. మరో ముఖ్యమైన మసీదు బరంపేటలోని మదీనా మసీదు. ఈ మసీదు ఆధ్వర్యంలో దారుల్ ఉలుమ్ మదర్స 50 మంది విద్యార్థులతో జరుగుతున్నది. ఇక్కడ ఉర్దూ బోధన చేస్తున్నారు.

1938లో అప్పటి జమీందార్ ప్రకాష్‌నగర్‌లో 1.6 ఎకరాల భూమిని ఈద్గామైదానంగా విరాళం ఇచ్చారు. అక్కడ రంజాన్, బక్రీద్ పర్వదినాలలో పట్టణంలోని ముస్లిం సోదరు లందరూ కలిసి ప్రత్యేక సామూహిక ప్రార్థనలు చేస్తారు. ఈ మైదానంలోనే నూతనంగా ఉస్మానీ గని మస్జిద్‌ను జనాబ్

ఎస్.ఎం.హెచ్. బాజాన్ పితరులతో నిర్మించారు. వీరు మన పట్టణంలో 1986వ సంవత్సరంలో పవిత్ర హజ్‌యాత్ర చేసిన మొట్టమొదటి వారయిన హాజీ మహమ్మద్ గయాసుద్దీన్, శ్రీమతి ఖైరున్నిసాబీల కుమారుడు. ఈ మసీదులో ప్రతి గురువారం సాయంత్రం మష్వారా (ఇస్లాం అభివృద్ధి కొరకు చర్చ) జరుగుతుంది.

వీటితోపాటు మన పట్టణంలోని ఎస్.ఎస్.పి. కాలనీలో మసీదు మైమూనా, రామిరెడ్డిపేటలో మున్వర్ మసీదు, పాత సమితి ఆఫీసు వద్ద నూర్ మసీదు, ప్రకాష్‌నగర్‌లో హుదా మసీదు, రైల్వేస్టేషన్ వద్ద గల బిలాల్‌మసీదు, బాపనయ్య నగర్‌లోని అలీముర్తజా మసీదు, బస్‌స్టాండ్ సమీపంలోని మక్కా మసీదు, ఏనుగుల బజారులోని మహమ్మదా మస్జిదే ఖతిజుల్ ఖుబ్రా, పెద్దచెరువులోని మసీదు మహ్మదీయా ముఖ్యమైనవి.

మన పట్టణంలో సత్తెనపల్లిరోడ్‌లో చంద్రబాబు నాయుడు కాలనీలో మసీదే అయేషా, డా॥ కోడెల శివప్రసాదరావు క్రీడాప్రాంగణం వద్ద మసీదేకీసర, బి.సి.కాలనీలో మసీదు ఉస్మాన్, వెంగళరెడ్డికాలనీలో ఫిర్దోదు మసీదు, అమీన్ మసీద్, రహమతుల్లా నగర్‌లో మసీదే, రహమతులు నూతనంగా ప్రారంభించినారు. చిలకలూరిపేటరోడ్‌లో పట్టణ ముఖద్వారం వద్ద నాలుగు మసీదులు నిర్మాణంలో ఉన్నాయి. అందులో మసీదు అబూబకర్ ఒకటి. మిగతావి నిర్మాణదశలో వున్నాయి.

నరసరావుపేట పురపాలకసంఘం 100 వసంతాల వేడుకల్లో భాగంగా డా॥ కోడెల శివ ప్రసాదరావుగారి ప్రోత్సాహంతో ముస్లిం శ్మశానవాటిక వద్ద గల మోతీమసీదును షాపింగ్ సముదాయం, వజూఖానాలు, అంతర్గత రోడ్లు, విద్యుదీకరణ, మొదలగు ఆధునిక సదుపాయాలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. •

# ఖబరస్థాన్ ఆధునికీకరణ

**షేక్ మీరావలి,** వైస్ ఛైర్‌పర్సన్, నరసరావుపేట పురపాలక సంఘం.



నరసరావుపేట మున్సిపాలిటీ 100 సంవత్సరముల ఉత్సవములు జరుగుచున్న సందర్భమున పట్టణ అభివృద్ధితో పాటు అన్ని మతముల శ్మశానవాటికలను సుందరవనములుగా రూపొందించే నిర్ణయము తీసుకొనుట ఆనందించదగిన విషయము.

ఈ సందర్భముగా నరసరావుపేట మునిసిపల్ వైస్ ఛైర్మన్ ఐన నా అధ్యక్షతన ఖబరస్థాన్ అభివృద్ధి సొసైటి కమిటీ ఏర్పడినది. ఖబరస్థాన్‌ను అందముగా మార్చుటకు కృషి జరుగుచున్నది. ఖబరస్థాన్ శాశ్వత అభివృద్ధికి, ఖబరస్థాన్ మస్‌జిద్ అభివృద్ధికి ముస్లిమ్ పేదప్రజలకు విద్య, వైద్య, వివాహ సాంఘిక విషయాలలో సహాయ సహకారములు అందించి వారి అభివృద్ధికి తోడ్పడాలనే ఉద్దేశముతో డా॥ కోడెల శివప్రసాదరావుగారి సహకారములతో ఖబరస్థాన్ అభివృద్ధి సొసైటిని 17 మంది సభ్యులతో రిజిస్టర్ చేయించటం జరిగినది. సొసైటీ సభ్యులందరు కలిసి నరసరావుపేటలోని ముస్లిమ్ పెద్దలను సంప్రదించి వారికి ఖబరస్థాన్ అభివృద్ధి సొసైటిలో పేర్కొనిన అంశాలను వివరించారు. ఆదాయ వనరులను సమకూర్చుకోవడానికి ఖబరస్థాన్‌లో పేర్కొనిన అంశాలను వివరించారు. ఆదాయవనరులను సమకూర్చుకోవటానికి ఖబరస్థాన్‌లోగల ఖాళీప్రదేశంలో 19 షాపులను నిర్మించడానికి కావలసిన ఆర్థికవనరులను- ముస్లిమ్ పెద్దల నుండి చందాలు సేకరించారు. 19 షాపుల నిర్మాణం జరిగినది.

సభ్యులు మరియు ముస్లిమ్ పెద్దల సహాయ సహకారములతో ఉన్నత ఆశయాలతో కొనసాగించాలనేది మా ఉద్దేశము. రిజిస్టర్డ్ బైలాస్ నందు పేర్కొన్న అంశములను తూచా తప్పకుండా నెరవేరుస్తూ ముస్లిమ్ పేదప్రజల అన్నివిధముల అభ్యున్నతికి సహకరించాలనే ఆశయంతో ఈ కమిటీ ఉన్నది. కమిటీ తన పవిత్రకర్తవ్యమును నెరవేర్చాలనే దృఢ సంకల్పంతో ఉన్నది. •



# అంజుమన్ ఇస్లామియా

## షేక్ అబ్దుల్ మన్నాన్ షరీఫ్

అధ్యక్షులు, అంజుమన్ ఇస్లామియా సంఘము

1950 సంవత్సరములో జనాబ్ షేక్ ముహ్మద్ అలిగారి అధ్యక్షతలో నరసరావుపేట అంజుమన్ ఇస్లామియా సంఘమును నరసరావుపేట మరియు పరిసర గ్రామముల లోని ముస్లిమ్ ప్రజల అభ్యున్నతి కోసం ఏర్పాట చేయటము జరిగినది. దీని కొరకు కావలసిన ఆదాయ వనరుల కొరకు వరవకట్ట జామియా మస్జిద్ స్థలమునందు షాపుల ఏర్పా టుకు కృషి చేయుటము జరిగినది. ఈ కార్యవర్గం అంజుమన్ సంఘము యొక్క అభివృద్ధి కొరకు 1950 నుండి 1973 వరకు పనిచేసింది. తరువాత జనాబ్ మొహిద్దీన్‌గారు, 1979 నుండి 1980 వరకు ఎ.పి. వక్ఫ్ సంస్థవారు అంజుమన్‌ను తమ అధీనములోనికి తీసుకొని వృద్ధిచేయటము జరిగినది.

2004 సంవత్సరములో డా॥ కోడెల శివప్రసాదరావు గారు జనాబ్ మహ్మద్ ముజిమ్మిగారి అధ్యక్షతన అంజుమన్ కమిటీని ఏర్పాటు చేయించి దాని అభివృద్ధికి దోహదపడినారు. ఈ కమిటీ ఈద్‌గాగ్రౌండ్ ఖాళీస్థలము నందు రూ. 31 లక్షల వక్ఫ్‌ఫండు ద్వారా షాపింగ్ కాంప్లెక్స్‌ను నిర్మించి అంజుమన్ ఆదాయము పెరుగుటకు దోహదపడింది. మరల అంజుమన్ సంఘమును 2007 సంవత్సరములో వక్ఫ్ సంస్థవారు తమ అధీనములోనికి తీసికొనటము జరిగినది. తరువాత జనాబ్ సయ్యద్ సైదాసాహెబ్‌గారు అధ్యక్షుడుగా పనిచేయటము, మరల వక్ఫ్‌సంస్థవారు తమ అధీనములోనికి తీసుకొనటము జరిగినది. మరల ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర తొలిశాసనసభాపతిగారైన డా॥ కోడెల శివప్రసాదరావుగారి కృషితోను, నరసరావుపేట పురపాలక సంఘం వైస్‌ఛైర్మన్‌గారైన జనాబ్ షేక్ మీరావలి గారి కృషితోను అంజుమన్ కమిటీని జనాబ్ షేక్ అబ్దుల్ మన్నాన్ షరీఫ్‌గారి అధ్యక్షతన ఏర్పాటు చేయించి 27 నవంబర్ 2015న వక్ఫ్ ఇన్‌స్పెక్టర్‌గారి నుండి ఇన్‌చార్జి ఇప్పించుట జరిగినది.

ఈ కమిటీ మస్జిద్ అభివృద్ధికి కృషిచేస్తూ, ఇమామ్, మౌజన్‌సాహెబ్‌లకు జీతములుసమకూర్చుతూ, పేదముస్లిమ్ ప్రజలకు సహాయ సహకారములను అందించాలని, పేద ముస్లిమ్ విద్యార్థుల విద్యాభివృద్ధికి దోహదపడాలని, ముస్లిమ్ వితంతువులకు, ముస్లిమ్ పేదవృద్ధులకు, పేద ముస్లింప్రజల వైద్యము కొరకు సహాయము చేయాలనీ కమిటీ సభ్యులు నిర్ణయము తీసికొనటము జరిగినది. పేద ముస్లిమ్ యువతీ యువకుల వివాహములకు సహకారము కూడా అందించా లని నిర్ణయించుకొనటము జరిగినది. అంజుమన్ సంఘ మును ఉన్నత సంఘముగా మార్చాలనే సంకల్పముతో దీని కొరకు కావలసిన ఆదాయ వనరులను వృద్ధిచేసికొనుటకు స్పీకర్‌గారి ఆధ్వర్యములో మరియు స్థానిక శాసనసభ్యులు డా॥ గోపిరెడ్డి శ్రీనివాసరెడ్డిగారి సహకారముతో అభివృద్ధి పరచుకోవాలనే సంకల్పముతో కమిటీసభ్యులు కృషిచేయాలని నిర్ణయించుకొన్నారు.



# ప్రార్థనా మందిరాలు



బి.ఆర్. సుశీల్ కుమార్

చైర్మన్, సంరక్ష సొసైటి

**మే రికర్ట్స్ మెమోరియల్ టౌన్ బాప్టిస్ట్ చర్చి :** 1885లో రెవ. ఇఇ సిల్మన్, భార్య, 1903లో ఆమెచెల్లెలు కుమారి మేరి కర్ట్స్ మిషనరీలుగా నరసరావుపేటకి వచ్చారు. 1910లో మేరి కర్ట్స్ అమెరికాకు వెళ్లవలసి వచ్చింది. అప్పటి వరకు హార్ద్ కాంపౌండ్‌లో ఉన్న ప్రార్థనా మందిరంలో ఆరాధనలు జరిగేవి. అది పట్టణానికి చాలా దూరంగా ఉంది. అందుకని రెవ. సిల్మన్‌గారికి పట్టణములో ఒక చర్చిని నిర్మించవలెనని ఆలోచన వచ్చి పట్టణం మధ్యలో కొంత భూమిని సేకరించాడు. 1911లో మేరి కర్ట్స్ కొంత ధనాన్ని సేకరించుకొని అమెరికా నుండి వచ్చినది. అనేక గ్రామాలు తిరిగి ప్రజలను కలిసి కొంత ధనం వసూలు చేసి 1912లో మరణించింది. ఆమె సమకూర్చిన డబ్బుకు మరికొంత చేర్చి సిల్మన్ దంపతులు ఆ చర్చిని పట్టణంలో నిర్మించి దానికి 'మేరి కర్ట్స్ మెమోరియల్ బాప్టిస్ట్ చర్చ్'గా నామకరణం చేసారు.

'మేరి కర్ట్స్ మెమోరియల్ బాప్టిస్ట్ చర్చ్‌కి మొట్టమొదటి సంఘకాపరి సిల్మన్‌గారు. ఆ తరువాత వరుసగా జె. ఫ్రాన్సిస్ గారు, బి. యోహాన్‌గారు, జె. నతానియేలుగారు, టి.పాల్ బెంజ్‌మెన్‌గారు, బి. జాన్‌బాబుగారు, జె.ఎం. ప్రకాశ్‌రావు గారు, పి.జె. సాల్మన్‌గారు, డి. విజయదత్తుగారు సంఘ కాపరులుగా బాధ్యతలను నిర్వహించారు. ప్రస్తుతం ఎం. ఎలిషాగారు సంఘకాపరిగా ఉన్నారు.

హార్ద్ కాంపౌండ్‌లో మేపుల్స్‌డన్ దంపతులు కట్టించిన మొట్టమొదటి చర్చిని ఆ తరువాత హార్ద్ హైస్కూల్ చాపల్‌గా ఉపయోగించారు. 1999 లో బి. డేవిడ్ అలెగ్జాండర్‌గారు, ఎ.ఎస్. పాల్‌గారు, ఐ. ప్రసాదరావుగారు, కె.ఎ. లింకన్‌గార్ల ఆధ్వర్యంలో అదే చర్చ్ బిల్డింగ్‌లో మిలీనియమ్ తెలుగు బాప్టిస్ట్ సంఘం స్థాపించబడింది. ఈ సంఘమునకు కె. ప్రభు మనో హర్‌దాస్‌గారు, డి.ఎం. రాహుల్‌దేవ్‌గారు, కె. అర్చిరావుగారు సంఘకాపరులుగా బాధ్యతలు నిర్వర్తించారు. ప్రస్తుతం పి.ఎస్ తిమోతిగారు సంఘకాపరిగా ఉన్నారు.

**రోమన్ కథోలిక్ మిషన్ :**

**పునీత శౌరివారి దేవాలయం :** 1940 సం॥లో గుంటూరు మేత్రాసనం ఆవిర్భవించింది. ఆ సంవత్సరంలోనే తురక పాలెంలో మల్లవరపు శౌరయ్య అనే భూస్వామి 26-06-1941న నరసరావుపేటకు చెందిన పొతకమూరి శౌరయ్య గారిని, కరణం చిన్నయ్యగారిని, ఫాదర్ సింగారెడ్డి తోమస్ గారిని సభ్యులుగా చేర్చుకొని తన యావదాస్తితో ట్రస్ట్ ఏర్పాటుచేశారు. 1958 ఫిబ్రవరి 20న ట్రస్టు సభ్యులలో ఒకరైన పొతకమూరి శౌరయ్యగారి ఔదార్యంతో నేటి ఈ దేవాలయానికి పునాది వేశారు. క్రైస్తవ, క్రైస్తవేతర భక్తుల రద్దీ వలన కె.బి. సత్యానందంగారు దానిని విస్తృత పరిచారు. బిషప్ గాలిబాలిగారు హార్దిక, ఆర్థిక చేయూతల నిచ్చారు.

కె. తోమస్‌గారు, జి. రాయన్న, జి. తానయ్య, గోపు శౌరి, జోసఫ్ వన్నికట్, జి. అంతయ్య, కె. సుందరరాజు, వై. బాలశౌరిరెడ్డి, కె.బి. సత్యానందం, పూదోట జోజయ్య, వై.ఎల్. మర్రెడ్డిగార్లు దీని అభివృద్ధి కొరకు శ్రమించారు. పొతకమూరి దుస్తీనయ్య, పొన్నపాటి లూర్థురెడ్డి, నాగోతు ఇన్నయ్య, మద్దినేని రాయన్న, కొండవీటి చిన్నయ్య, సౌభాగ్యపు జ్ఞానేసుగార్లు శ్లాఘనీయమైన సేవల నందించారు.

**యునైటెడ్ లూథరన్ చర్చి మిషన్ :**

**పరిశుద్ధ పౌలు లూథరన్ దేవాలయము :** అమెరికన్ మిషనరీలు డౌల్‌బేర్, ఫినిఫ్రాక్‌గార్లు, అమెరికా దేశపు యు.ఎల్.సి.ఎం. వారి సహకారముతో నరసరావుపేటలో సువిశాలమైన భూమిని సేకరించారు. 1929 లో లూథరన్ దేవా

లయమును నిర్మించారు. ఇది డా॥ మోయర్, ఇ.జి.వుడ్, జి.సి. పీరిస్మిత్ హేనర్ల పర్యవేక్షణతో పాటు, స్త్రీ మిషనరీలు మిస్సీ మోజెస్, ది.జె. నికెల్, రూత్ సిగ్నెన్, డి. డోలెన్‌గార్ల సహకారముతో దినదినాభివృద్ధి చెందుతూ వచ్చింది. 1929 నుండి 1940 వరకు మిషనరీలు సంఘకాపరులుగా ఉన్నారు. ఎస్. సంతోషంగారు బి.మోషేగారు, పి. శౌరయ్య గారు, కె. దేవసహాయంగారు, పి. జాన్‌గారు, ఎస్. ప్రసాద్ రావుగారు, జ్యోతిరాజారావుగారు, బి. కనకాంబరంగారు, లాం చార్లెస్‌గారు, బెల్లి ప్రకాశంగారు, కె. ఆశీర్వాదంగారు, ఎ. భాస్కర్‌రావుగార్లు సంఘకాపరులుగా 2010 వరకు సేవల నందించారు. ప్రస్తుతం కె. ప్రేమ్‌కుమార్ సంఘకాపరిగా వున్నారు. మేళం అబ్రహాంగారు, కొండమూడి ఎడ్వర్డుగారు ఈ దేవాలయమును అభివృద్ధి పరిచారు.

**లూథరన్ వెస్ట్ పారిష్ చర్చి :** 1997లో అంధుల పాఠశాల లోని 43 సెంట్ల స్థలములో పరిశుద్ధపౌలు లూథరన్ చర్చి (పడమర) దేవాలయ నిర్మాణమును మొదలు పెట్టారు. ఆ నాటి ఎ.ఇ.ఎల్.సి అధ్యక్షులైన డా॥ ఇమ్మానియేలుగారు దీనిని ప్రారంభించారు. ఎల్. హెచ్. భారతిగారి సహాయముతో ఈ నూతన దేవాలయము 2004న మెయిన్ చర్చికి అనుబంధ చర్చిగా ప్రతిష్ఠింపబడింది. లూథరన్ మిషన్ తరపున జె.సి.పి. స్మిత్ హేనర్‌గారు నరసరావుపేటలో ఆఖరి మిషనరీగా పనిచేశారు.

ఈ విధంగా మన భారతీయులు, భారతీయేతరులు మన పట్టణంలోని చర్చీల అభివృద్ధికి ఎంతో కృషిచేశారు.

## నరసరావుపేటతో నా అనుబంధం

**ప్రయాగ కృష్ణమూర్తి,** రిటైర్డు హెడ్, బోటనీ డిపార్టుమెంటు

1956 జులైలో మొదటిసారిగా నాకు పాతిక సంవత్సరా లున్నప్పుడు పెళ్లిచూపుల కొరకు ఈ ఊరు వచ్చా. సెప్టెంబరు 12వ తేదీ 1956 సం॥లో 4 గదులపోర్షను 18 రూ॥కు అద్దెకు తీసుకొన్నాము. ఒక సంవత్సరంగడిచిన తరువాత మా యింటి ఖామందు రూ. 1/- అద్దె పెంచమన్నారు. ఆ రోజుల్లో అదే మాకు కష్టం అనిపించింది.

అప్పటికి ఈ ఊరు చాల చిన్నది. 30,000 మంది జనాభా వుండేది. ఇప్పుడు ఎస్.కె.ఆర్.బి.ఆర్. కాలేజి వున్న చోటు నుంచి, మా కాలేజి వరకు రోడ్డుకు ఉత్తరాన పెద్దచెరువుండేది. నీరు నిండుగా వున్నప్పుడు ఎంతో శోభాయమానంగా, ఆహ్లాదకరంగా వుండేది. గడియారస్తంభం సెంటరు నుంచి శౌరయ్యగారి, తుమ్మల రామకోటయ్యగారి బస్సులు నడిచేవి. అప్పటికి ఆర్.టి.సి. లేదు. అనిసెట్టి కృష్ణారావుగారి ఇంటి ముందు ఒక చిన్న మార్కెట్టు వుండేది. పండ్ల కొట్లు రెండే వుండేవి. ఊరు మొత్తంలో రెండే మోటారు కార్లుండేవి. మోటారు సైకిళ్లు అసలు లేవనే చెప్పాలి. నీటి ఎద్దడి విపరీతంగా వుండేది. సాగర్ నీళ్లు వచ్చిన తర్వాతే నరసరావు పేటకు నీటి ఎద్దడి లేకుండా పోయింది. అంగర లక్ష్మీనారాయణగారు, తాడేపల్లి సంపూర్ణంగారు, నడింపల్లి హనుమంతరావుగారు, శ్రీగిరిరాజు రంగారావుగారు, లంకా రామనాథంగారు, గుంటుపల్లి సుబ్బారావుగారు, బొడ్డుచర్ల హనుమంతరావుగారు, నల్లపాటి వేంకట్రామయ్యగారు, నల్లపాటి వేంకటేశ్వర్లుగారు, ప్రత్తిపాటి సుబ్బారావుగారు, యనమండ్ర సాంబశివశాస్త్రిగారు లాంటి పేరుమోసిన లాయర్లు ఉండేవారు.



కోలవెన్ను రామకోటేశ్వరరావు గారు, శ్రీ శ్రీ, పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, గడియారం వేంకట శేషశాస్త్రిగారు, కాటూరి వేంకటేశ్వరరావు గారు, తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, విశ్వనాథ సత్యనారాయణగారు, శలాక రఘునాథశర్మ గారు, ప్రభాకర ఉమామహేశ్వర పండిట్‌గారు, నీలం సంజీవరెడ్డిగారు, కాసు బ్రహ్మానందరెడ్డి గారు, బెజవాడ గోపాలరెడ్డిగారు మొదలైనవారిని ఇక్కడే కలుసుకున్నాను.

ఈ 50, 60 ఏండ్లలో ఊరు ఎంతో పెరిగింది. జనాభా ఎక్కువ అయింది. వసతులు పెరిగినవి. భవిష్యత్తులో మన వూరు శాటిలైట్‌సిటీగా అభివృద్ధి చెందుతుంది.

# పండుగలు



**డా॥ దండా హనుమంతరావు**
ప్రిన్సిపాల్ (రిటైర్డ్)

అనేక భాషలు, కులాలు, మతాలు కలిగి భిన్నత్వములో ఏకత్వానికి గుర్తుగా భారతీయ పండుగలను ప్రజలు స్నేహ సౌభ్రాత్రాలతో వసుధైక కుటుంబముగా సమైక్యతా భావనతో జరుపుకొందురు.

**ఉగాది :** చైత్ర శుద్ధ పాడ్యమి నుండి తెలుగు వారికి సంవత్సరము ఆరంభమగును. ఈ రోజు నరసరావుపేటలో ప్రతి దేవాలయమునందు సేవాసంస్థలందు ప్రజల, దేశభవిష్యత్ మార్గమును తెలిపే 'పంచాంగశ్రవణము'లు జరుగును. వర్షములు కురియుట, దేశాధిపతుల పాలనావిధాన ఫలితాలు, వ్యక్తిగత జాతకఫలితాలు వివరించబడును. రెడ్‌క్రాస్ హాల్‌నందు ఆ రోజు సాయంత్రము లయన్స్ క్లబ్, రోటరీ క్లబ్‌లతో కలసి అభ్యుదయభారతి కవితా సమ్మేళనములు జరిపి, ప్రథమ, ద్వితీయ బహుమతుల నిస్తుంటారు.

**శ్రీరామ నవమి :** ఇది ప్రతి సంవత్సరము చైత్ర శుద్ధ నవమి దినమున వచ్చును. మన నరసరావుపేటలో మొదట సంప్రదాయబద్ధంగా తాటాకు పందిళ్లతో 16 రోజుల వేడుకలు జరుపుకొన్నారు. సుమారు ముప్పది సంవత్సరముల నుండి గడియారము స్తంభం సెంటర్‌లోని స్వస్తిక్ జనరల్ స్టోర్స్ షాపు ముందు తాటాకు పందిరి వేసి 16 రోజులు ఉత్సవము జరిపేవారు. 1975 నుండి 2002 వరకు మల్లమ్మ సెంటర్ తూర్పుబజార్‌లో వైభవోపేతంగా శ్రీరామనవమి వేడుకను జరిపించారు.

సీతారామ స్వామి దేవస్థానము నందు జరుపు శ్రీరామనవమి వేడుక తెలుగువారి పెండ్లి వేడుకను మరపించును. నవమికి ముందురోజే స్వామిని పెండ్లి కొడుకును చేయుట, సకలదేవతలను పెండ్లిపెద్దలుగా ఆహ్వానించుట (అంకురారోపణ), పొన్నమాను ఉత్సవము, నవమిరోజు కల్యాణము, దశమిరోజు వసంతోత్సము, చక్రస్నానము, పూర్ణాహుతి హెూమములు, దొంగలదోపిడి, దేగాట, రాత్రికి పవళింపుసేవ, పూలంగిసేవ, వగైరాలు రోజుకొక విధంగా చేస్తారు. పై విధముగానే పట్టాభిరామస్వామి దేవస్థానమువారు కూడా నిర్వహించుచున్నారు.

**తొలి ఏకాదశి :** ఆషాఢ శుద్ధ ఏకాదశియే తొలిఏకాదశి. మన నరసరావుపేట ప్రజలు తెల్లవారు జాముననే లేచి తలంటు స్నానములు చేసి కోటప్పకొండకు వెళ్లి త్రికోటేశ్వరుని సన్నిధానములో అర్చనలు, అభిషేకములు చేయించెదరు.

**శ్రీకృష్ణాష్టమి :** శ్రీకృష్ణుడు శ్రావణ బహుళాష్టమి రోజు జన్మించాడు. అదే కృష్ణాష్టమి. ఈ పండుగను నరసరావుపేటలోని ఇస్కాన్ టెంపుల్‌వారు వైభవోపేతముగా నిర్వహించెదరు. ఈ వేడుకలో 'ఉట్టికొట్టుట' ప్రధానమైనవేడుక.

**వినాయక చవితి :** నరసరావుపేటలో గత 30 సంవత్సరములకు పైబడి క్లాత్‌మర్చంట్స్ అసోసియేషన్‌వారు వైభవముగా వినాయకచవితి ఉత్సవమును జరిపారు. గత పందొమ్మిది సంవత్సరాలుగా డ్రగ్గిష్ట్స & మెడికల్ అసోసియేషన్‌వారు శ్రీరాంపురంనందు గణపతిఉత్సవాలు ఘనంగా జరిపేవారు. రోజుకొక తీరుగా గణపతిని అలంకరించుట వీరి ప్రత్యేకత. 17 సంవత్సరములనుండి కాకుమానువారివీధిలో విఘ్నేశ్వరుని ఉత్సవం వైభవంగా జరుగుచున్నది. గత 28 సంవత్సరాల నుండి గడియారంస్తంభం వద్ద స్వస్తిక్ జనరల్‌స్టోర్స్ షాపు ఎదురుగా తాటాకు పందిరి వేసి ఘనంగా గణపతి ఉత్సవాలు జరుపుతున్నారు. రాజాగారికోటలో మహాత్మాగాంధీ క్లాత్ మార్కెట్‌వారు గణపతి ప్రతిమను తమ పందిరిలో నెలకొల్పి కొలుచుచున్నారు. పల్నాడు రోడ్డులోని ఎస్.ఎస్.&ఎన్. కళాశాల వద్ద కొందరు కళాకారులు పూర్వం మట్టితోను, తరువాత ప్లాస్ట్ ఆఫ్ ప్యారిస్‌తోను గణపతి బొమ్మలు చేస్తున్నారు.

**దసరా :** అశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి దశమి వరకు ఈ పండుగను జరుపుకొందురు. ఈ ఉత్సవాలను నరసరావుపేటలో ప్రముఖంగా పాతూరు శివాలయంలోనూ, చౌడేశ్వరి దేవాలయము, కన్యకా పరమేశ్వరీ దేవాలయములోనూ వైభవంగా జరిపించెదరు. అమ్మవారిని బాల, కౌమారి, వైష్ణవి, మహాలక్ష్మి, మహాకాళి, సరస్వతి, అన్నపూర్ణ, దుర్గ, మహిషాసుర మర్దిని, రాజరాజేశ్వరి రూపాలలో రోజుకొక విధముగా అలంకరించి అర్చింతురు.

**బతుకమ్మ పండుగ :** ఆశ్వయుజ శుద్ధపాడ్యమి నుండి దశమి వరకు ఈ పండుగను జరుపుకొందురు. స్త్రీలు తెల్లవారు జాముననే నిద్ర లేచి, తలంటు స్నానము చేసి క్రొత్తబట్టలు ధరించి వివిధరకాల పూలతో బతుకమ్మను చేసి పూజింతురు.

**దీపావళి :** ఆశ్వయుజ అమావాస్యకు ముందు చతుర్దశినాడు నరకాసుర సంహారము జరిగినది. మరుసటి దినము దీపావళి. మన నరసరావుపేటలో నరకచతుర్దశి తెల్లవారుజామున వరిగడ్డితో వెదురు కఱ్ఱలు ఆసరాగా నరకాసురుని గడ్డిబొమ్మను చేసి ఆపాదమస్తకము సీమటపాకాయలు, అవుట్లు, చిచ్చుబుడ్లు వగైరా ప్రేలుడు సామాగ్రి అమర్చి నిప్పంటింతురు. ఈ కార్యక్రమము మొదట మల్లమ్మసెంటర్‌లో జరిగేది. ఆ తర్వాత గడియార స్తంభం సెంటర్‌లో జరుగుచున్నది.

**నాగులచవితి :** 'దిబ్బు దిబ్బు దీపావళి, వచ్చె వచ్చె నాగుల చవితి' అని జానపదుల పాట. కార్తీక శుద్ధ చవితియే నాగుల చవితి. శివుని కంఠహారము సర్పము. కనుక సర్పములను పూజించుటచే శివానుగ్రహము కలుగుతుంది. స్త్రీ, పురుషులు వేకువనే పవిత్ర స్నానాలు చేసి శుభ్రమైన వస్త్రాలు ధరించి, నాగేంద్రునిపుట్టలో పాలు పోయుదురు. మన పాతూరు శివాలయము లోను, ఎన్.ఎస్.పి. కాలని కాలువకట్ట శివాలయము లోను, వినుకొండ రోడ్డులోనున్న నాగేంద్రుని పుట్ట వద్దను ఈ కార్యక్రమములు ప్రధానముగా జరుగుచున్నవి.

**సంక్రాంతి :** సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినపుడే సంక్రాంతి. నాటి నుండి ఉత్తరాయణ పుణ్యకాలము ఆరంభ మగును. మన పట్టణములో మహాత్మాగాంధీ క్లాత్‌మార్కెట్ మరియు వివిధసంస్థలవారు స్త్రీలకు రంగవల్లుల పోటీలు జరిపి బహుమతు లిత్తురు.

**మహాశివరాత్రి :** మాఘమాస అమావాస్యకు ముందు వచ్చు చతుర్దశి మహాశివరాత్రి పర్వదినము. మన పట్టణ సమీపము లోని ప్రముఖ శైవక్షేత్రము కోటప్పకొండ. ఈ పండుగకు ముందు సుమారు వారం రోజుల నుండి ప్రభలను నిర్మించు టకు ప్రజలు సమాయత్త మగుదురు. దేవతల చిత్రాలతో, కలశాలతో, శివుని ప్రతిమ కల మందిరాలను శివుని ఆకారం లో మందిరాలను ప్రభలకు అమర్చెదరు. ఆ శివరాత్రి పర్వ దినమున పట్టణవీథు లన్నియు 'హరహర ! చేదుకో కోటయ్య!' నినాదాలతో మారుమ్రోగును.

ఇవేకాక ముక్కోటి ఏకాదశి, హోలి మొదలగు పండుగలను కూడ తగువిధముగా భక్తితో జరుపుకొను ఆచారము కలదు.

**రంజాన్ :** ముస్లిమ్‌లు ప్రధానంగా జరుపుకొను పండుగలు రంజాన్, బక్రీద్, మొహర్రం. ఇస్లాం క్యాలెండర్ ప్రకారం తొమ్మిదవ నెలనుండి ప్రారంభమగునది రంజాన్. ఈ ముప్పది దినములు తెల్లవారు 4.30 గం॥లకు భోజనము చేసి సాయంత్రము చంద్రదర్శనము వరకు ఉపవాస ముందురు. ఆ తదుపరి నమాజ్ చేసి, ఖురాన్ పఠించిన పిదప ఫలాహారము స్వీకరింతురు. ఈ ముప్పది దినములలో చివరిరోజు షవ్వాల్ నెల ప్రారంభమగును. ఆ నెలలో చంద్రదర్శనమైన మొదటిరోజే 'రంజాన్' పండుగ. దీనిని 'ఈదుల్‌ఫిత్ర్' అందురు. ఆ రోజు ముస్లింలందరు కలసి ఒకే చోట విశాలమైన మైదానములో ప్రార్థనలు చేస్తే అల్లా అనుగ్రహం లభించునని వారి విశ్వాసము. ఇట్లు చేయుటను 'ఈద్గా' అని పిలుచుదురు. ఈ రోజు నమాజుకు ముందే తాము భుజించే ఆహార పదార్థాలు – గోధుమలు, బియ్యం వగైరాలు ప్రతిఒక్కరు పేదలకు దానము చేయుదురు. అట్లు చేయనివారు పాపులని వారి నమ్మకం. ఈ దానాన్ని 'సా' అందురు.

**బక్రీద్ :** దీనినే 'ఈదుల్ అజ్హా' అని కూడా పేర్కొందురు. ఈద్ అనగా పండుగ అని అర్థము. 'ఖుర్బానీ మాంసాన్ని తినండి. లేమికి గురైన నిరుపేదలకు తినిపించండి (22:28) అలాగే యాచించని పేదలకు కూడా తినిపించండి (22:36)'

కాని వాటి మాంసముగాని రక్తంగాని అల్లాకు మాత్రము చేరవు. మీ భయ భక్తులు చేరును (22 :37). ఈ పండుగ దినమున మసీదులందు సామూహికంగా పట్టణ ముస్లింలు ప్రార్థనలు (నమాజ్) జరుపు పేదలకు గొర్రె లేక మేక మాంసాన్ని దానము చేయుదురు. బంధు మిత్రులతో కలసి ఆనందంగా, ఉత్సాహంగా మాంసాహారమును భుజించి పండుగ అనుభూతిని పొందుచున్నారు.

**మొహరం :** ముస్లిమ్‌లు జరుపుకొను ముఖ్యమైన మూడు పండుగలలో మూడవది మొహరం. ఇస్లామ్ క్యాలెండర్ ప్రకారం మొదటి నెలలో వచ్చునది మొహరం. మహమ్మద్ ప్రవక్త మక్కా నుండి మదీనాకు వెళ్లినప్పటి నుండి ఈ క్యాలెండర్ ప్రారంభమగును. మొహరంనే పీర్లపండుగ అంటారు. మొదటి నెల 10వ తేదీన ఈ పండుగను జరుపుకుంటారు.

**క్రిస్టమస్ :** 'క్రిస్టమస్' అనగా క్రీస్తును ఆరాధించుట. జీవులను పాపమార్గము నుండి తప్పించి సత్యమార్గంలో నడిపించుటకు కన్యయైన మరియ గర్భమున క్రీస్తు జన్మించిన దినమే క్రిస్టమస్. ప్రతి సంవత్సరం డిసెంబరు 25వ తేదీ ఈ పండుగను జరుపుకొందురు. మానవునిలోని అజ్ఞానమును తొలగించి వెలుగును నింపినవాడు క్రీస్తు అను సందేశానికి గుర్తుగా 24వ తేదీ చర్చిలలో, గృహాలలో 'క్యాండిల్ లైట్ సర్వీసు'గా కొవ్వొత్తులను వెలిగించెదరు.

**గుడ్‌ఫ్రైడే :** క్రైస్తవులు జరుపుకొను ముఖ్యమైన మూడు పండుగలలో మొదటిది 'క్రిస్టమస్', రెండవది గుడ్ ఫ్రైడే, మూడవది ఈస్టర్. క్రీస్తు మరణించుచు పలికిన ఏడు మాటలను తలచుకుంటు ప్రార్థించేది గుడ్‌ఫ్రైడే. ఈ పండుగకు 40 రోజులు ముందుగా ఉపవాసముండి ఈ రోజున దైవప్రార్థనలు చేతురు. మనుష్యుల పాపాలను హరించుటకు క్రీస్తు తనకు తాను మరణించి జన్మించినాడని క్రైస్తవుల విశ్వాసము.

**ఈస్టర్ :** క్రైస్తవుల విశ్వాసమునకు పునాది ఈస్టరు పండుగ. యజ్ఞపశువుగా ఆత్మబలిదానమైన యేసుక్రీస్తు మృత్యుంజయుడై తిరిగి జన్మించిన దినమే ఈస్టర్. క్రీస్తు చనిపోయిన మూడవ దినమున పునరుత్థానుడగుటను 'ఈస్టర్' పర్వదినముగా దేవుని ఆరాధించెదరు. అందరూ కలసి చర్చిలలో దైవకీర్తనల గానము, ప్రార్థనలు చేయుదురు.

మన నరసరావుపేటలో ఈ పర్వదినాలను జాతి, మత భేదాలు మరచి ఎంతో ఉత్సాహంతో హృదయాహ్లాదంగా జరుపుకొనుట ముదావహము. మిక్కిలి ఆమోదయోగ్యము.

## 'సుందర' సమయస్ఫూర్తి

అక్కిరాజు సుందరరామకృష్ణగారి రంగస్థలజీవితం మూడు పూలూ, ఆరు కాయలుగా ఖండఖండాతరాల్లో వ్యాపించిన సంగతి అందరికి తెలిసిందే! 1993-'94 ప్రాంతాల్లో మన మునిసిపల్ హైస్కూలులోని గురజాడ కళామందిరంలో చింతామణి నాటక ప్రదర్శనం జరుగుతున్నది. రామకృష్ణగారు బిల్వమంగళుడి పాత్రలో, ఇందిరగారు చింతామణి పాత్రలో నటిస్తున్నారు. చింతామణి అడిగిన ప్రశ్నలకు బిల్వమంగళుడు చక్కగా సమాధానాలు చెప్పాడు. అప్పుడు ఆమె ఎంతో సంతృప్తి చెందింది. ఆ సంతోషంలో తన మెడలోని ముత్యాల హారాన్ని బిల్వమంగళుడి మెడలో అలంకరించాలి. ఇందిరగారు ఎంత ప్రయత్నించినా ఆ దండ రావడంలేదు. ఆమె కంగారుపడుతున్నది.



అప్పుడు అక్కిరాజువారు సమయస్ఫూర్తితో 'సుందరీ నా మనస్సును నీవు దోచితివి. నీ మనస్సును నేను దోచితిని. కావున ఆ సుందర హారమును నేనే తీసికొని నా మెడలో వైచికొనియెదను' అని ఆ దండను తీసికొని తన మెడలో వేసుకొన్నారు. ఆ దండ అనంతర సన్నివేశానికి ప్రాణం! మన ఊరి నటుడు అక్కిరాజు సమయస్ఫూర్తికి సంతోషించి ప్రేక్షకులు అందరూ ఆగకుండా చప్పట్లు కొట్టారు.

# ధను: కౌశలం




## లింగంగుంట్ల సుబ్బారావు

ధనుర్విద్యా ప్రదర్శకులు


ధనుర్వేదం ఉపవేదం. అధర్వణ వేదంలో దీనికి సంబంధించిన విషయా లెన్నో ఉన్నాయి. ధనుర్విద్య పురాణ ప్రసిద్ధ మైన విద్య. ధనుర్బాణాలు మన దేవతలకు, రాక్షసులకు కూడా ఆయుధాలు. అర్జునుడు బాణాలతో నిర్మించిన నిచ్చెన మీదుగా భీమసేనుడు స్వర్గలోకానికి వెళ్లాడనీ, ఆ అర్జునుడే బాణప్రయోగంతో మత్స్యయంత్రాన్ని కొట్టాడనీ, పాతాళగంగా జలాన్ని బయటకు రప్పించి అంపశయ్యమీద ఉన్న భీష్మా చార్యులవారి దాహాన్ని తీర్చాడని మహాభారతం తెలియ జేస్తున్నది. రామాయణంలోని దశరథుడు శబ్దభేది విద్యలో నిష్ణాతుడు. శ్రీరామచంద్రుడు సప్తసాలభంజనం చేశాడు. పృథ్వీరాజు తన శత్రువును శబ్దభేదిద్వారా తుద ముట్టించాడని చరిత్ర చెబుతున్నది. ఐతే ధనుర్విద్య కాలగతిలో కనుమరు గవుతున్నది. కాగా కొందరు ఔత్సాహికులు మాత్రం ఈ విద్య చరిత్రపుటల్లో అంతం కాకుండా సాధన చేస్తున్నారు.

'కలియుగార్జున' బిరుదును పొందిన గుండవరపు అప్పారావుగారు ధనుర్విద్యా ప్రదర్శన చేసేవారు. దానిని తమ 16 సం॥ల వయస్సులో చూసిన మన ఊరి హిందీ ఉపాధ్యాయులు మిన్ని కంటి వేంక టేశ్వర్లుగారు ధనుర్విద్యా సక్తులై సాధన చేసి మూడు సంవత్స రాలలో ఈవిద్యలో రాటుతేలారు.



మిన్నికంటి వేంకటేశ్వర్లు

అయన ఈ విద్యను తమ కుమారుడైన నాగేశ్వర రావుగారికి నేర్పారు. మిన్నికంటి వేంకటేశ్వర్లుగారికి ప్రీతిపాత్రుడైన ధానుష్కుడు లింగంగుంట్ల వేంకటేశ్వరరావుగారు. వీరు మా తండ్రి.

నేను మా తండ్రిగారి వద్ద ఈ విద్యలో శిక్షణపొంది, పలుచోట్ల ప్రదర్శించి పలువురి ఆశీస్సులను పొందాను. దూరంగా సన్నని దారానికి వ్రేలాడదీసిన బంతిని బాణంతో నేలకు పడగొట్టాను. ఇది స్థిరలక్ష్య భేదనం. ఊగుతున్న దారానికి ఉన్న చలన లక్ష్యాన్ని కూడా ఛేదించాను. ఇది చరలక్ష్య భేదనం. ఇంకొక ప్రదర్శన శబ్దభేది. వేరొక వ్యక్తి శబ్దం చేస్తూ వుండగా ధ్వని ఆధారంగా లక్ష్యాన్ని ఛేదించటం ఇందులోని విశేషం. శ్రీరాముడు సప్తతాళ భంజనం చేసిన రీతిలోనే ఏడు పుల్లలను ఇసుకలో సర్పాకృతిలో గుచ్చి వాటిని ఒకే బాణంతో పడ గొట్టటం కూడా ప్రదర్శించాను. ఇది స్థిరలక్ష్య భేదనం. చేతులతో మాత్రమే కాకుండా కాలితో కూడా వింటిని ఎక్కుపెట్టి బాణప్రయోగం చేశాను. దీనిని పాద లక్ష్యభేదన మంటారు.

నేను, మా తండ్రిగారు, మిన్నికంటి వేంకటేశ్వర్లుగారు – అందరమూ శ్రీరామకృష్ణ ఓరియంటల్ కళాశాల ప్రిన్సిపాల్ లంకా లక్ష్మీనరసింహశర్మగారి ప్రోత్సాహ సహకారాలతో మన రాష్ట్రంలోని, ఇతర రాష్ట్రాలలోని పలుప్రాంతాలలో ఈ ప్రదర్శనల నసంఖ్యాకంగా ఇచ్చి వారి ప్రశంసలకు పాత్రుల మైనాము. ఈ సందర్భంగా శ్రీ శర్మగారికి నా కృతజ్ఞతాపూర్వక స్మృత్యంజలి ఘటిస్తున్నాను.

నేను ఈ విద్యను నా కుమార్తెయైన మల్లికారమ్యకు నేర్పి ఆమె చేత కూడా ప్రదర్శన లిప్పిస్తున్నాను. ఈ రంగంలో కృషి చేస్తూ నేను 2011 జనవరిలో తానావారి ఆధ్వర్యంలో జరిగిన సంక్రాంతి సంబరాలలో పాల్గొ న్నాను. మన సభాపతి డా॥ కోడెల వారి చేతుల మీదుగా ఘనసన్మా నాన్ని పొందాను. ఇదంతా గుర్వనుగ్రహం, పూర్వధానుష్కుల ఆశీఃప్రభావమే అని సవినయంగా మనవి చేస్తున్నాను.



మల్లికా రమ్య

# చేదుకో కోటయ్య!




ములకలూరి సుధాకర్

సూర్య పత్రిక సీనియర్ జర్నలిస్ట్


నరసరావుపేట మండలంలోని కోటప్పకొండ పుణ్య క్షేత్రంగానూ, పర్యాటక కేంద్రంగానూ అసాధారణరీతిలో అభి వృద్ధి చెందింది. దీనితో పుణ్యక్షేత్రానికి భక్తుల సంఖ్య రోజు రోజుకీ పెరుగుతోంది. మన ప్రభుత్వంవారు పర్యాటక కేంద్రా లుగా కొన్నింటినీ, పుణ్యక్షేత్రాలుగా మరికొన్నింటినీ అభివృద్ధి చేశారు. ఒక్క కోటప్పకొండను మాత్రమే రెండు విధాలా అభివృద్ధి చేశారు. ఇదే దీని విశిష్టత. హరహరో! చేదుకో కోటయ్య! అని భక్తి సమ్మిళిత ఆర్తితో పిలవగానే కాలకూటం లాంటి పాపాలను హరించి, ఇహపర సౌఖ్యాలను అందించే ప్రత్యక్ష దైవం శ్రీ త్రికూటేశ్వర స్వామి. ఎందరో దేవతామూర్తు లకు జ్ఞానోపదేశ కేంద్రం కోటప్పకొండ. ఏటా లక్షలాది భక్తుల నీరాజనాలు అందుకుంటూ ఇక్కడ శివరాత్రినాడు సాగే తిరునాళ్లు రాష్ట్రంలోనే ప్రసిద్ధిచెందినది. ఈ తిరునాళ్ళకు రాష్ట్ర పండుగ హోదా లభించింది. దీని కోసం మాజీ మంత్రి వర్యులు కాసు కృష్ణారెడ్డి గారు చేసిన కృషి అభినందనీయం!



కోటివేల్పుల అండ - కోటప్పకొండ

కోటప్పకొండ ఘాట్‌రోడ్డులో ఇరువైపుల 20 కిలో మీటర్ల స్థలంలో పర్యాటక కేంద్రం ఉన్నది. జింకల పార్కు, వివిధదేశాలకు చెందిన పక్షులు, వాటి కిలకిలారావాలు పర్యా టకులకు కనువిందు, వీనులవిందు చేస్తున్నాయి. బ్రహ్మ, శేష శయనంపై విష్ణుమూర్తి, సరస్వతి, లక్ష్మీపార్వతి, విఘ్నేశ్వరుడు, ధ్యానముద్రలో శివుడు, శివలింగం భారీవిగ్రహాలు, కాళింది మడుగులో బాలకృష్ణుని విగ్రహం, బోటు షికారు చూపరులను తరంగితం చేస్తాయి. పిల్లలు ఆడుకొనేందుకు చిల్డ్రన్స్‌పార్క్ ఉన్నది. కొండపై సి.సి.రోడ్లు పార్కింగ్ ప్రదేశాలు, మేధాదక్షిణా మూర్తి ఆలయం చూడాల్సిన ప్రదేశాలు.

దక్షయజ్ఞాన్ని ధ్వంసంచేసినతర్వాత శివుడు శాంతించి పన్నెండేళ్ల బాలుడుగా మారి బ్రహ్మచర్యదీక్షతో కైలాసంలో సమాధినిష్ఠలో దక్షిణామూర్తిగా ఉన్నాడు. అప్పుడు బ్రహ్మ తదితర దేవతలు దక్షిణామూర్తి వద్దకు వెళ్లి తమకు బ్రహ్మోప దేశం చేయమని కోరారు. అందుకు అంగీకరించిన దక్షిణా మూర్తి త్రికూటాద్రికి (కోటప్పకొండకు) వచ్చి వారికి బహ్మోప దేశం చేశాడు. కనకనే ఇది మహాపుణ్యక్షేత్రంగా విరాజిల్లు తోంది. ఆలయంలో నిత్యమూ అభిషేకాలు, పూజలు, హోమాలు జరుగుతున్నాయి. కార్తీకమాసంలో శివారాధన చాలావిశిష్టం. అందువలన కార్తీకమాసంలో విశేషపూజలు నిర్వహిస్తున్నారు. కోటప్పకొండకు సమీపంలోగల యల్లమంద గ్రామం నుండి బ్రహ్మశిఖరంలో వున్న త్రికోటేశ్వరునికి ఆనందవల్లి

అనే గొల్లభామ నిత్యం పాలు తీసుకొని వెళుతూ ఉండేది.ఒకా
నొక సమయంలో గర్భవతి గా వున్న ఆ గొల్లభామ 'స్వామీ!
కొండపైకి రావటానికి చాలా ఇబ్బందిగా వుంది. కనుక
క్రిందకు దిగవలసింది' అని ప్రార్థించింది. మహేశ్వరుడు
గొల్లభామతో 'వెనుకకు తిరుగకుండా వెళుతూవుండు. నేను
నీ వెనుకే వస్తుంటా'నని చెప్పాడు. గొల్లభామ క్రిందకు వస్తున్న
సమయంలో వెనుకనుండి పెద్ద పెద్ద శబ్దాలు రావడంతో
భయంతో వెనుదిరిగింది. తత్క్షణమే వెనుక నున్న శివుడు



త్రికోటేశ్వర స్వామి

లింగాకృతి ధరించాడు. గొల్లభామ శిలావిగ్రహంగా మారింది.
కోటేశ్వరుని దర్శనానికి వచ్చే భక్తులు ముందుగా గొల్లభామను
దర్శించి, ఆ తర్వాతనే శివదర్శనం చేసుకొనే సంప్రదాయ
మిక్కడ ఉన్నది. ముందు భాగవత దర్శనం, తర్వాత భగవ
ద్దర్శన మన్నమాట!!

పాత కోటేశ్వరస్వామి ఆలయం రుద్రశిఖరం పైన
ఉంది. దక్షిణామూర్తి తపం ఆచరించిన స్థలం ఇదే! ఇక్కడ
నుండి ఆర్ద్రోత్సవంనాడు జ్యోతిదర్శన మవుతుంది. పాప విమో
చనేశ్వరస్వామి ఆలయం శివరహితంగా జరిగిన దక్షయజ్ఞం
లో పాల్గొన్న దేవతలు, ఋషులు పాపవిమోచనం పొందిన
స్థలం. బొచ్చుకోటయ్యస్వామి ఆలయం కొండక్రింద ఉంది.
ఇక్కడ భక్తులు తలనీలాలు సమర్పిస్తారు. వరసిద్ధి గణపతి
ఆలయం మెట్లమార్గం మొదట వుంది. టూరిజంశాఖ వారు
అక్కడి నుండి త్వరలో రోప్ వే ఏర్పాటు చేయనున్నారు.

టి.టి.డి. వారి సౌజన్యంతో 20 కోట్ల రూపాయల
అభివృద్ధి పనులు డా॥ కోడెల శివ ప్రసాదరావుగారి ఆధ్వ
ర్యంలో చురుకుగా సాగుతున్నాయి. వేద పాఠశాల
ఇటీవల టి.టి.డి. ఛైర్మన్ చదలవాడ కృష్ణమూర్తిగారిచే
ప్రారంభించబడింది. ఈ వేదపాఠశాలకు మార్తి వేంకట
రామశర్మగారు ప్రాచార్యులుగాఉన్నారు. ఈ విధంగా కోటప్ప
కొండ మహా పుణ్యక్షేత్రమై విరాజిల్లుతున్నది. ●



కరెంట్ ప్రభలు

భయపడడమే ప్రపంచంలో ఉన్న ఏకైక పాపం. - ఉపనిషత్తులు.
మన లోపాలన్నింటిలో మనం చక్కగా సమర్థించుకునేది మన బద్ధకాన్నే. - షేక్స్పియర్.
కృతనిశ్చయానికి మరోపేరు విజయం. - నెపోలియన్.

# రాక్షస గుళ్లు



గాలి శతవర్ధనరావు
రిటైర్డ్ ప్రిన్సిపాల్

మన నరసరావుపేట పట్టణానికి అతిచేరువగా వున్న శైవపుణ్యక్షేత్రం కోటప్పకొండ. ఈ పుణ్యక్షేత్రం వెనుక ఒక గొప్ప చారిత్రక ప్రస్థానం సాగింది. దీనికి తూర్పువైపున పశ్చిమాన సుమారు 3 చదరపు కిలోమీటర్ల వరకు లభిస్తున్న పురాతత్త్వ అవశేషాలే దీనికి నిదర్శనం.

ఇక్కడి నునుపు పెట్టిన రాతిగోడల్లో క్రీ.పూ. 3,000 సంవత్సరాలకు పూర్వకాలం (నవీన శిలాయుగం) నాటి మృణ్మయపాత్రలు లభించాయి. తరువాతి కాలంలో ఇనుప యుగం (క్రీ.పూ. 1000 సం॥, క్రీ.శ.300 సంవత్సరముల కాలం నాటి జనావాసాల పునాదులు, అదే యుగంనాటి 'రాక్షసి గుళ్లు' పేరుతో పిలువబడే సమాధులు ఇప్పటికీ ఉన్నాయి.

మృతులకు జరిగే అంత్యక్రియా విధానం వలన ఒక సమాజ ప్రజల మతాచారాలు తెలుస్తాయి. ఈ కాలంలో చనిపోయిన వారిని భూమిలో స్వస్తిక్ ఆకారంలో రాతి పలకలను పేర్చి, మధ్యన శవాన్ని భద్రపరుస్తారు. వారి పరలోకయాత్రకు అవసరమయిన ఆహారపదార్థాలు, అతని ఆయుధాలు ఎరుపు నలుపు రంగుతో మెరుగు పెట్టబడిన పాత్రలో ఉంచుతారు. పై భాగాన్ని రాతిపలకతో మూసివేస్తారు. తూర్పువైపు రాతి పేటికకు అడుగు వ్యాసంలో రంధ్రాన్ని ఉంచి రాళ్లతోమూస్తారు. సమాధికి గుర్తుగా గుండ్రగా భూమి మీద పెద్ద బండరాళ్లను అమర్చి మట్టితో కప్పివేస్తారు. తల పడమరవైపుకు ఉంచడం వల్ల, దేహనిర్మాణశాస్త్ర రీత్యా పోలికలు ఉండడం వల్ల ఈ ప్రజలు మధ్యధరాప్రాంతం నుండి వలసవచ్చి ఉంటారని తెలుస్తున్నది. మృతుని శరీరాన్ని నిర్జనప్రదేశంలో పక్షులకు విడిచిపెట్టి కొన్ని దినాల తరువాత మిగిలిన అస్థికలను ఖననంచేసే పద్ధతి కూడా ఉన్నది. గ్రద్దలబోడుగా పిలువబడే కోటప్పకొండ భాగంలో ఈ అచారాన్ని నిర్వర్తించేవారు.

నిధుల వేటగాళ్లు ఈ స్మారక చిహ్నాలలో విలువైన సంపద దొరుకుతుందని విచ్చలవిడిగా త్రవ్వివేస్తున్నారు. దీని వలన ఈ రాక్షసిగుళ్లు రోజు రోజుకు కనుమరుగవుతున్నాయి. ఈ వలయాకారంలో నిర్మించబడ్డ సమాధులే తరువాత కాలం లో బౌద్ధుల స్థూపనిర్మాణానికి నమూనాలైనై. అమరావతి, భట్టిప్రోలు, నాగార్జునకొండలలోని స్థూపాలు ఈ విధంగా నిర్మించబడినవే.

కోటప్పకొండను గురించి మొదటిసారిగా చేజర్లను కేంద్రంగా చేసుకొని పాలించిన ఆనంద గోత్రరాజులు, నాలుగవ శతాబ్దపు రాజులు ప్రస్తావించారు. వీరిలో రెండోరాజు అత్తివర్మ 'త్రికూట మలయాధి పతి'గా తన శాసనాల్లో చెప్పుకున్నాడు. 'సమ్యక్ సంబుద్ధ పాదా నాధ్యాతుడు'గా చెప్పుకున్న దామోదరవర్మ శాసనాల్లో కూడా త్రికూట ప్రస్తావన ఉన్నది. వీరు వైదికమతాభిమానులే అయినా ప్రజల్లో ప్రాచుర్యం ఉన్న బౌద్ధమతాన్ని కూడా



మృణ్మయ పాత్రలు

ఆదరించారు. కోటప్పకొండ శివాలయ పునరుద్ధరణ సందర్భంలో ఇక్ష్వాకుల లిపి పోలికలున్న బ్రాహ్మీశాసనం లభించింది. ఇది ప్రస్తుతం ఆలయంలోనే భద్రపరచబడి వుంది. దీని ప్రకారం 'అన్నకుడు' అనే బౌద్ధభిక్షువు త్రికూటపర్వత ప్రాంతంలోని 'అరియబౌద్ధ' గ్రామానికి పదవసారి దానం చేస్తున్నట్లు విశదమవుతున్నది. పర్వతపాదంలో శిథిలమైన ఒక బౌద్ధచైత్యాలయం, స్థూపాన్ని కప్పిఉంచే గుండ్రని రాతి పలకలు కూడా ఇప్పటికి కనిపిస్తాయి.

తరువాత కాలంలో ఈ ప్రాంతమంతా విష్ణుకుండినుల అధీనంలోనికి వచ్చింది. రెండవ మాధవవర్మ కాలంలో బౌద్ధం స్థానంలో వైదిక సాంప్రదాయం తన ఆధిక్యాన్ని చాటుకున్నది. ప్రజల్లో బౌద్ధానికున్న గౌరవం సన్నగిల్లింది. దీని ఫలితమే కోటప్పకొండలోని శివాలయనిర్మాణం. ఈ ఆలయానికి 12వశతాబ్దంలో చందోలును రాజధానిగా పాలించిన వెలనాటి చోళరాజు రెండవ గొంకరాజు భూరివిరాళములను ప్రకటించాడు. 16వ శతాబ్దంలో దక్షిణదేశ దండయాత్రకు వచ్చిన విజయనగరరాజు శ్రీకృష్ణదేవరాయల మంత్రితిమ్మరుసు ఆలయంలో ధూపదీప నైవేద్య నిర్వహణకు కొండకావూరులో భూమిని దానంచేశాడు. ఈ శాసనం ప్రస్తుతం అచ్చయ్యపాలెం పొల్లాల్లో పడివున్నది.

కాల గర్భంలో కలసిపోగా మిగిలివున్న చారిత్రక అవశేషాలను పురాతత్వశాఖ వెలుగులోనికి తేగలిగితే కోటప్పకొండ ఇంకా మంచి పర్యాటకేంద్రంగా అభివృద్ధి చెందుతుంది. ●



## 'ప్ర' పంచకం

మనం దేవాలయాలకు వెళుతుంటాం కదా!
దీనికి సంబంధించి మనం చేయవలసిన పనులు ఐదు.
1. ప్రవేశం, 2. ప్రదక్షిణం, 3. ప్రణతి (నమస్కారం), 4. ప్రణుతి (దేవతా స్తుతి), 5. ప్రసాదం.
వీటిని 'ప్ర'పంచకం అంటారు. వీటిని భక్తి శ్రద్ధలతో పద్ధతి ననుసరించి
పాటించినట్లయితే పరమ ప్రయోజన ముంటుంది.



# 'ప్రభ'ల ప్రభలు



స్వర్ణ చినరామిరెడ్డి
అసిస్టెంట్ రిజిస్ట్రార్, కో-ఆపరేటివ్ డిపార్ట్‌మెంట్

ప్రభ అనగా వెలుగు, తేజం. ప్రభ దివ్యత్వానికి ప్రతీక. మన దేశంలో ప్రభల నిర్మాణం చాలాచోట్ల ఉన్నప్పటికి కోటప్పకొండ తిరునాళ్లకు సంబంధించి త్రికోటేశ్వరునికి నిర్మించే ప్రభకు మాత్రమే రూఢిఐంది. 'కోటి ఒక్క ప్రభలు వస్తే కోటయ్యస్వామి దిగివస్తాడు'అని ఇక్కడిభక్తుల ప్రగాఢవిశ్వాసం.

మొదట వీపుప్రభలు అనే పేరుతో మొక్కుబడి ప్రభలను కట్టేవారు. ఇవి 3,4 అడుగుల ఎత్తు ఉండేవి. స్వామికి మొక్కుకున్న భక్తులు వీటిని తమ వీపులకు కట్టుకొని కొండకు వచ్చేవారు. ఇది ఒక విధమైన శైవాచారం.

ప్రభలకు క్రింద ఆధారంగా ఉండే చెక్కమొద్దును మండిగం అంటారు. దీనిని మద్ది, లేదా బిల్లుడు, లేదా టేకు కలపలతో చేస్తారు. ఇది ఇంటికి పునాది వంటిది. దీనిమీద సాధారణంగా వెదురు బొంగులను నిలబెట్టి తడిక లాగా కడతారు. ఇవి తప్పని సరిగా 9,11,13-బేసి సంఖ్యలో ఉంటై. ప్రతి 5 అడుగులకు మధ్య ఉండే మెట్లవంటి నిర్మాణాలను పెండెగం లేదా పెండెంగా వ్యవహరిస్తారు. వీటిని వెదురు బొంగులను చీల్చి కడతారు. దీనికోసం కొబ్బరి విచ్చెలు లేదా పురికొసలను ఉపయోగిస్తారు. ప్రభ శిఖరభాగం కోణంగా ఉంటుంది. దాన్ని టెక్కెం అంటారు. అందులో శివలింగం బొమ్మ ఉంటుంది. టెక్కెం మీద ఇత్తడి లేదా రాగితో నిర్మితమైన ఛత్రం ఉంటుంది. ఈ టెక్కెం ప్రభలు ఇప్పుడు కనుమరుగైనవి.

నరసరావుపేటలో 1940 ప్రాంతంలో 60 అడుగుల ప్రభను నిర్మించారు. దానికి చంద్రి అనే భక్తురాలు 5 గోపురాలను చేయించింది. ప్రభ యొక్క తడిక వంటి దేహానికి కలంకారి డిజైన్స్‌తో చేసిన వస్త్రాన్ని కప్పేవారు. ఆ కలంకారి బొమ్మల్లో రావణవధ, త్రిపురాసుర సంహారం, భక్తకన్నప్ప, సీతారామ పట్టాభిషేకం, గంగావతరణం, సాగరమథనం, పార్వతీ కల్యాణం, శివతాండవం, నటరాజతాండవం లాంటి అందమైన బొమ్మలు ఉండేవి.

ప్రభలు క్రిందబడకుండా నిలవరించేవి పగ్గాలు. ఇవి కూడా ప్రభయొక్క ఎత్తుని బట్టి ఉంటాయి. 100 అడుగుల ఎత్తుతో కట్టిన గణపవరం ప్రభకు దాదాపు 100 పగ్గాలుండేవి. వాటిని పట్టుకొనేవారు ఒక్కొక్క దానికి ఇద్దరు తప్పనిసరి. ఈ పగ్గాలవారు ప్రభ ప్రయాణించేటప్పుడు గాలి ఒత్తిడికి తట్టుకునేవిధంగా పగ్గాలను లాగిపట్టుకొని ప్రభను నడిపిస్తారు.

నరసరావుపేట పట్టణం మరియు చుట్టుప్రక్కల గ్రామాలలో ప్రభల బండ్లను నిర్మించే పనివారున్నారు. వాటిని కార్ఖానాల్లో చేసేవారు. ప్రభబండికి మొదటిలో 6 రాతి గానులు ఉండేవి. తరువాత వాటిని 4కు తగ్గించారు. తరువాత కాలక్రమంలో రాతిగానులకు బదులు కలపచక్రాలను ప్రభబండ్లకు ఉపయోగిస్తున్నారు. వాటికి చింత ఇరుసులను వాడేవారు. 1940 ప్రాంతంలో నరసరావుపేట పట్టణంలో గల రైల్వే గేటు వద్ద పెద్ద ప్రభలు వచ్చినపుడు గేటు దాటడానికి మండిగం వెడల్పు గేటు వెడల్పును మించి ఉన్నందువలన దానిని దాటించడానికి రైల్వేవారు ఎంతో వ్యయ ప్రయాసలకు ఓర్చి పర్మిషన్స్ తీసుకొని గేటును వెడల్పు చేయించి ప్రభను గేటు దాటించారట.

ఈ రాతి గానులతో బరువైన ప్రభతో బండి నడుస్తున్నపుడు ఇరుసు దగ్గర కోత ఏర్పడి ఇరుసు విరిగే ప్రమాదం ఉంటుంది. దానిని నివారించడానికి నాలుగు చక్రాల దగ్గర నలుగురు మనుషులు గోగునారను కందెనతో తడిపి ఇరుసు దగ్గర వేస్తుంటారు. వీరిని కందెనవారు అంటారు. వీరు ప్రభయాత్ర ముగిసే వరకు వెన్నంటే ఉంటారు. వాటితో పాటు అదనంగా 4 ఇరుసులు, ఒక కాడిమాను ఉంటై. ఒక వడ్రంగి మేస్త్రి ప్రభవెంట తప్పనిసరిగా ఉంటారు. వీరితోపాటు

దివిటీలవారు, పూజారి, వాద్యాలవారు, భజంత్రీలు, కోలాటం బృందాలు, పగ్గాలవారు– అందరూ కలసి రెండు వందలకు పైగా జనంతో ప్రభయాత్ర మొదలవుతుంది.

తిరునాళ్లకు ప్రభల ఎత్తు వల్ల సమస్యలు వచ్చినందు వల్ల దానిని అధిగమించడానికి మడతప్రభ లను తయారు చేశారు. మడతప్రభను ప్రభ మధ్యభాగంలో రెండు మండిగా లను నిర్మించి వాటిని జాయింటు చేసి కావలసినపుడు ప్రభను మడిచి ఎత్తు తగ్గించుకోవడం అనేది దీని ప్రత్యేకత. మొదటిగా చందవరం గ్రామం నుండి మడతప్రభ వచ్చిందని చరిత్ర చెబుతున్నది. దానిని గొంటు నర్సిరెడ్డిగారు నిర్మించారు.

నరసరావుపేట పట్టణంలో గోగుల చిన్నహనుమయ్య, గానుగుల బజారు పిల్లకోటయ్య, కోయల సూర్యనారాయణ గార్లు ప్రభలను నిర్మించడంలో నిష్ణాతులు.

గాంధీచౌక్‌లో నిర్మించిన గాంధీప్రభ దాదాపు 70 అడుగుల ఎత్తు ఉండేది. ఈ విధంగా దాదాపు 35 ఏళ్ళపాటు ప్రభను కట్టారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో గాంధీప్రభ పైన గాంధి, పటేల్ వంటి దేశనాయకుల చిత్రాల నుంచే వారు. దీనిని జమ్ముల బాపయ్యగారు నిర్వహించేవారు.

నరసరావుపేటకు ప్రథమ పౌరుడైన చైర్మన్‌గారు తమ పట్టణప్రజల యోగక్షేమాలను స్వామివారికి విన్నవించడానికి మున్సిపాలిటీవారిచేత ప్రభను కట్టించి శివరాత్రికి 2 రోజుల ముందు అనగా ఏకాదశి రోజున కొండకు తీసుకొని వెళతారు. ఆ తర్వాతనే మిగతా ప్రభలు కొండకు వెళుతుంటాయి. 1932 నుండి ఇది ఆనవాయితీగా వస్తున్నది.

కావూరు గ్రామప్రజలు అత్యంత భక్తిశ్రద్ధలతో 1946 నుండి క్రమం తప్పకుండా ప్రభను నిర్మిస్తున్నారు. ఈ ప్రభ



ఎత్తు సుమారు 90 అడుగులు. ఇప్పుడు ప్రతిసంవత్సరం ఆ ప్రభ నిర్మాణానికి గ్రామస్థులు దాదాపు 15 లక్షల రూపాయలు ఖర్చుపెడుతుంటారు.

దాదాపు 1940 నుండి ప్రతి సంవత్సరం 15–20 వరకు విద్యుత్ ప్రభలు వస్తుంటాయి. వీటిలో ఒక్కొక్క దానికి దాదాపు 10లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. దండ మూడి, పోతవరం, మురికిపూడి గ్రామంలోని కొందరు ముస్లిం సోదరులు ఈ ప్రభల ఎలక్ట్రికల్ వర్క్‌కు, లైటింగ్‌కు, జనరేటర్స్‌కు ప్రసిద్ధి.

ప్రభ నిర్మాణానికి ముందు ఊరిలోని ప్రథమ శివాలయానికి వెళ్లి శివుని అర్చించి ఆ శివాలయ పూజారి ప్రభయాత్రకు శ్రీకారం చుడతారు. అనంతరం ఊరిలోని ప్రథమ విశ్వబ్రాహ్మణుని ఇంటికి మేళతాళాలతో వెళ్లి మోయనం సమర్పించి నారసాలను తీసుకు వచ్చి శరభ! శరభలను పఠించి ఆ నారసాలను మండిగానికి కడతారు. ఊరిలో వున్న శాలివాహనులు జొన్నలు, పెసలు కలిపి మట్టికుండలో కుంభాన్ని వండి ఆ కుంభాన్ని ప్రభ ఎదురుగా రాశి పోసి ఆ రాశి పైన ప్రమిదలో నేతి దీపాన్ని వెలిగించిన అనంతరం మేళతాళాలు, హరహర నినాదాల మధ్య ఎద్దులను అదిలించి ప్రభచక్రాన్ని కుంభరాశిపై నుండి దాటిస్తారు. త్రికోటేశ్వరునికి మంచిగుమ్మడికాయను సమర్పించడాన్ని పడిదరం అంటారు. ఉపవాస దీక్షలో ఉన్న వ్యక్తి ఆ పడిదరాన్ని తీసుకొని కొండకు వెళ్లి త్రికోటేశ్వరునికి నైవేద్యంతో పాటు దానిని సమర్పిస్తారు. భాజాలు, భజంత్రీలు, కనకతప్పెట్లు, కోలాటాలు, చెక్కభజనలతో ప్రభ నడుస్తుంది. కూచిపూడి భరతనాట్యం ఇతర నాట్య ప్రదర్శనలు, పార్వతీకల్యాణం వంటి హరికథలు, బుర్రకథలతో శివరాత్రినాడు జాగారం చేస్తారు.

ప్రభ తిరుగుయాత్రలో గ్రామంలోకి వచ్చిన తరువాత గ్రామోత్సవం నిర్వహిస్తారు. 16 రోజులపాటు భక్తి, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించి 15వ రోజున లేదా 16వ రోజున ప్రభను విప్పదీస్తారు. భక్తి, సాహిత్యం, సంగీతం, వాద్యాలు, కళారూపాలు, చేతివృత్తులవారి నైపుణ్యం, ప్రజల ఐకమత్యం– వీటన్నింటి మేలుకలయికతో 'ప్రభ కార్యక్రమం' పూర్తివుతుంది. ●

# సై సైరా! చిన్నపరెడ్డి!!



డా॥ బూదాటి వేంకటేశ్వర్లు
తెలుగు ప్రొఫెసర్

చిన్నపరెడ్డి కథ 18-2-1909న జరిగిన కోటప్ప కొండ సంఘటనతో ముడిపడి ఉంది. ఈ కథ వీరగాథగా ప్రచారంలో ఉంది. శాసన ధిక్కారం దీని ఆత్మ. చిన్నపరెడ్డి స్వేచ్ఛాప్రవృత్తి, స్వాతంత్ర్య కాంక్ష కలవాడు. బ్రిటీష్ ప్రభుత్వానికీ, దాని మానసపుత్రులకూ ఇది నచ్చలేదు. తెల్లప్రభుత్వం అదను కోసం చూసి చిన్నపరెడ్డిని చంపివేసింది. ఒక అన్యాయాన్నీ, దౌష్ట్యాన్నీ, అసమంజసమైనఅధికారాన్నీతిరస్కరించే శక్తి లేనప్పుడు, పీడితులైన పాలితులు-ప్రజలు తిరస్కరించే శక్తిగల వ్యక్తి కోసం ఎదురు చూస్తారు. చిన్నపరెడ్డి సందర్భం కూడా ఇదే! ప్రజలందరూ ఎదురు చూసిన వ్యక్తి చిన్నపరెడ్డి!!

చిన్నపరెడ్డి పూర్వులు ఇప్పటి ప్రకాశంజిల్లా నుండి రాజావాసిరెడ్డి వేంకటాద్రి నాయుడుగారి పరిపాలనలో ఉన్న చేబ్రోలు ప్రాంతానికి వలస వెళ్లారు. చిన్నపరెడ్డి గుంటూరుకు సమీపంలో ఉన్న రెడ్డిపాలెంలో పుట్టాడు. చేబ్రోలులో పెరిగాడు. లింగమ్మ, సుబ్బారెడ్డి ఇతని తల్లిదండ్రులు. సుబ్బారెడ్డికి నలుగురు కుమారులు. వారిలో నాల్గవవాడు చిన్నపరెడ్డి.

1909వ సంవత్సరం శివరాత్రి పండుగకు ముందు రోజున చిన్నపరెడ్డి ప్రభను కట్టుకొని దానికి ముందు గుర్రం మీద స్వారి చేస్తూ వెళుతున్నాడు. పత్తిపాటి గ్రామస్థులు చిన్నపరెడ్డిని అటకాయించారు. 'గుర్రాన్ని దిగి నడిచి వెళ్లమన్నారు. చిన్నపరెడ్డి వాళ్ల మాటను పెడచెవిని పెట్టి కోటప్పకొండకు వెళ్లాడు.

కోటప్పకొండలో చిన్నపరెడ్డి పందెపు టెడ్లను ప్రభకు కట్టాడు. ఎద్దులు అక్కడి మోతలకు, కొత్త వాతావరణానికి బెదిరి గందరగోళాన్ని సృష్టించినై. పోలీసులు ఎద్దుల్ని నిలిపివేయమన్నారు. లేకపోతే వాటిని చంపుతామన్నారు. ఆ ఎద్దుల్ని మామూలు స్థితికి తెచ్చుకుంటామన్నా పోలీసులు చిన్నపరెడ్డికి అవకాశం ఇవ్వలేదు. పోలీసులు చిన్నపరెడ్డిని కోటప్పకొండలోనే లొంగతీసుకోవాలని చూశారు. చిన్నపరెడ్డి 'ముందు నన్ను చంపి, తర్వాత నా ఎద్దుల్ని చంపండి!' అన్నాడు. పోలీసులు అతడ్ని బంధించ బోయారు. చిన్నపరెడ్డి తప్పించుకొని వెళ్లాడు. ఆనాటి డెప్యూటీ సూపరింటెండెంట్ ఆరణి సుబ్బారావు ఆజ్ఞప్రకారం పోలీసులు ఎద్దుల్ని కాల్చివేశారు. ప్రజలు పోలీసులపై తిరగబడ్డారు.

చిన్నపరెడ్డి పోలీసుల కెదురుతిరిగి నరసరావుపేటకు వచ్చి తహసిల్‌దారుకు జరిగిన విషయాన్ని చెప్పాడు. తహసిల్‌దారు చిన్నపరెడ్డినే తప్పుపట్టాడు. తర్వాత పోలీసులు చిన్నపరెడ్డిని అరెస్టు చేశారు. గుంటూరుకోర్టులో అప్పటి జడ్జి విశ్వనాథశాస్త్రి చిన్నపరెడ్డికి ఉరిశిక్ష విధించారు. చిన్నపరెడ్డి మద్రాసు హైకోర్టును ఆశ్రయించాడు. మద్రాసు హైకోర్టు ఆ ఉరిశిక్షను ధ్రువీకరించింది.

ఈ కేసు గుంటూరు అదనపు సెషన్స్ న్యాయస్థానంలో క్రిమినల్ కేసు నెం. 27/1909గా నమోదయింది. ఐషర్ కార్షన్ అనే న్యాయాధిపతి చిన్నపరెడ్డికి ఉరిశిక్షనూ, నలుగురికి యావజ్జీవ కారగారశిక్షనూ, 16 మందికి సాధారణ శిక్షనూ విధించాడు.

ఈ కాల్పులలో జననష్టం కూడా జరిగింది. ఆ సమయంలో స్త్రీలు కూడా ఇనుపకడ్డీలతో పోలీసుల మీద దాడి చేశారు. హెడ్ కానిస్టే బుల్‌ను, కానిస్టేబుల్ ను మంటలలో వేసి కాల్చిచంపారు. తక్కిన పోలీసువారు, మేజి స్ట్రేట్, ఉద్యోగస్థులు పారిపోయారు.'బ్రిటీష్ గవర్నమెంట్‌ను పారద్రోలాలి', 'మాకు న్యాయం చేయాలి' 'వందే మాతరం' అనే నినాదాలు మారు మ్రోగినై' అని అయ్యదేవర కాళేశ్వర

రావుగారు వ్రాశారు.

చిన్నపరెడ్డి మద్రాసు హైకోర్టుకు అప్పీల్ చేశాడు. చిన్నపరెడ్డి వాదిగా, బ్రిటీష్ చక్రవర్తి ప్రతివాదిగా నెం. 17/1910గా హైకోర్టు ఈ కేసును విచారించింది. ముద్దాయి తరపున న్యాయవాదిగా కె. స్వామినాయర్, బ్రిటీష్ ప్రభుత్వం తరఫున జె. రిఛ్మాండ్ వాదించారు. శంకర్‌నారాయణ్, మన్రో- వీరిద్దరు న్యాయాధిపతులు.

ఆనాడు ఎద్దుల్ని కాల్చిన ఆరణి సుబ్బారావు తను చేసిన పనికి పశ్చాత్తాపపడి మనశ్శాంతికోసం నరసరావుపేట రాజాగారికోటకు ఎదురుగా పులుపులవారి వీథిలో ఉన్న ఆంజనేయస్వామిగుడికి వచ్చి అక్కడి తపస్సంపన్నుడైన అధరాపురపు పురుషోత్తమాచార్యులవారి ఆదేశానుసారంగా ఒక నెలరోజుల పాటు స్వామివారిని సేవించి మనశ్శాంతిని పొందాడు.

ఆ తిరునాళ్లలో శాంతిభద్రతల పర్యవేక్షణ అధికారి ఫిరోజి కార్షన్స్బ పేరుతో ఉన్న శిలాశాసనాలు కొన్ని నరసరావుపేట మునిసిపల్ హైస్కూల్‌లోనూ, పాతూరు ఆంజనేయస్వామి గుడి ప్రక్కన ఉన్న పాఠశాలలోనూ ఉండేవి.

రాజమండ్రిలోని కేంద్రకారాగారంలో చిన్నపరెడ్డిని ఉరితీశారు. అతడిని ఏ తేదీన ఉరి తీసింది చరిత్రకు అందటం లేదు. ఈ వ్యాసరచయిత ఈ తేదీ కోసం ఎంతో ప్రయత్నం చేశాడు. కానీ ఆ తేది తెలియరాలేదు. చిన్నపరెడ్డి వీరగాథకు కోటప్పకొండ, నరసరావుపేటలు కార్యరంగాలైనై. స్వాతంత్ర్య కాంక్షకు స్ఫూర్తినిచ్చినై.

## విశ్వనాథవారి ఆదాయం

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికి నరసరావుపేటకు ఎంతో అనుబంధం ఉంది. వారు బెల్లంకొండ రాఘవరావుగారికి నాయని సుబ్బారావుగారికి, కోలవెన్ను రామకోటీశ్వరరావుగారికి ఆప్తమిత్రులు. రాఘవరావుగారు, నాయనివారు విశ్వనాథవారి 'వేయిపడగలు' నవలలో పాత్రలు కూడా. బీర్నీడి ప్రసన్న కవిగారి పృథ్వీభాగవతాన్ని కోరి అంకితం తీసుకున్నారు. నకరికల్లులో వెలసిన శివుడి మీద ఆయన శతకం వ్రాశారు- మధ్యాక్కర ఛందంలో. విశ్వనాథవారు 1953 ఫిబ్రవరి 27న నరసరావుపేట మునిసిపల్ హైస్కూలులో ఉపన్యసించారు. పారితోషికం రూ. 15/-. ఆయన పెట్టుకున్న ఖర్చు రూ. 16/- అనేది ఇందులోని విశేషం. ఇది ధనంగా వ్యయం! ఆనందంగా అవ్యయం!



## పట్టణంలో కొన్ని బజార్ల పేర్లు ఎలా వచ్చాయంటే....

ఆ నాడు కాశ్యపుడు అనే ఋషి ఓ సరస్సు (మిరము) ప్రక్కన కూర్చొని ఘోరతపస్సు చేసుకోవటంతో ఆ ప్రదేశానికి కాశ్యపుని మిరము అని పేరు వచ్చింది. కాలక్రమేణా అది కాశ్యపమిరము అయి, ఆ తరువాత కాశ్మీరము, కాశ్మీర్‌గా ప్రసిద్ధికెక్కింది. అలాగే ఫెయిర్ బరన్ అనే ఆయన 1923లో ఇక్కడ డిప్యూటీ కలెక్టరుగా పనిచేసారు. ఆయన పేరున ఫెయిర్ బరన్‌పేట వెలసింది. క్రమంగా అది బరంపేటగా మారి, ఇప్పుడు బరంపేటగా వాడుకలోకి వచ్చింది. అలానే అప్పటి జిల్లా కలెక్టరు (1893) ఎ.పి. అరండేల్ నామ ధేయంతో అరండేల్‌పేట వచ్చి, క్రమంగా అది అరండల్‌పేట ఐంది. ఏ జమీందారు, కలెక్టరు పేరో పట్టణానికో, బజారుకో రావచ్చుకానీ స్వీట్స్ అమ్ముకొనే ఒక సామాన్య వర్తకురాలు మల్లమ్మ పేరు పట్టణంలోని ఒక బిజీ సెంటర్‌కు రావటం చిత్రం కదూ! అదే మల్లమ్మ సెంటర్.

# చేరువలో - చేజర్ల



ఈవూరి వేంకటరెడ్డి
సేఫ్టీ డ్రైవింగ్ ఇన్‌స్ట్రక్టర్ (రిటైర్డ్)

శ్రీ కపోతేశ్వర దేవాలయం ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరుజిల్లా నకరికల్లు మండలం చేజర్లలో కలదు. నరసరావుపేటకు 30 కి.మీ. దూరం. ఇందు వేంచేసియున్న కపోతేశ్వరస్వామి కీర్తిచంద్రికలచే ఇది దక్షిణకాశియని ప్రసిద్ధి నొందెను. ఆలయప్రాంగణం చతుర్భుజాకారముగ నుండెను. ఈశాన్యభాగమున రెండు గజముల ఎత్తుగల దశసహస్ర లింగము గలదు. దక్షిణమున సప్తమాతృకల విగ్రహములు, 'మల్లికాగుంట' యను పుష్కరిణియు, పశ్చిమమున తటాకము గలవు. ఈ ఆలయానికి పూర్వము సప్తప్రాకారములున్నవని చెప్పుదురు. ఇపుడు రెండు మాత్రమే కలవు.

స్వామివారి గర్భాలయమునకు చుట్టును లెక్కింపనలవికాని శివలింగములు కలవు. ఈశాన్యమున మాధవస్వామి, ఆంజనేయస్వామి మంటపములు గలవు.

కపోతేశ్వరుని కోవెలలో వీరభద్రాలయము కలదు. అందు భద్రకాళీ సహిత వీరభద్రస్వామి ఉన్నారు. దశసహస్ర లింగానికి ఉత్తరమున కళ్యాణమండపము కలదు. ఇక్కడ వార్షికముగా ఫాల్గుణ శుక్లపాద్యమి నాడు స్వామివారి కళ్యాణము జరుగును. ఆ మండపము ప్రక్కగా సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయం కలదు. ఆ స్వామి 12 శిరస్సులు కలిగి ప్రతిరాత్రి 12 గం॥ నుండి తెల్లవారుజామున 3 గం॥ల వరకు కబ్బయ్యస్వామికి గొడుగు పట్టునని ప్రతీతి.

స్వామి వారి కెదురుగా నందీశ్వరమంటపము కలదు. ఆ నందీశ్వర విగ్రహము ప్రజల నాకర్షించు శిల్పచాతుర్యం కలది. స్వామివారి గర్భాలయంలో పార్వతీదేవి, భ్రమరాంబాదేవి విగ్రహములు కలవు. అమ్మవార్లకు ప్రతి శుక్రవారం కుంకుమపూజ జరుగుచున్నది. మహాశివరాత్రికి తిరునాళ్లు, సంక్రాంతి, దసరా, తొలిఏకాదశి పర్వదినాలలో ఉత్సవాలు జరుపబడును.

**పేరు లేని పెద్దమాను :** ఈ ఆలయ ప్రాంగణంలో గర్భాలయానికి దక్షిణముగ క్రీ.శ. 1915వ సంవత్సరమునకు పూర్వము ఒక గొప్ప వృక్షము కలదు. అనేక రకముల ఆకులు, పువ్వులు ఉండుటవలన ఆ వృక్షమునకు 'పేరులేని పెద్ద మాను' అని పిలుతురు. 12 సంవంత్సరముల కొకసారి ఒక కాయ కాయునని, అది పండగానే దానిని స్వామి కర్పింతురని చెప్పుదురు. ఈ వృక్షవృత్తాంతము గోష్ఠీవనమాహాత్మ్యము (పొన్నూరు స్థల పురాణము)న గలదు. ఈ వృక్షము ది. 30-12-1915 నాడు భస్మమయ్యెను. దాని స్థానంలో తుంగదుర్తి బుచ్చయ్య గారు ఒక మఱ్ఱివృక్షమును నాటగా అది మహావృక్షమై 2000 సం॥లో దగ్ధమైనది. అది కాలుచున్నప్పుడు నేతివాసనలు నల్గడల వ్యాపించినవి. ఆ దృశ్యమును ప్రజలు తండోపతండములుగా వచ్చి తిలకించిరి. ఆ స్థలములో ఒక మఱ్ఱి మొక్కను నాటగా అది దినదినాభివృద్ధి చెందుతున్నది.

**కుమారస్వామి దేవాలయం :** కపోతేశ్వరుని కోవెలకు ఉత్తరమున పెద్ద కొండ కలదు. ఆ కొండ యందు అనేక నిధినిక్షేపాలు గలవని ప్రసిద్ధి. అందుచే ఆ కొండను 'సంజీవికొండ' అని పిలుతురు. కొండకు తూర్పుగా మధ్యభాగంలో ఒక శిలాఫలకంపై 'హిరణ్య బాహవే తుభ్యం, సేనానాం పతయే నమః' అనే శ్లోకం చెక్కబడి ఉన్నది. అది చదువుచు కొండ చుట్టూ ప్రదక్షిణ చేసిన యెడల సకలపాపములు, రోగములు పోవును.

**మేఘాల మల్లేశ్వరస్వామి :** కుమారస్వామి కొండకు పడమరగా 3 కి.మీ. దూరంలో కొండమీద ఈ ఆలయం కలదు. ఆ కొండ యందు అనేక గుహలు కలవు. వాటిల్లో ఋషులు తప మాచరించుచుందురు. అందొక గుహ గుత్తికొండ బిలంలోనికి, రెండవ గుహ శ్రీశైలంలోనికి వెళ్లును.

ఈ ప్రాంతంలో వర్షాలు లేనప్పుడు ఇచటి ప్రజలు



కపోతేశ్వర ఆలయం



హస్తిపృష్ఠ విమానం

మల్లేశ్వరస్వామి కొండకు పోయి నవధాన్యములతో పులగము, పొంగలి, పాయసం తయారుజేసి ప్రసాదముగా స్వీకరింతురు. అప్పుడు మేఘములు ప్రాంతానికివచ్చి వర్షించును. కనుకనే ఆ దేవునకు 'మేఘాల మల్లయ్య' అను పేరు వచ్చినది. ఆ కొండయందు జీమూతవాహనుని గుహ, సూరయ్యగారను అవధూత మఠమును గలవు.

**తుంగదుర్తి బుచ్చయ్యగారు :** వీరు మేఘాల మల్లేశ్వరస్వామి కొండకు సమీపాన భూమిని దున్నుచు దాహమై ఆ కొండ గుహలోనికి పోగా నచట ఋషిదర్శన మయ్యెను. వారిని చూడగానే సాష్టాంగప్రణామ మాచరించిరి. ఋషికి బుచ్చయ్యపై అనుగ్రహము కలిగి నాలుకపై బీజాక్షరములు దర్భతో వ్రాసిరి. మధుమతి విద్యామంత్ర ముపదేశించిరి. నాటినుండి బుచ్చయ్య మహాత్ముడై అనేక మహిమలను ప్రదర్శించెను. కపోతేశ్వరాష్టకము, మరికొన్ని కీర్తనలు వ్రాసిరి.

వీరి కొక పరి జ్వరము రాగా తన చేతికఱ్ఱను బావి యొడ్డున గ్రుచ్చి తన జ్వరమును దాని కావహింపజేసి స్నానానంతరం తిరిగి తనకు వచ్చులాగున చేసిరి. దీనిని చూసిన ప్రజలు 'అసలు జ్వరం రాకుండా చేసుకోకూడదా? స్వామీ!' యని అడుగగా 'ప్రారబ్ధం అనుభవింపక తప్ప'దనేవారు. వీరు కాశీ, రామేశ్వరం, శ్రీశైలం, గుత్తికొండ మొదలగు ప్రదేశాలలో ఒకే పర్యాయం కనబడేవారు. వారి శిష్యులు ప్రతి సంవత్సరము కపోతేశ్వరాలయంలో బుచ్చయ్యగారికి ఆరాధన చేసి స్మరించుకొందురు.

చేజర్లకు 'చేరుంజర్ల' అను నామము పురాతన ప్రసిద్ధము. ఇచట క్రీ.శ. 1165, 1140, 1247 సం॥ల నాటి శాసనాలలో కపోతేశ్వరుడు 4,444 లింగములచే పరివృతుడై యుండెనని తెలుపబడెను. తుంగదుర్తి బుచ్చయ్యగారి శాసనాన్ని బట్టి ఈ పరిసరాలలో కోటొక్కలింగం, 101 బావి, ఆరు చెరువులు, మూడు కుంటలు వున్నవి. గుడి ఆవరణలో పెద్ద కోనేరు కలదు. దీని మెట్లనుండి గుత్తికొండబిలం లోనికి ఆ మార్గంలోని మహాలక్ష్మి కోనేరులోనికి మార్గము కలదు.

**హస్తిపృష్ఠ విమానము :** శాస్త్రములలో నిర్వచించిన హస్తిపృష్ఠ విమానము భారతవర్షంలో రెండు దేవాలయములకే ఉన్నది. చేజర్ల లోనిది ఒకటి. రెండవది షోలాపూర్ సమీపంలోని 'టెరి' అనేగ్రామంలో ఉన్నది. ఈ ఆలయం తొలుత బౌద్ధ చైత్యగృహమనియు, తర్వాత శివాలయంగా మారినదనియు తెలియుచున్నది.

ఈ ఆలయానికి శ్రీకృష్ణదేవరాయలు 263 ఎకరములు దానం ఇచ్చారు. ఇలా ఎంతో ప్రాముఖ్యత సంతరించుకొని ప్రాచీన కళాసంపత్తికి అద్దంపట్టే విధంగా శతాబ్దాల చరిత్ర గల్గిన కపోతేశ్వరాలయాన్ని కాపాడి జీర్ణోద్ధరణ కార్యక్రమం చేపట్టాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది. ●

అదృష్టవంతుడికి జాగ్రత్త తోడయితే ఎడారిని కూడ స్వర్గతుల్యం చేసుకుంటాడు.
-స్వామి వివేకానంద

# వివిధ కోణాలలో త్రికూటాచల దర్శనం




దోనెపూడి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

డిప్యూటి రిజిస్ట్రార్, ఇగ్నో, న్యూ ఢిల్లీ


మన కోటప్పకొండ గిరిప్రదక్షిణం పుణ్యప్రదం; ప్రకృతి సౌందర్య సందర్శన మహానందదాయకం.

చిన్మయారణ్య ఆశ్రమం దగ్గరలోని వంతెన సమీపం నుండి చూచినా, రెండు కొండల మధ్యనుండి కుడివైపు చూచినా, అంటే మిట్ట మీద నుండి చూచినా, కొండ వెనుకవైపు మలుపు తిరిగే ముందు కుడివైపు నుండి చూచినా మన కోటప్పకొండ ఏకలింగాకారంగా కన్పిస్తుంది. వర్షం కురుస్తున్నప్పుడు రుద్రశిఖరం ఉరుములు మెరుపుల మధ్య నమక చమకాలతో దేవతలు మహారుద్రాభిషేకం చేస్తున్నట్లు కన్పిస్తుంది. మహాశివరాత్రి నాడు దేదీప్యమానమైన దీపాలతో కూడిన కోటప్పకొండ జ్యోతి ర్లింగంగా కన్నుల పండుగ చేస్తుంది. కాలువ దగ్గరి చాకలి బండల వద్ద నిలబడి ఓంకారం ఆలపిస్తే అది బాగా ప్రతి ధ్వనిస్తుంది.

కోటప్పకొండ జిల్లాపరిషత్ హైస్కూల్ ఎదురుగా నిలబడి చూచినా, కొత్త వినాయకుడికీ మిట్టకూ మధ్యలో ఉండి చూచినా, కొండవెనుక ఉన్న హనుమంతుడి లొద్దెకు కొంచెం దూరంలో ఉండి చూచినా (లొంపిలో నుండి చూచినా) కాలువకు 150 గజాలు వెనుక ఉన్న గుట్ట మీద నుండి చూచినా త్రికూటాలు కనిపిస్తాయి. పెట్లూరివారిపాలెం రోడ్డు దిగి కొండవైపు, తోట వైపు 100 అడుగులు వేసి చూస్తే పొయ్యి రాళ్లలా మూడు శిఖరాలు కన్పిస్తాయి. వెనుకవైపు వంపు తిరిగి రెండు వందల అడుగులు నడిస్తే వంపుగా పేర్చిన నాలుగు పోస్టుకార్డుల ఆకారంలో కన్పిస్తాయి.

పాలపాడు రోడ్డు కాలువగట్టు మీదగా చూస్తే పంచ శిఖరాలు కన్పించి పంచముఖ పరబ్రహ్మ భావన కలిగిస్తాయి.

శివుడు అష్టమూర్తి. పంచభూతాలు, సూర్యచంద్రులూ, యజమానుడు- ఈ ఎనిమిదీ ఆయన రూపాలు. కొండ మెట్ల ఎదురు రోడ్డు మీద నుండి చూస్తే అష్టశిఖరాలతో అష్టమూర్తిగా కోటప్పకొండ కన్పిస్తుంది.

పాలపాడు రోడ్డున నడుస్తూ నరసరావుపేట బయటకు వచ్చి చూస్తే కోటప్పకొండ మహాకూర్మం (పెద్ద తాబేలు) లాగా, విశ్రాంతి తీసుకుంటూ పడుకున్న గర్భవతిలాగా దర్శనమిస్తుంది. దాని ఉపరిభాగం శివధనుస్సులా రమణీయంగా ఉంటుంది.

ఈ విధంగా ఎన్ని ముఖాలుగా కన్పిస్తున్నా మన కోటప్పకొండ గిరిరూపధరుడైన మేధాదక్షిణామూర్తి. 'యద్భావం తద్భవతి' అన్నట్లుగా భక్తులు ఏ పవిత్ర భావనతో చూస్తే కోటప్పకొండ ఆ రూపంలో కనిపిస్తుంది. ఈ గిరి ప్రదక్షిణం భక్తిజ్ఞానప్రదం. ధారణాశక్తి దాయకం. బ్రహ్మానంద సంధాయకం!



నరసరావుపేట నుండి కోటప్పకొండ దృశ్యం

# కనుమరుగైన కాలసూచికలు




## మల్లిపెద్ది సాంబశివరావు

శ్రీనివాస నగర్ వ్యవస్థాపకులు


కాలం లాంటిది కాలమే! వేరేది ఏదీ లేదు. అన్ని జీవులూ కాలానుకూలంగా సంచరించవలసిందే! మన ప్రాచీనులు కాలమానాన్ని చక్కగా రూపొందించారు. సంవత్సరం, మాసం, పక్షం, వారం, రోజు, పగలు, రాత్రి, గంటలు, నిమిషాలు, సెకనులు- ఇలా మనం కాలాన్ని కొలుస్తున్నాం!

ఈ సమయం ధనం! ఇంకా ఆలోచిస్తే ధనం కన్నా విలువైనది. పూర్వం మన పెద్దలు ఆకాశంలో గొరకొయ్య నక్షత్రాలను చూచి సమయాన్ని తెలుసుకొని నిద్రలేచేవారు. సమయం తెలుసుకోవడానికి కోడికూత ఒక సాధనంగా ఉండేది! "సమయం అమూల్యమైనది. ఒక్క నిమిషం వృథాగా పోయినా తిరిగిరాదు. నిద్రమత్తును వదలండి! మీ దైనందిన కార్యక్రమాలను చూచుకోండి!"- అని కోడి మెడఎత్తి ఎలుగెత్తి చాటుతుంది. పూర్వం మన నరసరావుపేట పట్టణంలో కూడా కోడికూతలు మనోహరంగా వినిపించి ప్రజలను నిద్రలేపేవి.

రాజుల కాలంలో, జమీందార్ల కాలంలో కాలాన్ని తెలియజేయడానికి నగారాలు మ్రోగేవి. "ఆఱు వేళల మ్రోయ నగు నగారా మ్రోతలు" వినబడేవి. వెనుకటి రోజులలో మన రాజాగారి కోటలో కూడా ఇటువంటి నగారా మ్రోతలు చెవుల పండువుగా ఉండేవి. సమయాన్ని తెలియజేసేవి.

1960 ప్రాంతంలో మన తాలూకా ఆఫీస్‌లో పంచలోహ గంట మీద చెక్కపిడితో ప్రతి గంటకు ఎన్ని గంటల సమయమో అన్ని దెబ్బలు కొట్టేవారు.

ఆ తరువాత సమాజంలోని కొందరు పెద్దలు కూడా ప్రజాశ్రేయస్సును ఆకాంక్షించి గంటలు కొట్టేవారు. ఈ వేళా ఘంటికలు జనుల్ని కర్తవ్యపరాయణులుగా చేసేవి. మన నరసరావుపేటలోని పేటల్లోనూ, వీథుల్లోనూ సమయం ఎన్ని గంటలైతే అన్ని గంటలు (దెబ్బలు) కొడుతుండేవారు.

మన పట్టణం విస్తరించే కొద్ది ఆధునిక జీవనరేఖలు పరివ్యాప్త మయ్యేకొద్ది సైరనులు వచ్చాయి. మన నరసరావుపేట పురపాలకసంఘం ఒక సైరనును, నాగార్జునసాగర్ ప్రాజెక్టు (ఎన్.ఎస్.పి.) కాలనీ కార్యాలయ వర్క్‌షాపు ఒక సైరనును ఏర్పాటు చేశాయి. ఈ సైరను మ్రోతలు ఉద్యోగులతోపాటు పౌరులందరకూ సమయనిర్దేశం చేసేవి.

గాంధీమహాత్ముని వర్ధంతి మొదలైన సందర్భాలలో పురపాలకసంఘం వారి సైరను మ్రోగేది. అప్పుడు ప్రజలందరూ మౌనం పాటించి జాతిపితకు నివాళు లర్పించేవారు. ఇప్పుడు ఆ సైరనులు మూగవోయాయి.

ఆ తరువాత 1974 ప్రాంతంలో మన పట్టణంలో 'గడియార స్తంభం' ఏర్పాటుయింది. పనుల మీద ఆ ప్రాంతానికి వచ్చిన పట్టణ పౌరులకు, ఇతర ప్రదేశాల వారికి అది ఎంతోగానో ఉపయోగపడింది. అది నేడు కనుమరుగైంది.

ప్రస్తుతం మన పురపాలకసంఘ కార్యాలయం ఎదురుగా గాంధీవిగ్రహం దగ్గర డిజిటల్ గడియారాన్ని ఏర్పాటు చేశారు. ఇది ప్రశంసార్హం. ఎంతగా మన దగ్గర వాచీలు, సెల్ ఫోన్‌లు ఉన్నా పై కాలసూచికల అవసరం కూడా ఎంతో ఉంది. ●

## పట్టణానికే వన్నెతెచ్చిన విద్యార్థిని హిమజ



నరసరావుపేట, శ్రీనివాసనగర్‌కు చెందిన మందలపు హిమజ 2011 మెడికల్ ఎంసెట్‌లో ఉమ్మడి రాష్ట్రంలో మొదటి ర్యాంక్ సాధించి మనకు గర్వకారణమైంది. ఆమె 159 మార్కులకు 158 మార్కులు సాధించింది. అన్ని మార్కులు రావడం అప్పటికి, ఇప్పటికి ఒక రికార్డు! హిమజ ఇంకా మరెన్నో విజయాలను సాధించాలని కోరుకుందాం! ●

# లాల్‌బహదూర్ కూరగాయల మార్కెట్ వర్తక సంఘం



షేక్ ఆదంషఫీ
(ప్రెసిడెంట్)



నిమ్మిశెట్టి శ్రీనివాసరావు



చింతా వెంకటేశ్వర్లు



నాగం ఆంజనేయులు



కోపూరి నరసింహారావు



కుంకం హనుమంతరావు



వంకాయలపాటి రాము



మురారి సంజీవరావు



చింతా మాధవరావు

# లాల్‌బహదూర్ కూరగాయల మార్కెట్ వర్తక సంఘం



మారిశెట్టి గోపాల్



సానా వెంకట కోటేశ్వరరావు



శివలింగం సుబ్బారావు



శివలింగం రాఘవరావు



తోట సుబ్బరామయ్య



పిన్నంశెట్టి సుధాకర్



తోట సురేష్



తిరుమలశెట్టి వెంకటేష్



రామిశెట్టి సత్యం



షేక్ జాని



నాగిశెట్టి ఆదినారాయణ



శేషం పేరయ్య (శివ)

# పరివ్రాజకవర్యులు



**డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి**
రిటైర్డ్ తెలుగు లెక్చరర్

కొంతమంది మహాత్ములు జన్మించటంవలన వారి వంశం పవిత్రమవుతుంది. తల్లి కృతార్థురాలవుతుంది. వారు జన్మించిన ఊరు పుణ్యవతి అవుతుంది. అటువంటి కొంతమంది పరివ్రాజకులు పుట్టి, పెరగటం వలన మన నరసరావుపేట పట్టణ ప్రఖ్యాతి కూడా సమస్త ప్రపంచ పరివ్యాప్తమైంది. అటువంటి పరివ్రాజకవర్యులను గురించి భక్తిపురస్సరంగా ప్రస్తావించు కొందాం!

## శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ మహాస్వామి

అద్వైతవేదాంతకేసరి జగద్గురువు ఆదిశంకరాచార్యుల వారు మన భారతదేశానికి నాలుగు దిక్కులలో నాలుగు పీఠాలను స్థాపించారు. దక్షిణ దిక్కున శృంగేరిలో ఉన్నది శారదా పీఠం. దానికి మొట్టమొదటి అధిపతి సురేశ్వరాచార్యులవారు. కాగా 36వ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ భారతీతీర్థమహాస్వామి వారు. శ్రీభారతీతీర్థులవారి పూర్వాశ్రమ నామధేయం తంగిరాల సీతారామాంజనేయులుగారు.



శ్రీసీతారామాంజనేయులుగారు శ్రీ ఖర నామ సంవత్సర చైత్ర శుక్ల షష్ఠి బుధ వారం నాడు (11-04- 1951) గుంటూరు జిల్లా, పల్నాడు తాలూకా, నాగులేరు తీరంలో ఉన్న అలుగు మల్లెపాడు గ్రామంలో జన్మించారు. వీరి తల్లి శ్రీమతి అనంతలక్ష్మమ్మగారు. తండ్రి బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటేశ్వరావధానిగారు. వీరు వెలనాటి వైదిక బ్రాహ్మణులు. కుత్సస గోత్రికులు. ఆపస్తంబ సూత్రులు. కృష్ణయజుశ్శాఖీయులు. శ్రీఅవధానిగారు వేదపండితులు; పురోహితులు; స్మార్త అధ్యాపకులు.

సీతారామాంజనేయులు గారు జన్మించిన వెంటనే అవధాని గారు తమ నివాసాన్ని మచిలీపట్టణానికి, అక్కడి నుండి నరసరావుపేటకు మార్చారు. రామిరెడ్డిపేటలోని పాత చౌడేశ్వరీ దేవాలయానికి తూర్పుగా ఉన్న ఇంట్లో స్థిరనివాస మేర్పరచుకొన్నారు. అప్పటికి సీతారామాంజనేయులుగారి వయస్సు ఒక సంవత్సరానికి లోపు.

సీతారామాంజనేయులుగారికి గర్భాష్టమంలో-7వ యేట ఉపనయనసంస్కారం జరిగింది. వారు ఒక వంక తండ్రిగారి వద్ద వేదపాఠం చెప్పుకొంటూనే మరొక వంక గురుకుల సంప్రదాయ ఆదర్శాధ్యాపకాగ్రేసరులైన బ్రహ్మశ్రీ ప్రతాపగిరి శివరామశాస్త్రిగారి వద్ద సంస్కృత భాషాధ్యయనం ప్రారంభించి అచిరకాలంలోనే ఆ భాషాంభోనిధిని ఆపోశన బట్టారు. గీర్వాణవాణీ నైపుణ్యాన్ని సాధించారు. ముద్దులొలికే విధమైన శ్లోకరచనాకౌశలాన్ని గడించారు. సంభాషణా చాతుర్యాన్ని అలవరచుకొన్నారు. గుంటూరుజిల్లా వేదసభవారు ప్రతిసంవత్సరమూ నిర్వహించే వేదపరీక్షలలో అగ్రశ్రేణిలో ఉత్తీర్ణులైనారు. ఉపనయన వివాహాది స్మార్తసంస్కార నిర్వహణానికి సంబంధించిన పౌరోహిత్యంలో అనితరసాధ్యమైన

అగ్రగణ్యత్వాన్ని సొంతం చేసుకొన్నారు. సీతారామాంజ నేయులు గారు ప్రాథమిక విద్యాభ్యాసాన్ని పూర్తి చేసుకొని 1960 జూన్ నెల ప్రాంతంలో మన నరసరావుపేటలోని మునిసిపల్ హైస్కూల్‌లో ఫస్ట్ ఫారం, ఏ సెక్షన్‌లో (ఇప్పుడు మనం దీనిని 6వ తరగతి అంటున్నాం) చేరారు. ఆత్మీయ పాఠకులారా! నేను కూడా అదే సంవత్సరం, ఆ సెక్షన్‌లోనే చేరి, వారికి వెనుక బెంచీలో కూర్చొనేవాడిని. ఆ మధురాను భూతితోనే నేను ఈ విషయాన్ని వ్రాస్తున్నాను.

వపనం చేయబడిన తల, బ్రహ్మజ్ఞానానికి నిలయ మైన శిఖ, ముఖాన విభూతి, గంధం మీద కుంకుమబొట్టు, చెవులకు పోగులు, చేతులకు విభూతి రేఖలు, ఖద్దరు చొక్కా నిక్కరు. కాళ్లకు చెప్పులుండేవి కావు. ఈ విధంగానే సీతా రామాంజనేయులుగారు క్లాసులకు వచ్చేవారు. అన్ని సబ్జక్టుల లోనూ, అన్ని పరీక్షలలోనూ అగ్రగణ్యులుగానే ఉంటూ వుండేవారు.

1961వ సంవత్సరంలో శృంగేరి శారదాపీఠానికి 35వ అధిపతియైన శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థమహాస్వామి వారు అద్వైత విజయయాత్రను చేస్తూ విజయవాడకు వచ్చారు. నరసరావుపేట, రామిరెడ్డిపేటలో నివసిస్తున్న మంత్రశాస్త్ర వేత్తలు బ్రహ్మశ్రీ కవితా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు శ్రీసీతా రామాంజనేయులుగారిని మహాస్వామివారి సన్నిధానానికి తీసుకొనివెళ్లి, వారికి పరిచయం చేశారు. సీతారామాంజ నేయులుగారు వారితో సంస్కృతంలో సంభాషించారు. మహా సన్నిధానంవారు వారి భాషాపటిమకు ఆకృష్టులైనారు. సీతా రామాంజనేయులుగారికి వారి వద్ద శాస్త్రాధ్యయనం చేస్తే బాగుండుననే కోరిక కలిగింది.

1966వ సంవత్సరం ఫిబ్రవరిలో సీతారామాంజ నేయులుగారు సిక్స్‌ఫారం చివరికి (అంతకు ముందు రోజులలో దీనిని ఎస్.ఎస్.ఎల్.సి.అనేవారు. ఇప్పుడు మనం జూనియర్ ఇంటర్మీడియేట్ అంటున్నాం.) వచ్చారు. అభినవ విద్యాతీర్థ శ్రీచరణులు ఆ సంవత్సరం ఉజ్జయినిలో చాతుర్మాస్య దీక్షను చేపట్టబోతూ ఉన్నారు. ఈ విషయాన్ని తెలుసుకొన్న సీతారామాంజనేయులుగారు హైస్కూల్ చదువుకు స్వస్తి చెప్పి ఉజ్జయినికి వెళ్లారు. సిప్రానదీతీరంలో అభినవవిద్యాతీర్థ జగద్గురువుల సన్నిధికి వెళ్లి, పాదప్రణామం చేసి తమ మనో రథాన్ని వారికి విన్నవించుకొన్నారు. త్రికాలవేదులైన అభినవ విద్యాతీర్థులు సంప్రీత మనస్కులై వారిని శిష్యుడుగా స్వీకరించి ఆ మరునాడే తర్కసంగ్రహ పాఠప్రవచనం ప్రారంభించారు. విద్యార్థిగా ఉన్న రోజులలోనే సీతారామాంజనేయులుగారు గురునిర్వహణంలో జరుగుతున్న అనేక విద్వత్సభలలో పాల్గొంటూ, పండితప్రకాండుల ప్రశంసలనూ, ఆచార్యవర్యుల ఆశీస్సులనూ అందుకొంటూ ఉండేవారు. శారదాపీఠానికి సంబంధించిన సద్విద్యా సంజీవనీ సంస్కృత పాఠశాలలోని విద్యార్థులకు సంస్కృత పాఠప్రవచనం చేస్తుండేవారు.

అభినవవిద్యాతీర్థుల ఆశీస్సులతో బ్రహ్మశ్రీ గొల్ల పూడి గోపాలకృష్ణశాస్త్రిగారు సీతారామాంజనేయులుగారికి న్యాయశాస్త్ర మూలగ్రంథమైన 'తత్త్వచింతామణి'ని దీధితి వ్యాఖ్యాసమేతంగా పాఠంచెప్పారు. ఆ తర్వాత సీతారామాంజ నేయులుగారు స్వకీయవేదమైన కృష్ణయజుర్వేదాన్ని అధ్య యనం చేశారు.

1974వ సంవత్సరం అక్టోబరునెలలో శరన్నవ రాత్రులు జరుగుతున్న సందర్భంలో శ్రీఅభినవ విద్యాతీర్థులు శ్రీతంగిరాల వేంకటేశ్వరావధానిగారితో 'శారదాదేవి ఆజ్ఞానుసారం మీ కుమారుడికి తురీయాశ్రమాన్ని అనుగ్ర హించి, ఈ శారదాపీఠానికి ఉత్తరాధికారిని చేస్తాం!' అన్నారు. శ్రీఅవధానిగారు జగద్గురువాక్యాన్ని వేదవాక్యంగా శిరసా వహించి అంగీకరించారు. శ్రీఆనంద నామ సంవత్సరం ఆశ్వ యుజ బహుళ ౧౧ (11-11-74) సోమవారంనాడు శ్రీ అభినవవిద్యాతీర్థులు శ్రీసీతారామాంజనేయశాస్త్రిగారికి సన్యాసాశ్రమాన్ని అనుగ్రహించి, ప్రణవోపదేశం, మహా వాక్యోపదేశం చేసి, వారికి 'భారతీతీర్థ' అని యోగపట్టనామ కరణం చేశారు. ఆ సందర్భంలో శ్రీఅభినవ విద్యాతీర్థులు భక్తజనావళిని ఉద్దేశించి 'అఖిల భువనాచార్యవర్యులైన ఆది శంకరులవారు మఠామ్నాయంలో అస్మత్పీఠే సమారూఢః...' అంటూ ఈ శృంగేరి పీఠాధిపతికి ఏయే లక్షణాలున్నైతే ఉండా లని నిర్దేశించారో, ఉంటాయని ఆశించారో, ఆ యా

లక్షణాలన్నీ పరిపూర్ణంగా ఉన్న మహాత్ములు ఈ స్వాములు. వారి ఆశీర్బలం వలన అద్వైతానుయాయులైన మీకందరికీ చక్కని మార్గదర్శనం చేయటానికి సర్వవిధాలా సమర్థుడైన సద్గురువరుణ్ని మీ కిచ్చాను. వీరి ఆధ్వర్యవంలో మన సంప్రదాయ జ్యోతి దేదీప్యమానంగా వెలిగి, మన సనాతన సంప్రదాయ జగత్తు సుప్రకాశవంత మౌతుంది' అన్నారు.

ఈ గురుశిష్యులలోని ప్రత్యేకత ఏమిటీ అంటే - వీ రిద్దరూ రెండు శరీరాలో ఉన్న ఒకే ఆత్మ. ఏ విషయంలో నైనా, ఏ సమయంలో నైనా వీరిద్దరి ఆలోచన, మాట, నిర్ణయం, సలహా- ఒకేవిధంగా ఉంటై. 1983 దాకా అభినవవిద్యాతీర్థులతో కలసి విజయయాత్రలలో పాల్గొన్న శ్రీభారతీతీర్థ సన్నిధానంవారు మహాసన్నిధానంవారి ఆదేశాను సారం 1983 నుండి స్వతంత్రంగా విజయ యాత్రలను నిర్వహిస్తుండేవారు.

శుక్ల నామ సంవత్సర భాద్రపద బహుళ సప్తమి గురువారం (ది. 21-9-1989) నాడు శ్రీఅభినవ విద్యాతీర్థ మహాస్వామివారు తమ పాంచభౌతిక శరీరాన్ని వదిలి ఆద్యంత రహితమూ, అద్వితీయమూ ఐన సచ్చిదానంద బ్రహ్మంలో లీనమైనారు.

శుక్ల నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ పంచమి గురువారం నాడు మన భారతీతీర్థ సన్నిధానంవారు (ది.19-10-1989) దక్షిణామ్నాయ శృంగేరి శారదాపీఠానికి 36వ అధిపతిగా అభిషిక్తులైనారు. మహాసన్నిధానం, మహాస్వామి పదవిరాజితులైనారు.

శ్రీశ్రీశ్రీ భారతీతీర్థులు బహుభాషా కోవిదులు. తెలుగు, సంస్కృతం, కన్నడం, తమిళం, మళయాళం, హిందీ- ఏ భాషలో అనుగ్రహ భాషణం చేసినప్పటికీ 'వీరి మాతృభాష ఇదే ఐవుంటుంది!' అని అందరూ అనుకొనే విధంగా చక్క గా ప్రవచనం చేయటంలో సమర్థులు వీరు. శ్రీమహా స్వామివారు పూర్వాశ్రమంలో తమకు బావగారైన బ్రహ్మశ్రీ చింతలపాటి వీరనీలకంఠ కుటుంబరామశాస్త్రిగారికి వ్రాసిన ఉభయకుశలోపరి జాబులు సైతం శ్లోకరూపంలోనే రసవత్కవితాభరితంగా ఉండేవి.

శ్రీభారతీతీర్థ మహాస్వామివారు పీఠాధిపతులైన నాటినుండి సురేశ్వరాచార్యులవారి నుండి తమదాకా వార సత్వంగా వచ్చిన మతసంప్రదాయాల నన్నింటినీ నిర్దుష్టం గానూ, త్రికరణశుద్ధిగానూ పాటిస్తూనే ఉన్నారు. ప్రతి సంవ త్సరమూ వినాయకచతుర్థి సందర్భంగా వాక్యార్థ సభలు, శాస్త్రార్థ చర్చలు, వేదపండిత సన్మానాలు, గురు, పరమగురు, పరమేష్ఠిగురు వర్ధంతులనూ, శారదాచంద్ర మౌళీశ్వరాది దేవతార్చనలనూ, యథాశాస్త్రీయంగా జరుపు తున్నారు. వేద సంస్కృత పాఠశాలా నిర్వహణం, అద్వైత సిద్ధాంత ప్రచారం, సనాతన ధర్మసంరక్షణం, ఆస్తిక జనగణ మార్గదర్శనం చేస్తు న్నారు. సమాజశ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని సామాజిక సేవాకార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

శ్రీభారతీతీర్థులు మన్మథ నామసంవత్సరం ది. 23-1-2015 శుక్రవారం విద్యావినయ సంపన్నులు, వేదాంత తత్త్వజ్ఞులైన శ్రీశ్రీశ్రీ విధుశేఖరభారతీస్వామివారిని శృంగేరి శంకర మఠానికి ఉత్తరాధికారిగా ప్రకటించి, పట్టాభిషిక్తులను చేసి, వారికి మార్గదర్శకత్వం చేస్తూ, శారదా చంద్రమౌళీశ్వరు లను సేవిస్తూ, అద్వైత సంప్రదాయ ప్రచారం కావిస్తూ, భక్త జనులను అనుగ్రహిస్తున్నారు. 'భారతీతీర్థ మాశ్రయే'.

## శ్రీ చిదానంద భారతీస్వామి

కృష్ణాజిల్లా, గన్నవరానికి సమీపంలో ఉన్న కేసరపల్లి గ్రామంలో నెలకొన్న భువనేశ్వరీ పీఠానికి 3వ అధిపతులైన శ్రీశ్రీశ్రీ చిదానందభారతీస్వామివారు మన నరసరావుపేట పండిత ప్రముఖులు కావటం మన పట్టణానికి గర్వ కారణం! శ్రీచిదానంద భారతీ స్వామివారి పూర్వా శ్రమ నామధేయం బ్రహ్మ శ్రీ దమ్మాలపాటి శేషగిరి శర్మగారు. శ్రీ శేషగిరిశర్మ గారు ది. 9-10- 1913న గుంటూరు జిల్లా, సత్తెనపల్లి తాలూకాలోని దమ్మాలపాడు గ్రామంలో జన్మించారు. శ్రీమతి వేంకటలక్ష్మమ్మ, బ్రహ్మశ్రీ దమ్మాలపాటి వేంకట్రావుగారు వీరి తల్లిదండ్రులు. నియోగి బ్రాహ్మణ వంశసంజాతులైన వీరు హరితస గోత్రికులు. ఆపస్తంబ సూత్రులు. కృష్ణయజు



శ్లాఘీయులు.

శ్రీశేషగిరిశర్మగారు చౌటపాపాయపాలెం సంస్కృత కళాశాలలోనూ, తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర సంస్కృత కళాశాలలోనూ, మద్రాస్ మైలాపూర్‌లోని సంస్కృత కళాశాల లోనూ సాహిత్యాన్ని, వేదాంతాన్ని అధ్యయనం చేశారు. 'సాహిత్యవేదాంత శిరోమణి', 'ఉభయభాషా ప్రవీణ' పట్టాలను పొందారు. తర్క విశారదులు, వేదాంత విద్యాధికులైన బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకట్రామశాస్త్రిగారి వద్ద ప్రస్థానత్రయాన్ని గురుకులరీతిలో చదివారు. 'ఆంధ్ర వివేకానంద' శ్రీప్రభాకర ఉమామహేశ్వర పండితులతో పాటు ఆంధ్రదేశమంతటా పర్యటించి మన సనాతన ధర్మ వైశిష్ట్యాన్ని గురించి ప్రవచనాలు చేశారు. ఆంధ్రదేశంలోని వైదికధర్మ ప్రచారపరిషత్‌కు కార్యదర్శిగా వ్యవహరించి ధర్మప్రచారం చేశారు.

1952 నుండి 1968 వరకు నరసరావుపేట మునిసి పల్ హైస్కూల్‌లో సంస్కృత భాషాధ్యాపకులుగా ఉద్యోగ నిర్వహణం చేసిన శ్రీశర్మగారు 1968లో నరసరావుపేటలోని శ్రీరామకృష్ణ ఓరియంటల్ కళాశాలలో సంస్కృతోపన్యాస కులుగా చేరి, 1972 వరకు ఉద్యోగనిర్వహణం చేశారు.

శ్రీ శేషగిరిశర్మగారు వారణాసిలో శ్రీనివాస ద్వివేది గారి పర్యవేక్షణలో జరిగిన సార్వభౌమ సంస్కృత సమ్మేళనం రజతోత్సవాలలో మన ఆంధ్రరాష్ట్ర ప్రతినిధిగా పాల్గొన్నారు. కాశీ విద్వత్పరిషత్‌వారు శ్రీశర్మగారికి 'మహామహోపాధ్యాయ' బిరుదుప్రదానం చేసి గౌరవించారు.

'మహామహోపాధ్యాయ' శ్రీశర్మగారు ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండకోపనిషత్తులను సంస్కృత కావ్యంగా రచించారు. ఆదిశంకరాచార్యులవారి విష్ణుసహస్రనామ భాష్యాన్ని ఆంధ్రీకరించారు. శ్రీ లలితాంబికా పూజా విధానము, శ్రీ గాయత్రీ శంకర భాష్యము, సర్వదర్శన సంగ్రహము, ఛాందోగ్యకథా మంజూష, దేవీగీత, దశావతా రములు, హరి హరతత్త్వము, ఆత్మబోధ, మొదలైనవి వీరి ఇతర రచనలు.

శిష్యగణ కల్పతరువులైన శ్రీశర్మగారికి సంధ్యావంద నాది నిత్యకర్మానుష్ఠానం పట్ల శ్రద్ధ ఎక్కువ. వారు ఏడెనిమిదేళ్ల వయస్సు ఉన్న కొడుకులుగల ప్రతి తండ్రినీ 'మీ అబ్బాయికి ఉపనయనం చేశావా?" అనీ, ఉపనయనం ఐన ప్రతివ్యక్తిని 'త్రికాల సంధ్యావందనం చేస్తున్నావా?' అనీ అడుగుతూ 'చేయవలసింది'గా ఆదేశిస్తూ ఉండేవారు. నిత్యకర్మానుష్ఠానం లో ఏ కొద్దిపాటి అనాచారాన్నైనా అంగీకరించేవారు కాదు.

'అపర ఆదిశంకరాచార్యు'లైన శ్రీబెల్లంకొండ రామ రాయకవిగారి పుస్తకాలను ప్రచురించిన శ్రీకవితా సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి శ్రీశర్మగారు ఎంతగానో సహకరించారు.

పుట్టపర్తి సాయిబాబా, శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి, కంచి కామకోటిపీఠాధిపతి, కుర్తాళం సిద్ధేశ్వరానంద భారతి, గుంటూరు స్వయంసిద్ధ కాళీపీఠంవారు శ్రీ శర్మగారిని సత్కరించారు.

1985లో గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ సత్యానందభారతీస్వామివారు శ్రీదమ్మాలపాటి శేషగిరిశర్మ గారికి సన్యాసాశ్రమాన్ని అనుగ్రహించి, 'చిదానందభారతి' అని యోగపట్ట నామకరణం చేశారు. శ్రీ చిదానందభారతులు 1986లో ఆ పీఠానికి అధిపతులై ఆ పీఠసంప్రదాయాన్ని త్రికరణశుద్ధిగా అనుసరిస్తూ దాని ప్రతిష్ఠ ను ద్విగుణీకృతం చేశారు. శ్రీచిదానందభారతీ స్వామివారు శ్రీవిద్యోపాసనా తత్పరులు. శ్రీవిద్యావిషయమై ఎవరికి ఏ విధమైన సందేహాలున్నప్పటికీ, వాటి నన్నింటినీ సాధికారి కంగా తీర్చగలిగిన ప్రజ్ఞాశాలి. శరన్నవరాత్రుల లోనూ, పూర్ణి మలలోనూ, విశేషసందర్భాలలోనూ తమ పీఠంలో శ్రీచక్ర నవావరణార్చనలను నిర్వహిస్తూ ఉండేవారు. శ్రద్ధాళువులైన,

జిజ్ఞాసువులైన భక్తులకనేకులకు వివిధ మం త్రోపదేశాలను చేసి, వారి నందరినీ ధన్యులనుచేశారు.

తురీయాశ్రమధర్మాలను త్రికరణశుద్ధితో నిర్వహించి సనాతన ధర్మప్రచారం చేసిన శ్రీ చిదానందభారతీస్వామివారు 20-3-2006వ తేదీన పార్థివ నామసంవత్సరం ఫాల్గుణ బహుళ పంచమినాడు తమ పాంచ భౌతిక శరీర త్యాగం చేసి బ్రహ్మీభూతులైనారు. 'చిదానంద యతిం భజే'.

## శ్రీ విద్యారణ్యస్వామి

'భారతీయ సుజన సేవక సమాజ్' అనే సత్సంగాన్ని స్థాపించి విద్యార్థులలోనూ యువకులలోనూ దైవభక్తినీ, దేశభక్తినీ సత్ప్రవర్తననూ క్రమశిక్షణనూ పెంపొందింప జేసి వారిని ఉత్తమపౌరులుగా తీర్చిదిద్దిన పరివ్రాట్టులు శ్రీవిద్యా రణ్యస్వామివారు. వారి పూర్వాశ్రమ నామధేయం శ్రీ కేసాను పల్లి హనుమంతరావుగారు.

శ్రీకేసానుపల్లి హనుమంతరావుగారు 1939 ప్రాంతంలో మన నరసరావుపేటలో జన్మించారు. 1956వ సంవత్సరంలో స్థానిక ఎస్. ఎస్. & ఎన్. కళాశాలలో చదువుతున్న రోజులలో మన నరసరావుపేటలో భారతీయ సుజన సేవక సమాజ్ అనే సంస్థను స్థాపించారు. అరండల్ పేట వీరాంజనేయ స్వామి, రంగనాయకస్వామి ఆలయ ప్రాంగణంలో ఈ శాఖ నడుస్తూ ఉండేది. శ్రీతెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రి, శ్రీ జగర్లపూడి మారుతీప్రసాదు, శ్రీదొంతరాజు గోపాలరావు, శ్రీపామరాజు వేంకటేశ్వర్లు, శ్రీదొంతరాజు సాయిరామారావు మొదలైన స్థానిక యువకులు ఈ శాఖకార్య క్రమాలలో చురుకుగా పాల్గొంటూ ఉండేవారు.



నేను కూడా నా పదవ యేట ఈ శాఖకు ఎంతో ఆనందంగా వెళుతూ శ్రీ హనుమంతరావుగారి అభిమానానికి పాత్రుడినైనాను.

ప్రతిరోజూ సాయంత్రం 6 గంటలకు ధ్వజారోహ ణంతో కార్యక్రమాలు ప్రారంభమయ్యేవి. వరుసగా ప్రార్థన, సూక్తిప్రబోధం, దేశభక్తుల చరిత్ర, రామాయణ భారత భాగవతాదుల నుండి ఒక వృత్తాంతం, పద్య, శ్లోక పఠనం, వ్యాయామం, ఆటలు జరిగేవి. అటుపిమ్మట ధ్వజావరోహణంతో కార్యక్రమం ముగిసేది.

శ్రీ హనుమంతరావుగారు 1958లో కళాశాల విద్యను ఆపివేసి, భారతీయ సుజనసేవక సమాజ్ కార్యక్రమాలనే నిర్వ హిస్తూ ఉండేవారు.

1962వ సంవత్సరంలో శృంగేరివాసులైన శ్రీ శంక రానందతీర్థస్వామివారు శ్రీహనుమంతరావుగారిని సంన్యాసా శ్రమంలోనికి ప్రవేశింపజేసి 'విద్యారణ్యస్వామి' అని యోగపట్ట నామకరణం చేశారు. ఈ నామాన్ని శృంగేరి శారదాపీఠానికి 35వ అధిపతులైన శ్రీఅభినవవిద్యాతీర్థులవారు సూచించారు.

శ్రీ విద్యారణ్య స్వామివారు 1963వ సంవత్సరంలో డా॥ తెలికేపల్లి లక్ష్మీనారాయణ గారి సంపాదకత్వంలో శ్రీ శంకరవాణి అనే మాసపత్రికను ప్రారంభింపజేశారు.

శ్రీవిద్యారణ్యస్వామి వారు చామనచాయ మనిషి. మంచి పుష్టి కలిగిన దేహయష్టి. మేఘ గర్జన లాంటి గంభీర కంఠనాదం. శ్రోతల నందరినీ ఆనందపరచే ప్రవచనవిధానం. నిత్యమూ చిరునవ్వు చిందులాడే ముఖం. ఆత్మీయతతో గూడిన పలకరింపు- వీటితో శ్రీస్వామివారు అందరినీ ఆకట్టుకుంటూ వుండేవారు.

శ్రీవిద్యారణ్యస్వామివారు రసవత్కవివర్యులు. 'భగవ ద్భారతి' అధ్యాత్మికవిద్యకు సంబంధించిన 9 అధ్యాయాల మహాగ్రంథం వీరి ప్రధాన రచన.

అద్వైతానందానుభూతిని అన్నివిధాలుగానూ అను భవంలోకి తెచ్చుకొన్న శ్రీవిద్యారణ్యస్వామివారు 1999 సంవత్సరములో పాంచభౌతిక శరీరత్యాగం చేశారు. 'విద్యారణ్యం నమామ్యహం'.

# రుద్రాక్ష కిరీటం తాతగారు



శ్రీపతి పండితారాధ్యుల చంద్రశేఖర్
వ్యాపారవేత్త

శైవమత ప్రచారకులలో శ్రీపతి పండితారాధ్యుల శివానందశాస్త్రి ప్రముఖులు. వీరు 120 సంవత్సరాలు సంపూర్ణారోగ్యంతో జీవించి, 1945 ప్రాంతంలో నాగులచవితి రోజున నిర్యాణం చెందారు. వీరు షట్కాల శివార్చనా ధురంధరులు. 'రుద్రాక్ష కిరీటం తాతగారు' అంటూ పిలువబడిన శివయోగి. వీరు చరమదశలో నరసరావుపేటలోని స్వగృహంలోనే ఎక్కువకాలం జీవించారు. శ్రీశివానందశాస్త్రి గొప్ప యోగాభ్యాసకులు. వీరు పతంజలి యోగరీతి ననుసరించినవారు. వీరు 20 ఏండ్ల వయస్సులో ఒక మఱ్ఱిచెట్టు తొఱ్ఱలో చాలాకాలం తపస్సుచేసి జ్ఞానోదయభాజను లయ్యారు.

శ్రీశివానందశాస్త్రి చిన్ననాడే సమస్త వేదవిద్యల నభ్యసించారు. ఆ తరువాత దేశవ్యాప్తంగా పర్యటిస్తూ చతుర్వేదాలు, ఉపనిషత్తులు, ధర్మశాస్త్రాలు, ఇతర వేదాంత సిద్ధాంతాలకు సంబంధించిన చర్చల్లో పాల్గొన్నారు. అనేక పర్యాయాలు కాశీపండితులతో పోటీపడి గెలుపొందారు. గెలుపొందిన ప్రతిసారీ శాస్త్రిగారికి పూర్ణకుంభంతో కాశీవిశ్వేశ్వరాలయ ప్రవేశం, గజారోహణం, గండపెండారాది విశిష్ట సత్కారాలు జరిగాయి. శాస్త్రిగారు వారణాసికి ఎప్పుడు వెళ్లినప్పటికీ అక్కడి కలెక్టరు స్వయంగా అధికారికంగా స్వాగతించేవారు.

తెలంగాణా ప్రాంతంలో కూడ శాస్త్రిగారి సలహా ప్రకారమే శివాలయాల నిర్మాణాలు జరిగేవి. వరంగల్లు ఆకారపు వారి గుడి, కొరివి (కొత్తకొట్టు) భద్రకాళీ సమేత వీరభద్రేశ్వరాలయమూ, అందులోని సర్వ ఉపాలయ సముదాయ పునః ప్రతిష్ఠలు శాస్త్రిగారి చేతుల మీదుగానే జరిగాయి.

నరసరావుపేట పాతూరులోని గంగాపార్వతీసమేత భీమలింగేశ్వరస్వామివారి ఆలయంలో వార్షిక కల్యాణాదులతో పాటు తిరునాళ్ళు, అఖండ శైవహోమాలు, యజ్ఞయాగాలు, విశేష క్రతువులు శ్రీశివానందశాస్త్రి ఆధ్వర్యంలోనే జరిగేవి.



శ్రీశివానందశాస్త్రి స్వాతంత్ర్య ఉద్యమస్ఫూర్తితో సహపంక్తి భోజనాలను ప్రోత్సహించారు. తాను నమ్మిన ఈ విషయాన్ని గురించి 'దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని సంప్రదించి దానిని ఆచరణలో పెట్టారు. దేశసమైక్యం కోసం సమాజ ఏకత కోసం ఎనలేని కృషిచేశారు.

నెల్లూరు వాస్తవ్యులైన శ్రీపతి పండితారాధ్యుల సాంబమూర్తిగారు, మన ఊరి 'కంఠమాల'సుబ్బయ్యగారు, లంకా సీతారామశాస్త్రిగారు- ఇంకా ఎందరో ప్రముఖులు వీరి శిష్యకోటిలోనివారే!

వీరు ఒంటెద్దు బండిలో ప్రయాణిస్తూ సమాజంలోని అన్నివర్గాలలో ఉన్న తమ శిష్యబృందాల ననుగ్రహిస్తుండేవారు. సద్గురువరులైన రుద్రాక్షకిరీటం తాతగారు ఈ విధంగా శైవాచార విశిష్టతను దేశవ్యాప్తం చేశారు. తాము తరించి అందరినీ తరింపచేశారు. 'స్వయం తీర్ణః పరాం స్తారయతి' అన్న ఋష్యుక్తికి ప్రత్యక్ష, ప్రత్యక్షర సాక్షులుగా నిలిచారు.



# తపస్సంపన్నులు - అధరాపురపువారు



## మానూరి శ్రీనివాస హనుమంతరావు

రిటైర్డ్ హెడ్ - తెలుగు డిపార్ట్‌మెంట్

ద్వైతసిద్ధాంత కోవిదులు, పరమ నిష్ఠాగరిష్ఠులు, భాగవత భగవద్భక్తులు, ముముక్షువులు అధరాపురపు పురుషోత్తమాచార్యులవారు పల్నాడులోని దాచేపల్లి గ్రామంలో 1837 సంవత్సరంలో శ్రావణ బహుళ దశమినాడు జన్మించారు. వీరి తండ్రి మధ్వశ్రీ సుబ్రహ్మణ్య సోమయాజులు, తల్లి శ్రీమతి లక్ష్మీబాయమ్మ సోమిదేవమ్మ. ఆచార్యులవారు మన నరసరావు పేటలో స్థిరనివాస మేర్పరచుకొని నిరతాన్న దానవ్రతులై ప్రసిద్ధిని పొందారు.

వీరు ఎనిమిదవ యేట ఉపనీతులైనారు. వీరి ధర్మపత్ని శ్రీమతి పున్నమ్మగారు. వీరు తమ తండ్రిగారి వద్ద, గుంటూరువాసి అధరాపురపు శ్రీనివాసాచార్యులవారి వద్ద లౌకిక, వేదాంతవిద్యల నభ్యసించారు. నెలకు 7 రూపాయల జీతంతో 'దస్తరుబంది' అనే ప్రభుత్వోద్యోగం చేశారు.

ఆచార్యులవారు రేపల్లెలో ఉన్న రోజులలో ఒక రోజు రాత్రి ఆంజనేయస్వామి స్వప్నసందర్శనమిచ్చి 'శేషజీవితమును నరసరావుపేటలో గడుపవలసింది'గా ఆజ్ఞాపించాడు. దానిని శిరసావహించిన ఆచార్యులవారు నరసరావుపేటకు వచ్చి, రాజాగారి కోటకు ఎదురుగా ఉన్న పులుపులవారివీథిలో ఒక ఇంట్లో నివసించ సాగారు. కాలాంతరం లో ఆ ఇంటిలోనే ఆంజ నేయవిగ్రహాన్ని ప్రతి ష్ఠించి నిత్య ధూప దీప నైవేద్యాదులను నిర్వర్తించసాగారు. కొన్నేళ్ల తర్వాత ఆ ప్రాంగణంలోనే రాజ్యలక్ష్మీ సమేత నృసింహ స్వామిని ప్రతిష్ఠించారు. నృసింహ పుష్కరిణి పేరుతో ఒక బావిని త్రవ్వించారు.

సదాచార సంపన్నులైన ఆచార్యులవారు నరసరావుపేట సీమోల్లంఘనం చేయకుండే విధంగా ఒక నియమాన్ని ఏర్పరచుకొని, పొలిమేరలు దాటకుండా పట్టణంలోనే నివసిస్తూ ఉండేవారు. ఆ రోజులలో ఉత్తరాది మధ్వపీఠాధిపతులు తమ సన్నిధానానికి వచ్చి ద్వైత సిద్ధాంత ప్రవచనమూ, శాస్త్రచర్చ చేయవలసిందిగా వారిని ఆహ్వానించారు. ఆచార్యులవారు తమ నియమాన్ని గురించి వారికి తెలియజేశారు. ఆ విషయాన్ని తెలుసుకొన్న పీఠాధిపతులు ఎంతగానో సంతోషించి 'మీ ప్రసంగ విషయాన్ని వ్రాతపూర్వకంగా మాకుపంపితే సభలో వినిపించి ఆనందిస్తా' మన్నారు. అధరాపురంవారు ఆ విధంగానే చేసి ఆచార్యవర్యుల ఆశీస్సుల నందుకొన్నారు.

1909వ సంవత్సరం శివరాత్రినాడు కోటప్పకొండ వద్ద 'సైసైరా! చిన్నపరెడ్డి!' సంఘటన జరిగింది. ఆ సందర్భంలో తుపాకితో ఒక ఎద్దును కాల్చి చంపిన డి.ఎస్.పి. ఆరణి సుబ్బారావు పశ్చాత్తాపంతోనూ, పాపభయంతోనూ ఆచార్యులవారిని ఆశ్రయించాడు. వారి సూచన ననుసరించి ఉద్యోగానికి ఒక నెల రోజులు సెలవుపెట్టి నరసరావుపేటకు వచ్చాడు. ఈ హనుమదాలయంలో ఉంటూ స్వామిని సేవించాడు. మనశ్శాంతిని పొందాడు. కేసు నుండి విముక్తుడైనాడు. ఈ విధంగా ఆచార్యులవారు ఆర్తుల కెందరికో అనేకానేక బాధలను తొలగించి, చిత్తస్వాస్థ్యాన్ని ప్రసాదించారు.

1911వ సంవత్సరంలో శ్రీరామనవమి రోజున పట్టాభిరామస్వామివారికి కల్యాణం జరిగింది. అనంతరం ఉత్సవవిగ్రహాలు గ్రామోత్సవం జరుపుకొంటూ నాలుగు వీథులలో తిరిగి ఆచార్యులవారున్న ఆలయం వద్దకు వచ్చినై. ఆచార్యులవారు బయటకు వచ్చి, స్వామివారికి పూజాద్రవ్యాలను సమర్పించి, సాష్టాంగ నమస్కారం చేసి, గృహంలోకి వెళ్లారు. ఉత్తర దక్షిణాలుగా తులసికాడలను పరచుకొన్నారు. అందరి అనుజ్ఞను తీసుకొని, దక్షిణంవైపు శిరస్సు నుంచి పడుకొన్నారు. హనుమన్నామ స్మరణం చేస్తూ ప్రాణత్యాగం చేశారు. స్వామివారి దివ్యసాయుజ్యాన్ని పొందారు.

మధ్వశ్రీ చిట్టి లక్ష్మీనరసింహాచార్యులువారు, మధ్వశ్రీ మానూరు వేంకటరమణయ్యగారు వారి వారి గ్రంథాలలో శ్రీఅధరాపురపువారిని గురించి విపులంగా వ్రాశారు.



# రాజకీయ 'రసపట్టు'


లంకా సత్యనారాయణ

ఇంగ్లీష్ లెక్చరర్ (రిటైర్డ్)


ప్రఖ్యాత ఉర్దూకవి అక్బర్ ఇలాహాబాదీ స్వాతంత్ర్య పోరాటంలో ప్లీడర్లంతా లీడర్లు అయిపోయారని చమత్కరిస్తారు. పీ అంటే పైసా, అంటే డబ్బు. సంపాదన త్యజించి దేశసేవకు పూనుకున్నారని ఆయన ప్రశంస. డబ్బే పరమార్థమై దాని కోసం ఎంతటి హైన్యానికైనా దిగజారుతూ వున్న ఈ రోజుల్లో అలాంటి వారు ఉండేవారంటే ఈ కాలపువారు కొంత మంది నమ్మకపోవచ్చు. త్యాగం, నిర్భీకత్వం ఆనాటి నాయకుల సామాన్య లక్షణాలు. గాంధీజీ ప్రభావమే దానికి ప్రధాన కారణం.

ఉదాహరణకు, నరసరావుపేట కీర్తిని నలుచెరగులా విరజిమ్మిన కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు లాయర్ వృత్తిని త్యజించి సత్యాగ్రహిగా జైలు కెళ్ళినపుడు 'నీ వృత్తిలో ఎందుకు కొనసాగ లేకపోయావు?' అని అడుగగా 'అబద్ధాలు చెప్పలేక, చెప్పించలేక' అని రకీమని జవాబుచెప్పారు. మరి ఈ ఉద్యమంలో ఎందుకు చేరావంటే 'నేను విన్న గాంధీజీ సందేశ ప్రభావం అటువంటిది' అని వివరించారు. అది విన్న ఆ భారతీయ జైలర్ లోలోన మురిసిపోయాడు.

కోలవెన్నువారు నరసరావుపేటలో ఉంటూ స్థానిక యువతకు స్ఫూర్తికేంద్రంగా ఉండేవారు. అంతకు ముందు బందరులో జాతీయకళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. కవులు, కళాకారులు, పండితులు, లెక్చరర్స్‌గా ఆయన క్రింద పనిచేసిన కళాశాల అది. 'త్రివేణి' ఆంగ్లపత్రికకు సంపాదకత్వం వహించి, దానికి ప్రాచుర్యం, పాఠకుల మన్నన గడించారు. గాంధీజీ, రాజేంద్రప్రసాద్, ప్రకాశంపంతులు, పట్టాభి వంటి అగ్రనాయకులతో ఆయనకు సన్నిహిత సంబంధాలుండేవి. ఆయన పాల్గొనని ఉద్యమం ఆనాడు ఏదీ లేదు.

బాలకృష్ణుని మురళీగానానికి సమ్మోహితులైన బృందావనంలో ఆయనతో విహరించిన గోపికల్లాగా గాంధీజీని కని, విని ఎందరో భావుకులు ఇల్లు, సంసారం వదలి దేశం బాట పట్టారు. గాంధీచౌక్‌లో పచారీకొట్టు నడుపుతూ కొట్టు వదిలివేసి, 'కోట్లోకి' పోయిన కొఠారీ రామోజీ అటువంటి



కొఠారు రామోజి, మాజేటి పూర్ణచంద్రరావు, జొన్నలగడ్డ అప్పల నరసింహం, ఏలూరు హనుమంతరావు

వారిలో ఒకరు. ఆయన అరకాలీ. శివాజి వారసత్వాన్ని నిరూపించుకున్న ధీరుడాయన. అప్పట్లో జాతీయోద్యమంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించిన మరో ప్రముఖవ్యక్తి కరణం రామస్వామి. ఈ సందర్భంలో పమిడిపాడు గ్రామానికి చెందిన బెల్లంకొండ వారిని గురించి తప్పక పేర్కొనాలి. బెల్లంకొండ రామారావు గారిది పండితవంశం. ఆయన స్వయంగా మహాపండితులు. ఉపనిషత్తులకు శంకరభాష్యంతో తులతూగే వ్యాఖ్యానాలు సంస్కృతంలో వెలయించి, కాశీ పండితుల ప్రశంసల నందు కున్నారు. తిరుపతివేంకట కవులు సైతం ఆయనకు గౌరవ పురస్సరంగా అంజలి ఘటించారు. ఆయన వంశీయుడైన రాఘవరావుగారు దానవీరులు. సమాజ స్పృహ నిండుగా ఉన్నవారు. తమ 1100 ఎకరాల సుక్షేత్రాన్ని

ప్రజలకోసం ధారపోశారు. వారి ఇల్లు కవి పండితులకు, సత్యాగ్రహులకు తీర్థస్థానంగా ఉండేది. కటిక దారిద్ర్యాన్ని చవిచూచి కూడా 'దేహి!' అనకుండా సంతృప్తిగా కన్నుమూసిన మహనీయు డాయన. 'త్యాగంతో సాధించిన స్వరాజ్యాన్ని తన కన్నుల ముందే ఇలా భ్రష్టుపట్టిస్తున్నా'రన్న ఆవేదన ఆయన అడపా దడపా వెలిబుచ్చేవారు. స్వంత గ్రామంలో సెంటు భూమి లేకపోయినా వారి వారసులు చిన్న వ్యాపారాలతో సంపాదించుకున్న సొమ్ముతో ఇప్పటికి తమ గ్రామంలో రోడ్లు వేయిస్తున్నారు. అనాథలకు ఆర్థిక సహాయం అందిస్తున్నారు.

బెల్లంకొండవారు గ్రంథాలయోద్యమ పితామహుడు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి ప్రేరణతో పమిడిపాడు గ్రామంలో అఖిలభారత గ్రంథాలయోద్యమ మహాసభను నిర్వహించారు. గాంధీజీ 1930 ప్రాంతంలో నరసరావుపేట ప్రాంతానికి వచ్చినపుడు బెల్లంకొండ కనకమ్మగారు తన ఆభరణాలన్నింటిని ఆయనకు సమర్పించారు. తన బంగారు జరీపట్టుచీరల నన్నింటిని విదేశీ వస్తువుల క్రింద దహనం చేశారు. ప్రసిద్ధ పాత్రికేయుడు రచయిత అయిన బెల్లంకొండ రామదాసుగారు అకాలమరణం చెందగా, ఆయన సతీమణికి ప్రభుత్వం ఇచ్చిన కొద్దిపాటి భూమిని స్వతంత్ర భారత స్వార్థ నాయకులు స్వాహాచేయగా, ఆ కుటుంబం ఈనాటికి నిస్సహాయంగా ఉండిపోయింది.

స్వాతంత్ర్యసాధన కోసం అంకితమైన నాలుగు కుటుంబాలను ఇక్కడ ప్రధానంగా పేర్కొనాలి. మాజేటివారు, పాటిబండ్లవారు, కనుపర్తివారు, కాసువారు. మాజేటివారు కాంగ్రెస్ నడిపిన ఉద్యమాలలో చురుకుగా పాల్గొనేవారు. వారు స్వతహాగా సంపన్నులు కావడంచేత ఉద్యమం నిర్వహణకు ఆర్థిక సహాయం సైతం అందించేవారు. సహాయ నిరాకరణోద్యమంలో మాజేటి పూర్ణచంద్రరావుగారు కారాగార క్లేశం అనుభవించారు. ఆయన తండ్రి శ్రీరాములుగారు పేరు గాంచిన దాత. ఆయన సోదరి శేషమాంబ ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. పాటిబండ్లవారి మాటకొస్తే పాటిబండ్ల శ్రీనివాససత్యనారాయణ గాంధీజీ నడిపిన వివిధ ఉద్యమాలలో చురుగ్గా పాల్గొన్నారు. జైలుశిక్ష అనుభవించారు. పాటిబండ్ల సుబ్బారావు గారు జాతీయోద్యమంలో పాల్గొన్నారు. మూడు సంవత్సరాలు మున్సిపల్ ఛైర్మన్‌గా చేశారు. కనుపర్తి నిత్యానందం కాకలుతీరిన కాంగ్రెస్ కార్యకర్త. కారాగార క్లేశం అనుభవించారు. కనుపర్తి హనుమాయమ్మ సాంప్రదాయ కుటుంబం నుండి వచ్చిన బాలవితంతువు. సాంప్రదాయ వేషంలోనే ఖద్దరు అమ్మకంతోసహా అన్ని కార్యక్రమాలలోను బెరుకు లేకుండా పాల్గొన్నారు. ప్రతిరోజు రాట్నం వడికేది. ఫిరంగిపురం, పేరేచర్ల వద్ద జరిగిన పికెటింగ్‌లో పాల్గొని సర్కారువారి ఆగ్రహానికి గురయ్యారు. కొంతకాలం గాంధీజీ ఆశ్రమంలో శిక్షణకూడా పొందారు.

నరసరావుపేటకు చెందిన జొన్నలగడ్డ అప్పల నరసింహం, ఏల్చూరి హనుమంతరావు 1922లో జరిగిన సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని తమ దేశభక్తిని చాటుకున్నారు. ఉప్పుసత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమంలో జొన్నలగడ్డ సత్యనారాయణగారు చురుకైన కార్యకర్త. వలంటీర్లను సంఘటిత పరిచేవారు, కార్యక్రమాలు ఏర్పాటు చేసేవారు.

స్వాతంత్ర్య ఉద్యమంలో ఉప్పుసత్యాగ్రహం ఒక కీలకమైన ఘట్టం. ఈ సత్యాగ్రహంతో స్వాతంత్ర ఉద్యమం నాయకుల ఉద్యమంగా కాకుండా ఒక ప్రజాఉద్యమంగా మారింది. ఇన్ని వస్తువులుండగా గాంధీజీ ఉప్పును సత్యాగ్రహ ఆయుధంగా ఎందుకు ఎన్నుకున్నారో, పరిణామాలు ఏమిటో ఇటు భారత ప్రజలకుగాని, పరిపాలకులైన తెల్లవారికిగాని అర్థం కాలేదు. అందుచేతనే ప్రధానమంత్రి చర్చిల్ గాంధీని గురించి, ఉప్పుసత్యాగ్రహం గురించి నిర్లక్ష్యంగా అవహేళనగా మాట్లాడాడు. తమ ఖాళీ ఓడల భద్రత కోసం వాటిలో ఇంగ్లాండ్ నుండిఉప్పు తేవలసి వచ్చింది. ఆ ఉప్పును భారతదేశంలో కొనేటట్లు చేసేందుకు, భారతదేశంలో ఉప్పుతయారీ నిరోధించారు. భారీఎత్తున దేశంలో ఉప్పు ఉత్పత్తిపై పన్ను విధించడంతో ఒక రూపాయికి రెండు మానికలు అమ్ముతున్న ఉప్పుకాస్తా ప్రియమై రెండు రూపాయలకు ఒక మానిక అయింది. దీనితో బ్రిటీష్‌వారు భారతీయులను ఎలా దోస్తున్నారో, ఉప్పువాడే ప్రతివాడికి బాగా అర్థమై పెద్దఎత్తున ప్రజాఉద్యమంవచ్చింది. ఈ ఉప్పు ఉద్యమంలో నుండి లక్షల మంది కార్యకర్తలు ప్రభవించారు. నరసరావుపేటలో

మున్సిపల్ ఆఫీసువద్ద చేపట్టిన ఉప్పు సత్యాగ్రహం ఒక మరుపురాని ఘట్టం. చీరాల వద్దనుండి కడవలతో తెచ్చిన సముద్రపు నీటిని కాగబెట్టి, ఉప్పుతయారు చేసే కార్యక్రమంలో కోలవెన్ను, బెల్లంకొండ రాఘవరావు, మరి ఎందరో ప్రత్యక్షం గా పాల్గొని తమ ఉపన్యాసాలతో జనాన్ని ఉద్రూతలూగించే వారు. తంగిరాల లక్ష్మీనారాయణ ఉపాధ్యాయవృత్తిని వదులు కొని జాతీయ ఉద్యమంలో జైలుకు వెళ్లారు. అన్నాప్రగడ కామేశ్వరరావు మంచివక్త. తన సాహసకృత్యాలతో యువకు లకు ఆదర్శంగా నిలిచారు. ఆయనకు ఆజాద్ హింద్ ఫౌజ్‌తో సంబంధా లుండేవి. రావిపాటి కామేశ్వరరావు జాతీయోద్యమ ఘట్టాలను హరికథలుగా వినిపిస్తూ వుండేవారు. కనపర్తి వేంకటేశ్వరశర్మ కూడా జాతీయోద్యమంలో జైలుశిక్ష ననుభ వించినవారే. సర్వస్వం పోగొట్టుకొని జీవితపు చరమాంకంలో ఎన్నో బాధలు పడ్డారు. నరసరావుపేటలోని లాయర్లలో చాలా మంది జాతీయోద్యమ సానుభూతిపరులే. తాడేపల్లి సంపూర్ణ లక్ష్మీనారాయణ, చావలి కిష్టయ్య, నడింపల్లి హనుమంతరావు, జగన్నాథరావు, పంగనామాల నరసింహారావు, చింతలచెర్వు కోటేశ్వరరావు మున్నగువారు జాతీయోద్యమానికి ఎంతగానో దోహదం చేశారు.

గాంధీజీ తనఉద్యమంలో మహిళలకు ఎంతో ప్రాధా న్యం ఇచ్చేవారు. కొండా లక్ష్మి, కాసు రాఘవమ్మ మున్నగు వారు నూలు వడకడంతోపాటు, ఖాదీవస్త్రాల అమ్మకం, ఖాదీ ప్రచారం నిర్వహించారు.

జాతీయోద్యమంలో హిందీ భాషాప్రచారం ఒక ముఖ్యమైన భాగం. ఈ ఉద్యమాన్ని ముక్తినూతలపాటి హనుమంతరావు, ఆయన సతీమణి సమర్థంగా నిర్వహించారు. ఆయన కాలం చెందే వరకు సైకిల్‌పై పెట్టుకొని ఖాదీవస్త్రాల అమ్మకం చేసే వారు. పెండ్యాల జగన్నాథం కూడ జాతీయోద్యమంలో చురుకుగా పాల్గొన్నవారే.

నిమ్నవర్గాలలో కూడ ఆనాడు జాతీయోద్యమం పట్ల నిబద్ధత కల్గిన కార్యకర్తలుండేవారు. మంగళగిరి పరవస్తుదాస్, రేపల్లె భీముడు (లారీ డ్రైవర్), దేవరపల్లి ఏలియా (కుంకల గుంట) దళిత కుటుంబాల నుండి వచ్చారు. ముసుగు జోసెఫ్ వాల్‌పోస్టర్లు అతికిస్తూ పట్టుబడి పోలీస్ క్రౌర్యానికి గురి అయ్యారు. నరసరావుపేటలో స్థిరనివాసం ఏర్పరచుకున్న సంగీత విద్వాన్ షేక్ చినమస్తాన్ కూడా జాతీయోద్యమంలో పాల్గొని తెనాలిలో కారాగారశిక్ష అనుభవించినవారే.

ఈ సందర్భంగా 'కరాచీ' పేరు కూడా ప్రస్తావించాలి.



కరాచి

ఆయన అసలు పేరు మేళ్లచెర్వు ఆంజనేయశాస్త్రి. తద్దినాలు పెడతా డని పినతల్లి దత్తుతీసుకోగా గాంధీ మతం పుచ్చుకొని 'సంకరపుకూడు' తిన్నాడు. దత్తుతల్లి రుక్మిణమ్మ దర్భ కర్రతో నాలుక కాల్చి పంచకవ్య ప్రాయశ్చిత్తం చేసింది. అయినా గాంధీభూతం వదలలేదు. పోలీసులు ఒకమారు పట్టుకొని ఆయనను కొండవీటి కొండల వెనుక వదిలేశారు. టిక్కెట్టు లేకుండా చెప్పా పెట్టకుండా కరాచీలో జరిగిన కాంగ్రెస్ మహాసభలకు హాజరైనందున ఆయనను కరాచీ అని పిలిచే వారు. ప్రాణంపోయే వరకు ఖద్దరే ధరించారు.

తమ కవితల ద్వారా ప్రజలలో దేశభక్తి, అభ్యుదయ భావ బీజాలను వెదజల్లిన వారిలో అనిసెట్టి సుబ్బారావుగారిని ప్రధానంగా చెప్పుకోవాలి. మద్రాస్‌లో విద్యాభ్యాసం చేస్తున్న ప్పుడే బెంగాలీ విప్లవకారులతో కలిసి బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్ర పన్నినందుకు రెండు సంవత్సరాలు బళ్లారి జైలుశిక్ష అనుభవించాడు.

20వ శతాబ్దం మూడవ దశకంలో గాంధీజీ ఒక మారు నరసరావుపేటను, వినుకొండ తాలూకా ముప్పాళ్లను సందర్శించారు. ఆయన కొద్దిసేపు బహిరంగసభలో మాట్లా డారు. డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఈ ప్రాంతాన్ని రెండు సార్లు సందర్శించారు.

1938వ సంవత్సరం నుండి నరసరావుపేట ప్రాం



పులుపుల శివయ్య

తంలో కమ్యూనిస్ట్ ఉద్యమం బాగా ఊపందుకుంది. ఉద్యమ వ్యాప్తి భారం పులుపుల శివయ్య భుజ స్కంధాలపై పడింది. శివయ్యగారు బెనారస్‌లో విద్యాభ్యాసం ముగించు కొని వచ్చారు. మార్క్సిస్టు ఫిలాసఫీ

బాగా జీర్ణించుకున్నవారు ఆయన. మంచి వక్త, ప్రబోధగీతాలు కూడా వ్రాశారు. శిరిగిరిరాజు సత్యనారాయణ, తెలికేపల్లి కృష్ణమూర్తి శివయ్యకు అండగానిలిచి, నరసరావుపేట రెవిన్యూ డివిజన్‌ను కమ్యూనిస్టు కాణాచిగా రూపొందించారు. దళితులు, మైనారిటీ వర్గాలవారిని ఆయన మంచి కమ్యూనిస్టు కార్యకర్తలుగా తీర్చిదిద్దారు. కరణం రంగారావు, నరసింగరావు, గంగినేని వేంకటేశ్వరరావు ఈ ఉద్యమంలో ఎంతో ప్రధాన పాత్ర వహించారు. మహంకాళి సుబ్రహ్మణ్యం, ఆయన భార్య పార్వతి, కొరటాల రత్తయ్య, తూబాటి వేంకటేశ్వర్లు మున్నగువారు పార్టీ ఆదేశాల మేరకు ఉద్యమాలు నడుపుతూ జైలుశిక్షలు, అజ్ఞాతవాసంతో సహా పలు కష్టాలు అనుభవించారు. జొన్నలగడ్డకు చెందిన మామిడాల సుబ్బారావు పోలీసు తూటాలకు బలియై ప్రాణాలు విడిచారు.

ఎన్నికల రాజకీయాలు వాటిలో కులం, ధనం, స్వార్థం, సిద్ధాంత నిబద్ధతారాహిత్యం పెరుగుతున్నకొద్ది కమ్యూనిస్టు పార్టీ, ఇతరచోట్ల వలె బలహీన పడుతూవచ్చి చీలికతో కుంటుపడింది. ఉద్యమాల తీవ్రత తగ్గింది. ఇక్కడ సి.పి.ఐ. మాటకు వస్తే పోపూరి బ్రహ్మానందం, లాయర్ చేకూరి కాంతా రావు, షేక్ బుడేలను ప్రత్యేకంగా పేర్కొనాలి. బుడే నిబద్ధత కల్గిన కమ్యూనిస్టు. స్వార్థరహితంగా పార్టీకోసం పనిచేసిన వాడు. వృద్ధాప్యంలో వున్నా ఇప్పటికీ ఎర్రటోపీ నెత్తిన లేకుండా బయటికి రాడు. సైకిల్ మీదనే ప్రయాణం. ఇక పోపూరి బ్రహ్మానందం పేదల ఆవాసం, ఆర్థికాభివృద్ధికి విశేషంగా పనిచేసినవారు. ఏ వేళ ఎవరు వచ్చి ఇబ్బంది పడుతూ తలుపు తట్టినా పంచె ఎగకట్టి, ఇబ్బందిలో ఆదుకునేందుకు పనిచేయని అధికారులను నిలదీసి, గద్దించి, పని చేయించేవారు. కుటుంబాన్ని, పిల్లల భవితవ్యాన్ని మరిచి పార్టీకోసం పనిచేశారు. కార్యకర్తలు, అభిమానులు ఇల్లు కట్టించి ఇచ్చేవరకు ఆయనకు సొంత ఇల్లు అంటూ లేదు. చేకూరి కాంతారావుగారు వృత్తిచేత లాయర్ అయినా ప్రవృత్తిచేత మార్క్సిస్టు ట్రేడ్ యూనియన్ల నిర్మాణానికి, వారి సమస్యల పరిష్కారానికి ఎంతగానో కృషి చేశారు. కమ్యూనిస్టు కార్యకర్తలపై పెట్టిన కేసులను వాదించే వారు. ఆయన వృద్ధాప్యంలో ఉన్నా ప్రతి రోజూ సి.పి.ఐ. ఆఫీసుకు వెళ్లి కార్యకర్తలకు సలహాలు ఇస్తూ, మార్గదర్శనం చేస్తుంటారు. సి.పి.ఐ. (ఎం.)కు కూడా మంచి కార్యకర్తలు ఇప్పటికీ వున్నారు. రాఘవరెడ్డి ఇప్పుడు ఆ పార్టీకి నాయకత్వం వహిస్తున్నా రు. ఆ పార్టీకి షేక్ సైదా వంటి మంచి కార్యకర్త లుండేవారు.

నరసరావుపేట ప్రాంతంలో బి.జె.పి.కి పెద్దగా పట్టు లేదు. పార్టీ సిద్ధాంతాల పట్ల నమ్మకం కలిగిన కార్యకర్తలు గణనీయంగానే వున్నా పూర్తికాలం పనిచేసే గట్టి నాయకులు లేరు. వల్లెపు కృపారావు మాత్రం పట్టువీడని విక్రమార్కుడిలా పార్టీకోసం పనిచేస్తునే వున్నారు. బి.జె.పి. అసెంబ్లీ పార్లమెంట్ ఎన్నికలలో పోటీచేస్తూవున్నా, వారి ఓట్ల శాతం చాలా తక్కువ. ఈ పార్టీ తరపున ఎన్నికల బరిలోకి దిగిన వారిలో మేడికొండ కబ్బిరెడ్డి, డాక్టర్ నలబోతు వెంకట్రావు లాంటి వారు వున్నారు. మున్సిపల్ ఎన్నికలలో మాత్రం వారికి గణనీయమైన ఓట్ల శాతం కనిపిస్తుంది.

20వ శతాబ్దం 7వ దశకంలో ఇందిరాగాంధీ ఆశీస్సులతో ఏర్పడిన కాంగ్రెస్ ఫోరం ఫర్ సోషలిస్ట్ యాక్షన్‌కు అంటూ ఒక ఫోరం దేశంలో ఏర్పడింది. దానికి గుంటూరు జిల్లా కన్వీనర్స్‌గా అనిసెట్టి కృష్ణారావు గారు, ఎస్.వి.రావు గారుండేవారు. వీరు నరసరావుపేటవారే! ఆంధ్రజ్యోతి విలేఖరిగా ఎంతో కాలం పనిచేసిన గన్నమనేని లింగయ్య వారి కార్యక్రమాలకు దన్నుగాను, సిద్ధాంతాలకు సానుభూతిపరుడుగాను వుండే వారు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోసం ఉద్యమం బయలుదేరి నపుడు ఈ ఫోరం వారు దాన్ని ఎదిరించారు. ఇప్పుడు ఈ ఫోరం ఛాయలు లేవు.

ఇక విప్లవవాద రాజకీయాల మాటకు వస్తే పగడాల ఆదినారాయణ 5 సంవత్సరాలు కారాగారంలో వున్నారు. జొన్నలగడ్డ గ్రామానికి చెందిన నల్లపాటి రామారావు కూడా ఈ కోవకు చెందినవారే. ఆయన పి.డి.ఎఫ్.కి నాయకత్వం వహిస్తూ తరుచూ ఉద్యమాలు చేస్తుంటారు.

1952 నుండి దేశంలో ఎన్నికల పర్వం ప్రారంభ మైంది. ప్రతి ఎన్నికలలోను కాంగ్రెస్‌వారు ప్రముఖ పోటీ దారులు. వారి ప్రధాన ప్రత్యర్థులు కమ్యూనిస్టువారు. ప్రజా

పార్టీ జనతాపార్టీ పేరుతో కొందరు నరసరావుపేట ప్రాంతంలో పోటీకి దిగకపోలేదు. అయితే వారి ప్రభావం నామమాత్రమే. తెలుగుదేశం పార్టీ ఆవిర్భవించాక అది కాంగ్రెస్‌కు ఎన్నికలలో సమ ఉజ్జీగా తయారైంది.

ఎన్నికల చరిత్ర ప్రారంభమైన నాటి నుండి ఇటీవల వరకు కాసు కుటుంబానికి చెందిన వేంకటరెడ్డి, వెంగళరెడ్డి, బ్రహ్మానందరెడ్డి కాంగ్రెస్ పార్టీకి మూలస్తంభాలుగా నిలిచారు. కాసు వేంకటరెడ్డి లాయర్, మంచి మేధావి. 1937లో జరిగిన ఎన్నికలలోనే గుంటూరు అసెంబ్లీస్థానం నుండి జస్టిస్‌పార్టీ అభ్యర్థి జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిపై కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీచేసి, విజయం సాధించారు. అది ఆ రోజులలో గొప్ప విజయం.


కాసు వెంగళరెడ్డి

వెంగళరెడ్డిగారు లెజిస్లేటివ్ కౌన్సిల్, రాజ్యసభ సభ్యులుగా ఎన్నికయ్యారు. జిల్లా సహకార బ్యాంక్ అధ్యక్షు లయ్యారు. ఆయన జిల్లాలో కాంగ్రెస్ పార్టీకి గట్టి పునాదులు వేశారు. ఆయనకు తెలియని ఊరు, కార్యకర్తలు లేరు. ప్రజలతో మమైక్యం చెందారు. చాలాసీరియస్‌గానూ సరదాగానూ వుండేవారు. గొప్ప వ్యూహకర్త. ప్రత్యర్థులను సైతం మంచి చేసుకునే ఉద్దేశంతోనే ఉండేవారు. జిల్లా కో-ఆపరేటివ్ సొసైటి అధ్యక్షులుగా కొంతకాలం పనిచేసి, నిజాయతీపరునిగా పేరు గడించారు.


కాసు బ్రహ్మానందరెడ్డి

కాసు బ్రహ్మానందరెడ్డి వెంగళరెడ్డికి తమ్ముడు. కేంద్ర మంత్రిగా అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షునిగా, రాష్ట్ర ముఖ్యమంత్రిగా, రాష్ట్రమంత్రిగా ఎన్నోశాఖలు నిర్వహించి, అనుభవజ్ఞుడైన పరిపాలకుడిగా పేరు సంపాదించారు. మిత భాషి, మృదుభాషి, అన్నా తమ్ముడూ ఇద్దరిది ఒకే మాట, ఒకే బాట. సాగర్ డ్యాంపై క్రెస్ట్ గేట్లు సడీ చప్పుడు లేకుండా పెట్టించి సాగర్ ఆయకట్టును పెంచారు. చలనచిత్ర పరిశ్రమను భాగ్యనగరం వైపు మరలించారు. సౌత్ సెంట్రల్ రైల్వే మండలం ఆయనే ఏర్పాటు చేయించారు. ఫైనాన్స్ కమిటీ ఛైర్మన్‌గా ఉండి, కేంద్ర నిధులలో రాష్ట్రాలకు ఎక్కువవాటా ఇప్పించారు. వంశధారా ప్రాజెక్టు నిర్మాణానికి, డెల్టా డ్రెయినేజీస్కీముకు నిధు లిప్పించారు. ముఖ్యమంత్రిగా 7 సంవత్సరాలు పాతుకు పోయిన ఆయన తెలుగువారి సమైక్యత కోసం ఆ పదవిని త్యజించారు.


వెంకట రామయ్య చౌదరి

నరసరావుపేట ప్రాంతంలో మరొక ముఖ్యమైన రాజకీయ కుటుంబం నల్లపాటి వారిది జొన్నలగడ్డ. మద్రాస్ నుంచి విడిపోయి ఆంధ్ర రాష్ట్రం ఏర్పడగానే నల్లపాటి వేంకట్రామయ్య గారు రాష్ట్ర అసెంబ్లీకి తొలి స్పీకర్ అయ్యారు. ఆయన కుటుంబంలోని వారే నల్లపాటి చంద్రశేఖరరావుగారు. మృదుస్వభావి. ప్రస్తుతం కాంగ్రెస్‌పార్టీలో వున్నారు. జి.డి. సి.సి. ఛైర్మన్‌గానూ, జొన్నలగడ్డ మునుసబుగా, సర్పంచ్‌గా సేవలు అందించారు.

ఇదే గ్రామనికి చెందిన నంద్యాల కోటిరెడ్డి ఐదు దశాబ్దాలకు పైగా రాజకీయాలలో వున్నారు. ఆయన కాంగ్రెస్ సీనియర్స్‌లో ఒకరు. రాష్ట్ర కాంగ్రెస్‌లో బాధ్యతగల పదవి నిర్వహించారు. ప్రోటోకాల్‌కు, సీనియారిటీకి సముచిత స్థానం ఇవ్వాలంటారు. అలా జరుగకపోతే ఎవరినైనా నిలదీస్తారు. కార్యసాధకుడు కూడాను. ఆయనకు సమకాలికుడైన మహ్మద్ మొహిద్దీన్ మంచివక్త. చివరివరకు కాంగ్రెస్‌లో వుంటూ జిల్లా నాయకులతో స్నేహ సంబంధాలు నెరపేవారు.

నరసరావుపేట పార్లమెంట్ నియోజకవర్గానికి పార్లమెంట్ సభ్యులుగా బయటివారే తరచుగా ఎంపిక అవుతూ వచ్చారు. గుంటూరుకు చెందిన పారిశ్రామికవేత్త మద్ది సుదర్శనం కాంగ్రెస్ అభ్యర్థిగా రెండుమార్లు పార్లమెంట్‌కు ఎన్నికయ్యారు. ఆయన ఒకమారు తేళ్ల కృష్ణమ్మచౌదరిని, మరొకమారు యర్రం నరసింహారావును ఓడించారు. 1977 ఎన్నికలలో బ్రహ్మానందరెడ్డి బి.ఎల్.డి. అభ్యర్థి ఐ. కోటిరెడ్డిని ఓడించి పార్లమెంట్ సభ్యుడైనారు. 1980లో జరిగిన మధ్యంతర ఎన్నికలలో తెలుగుదేశం అభ్యర్థి కాటూరి నారాయణ స్వామి బ్రహ్మానందరెడ్డిని ఓడించారు. 1989లో జరిగిన ఎన్నికలలో కాసు వేంకటకృష్ణారెడ్డి టి.డి.పి. అభ్యర్థి పిడతల

రంగారెడ్డిపై విజయం సాధించారు. 1996లో జరిగిన ఎన్ని కలలో టిడిపి అభ్యర్థి కోట సైదయ్య కాసు వేంకటకృష్ణారెడ్డిపై


కాసు వెంకట కృష్ణారెడ్డి

విజయం సాధించారు. అనంతర కాలంలో ప్రస్తుత తమిళనాడు గవర్నర్ కొణిజేటి రోశయ్యగారు దివంగత నాయకులు జనార్దనరెడ్డి కాంగ్రెస్ తరపున పోటీచేసి పార్ల మెంట్‌కు ఎన్నికయ్యారు. ప్రస్తుతం రాయపాటి సాంబశివరావుగారు ఈ నియోజకవర్గానికి పార్ల మెంట్‌లో ప్రాతినిధ్యం వహిస్తున్నారు.

తొలినుండి నరసరావుపేట అసెంబ్లీ ఎన్నికల పర్వం రసవత్తరంగా సాగుతూవచ్చింది. 1946లో జరిగిన ఎన్నికల లో సి.పి.ఐ. అభ్యర్థి పులుపుల శివయ్యపై కాంగ్రెస్ అభ్యర్థి బ్రహ్మానందరెడ్డి విజయం సాధించారు. 1952 ఎన్నికలలో ప్రజాపార్టీ అభ్యర్థి నల్లపాటి వేంకట్రామయ్య కాంగ్రెస్ అభ్యర్థి కాసు వెంగళరెడ్డిపై విజయం సాధించారు. ఇదే ఎన్నికలలో పలనాడు నుండి బ్రహ్మానందరెడ్డి సిపిఐ అభ్యర్థి కోలా సుబ్బా రెడ్డిపై పోటీచేసి పరాజయం పొందారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడ గానే ప్రకాశం పంతులు ముఖ్యమంత్రి అయ్యారు. నల్లపాటి వేంకట్రామయ్య చౌదరి మొదటి స్పీకర్‌గా ఎన్నుకోబడ్డారు. ఆయన కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసి కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిపై విజయం సాధించారు. అదే ఎన్నికలలో బ్రహ్మానంద రెడ్డి ఫిరంగిపురం నియోజకవర్గం నుండి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసి సి.పి.ఐ. అభ్యర్థి ఎం.రెడ్డి రామిరెడ్డిని ఓడించారు. 1962లో ఉత్కంఠ భరితంగాను, తీవ్రంగాను జరిగిన పోటీలో స్వతంత్ర అభ్యర్థి జాగర్లమూడి చంద్రమౌళిని కొద్ది తేడాతో ఓడించారు. తిరిగి 1969లో ఆయన నరసరావుపేట నియో జకవర్గం నుండి స్వతంత్రపార్టీకి చెందిన కొత్తూరి వేంక


దొండేటి కృష్ణారెడ్డి

టేశ్వర్లుపై విజయం సాధించారు.

1972లో జరిగిన ఎన్నికలలో ఇదే నియోజకవర్గం నుండి కాంగ్రెస్ అభ్యర్థి దొండేటి కృష్ణారెడ్డి స్వతంత్ర పార్టీ అభ్యర్థి కొత్తూరివెంకటేశ్వర్లుపై విజయం సాధించారు. 1978లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ 'ఐ'కి చెందిన పి. శివరామ కృష్ణయ్యను, జనతాపార్టీ అభ్యర్థి కొత్తూరిని, ఇండిపెండెంట్‌గా పోటీచేసిన బ్రహ్మానందాన్ని ఓడించి కాసు వేంకటకృష్ణారెడ్డి కాంగ్రెస్ 'ఆర్' తరపున అసెంబ్లీకి ఎన్నికయ్యారు. ఆ తరువాత 1983, 1985, 1994, 1999లో జరిగిన ఎన్నికలలో డాక్టర్


డా॥ కోడెల శివప్రసాదరావు

కోడెల శివప్రసాదరావు తెలుగు దేశం పార్టీ అభ్యర్థిగా పోటీచేసి వరుసగా కాంగ్రెస్ అభ్యర్థులు బూచి పూడి సుబ్బారెడ్డి, కాసు వేంకట కృష్ణారెడ్డి, డాక్టర్ ముళ్లమూరి రాధాకృష్ణమూర్తి, దొడ్డా బాలకోటి రెడ్డి, కాసు వేంకటకృష్ణారెడ్డిలపై ఐదుసార్లు పరంపరగా విజయాలు సాధించారు. ఇది సాధారణమైన విజయం కాదు. అయితే ఆయన 2004, 2009లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థి కృష్ణారెడ్డి చేతిలో ఓడిపోయారు. కాసు వేంకట కృష్ణారెడ్డి చాలా సౌమ్యుడు. అవినీతికి దూరంగా ఉంటారు. ఎవ్వరితోను ఘర్షణకు దిగకుండా అందరిని కలుపుకొని పోయే మనస్తత్వం. ఆయన పదవుల కోసం పార్టీలు మార కుండా కాంగ్రెస్ పార్టీలో కొనసాగుతున్నారు. మంత్రి పదవు లను వివాద రహితంగా నిర్వహించారు.

ఇంక డాక్టర్ కోడెలను గురించి కూడా చెప్పుకొన వలసిన అవసరముంది. వీరు ఎన్.టి.ఆర్. ప్రోత్సాహంతో తెలుగుదేశంలో చేరారు. సర్జన్‌గా మంచి పేరుండేది. ఆయన బీద బిక్కని కనిపెట్టి పోయేవారు. స్వతహాగా చాల గుండె నిబ్బరం గల వ్యక్తి. సంక్షోభాలను ధైర్యంగా ఎదుర్కొనే స్థైర్యం ఉంది ఆయనకు. కాసువారిని ఆయన కాబట్టి ధైర్యంగా ఎదుర్కో గలిగారు. తన సమర్థత, పార్టీ నిబద్ధత, కార్యదక్షత వల్ల నియోజకవర్గంలోనే కాకుండా జిల్లాలోను, రాష్ట్రంలో కూడ మంచిపేరు సంపాదించారు. మంత్రిపదవులు సమర్థం గా నిర్వహించారు. 2014 అసెంబ్లీకి జరిగిన ఎన్నికల్లో నరస రావుపేట నియోజకవర్గం వదలటం ఆయనకు ఇష్టం లేక పోయినా పార్టీ ఆదేశం మేరకు సత్తెనపల్లి నుండి పోటీచేసి అంబటి రాంబాబును ఓడించారు. నవ్యాంధ్ర ప్రదేశ్ స్పీకరు గా, ఏకగ్రీవంగా ఎంపిక అయ్యారు. నరసరావుపేట మునిసి

పాలిటి శతవసంత ఉత్సవాల రూపశిల్పి. ఆయన వికాస కార్యక్రమాలను ఎన్నింటినో నరసరావుపేట, సత్తెనపల్లి నియోజక వర్గాలలో కొనసాగిస్తున్నారు, ప్రారంభిస్తున్నారు. నరసరావు పేటలో స్టేడియం, ఆడిటోరియం, ఓవర్ బ్రిడ్జిలు, రోడ్లవిస్తరణ, ఆదర్శ శ్మశాన వాటికల నిర్మాణం, పార్కుల నిర్మాణం, స్వచ్ఛతా కార్యక్రమ నిర్వహణ, మంచినీటి చెరువులు, కోటప్పకొండ దేవస్థాన అభివృద్ధి, రైల్వే అండర్ బ్రిడ్జి, మరుగుదొడ్ల నిర్మాణంపై దృష్టి కేంద్రీకరించారు.

2014లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో నరసరావు పేట నియోజకవర్గం నుండి వై.ఎస్. ఆర్. కాంగ్రెస్ అభ్యర్థి డా॥ గోపిరెడ్డి శ్రీనివాసరెడ్డి బిజెపి అభ్యర్థి డా॥ నలబోతు వేంకట్రావుపై ఘనవిజయం సాధించారు. డా॥ శ్రీనివాస రెడ్డి అనతి కాలంలోనే డాక్టర్‌గా మంచిపేరు సంపాదించారు. ఎన్నికల బరిలోకి దిగాలన్న తలంపుతో మైనారిటీ దళితవర్గాల వారిని మొదటినుండి దగ్గరకు చేరతీసుకున్నారు. వై.యస్.ఆర్. కాంగ్రెస్ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్నారు. దీనికితోడు దివంగత ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి అనుయాయివర్గం ఆయనకు బాగా అండగా నిలిచింది. డాక్టర్‌గా తీరిక లేకపోయినా ప్రజాహిత కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటూనే వున్నారు.



డా॥ జి. శ్రీనివాసరెడ్డి

అనుబంధ కళాశాలల అధ్యాపక సంఘ నాయకులుగా, శాసన మండలి సభ్యులుగా ప్రసిద్ధులైన శ్రీ ఎం.జె. మాణిక్యరావు మన నరసరావు పేట వాస్తవ్యులే.



ఎం.జె. మాణిక్యరావు

నరసరావుపేటకు చెందిన కాకుమాను పెదపేరిరెడ్డి విద్యార్థి దశనుండి ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొనేవారు. ఆంధ్రాయూనివర్సిటీలో ఉంటూ ఎందరో విద్యార్థులకు తన సేవలందించారు. ఆయన ఏ పార్టీలో వున్నా కార్యకర్తలతో సన్నిహితంగా మెలిగేవారు. పార్లమెంటుసభ్యులుగా ఎన్నికైన కొణిజేటి రోశయ్యగారు, నేదురుమల్లి జనార్దనరెడ్డిగారు, మేకపాటి రాజమోహనరెడ్డిగార్ల తరపున నియోజకవర్గంలో ప్రజల అవసరాలను తీరుస్తూ వుండేవారు. ఆయన రాష్ట్ర హ్యూమన్ రైట్స్ కమీషన్ సభ్యులుగా కూడా పనిచేశారు.

1963లో అధికార వికేంద్రీకరణ పథకం క్రింద పంచాయితీ సమితులు ఏర్పడ్డాయి. 1963-66లో జరిగిన పరోక్ష ఎన్నికలలో కామిరెడ్డి వేంకటేశ్వరరెడ్డి సమితి అధ్యక్ష పదవికి ఎంపిక అయ్యారు. దివంగత దొండేటి కృష్ణారెడ్డి కూడా రెండు సంవత్సరాలు సమితి రాజకీయాలలో ఉన్నారు. అప్పట్లో కాంగ్రెస్‌కు ఎదురే లేదు.1981లో ఎన్నికలు వచ్చాక తొట్టతొలుతగా సి.పి.ఐ.కి చెందిన పోపూరి బ్రహ్మానందం కాంగ్రెస్ అభ్యర్థిపై గెలుపొంది సమితి అధ్యక్షు లయ్యారు.

కాంగ్రెస్ పార్టీ పటిష్ఠతకు పాటుపడిన నాయకులలో శ్రీ కపలవాయి కాశీరామారావు, శ్రీ పొన్నపాటి పేరిరెడ్డి, శ్రీ ముద్దా ఆంజనేయులు, అలాగే తెలుగుదేశం పార్టీ పటిష్ఠత కోసం పాటుపడిన నాయకులలో శ్రీ వనమా సుబ్బారావు, శ్రీ నాగసరపు సుబ్బరాయగుప్త మొదలైనవారు గణనీయులు.

స్వాతంత్ర్యం వచ్చిన తొలిరోజుల్లో ప్రతిచోట ప్రతి ఎన్నికల్లో కాంగ్రెస్ వారే తరచుగా గెలుస్తూవచ్చారు. కాంగ్రెస్‌కు మంచి పేరున్న రోజులవి. ఆ తరువాత ఎన్నికలలో ధన ప్రభావం ఎక్కువై సిద్ధాంత రాజకీయాలు వెనుకంజ వేశాయి. ఆ తరువాత రాజకీయాలలో కులప్రభావం ఎక్కువగా పని చేసింది. ఇపుడిపుడే ఎన్నికల రాజకీయాల ధోరణి మారుతున్నది. అభివృద్ధి కార్యక్రమాలను సమర్థవంతంగా అమలు చేయగల్గిన నాయకులను మాత్రమే ఎన్నుకోవాలన్న ధోరణి ప్రజలలో ప్రారంభమైంది. రాజకీయాలకు ప్రజలకు మంచి రోజులు రావచ్చు. ఓపికతో ఎదురు చూద్దాం! కొన్ని లోపాలున్నా ప్రజాస్వామ్యం నానాటికి బలపడుతున్న సూచనలే కనిపిస్తున్నాయి!

ప్రజాస్వామ్యం బ్రతికున్నంత కాలం రాజకీయాలు ఎప్పుడూ నడుస్తూనే ఉంటాయి.

- మహాత్మాగాంధీ

# అబ్బా! ఆంధ్రుడు అంత గొప్పవాడా?!



గోపరాజు నాగేశ్వరరావు
కథా, నవలా రచయిత

అప్పుడు 1997లో జరిగిన మన నరసరావుపేట ద్విశతాబ్ది ఉత్సవసభలో అప్పటి గవర్నరు కృష్ణకాంత్‌గారు మాట్లాడుతూ 'అన్నాప్రగడ కామేశ్వరరావుగారు పుట్టిన ఈ ప్రాంతానికి రావటం తనకు మహదానందంగా ఉం'దని చెప్పారు. చెప్పగానే 'ఔరా! అంతటి విప్లవవీరుడా ఆ అన్నాప్రగడ?' అని ఇక్కడి వాళ్లంతా ఆశ్చర్యపోయారు. అదలా కథలా ఆరా తీస్తే అప్పటి నాదెండ్ల గ్రామకరణం గారైన అన్నాప్రగడ రోశయ్యగారి కుమారుడే ఈ కామేశ్వరరావు.

కామేశ్వరరావు యుక్తవయసు రాగానే 'బ్రిటీష్-ఇండియా' సైన్యంలో చేరి యుద్ధవిద్యలు నేర్చుకొని సైన్యంలో తిరుగుబాటు తెచ్చేందుకు ప్రయత్నించారు. అందుకుగాను మిలిటరీ కోర్టుమార్షల్ ద్వారా వారికి ఉరిశిక్ష విధించబడింది. బ్రిటిష్ వలసదేశాల్లో పెల్లుబికిన ఆగ్రహావేశానికి భయపడ్డ బ్రిటీష్ ప్రభుత్వం ఆ ఉరిశిక్షను రద్దుచేసి ఆయనగార్ని సైన్యం నుంచి తొలిగించివేసింది. నాదెండ్ల గ్రామానికి చేరుకున్న అన్నాప్రగడ చుట్టుపట్ల గ్రామాల్లో సహాయనిరాకరణ ఉద్యమాన్ని చేపట్టి, ఏలినవారి ఆగ్రహానికి గురై అప్పటి నరసరావుపేట సబ్‌కలెక్టరు జంబునాథ్‌అయ్యర్ ఉత్తర్వుల మేరకు రాజ మండ్రి సెంట్రల్ జైల్లో శిక్ష అనుభవిస్తున్నారు. అక్కడే ఖైదీలుగా వున్న గదర్ విప్లవవీరులు పృథ్వీసింగ్ పరిచయంతో విప్లవపంథా అనుసరించి జైల్నించి విడుదల కాగానే స్వాతంత్ర్యంకోసం విప్లవపోరాటం ప్రారంభించారు.

లాహోరు కుట్రకేసులో అన్నాప్రగడ కూడా నిందితుడై బరోడా మహారాజు శామోజీరావ్ గైక్వాడ్ సహకారంతో పోలీసుల బారి నుంచి తప్పించుకొని తలదాచుకునేందుకు తరలిరాగా వారికి ఆశ్రయం ఇవ్వటానికి భయపడి 'దేశభక్త' కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ నిరాకరించారు. ఆర్యవైశ్య ప్రముఖుడు నాళం మిట్టపల్లి, అన్నాప్రగడకు, భార్య సరళాదేవికి మాచర్ల వద్ద గల ఎత్తిపోతలలో రహస్యంగా ఆశ్రయం కల్పించారు.

స్వాతంత్ర్యానంతరం తొలిసారి గుంటూరు రూరల్ అసెంబ్లీ నియోజకవర్గం నుంచి శాసనసభకు ఎన్నికైన అన్నాప్రగడ ఉరవడిగా శాసనసభలో మంత్రుల అవినీతిపై అనేక విమర్శలు చేశారు. 'అంకుశం' పత్రిక ప్రారంభించి అక్షరాల ఆయుధాలతో స్వదేశీదొంగలపై యుద్ధం ప్రకటించారు. అనంతరం జరిగిన ఎన్నికల్లో వారికి కాంగ్రెస్‌వారు సీటు నిరాకరిస్తే, అలాగే కోలవెన్ను రామకోటేశ్వరరావుగారినీ దూరం పెడితే అది తప్పని అప్పటి కాంగ్రెస్ పీఠాధిపతులను ధిక్కరించి గొంతు విప్పినవారు కపలవాయి కాశీరామారావు గారొక్కరే!

అలా స్వాతంత్ర్యం వచ్చీ రాగానే అంతకుముందు తెల్లదొరల పాలన భేషుగ్గానే వుందన్న వాళ్లు, విదేశీ పాలకుల బూట్లు నాకిన బానిసబుద్ధులవాళ్లు హడావిడిగా దర్జీలను తొందరపెట్టి కుట్టించుకున్న ఖద్దరువేషాలతో కాంగ్రెస్ కార్యాలయాల వద్ద బారులు దీరి నిల్చొని చట్టసభల్లో సీట్లకోసం పోటీపడిన వాళ్లే పైచేయి సాధించుకొన్నారు.

తెలుగుగడ్డ మీద, అందునా గుంటూరు నేల మీద పెరిగిన గంజాయి వనాన్ని తట్టుకోలేక అన్నాప్రగడ అనే ఆ తులసి మొక్క ఇక్కడ్నించి తరలిపోయి పూనే నగరంలో స్థిరపడిపోయింది. ఈ ఆంధ్రుడికి ఆ అందించిన స్నేహహస్తం అభినందనీయం.

రష్యాలో కుతుబ్ యూనివర్సిటీలో స్టాలిన్ సరసన కూర్చొని విప్లవాభినందనలు అందుకున్న, నిఖార్సయిన భారతీయ విప్లవయోధుడని ప్రపంచ దేశాలు కీర్తించినా, ఒక తడవ శాసనసభ్యుడిగా పదవి విధులు నిర్వహించినా సొంత

ఇల్లంటూ లేని అన్నాప్రగడకు అప్పటి భారతప్రధాని స్వర్గీయ ఇందిరాగాంధీ స్వయంగా పూనుకొని పూనే నగరంలో (41సి, ఐ.సి.ఎస్. కాలనీ) ఇల్లు కట్టించి బహూకరించి ఆ దేశభక్తుడి రుణం తీర్చుకున్నారు. డెహ్రాడూన్‌లో అఖిల భారత విప్లవ కారుల సభ జరిపించి, దానికి అన్నాప్రగడను అధ్యక్షుడిగా నియమించి స్వాతంత్ర్య పోరాట వీరులకు పెన్షన్లు, స్థలాలు, ఉచిత ప్రయాణ సౌకర్యాలు కల్పించారు. అన్నాప్రగడ స్వర్గీయ భగత్‌సింగ్ తల్లిగారైన విద్యావతిగారి పాదాలకు నమస్కరించటంతో ఆమె చనిపోయిన తన కుమారుడు భగత్‌సింగ్‌ను అన్నాప్రగడలో చూసుకొని కన్నీళ్లు రాల్చారు. అలాగే విప్లవకారుల మహాసభ గుంటూరు నగరంలో కూడా జరిపించాలనీ, అలాంటి త్యాగధనులను కళ్లారా చూచి తరించాలనీ ప్రయత్నాలు చేసినా చివరి నిమిషంలో ఆ సభ రద్దయింది.



పండిట్ జవహర్‌లాల్ నెహ్రూతో అన్నాప్రగడ కామేశ్వరరావు

అంతటి విశ్వవ్యాప్త కీర్తి గడించిన ఆ త్యాగధనుడు అన్నాప్రగడ 1987, జనవరి 30న పూనే నగరంలోనే అంతిమశ్వాస విడిచిపెట్టి అనంత లోకాలకు తరలిపోయారు.

## గాంధీ మార్గ సంచారిణి



ఇనగంటి అరుణకుమారి, ఎకనమిక్స్ లెక్చరర్

నరసరావుపేట వాస్తవ్యులైన ఘంటా వీరరాఘవయ్య గారి ధర్మపత్ని మల్లికాంబగారు. కృష్ణా జిల్లా, గుడివాడ సమీపంలోని పోలుకొండ ఆమె పుట్టిన ఊరు. వీరిది వ్యవసాయ కుటుంబం.

**స్వాతంత్ర్య సమరంలో** : 1930 జులై 7న మల్లికాంబగారు, ఆమె భర్త వీరరాఘవయ్యగారురాజమండ్రిలో ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. ఈ దంపతులు ఆరునెలలు కారాగారవాసం చేశారు. ఆ సత్యాగ్రహ సమయంలో బాపూజీ జోలె పడితే ఎందరో వనితలు ఒంటిమీది నగలను ఆ జోలెలో వేశారు. మల్లికాంబగారు ఆ కార్యక్రమంలో ముందడుగు వేశారు.

మల్లికాంబగారు, ఆమెభర్త ఏడాది కొడుకుతో సహా రెండేళ్లు రాజమండ్రి, రాయవెల్లూరు, కన్ననూరు జైళ్లలో గడిపారు. 1932 మే 2న శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నందుకు పడిన శిక్ష ఇది. భర్త ఒక సెల్‌లో, భార్యా పిల్లవాడూ మరో సెల్‌లో ఉన్నారు. ఏడాది పసివాడూ బాలఖైదీగా శిక్షను అనుభవించాడు. జైలులో పురుగుల అన్నం తినవలసి వచ్చింది.



ఘంటా మల్లికాంబ

**జీవన విధానం** : 'విదేశవస్తువుల్ని బహిష్కరించాలి, స్వదేశ వస్తువుల్నే వాడాలి. చేనేత బట్టలనే కట్టుకోవాలి. కూరగాయ లను సొంతంగా పండించుకొని తినాలి. ఆవుపాలు తాగాలి. ఇంట్లో తయారయ్యే నెయ్యితోనే వంటలు చేసుకోవాలి. సాత్వి కాహారమే భుజించాలి' అనే గాంధీమహాత్ముడి సూత్రాల్ని తూచా తప్పకుండా మల్లికాంబ దంపతులు పాటించారు. వారు తమ వ్యవసాయంలో సేంద్రియ పద్ధతులు పాటించారు. దంపుడుబియ్యం భోజనం, ఆవు నెయ్యి వంటలు, ఖద్దరు ధారణ పాటించారు.

మల్లికాంబ దంపతులు స్వాతంత్ర్య సమర యోధు లయినందువల్ల ప్రభుత్వం విశాఖనగర సమీపంలో మురికివలసలో భూమి ఇచ్చింది. వీర రాఘవయ్యగారు దివంగతు లయ్యారు. ప్రస్తుతం 83 సంవత్సరాల కుమారుడు రామ మోహనరావుతో, కోడలుతో కలిసి అక్కడ నివసిస్తున్నారు 106 సంవత్సరాల మల్లికాంబ గారు. మన మునిసిపాలిటీ కన్నా 6 సంవత్సరాలు పెద్ద అయిన మల్లికాంబగారికి అభినందనలు, అభివందనాలు.

# మన మహిళామణులు



## శ్రీమతి బెల్లంకొండ శివకుమారి

ఉపాధ్యాయిని

'ము'దితల్ నేర్వగరాని విద్యగలదే? ముద్దార నేర్పించినన్!' అని చిలకమర్తివారు సెలవిచ్చారు. తమతమ రంగాలలో విజయబావుటా లెగురవేసి కీర్తి శిఖరాల నధిరోహించిన మన ఊరి మహిళామణులను గురించి ముచ్చటించుకొందాం!

నరసరావుపేట జమీందారు శ్రీరాజా మల్రాజు వేంకట గుండారాయనింగారి పట్టపురాణి లక్ష్మయ్యమ్మారావు భర్త మరణానంతరం నరసరావుపేట సంస్థానానికి అధికారిణియై ప్రజలను కన్నబిడ్డలవలె పాలించారు. 1832వ సంవత్సరంలో అనావృష్టివలన తీవ్రమైన కరవు ఏర్పడి ప్రజలు ఆకలితో అలమటిస్తుంటే లక్ష్మయ్యమ్మారావుగారు తమ ధాన్యాగారంతో పాటు సుదూరప్రాంతాలనుండికూడా ధాన్యాన్ని తెప్పించి ప్రతిరోజూ గంజి కాయించి, ప్రజలకు పోసి వారిని ఆదుకొన్నారు. శ్రీ రాజా మల్రాజు వేంకట రామకృష్ణకొండలరావుబహద్దర్‌గారి పుత్రిక ప్రేమధాత్రీదేవి మంచి విదుషీమణి. బహుభాషాకోవిదురాలు. శ్రీరాజా మల్రాజు వేంకటకృష్ణగుండా రావుగారి పుత్రిక రాణీరమాసమీరాదేవి విద్యావినయ సంపన్న. వన్యమృగ సంరక్షణ, అరణ్యోద్ధరణ వీరి ధ్యేయాలు.

నరసరావుపేటలో మొట్ట మొదటి ఎం.బి.బి.ఎస్. మహిళా వైద్యు రాలు శ్రీమతి అనిశెట్టి పద్మావతిగారు. శ్రీమతి పాలడుగు అన్నపూర్ణమ్మగారు, డా॥ కమలమ్మగారు, డా॥పి. అనూరాధగారు, డా॥ కృష్ణకుమారిగారు గొప్పగా వైద్యసేవల నందించి ప్రజాభిమానాన్ని చూరగొన్నారు. డా॥ పోపూరి భాస్కరలక్ష్మి, డా॥ పోపూరి రమారాణి, డా॥ టి. రమాదేవి, డా॥ సి. గౌతమి, డా॥ పి.సరస్వతి, డా॥ జోసఫీన్, డా॥ జి.సునీత, డా॥ సాయిలక్ష్మి, డా॥ చారులత, డా॥ జి. విజయలక్ష్మి, డా॥ జి. నాగమణి, డా॥ బి. పార్వతి, డా॥ సలీమాబేగం, డా॥ సుస్మిత, డా॥ వసంత, డా॥ ఎమ్. ప్రతిమ, డా॥ కె.భారతి, డా॥ జి. దుర్గాంబ, డా॥ ఎన్. సౌజన్య, డా॥ శిరీషాయజ్ఞం, డా॥ సి.హెచ్. పూర్ణిమా శ్రీదేవి, డా॥ చెరుకూరి నీలిమ మొదలయినవారు నేడు విశేషమైన వైద్యసేవల నందిస్తున్నారు.



శ్రీమతి రాజేశ్వరమ్మ

1989లో సెయింట్ ఆన్స్ సొసైటీ వారిచేత నవ చైతన్య మల్టీపర్పస్ మహిళా ఆరోగ్య కార్యకర్తల స్కూల్ ప్రారంభమైంది. సిస్టర్ పాల్‌థెరిసా ఈ సంస్థకు ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. 1960లో స్థాపించిన మున్సిపల్‌బాలికల ఉన్నత పాఠశాలకు శ్రీమతి టి. రాజేశ్వరమ్మగారు మొదటి ప్రధానో పాధ్యాయిని. వీరు క్రమశిక్షణకు, పరిపాలనా దక్షతకు మారు పేరుగా ప్రజల ప్రశంసల నందుకున్నారు. రాజేశ్వరమ్మగారు 'విదురనీతి' అనే గ్రంథాన్ని రచించారు. జి. వసుంధరాదేవి గారు మున్సిపల్ బాలికోన్నత పాఠశాలకు ప్రధానోపాధ్యాయి నిగా బాధ్యతలు చేపట్టి, 1985లో పాఠశాల రజతోత్సవాలను నిర్వహించారు. తరువాత శ్రీమతి టి. జయమణి, శ్రీమతి వై. భారతీలక్ష్మీదేవి ప్రతిభావంతమైన సేవల నందించారు. ప్రస్తుతం శ్రీమతి ఎం. సులేఖ ఆ బాధ్యతలను నిర్వహిస్తున్నారు. మున్సిపల్ బాలుర ఉన్నతపాఠశాలకు శ్రీమతి సుబ్బమ్మగారు, శ్రీమతి సర్వలక్ష్మిగారు, శ్రీమతి పి. జ్యోతిగారు ప్రధానోపాధ్యాయినులుగా బాధ్యతలను నిర్వహించారు. అంధుల పాఠశాలయందు ఎల్.హెచ్. భారతి ప్రధానోపాధ్యాయినిగా పనిచేసి, మంచి గుర్తింపును పొందారు. మదర్ ఏ. మేరీస్టెల్లా మొదటి ప్రిన్సిపల్‌గా సెయింట్ ఆన్స్ మహిళా జూనియర్ కళాశాల 1987లో ప్రారంభించబడింది. 1883లో ప్రారంభమైన హర్డు పాఠశాలకు శ్రీమతి బాలసుందరమ్మ

మొదటి ప్రధానోపాధ్యాయిని. అనంతరం 1957లో శ్రీమతి


శ్రీమతి జి.ప్రభావతి

జి. ప్రభావతి ప్రతిభావంతమైన సేవలందించారు. శ్రీమతి నాయని కృష్ణకుమారి ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు విభాగంలో అధ్యాపకురాలిగా, ఆచార్యురాలిగా, తెలుగు విశ్వవిద్యాలయానికి ఉపకులపతిగా కూడా ఖ్యాతి గాంచారు.

కార్పొరేట్, ప్రయివేట్, ప్రభుత్వరంగ విద్యా సంస్థలలో మహిళలు ప్రిన్సిపాల్స్‌గా, లెక్చరర్స్‌గా, ప్రధానోపాధ్యాయినులుగా, సాంకేతిక నిపుణలుగా విలువైన సేవల నందిస్తున్నారు.

నరసరావుపేట వాలీబాల్ హోంటీమ్‌లో జ్యోతి మంచి విజయాల నందివ్వగా, అథ్లెటిక్స్‌లో షేక్ రఫీదాబీ జావలిన్‌త్రో, షాట్‌పుట్ క్రీడల పోటీలలో పాల్గొని, రాష్ట్ర స్థాయిలోనే కాక జాతీయస్థాయిలో కూడా ఎన్నో పతకాలను సాధించింది. లక్కు అనితారెడ్డి జిమ్నాస్టిక్స్ నందు అంతర్జాతీయ స్థాయి గుర్తింపును పొంది రాష్ట్రప్రభుత్వ సన్మానాన్ని అందుకుంది.

బెల్లంకొండ రాఘవరావుగారి సతీమణి శ్రీమతి కనకమ్మ శ్రీరామలింగ ప్రతిష్ఠ అనే ఏకసర్గ ప్రబంధాన్ని సంస్కృతంలో రచించిన విదుషీమణి.

ఎన్నో నవలలు, కథలు వ్రాసి బీనాదేవిగా సాహితీ లోకానికి చిరపరిచితురాలైన శ్రీమతి బాలాత్రిపురసుందరమ్మగారు 1967-'70 ల మధ్య కథారచన చేశారు. శ్రీమతి సునందాభార్గవి మంచి నవలా రచయిత్రి.

1922లో జరిగిన సహాయనిరాకరణ ఉద్యమంలోనూ, ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలోనూ పాల్గొని కారాగార శిక్షలను అనుభవించిన మహిళామణి మాజేటి శేషమాంబ. ఈమె మాజేటి పూర్ణచంద్రరావుగారి సోదరి.

సాంప్రదాయక కుటుంబ నేపథ్యం నుండి వచ్చిన కనుపర్తి హనుమాయమ్మ ఫిరంగిపురం - పేరేచర్ల పికెటింగ్‌లో పాల్గొని జైలుకు కూడా వెళ్లారు. కాసు రాఘవమ్మ, కోలవెన్ను సీతామహాలక్ష్మమ్మ, తాడేపల్లి సంపూర్ణమ్మ, కొండా అలివేలు సత్యవతమ్మగార్లు గాంధీజీ పిలుపుకు ప్రభావితలై నూలు వడికేవారు.

20వ శతాబ్దపు ఉత్తరార్ధంలో శ్రీమతి మాలినీదత్తు వైస్‌ఛైర్మన్‌గా పనిచేశారు. 2001-'05లో శ్రీమతి జి. జోగేశ్వరమ్మ, 2005-'10 లో శ్రీమతి కె. రోశమ్మ మునిసిపల్ ఛైర్‌పర్సన్లుగా తమ సేవల నందించారు. శ్రీమతి ఘంటా మల్లికాంబ,ఉప్పుసత్యాగ్రహంలోనూ, శాసనోల్లంఘన ఉద్యమంలోనూ పాల్గొని, భర్త, చంటిబిడ్డతో జైలు శిక్షననుభవించారు.

మహంకాళి సుబ్రహ్మణ్యంగారి సతీమణి పార్వతి కమ్యూనిస్టు ఉద్యమాలకు బాసటగా నిలిచింది. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న మరొక నరసరావుపేట మహిళ శ్రీమతి కల్లం గోవిందమ్మ.

స్వాతంత్ర్యానంతరం కూడా నరసరావుపేట మహిళలు రాజకీయ చైతన్యస్ఫూర్తిని ప్రదర్శించారు. భారతీయ జనతాపార్టీ కొరకు శ్రీమతి యన్నం (పులిం) బాలసరస్వతి పనిచేశారు. నందమూరి తారకరామారావుగారిని వివాహమాడిన శ్రీమతి లక్ష్మీపార్వతిగారు తెలుగు సాహిత్యమున చక్కని రచయిత్రి, ఉపన్యాసకురాలు.

శ్రీలక్ష్మీ నాట్యమండలి అనే నాటక సమాజం ద్వారా 3,800 ప్రదర్శనలిచ్చిన నటీమణి శ్రీమతి లతాలక్ష్మి. శ్రీమతి పరగటిచర్ల భానుమతి చంద్రమతి, చింతామణి, మొదలైన స్త్రీపాత్రలనే కాకుండా, పాండవోద్యోగం ప్రథమాంకంలో కృష్ణుడు, హరిశ్చంద్ర నాటకంలో హరిశ్చంద్రుడు మొదలైన పురుష పాత్రలను కూడా ధరించిన నటీమణి. మెట్టెల పరమేశ్వరి నర్తనశాల, ఉత్తరగోగ్రహణం మొదలైన కథలను మనో రంజకంగా చెప్పగల హరికథా భాగవతారిణి. రంగస్థలం నుండి సినీ వినీలాకాశంలో మెరిసిన తార లక్ష్మీరాజ్యం. నటిగా, దర్శకురాలిగా బహుముఖ ప్రతిభను చాటిన విజయనిర్మల నరసరావుపేటవారే! మరొకమంచి సినీ, నాటక కళాకారిణి సింధుజ. దూరదర్శన్‌లో దర్శనమిచ్చే నటీమణులు శోభారాణి, శిల్పాలు మన పట్టణానికి చెందినవారే!

షహీదా, వహీదా అనే సోదరీమణులు ఇద్దరూ డాన్స్ పార్టీల స్థాయి నుండి, నాటకరంగం వరకూ ఎదిగారు. వహీదా చింతామణి, సత్యహరిశ్చంద్ర మొదలైన నాటకాల లోని పద్యాలను శ్రావ్యంగా ఆలపించేది.

కొక్కిలిగడ్డ వసంతకుమారి తులాభారం నాటకంలో సత్యభామ పాత్రను చక్కగా పోషించేది. వీరి కుమార్తె కారు మంచి విజయలక్ష్మి ప్రముఖ నర్తకి.

సీనియర్ శివకుమారి, జూనియర్ శివకుమారి డాన్స్, మ్యూజికల్ పార్టీలలో ఆడి పాడినవారే! నరసకుమారి వీరి మ్యూజికల్ పార్టీలోనే ఉన్న మంచి కళాకారిణి.

సీనియర్ కల్యాణి అసలు పేరు ఖాసింబి. అరవపల్లి సుబ్బారావుగారి చింతామణి నాటకంలో చిత్ర పాత్రను పండించటంలో ఈమెకు సాటిలేరు. గుడివాడ రమణకుమారి, బేగంలు ఆనాడు అత్యంత ప్రజాదరణ పొందినవారే.

1939లో రామిరెడ్డిపేటలో స్థాపించబడిన రుక్మిణీ స్త్రీసమాజానికి శ్రీమతి ఐ. నరసాయమ్మ అధ్యక్షురాలు. శ్రీమతి జంపాల హరికుమారి 1981లో ఇన్నర్‌వీల్ క్లబ్ ఛైర్‌పర్సన్‌గా, శ్రీమతి మేళ్లచెర్వు మల్లికాంబ కార్యదర్శిగా పనిచేశారు. తర్వాతి కాలంలో మల్లికాంబగారు డిస్ట్రిక్ట్ ఛైర్‌పర్సన్‌గా పనిచేశారు. శ్రీమతి ఎ. అనూరాధగారు కూడా డిస్ట్రిక్ట్ ఛైర్ పర్సన్‌గా పనిచేశారు. శ్రీమతి ఎం. కస్తూరిగారు దశాబ్ద కాలంగా వకుళమాధవీ వృద్ధాశ్రమాన్ని నిర్వహిస్తూ ఎందరో వృద్ధులను ఆదరిస్తున్నారు. వీరు ఇన్నర్‌వీల్‌క్లబ్‌లో ఎన్నో పదవు లను నిర్వహించి సమాజానికి తమ సేవల నందించారు.

శ్రీ సీతారామాంజనేయ దేవస్థానాన్ని, 1905లో వంగల ఆదిలక్షమ్మ అనే భక్తురాలు నిర్మింపజేసింది. గుగ్గిలం రాఘవమ్మ ఆలయగోపుర నిర్మాణం చేయించి 1936లో స్వామివారి ప్రతిష్ఠామహోత్సవాలను నిర్వహించారు.

న్యాయవాదుల సంఘంలో చేరిన మొదటి మహిళ శ్రీమతి వై. బాలసరస్వతి. శ్రీమతి పుల్లెల అలివేలమ్మ, శ్రీమతి సుధారాణి, శ్రీమతి డి. శాంతకుమారి, శ్రీమతి పి. రామలక్ష్మి, శ్రీమతి నసీమా రాజశేఖర్, శ్రీమతి జాగర్లమూడి విజయ మొదలైన మహిళలు వాదనాపటిమ గల న్యాయవాదినులుగా పేరుపొందారు.

చరిత్రపుటలకు చిక్కిన కథలు కొన్నే! కాలపు పొరలలో మణిగినవి మరెన్నో! అక్షరాలసాక్షిగా చరితార్థులుగా కీర్తించబడిన మగవారి వెనుక మాత్రమే కాదు! తమకు తాము ముందుండి సమాజసేవ చేసినవారు ఇంకా ఎందరో!!



# న్యాయస్థానాలు, న్యాయవాదులు

*"Justice is the conscience of the whole of humanity"*






అ(ద్రూరి రమేష్
డివిజనల్ ఇన్‌ఛార్జి, ఆంధ్రభూమి

మోదుగుల ఆరోగ్యం చౌదరి
న్యాయవాది


నరసరావుపేట గడ్డమీద మున్సిఫ్ మెజిస్ట్రేట్ కోర్టు ప్రారంభమై నూరేళ్ళు నిండిన చారిత్రాత్మక సంఘటన నేపథ్యం లో శతాబ్ది ఉత్సవాలను అమితోత్సాహంగా నరసరావుపేట న్యాయవాదులు ఈ మధ్యనే జరుపుకోవటం చూస్తే నరసరావు పేట పట్టణ జీవితకాలంలో సగభాగస్వామ్య చరిత్ర న్యాయ వాదులకు ఉండటం యాదృచ్ఛికమైనప్పటికీ, అంతటి సుదీర్ఘ చరిత్ర పట్టణంతో పెనవేసుకుపోవటం మాత్రం విశేషాంశమని చెప్పుకోక తప్పదు.

అట్లూరు కాస్తా నరసరావుపేటగా మారింది. నరస రావుపేటగా పిలవబడటం ప్రారంభమయ్యాక 1891లో కారంపూడి నుండి ప్రప్రథమముగా న్యాయస్థానం పట్టణంలో కాలూనింది. ఆ న్యాయస్థానమే "మునసబ్ కోర్టు".

న్యాయస్థానం నరసరావుపేట చేరుకోగానే ప్రజా నీకం, ప్రముఖుల ఆహ్వానం మేరకు తొలినాటి న్యాయవాద కుటుంబాలు కొన్ని మచిలీపట్నం నుండి తరలివచ్చి పట్టణంలో స్థిరపడ్డాయి. ఆ కుటుంబీకుల వారసులు ఈనాటికి న్యాయ వాద వృత్తిలో ఉండటం అత్యంత విశేషం. అక్కడినుండి ఆరంభమైన న్యాయవాదుల వృత్తి జీవనం, అత్యంత ప్రతిభా సంపన్నులైన న్యాయవాదులతో పరిఢవిల్లింది.

నరసరావుపేట డిప్యూటీ కలెక్టర్ కార్యాలయాన్ని ప్రారంభించాక, ఇక్కడ కోర్టు లేకపోవడం సరికాదని, పల్నాటి ప్రాంతమైన కారంపూడిలోని జిల్లా మునసబ్ కోర్టును 1891లో నరసరావుపేటకు మార్చారు. నరసరావుపేట–సత్తెనపల్లిరోడ్‌లో ప్రస్తుతం ఉన్న వాసవీ కన్యకాపరమేశ్వరి కళ్యాణమండపంలో మున్సిఫ్ కోర్టు ప్రారంభమైంది. 1894లో ప్రస్తుత ప్రిన్సిపల్ సీనియర్ సివిల్ జడ్జి కోర్టు భవనమును నిర్మించి మున్సిఫ్ కోర్టును కోట ప్రాంతం నుండి నూతన భవనంలోకి మార్చారు.

స్వాతంత్ర్యానంతరం నరసరావుపేటకు 'సబార్డినేట్ జడ్జి కోర్టు' మంజూరైంది. ఈ కోర్టు ప్రస్తుతం మండల పరిషత్ కార్యాలయ భవనంలో 1949 అక్టోబర్ 1న ప్రారంభమైంది. 1892లో ఆరంభించిన మున్సిఫ్‌కోర్టు శతాబ్ది ఉత్సవం జరుపు కోగా సబార్డినేట్ జడ్జికోర్టు స్వర్ణోత్సవాలు జరుపుకో నుందన్న మాట. 1958లో జుడిషియల్ ఫస్ట్ క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టు మంజూరై, ఇది ప్రస్తుతం ఎక్సైజ్ కార్యాలయం ఉన్న భవనంలో ఆరంభమైంది. జనాభాపెరుగుదల, పరిసరప్రాంతాల విస్తరణ ఫలితంగా, 1970లో పట్టణ న్యాయస్థానాలకు అదనంగా రెండవ అదనపు జిల్లా మున్సిఫ్ మెజిస్ట్రేట్‌కోర్టు కూడా వచ్చి చేరింది. కోర్టు తొలుత అద్దెభవనంలో ప్రారంభమైనప్పటికీ 1982లో నూతనంగా నిర్మించిన న్యాయస్థాన భవనంలోకి తరలించారు. జుడిషియల్ సెకండ్ క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టు 1981లో ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టుగా ఉన్నతీకరించబడి అది కాస్తా మూడవ అదనపు మున్సిఫ్ మేజిస్ట్రేట్ కోర్టు అయ్యింది. ఈ మూడవ అదనపు మున్సిఫ్ మేజిస్ట్రేట్ కోర్టు 1987లో చిలకలూరిపేటకు తరలించడంతో మొదటి అదనపు మున్సిఫ్ మేజిస్ట్రేట్ కోర్టు ఈ భవనంలోకి మార్చటం జరిగింది. 1974 లో పట్టణ న్యాయస్థానాలకు అదనంగా అదనపు సబార్డినేట్ జడ్జి కోర్టు కూడా మంజూరైంది. 1988లో నూతనంగా నిర్మించిన న్యాయస్థాన భవనాలకు మొదటి అంతస్థు అదనపు నిర్మాణం కావటంతో ప్రథమ జిల్లా మున్సిఫ్‌కోర్టు అందులోకి తరలించారు. పల్నాటి ప్రాంతపు ప్రజలకు అనుకూలంగా లేనందున, ఆ ప్రాంత వివాదాలు, నేరాలు ఎక్కువ కావటంతో అనేక సంవత్సరాలుగా ఆ ప్రాంత న్యాయవాదులు, ప్రజలు నుండి వస్తున్న విజ్ఞప్తుల మేరకు నరసరావుపేటలోని అదనపు ప్రిన్సిపల్ సబార్డినేట్ జడ్జి కోర్టు గురజాలకు తరలించారు. అనంతరం నరసరావుపేటలో ఉన్న ఫాస్ట్ ట్రాక్ జిల్లా జడ్జి కోర్టును కూడా గురజాలకు 2013లో తరలించారు.

శతాబ్దిపైగా చరిత్రగల నరసరావుపేట బార్ అసోసి

యేషన్ 1894లో పదిమంది న్యాయవాదులతో ప్రారంభ మైంది. అయితే నరసరావుపేట న్యాయవాదుల సంఘాన్ని ఏర్పరిచిన తొలినాటి వ్యవస్థాపక సభ్యులెవ్వరో తెలియటం లేదు. పరిశోధనఫలితంగా బందర్ నుండి నరసరావుపేటకు వచ్చి స్థిరపడిన ఇరువురి పేర్లుతప్ప మిగిలిన 8 మంది న్యాయ వాదు లెవ్వరో తెలియరాలేదు. శ్రీ తాడేపల్లి ఆంజనేయశాస్త్రి ఒకరుకాగా, మరొకరు శ్రీ కోలవెన్ను వియ్యన్న పంతులు. శ్రీ ఆంజనేయశాస్త్రి కుమారుడు శ్రీ సంపూర్ణలక్ష్మీనారాయణ కూడా 53 సంవత్సరాలు న్యాయవాదిగా పనిచేసారు. ఆయన నరసరావుపేట పురపాలక సంఘం ఛైర్మన్‌గా బాధ్యతలు నిర్వర్తించటమే కాకుండా, ప్రభుత్వ న్యాయవాదిగా వ్యవహ రించిన సంస్కృత పండితుడు. ఆయన కుమారుడు శ్రీ ఆంజ నేయశాస్త్రి కొంతకాలం న్యాయవాదిగా పనిచేసి ప్రభుత్వ ఉద్యోగంలో స్థిరపడ్డారు.

శ్రీ కోలవెన్ను వియ్యన్నపంతులు కుమారులు శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు 'త్రివేణి' ఆంగ్లపత్రిక వ్యవస్థాప కులు. తండ్రిని అనుసరిస్తూ నరసరావుపేట న్యాయవాదుల సంఘం సభ్యులయ్యారు. శ్రీ రామకోటేశ్వరరావు మద్రాస్ విధానసభకు ఎన్నికై రాజకీయాలలో కూడా రాణించారు. 1900లో కొండుభొట్ల గోపాలకృష్ణయ్య నరసరావుపేట బార్ అసోసియేషన్‌లో చేరారు. ఆయన కుమారులు శ్రీ కె.వి. సుబ్రమణ్యశాస్త్రి అనేక దశాబ్దాలు న్యాయవాదిగా పనిచేసారు.

నల్లపాటి వారు, నడింపల్లి వారు, బొడ్డుచర్ల వారు, పుల్లెల వారు, కాకుమాను వారు, యనమండ్ర వారు, లంకా వారు, కొణిదెన వారు, దేశిరెడ్డి వారు, భృగుబండ వారు, చేకూరి వారు, చెరుకూరి, రాచకొండ కుటుంబాలలో తండ్రులు, తోబుట్టువులు, కుమారులు, కుమార్తెలు కూడా న్యాయవాద వృత్తిలో ప్రకాశిస్తున్నారు.

నరసరావుపేట న్యాయవాదుల పేరు ప్రఖ్యాతులు ఇనుమడింప చేసిన వారిలో సర్వశ్రీ నల్లపాటి వెంకటరామయ్యా చౌదరి, కొణిదెన నారాయణరావు, యనమండ్ర సాంబశివ శాస్త్రి, శ్రీగిరిరాజు రంగారావు, శ్రీగిరిరాజు వెంకటకృష్ణయ్య, సాదు సూర్యనారాయణ, శిష్టా సాక్షి సుందర సోమయాజులు, గుంటుపల్లి నరసింహం, ముత్తనపల్లి వెంకటేశ్వర్లు, తెలికేపల్లి వీరరాఘవయ్య, ధర్మవరపు రామనాథం, ముప్పల కోటినారా యణ, ప్రత్తిపాటి వెంకటసుబ్బారావు, తూబాటి వెంకటేశ్వర్లు, కాశీనాథుని వెంకటసుబ్బారావు,భృగుబండ వెంకటరామయ్య, భృగుబండరామారావు, మేడికొండూరి వెంకటేశ్వర్లు, నాగోతు ఇన్నయ్య, రాచకొండ పూర్ణానందం, కాకుమాను సూర్యనారా యణరెడ్డి, పుల్లెల దశరథ రామయ్య, ఆర్.వి. అప్పయ్యశాస్త్రి, దేశిరెడ్డి వెంకటరెడ్డి, జి. కోటేశ్వరరావు, బెల్లంకొండ కృష్ణ మూర్తి, ఎం.జి. కృష్ణారెడ్డి, పి.వి.ఆర్. శర్మ, పొత్తూరి కృష్ణ మూర్తి, జి. సుబ్బారావు, బండా రామశాస్త్రి, నల్లపాటి వెంక టేశ్వర్లు ఉన్నారు.



కాసు బ్రహ్మానందరెడ్డి

రాజకీయాలలోప్రవేశించిన న్యాయ వాదులను ప్రస్తావించగానే ముందు గా గుర్తు వచ్చే వ్యక్తి శ్రీ కాసు బ్రహ్మా నందరెడ్డి. ఆయన జిల్లా బోర్డ్ అధ్యక్షుని స్థాయి నుండి క్రమ క్రమంగా ఎదిగి శాసనసభ్యులు, రాష్ట్ర మంత్రి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి, కేంద్రమంత్రి, గవర్నర్ స్థాయికి చేరు కున్నారు. జాతీయ స్థాయిలో కాంగ్రెస్ కమిటీ ఇచ్చిన ప్రతి పదవికి ఆయన వన్నె తెచ్చారు.

శ్రీ కాసు తరువాత రాజకీయాలలో ధ్రువతారగా





వెంకట రామయ్య చౌదరి

వెలిగినవారిలో శ్రీ నల్లపాటి వెంకట రామయ్య చౌదరి దర్శన మిస్తారు. గుంటూరు జిల్లా బోర్డు సభ్యుని స్థాయి నుండి, పురపాలక సంఘం కౌన్సిలర్‌గా మద్రాస్, ఆంధ్ర, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రాల విధాన సభలలో పదేళ్ళపాటు ప్రజల ప్రతినిధిగా ప్రాతినిధ్యం వహించారు. అంతకంటే ఆంధ్రవిధానసభకు ప్రప్రథమ స్పీకర్‌గా పనిచేసి తనదైన ముద్రవేసారు. తరువాత వరసలోను ఆయన తమ్ముడు శ్రీ నల్లపాటి వెంకటేశ్వర్లుచౌదరి గుంటూరు జిల్లా బోర్డ్ అధ్యక్షునిగా రాజకీయ రంగప్రవేశంచేసి మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యునిగా బాధ్యతలు నిర్వర్తించారు. అలాగే నరస



రామయ్య చౌదరి

రావుపేట న్యాయవాదుల సంఘం సభ్యులైన శ్రీ చాపలమడుగు రామయ్య చౌదరి శాసనసభ్యునిగా, పార్లమెంట్ సభ్యునిగా ఎన్నికయ్యారు. గంగినేని వెంకటేశ్వరరావు వినుకొండ శాసన సభ్యునిగా ప్రజల ఆశీర్వాదం పొందారు. శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు మద్రాస్ శాసనసభ సభ్యునిగా ప్రజలకు సేవలందించారు. శ్రీయుతులు తాడేపల్లి సంపూర్ణ లక్ష్మీనారాయణ, చావలి వెంకట కృష్ణయ్య, గాదె సింహాచలం నరసరావుపేట పురపాలక సంఘం అధ్యక్షులుకాగా, శ్రీ ఎన్.వి. హనుమంతరావు ఉపాధ్యక్షులుగా పట్టణ ప్రజలకు చేరువయ్యారు. నరసరావుపేట పురపాలకసంఘం సభ్యులుగా నడింపల్లి జగన్నాథరావు, బొడ్డుచర్ల రవీంద్రనాథ్, జొన్నలగడ్డ సుబ్బా రావు, సిహెచ్.ఎల్. కాంతారావు, అనిశెట్టి కృష్ణారావు, కాకుమాను పెదపేరిరెడ్డి, కట్టానారపరెడ్డి, మాదిరెడ్డి వెంకటేశ్వరరెడ్డి, జనాబ్ షేక్ మౌలాలి సేవలందించారు.

నరసరావుపేట న్యాయవాదులు, న్యాయవ్యవస్థలో కూడా కీలకపాత్ర వహించిన న్యాయమూర్తులు, శ్రీయుతులు మూర్తి సత్యనారాయణ గుప్తా, పొపూరి రఘునాథశాస్త్రి, చావలి అవధాని, రాళ్ళబండి విశ్వేశ్వరావు, మున్సిఫ్ మేజిస్ట్రేట్లుగా ఎంపికై జిల్లా జడ్జిల స్థాయికి చేరుకున్నారు. రంగారెడ్డి జిల్లా జడ్జీగా పనిచేసిన శ్రీ డి.ఎస్.ఆర్. ఆంజనేయులు కూడా నరసరావుపేట న్యాయవాది. కాగా శ్రీ కాకుమాను ఉమామహేశ్వరరావు, శ్రీ నడింపల్లి రామలింగ నాగేశ్వరరావు సబార్డినేట్ జడ్జీలుగా సేవలందించిన అనంతరం హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేసి 2014లో తన బాధ్యతలనుండి విరమణ చేశారు. పి.బి.ఎస్. ఛార్లెస్ జిల్లా జడ్జిగా పనిచేశారు. టి. చలపతిరావు, బి. డేవిడ్‌రాజు, పి.వి.ఎస్.ఎన్. మూర్తి, పి.బి.ఎస్. ఛార్లెస్, ఆర్. శివకుమార్, షేక్ జానీభాషా, అనూరాధ, పద్మిని తదితరులు మున్సిఫ్ మేజిస్ట్రేట్స్‌గా నియమితులై అనంతరం జిల్లా జడ్జిలు అయ్యారు. న్యాయాధికారులుగానే కాకుండా పబ్లిక్ ప్రాసిక్యూటర్స్‌గా కూడా శ్రీయుతులు వాసిరెడ్డి రామలింగప్రసాద్, శ్రీ గిరిరాజు ఆంజనేయులు, గుదె హనుమంతరావు, టి.రంగారావులు ఎంపికయ్యారు. న్యాయవాదుల సంఘం తన సభ్యుల సంఖ్య వంద సంఖ్యను దాటింది. 250 మంది సభ్యులతో జిల్లాలోనే ఒకప్రముఖ బార్ అసోసియేషన్‌గా ఖ్యాతిగాంచింది. 1994 సంవత్సరంలో మున్సిఫ్ కోర్టు, బార్ అసోసియేషన్ వంద సంవత్సరాల ఉత్సవాలను జరుపుకుంది.

నరసరావుపేట న్యాయవాదుల సంఘంలో చేరిన ప్రప్రథమ మహిళా న్యాయవాది శ్రీమతి వై. బాలసరస్వతి. శ్రీమతి పుల్లెల అలివేలమ్మ, శ్రీమతి సుధారాణి, శ్రీమతి డి. శాంతకుమారి, పి. రామలక్ష్మిలతో పాటు మరో 15 మంది మహిళా న్యాయవాదులు సంఘసభ్యులై తమ ప్రతిభను చాటుతున్నారు.

నరసరావుపేట న్యాయవాదుల సంఘంలో భార్యాభర్తలు న్యాయవాదులుగా ప్రఖ్యాతి పొందిన జంట ఒకటుంది. నరసరావుపేట బార్ అసోసియేషన్ చేరిన ప్రప్రథమ మహిళ శ్రీమతి వై. బాలసరస్వతి కాగా ఆమె భర్త శ్రీ పి. మధుసూదన రెడ్డి కూడా న్యాయవాదికావటం ఆయనకూడా నరసరావుపేట న్యాయవాదుల సంఘం సభ్యుడు కావటంతో న్యాయవాదుల జంటగా ప్రత్యేక గుర్తింపు పొందారు. గతంలో మధుసూదన రెడ్డి ఎ.జి.పి.గా పనిచేశారు.

మూడు దశాబ్దాల నుండి అయిదు దశాబ్దాలకు మించిన వృత్తి జీవనం సాగించిన, సాగిస్తున్న న్యాయవాదులలో శ్రీ లంకా రామనాథం ఒకరు. శ్రీ బొల్లాపల్లి వెంకటేశ్వర్లు నరసరావుపేటలో ప్రఖ్యాత న్యాయవాదిగా పేరుగాంచి, సి.బి.ఐ., సి.బి.సి.ఐ.డి.లో పబ్లిక్‌ప్రాసిక్యూటర్‌గా పనిచేసి ఉద్యోగ విరమణ చేశారు. శ్రీ జొన్నలగడ్డ సుబ్బారావు గారితో పాటుగా

శ్రీ నడింపల్లి వెంకట అప్పారావు, శ్రీ పి. జగన్నాథరావు, శ్రీ కాకుమాను కృష్ణమూర్తి, శ్రీ రాచకొండ పూర్ణానందం, శ్రీ ఇ. కామేశ్వరరావు, శ్రీ ఎన్. దేవయ్య, శ్రీ కె. పార్థసారధి, శ్రీ టి.ఎస్.కె. మోహనరావు, శ్రీ పి.ఎస్.ఆర్. కృష్ణయ్య, శ్రీ చెరుకూరి వెంకయ్య చౌదరి, శ్రీ సిహెచ్.ఎల్. కాంతారావు, శ్రీ అంగర మధుసూదనరావు, శ్రీ కె. రాధాకృష్ణమూర్తి సుమారు 50 సంవత్సరాల తరబడి న్యాయవాద వృత్తిలో కొనసాగి సీనియర్ న్యాయవాదులుగా ఖ్యాతిగాంచారు.

కళారంగాన కూడా తమ నటనతో అశేష ప్రజానీకాన్ని ఆకట్టుకున్న శ్రీ బెల్లంకొండ సుబ్బారావులాగే నటుడిగా, గాయకుడుగా శ్రీ నడింపల్లి వెంకట అప్పారావు కూడా గుర్తింపు పొందారు. న్యాయవాదుల సంఘానికి సంబంధించిన ఏ కార్యక్రమం జరిగినా శ్రీ అప్పారావు పాట పాడటంతోగాని అది సంపూర్ణం కాదు.

భారతదేశ ప్రథమ ప్రధాని శ్రీ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ వ్రాసిన ఆర్టికల్స్‌ను నరసరావుపేట న్యాయవాది శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు ఎడిట్ చేసారంటే ఆశ్చర్యం, ఆనందం కలుగుతుంది. ఇది నిజం. శ్రీ కోలవెన్నువారు శ్రీ నెహ్రూ ఆర్టికల్సేకాదు ఆనాడు హేమాహేమీలుగా రాజకీయ రంగాన ఖ్యాతి గడించిన అనేకుల ఆర్టికల్స్‌ను ఎడిట్ చేశారు. 'త్రివేణి' పేరుతో ఆయన ఆర్టికల్స్ రాసేవారు.

శ్రీ పంగనామాల నరసింహారావు ప్లీడర్ చదవక పోయినా హైకోర్టు నుండి ప్రైవేటు పట్టాను పొంది క్రిమినల్ కోర్టులలో ప్రఖ్యాత న్యాయవాదిగా ఖ్యాతి గడించారు. న్యాయ వాదులకు ఏ మాత్రం తగ్గకుండా అంతే ప్రతిభ చూపిన 'ప్లీడర్ గుమాస్తా'లను స్థానికులు మర్చిపోలేరు. అయిదు దశాబ్దాలుగా ప్లీడర్ గుమాస్తాగా పనిచేసిన స్వర్గీయ గుంటుపల్లి ఉగ్రనరసింహారావు పట్టణ ప్రజలకు సన్నిహితులు. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారికి ఆయన ప్లీడర్ గుమస్తాగా పనిచేసి ఆ తదుపరి లంకా రామనాథంగారి దగ్గర ప్లీడర్ గుమాస్తాగా పని చేశారు. ఆయన మున్సిపల్ కౌన్సిలర్‌గా కూడా ఎన్నికయ్యారు. పోలూరి సత్యనారాయణ ప్లీడర్ గుమస్తాగానే కాక కళాకారుడిగా రాణించారు.

కాగా, నరసరావుపేట 13వ అదనపు జిల్లా మరియు సెషన్స్ జడ్జి కోర్టుకు పబ్లిక్ ప్రాసిక్యూటర్స్‌గా ఇప్పటి వరకు దేశిరెడ్డి మల్లారెడ్డి (2011-2014), మేడపాటి బాలసత్య నారాయణరెడ్డి 2014 నుండి పనిచేస్తున్నారు. జి.ఎల్.వి. రమణమూర్తి, పంగులూరి ఆంజనేయులు చౌదరి, కట్టా నారపరెడ్డి, పోలూరి ప్రభాకరరావు గతంలో అడిషినల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్స్‌గా పనిచేశారు. అనంతరం ఫాస్ట్ ట్రాక్ జిల్లా జడ్జి కోర్టుకు 1988-1992 వరకు పనిచేశారు. అనంతరం గర్నెపూడి అలెగ్జాండర్ (2006-2011), ఏలూరి మల్లిఖార్జున రావు (2011-2015), రావెళ్ళ లక్ష్మీనారాయణ 2015 నుండి పనిచేస్తున్నారు. గవర్నమెంటు ప్లీడర్లుగా 13వ అదనపు జిల్లా మరియు సెషన్స్ జడ్జి కోర్టులో 2013 నుండి శ్రీగిరిరాజు అయ్యపరాజు పనిచేస్తున్నారు. అదనపు సీనియర్ సివిల్ జడ్జి కోర్టులో ఎ.జి.పి.లుగా ఎన్.వి. అప్పారావు, బి. రామారావు, నల్లపాటి లక్ష్మీనారాయణ, బి. మధుసూదనరెడ్డి, చంద్ర ఆంజనేయులు (2002-2006), నడింపల్లి శ్రీశైలకుమార్ (2006-2012), బోయన పిచ్చేశ్వరరావు 2012 నుండి పనిచేస్తున్నారు. మునిసిపల్ స్టాండింగ్ కౌన్సిల్‌గా రాచకొండ పూర్ణానందం, కట్టా నారపరెడ్డి, బోయన పిచ్చేశ్వరరావు (2009-2011), బి.వి.ఆర్.వి. ప్రసాదరెడ్డి (2011-2015), 2015 నుండి చెన్నుపాటి నాగేశ్వరరావు పనిచేస్తున్నారు.

నరసరావుపేట బార్ అసోసియేషన్ సభ్యులు, మునిసిపల్ కౌన్సిలర్ అయిన శ్రీ కాకుమాను పెద పేరిరెడ్డి ప్రప్రథమముగా బార్ అసోసియేషన్ నుండి హైకోర్టు జడ్జి క్యాడర్ మరియు చీఫ్ జస్టిస్ క్యాడర్ అయిన ఆంధ్రప్రదేశ్ మానవ హక్కుల కమీషన్ సభ్యులుగా, యాక్టింగ్ ఛైర్మన్‌గా 2010 ఆగష్టు నుండి 2015 ఆగష్టు వరకు పనిచేశారు. 2010 అక్టోబర్‌లో నడింపల్లి నాగేశ్వరరావు హైకోర్టు జడ్జిగా బాధ్యతలు స్వీకరించి 8 నెలల క్రితం ఉద్యోగ విరమణ చేశారు. ప్రస్తుతం జిల్లా జడ్జి క్యాడర్‌లో ఉన్న వి.యస్.ఆర్. అవధాని సుప్రీంకోర్టు రిజిస్ట్రార్ జనరల్‌గా పదవీ బాధ్యతలు నిర్వహిస్తున్నారు.


కాకుమాను పెద పేరిరెడ్డి


వి.యస్.ఆర్. అవధాని

*With out justice there is no peace - No lasting peace any way.*

# కోలవెన్ను రామకోటీశ్వరరావు







## డా॥ వేదగిరి రాంబాబు

విమర్శకుడు, రచయిత, జర్నలిస్ట్


అది 1908వ సంవత్సరం. అప్పటికే దేశమంతా రాజకీయచైతన్యం ప్రబలి ఉంది. బాలగంగాధర తిలక్‌కి జైలు శిక్ష పడిందని తెలియగానే విద్యార్థులందరూ పాఠశాలలకు వెళ్లకుండా నిరసనగా ఊరేగింపు జరపసాగారు. ఆ ఊరేగింపులో పాల్గొంటున్న ఓ పద్నాలుగేళ్ల కుర్రవాడి జేబులో పాఠశాలలో రెండునెలల జీతంకట్టడానికని ఉంచుకున్న డబ్బు ఉంది. ఆ ఊరేగింపులో ఆ డబ్బు జేబులోంచి జారిపోయింది. ఈ విషయం తండ్రికి తెలిస్తే ఎంతగా కోప్పడతారోనని భయపడిపోయాడు ఆ కుర్రవాడు. విచిత్రం! ఈ విషయం తెలిసిన తండ్రి కోప్పడకపోగా అలాంటి జాతీయోద్యమంలో కుమారుడు పాల్గొన్నందుకు చాలా సంతోషించాడు. ఆ తండ్రి మరెవరో కాదు శ్రీవియ్యన్న పంతులుగారు! కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు ఆ పుత్రుడు!

కోలవెన్ను రామకోటీశ్వరరావుగారికి అడవి బాపిరాజుగారు, విశ్వనాథవారు, నండూరివారు, బసవరాజువారు, మల్లంపల్లివారు లాంటి ప్రముఖులెందరో ఆప్తులు. అయినా వాళ్లెవ్వర్నీ 'నువ్వు' అని పిలిచేవారు కారట రామకోటీశ్వరరావుగారు. అలాగే వాళ్లెవ్వరూ కూడా ఆయనను 'నువ్వు' అనేవారు కారట. ఓరోజు అడవి బాపిరాజుగారు నవ్వుతూ 'ఏమండీ! మీరు ఎవ్వర్నీ 'నువ్వు' అని పిలవడం నేనెరుగను. ఇంటిదగ్గర ఇల్లాల్ని కూడా మీరనే మన్నిస్తారా ఏమిటి?' అన్నారట రామకోటీశ్వరరావుగారితో. వారు 'మీరే అనే అంటాను. ఒసేయ్, ఏమేవ్ అని అనను కూడా!' అన్నారట.

రామకోటీశ్వరరావుగారి పూర్వీకులది కృష్ణాజిల్లాలోని కోలవెన్ను. ఆ తర్వాత బందరు దగ్గర మొలపర్రుకి చేరుకున్నారు. కుటుంబభారం పెరగడంతో వియ్యన్నపంతులుగారు తమ చదువుకి మధ్యలోనే స్వస్తి చెప్పి, గుంటూరు గవర్నమెంట్ హైస్కూల్‌లో ఉపాధ్యాయవృత్తిలోకి ప్రవేశించారు. ఉపాధ్యాయుడిగా పనిచేస్తూనే ప్రైవేట్‌గా పరీక్షలు పాసవుతూ ప్లీడరు పట్టా పుచ్చుకున్నారు.

పల్నాడు తాలూకా కారంపూడిలో డిస్ట్రిక్ట్ మున్సిఫ్‌కోర్టు వుండేది. గుంటూరు నుంచి వియ్యన్నపంతులుగారు కారంపూడి వచ్చి, అక్కడి నుంచి నరసరావుపేట వచ్చారు. అక్కడ ఆయనకు రెండవ కుమారుడు రామకోటీశ్వరరావు 1894 అక్టోబర్ 22వ తేదీన జన్మించారు. అతి చిన్నవయసులోనే ఆయనకు జయంతి రామయ్యపంతులుగారు, గిడుగు రామ్మూర్తి పంతులుగారు లాంటి మహానుభావులతో పరిచయమై స్ఫూర్తిని పొందారు. చిన్నతనం నుంచి పాఠ్యపుస్తకాలే కాక, ఇతర పుస్తకాలు చదవాలన్న ఆసక్తి, అభిలాష ఆయనకుండటం విశేషం. ఆయనకు లెక్కలంటే భయం!

వాళ్ల కుటుంబం బందరు నుంచి నరసరావుపేట వచ్చి స్థిరపడింది కాబట్టి రామకోటీశ్వరరావుగారికి బందరుతోనూ సంబంధాలుండేవి. 1906లో లోయర్ సెకండరీ పరీక్షపాసై, గుంటూరు హైస్కూలులో చేరారు. 1908లో మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణులై 1909లో బందరు నోబుల్‌కాలేజీలో చేరారు. బందరులో ఇంటర్మీడియట్ పూర్తిచేసి, చెన్నపట్నం ప్రెసిడెన్సీ కాలేజీలో బి.ఎ. ఆనర్స్‌లో చేరారు. 1913 జూన్ 13న ఆయనకు వివాహమైంది. వారిభార్య రాజ్యలక్ష్మిగారు. 1917 నుంచి 1921 దాకా నరసరావుపేటలో ప్లీడర్‌గా ప్రాక్టీస్ చేశారు. 1917లో బెల్లంకొండ రాఘవరావుగారితో కలిసి ఓ గ్రంథాలయాన్ని ప్రారంభించారు. అదే ఆ తర్వాత మున్సిపల్ లైబ్రరీగా మారింది.

రెండేళ్లు ఉపసంపాదకుడుగా చేసిన అనుభవం ఆయన జీవితంలో మరిచిపోలేనిది. ఎప్పుడైనా సంపాదకీయాలు రాయడం, వార్తలను ఎడిట్ చేయడం చేస్తుండేవారు. ఖాసా సుబ్బారావు, కృపానిధిగార్లతో అక్కడే పరిచయమైంది.

ప్రకాశంగారితో రామకోటీశ్వరరావుగారికి ఓసారి ఓ చిన్న వివాదం వచ్చింది. 'స్వరాజ్య' పత్రికలో ఎవరో సర్ ఎస్. సుబ్రహ్మణ్యయ్యర్‌గారిని గురించి ప్రస్తావిస్తూ, ఆయన రెండు సార్లు కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా ఉన్నారని రాశారు. ఇది తప్పని, ఆయనెప్పుడూ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉండలేదని రామకోటీశ్వరరావుగారు ప్రకాశంపంతులుగారితో అన్నారు. 'నీవప్పటికి పుట్టలేదు. నీకెట్లా తెలుసు?' అని ప్రకాశం పంతులుగారు చమత్కరించారు. కానీ తరువాత ఆయన రామకోటీశ్వరరావుగారి వద్దకే వెళ్లి తన తప్పును దిద్దుకున్నారు.

'స్వరాజ్య'లో పనిచేసినప్పుడే సి. రాజగోపాలాచారిగారితోనూ రామకోటీశ్వరరావు గారికి పరిచయముందట. 'స్వరాజ్య' పత్రికలో పనిచేస్తున్న రామకోటీశ్వరరావుగారిని పట్టాభిసీతారామయ్యగారు బందరు జాతీయకళాశాలలో అధ్యాపకులుగా చేరమని కోరడంతో ఆయన 1923లో బందరులో అధ్యాపకులుగా చేరారు. అక్కడ నాలుగేండ్లు పనిచేశారు. ఆ తర్వాత ప్రభుత్వ ఆర్థిక సహాయాన్ని పొందడానికి కళాశాల కార్యనిర్వాహకవర్గం నిర్ణయించడంతో అందుకిష్టంలేని ఆయన జాతీయకళాశాలను విడిచిపెట్టారు. కొన్నాళ్లు చెన్నపట్నం నుంచి 'జయంతి' అన్న తెలుగు పత్రికను విశ్వనాథ, మల్లంపల్లి, బాపిరాజు, కృష్ణశాస్త్రిగార్ల రచనలతో ద్విమాస పత్రికగా నడిపారు. ఇది ఒక సంవత్సరం మాత్రమే నడిచింది.

రామకోటీశ్వరరావుగారు 1927 డిసెంబర్‌లో 'త్రివేణి' పత్రికను ప్రారభించారు. అది అప్పటినుంచి తొమ్మిది సంవత్సరాలపాటు ద్వైమాసిక పత్రికగా వచ్చింది. ఆ తర్వాత అది త్రైమాసిక పత్రికగా మారింది. 1937లో త్రివేణి మాసపత్రికైంది. నాలుగు సంవత్సరాలపాటు నిరాఘాటంగా నడిచింది. ఆ తర్వాత ఆర్థిక ఇబ్బందులతో కుంటుపడింది.

వైవిధ్యదృష్టితో భారతీయ సంస్కృతిలో వున్న ఏకత్వంలోని భిన్నత్వాన్ని, భిన్నత్వంలోని ఏకత్వాన్ని, వివిధ ప్రాంతాలలో వివిధ భాషలలో వికసిస్తున్న జ్ఞానతృష్ణను, సారస్వత పునరుజ్జీవనాన్ని జిజ్ఞాసువులందరూ దర్శించడమే త్రివేణి పరమాదర్శం. ఏ రాజకీయ పక్షానికి సంబంధంలేని ఉన్నత స్థాయి రాజకీయాలతోనూ, వివిధ ప్రాంతాల కళ, సాహిత్య రీతుల్ని సమన్వయ దృష్టితో పరిశీలించడం, జాతీయ సమైక్యతా దృష్టిని అలవరచడంలో సమగ్రమైన భారతీయ సంస్కృతికి దర్పణప్రాయంగా త్రివేణిని నడిపారు.

జవహర్‌లాల్ నెహ్రూగారు 'త్రివేణి'లో తమ స్వీయానుభవాల గురించి రెండు వ్యాసాల్ని రాశారు. రాజగోపాలాచారిగారు ఓ కథని, ఓ వ్యాసాన్ని 'త్రివేణి'కి రాశారు. సుప్రసిద్ధ విద్వాంసులు, పాత్రికేయులు, రాజకీయవేత్తలు, సంస్కృతీ పరులెందరో వివిధ విషయాల మీద త్రివేణికి రాసేవారు.

ఆ రోజులలో 'త్రివేణి'లో రచన పడడమే పెద్ద సర్టిఫికేట్! 'త్రివేణి' అంటే కోలవెన్ను. కోలవెన్ను అంటే 'త్రివేణి' గా సిద్ధపరడి పోయింది.

కోలవెన్నువారు 1933వ సంవత్సరాంతం నుంచి 1934 దాకా బందరు ఆంధ్రజాతీయ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. ఆ తర్వాత 'త్రివేణి' పత్రికను అభివృద్ధి పరచాలనే ధ్యేయంతో జాతీయ కళాశాలను విడిచిపెట్టారు. 1937లో చెన్నపట్నంలో అకాశవాణి ప్రారంభమైంది. అక్కడ మొట్టమొదటి ప్రసంగాన్ని గిడుగు రామమూర్తిగారు చేస్తే, రెండో ప్రసంగం కోలవెన్నురామకోటేశ్వరరావుగారు చేశారు.

ఆ తర్వాత రాజకీయ జీవితం, జైలు... 1961లో 'త్రివేణి'ని ప్రచురించే బాధ్యతను బందరు త్రివేణి పబ్లికేషన్స్ భావరాజు నరసింహారావుగారికి అప్పజెప్పారు. అంతకు ముందు-1954లో బెంగళూరులో 'త్రివేణి' రజతోత్సవాలు వైభంగా జరిగాయి. 1957లో రామకోటీశ్వరరావుగారు దక్షిణ భాషా పుస్తకసంస్థకు ప్రధాన సంపాదకులుగా పనిచేశారు. ఆతర్వాత 1965లో అఖిలభారత పాత్రికేయుల సమాఖ్య కోలవెన్ను రామకోటీశ్వరరావుగారిని సత్కరించింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ కోలవెన్నువారికి గౌరవ సభ్యత్వాన్నిచ్చి గౌరవించింది.

1970లో ఆయన మనల్ని విడిచి వెళ్లిపోయారు. నరసరావుపేట పురపాలకసంఘం శతాబ్దిఉత్సవ సందర్భంగా ఇలా ఆ మహనీయుణ్ణి తలచుకునే అవకాశం దొరికినందుకు చాలా సంతోషం. •

# ఏల్చూరి సోదరులు




## డా॥ ఏల్చూరి మురళీధరరావు

అసోసియేట్ ప్రొఫెసర్


**'నయాగరాకవి' సుబ్రహ్మణ్యం :** ఏల్చూరి సుబ్రహ్మణ్యం అని మా నాన్నగారి పేరు వినగానే ఒక ఉప్పొంగే ఉద్యమస్ఫూర్తి జ్ఞాపకానికి వస్తుంది. ప్రభుత్వాల ప్రాభవాన్ని ఎదిరించి ప్రజాశక్తికి స్వాగత తోరణాలను కట్టిన కావ్యకర్త కమనీయ విగ్రహం సాక్షాత్కరిస్తుంది. 'మా సుబ్రహ్మణ్యం మనుషుల్లో దేముడు' అని మా నాన్నగారు మరణించిన మూడవ రోజున హైదరాబాదు ప్రెస్సుక్లబ్బులో జరిగిన ఒక సంస్మరణ సభలో వారి మనసెరిగిన కూర్మి నెచ్చెలి కాళోజీగారు చెబుతుంటే చెమర్చిన కళ్లతో బరువెక్కిన గుండెలతో ఆ మాటలను వింటూ దైవాన్ని గుర్తింపలేకపోయిన దైవోపహతులమై నిశ్చేష్టుల మయ్యాము.

మా నాన్నగారు గడిచిన రౌద్రినామ సంవత్సరం నిజశ్రావణ శుక్లపక్ష ద్వాదశీ గురువాసరాన (26 ఆగష్టు, 1920) ఉత్తరాషాఢానక్షత్రంలో ఏల్చూరి రామయ్య, సుబ్బా యమ్మ దంపతులకు జన్మించారు. మా తాతగారి తండ్రి ఏల్చూరి వరదరాజుగారు. ఆయనకు విద్యావ్యాసంగం పైకి మనస్సు మళ్లింది. ఏల్చూరులో కరణీకం అంటే ఆయనకు విరక్తి కలిగింది. ఇద్దరు కొడుకులనూ ఇంగ్లీషు చదువులలో పెట్టి అటు మల్లాయపాలెంలోనూ, ఇటు బొప్పూడిలోనూ, ఆ తర్వాత కోటప్పకొండ దగ్గరొక పాఠశాలలోనూ చదివించి, యుక్తవయస్సులు వచ్చేసరికి పెద్దకొడుకు రామయ్యగారిని నరసరావుపేటలో రావిపాటి లక్ష్మీనారాయణగారి తండ్రి వద్ద తాలూకాఫీసులో గుమస్తాగానూ, చిన్నకొడుకు లక్ష్మయ్య గారిని ప్రభుత్వపాఠశాలలో ఉపాధ్యాయుడుగానూ ప్రవేశ పెట్టారు. ఏల్చూరి రామయ్యగారు తాలూకాఫీసులో మంచిపేరు తెచ్చుకొని, నెలకు ఎనిమిదిరూపాయల పెద్దజీత గాడయ్యేసరికి రాళ్లబండివారి వీథిలో చెరువుకట్ట దగ్గరొక చిన్నయింటినీ, దాని కెదురుగా నీటి యెద్దడి లేని ముప్పైరెండు నిలువుల లోతైన మోటబావితో విలసిల్లిన సువిశాలమైన స్థలంలో ఒంటి అడ్డదూలపు కప్పుతో క్రిందిభాగంలో నాలుగేసి గదులతో రెండు పెద్దకుటుంబాలు విడివిడిగా ఉండటానికి పనికివచ్చే మేడనీ కట్టుకున్నారు.

ఆ రోజులలో నరసరావుపేటలో 'పలనాటి వామన భట్టబాణు'డని పేరొందిన ప్రౌఢసరస్వతి మద్దులపల్లి గురు బ్రహ్మశర్మగా రుండేవారు. ఆ శర్మగారు 1932 ప్రాంతంలో మా నాన్నగారికి జాతకచక్రం వేసి ఫలితజ్యోతిషాన్ని గుణించి జాతకుడు ఋషితుల్యుడని, బంధుసముద్రుడు, బహుజన హితైషి కాగలడని పాండిత్య కవిత్వయోగాఢ్యుడనీ చెప్పారట. కొన్నాళ్లకు ఆయనే నాన్నగారిని స్వజనవర్గంలో కలుపుకొని పద్యరచనను నేర్పటం గొప్పఅదృష్టమని నాన్నగారు గురుబ్రహ్మ శర్మగారిని పదేపదే తలచుకునేవారు.

మా నాన్నగారికి చిన్నప్పుడు సుబ్బారావు అని పేరు పెట్టారు. పది, పన్నెండేళ్ల ప్రాయంలో గురుబ్రహ్మణ్యులు గురుబ్రహ్మశర్మగా రెందుకో సుబ్రహ్మణ్యం అని మార్చారు. అంతటి మహాపండితుడు పునర్నామీకరించినా ఆ చిన్ననాటి ప్రియమిత్రులు అనిసెట్టి సుబ్బారావుగారు, బెల్లంకొండ రామదాసుగారు, దండంమూడి కేశవరావుగారు, కుందుర్తి ఆంజనేయులుగారు, సముద్రాల రామానుజాచార్యగారు, దేవరకొండ బాలగంగాధరతిలక్‌గారు, దేశిరాజు కృష్ణశర్మ గారు, అంగర వెంకటకృష్ణారావుగారు, మాదల వీరభద్రరావు గారు, నాన్నగారి పినతండ్రి లక్ష్మయ్యగారు జీవితాంతం మా నాన్నగారిని ప్రేమతో 'సుబ్బారావూ!' అనే అనేవారు. మా బాబాయి గారికీ వైఖానసుల సంప్రదాయానుసారం 'విజయ రాఘవరావు' అని నామకరణం చేశారు. మిత్రులందరూ 'మా విజయుడు, మా విజయుడు' అనేవారు. చిన్నారి వయస్సులో నాన్నగారు ఆయన్ని 'విజయా!" అనీ, ఆయన

మా నాన్నగారిని నోరారా 'అన్నయ్యా!' అనీ పిలుస్తుంటే ఆ అప్యాయతలను చూసేవారి కళ్లు చెమర్చేవట.

చేతికి యెముక లేని దాతృత్వ గుణం మా నాన్నగారికి బంగారుకు పరిమళం అబ్బినట్లు తల్లినుంచి సంక్రమించింది. మా పితామహులు రామయ్యగారు దేహయాత్ర చాలించిన కొన్నాళ్లకు ముక్కుపచ్చలారని వయసులో తండ్రిని కోల్పోయిన పిల్లలిద్దరికీ చదువు సాములు నేర్పగల ఉదారస్వభావు లెవరుం టారని నలుగురినీ అడిగి తెలుసుకొని మా బామ్మగారు పిల్లల్ని గొప్పవిద్వాంసులు అబ్బురాజు హనుమంత పాకయాజిశర్మగారి వద్దకు తీసుకొని వెళ్లి అప్పగించింది. నాన్నగారికి ఇలువేల్పు ఏల్చూరులో కొండకొమ్ము మీద వెలసిన శ్రీలక్ష్మీనరసింహ స్వామి కాగా, ఇలవేల్పుగా అన్నంపెట్టి చదువు చెప్పిన ప్రథమ గురువు ఆయన.



ఏల్చూరి సుబ్రహ్మణ్యం

రోజూ ఇంటి ప్రక్కనే చెరువుకట్ట దగ్గర స్నానం, వంట అయినాక పొయ్యిలో బొగ్గులను చెంబులోవేసుకొని అన్నదమ్ము లిద్దరూ ఉతికిన బట్టలను ఇస్త్రీ చేసుకొని పాఠశాలకు వెళ్లడం, తిరిగి రాగానే ఆడుకోవటం, చీకటిపడేలోగా ఉన్నదేదో తిని పడుకోవటం నిత్యకృత్యాలు. ఆటపాటల మీద ధ్యాస పెరిగితే చదువు చటాకులవుతుందని తల్లి దిగులు పడసాగింది.

సత్తెనపల్లి తాలూకా కోసూరులో అంతకు యాభై, అరవై యేళ్ల మునుపు కొప్పరాజు నరసింహకవిగారు రచించిన గ్రంథాల తాళపత్ర సంపుటాన్ని మద్దులపల్లి గురుబ్రహ్మ శర్మగారు నరసరావుపేటకు తీసుకొని వచ్చి అచ్చు వేయించా లని ప్రయత్నిస్తుండేవారు. వారు పరమపదించిన తర్వాత కొంతకాలానికి భాగవతుల వేంకట సుబ్బారావుగారు దానిని మునిసిపల్ ఛైర్మన్ కొత్తూరి వేంకటేశ్వర్లుగారి సాయంతో 'శ్రీత్రికూటాచల మాహాత్మ్యము'అన్న పేరిట శ్రీనివాససోదరుల అజంతా ముద్రణాలయంలో అచ్చు వేయించారు. త్రికూటా చలం అంటే కోటప్పకొండ. ఆ దక్షిణకైలాస క్షేత్ర మాహాత్మ్యాన్ని వర్ణిస్తూ ఉదయించిన కావ్యాలలో కొప్పరాజు వారిరచన అగ్ర శ్రేణికం. ఆమహాకావ్య ప్రభావంతో భాగవతుల సుబ్బారావు గారు చెప్పిన త్రికోటేశ్వరశతకంలోని సీస పద్యాలను గుఱించి మా నాన్నగారు మాకు తరచు చెబుతుండేవారు. సుబ్బారావు గారు తనకు బహూకరించిన ఆ పుస్తకాల ప్రతులను ఎంతో పదిలంగా దాచుకొని నెమరువేసు కుంటుండేవారు.

మా రాళ్లబండివారి వీథి మొదట రోడ్డువైపు ఇంటిలో కొణిదెనవారిల్లు ఉండేది. ఆ తర్వాత దానిని పడగొట్టి సత్య నారాయణ టాకీసు కట్టారు. కొణిదెనవారు వీథి మధ్యలోకి మారారు. ఇప్పుడదీ లేదు. పువ్వాడవారి ఆసుపత్రి వచ్చింది. 1932లో కొణిదెన వారింటికి అత్తినూరు శ్యామయ్యగారని తొంబై యేళ్ల వృద్ధుడు 1860లో మొదలుపెట్టి, ఆసేతు శీతాచలం సుమారు డెబ్బైయేళ్లకు పైగా దేశంలో ఉన్న పుణ్య క్షేత్రాలన్నిటినీ ఒకటొకటిగా దర్శించుకొంటూ నరసరావు పేటకు విచ్చేసిన పుణ్యాత్ములు. కొణిదెన రమణయ్యగారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని వారింటిలో ఒకటి రెండు వారాలు బసచేశారు. నలుగురూ చెప్పుకొంటుంటే విని మా నాన్నగారు వారింటికి వెళ్లి ఆయన దర్శనం చేసుకొన్నారు. జీవనాదర్శాలు రూపు దిద్దుకొంటున్న పన్నెండేండ్ల పూప వయసులో ఆ చిరంతన యాత్రికుడు, ఆ ఆధ్యాత్మిక తత్త్వాన్వేషి ఆ మహామనీషి చెప్పిన దేశాటన, క్షేత్రాటన, వనాటన పర్యటన విశేషాలు, ఎవరెవరో మహనీయులైన వ్యక్తుల దివ్యప్రబో ధాలు, ఏవేవో అపురూపమైన గ్రంథాల వివరాలు నాన్నగారి మనస్సులో చెరగని ముద్రవేశాయి. లోకాతీతమైన ఏదో శక్తి జీవులందర్నీ ముక్కుతాడు వేసి నడిపిస్తున్నదని ఒక దృఢమైన విశ్వాసం ఏర్పడింది. ఆయన వేసిన ఆ చెఱగని ముద్రవల్ల దేశాటనమన్నా, స్వతంత్ర జీవనమన్నా ఆసక్తి కలిగింది.

అక్కిరాజు ఉమాకాంతంగారి సన్నిహితబంధువు అక్కిరాజు రామయ్యగా రుండేవారు. దేశికోత్తములంటే ఆయనే! విద్యార్థికల్పతరువు. ఋషితుల్యులైన నిష్కామ కర్ములు. 1971లో నేను నరసరావుపేటకు వెళ్లినప్పుడు వారి

దర్శనం చేసుకుందామని వారింటికి వెళ్లి ఆ సద్గురువరుని పాదపద్మాలను కన్నులకు అద్దుకొన్నాను. అటువంటి సద్గురువు శిక్షణలో సుశిక్షితులై సురక్షితులైన మా నాన్నగారి భాగ్యవిశేషానికి విస్తుపోవటం నా వంతయింది.

ఇదంతా ఒకయెత్తు కాగా ఆనాళ్లలో నరసరావుపేటలో కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు నడుపుతుండిన త్రివేణి ఆంగ్లపత్రిక ఒక్కటీ ఒకఎత్తు. ఆప్రభావం ఆచిన్నిచోట విద్యార్థులకు విద్యాధికులకు విశ్వవిజ్ఞానమందిర వినూత్న కవాటలను తెరిచి బహిరంతరాలలో వివేక దీపాలను వెలిగించింది.

**ప్రముఖ వైణికుడు విజయరాఘవరావు :** గుంటూరు మండలంలో నరసరావుపేట అంటే సంగీత సాహిత్య కళాకోవిదులకు అవిముక్త కటక పుణ్యక్షేత్రం. మా పితామహులు రామయ్యగారు తాలూకాఫీసులో పనిచేస్తూనే జంత్రగాత్ర నిపుణుల సావాసం కట్టి వారితో ఆటపాటలలో పాలుపంచుకుంటూ అప్పుడప్పుడు అవకాశం వచ్చినప్పుడు రంగస్థలం పైనే ఏవో చితుకూ మతుకూ వేషాలతో క్రమేణ పద్యనాటకాలలో నాణెమైన నటుడుగా గుర్తింపుపొందారు. ఆయన నాణెమైన ముఖవర్చస్సుతో, వెడల్పైన కన్నులతో, విశాలమైన ఫాలభాగంతో, తీర్చిదిద్దిన పలువరుసతో నారింజరంగులో అందంగా ఉండేవారట. ఆ పోలిక నాన్నగారికి మతి నాలుగేళ్ల తర్వాత పుట్టిన మా బాబాయిగారికి వచ్చింది. ఆయనే విశ్వవిఖ్యాత వేణుగాన విద్వాంసులు, గానకళాప్రపూర్ణ పద్మశ్రీ ఏల్చూరి విజయరాఘవరావుగారు. వారు 1925 నవంబరు 3వ తేదీన జన్మించారు. ఆయన జాతకచక్రం మాత్రం పెద్దయ్యాక మద్రాసులో గొప్ప జ్యోతిషశాస్త్ర విద్వాంసులు, శృంగేరి జగద్గురు శ్రీశ్రీశ్రీ అభినవ విద్యాతీర్థమహాస్వాములవారి ప్రియాంతేవాసి, తమిళభాషావిశారదులు మహామనీషి నటరాజశర్మగారు పరాశర హోరానుసారం గుణించి ఫలితాలను వ్రాసిపెట్టారు. విజయరాఘవరావుగారు తండ్రిగారి నుండి వారసత్వంగా సంక్రమించిన సంగీతాభిమానంతో పూపవయసులోనే పిల్లనగ్రోవిని చేతబట్టి గొల్లపిల్లల చెలిమి వల్ల కల్లరి పిల్లలతో అల్లరి కట్టిపెట్టి ఎల్లకాలం దేవదత్తమైన ఆ [illegible]కకు మెరుగులు దిద్దుకొనే ప్రయత్నంలో ఉండే వారట. ఆ గొల్లపిల్లలే వారికి విద్య నేర్పిన గురువులు. తక్కినదంతా ఎవరైనా శాస్త్రీయ గానకచేరీలు చేస్తుంటే వెళ్లి విని, ఇంటికి వచ్చి స్వయంకృషితో నేర్చుకొన్నది. వారి సాధనాకాలంలో నరసరావుపేట చెరువుకట్ట దగ్గర రావిచెట్టు క్రింద అరుగు చెరుగంతా ఆ నాటి బాలమిత్రమండలి గమనాగమనాలతో గోగోపగోపీ విభూషిత రమణీయ బృందావనంగా భక్తినివేశమై విలసిల్లేదట. ఆ శ్రోతల్లో అనిసెట్టి సుబ్బారావుగారు, అంగర వేంకటకృష్ణారావుగారు, తెలికేపల్లి కృష్ణమూర్తిగారు, మస్తాన్ గారని ఆ తర్వాత నరసరావుపేటలోని కన్యకాపరమేశ్వరీ గ్రంథాలయం జాతీయ గ్రంథాలయాలతో సమంగా తీర్చిదిద్దిన విద్యావేత్త ఉండేవారు. తాపత్రయ నిదాఘ నిత్యసంతప్తులకు జీవసంజీవనామృతమూ, సహృదయ హృదయభావనా లతికలకు అవ్యయానందదాయకమూ, శ్రోతృమండలి శ్రవోయుగళికి పరమరసాయనమూ, ఉపాసించిన వారికెల్లా హేమాద్రి దాన ఫలమూ అయిన ఆ సంగీతరసం ఆయన జీవితాన్ని అనంత సౌందర్య మాధుర్యమయం కావించింది. ఆయన అనిసెట్టి సుబ్బారావుగారి ప్రేరణ మూలాన భగవద్దత్తమైన సంగీతకళను గురూపదేశంతో మెరుగులు దిద్దుకోవటానికి చెన్నపట్నం వెళ్లి అక్కడ కళాక్షేత్రంలో సంగీతం నేర్చుకుంటూనే రుక్మిణీ అరండేల్‌గారి వద్ద భరతనాట్యంలో శిక్షణను పొందారు. ఆ శిక్షణాఫలంగా అప్పుడు అక్కడికి విచ్చేసిన విశ్వవిదిత నాట్యకళాకోవిదులు ఉదయశంకర్‌గారి దృష్టిని ఆకర్షించి వారి బృందంలో సహకార నర్తకునిగా దేశ విదేశాలు తిరిగారు. ఆ యాత్రాసందర్భంగా ఒక రోజు రష్యాలోని బొల్షోయ్ థియేటర్లో బీథోవెన్ హాల్లో ఉదయశంకర్‌గారి బృందం నాట్యప్రదర్శన పూర్తయిన తర్వాత రాత్రిపూట పదిమంది మిత్రుల మధ్య కూర్చొని సాక్షాత్తు శ్రీకృష్ణావతారమూర్తి వలె కరకమలాలలో శబ్దబ్రహ్మ భూషితమైన వేణుదండాన్ని దాల్చి గులాబీ వన్నె పెదవులతో మధురస్వరాలూరిస్తూ కుశల కరాంగుళులతో రాగవల్లికలకు ప్రాణం పోస్తుంటే ఉదయశంకర్‌గారి సోదరులు ప్రఖ్యాత సితార్ వాదన గురువు పండిత రవిశంకర్ విని, తమ శిష్యవర్గంలో కలుపుకొని క్రమంగా నాట్యకళా వ్యసనం నుంచి హిందూస్థానీ శాస్త్రీయసంగీత ప్రపంచంలోకి ప్రవేశపెట్టి మహనీయ కళాకారునిగా తీర్చిదిద్దారు. ప్రథిత చలనచిత్ర సంగీత దర్శకులు, వేణుగాన నైపుణికులు, బహుభాషా కోవిదాగ్రణి, ఆంధ్రాంగ్ల కవి ఆయన. •

# విశ్వవిద్యాలయ గౌరవ స్వీకర్తలు


వై. విద్య
తెలుగు లెక్చరర్




నరసరావుపేట పూర్వం ఆంధ్రవిశ్వవిద్యాలయం పరిధిలో ఉండేది. ఆ తరువాత ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం పరిధిలోకి వచ్చింది. ఈ రెండు విశ్వవిద్యాలయాల గౌరవాలను మన పురప్రముఖులు అందుకొన్నారు.

**ఆంధ్రవిశ్వవిద్యాలయం :**



ఇలింద్ర రంగనాయకులు

నాగసరపు సుబ్బరాయ శ్రేష్ఠి గారు ఆంధ్రవిశ్వవిద్యాలయ పాలక మండలి సభ్యులుగా పనిచేశారు. ఇలింద్ర రంగనాయకులుగారు సెనెట్‌లోను, సిండికేట్‌లోను సభ్యులుగా ఉన్నారు. దొండేటి కృష్ణారెడ్డి గారు, కాకుమాను పెదపేరిరెడ్డి గారు సెనెట్ సభ్యులుగా ఉన్నారు. రావిపాటి సీతారామారావు గారు ఎకడమిక్ కౌన్సిల్‌లో రెండు పర్యాయాలు సభ్యులుగా పనిచేశారు.

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లో వుండి మన అధ్యాపకులు కొందరు తమ సేవలను అందించారు. తూములూరి శివరామకృష్ణమూర్తిశాస్త్రిగారు రెండు పర్యాయాలు తెలుగు బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లో సభ్యులుగా ఉన్నారు. ఆ



జి.వి. జోగారావు



ఎ. మధురప్రసాద్

తరువాత మానూరి శ్రీనివాస హనుమంతరావుగారు తెలుగు బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లో సభ్యులుగానేకాక యాక్టింగ్ చైర్మన్‌గానూ వున్నారు. జి.వి. జోగారావుగారు ఇంగ్లీషు బోర్డ్ ఆఫ్ స్టడీస్ అధ్యక్షులుగా, ఎ. మధురప్రసాద్‌గారు హిస్టరీ బోర్డ్ ఆఫ్ స్టడీస్ అధ్యక్షులుగా, ఎం. సుబ్బరామయ్యగారు హిందీ బోర్డ్ ఆఫ్ స్టడీస్ అధ్యక్షులుగా ఉన్నారు. మన పట్టణంలోని ఎందరో అధ్యాపకులు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో పరిశోధనలు చేసి ఎం.ఫిల్., పిహెచ్.డి. పట్టాలను పొందారు.

**ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం :**

ఆచార్య డి. రామకోటయ్యగారు, ఆచార్య వి. బాల మోహనదాసుగారు ఆచార్య నాగార్జునవిశ్వవిద్యాలయఉపాధ్యక్షులుగా ఉండి విశ్వవిద్యాలయానికి విశేషఖ్యాతిని సమకూర్చారు.

గాలి సుబ్బారావుగారు ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యులుగా మూడు పర్యాయాలు పనిచేశారు. ఆర్.వి. నారాయణగారు ఎకడమిక్ సెనేట్ సభ్యులుగా ఉన్నారు. ఆచార్య డి.ఎ.ఆర్. సుబ్రహ్మణ్యంగారు ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యులుగా



కపలవాయి కాశీ రామారావు



నాగసరపు రామారావు

ఉన్నారు. ఆ సమయంలో కపలవాయి కాశీరామారావుగారు, కె.పి. రంగారావుగారు, డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డిగారు, రాజా కాశయ్యగారు ఎకడమిక్ సెనేట్ సభ్యులుగా ఉన్నారు.

ఎం.ఆర్.కె. మూర్తిగారు పొలిటికల్ సైన్సు బోర్డు ఆఫ్ స్టడీస్ చైర్మన్‌గా ఉన్నారు. సి. సత్యనారాయణగారు కామర్స్ బోర్డ్ ఆఫ్ స్టడీస్ చైర్మన్‌గా ఉన్నారు. డా॥ కాసుల

నాటి నాగరాజశర్మగారు సంస్కృతం బోర్డ్ ఆఫ్ స్టడీస్ సభ్యులుగాను, బోర్డు ఉపాధ్యక్షులుగాను రెండుసార్లు ఉన్నారు. అరిపిరాల హరిహరనాథశాస్త్రిగారు, డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డిగారు తెలుగు బోర్డ్ ఆఫ్ స్టడీస్ సభ్యులుగా ఉన్నారు.

ప్రసిద్ధ నాయకులు కాసుబ్రహ్మానందరెడ్డిగారిని ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం ఆనరరీ డి.లిట్. పట్ట ప్రదానంతో సత్కరించడం విశేషం.

మన పట్టణంలోని అధ్యాపకులు ఎంతోమంది ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలో పరిశోధనలు చేసి పిహెచ్.డి., ఎం.ఫిల్. పట్టాలను పొందారు.

ఆచార్య బాలమోహనదాసుగారు ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా ఉన్నప్పుడు విశ్వవిద్యాలయ పరిధిలోని వివిధ రంగాలలో నిష్ణాతులైన ప్రముఖులను ప్రతిభా పురస్కారాలతో సత్కరించాలన్న గొప్పఆలోచనతో వారు ప్రతిభాపురస్కార ప్రదానానికి శ్రీకారం చుట్టారు. విశ్వవిద్యాలయం 31వ వ్యవస్థాపక వార్షికోత్సవం (11-09- 2007) నుండి తమ ఆలోచనకు కార్యరూపం కల్పించారు.

నరసరావుపేటలో ప్రప్రథమంగా ఆ ప్రతిభాపురస్కారాన్ని ఎం.ఆర్.కె. మూర్తిగారు అందుకున్నారు. వారు రచించిన హాస్యప్రపంచం, స్టాంపుల సరదా గ్రంథాలను, వారి సాంఘిక సేవను ప్రశంసిస్తూ విశ్వవిద్యాలయం ఈ పురస్కారాన్ని అందజేసింది.

2009లో కె.పి. రంగారావుగారు ఈ ప్రతిభా పురస్కారాన్ని పొందారు. వీరు రోటరి ఇంటర్నేషనల్ గవర్నర్‌గా సామాజికసేవ చేశారు. ఛాంబర్ఆఫ్ కామర్స్ అధ్యక్షుడుగా, ఆంధ్రప్రదేశ్ మెడికల్ అసోసియేషన్ జనరల్ సెక్రటరీగా విశిష్ట సేవలను అందించారు.

2010లో ఆ ప్రతిభాపురస్కారాన్ని నాగసరపు రామారావుగారు (1933-2012) స్వీకరించారు. వీరు 1957 నుండి 2008 వరకు అర్ధశతాబ్దికాలం సుబ్బరాయ & నారాయణ కళాశాల కార్యదర్శి, కరస్పాండెంటుగా ఉన్నారు. ఇంత సుదీర్ఘకాలం ఆ పదవిలో ఉన్నవారు ఆయనే. కళాశాల అభివృద్ధికి వారు ఎంతోకృషిచేశారు. పట్టాభిరామస్వామి ఆలయంలోని వేంకటేశ్వర కల్యాణమండపం రూపశిల్పి ఆయనే! తమ తండ్రిగారు నెలకొల్పిన ధర్మసంస్థలను వీరు ఎంతో అభివృద్ధి చేశారు.

2011లో ఈ ప్రతిభాపురస్కారాన్ని అందుకున్నవారు వనమా సుబ్బారావుగారు. ప్రముఖ వ్యాపారవేత్తగా, చాంబర్ ఆఫ్ కామర్స్ అధ్యక్షుడుగా, రాజకీయ ప్రముఖుడుగా, సంఘ సేవకుడుగా వీరు పేరుగాంచారు. వీరు చైర్‌పర్సన్‌గా ఉన్నప్పుడు నరసరావుపేట ద్విశతాబ్ది ఉత్సవాలు ఘనంగా జరిగాయి. అప్పుడు వీరు ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించారు.

2013లో ప్రతిభాపురస్కారాన్ని పొందిన వారు మేళ్లచెర్వు వీరాంజనేయులుగారు. వీరు 1965లో వేంకటేశ్వర మెడికల్ కార్పొరేషన్‌ను స్థాపించి మన రాష్ట్రంతో పాటు మహారాష్ట్ర, కర్ణాటకరాష్ట్రాలలో వ్యాపారవ్యాప్తి చేసి తద్వారా పలు కుటుంబాలకు ఉపాధి కల్పించారు. ఎన్నో సామాజిక, ఆధ్యాత్మిక, సాహితీ సేవా కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

పెనుగొండ వెంకటేశ్వరరావుగారు, మండవ సీతా రామాంజనేయులుగారు విశ్వవిద్యాలయానికి సంబంధించిన వివిధ కమిటీలలో పనిచేశారు.

ఈ విధంగా పాలనాపరంగా, విద్యాపరంగా, పురస్కారాల పరంగా ఆంధ్ర, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయ గౌరవాలను పొందిన వ్యక్తుల్లో మనవారు వుండడం హర్షదాయకం.

**జాషువాగారి మిత్రులు**



'కవికోకిల' జాషువగారు బాపట్లలో టీచర్ ట్రైనింగ్ చేస్తున్నారు. ఆ సరస్వతీ పుత్రుడికి ఆ నాడు లక్ష్మీకటాక్షం లేదు. ఆయన బాపట్ల నుండి స్వస్థలమైన వినుకొండకు కాలినడకన బయలుదేరారు. నరసరావు పేట వచ్చేసరికి ఆయనకు కాళ్లు దూలాల్లా వాచినై. మిత్రులు రైలుకు పంపాలని ప్రయత్నించినా ఆయన వారి మాట వినలేదు. అప్పుడు వాళ్లు బలవంతంగా రైలెక్కించి టిక్కెట్టును చేతి కిచ్చారు. 'సరసకవి రాజపూజా పరతంత్రు'లైన ఆ మిత్రులు ప్రశంసా పాత్రులు.

# తెలుగు కవిలోకం!



## డా॥ మేళ్లచెర్వు భానుప్రసాదరావు

తెలుగు రీడర్ (రిటైర్డ్)

లలితకళా పంచకంలో సాహిత్యం ఆలోచనామృత మైన కళ. ఆనందం, ఉపదేశం- దీని ప్రయోజనాలు. ఇది సమాజాన్ని సన్మార్గంలోనడిపిస్తుంది. అటువంటి ఉత్తమ సాహిత్యాన్ని మన నరసరావుపేట కవులు బండ్లకెత్తారు. తొలి కవి రాళ్లబండి పట్టాభిరామరాజు. ఆయన మల్రాజువారి ఆస్థాన కవి. పట్టాభిరామరాజు మల్రాజు గుండారాయణోపాఖ్యానం, కవిసర్పగారుడం, కవిమూషిక మార్జాలం, మరున్నందన శతకం, వజ్రపంజరశతకం, స్యమంతకోపాఖ్యానం మొదలైన వాటిని రచించారు. గుండారాయణింగారి ఆస్థానంలోనే ఉన్న తాడికొండ మల్లనారాధ్యుడు 'వీరాధిప గుండభూప! విభవ దిలీపా!' అనే మకుటంతో శతకాన్ని రచించాడు. దీనికి మెచ్చిన జమీందారు ఆయనకు నందివెలుగులో మాన్యాన్నిచ్చారు.

శ్రీనివాస సోదరకవులు, వేంకట పార్థసారథికవులు మన పట్టణవాసులే! వేంకటపార్థసారథికవులు శ్రీరామభద్ర దీక్షితులు రచించిన జానకీపరిణయం అనే సంస్కృత నాటకాన్ని విచిత్రరాఘవంగా తెలుగు చేసి మల్రాజు వేంకట నరసింహారావుగారికి అంకితం ఇచ్చారు.



గురుబ్రహ్మశర్మ

మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు (1862-1945) మన పాతూరు నివాసి. గొప్ప చారిత్రక పరిశోధకులు; కవి పండితులు. కొండవీటి చరిత్ర అనే పద్యకావ్యం, కొండవీటి సామ్రాజ్యం అనే పరిశోధనగ్రంథం, నరసరావుపేట చరిత్ర వీరి రచనలు. వీరు చంద్రహాసీయం, రామదాసీయం అనే నాటకాలు రచించారు. వీరి మరొక విశిష్ట రచన తిరువళ్లూరి వీరరాఘవశతకం. కృష్ణవేణీ మాహాత్మ్యము, చిరుతొండనంబి చరిత్ర, త్రికూటాచల మాహాత్మ్యము, ఎల్లమంద త్రికూటేశ్వర శతకము మొదలైనవి వీరి రచనలు.

మేళ్లచెర్వు కుటుంబరాయశర్మగారు మన శ్రీరామపురవాసి. భద్రగిరి సీతారామ చంద్రప్రభో! అనే మకుటంతో 102పద్యాల శతకాన్నీ, శ్రీహరి శృంగారశతకాన్నీ,శ్రీ భక్త విజయం అనే ఐదంకాల నాటకాన్నీ రచించారు. ఇది ప్రహ్లాదుడి కథ. సీతారామకల్యాణం అనే హరికథను, పల్నాటివీరచరిత్ర అనే నాటకాన్ని, చందలూరి మహాలక్ష్మమ్మ శతకాన్నీ రచించారు. శ్రీహరి శృంగారశతకం వీరి అముద్రిత గ్రంథం.



కుటుంబరాయశర్మ

కొప్పరపు వేంకట సుబ్బరాయశర్మ (1895-1932), కొప్పరపు వేంకటరమణకవి (1887-1942) కొప్పరపు సోదరకవులుగా ప్రసిద్ధులు. ఆశుకవి సింహాలైన వీరు 'మల రాడ్వేంకట నారసింహ నరరాణ్మాణిక్య సంస్థానవర్తుల' మని సగర్వంగా చెప్పుకున్నారు. ఆనాటి ప్రముఖ న్యాయవాది చింతలచెరువు కోటేశ్వరరావుగారి యిల్లు వీరికి విడిది, కార్య స్థానం. వీరు గంటకు 700 పద్యాలు అలవోకగా చెప్పగలరు. వీరు రచించిన సుబ్బరాయశతకాన్ని నాగసరపు సుబ్బరాయ శ్రేష్ఠి గారికి అంకిత మిచ్చారు. వీరి తమ్ముడు బుచ్చిరామయ్య గారు కూడా నరసరావుపేటలో ఆశుకవితా ప్రదర్శన చేశాడు. ప్రముఖ హిందూమత ప్రచారకుడైన ప్రభాకర ఉమామహేశ్వర పండిట్‌గారు బహుగ్రంథకర్త. హిందూమతం - దైవమతం వీరి ప్రసిద్ధరచన. ఈయన బెల్లంకొండ రామరాయకవిగారి ప్రియశిష్యులు.

గోపాలుని హనుమంతరాయకవిగారు (1888-1944) ప్రౌఢసరస్వతీ బిరుద విరాజితులు. శ్రీకృష్ణతులాభార యక్షగానకర్త. సుమనసోల్లాసం అనే పేరుతో భక్తసంరక్షణ శతకం రచించారు. గ్రాంథికభాషావాది, విద్వత్కవియైన

జయంతి రామయ్యపంతులుగారు మన ఊళ్లో డిప్యూటీ కలెక్టరుగా ఉంటూ సాహిత్య వ్యాసంగం చేశారు. శాసనపద్యమణి మంజరిని కూర్చారు. ఉత్తరరామచరిత్రను అనువదించారు. 'కుకవి ఘూకవి రవి' కేసనపల్లి లక్ష్మణకవి మన మునిసిపల్ హైస్కూలులో ఉపాధ్యాయులు. వీరి చెన్నకేశవ శతకం రఘురామశతకం, జానకీపరిణయ ప్రబంధం అలభ్యాలు. త్ర్యంబకేశ్వర శతకం లభిస్తున్నది. కేసనపల్లి కబ్బయ్యగారు, చెల్లపిళ్ల బంగారేశ్వరశర్మగారు, సాగి సుబ్రహ్మణ్యంగారు విద్వత్కవులు. ప్రయాగ సుబ్రహ్మణ్యంగారు సాయినాథ శతకాన్నీ, పదికిపైగా బుఱ్ఱకథలనూ రచించారు. రాష్ట్రపతి పురస్కార గ్రహీత రొంపిచర్ల పార్థసారథిగారు ప్రతిష్ఠావిధిదర్పణ గ్రంథాన్ని వ్యాఖ్యానించారు.

పల్నాటి సోదరకవులలో మధ్యముడైన కన్నెగంటి చిన లింగాచార్యులుగారు (1903–1968) ఆశుకవి, అవధాని. 1965 లో జరిగిన వీరు తమ షష్టిపూర్తి ఉత్సవంలో రాజరాజు కావ్యం, నీలలోహిత శతకాలను ఆవిష్కరించారు. రావిపాటి లక్ష్మీనారాయణగారు కవితాకోవిద, చిత్రకవిశేఖర బిరుద విభ్రాజితులు. వీరి నిర్వచన భారతగర్భ రామాయణం వీరికి అఖండకీర్తిని ఆర్జించిపెట్టింది. మాచర్ల చెన్నకేశవశతకం, సర్వేశ్వరశతకం, గురజాల ఇష్టకామేశ్వరశతకం, పల్నాటివీర గాథ, నాగార్జునకొండచరిత్రం, పల్నాటిచరిత్ర వీరి ఇతర గ్రంథాలు. న్యాయవాది నడింపల్లి జగన్నాథరావు 'ఆంధ్ర సామ్రాజ్యము'ను రచించారు. నరసరావుపేటకు ఛైర్మన్‌గా పనిచేసిన నడింపల్లి హనుమంతరావు 'సాహస్రిక' అనే గ్రంథాన్ని రచించారు.

పోలూరి హనుమజ్జానకీ రామశర్మగారు మన మునిసిపల్ హైస్కూలు విద్యార్థి. రామాయణకథా తరంగిణి, త్రిపురా రహస్యం, వాసుదేవకథాసుధ, నలచరిత్ర వంటి అనేక అమూల్య గ్రంథాల్ని రచించారు. భాగవతుల వేంకటసుబ్బారావుగారు మున్సిపల్ హైస్కూలు తెలుగు పండితులు. త్రికూటాచల మాహాత్మ్యం, రెడ్డిరాజులు, బ్రహ్మన్న విజయం, త్రికూటేశ్వర శతకం, భద్రగిరి శ్రీ రఘురామ శతకం, నరసరావుపేట శ్రీ భీమలింగేశ్వరస్వామి చరిత్ర మొదలైన గ్రంథాలను రచించారు. ప్రిన్సిపాల్ ఇలింద్ర రంగనాయకులుగారు గీతాంజలిని వచనకవితగా అనువదించారు. స్వర్ణలత వీరి నవల. అన్నంభొట్ల సూర్యనారాయణగారు అలెగ్జాండరు పురుషోత్తముల కథను ఆత్మగౌరవం అనే పద్యకావ్యంగా రచించారు. సాయిసాహిత్య రచన చేశారు. మధురకవి వారణాసి వేంకటేశ్వరులుగారు రత్నసానువు, ఏణరాజు మొదలైన కావ్యాలను రచించారు. ఆంధ్రసాహిత్య చరిత్రసంగ్రహం, బాల ప్రౌఢ వ్యాకరణ వ్యాఖ్యానాలు కూడా వీరి ప్రసిద్ధ గ్రంథాలు. పోలూరి రామకృష్ణయ్యగారు మహామాయా! శివా చండికా!, వెన్నముద్ద కృష్ణయ్య మొదలైన పద్యరచనలను చేశారు. జన్నాభట్ల వీరభద్రయ్యగారు కనకాభిషేకం నాటకాన్నీ, జ్యోతిష్యశాస్త్ర గ్రంథాన్నీ రచించారు. వడ్లమూడి సిద్ధయ్యకవిగారు బుద్ధవిజయం, ప్రేమాంజలి, మహాభినిష్క్రమణం, అమరసింహుడు, సారస మిత్రం, విజ్ఞాన భాస్కరం, సులక్షణ, సుధన్వుడు, అనపోతు, సుధీర మొదలైన రచనలు చేశారు.



భాగవతుల సుబ్బారావు



సూర్య నారాయణ



వారణాసి వేంకటేశ్వర్లు

రెంటాల గోపాలకృష్ణగారి కవితాసంపుటులు– సంఘర్షణ, సర్పయాగం. ఇవి అభ్యుదయ కావ్యాలు. వీరు అనేక ప్రాచీన ప్రబంధాల్ని వచనకావ్యాలుగా వ్రాశారు. వాత్స్యాయనుడి కామసూత్రాలకు సరళవచనవ్యాఖ్య రచించారు. గంగినేని వేంకటేశ్వరరావుగారు ఉదయిని కావ్యరచయిత. వారి ఎర్రజెండాలు, ఆదర్శకుటుంబం గ్రంథాలు ప్రసిద్ధాలు.



కామేశ్వరరావు

గోపాలుని సుబ్రహ్మణ్యశర్మగారు నారదవిలాస ప్రబంధ రచయిత. ఈ గ్రంథానికే మూడున్నర వజ్రకథ అని మరో పేరు ఉంది. కనిసేవక బబ్బెళ్లపాటి కామేశ్వరరావుగారు శ్రీరామచంద్రప్రభుశతకం, శ్రీసోమ

సుందరశతకం రచించారు. తులసీదాసు రచించిన రామచరిత మానసాన్ని వీరు శ్రీరామచరిత మానసామృతం అనే పేరుతో తెనిగించారు. వీరికి ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీ సహకారం లభించింది. శ్రీసత్యసాయిశతకం, శ్రీలక్ష్మీసుందరీ శతకం, ఆంధ్రమహావీర నాటకం హైమవతీపరిణయం అనే గ్రంథాల్ని కొన్ని యక్షగానాల్ని రచించారు.

నాయని సుబ్బారావుగారు సౌభద్రుని ప్రణయయాత్ర, మాతృగీతాలు, ఫలశ్రుతి, విషాదమోహనం, జన్మభూమి వంటి రచనలు చేశారు. నాయనివారి కుమార్తె కృష్ణకుమారిగారు తెలుగు జానపద గేయగాథల్ని గురించి పరిశోధన చేశారు. మానసలీల పద్యకవితా సంపుటి. అగ్నిపుత్రి, ఏం చెప్పను నేస్తం- వచనకవితా సంపుటాలు. కాశ్మీరదీపకళిక వచన యాత్రాకావ్యం. నయాగరా అనే అభ్యుదయ కావ్యాన్ని రచించి నయాగరా కవులుగా ప్రసిద్ధిపొందిన కుందుర్తి ఆంజనేయులు, బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యంగార్లు మన వారే! అనిసెట్టి సుబ్బారావుగారు అగ్నివీణ, బిచ్చగాళ్ల పదాలు రచించారు. అనేక చలనచిత్రాలకు పాటలను, మాటలను రచించారు. ప్రముఖ వేణుగాన విద్వాంసుడు ఏల్చూరి విజయ రాఘవరావు వినయాంజలి మొదలైన అనేక గ్రంథాల్ని రచిం చారు. కవిహృదయం అనే రచన చిన్నతనంలోనే చేశారు. మన ఊరివారైన మాచిరాజు దేవీప్రసాద్‌గారి ప్యారడీలు ఆ సాహిత్యశాఖలో ఆణిముత్యాలు.

పి.వి. రమణారెడ్డిగారు క్షేమేంద్రుని చారుచర్య అనే



పమ్మి వెంకట రమణారెడ్డి

గ్రంథాన్ని తెలుగులో వ్యాఖ్యానిం చారు. నాగార్జునవింశతి, బుద్ధ హృదయం, వేదసందేశం, విశు ద్ధమనుస్మృతి, గాయత్రీమంత్రం, వేమన వేదం, చాణక్య నీతి, బృహ స్పతి రాజధర్మసూత్రం మొదలైన అనేక గ్రంథాలు వీరి రచనలు. అక్కిరాజు సదానందరావుగారు సమకాలీన విద్యారంగం- సమాజసేవలు అనే గ్రంథాన్ని రచించారు. మంజుశ్రీ అక్కిరాజు రమాపతిరావుగారు మన ఊరివారు. కోలవెన్నువారి జీవితానుభవాలు, వీరేశలింగంపంతులు-సమగ్రపరిశీలన, వీరేశలింగం డైరీలు, వ్యావహారిక భాషావికాసం-చరిత్ర మొదలైనవి వీరి రచనలు. జీవనవాహిని వీరి స్వీయచరిత్ర. వీరు శతాధికగ్రంథకర్త. వీరి తమ్ముడు డా॥ అక్కిరాజు సుందర రామకృష్ణగారు పశ్యముఖితో ముఖాముఖి, శనీశ్వరా!, రంగ రంగా! శారదా! మొదలైన గ్రంథాలను 25 దాకా రచించారు.

ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డిగారు సాహిత్యవివేచన అనే వ్యాససంపుటిని వెలువరించారు. రఘునాథనాయకుడు రచించిన నలచరిత్రను పరిష్కరించి ప్రచురించారు. నిమ్మ లూరి భాస్కరరావుగారు పాట వెన్నెల మీద నడుస్తున్నది, ఇప్పవనాల గాలి, భుజంభుజం కలిపినడుద్దాం వంటి రచనలు చేశారు. ఎన్.వి.కె. గోవిందుగారి తొలిరచన భిక్షువు పుట్టింది యిక్కడే! నీలి చంద్రయ్యగారు కైశికేయ కుసుమాభరణం, చౌడేశ్వరీ విజయం రచించారు. రొంపిచర్ల లక్ష్మీనరసింహా చార్యులుగారు రామాయణ రహస్యార్థదీపిక రచించారు.

పొత్తూరి వీరరాఘవ వరప్రసాదరాయకవిగారు



గోపాల కృష్ణమూర్తి

కోటప్పకొండ క్షేత్ర మాహాత్మ్యము- చరిత్ర, బ్రాహ్మణ వంశచరిత్రను రచించారు. అనేక శతకాలను రచించారు. వీరు చతుర్విధ కవిత్వ ధురీణులు. సాహిత్యచరిత్రను బండ్ల కెత్తారు. ముప్పాళ్ల గోపాలకృష్ణ మూర్తిగారు అనేక శతకాలను రచించిన మహనీయుడు. పోతుకూచి వేంకటశాస్త్రిగారు విజ్ఞానదీపిక గ్రంథాన్ని రచించారు. దోనెపూడి లక్ష్మీప్రసాద రావుగారు రచిం చిన శ్రీశివదేవీ స్తోత్రమాల, దేవీకర్ణామృతం, సాయిబాబా చరిత్ర పాటలు, పద్యాలు పులకింప చేస్తాయి.

భాస్కరుని వేంకట లక్ష్మీనారాయణ ప్రసాదరావుగారు శ్రీకపోతేశ్వరస్వామి చరిత్రను, విష్ణుభొట్ల సూర్యనారాయణ గారు నరసరావుపేట తాలూకా గ్రామ చరిత్రను రచించారు.

గోపరాజు లక్ష్మీఆంజనేయులు గీతాగానం, వాన, పెనుగాలి, జీవననావ, గీతావైభవం రచించారు. ధూళిపాళ బసవబ్రహ్మం గీతానవనీతాన్ని, (బవసగీత) రచించారు. కంపా చెన్నకేశవరావు రంగస్థల కరదీపికను రచించారు. ఆధ్యాత్మిక మణిమాల పేరుతో మంచి విషయాల నందించారు కాల్వ వేంకటేశ్వర్లు. చిమటా వెంకటదాసు దాదాపు 15 పుస్తకాలు రచించారు. అవి ఆధ్యాత్మికాలు, జానపద సంబం ధాలు. రంగస్థల నటుడు వి.వి. స్వామిగారు మానవతా

సౌరభం అనే వచనకవితా గ్రంథాన్ని వెలువరించారు. ఎం.వి. ప్రసాదరావు రచించిన ఊర్వశీ ఊర్వశీ వచనకవితా గ్రంథం.

మాదిరాజు రామకోటేశ్వరరావుగారు త్రికూటాద్రి చరిత్రతో సహా 44 గ్రంథాల దాకా రచించారు. త్రికూటాద్రి చరిత్రకు అనుబంధంలో నగమాహాత్మ్యం, పుణ్యక్షేత్రాలు, లలితారహస్యనామభాష్యం, మునీంద్రుల చరిత్ర, సాలంకయ్య, ఆభీరకన్యల చరిత్రలు ఉన్నాయి. వీరి మోక్షసామ్రాజ్య గ్రంథం ప్రకృష్టమైనది.

దోనెపూడి వెంకయ్యగారు 50 పైచిలుకు గ్రంథాలు, వ్యాసాలు రచించారు. వజ్రనఖ వంటి అనేక కలంపేర్లతో జాగృతి మొదలైన పత్రికలలో పుంఖానుపుంఖంగా వ్యాసాలు రచించారు. వీటిలో దేశభక్తి, రమణభక్తి, భారత భాగవత సంబంధాలు అనేకం. సద్గుణ సంపద, రమణ సహస్రనామ భాష్యం, గురువాచకకోవై, ఆత్మసంవాదాలు వంటి గ్రంథాలు ముఖ్యమైనవి.

ముక్తినూతలపాటి వేంకటసుబ్బారావుగారు, ఆది శంకర సౌందర్యలహరి, శివానందలహరిని పద్యానువాదం చేశారు. వేంకటేశ్వరచరిత ద్విపద కావ్యము, శ్రీ సదాశివ బ్రహ్మేంద్రయోగి అధ్యాత్మకీర్తనల వ్యాఖ్య, కాళికాసహస్ర నామావళి వ్యాఖ్య, ఆధ్యాత్మిక కీర్తనాసముదాయము రచించారు.

డా॥ పడవల వేంకటసుబ్బయ్యగారు మంత్రపుష్పం, శ్రీమద్భగవద్గీత-పరతత్త్వబోధిని, శ్రీసూక్తం-పురుషసూక్త మందలి పరతత్త్వము, గరుడపురాణము, వయోజనగీత వంటి ఆధ్యాత్మిక గ్రంథాల్ని రచించారు. ప్రయాగ కృష్ణమూర్తిగారు వేంకటరమణ శతకం, నా కవనం-నాక వనం వంటి రచనలు చేశారు. ఆచార్య బూదాటి వేంకటేశ్వర్లుగారు మువ్వల సవ్వడి ఇక్కడ రచించిందే! వారు అనేక గ్రంథాలు, వ్యాకరణ వ్యాఖ్యానాలు రచించారు.

ఎం.ఆర్.కె. మూర్తిగారు హాస్యప్రపంచం, సూక్తి ప్రపంచం, ప్రసంగం ఒకకళ, స్టాంపులసరదా, గమ్యాన్ని నిర్దేశించుకో! సమయపాలన వంటి అనేక గ్రంథాలను రచించారు. గాలి సుబ్బారావుగారు త్రిశతి, మరపురాని మన నాయకులు, లోకరీతి గ్రంథాలను రచించారు. డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డిగారు కోదండరామ నక్షత్రమాల, వీరాంజనేయ తారావళి, గణేశ తారావళి, ఇంద్రధనుస్సు, దశోపనిషచ్చంద్రికలను రచించారు. డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తిగారు సమస్యాతోరణము, సరసవినోదినీ రామాయణము, షిరిడీ సాయిసుధ, తెలుగు హనుమాన్ చాలీసా, శంకరవిజయకథలు, నిత్య దేవతా స్తుతిః, శ్రీమద్రామాయణ సందేశం, ఉపనిషత్సందేశం మొదలైన గ్రంథాలను రచించారు. ఈశావాస్యాది దశోపనిషత్తులను ఉపనిషత్సుధ అనే తేటగీతుల పద్యకావ్యంగా అనువదించి, స్వీయవ్యాఖ్యానాన్ని వ్రాశారు. పద్యసౌరభం అనే పేరుతో 200 పద్యాలకు వ్యాఖ్యను, 300కు పైగా సంగీత, సాహిత్య, ఆధ్యాత్మికవ్యాసాలను, పిల్లలకోసం 100కు పైగా కథలను, విజయవాడ ఆకాశవాణి సమస్యాపూరణం కార్యక్రమంకోసం 500కు పైగా పద్యాలను రచించారు. డా॥ మేళ్లచెర్వు భానుప్రసాదరావు రచించిన దేవీఅశ్వధాటివ్యాఖ్య పండితప్రశంసా పాత్రమైంది. వీరు శృంగారతిలకానికీ, రాక్షస కావ్యానికీ పద్యానువాదాలు చేసి, విశేషమైన వ్యాఖ్యలను రచించారు. కొప్పరపు సోదరకవుల సుబ్బరాయ శతకానికి విపుల వ్యాఖ్యను సంతరించారు. డా॥ చిటిప్రోలు సుబ్బారావుగారు నాళం కృష్ణారావుగారిని గురించి లఘుగ్రంథాన్ని వ్రాశారు.

పమిడి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సమర్థసద్గురు సాయినాథ చరితామృతం, సాయినాథ శిరసానమామి, సుందర కాండ వచనం వంటి అనేక రచనలు చేశారు. శ్రీదాసగణుకృత సాయినాథ స్తవనమంజరికి రచనాసహకారం అందించారు. బండారు విజయలక్ష్మిగారు బాలశంకరశతకం వ్రాశారు. గోపరాజు నాగేశ్వరరావుగారు చూడలేక చార్మినార్, సమర యోగి పేరుతో అన్నాప్రగడ కామేశ్వరరావుగారి జీవితచరిత్రను రచించారు. ఈవూరి వేంకటరెడ్డిగారు చేజర్ల కపోతేశ్వర మాహాత్మ్యం, డా॥ రత్నాకరం రాముగారు శ్రీవిజయం, పుర వైభవం రూపకాలను రచించారు.

అన్నాప్రగడ ఆంజనేయశర్మగారు గీతావైభవం గ్రంథాన్ని రచించారు. పి.వి.ఎస్.ఆర్. ప్రసాదరావుగారు వేదవాఙ్మయం-ఒక పరిచయం, బ్రహ్మసూత్రాలు-పరిచయం, రఘువంశరాజులకథలు రచించారు. యాజ్ఞవల్క్యచరిత్రను పరిష్కరించారు.

శ్రీవిద్యారణ్యస్వామివారి అనుగ్రహభాషణలను విద్యారణ్య మఠంవారు ప్రకటించారు. పిడుగురాళ్లలో ఆశ్రమజీవితాన్ని గడిపిన శ్రీకేశవతీర్థస్వామి పూర్వాశ్రమంలో మన ఊరివారే! రామతీర్థ వేదాంతభాష్యం వీరి ప్రముఖ రచన.

# సంస్కృత పండితులు



డా॥ కాసులనాటి నాగరాజశర్మ
వైస్ ప్రిన్సిపాల్

నరసరావుపేట జమీందారులైన మల్రాజు వంశీయులు సంస్కృత పండితుల ననేకులను పోషించారు. వీరి ఆస్థానపండితుడు శ్రీమతుకుమల్లి కనకాద్రిశాస్త్రి. వీరు షట్శాస్త్ర పారంగతులు. శ్రీతిరుమల నల్లాన్‌చక్రవర్తి వేంకటరామ నృసింహాచార్యులు ఆస్థాన విద్యాపరీక్షకులు. శ్రీ విక్రాల రామచంద్రాచార్యులు వేద వేదాంగాది బహుశాస్త్ర మర్మజ్ఞులు.

శ్రీ రామడుగు వేంకటేశ్వరశాస్త్రి ఆశుకవితా ధురీణులైన కొప్పరపు సోదరకవుల గురువర్యులు. వీరు సాహిత్య వ్యాకరణాలంకార ఛందశ్శాస్త్ర నిష్ణాతులు. శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్రులు బహుశాస్త్ర సముద్రులు; అపరశంకరులు. శంకరాశంకర భాష్యవిమర్శ, వేదాంత కౌస్తుభః, వేదాంత ముక్తావళి, వేదాంత సంగ్రహం, వేదాంత నిశ్చయం, వేదాంత అద్వైతామృతం, పశ్యశబ్ద మీమాంస, శారీరక చతుస్సూత్ర విచారః, ధర్మప్రశంసా, భగవద్గీతా భాష్యార్క ప్రకాశికా, అద్వైత తత్త్వామృతం, సిద్ధాంత సింధువు, శరద్రాత్రి, సిద్ధాంతకౌముదీ వ్యాఖ్యా, జాతక ముహూర్త సిద్ధాంతం, హయగ్రీవశతకం మొదలైన శతాధిక గ్రంథాలను రచించారు. వీరు హయగ్రీవోపాసకులు.



రామరాయకవీంద్రులు

బెల్లంకొండ రాఘవరావుగారు సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషాపండితులు. పండిత కవిపోషకులు. జాతీయ భావ సంపన్నులు. నిరంతర సమాజసేవా పరాయణులు. దాన కర్ణులు. వీరి సహధర్మచారిణి కనకమ్మగారు శ్రీరామలింగ ప్రతిష్ఠ అనే ఏకసర్గ ప్రబంధ రచయిత్రి. ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి ప్రశంసల నందుకున్న విదుషీమణి.

దమ్మాలపాటి శేషగిరిశర్మగారు సన్యసించి శ్రీ చిదానంద భారతీస్వామివారైనారు. వీరు భువనేశ్వరీ పీఠాధిపతులు. ఉపనిషత్కావ్యాలు, సర్వదర్శన సంగ్రహం, హరిహర తత్త్వం, భువనేశ్వరీదేవిగీతా, శ్రీ గాయత్రీ శంకరభాష్యము, పంచోపనిషత్తులు మొదలైన అనేకగ్రంథాలు రచించారు.

దక్షిణామ్నాయ శ్రీశృంగేరిశారదాపీఠాధిపతులు శ్రీ భారతీతీర్థ మహాస్వామివారి పూర్వనామధేయం తంగిరాల సీతారామాంజనేయులుగారు. ప్రతాపగిరి శివరామశాస్త్రిగారు, దమ్మాలపాటి శేషగిరిశర్మగారు, లంకా సీతారామ శాస్త్రిగారు వీరి పూర్వాశ్రమ గురువర్యులు. భారతీతీర్థ మహాస్వామివారి కవనశక్తి పండితజన ప్రశంసాపాత్రమైనది. పండిత ప్రకాండులు సైతం ప్రశంసించే విధంగా సంస్కృత కవితను చెప్పిన కవితల్లజులు. వీరు 'శ్రీ అభినవవిద్యాతీర్థ అక్షరమాలా స్తోత్రం', 'శ్రీ చంద్రశేఖర భారతీ నవరత్నమాలా స్తోత్రమ్', 'ధర్మశాస్తా', 'శ్రీ గురుధ్యానమ్', శ్రీ శారదా పంచ రత్నస్తుతి', 'శ్రీ శంకర భగవత్పూజ్యపాదాచార్యస్తవః' 'శ్రీ చంద్రమౌళీశ్వర వర్ణమాలా స్తుతిః', 'శ్రీ శారదాస్వర్ణరథ సమర్పణా పద్యావళిః', 'శ్రీ మహాగణపతి సేవా పద్యావళిః' మొదలైన వాటిని రచించారు.

లంకా సీతారామశాస్త్రిగారు ఉద్దండపండితులు. వీరు సీతారామాయణాన్ని అశ్వధాటీ వృత్తంలో రచించారు. ఇది ఏడు కాండల గ్రంథం. ప్రతికాండంలో 24 శ్లోకాలున్నాయి. ప్రతి శ్లోకంలోని ప్రథమాక్షరాల్ని కలిపితే గాయత్రీ మంత్రం సంఘటితంకావటం ఈ కావ్య విశిష్టత. గీర్వాణవ్యాకరణం, వేదాంతసంగ్రహం, త్యాగ రాజచరితామృతం, శ్రీమదద్వైత విజయం, సరస్వతీవిలాసం, శ్రీహనుమత్పూజా విధానం వీరి రచనలు.



లంకా సీతారామశాస్త్రి



సత్యనారాయణశాస్త్రి

మద్దులపల్లి సత్యనారాయణశాస్త్రి గారు మంత్రవేత్త. జ్యోతిష, ముహూర్త విషయాలలో దిట్ట. వీరు నామ రత్న పంచాశిక రత్నావళీ (సీత), ప్రభ, అతియోగ జ్యోతిష సుము హూర్త గ్రంథాలను రచించారు.

జన్నాభట్ల వేణుగోపాలకృష్ణమూర్తిగారు గాయత్రీ ఉపాసకులు. బాల్యంలోనే వైయాసికీ సాహస్రీ అనే గ్రంథాన్ని ఆశువుగా రచించారు. శ్రీదత్తగురు భగవద్గీతా, దత్తోపనిషత్తు, శ్రీమాణిక్యప్రభా మొదలగు గ్రంథాలను రచించారు.



రామకృష్ణమాచార్యులు

వేదాన్తం రామకృష్ణమాచార్యులు గారు శ్రీరామకృష్ణ ఓరియంటల్ స్కూలును, కళాశాలను స్థాపించారు. ఆగమశాస్త్రపండితులు. ఆయుర్వేద వైద్యులు. జాతీయ భావ పరిపూర్ణులు.

కాసులనాటి గురునాథశర్మగారు జాతీయభావ సంపన్నులు. ఇ.ఎల్.సి.ఎం. పాఠశాలలో పనిచేసే సమయంలో ఆ పాఠశాల యాజమాన్యం ఖద్దరుధారణను నిషేధించింది. వారు 'ఖద్దరు తమప్రాణ'మని చెప్పి ఆ ఉద్యోగాన్ని తృణప్రాయంగా త్యజించారు. సంస్కృతాంధ్ర పంచకావ్యాల మీది వీరి పట్టు అనన్య సామాన్యం.

శనివారపు పెదసుబ్బారెడ్డిగారు చాటుశ్లోక రత్నాకరులు. ఉప్పశ్రీ వంటి పండితుల ప్రశంసల నందుకున్న మేటి. పి.వి. రమణారెడ్డిగారు సాహిత్యవిద్యాప్రవీణ పట్టభద్రులు. షడ్భాషాపండితులు. ఇప్పటి పాకిస్థాన్‌లో ఉన్న ఝేలం గురుకులంలో వేదవిద్యను అభ్యసించారు. ఆర్యసమాజ అనుయాయులు. బహుగ్రంథకర్తలు. డా॥ చంద్రపాటి నాగవరప్రసాద రావుగారు ఒరిస్సారాష్ట్రంలోని పూరీనగరంలో ఉన్న శ్రీసదాశివ కేంద్రీయ సంస్కృత విద్యాపీఠంలో అద్వైతావరణ విభాగంలో వరిష్ఠప్రధానాచార్యులు. వీరు వేదేషు రథః, ఆనందకేతుః, వివేకోదయః మొదలైన గ్రంథాలను రచించారు. డా॥ కె. గాయత్రీదేవిగారు ఆంధ్రవిశ్వవిద్యాలయ సంస్కృత శాఖాధ్యక్ష పదవిలో ఉన్నారు. వీరు కావ్యకళానిధి, సంస్కృత బోధనా నైపుణ్యం మొదలైన గ్రంథాలను రచించారు. డా॥ వేదాన్తం సత్యశ్రీనివాసఅయ్యంగార్‌గారు విష్వక్సేనస్తోత్రం, అత్రి మహర్షికృత సమర్చనాధికరణం మొదలైన రచనలను చేశారు. ఈ వ్యాసకర్త నాగరాజశర్మ రచన శ్లోకమంజరి (గాయత్రీ వైభవం). ఇది లఘుకావ్యం. వీరు నారాయణభట్టు రచించిన రసికాష్టకం, ఆదిశంకరాచార్యులవారు రచించిన ఆత్మషట్కం, యతిపంచకం, దండి రచించిన అనామయ కావ్యాలకు, చంద్రతేజో వ్యాఖ్యానాలను రచించారు. దీవి శ్రీనివాస దీక్షితులుగారు 'నీలామోహనాష్టకమ్' కావ్యాన్ని రచించారు.

లంకా లక్ష్మీనరసింహశర్మగారు, గుదిమెళ్ల వేంకట బుచ్చితాతాచార్యగారు, వేదాల రాజగోపాలాచార్యులుగారు, వావిలాల గురుమూర్తిగారు, శేషాద్రిగారు, రంగాదొరైగారు, నిమ్మగడ్డ వేంకట లక్ష్మీనరసింహశాస్త్రిగారు, ప్రసిద్ధ విశ్రాంత సంస్కృత పండితులు.

వంగల కృష్ణమూర్తి అవధానిగారు కృష్ణయజుర్వేద క్రమాంత స్వాధ్యాయి. శ్రీవిద్యాపారాయణ పారీణులైన వెలమకంటి అనిల్‌కుమార్‌సాయిగారు 'చండీపారాయణదార్'. కొండకావూరి అప్పయ్యదీక్షితులుగారు శైవాగమ పండితులు, ముఖ్య అర్చకులు. గుండెపూడి చంద్రశేఖర అవధానిగారు వేద అధ్యాపకులు. స్మార్తపండితులైన మార్తి వేంకటరామశర్మగారు సంస్కృత వేదపాఠశాల ప్రిన్సిపాల్. వీరందరు సంస్కృతభాషకు చేస్తున్న సేవలు నిరుపమానము.

డా॥ నారాయణం రాంబాబుగారు, కాసులనాటి వేంకటరామ సువర్చలాదేవిగారు, డా॥ కంచర్ల కామేశ్వరరావుగారు, రెంటాల నరసింహారావుగారు మొదలగువారు సంస్కృతాధ్యాపనం కావిస్తూ భాషాభివృద్ధికి కృషిచేస్తున్నారు. ●

> 'భారతస్య ప్రతిష్ఠే ద్వే సంస్కృతం సంస్కృతి స్తథా'
> స్వదేశ విదేశాలలో మన భారతదేశానికి గొప్ప ప్రతిష్ఠ ఉంది.
> దానికి కారణాలు రెండు. ఒకటి : మన సంస్కృత భాష.
> కాగా రెండవది : మన సంస్కృతి.

# పల్లె పాట

**డా॥ కూరపాటి వేంకటకోటయ్య,** ప్రిన్సిపాల్ (రిటైర్డ్)



మహోన్నత చరిత్రకు మకుటాయమానం మన నరసరావుపేట. చారిత్రక, సాంస్కృతికచైతన్య మిక్కడ వెల్లి విరిసింది. మన ఊరి జానపదగేయ సాహిత్యాన్ని ఆ దృష్టితో పరిశీలించుటకే ఈ వ్యాసం.

జానపదగేయం రసగుళిక. తేనెతేటలూరు తియ్యందనం మధురానుభవాల చిక్కందనం జానపద గేయానికే చెల్లుతాయి. జానపదుల జీవనాడి, తరతరాల సంస్కృతికి ప్రతీక. పని-పాట ఈ రెండూ జానపదుల సొంతం. 'కలసి ఉంటే కలదు సుఖం' అనే భావన వీరికి ముఖ్యం. 'ఎద్దులా పనిచేస్తాడు - మొద్దులా నిద్రపోతాడు' అనే వ్యవహారం జానపద జీవితం నుండే పుట్టింది. కూనిరాగంతో మొదలయ్యే పాట వరినాట్లు వేసేటప్పుడు, వరి కోతలప్పుడు, కుప్ప నూర్చేటప్పుడు, తూరుపారపోసేటప్పుడు, వడ్లబండి తోలే టప్పుడు- నిరంతరం జానపదుల జీవితంతో పెనవేసుకొనిపోయింది.

నరసరావుపేట పేరుకే పట్టణమైనా పల్లెలతోనూ, పల్లీయ సంస్కృతితోనూ ముడివడి ఉంది. కుటుంబ వ్యవస్థ, ఆచారవ్యవహారాలు, ఆటపాటలు, పండుగలు పబ్బాలు మొదలైన అంశాల సమాహారం ఈ ఊరు. జానపదగేయం జానపద జీవిత నౌకకు చుక్కాని. జానపదుల సాంఘిక జీవనం వెనుకటి తరానికీ ముందుతరానికీ సంధికాలం. ఆహారవ్యవహారాలు, ఆచార సంప్రదాయాలు అలరారే జానపద జీవితం మధురాతి మధురం. జానపదులు పిండి వంటలు కలసి చేసుకొంటారు. తమ రెక్కల కష్టమే తమకు శ్రీరామరక్ష అని భావిస్తారు. జానపదాల అంతరంగం పాటకు భూమిక. పని వేగాన్నిబట్టి గేయస్వరూపముంటుంది.

ఆవేశాలు, అనుభూతులు, ఆలోచనలు పాటకు ప్రేరేపకాలు. నరసరావుపేట పొలాలలో దుక్కి దున్నేటప్పుడూ, విత్తు నాటేటప్పుడూ, పైరు కోసేటప్పుడూ, పంట నూర్చేటప్పుడూ వ్యవసాయ సంస్కృతి విరాజిల్లింది. ప్రత్తి, మిరప, పసుపు, జొన్న, వరిగ, కంది, పెసర, మినుము వంటి పంటలతో ఈ పొలాలు కళకళ లాడుతుంటాయి. రైతులు భూదేవిని తమ ఇలవేల్పుగా భావిస్తారు. ఏరువాక పండుగ రైతన్న జీవితానికి ప్రధాన భూమిక. అందుకే 'ఏరువాకపున్నమి' జరుపుకోవడం ఇక్కడ కనిపిస్తుంది. ఎడ్లనలంకరించడం, పందేలు జరుపుకోవడం ఇక్కడి సంస్కృతిలోని ప్రధాన భాగం.

వానల్లు కురవాలి వానదేవుడా! వరిచేలు పండాలి వానదేవుడా!

ఏమి కావాలమ్మో! ఏమికావాలి! ఏరువాకమ్మకు వాన కావాలి!

అంటూ గేయాలనాలపించడం ఇక్కడి కష్టజీవుల్లో కన్పిస్తుంది.

ముందు అరక దున్నేవాడా! ముద్దుల మేనత్త కొడకా!

దాపటెద్దుకు దప్పికాయెరా! దాని విప్పి నిలబెట్టరా!

జానపద కుటుంబ జీవనానికి ఆడమనిషే ఆధారం. అప్పగింతల పాటలు, తిరగలి పాటలు, కవ్వం పాటలు, దంపుడు పాటలు, రాట్నం పాటలు యథార్థ జీవితానికి ప్రతిబింబాలు. జానపదులు సోదెపాటల ద్వారా సంతృప్తిని పొందుతారు. కోలాటం, చెక్కభజనలు, బుర్రకథ, జానపదాల సాంస్కృతిక చైతన్యానికి తీపిగురుతులు.

జానపదుల శృంగార గేయాలు చలువపందిళ్లు. ఏతాం పాటలు శృంగార పారవశ్యానికి మచ్చుతునకలు.

చీమకన్నుల చీరా తేరా! పాముకన్నుల పైట తేరా!

మల్లెపూల సరము తేరా! మాపిటికి మా యింటికి రారా!

జానపద స్త్రీల కట్టు, బొట్టు, కాలి అందెల సవ్వడులు శృంగార ప్రేరకాలు.

కోటప్పకొండ తిరణాల కొస్తావా? కొంటె కోనంగీ!

చిలకపచ్చా చీర కట్టి చిలుకలా వస్తారా! పిల్లాగాడా!

తిరునాళ్ల సందడిలో జానపదులు పాడుకునే పాటలు వారి ఉల్లాసానికి ప్రతీకలు. జానపదులుపాడే భక్తిగేయాలు వారి హృదయాల నుండి ఉప్పొంగుతాయి.

జానపద జీవితాలలో నోములు, వ్రతాలు ఎక్కువ. 'నాగులచవితి' వంటి పండుగల్లో వీరు పుట్టలో పాలుపోసి నాగదేవత నారాధిస్తుంటారు. నరసరావుపేట ప్రాంతంలోని జానపద గేయాలు జానపదుల ఆదర్శజీవితానికి నిలువుటద్దాలు! ఇక్కడి రైతుల, పనివాళ్ల మేలుకలయిక మానవత్వానికే మకుటాయమానం!!

# కొప్పరపు సోదర కవులు



## మాచవరం వేంకట చెంచురామ మారుతీ సుబ్బరాయశర్మ

'ఆశుకవిచక్రవర్తులు'గా 'అవధాన కవిసమ్రాట్టులు' గా ఆంధ్రసాహిత్యంలో అజరామరమైన కీర్తిని ఆర్జించిన పుంభావభారతులు కొప్పరపు సోదరకవులు (కొప్పరపు వేంకట సుబ్బరాయకవి (1885–1932), వేంకటరమణకవి (1887 –1942). గంటకు 700 పద్యాల వేగంతో వీరు ఆశుకవిత్వం చెప్తుంటే నాటి కవి, పండితలోకం నివ్వెర భజించింది. **తిరుపతి వేంకటకవులు- కొప్పరపుకవుల మధ్య జరిగిన సాహిత్యసంగ్రామం అప్పుడే కాదు; ఎప్పటికీ సంచలనమే! 'నువ్వా?నేనా? అంటూ సవాల్ విసురుకుంటూ వారు పద్యాలు గుప్పిస్తుంటే ఆంధ్ర లోకం ఆనందంతో తడిసి ముద్దయ్యింది.** అంతటి మహా కవులు కొప్పరపు సోదరకవులు ఇక్కడి వారు కావడం మన కందరికీ గర్వకారణం. ఆ మహాకవులను స్మరించుకుందాం! ఈ నేల తల్లిని భజించుకుందాం!!

కొప్పరపు సోదరకవుల జన్మస్థానం నరసరావుపేటకు దగ్గరగా ఉన్న సంతమాగులూరుకు ప్రక్కనే ఉన్న కొప్పరము గ్రామం.

మ॥ మలరా డ్వేంకట నారసింహ నరరాణ్మాణిక్య సంస్థాన వ
ర్తుల నిస్తుల్య దిగంత విశ్రుత సుకీర్తుల్ హేమ దుర్గాకృపా
బల సందీప్త సురాపగాభ కవితాబంధాశుధారావధా
న లసత్ ప్రజ్ఞులు కొప్పరంపు కవుల న్వారల్ పితల్ దీనికిన్.

–సాధ్వీమాహాత్మ్యము

ఇలా వారు మన జమీందార్‌గారి ఆస్థానకవీంద్రులుగా చెప్పు కొన్నారు.

నరసరావుపేట పూర్వనామము 'నరసారాయనిపేట'. అంతకు ముందు ఇది 'అట్లూరు'. మలరాజు రాజావారి పేరున కోట, పేట వెలసి 'నరసరావుపేట'గా రూపాంతరం చెందింది. ఎంతో ప్రసిద్ధి గాంచింది. కొప్పరపు కవులకు మలరాజువారి సంస్థానంతోనూ, నరసరావుపేటతోనూ అపురూపమైన బంధం ఉంది. వీరు అవధానవిద్యనూ, ఆశుకవిత్వాన్నీ ఏల్చూరులో పోతరాజు రామకవిగారి వద్ద నేర్చుకున్నారు. సంస్కృత భాష, సారస్వతములు నరసరావుపేటకు చెందిన రామడుగు రామ కృష్ణశాస్త్రిగారి వద్ద అభ్యసించారు. కొప్పరపు కవులకు నరసరావుపేట గురుస్థానీయమైనది.

వారికి ఈ ఊరుతో ఆ బాల్యబంధం పెనవేసుకొని ఉంది. నరసరావుపేటలోని 'శ్రీ సుబ్బరాయ & నారాయణ కళాశాల స్థాపకులు నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారు. నాగసరపువారికి కొప్పరపు సోదరులు ఆబాల్యమిత్రులు. ఈ సోదరకవులు 'సుగుణ సముదాయ! పున్నయ్య సుబ్బరాయ!' అనే మకుటంతో 'సుబ్బరాయ శతకము' వ్రాసి సుబ్బరాయ శ్రేష్ఠికి అంకితం ఇచ్చారు. చిన్నతనంలోవీరికి సంబంధం



కొప్పరపు వేంకట సుబ్బరాయకవి - వేంకట రమణకవి

చిన కిరాణాషాపునకు సరుకుల కోసం వెళ్లినపుడు జరిగిన సంఘటనలు మనల్ని పులకాంకితులను చేస్తాయి. సరుకుల పొట్లాలు కట్టేలోపే వీరు ఒక శతకాన్ని ఆశువుగా చెప్పేవారట. ఇలా ఎన్నోమార్లు పద్యాలను గుప్పించి వారిని మైమరపించే వారట.

కొప్పరపు సోదరకవులు ప్రారంభదశలో పాతూరు ఆంజనేయస్వామి దేవాలయంలో ఎన్నో అవధానాలు చేశారు. అలాగే సుబ్బరాయకవిగారి కుమారుడు సీతారామప్రసాద రావు తమ పినతండ్రియైన వేంకటరమణకవిగారి ఆధ్వర్యంలో అవధానప్రస్థానం ప్రారంభించిందీ ఇక్కడే!

అపర ఆదిశంకరాచార్యులైన బెల్లంకొండ రామరాయ కవీంద్రునితో కొప్పరపుకవుల అనుబంధం అనుపమానం. కొప్పరపుకవులు కొండవీటిసీమకు, కొప్పరానికి కొండంత కీర్తిని తెచ్చిపెట్టిన కవితాకోటీశ్వరులు. నరసరావుపేట ప్రాంతంలో జన్మించి చిరయశస్సును ఆర్జించిన పుణ్య మూర్తులు.

నేను కూడా 29-11-1967న నరసరావుపేట కన్నెల ఆస్పత్రిలోనే కళ్లు తెరిచాను. నా బాల్యము నరసరావు పేటలోనే సాగింది. అటువంటి నా జన్మభూమి నరసరావు పేటకు ప్రణమిల్లుతూ.... మా శర్మ ●

## స్కౌట్ సేవలో - మేళం శ్రీకృష్ణ

స్కౌట్ ఉద్యమానికి సుమారు 43 సంవత్సరాలు సుదీర్ఘసేవలు అందించి నరసరావుపేట వాస్తవ్యులు, న్యాయ వాది మేళం శ్రీకృష్ణ సేవారంగంలో విశిష్టస్థానం సాధించారు. శ్రీకృష్ణ సేవలను అభినందిస్తూ 1986లో అప్పటి రాష్ట్రపతి ఆర్. వెంకట్రామన్‌గారు 'ప్రెసిడెంట్ ఆఫ్ రోవర్ ఇండియా' జాతీయ పురస్కారం అందించారు. భారత స్కౌట్స్ జాతీయ కౌన్సిల్ 60 మంది సభ్యులలో శ్రీకృష్ణ ఒకరు కావటం విశేషం. మహారాష్ట్ర రాచూర్ ప్రాంతంలో భూకంపం వచ్చినపుడు, పంజాబ్ రాష్ట్రం, అమృతసర్‌లోని స్వర్ణదేవాలయం వద్ద శాంతి యాత్రలోనూ పాల్గొని కేంద్రప్రభుత్వ ప్రశంసలు పొందారు. శ్రీలంక, మలేషియా, సింగపూర్, బ్యాంకాక్‌లలో జరిగిన అంతర్జాతీయ సేవాశిబిరాలలో పాల్గొని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అభినందనలు స్వీకరించారు. సుమారు 20 జాతీయ శిబిరాలలో పాల్గొని తమ సేవలను అందించారు. అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ కుముద్‌బెన్ జోషిగారితో కలసి రాజ్‌భవన్‌లో వందమంది జోగినుల పెళ్లిళ్ల కార్యక్రమంలో పాల్గొని ఉత్తమ సమాజసేవకునిగా ప్రముఖుల మన్ననలు పొందారు.



శ్రీకృష్ణగారు 1991-'92 సంవత్సరంలో రాష్ట్ర యువజన పురస్కారం, 1995-'96లో జాతీయ యువజన పురస్కారం స్వీకరించారు. సెంట్రల్ ఫిలిం సెన్సార్‌బోర్డు సభ్యునిగా బాధ్యతలు నిర్వహించారు. ఆ రోజుల్లో గుంటూరు జిల్లా తాడికొండలో 'స్కౌట్ రీజినల్ క్యాంపింగ్ అండ్ ట్రైనింగ్ సెంటర్' ఏర్పాటులో చురుగ్గా పనిచేశారు. సుమారు 25 సంవత్సరాలు కోటప్పకొండ తిరునాళ్లల్లో శాంతిభద్రతల పరిరక్షణలో సహకరిస్తూ, యాత్రికులకు సేవలు అందిస్తూ ప్రత్యేకశిబిరాలు నిర్వహించారు. 'కొంతమంది గవర్నర్ల, ఆంధ్రవిశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ డా॥ ఎల్. బుల్లయ్య, శ్రీమతి సంయుక్త బుల్లయ్య తదితర ప్రముఖుల ఆశీస్సులతో, అభినందనలతో స్కౌట్‌విభాగం ద్వారా సేవలు అందించటం నా అదృష్టం' అని మేళం శ్రీకృష్ణగారు సవినయంగా చెప్పటం అభినందనీయం!! ●

**మూడు రత్నాలు**

మన మందరమూ మెరుస్తున్న రాళ్లను రత్నాలంటున్నాం: కానీ అసలైన రత్నాలు మూడే!
అవి : జలం, అన్నం, సుభాషితం.




# నాయని వారికి నమస్సులు!



డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి
ప్రిన్సిపాల్ (రిటైర్డ్)

అది ఒక దశాబ్ది కాలం- 1945-1955. నరస రావుపేట మునిసిపల్ హైస్కూల్ ప్రధాన ప్రవేశద్వారం దగ్గరలో పెద్ద వేపచెట్టు. ఆ చెట్టు దగ్గర అంత మనిషి పేము బెత్తం పట్టుకుని గంభీరంగా ఉన్నాడు. విద్యార్థినీవిద్యార్థులు పరుగులు తీస్తున్నట్లు నడుస్తున్నారు. ఆ హిమవన్నగ శృంగమూర్తి ప్రధానో పాధ్యాయులు నాయని సుబ్బారావుగారు.

నాయనివారు వస్తుతః సుకుమారుడు, సౌమ్యుడు, మధుర వచస్వి, హాస్యప్రియుడు, అజాతశత్రువు, నిరాడంబ రుడు, పదవీ బిరుద సత్కార విత్తకాంక్షా విరహితుడు.

సుబ్బారావుగారు తెల్లని ధోవతి, లాల్చీ ధరించి కను విందు చేసేవారు. గుబురు మీసాలతో అందాలొలికే ముఖం ఆయనది. వికారి సంవత్సరంలో(1899) పుట్టిన 'మన్మథుడు' ఆయన.

మొదట్లో (1928-1942) నాయనివారు మన పుర పాలకసంఘ ఉన్నతపాఠశాలలో చరిత్ర ఉపాధ్యాయులుగా పనిచేశారు. ఇంగ్లీషు, నీతిబోధ మొదలైనవి కూడా ప్రాసంగి కంగా చెప్పేవారు. సహాయ ప్రధానోపాధ్యాయులుగా కూడా వున్నారు. ఆ తరువాత ప్రధానోపాధ్యాయులుగా పదోన్నతిని పొంది శ్రీకాకుళం బదిలీ అయ్యారు. అక్కడ మూడేండ్లు (1942-1945) ఉన్నారు. ఆ తరువాత ప్రధానోపాధ్యాయు లుగా మళ్లీ (1945) నరసరావుపేటకు వచ్చారు.

నాయనివారు వివిధ పోటీలలో విజేతలైన విద్యార్థులకు విలువైన సాహిత్యగ్రంథాలను బహుమతులుగా ఇచ్చి వారిలో సాహిత్యాభిరుచి కల్పించేవారు. విద్యార్థులు ఏ ప్రక్రియలో వ్రాసినా అందులోని సౌందర్యాన్ని స్వాగతించి వారిని ప్రోత్సహించేవారు. అనిసెట్టి సుబ్బారావుగారు, కుందుర్తి ఆంజనేయులుగారు, అక్కిరాజు రమాపతిరావుగారు, చేకూరి రామారావుగారు, నాయని కృష్ణకుమారిగారు... ఇంకా ఎందరో విద్యార్థులు ఆయనకు ఆత్మీయులు. ఆనాటి ఇక్కడి అభ్యుదయకవులంతా నాయనివారి శిష్యులే! నాయనివారి శుశ్రూషవల్ల వారి రచనల్లో కరుణరసం, సౌకుమార్యం, సాహిత్యమూల్యాలు పెల్లుబికాయి.

నాయని సుబ్బారావుగారు నరసరావుపేటలోని భీమలింగేశ్వరాలయంలో జరిగిన కార్తికాభిషేక కార్యక్రమాల్లో నిత్యం పాల్గొన్న పరమభక్తుడు. ఆయన ఆత్మనిష్ఠుడైన జ్ఞాని, తత్త్వచింతనాపరుడు, సహ శీలి. అభేదభావం ఆయన మనస్సులో తారాడేది. ఆయన అందరినీ గౌరవించేవారు.

నరసరావుపేటలో ఉద్యోగంలో ప్రవేశించేనాటికి ఆయన నాలుగు కావ్యాలు వ్రాశారు. సౌందర్యలహరి, సౌభద్రుని ప్రణయయాత్ర, ఫలశ్రుతి, మాతృగీతాలు. ఇవి వారు నరసరావుపేటలో ఉన్నప్పుడే ముద్రణ రూపాన్ని పొందినై.

సుబ్బారావుగారి సంతానం - కృష్ణకుమారిగారు, మోహనరావుగారు, స్వప్నకుమారిగారు, రమాకుమారిగారు, కోటేశ్వరిగారు-మన పురపాలకసంఘ ఉన్నతపాఠశాలలోనే చదివారు. 1952లో కృష్ణకుమారిగారు హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంధ్రశాఖలో ఉపన్యాసక పదవిలో నియుక్తురాలయ్యారు. 1954లో కృష్ణకుమారి, స్వప్నకుమారి గార్ల వివాహాలు నరసరావుపేటలోనే జరిగాయి.

ఉద్యోగ విరమణానంతరం నాయనివారు 1957లో హైదరాబాదులో స్థిరపడ్డారు. అక్కడ కొన్నాళ్లు రేడియోలో 'స్క్రిప్టు రైటర్'గా ఉద్యోగం చేశారు. వేదనావాసుదేవము, భాగ్యనగరకోకిల, జన్మభూమి, విషాదమోహనము, 32 రేడియోనాటికలు, ఐదు కథలు, మూడు పాటలు రచించారు.

హైదరాబాదు చేరిన తొలినాళ్లలో - పుట్టినఊరైన పొదిలెను, మెట్టినఊరైన నరసరావుపేటను వదలినందుకు ఎంతో బాధపడ్డారు. ఆయన తన ఇష్టదైవమైన వాసుదేవుడితో ఇలా అన్నారు 'వేదనా వాసుదేవము'లో.

ఉ॥ పుట్టిన గ్రామమున్ విడిచి పొమ్మని మిత్రుని సాకతమ్మునన్
మెట్టిన యూరు కాదని సమీకృత సంకర సర్వసభ్యతా
ఘట్టము సర్వ సంస్కృతి వికార నికార ఘరట్టమైన యీ
కొట్టములోన దెచ్చి పడగూల్చితి వెంత దయాపరుండవో!!

నరసరావుపేట పట్ల వారికి అంతటి ప్రీతి!!

నాయనివారి జీవితం ఉదయవేళ పొదిలిలో ప్రారంభమైంది. జీవితమధ్యభాగం నరసరావుపేటలో ఉజ్జ్వలంగా వెలుగొందింది. జీవిత చరమభాగం హైదరాబాద్‌లో గడిచింది. నరసరాట్పుర విద్యావిహాయసాన్ని తేజస్వంతం చేసిన నాయని భాస్కరుడు - తత్రాపి మధ్యాహ్న మార్తాండుడు మహేశ్వర స్వరూపుడు; మనందరికి నమస్కార్హుడు.

ఉ॥ నాయని యింత జాణ యగునా? యని, తత్ కృతు లింత లెస్సలా
నా? యని, శబ్దముల్ కదలునా? యని, భావము లాటకత్తె లా
నా? యని, గుండియల్ పలుకునా? యని కావ్యరహస్యముల్ ఫలా
నా యని నే వచింప గలనా? యని యచ్చెరు వొందితిన్ మదిన్.

- 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి

# నా అనుబంధం


## గన్నమనేని లింగయ్య

ఆంధ్రజ్యోతి మాజీ విలేఖరి




నేను నరసరావుపేటకు సమీప గ్రామమైన కేతముక్కల అగ్రహారంలో పుట్టిపెరిగాను. అక్కడే ప్రాథమికవిద్య నభ్యసించాను. ఇక్కడి మునిసిపల్ హైస్కూల్‌లో చదివి, ఎస్.ఎఫ్.ఐ. లో లీడర్‌గా ఉండి, నర్సరావుపేటలో స్థిరపడ్డాను. సి.పి.ఐ.లో పనిచేశాను. మొదట 1952 లో ప్రజాశక్తి పత్రికకు ఏజెంటు కమ్ రిపోర్టర్‌గా, 16 ఏళ్ళు విశాలాంధ్ర, ఆంధ్రభూమి, దక్కన్ క్రోనికల్, జనతా పత్రికల్లో పనిచేశాను. 1960లో ఆంధ్రజ్యోతి ఏజెంటు కమ్ రిపోర్టర్‌గా పనిచేశాను. గుంటూరు జిల్లా వర్కింగ్ జర్నలిస్టు యూనియన్‌కు 2 సార్లు అధ్యక్షునిగా చేసి, 1986లో వాటి ద్వారా రష్యాలో పర్యటించాను.

జై ఆంధ్ర ఉద్యమానికి వ్యతిరేకంగా సమైక్యం కోసం ఎస్.వి. రావు, అనిశెట్టి కృష్ణ, నన్నపనేని వెంకట్రావు, నాళం నరసింహారావు, నేను కృషిచేశాం. కోలవెన్నువారితో నాకుగల పరిచయాన్ని మర్చిపోలేను.

1960 లో నార్లవారి సంపాదకత్వంలో ఆంధ్ర జ్యోతి ప్రారంభంకాగా ఆ పత్రికకు ఏజెంటు కమ్ రిపోర్టర్‌గా 35 సంవత్సరాలపాటు పనిచేసి 'గన్నమనేని'కి బదులు 'జ్యోతి' లింగయ్యగా పేరు తెచ్చుకొన్నాను. నాకు కమ్యూనిజం పట్ల అభిమానం మెండే! ఐనప్పటికీ అన్ని రాజకీయ పార్టీల నాయకులతోనూ నాకు సత్సంబంధా లుండేవి. అది నా అదృష్టం.

మత సామరస్యానికి, ప్రాచీన ఆధునిక సాహిత్య సంప్రదాయాలకు, వీటితోబాటు హేతువాదానికి, గొప్ప ఉపన్యాసకులకు, గాయనీ గాయకులకు, కవి పండితులకు, కళాకారులకు, సుందరభవనాలకు మందిరం మన నరసరావుపేట. మన నరసరావుపేట ఇంకా గుణాత్మక పురోభివృద్ధిని సాధించాలని కోరుకొంటున్నాను.

### పిల్ల గాలి - పాఠకులు

పూల మొక్కలు పుష్పాలను పూస్తాయి. అంత వరకే! ఆ పూల సుగంధాన్ని దశదిశలా వ్యాపింపజేసి వాటి జన్మను సార్థకం చేసేది పిల్లగాలి. అదేవిధంగా కవులు కావ్యాలను వ్రాస్తారు. అంతవరకే! వాటిని ప్రచారం చేసి ఆ కవుల కృషికి సార్థకతను కలిగించేవారు సహృదయ పాఠకులు.

# అనిశెట్టి, నయాగరా కవులు




**డా॥ పి.వి. సుబ్బారావు**

తెలుగు రీడర్ (రిటైర్డ్)


ప్రముఖ అభ్యుదయకవిగా, ప్రయోగాత్మక నాటక రచయితగా, కథారచయితగా, సినీరచయితగా బహుముఖ ప్రజ్ఞతో ఆధునికసాహిత్యాన్ని సుసంపన్నం చేసిన అనిశెట్టి సుబ్బారావు 1922 అక్టోబర్ 23వ తేదీన నరసరావుపేటలో జన్మించారు. అనిశెట్టి కోటిలింగంగారు ఆయన తండ్రి. శ్రీమతి ఆదిలక్ష్మమ్మ ఆయన తల్లి. అనిశెట్టికి ఇద్దరు తమ్ముళ్లు. కథారచయితగా, సినీ దర్శకుడిగా ప్రసిద్ధుడైన అప్పారావుగారు ఆయన పెద్దతమ్ముడు. న్యాయవాదిగా మంచిపేరును పొందిన కృష్ణారావుగారు ఆయన చిన్నతమ్ముడు. అనిశెట్టి పూర్వీకులు మచిలీపట్టణం నుండి నరసరావుపేటకు వచ్చారు.



అనిశెట్టి సుబ్బారావు

అనిశెట్టి తమ ప్రాథమిక విద్యాభ్యాసం 1927 నుండి 32 వరకు 'జబ్బర్ సింగ్' అనే ఉపాధ్యాయుడి దగ్గర పూర్తి చేశారు. 1932లో నరసరావుపేట మునిసిపల్ ఉన్నత పాఠశాలలో చేరాడు. 1937లో ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలో కృతార్థుదయ్యాడు. ఆ పాఠశాలలో అప్పట్లో ప్రముఖ భావకవి శ్రీ నాయని సుబ్బారావు ఉపాధ్యాయులు. శ్రీ కుందుర్తి ఆంజనేయులు, శ్రీ రెంటాల గోపాలకృష్ణ, శ్రీ బెల్లంకొండ రాందాసు, శ్రీ మాచిరాజు దేవీప్రసాదు వంటివారు అనిశెట్టికి సహాధ్యాయులు. శ్రీ ఏల్చూరి సుబ్రహ్మణ్యం, స్వామికేశవతీర్థులు ఆయనకు సీని యర్ విద్యార్థులు.

అనిశెట్టి 1942లో గుంటూరు ఏ.సి. కళాశాల నుండి ఆంగ్లసాహిత్యం ప్రధానాంశంగా పట్టభద్రు లయ్యారు. 1942 ఆగస్టు 8వ తేదీన గుంటూరులో క్విట్ ఇండియా ఉద్యమంలో చురుగ్గా పాల్గొని అరెస్టయ్యారు. 1943లో మద్రాసు లా కళాశాలలో చేరాడు. అప్పటికే కమ్యూనిస్టు భావాలతో ప్రభావితుడయ్యాడు. బెంగాలీ విప్లవకారుడు రతన్‌కుమార్ ఛటర్జీకి ఆశ్రయమిచ్చి, బెంగాలీ కరపత్రాలను అనువాదం చేశాడు. అనిశెట్టికి ప్రభుత్వం రెండేళ్ల జైలుశిక్ష విధించి రాయ వెల్లూరు జైల్లో బంధించింది. అందువల్ల అప్పటికే నిశ్చయ మైన పెళ్లి రెండేళ్లపాటు వాయిదాపడింది.

అనిశెట్టి మామగారు అప్పట్లో రాజమండ్రిలో కోర్టు మేజిస్ట్రేట్‌గా ఉండేవారు. ఆయన తండ్రి, మామ- ఇద్దరూ తమ పలుకుబడిని ఉపయోగించి అనిశెట్టి జైలు శిక్షాకాలం పూర్తికాకముందే విడిపించే ప్రయత్నం చేశారు. అయితే అధికార్లు అనిశెట్టి కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలతో తెగతెంపులు చేసుకోవాలని ఆంక్షపెట్టారు. సిద్ధాంతాలకు అంకితమైన వ్యక్తిగా అనిశెట్టి అందుకు ససేమిరా అంగీకరించలేదు. జైలు నుండి విడుదలైన తరువాత ఆయన పెళ్లి 1945 జూన్ 6వ తేదీన గతంలో నిశ్చయమైన లక్ష్మీదేవితోనే జరిగింది.

**నరసరావుపేట నవ్యకళాపరిషత్‌తో-నయాగరాకవులు :**

అనిశెట్టి ప్రధాన కార్యదర్శిగా, ఆయన మిత్రబృందం ఏల్చూరి, కుందుర్తి, బెల్లంకొండ రాందాసుగార్లు నరసరావుపేట కేంద్రంగా 1942లో నవ్యకళాపరిషత్ స్థాపించారు. దేవరకొండ బాలగంగాధరతిలక్‌గారు అందులో సభ్యులు. వీరంతా సంప్రదాయ సాహితీ కల్మషాలపై నయాగరాలా విజృంభించి 'నయాగరా కవులు'గా ప్రసిద్ధి పొందారు. కుందుర్తి, ఏల్చూరి, రాందాసులు ఒక్కొక్కరు మూడేసి ఖండికల చొప్పున రాసి, సంకలనం చేసి 12 కవితాఖండికలతో నయాగరా కవితా సంపుటిని మార్చి 1944లో ప్రచురించారు. ఈ సంపుటి అభ్యుదయకవితా ప్రస్థానంలో అచ్చయిన తొలికావ్యం. ఈ నయాగరా కవితా సంపుటిని అనిశెట్టి పెళ్లి సందర్భంగా అతనికి కానుకగా సమర్పించారు.

నయాగరాకవుల్లోని ఏల్చూరి సుబ్రహ్మణ్యంగారు సోవియట్ ల్యాండ్ పత్రిక సంపాదక బాధ్యతల నిర్వహణలో కవితారచన పై దృష్టి సారించలేదు. బెల్లంకొండ రాందాసుగారు అగర్భశ్రీమంతుడు. తండ్రి బెల్లంకొండ రాఘవరావు గారు భూస్వామి, సాహితీపరుడు.


బెల్లంకొండ రాందాసు

రాందాసు విలక్షణమైనకవి. తొలుత శివభక్తితత్పరతతో, పిదప కృష్ణప్రేమతో పునీతుడై తరువాత సామ్యవాద దృక్పథంతో రచనలు చేశాడు. రాందాసు గారు రాసిన పునర్జన్మ నాటకం బాగా ప్రసిద్ధి పొందింది.

## వచన కవితా పితామహుడు కుందుర్తి :

నయాగరాకవుల్లో వచనకవితా పితామహుడుగా లబ్ధ ప్రతిష్ఠుడైన అభ్యుదయకవి కుందుర్తి ఆంజనేయులుగారు.

ఉన్నత పాఠశాల విద్యాభ్యాసం తరువాత విజయవాడ ఎస్.ఆర్.ఆర్. కళాశాలలో (1939-'41) ఇంటర్మీడియట్ చదివే రోజుల్లో విశ్వనాథ సత్యనారాయణగారి శిష్యుడుగా ప్రాచీనకవిత్వం పట్ల అభిమానం ఏర్పరచుకున్నాడు. అప్పట్లో భావకవితా ప్రభావంతో పద్యకావ్యాలు 'సౌప్తికం', 'నా ప్రేయసి' వంటి ప్రేమ కావ్యాలు రాశాడు. నరసరావుపేట నవ్యకళాపరిషత్ ప్రభావంతో కవితా దృక్పథం మారి కమ్యూనిస్టు భావాల వైపు ఆకృష్టుడయ్యాడు. వచనకవితకు ఆదర గౌరవాలను సంతరించి పెట్టేందుకు ప్రముఖపాత్ర వహించి వచనకవితా పితామహు డయ్యాడు. 'పాతకాలం పద్యమైతే వర్తమానం వచన గేయం' అని ఎలుగెత్తి చాటాడు. వచన కవితాప్రచారానికి ఫ్రీవర్స్‌ఫ్రంట్ (1958) స్థాపించాడు.

అభ్యుదయకవితా ఉద్యమంలో అనిసెట్టి అగ్నివీణ ప్రసిద్ధమైంది. శ్రీశ్రీ ప్రశంసించినట్లు 'అభ్యుదయ కవితా ఉద్యమానికి 'అ, ఆ'లు అనిసెట్టి, ఆరుద్రలు'. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణాత్మక సిద్ధాంతాన్ని తొలిసారిగా 'గాలిమేడలు' నాటకంలో ప్రవేశపెట్టాడు. ఆంగ్లసాహిత్యాన్ని ఆపోశన పట్టిన అనిసెట్టి 'ఫాంటోమైమ్' 'డ్యాన్స్ బాలె' వంటి ప్రక్రియలను తెలుగులో తొలిసారిగా రూపొందించాడు. ఆయన 'శాంతి' తెలుగులో తొలి మూకాభినయం. దీనిననుసరించి గిడుతూరి సూర్యం మానవుడు-చిరంజీవి, రెంటాల గోపాలకృష్ణ ఆటంశిక్ష, మూడో యుద్ధం, వేణుగోపాలస్వామి ఆది మానవుడు' వంటి మూకాభినయాలు వచ్చాయి. అనిసెట్టి ప్రభావంతో కె.వి. రమణారెడ్డి, గంగినేని వెంకటేశ్వరరావు, రెంటాల గోపాలకృష్ణ వంటివారు కవులుగా రూపొందారు. అనిసెట్టి నరసరావుపేట ఎస్.ఎస్.ఎన్. కళాశాల రజతోత్స వాల్లో (1975 మార్చి) పిలకా గణపతిశాస్త్రిగారితో కలిసి పాల్గొని ప్రేరణాత్మక ప్రసంగం చేశారు.


రెంటాల గోపాలకృష్ణ

'విగ్రహంలా వెయ్యేళ్ళు బ్రతకడం కన్నా విద్యుత్తులా ఒక్క క్షణం వెలగడం మిన్న' వంటి ఆయన కవితా సూక్తులు ప్రసిద్ధాలు.

అనిసెట్టి అనారోగ్యంతో 1979 డిసెంబర్ 27వ తేదీన నరసరావుపేటలో మరణించారు. ఆయన అంత్య క్రియల్లో పురప్రముఖులు మాజీ ముఖ్యమంత్రివర్యులు శ్రీకాసు బ్రహ్మానందరెడ్డి వంటివారు పాల్గొని నివాళులర్పించారు. అనిశెట్టి, నయాగరా కవులు ఆధునిక సాహిత్యచరిత్రలో ధ్రువ తారలు.

### కాటూరి వారి చుట్టలు



కాటూరి వేంకటేశ్వరరావుగారు ప్రముఖ కవులు. కోలవెన్ను రామకోటీశ్వరరావుగారి మిత్రులు. నరసరావుపేటకు తరచూ వస్తూ ఉండేవారు. సాహిత్యాభిమానులు ఆయనను కలుస్తూ ఉండేవారు. ఒకసారి భోజనానంతరం కొందరు సాహిత్య ప్రియులు ఆయన దగ్గరకు వచ్చారు. కాటూరివారికి చుట్ట తాగే అలవాటు ఉండడం వల్ల చుట్టలు చుట్టుకుంటున్నారు. 'ఏదైనా విషయాన్ని చెప్పండి!' అని అభిమానులు కాటూరివారిని అడిగారు. 'నా సంగతే చెబుతా!' అన్నారు కాటూరివారు.

'నేను రోజూ పడుకోబోయే ముందు చుట్టలు చుట్టుకొని పడుకుంటాను. ఆదిశేషుడు కూడా చుట్టలు చుట్టుకొని పడుకుంటాడు. ఆయన అంశనాలో ఉందేమో!' అని 'చుట్టచుట్టుకొని శేషుడు నిద్రపోవును/ ముది పన్నగములలో మొదటివాడు (వసుచరిత్ర, 1- 82) అనే పద్యాన్ని చదివారు. 'భాషాపరశేషభోగి' అంటూ కాటూరి వారిని ప్రశంసించారు- కోలవెన్నువారు.

# దళిత కవులు



పి.జె. రత్నం

టీచర్ (రిటైర్డ్)

నరసరావుపేటలో దళిత కవులలో ప్రముఖులైన వారు విద్వాన్ బీర్నీడి ప్రసన్నగారు 'మధుమాసం, పృథ్వీభాగవతం' కావ్యాలను రచించారు. వీరి పృథ్వీ భాగవతాన్ని 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారు కోరి అంకితం తీసుకున్నారు. ప్రసన్నగారి సోద రులు విజయదత్తుగారు స్వర్గావతర ణము అనే పేరుతో ఉమర్ ఖయ్యాం రుబాయత్‌లను అనువదించిరి. వీరి కవితను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ద్వితీయ ఆస్థానకవి శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి గారు బహుధా ప్రశంసించిరి. విద్వాన్ బి. యేలియాగారు సచిత్ర క్రీస్తుచరిత్ర, క్రీస్తు ఖండ కావ్యము, బుద్ధ జాతకకథలు, హనుమచ్చరి త్రము (బుర్రకథ), కుమారత్వచ్యుతి – ప్రాప్తి మొదలైన రచనలు చేసిరి. వీరు నూతన వధూవరులను ఆశీర్వ దిస్తూ, ప్రముఖులను ప్రశంసిస్తూ కొన్ని వందల పద్యరత్నా లను రచించిరి.



బిర్నీడి ప్రసన్న



బి. ఏలియా



కనుపర్తి సంతోషం

'సాహిత్య విద్వాన్' డా॥ కనుపర్తి సంతోషముగారు పరిణామ కిరణములు అను ప్రబో ధ పద్యకావ్యమును, క్రీస్తు శతకము ను రచించారు. అనేక క్రైస్తవ గీతా లను రచించారు. సంతోషంగారి కుమారులు డా॥ కె.వి. వసురాజు గారు మంచి పద్యకవి. పసుపులేటి జేసురత్నంగారు శుభశ్రీ, కవిచంద్ర, విజేత, క్రీస్తురాజు, నా హృదయం గ్రంథాలను రచించారు.



బిర్నీడి విజయదత్తు

'కవిసంయమీంద్ర' శామ్యూల్‌గారు 'విశ్వాలోకము' అనే పద్యకావ్యాన్ని, కైవల్య కపోతీశ్వరీయము అనే నాటకాన్ని రచించారు. కుందా భాస్కరరావుగారు బంతిపువ్వు (కథా సంపుటి), అక్షరకోకిల (కవితా సంకలనం), సువర్ణం (కథల సంపుటి), మనసు వాకిళ్లు రచించారు. మద్దూరి నగేష్‌బాబు గారు వెలివాడ, పుట్ట, నరలోక ప్రార్థన రచించారు. బొమ్ము వెంకయ్యగారు యేసుక్రీస్తు శతకమును తెలుగు, ఆంగ్లభాష లలో రచించారు. కుందా దేవిడ్‌విల్సన్ మరియు చిరకాల శివరాజేంద్రప్రసాద్ జంటకవులుగా 'విశ్వమంత కవిత' కవితా సంపుటిని రచించారు. డా॥ కాకాని సుధాకర్‌గారు గుండె డప్పు, గుండె మీద కొట్టకండి, పదునెక్కిన పాట, శంబూక శకం, దండోర దరువు మొదలైన వాటిని రచించారు. డా॥ జజ్జర జ్యోతిప్రసాద్‌రావుగారి రచనలైన జల చైతన్యం, మేలుకొలుపు, బహుమతి నందినవి.

**ఆ నాలుగు ఒకడికే ఉంటే?!**

నూతన యౌవన గర్వం, అపరిమితమైన ధనం, అదుపులేని అధికారం, అంతులేని అజ్ఞానం – మనిషి సర్వనాశనం కావటానికి వీటిలో ఒక్కటి చాలు. అటువంటప్పుడు ఒకడికి ఈ నాలుగూ ఉన్నట్లయితే ఇక వాడి సంగతి చెప్పేదేమున్నది?

– పంచతంత్రం

# కథ - నవల



## గంధం యాజ్ఞవల్క్యశర్మ

రిటైర్డ్ కోఆపరేటివ్ సబ్ రిజిస్ట్రార్

ఆంగ్ల భాషలోని షార్ట్ స్టోరీ అనబడే చిన్నకథకు సమానార్థంగా రూపుదిద్దుకొన్నదే మన ఆధునిక తెలుగు కథ. ఆంగ్లభాషలోని 'నావెల్' అనే వచనప్రక్రియ తెలుగు సాహిత్యంలో 'నవల' అనేపేరును సంతరించుకొంది. కథ ఆ క్షణాన ఆకలి తీర్చుకొనే ఫలాహారం లాంటిదయితే, నవల షడ్రసోపేతమైన విందుభోజనం లాంటిదని సాహిత్యకారుల విశ్లేషణ. నరసరావుపేట మునిసిపాలిటి వంద సంవత్సరాల వేడుక జరుపుకొంటున్న సందర్భంలో ఈ పట్టణానికి తమ ఆధునిక కథా, నవలా రచనలతో వన్నె తెచ్చిన రచయితలను/ రచయిత్రులను గుర్తుచేసుకోవటం మన బాధ్యత. ఈ రచయితలు కొందరు ఈ పట్టణాన పుట్టి పెరిగిన వారైతే, మరికొందరు ఉద్యోగరీత్యానో మరో కారణాననో ఇక్కడ కొచ్చి కొంతకాలం నివసించి తిరిగి వెళ్లినవారో, లేక ఇక్కడే నిలిచిపోయినవారో అయినా అందరూ నరసరావుపేటను తమ రచనావ్యాసంగానికి చిరునామాగా చెప్పుకొన్నవారే కావటం విశేషం.



చలం

ప్రముఖ కథ, నవల, వ్యాసరచయిత శ్రీగుడిపాటి వెంకటచలంగారు 'చలం'గా ప్రసిద్ధులు. వీరు 1920వ దశకంలో నరసరావుపేట పట్టణాన ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగా పనిచేసిన కాలాన ఎన్నో అద్భుతమైన కథలు, నవలలు రాసారు. స్త్రీ జనాభ్యుదయం వారి చాలా రచనల్లో ముఖ్య వస్తువు. వారి కథల్లో 'ఆ రాత్రి', 'పాపఫలం', 'జలసీ', 'కర్మ మట్లా కాలింది' మొదలైనవి చాలా మంచి కథలు. సుమారు వంద కథలదాక రాసారాయన. 'శశిరేఖ', 'మైదానం', 'వివాహం', 'అమీనా' వీరి నవలలు. హైందవ సమాజంలో నెలకొన్న కొన్ని మూర్ఖపు సంప్రదాయాలపై తిరుగుబాటు చేసిన రచయిత చలం. జీవితపు ఆఖరి మజిలీలో రమణాశ్రమం చేరి అక్కడ దివంగతులయ్యారు.

1930 సంవత్సరంలో నరసరావుపేటలో జన్మించిన నాయని కృష్ణకుమారిగారు సుప్రసిద్ధ కవి నాయని సుబ్బారావుగారి తనయ. తాను ఆరవ తరగతి చదువుతున్న తరుణాననే తన తొలి కథ రాసినట్లు చెప్పుకొన్నారామె. ఆ తర్వాత ఎన్నో కథలు రాసారు. 'ఆయాత' ఆమెగారి కథా సంపుటి కాగా 'గౌతమి' ఆమెగారి నవల.

అంతర్జాతీయంగా కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించిన మేటి వేణుగాన విద్వాంసుడు ఏల్చూరి విజయరాఘవరావుగారి జన్మభూమి నరసరావుపేట పట్టణమే. వీరు సంగీతజ్ఞులేకాక మంచి కథకులు కూడ. అమెరికాలో స్థిరపడిన వీరు చాలా మంచి తెలుగు కథలు వ్రాసారు. 'నయాగరా నవ్వుతోంది', 'వెలుగును మింగిన చీకటి', 'వంగపండు పట్టుచీరె' కథలున్న వీరి 'ఆద్యంతాలు' అన్న కథాసంపుటిలో 16 కథ లున్నాయి. భారత ప్రభుత్వం వీరిని 'పద్మశ్రీ' అవార్డుతో సత్కరించింది.

నరసరావుపేటకు తన కథా, నవలా రచనలతో కీర్తి తెచ్చిన ప్రముఖులలో ఒకరు డా॥ అక్కిరాజు రమాపతిరావుగారు (మంజుశ్రీ). జీవిత దృశ్యాలు, మంచు కురిసిన రాత్రి, మైథిలి, మంజుశ్రీ కథలు, పంచాక్షరి వీరి కథాసంపుటాలు. జారుడు మెట్లు, దూరతీరాలు, నూరు శరత్తులు వీరి నవలలు.



అనిసెట్టి అప్పారావు

అనిసెట్టి అప్పారావుగారు అనిసెట్టి సుబ్బారావుగారి తమ్ముడు. 1953లో వీరి కథ, 'ఎవరు, ఏమిటి, ఎందుకు' ప్రముఖ మాసపత్రిక 'భారతి'లో ప్రచురణ పొందింది. చాల మంచికథగా ప్రశంస నందు

కొంది. వీరు 'అసావేరి' అనే కలంపేరుతో 'భారతి', 'ఆనంద వాణి' పత్రికలలో కథలువ్రాసారు. 'గొప్పవారి గోత్రాలు' అనే సినిమాను అంతా కొత్తవారితో తీసి సంచలనాన్ని సృష్టించారు.

అనిసెట్టి శ్రీధర్ అనిసెట్టి అప్పారావుగారి కుమారుడు. 'శాహ వర్సెస్ మహా' అనే వీరి కథ సుప్రసిద్ధమైంది. 'బంగారు లోకం' అనే వీరి కథాసంకలనం 2008 సం॥లో ప్రచురితమైంది.

భాగవతుల నరసింగరావుగారు, వారి సతీమణి శ్రీమతి బాలత్రిపురసుందరమ్మగారు– ఇరువురు కలిసి 'బీనా దేవి' అనే పేరుతో ఎన్నో గొప్పకథలు రాసారు. నరసింగరావు గారు 1967-70లో నరసరావుపేటలో సబ్‌జడ్జిగా పని చేసారు. 'రాధమ్మ పెండ్లి ఆగిపోయింది', 'ఫస్ట్‌కేస్', 'డబ్బు', 'కన్నీళ్లొచ్చాయి' వీరి కథలు. 'పుణ్యభూమి! కళ్లు తెరువు', 'హ్యాంగ్‌మి క్విక్' అనేవి వీరి నవలలు. నరసింగరావు గారిప్పుడు లేరు. వారి సతీమణిగారు 'బీనాదేవి' అనే పేరుతోనే రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తున్నారు.

1955 సం॥లో గుంటూరు జిల్లా పెదనందిపాడు మండలం 'పుసులూరు'లో జన్మించిన ప్రతాప రవిశంకర్ తన తొలి తెలుగుకథను 1971లో ప్రచురించటంతో కథా సాహిత్యంలోకి అడుగు పెట్టారు. రవిశంకర్ ఇప్పటికి సుమారు 1,000 కథలు, 20 పైగా నవలలు రాసి ఒక రికార్డు సృష్టించారు. వీరి ఎక్కువ కథలు, నవలలు, డిటెక్టివ్ కథాంశాలకు చెందినవే!

నరసరావుపేటలో 1947 సం॥లో జన్మించిన కుందా భాస్కరరావుగారు 'బంతిపువ్వు' అనే కథతో తన కథావ్యాసంగానికి శ్రీకారం చుట్టారు. 'బంతిపువ్వు' తరువాత 'నంది వర్ధనం', 'సీతాకోకచిలుక', 'నీళ్లు' 'గోరంతదీపం' వంటి కథలు రాసి వాటితో 1974లో బంతిపువ్వు కథాసంకలనాన్ని ప్రచురించారు. వారి మరోపుస్తకం 'సువర్ణం' ఈ మధ్యనే విడుదలయింది.

ఈ వ్యాసకర్త గంధం యాజ్ఞవల్క్యశర్మ పెదనందిపాడు మండలంలోని పుసులూరు గ్రామ వాసి. 1937 అగస్టులో జన్మించిన వీరు కళాశాల విద్యార్థిదశ 1955 నుండే కథా సాహిత్యంలో తన రచనతో పాలుపంచుకొన్నారు. గత 60 సంవత్సరాలుగా ఈ వ్యాసంగంలో వుంటూ వీరు రాసి ప్రచురించినవి సుమారు 175 కథలు, రెండు నవలలు. వీరు ఓ అరడజను నవలికలు, 20 వరకు రేడియో కథలు, నాటికలు రచించారు. 'సెలవ యింది', 'గంధం యాజ్ఞవల్క్యశర్మ కథలు' అనేవి వీరి కథాసంపుటాలు; కాగా 'నీడలు-నిజాలు', 'వెలుగులో వెలది' వీరి నవలలు.

గంధం నాగరాజు యాజ్ఞ్యవల్క్యశర్మగారి అబ్బాయే! 1968 సం॥లో నరసరావుపేటలోనే జన్మించిన నాగరాజు అనతికాలంలోనే 20 కథలు, 'స్థితప్రజ్ఞ', 'పసిడిలంక' అనే నవలలు రాసారు. వీరి 'స్థితప్రజ్ఞ' నవల స్వాతిపత్రిక పోటీలలో బహుమతి నందుకొన్నది. వీరి మరణానంతరం వీరి మిత్రుడు గడిపూడి వేంకటేశ్వరరావు వీరి స్నేహచిహ్నానివాళిగా వీరి కథలను 'కథాసుగంధాలు'గా ప్రచురించారు.

సుంకర కోటేశ్వరరావుగారు 1942 సం॥లో జన్మించారు. 1976వ సం॥లో నరసరావుపేటకు ఉద్యోగ రీత్యా వచ్చి ఇక్కడే స్థిరపడిపోయారు. వీరు బహుముఖ ప్రజ్ఞాశాలి. వీరు 10 వరకు కథలు రాసారు.

60 సంవత్సరాలుగా నరసరావుపేట పట్టణనివాసి అయిన గోపరాజు నాగేశ్వరరావుగారు 1947లో జన్మించారు. వీరు వామపక్ష భావాలతో ఎదిగిన వ్యక్తి. మంచి స్థాయిగల కథలు, నవలలు రాసారు. వీరి ప్రచురితమైన కథలు 100 సంఖ్యను దాటాయి. అందులో 'శవం చెప్పని నిజం', 'నాలుగో సింహం', 'కులభోజరాజు', 'డబ్బుయావ', 'ఒంటరిశిలువ' మొదలైనవి కడుగొప్ప కథలు. గతంలో నాగేశ్వరరావుగారు కొంతకాలం పాత్రికేయునిగా పనిచేసారు. వీరు రాసిన నవలలు 16. అందులో 'సర్పయాగం', 'దండెం మీది చిలకలు' పోటీలలో బహుమతుల నందుకొన్నాయి. 'దూది పూలు' బహు ప్రశంసలందుకొన్న నవల. 'చూడలేక చార్మినారు', 'గోపరాజు కథలు' అన్నవి వీరి కథాసంకలనాలు.

నెమలూరి భాస్కరరావు నరసరావుపేట వాస్తవ్యులు. వీరు వామపక్ష భావాలతో చాల కథలు వ్రాసారు. నక్సలిజం వైపు ఆకర్షితులై ఆ ఉద్యమంలో చేరి కొంతకాలం రహస్య

జీవితం గడిపారు. ఆ కాలాన 'అజ్ఞాత సూర్యుడు', 'నిరంజన్', 'మల్లిక్', 'పద్మనాభం' అనే పేర్లతో ఎన్నో కథలు రాసారు. అజ్ఞాత జీవితం నుండి జనజీవన స్రవంతిలోకి తిరిగి వచ్చాక తన పేరుతోనే మరికొన్ని కథలు రాసారు. 'నిష్ఫలత్యాగం', 'నల్లంచు తెల్లచీర' అనే వారి కథలు పాఠకుల ప్రశంసల నందుకొన్నాయి.

తెలుగు లెక్చరర్ డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తిగారు ఆదిశంకరాచార్యులవారి జీతచరిత్రను 'శంకరవిజయ కథలు' అనే శీర్షిక క్రింద 28 కథలుగా వ్రాశారు. ఇంకా వీరు వ్రాసిన 'హరవిలాస కథలు', 'శ్రీకాళహస్తి కథలు', సంగీత కథలు, పిల్లలకోసం వ్రాసిన ఇతర కథలు వివిధ పత్రికలలో ధారా వాహికంగా వచ్చినై.

షేక్ కరిముల్లా గత కొద్దికాలంగా మంచికథలు రాస్తున్న వర్ధమాన రచయిత. ఆయన కలం నుండి గాఢత కల్గిన మంచి కథలు వచ్చాయి; వస్తున్నాయి.

పరాశరం శ్రీనివాసాచార్యులుగారు 1961లో పుట్టారు. బాలల కథలు అనేకం వ్రాసారు; వ్రాస్తున్నారు.

మరెందరో ప్రముఖ రచయితలు తమ కథా నవలా వ్యాసంగాలకు నరసరావుపేట పట్టణం రంగభూమి అని చెప్పుకొన్నారు. అలాంటివారిలో వేదగిరి రాంబాబు, డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు, కె. వాసుదేవరావు (ప్రముఖ జర్నలిస్ట్), ముత్తరాజు సుబ్బారావు, ఇర్రి భక్తవత్సలరావు (నర్సాపేట ఒత్సల) గారలు ముఖ్యులు.

## అనుభూతి ఆవేశం

**మద్దులపల్లి సత్యనారాయణశాస్త్రి**గారు శృంగారరసాన్నే కాదు, ఏ రసాన్ని అయినా తన్మయత్వం చెంది పాఠం చెప్పేవారు. ఒక పర్యాయం వారు శ్రీనాథుడు వ్యాసుడి కోపాన్ని వర్ణించిన పద్యాన్ని చెబుతున్నారు.

కుక్షిప్రోద్భవ నిష్ఠురక్షుధిత దుష్ప్రోద్ధాంధకారంబునం
జక్షుల్ రెండును చిమ్మచీకటులుగా సంరంభశుంభద్గతిం
బ్రేక్షచ్ఛాత్రులు భీతిఁ బొందఁ గడు నుద్రేకించి హట్టంబునన్
భిక్షాపాత్రము ఱాతి మీద శతధా భిన్నంబుగా వైచితిన్.

ఏడురోజులు అన్నం లేకపోయేటప్పటికి వ్యాసుణ్ణి కోపం అంధకారంలా ఆవరించింది. కళ్లు చీకట్లుకమ్మాయి. చూస్తూ ఉన్న శిష్యులు భయపడేటట్లు ఉద్రేకంతో రాతి నేలమీద భిక్షాపాత్రను విసరికొట్టాడు. అది వందల వక్కలయింది. పాఠం చెబుతున్న మద్దులపల్లివారు అపరవ్యాసు లయ్యారు. ఆయన కళ్లు గుండ్రంగా తిరిగాయి. ఒళ్లు చెమట పట్టింది. తమ చేతిలోని టెక్స్ట్ పుస్తకాన్ని విసిరికొట్టారు. చాలా సేపటికిగాని ఆయన సాధారణస్థితికి రాలేకపోయారు. అందుకే మద్దులపల్లి విద్యార్థికల్పవల్లి!

## రాజరాజు రాజసం



**యడవల్లి సూర్యనారాయణ**గారు మహా నటులు. దుర్యోధన పాత్రకు పెట్టిన పేరు. ఆయన విక్టోరియా హాల్లో (ప్రస్తుతం గీతామందిరం ఉన్న చోట) దుర్యోధనపాత్రలో నటిస్తున్నారు. ఆ సమయం లో వారి ఉత్తరీయం జారి క్రిందపడింది. ఆయన వంగి తీసుకోలేదు. తీసుకుంటే రాజరాజ రాజసానికి భంగం కదా! 'ఎవడురా అక్కడ!' అన్నాడు. వెంటనే ప్రభూ! అంటూ ఒకరు వచ్చి ఉత్తరీయాన్ని భుజం మీద వేసి వెళ్లారు! ఆ సారస్యాన్ని గ్రహించిన ప్రేక్షకుల కరతాళ ధ్వనులు ఆకాశాన్ని బ్రద్దలు చేశాయి.

# సాహితీ పోషకులు

**డా॥ నల్లూరి రామారావు,** విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు



నరసరావుపేట కవుల, కవిపోషకుల, కవితా ప్రియుల త్రివేణీ సంగమం. నరసరావుపేట సంస్థాన పాలకులైన మల్రాజు వేంకట గుండారావుగారి ఆస్థానకవి రాళ్లబండి పట్టాభిరామరాజు. గుండారాయణో పాఖ్యానం, కవి సర్ప గారుడం, కవిమూషిక మార్జాలం, మరున్నందన శతకం, శ్యమంతకోపాఖ్యానం మొదలైన రచనలు చేశారు. గుండారావు గారి ఆదరణ పొందిన తాడికొండ మల్లనార్యుడు 'వీరాధిప గుండభూప! విభవదిలీపా!' మకుటంతో శతకం వ్రాసి గుండారావుగారి వలన నందివెలుగులో మాన్యాన్ని పొందాడు.

రాజా మల్రాజు వేంకటనరసింహారావు నల్లాన్ చక్రవర్తి వేంకట నృసింహాచార్యులనూ, విక్రాల రామచంద్రాచార్యులనూ పోషించారు. శ్రీరామచంద్రదీక్షితుని 'జానకీ పరిణయం' సంస్కృత నాటకాన్ని 'విచిత్రరాఘవం'గా అనువదించిన వేంకట పార్థసారథి కవిద్వయం కూడా వీరి ఆస్థానములోని వారే! 'మలరా డ్వేంకట నారసింహ నరరాణ్మాణిక్య సంస్థానవర్తుల' మని చెప్పుకొన్న కొప్పరపు సోదర కవులు కూడా ఈ రాజావారి సత్కారాలు పొందారు. మల్రాజు విజయకృష్ణ వేంకట గుండారావుగారు బి. ఏలియాగారి మల్రాజు వంశవైభవం గ్రంథానికి ఆర్థిక సహాయంచేసి అంకితం తీసు కొన్నారు.



విజయ కృష్ణ గుండారావు

నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారు కొప్పరపు సోదర కవులకు మిత్రులు. శ్రేష్ఠిగారు సోదర కవులకు ఆర్థిక సాహాయ్య మందించారు. సోదర కవులు కృతజ్ఞతా పూర్వకంగా సుబ్బరాయ శతకమును రచించి వీరికి అంకితం చేశారు.



సుబ్బరాయ శ్రేష్ఠి

బెల్లంకొండ రామారాయకవిగారి రుక్మిణీపరిణయం, కృష్ణలీలా తరంగిణి, వేదాంత కౌస్తుభం మొదలైన గ్రంథాలను వారి మరణానంతరం కవితా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ముద్రించారు. వీరి మరికొన్ని గ్రంథాలను శ్రీతాడేపల్లి నారాయణ గారు ప్రచురించారు. బెల్లంకొండ రాఘవరావుగారు కవి, పండితులే కాక పోషకులుకూడా! వీరు ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి నవలను ముద్రించారు. పల్నాటి సోదర కవులలో ఒకరైన కన్నెగంటి చినలింగాచార్యులుగారి 'రాజరాజు' కావ్యాన్ని ప్రముఖ న్యాయ వాది జొన్నలగడ్డ సుబ్బారావు గారు ముద్రించి అంకితం పొంది, కవి నివాసానికి 3 సెంట్లు స్థలం ఇచ్చి గౌరవించారు.



తాడేపల్లి నారాయణ

ఆచార్యశ్రీ తూమాటి దొణప్పగారు తమ సంస్థానములు– సాహిత్య పోషణం అనే గ్రంథాన్ని కాసు బ్రహ్మానంద రెడ్డిగారికి అంకితం ఇచ్చారు. దొణప్పగారు దీని రెండవ ముద్రణను నందమూరి తారకరామారావుగారికి అంకితం ఇచ్చారు. ఆచార్య శ్రీ మద్దూరి సుబ్బారెడ్డిగారు తమ తెలుగు జాతీయోద్యమ కవిత్వం సిద్ధాంతగ్రంథాన్ని బ్రహ్మానందరెడ్డి గారికి అంకితం ఇచ్చారు.

పి.వి. రమణారెడ్డిగారి చారుచర్య గ్రంథానికి డా॥ నందిగల వేంకటరెడ్డిగారు ఆర్థికసహాయ మందించి, తమ తండ్రిగారైన సుబ్బారెడ్డిగారికి అంకిత మిప్పించారు. రమణారెడ్డిగారి 'వేదాలలో ఆయుర్వేదం' రచనా ముద్రణకు నందిగల వేంకటేశ్వరరెడ్డిగారు, 'వేమన పద్యాలకు వ్యాఖ్యానం' గ్రంథానికి వలివేలు రామకోటయ్యగారు ద్రవ్యసహాయం చేశారు.

మన పట్టణంలోని ప్రముఖ పరిశోధకుల సిద్ధాంత గ్రంథాల పరిచయం 'పద్నాలుగు పరిశోధనలు'. ఈ గ్రంథాన్ని తోటకూర వేంకటేశ్వరరావుగారు ప్రచురించారు.

కొప్పరపు సోదరకవుల సుబ్బరాయశతకానికి డా॥ మేళ్లచెర్వు భానుప్రసాదరావుగారు రచించిన వ్యాఖ్యను నాగసరపు రామారావుగారు ప్రచురించారు. మద్దులపల్లి సత్యనారా

యణశాస్త్రిగారు చింతలపాటి నరసింహదీక్షితశర్మగారి 'త్రివేణి' కావ్యాన్ని ముద్రించి అంకితం పొందారు. బుచ్చినాయనగారు పొత్తూరి వీరరాఘవ వరప్రసాదరాయకవిగారి కోటప్పకొండ చరిత్రకు ఆర్థికమైన తోడ్పాటు నందించి అంకితం పొందారు. మేళ్లచెర్వు వీరాంజనేయులుగారు డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డిగారి పిహెచ్.డి. సిద్ధాంతగ్రంథం 'భారతపద్యశైలి' ముద్రణకు కొంత ఆర్థికసాహాయ్యాన్ని అందించారు. డా॥ రత్నాకరం రాముగారి 'అప్రస్తుత ప్రసంగాలు' ముద్రణకు మేళ్లచెర్వువారు తోడ్పడ్డారు.

డా॥ చిటిప్రోలు సుబ్బారావుగారు డా॥ మడకా సత్యనారాయణగారి 'తెలుగులో చారిత్రక గేయకథాకావ్యాలు' గ్రంథానికి కొంత ఆర్థిక సహాయ మందించారు. 'శ్రీరామరాజు వీరభద్రయ్య-వెంకమ్మ మరియు గంగ్రకోట రాధాకృష్ణమూర్తి మెమోరియల్ ట్రస్ట్' పక్షాన రామరాజు చెన్నకేశవరావుగారు కాసావఝుల రామకోటిశాస్త్రిగారి 'హనుమద్గీత', పోలూరి హనుమజ్జానకీశర్మగారి 'శ్రీరామహృదయం', డా॥చేరెడ్డి మస్తాన్ రెడ్డిగారి 'దశోపనిషచ్చంద్రిక', డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి గారి 'శంకరవిజయకథలు, ఉపనిషత్సందేశం, శ్రీమద్రామాయణ సందేశం, పోలూరి శివరామప్రసాదరావుగారి 'వేదవాఙ్మయము-ఒక పరిచయం, బ్రహ్మసూత్రములు-ఒక పరిచయం, రఘువంశరాజుల కథలు, పోలూరి సత్యనారాయణగారి జానకీనాయక శతకము, త్రిపురశతకము, కామరాజుగడ్డ హనుమంతరాయశర్మగారి వాసుదేవశతకము గ్రంథాలను ముద్రించారు. నల్లపాటి వేంకటరత్తయ్యగారు డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తిగారి 'షిరిడీసాయిసుధ' గ్రంథాన్ని ప్రచురించారు. జమ్ముల రాధాకృష్ణ, అతని సోదరులు డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తిగారి 'నిత్యదేవతాస్తుతిః' గ్రంథాన్ని, గాలి సుబ్బారావుగారు డా॥ రత్నాకరం రాముగారి 'పురవైభవం'ను, నారాయణం బాలసుబ్రహ్మణ్యంగారి నరసరావుపేట శతావధాన సంచికను, కె.పి.రంగారావుగారు డా॥ రత్నాకరం రాముగారి 'శ్రీవిజయం'లను ప్రచురించారు.

మాజీమంత్రివర్యులు, నవ్యాంధ్ర శాసనసభాపతి డా॥ కోడెల శివప్రసాదరావుగారు డా॥ కాసులనాటి నాగరాజ శర్మగారి 'అనామయ' కావ్యవ్యాఖ్యానాన్ని అంకితం పొందారు. గుంటూరు జె.కె.సి. కళాశాల ప్రిన్సిపాల్ ఈదర భాస్కరరావుగారు డా॥ నాగరాజశర్మగారి 'శ్లోకమంజరి'ని (గాయత్రీ మాహాత్మ్యం) ప్రచురించి అంకితం తీసుకొన్నారు. డా॥ నాగరాజశర్మగారు రసికాష్టకం కావ్యానికి రచించిన చంద్ర తేజో వ్యాఖ్యానాన్ని పొలదుగు శ్రీనివాసప్రసాద్‌గారు ప్రచురించారు.

మాజీ మంత్రివర్యులు కాసు వేంకటకృష్ణారెడ్డిగారు కుందా భాస్కరరావుగారి 'అక్షరకోకిల' కవితాసంపుటిని అంకితం పొందారు. ఈవూరి వేంకటరెడ్డిగారి 'చేజర్ల కపోతేశ్వర వైభవం' మొదట ముద్రణకు వంగా వెంకటరెడ్డిగారు, రెండవ ముద్రణకు గుర్రం శిరామకృష్ణారెడ్డిగారు, మూడవ ముద్రణకు డా॥ ఎ. రామలింగారెడ్డిగారు, డా॥ గజ్జల పరమేశ్వరరెడ్డిగారు, నాలుగవ ముద్రణకు డా॥ గోపిరెడ్డి శ్రీనివాస రెడ్డిగారు, ఐదవ ముద్రణకు డా॥ ఎ. రామలింగారెడ్డిగారు, ఆరవ ముద్రణకు హైదరాబాద్ అరబింద్‌వారు ఆర్థిక సహాయాన్ని అందించారు.

నరసరావుపేట కవులకు, రచయితలకు స్థానికులే కాక రాష్ట్రం నలుమూలల నుండి ఆర్థిక సహాయం అందించిన వారున్నారు. ఎం.ఆర్.కె. మూర్తిగారి 'హాస్యప్రపంచం' మొదటి ముద్రణకు విజయవాడకు చెందిన చలువాది మల్లికార్జునరావుగారు, రెండవ ముద్రణకు కర్నూలుకు చెందిన జక్కా నాగభూషణంగారు, నరసరావుపేటకు చెందిన బొల్లా బ్రహ్మనాయుడుగారు, 'భావవ్యక్తీకరణ' ముద్రణకు గుంటూరు ఛాంబర్ ఆఫ్ కామర్స్‌కు చెందిన పడుచూరి వేంకటేశ్వర్లు, విజయవాడకు చెందిన చలువాది మల్లికార్జునరావులు, 'సూక్తి ప్రపంచం'కు శ్రీశైలం 'వాసవీసత్ర సముదాయం'వారు 'ప్రసంగం ఒక కళ'కు హైదరాబాద్ వాస్తవ్యులు వేలూరి రవీంద్రనాథ్ గుప్తాగారు, 'గమ్యాన్ని నిర్దేశించుకో' రచనకు విజయవాడకు చెందిన చలువాది మల్లికార్జునరావుగారు, తాటికొండ విశ్వనాథంగారు, హైదరాబాద్‌కు చెందిన గుబ్బా చంద్రశేఖర్‌గారు, నరసరావుపేటకు చెందిన బొల్లా బ్రహ్మనాయుడుగారు 'స్టాంపుల సరదా'కు జక్కా నాగభూషణంగారు, 'సమయపాలన'కు కృష్ణాజిల్లా కురుముద్దాలి వాస్తవ్యులు నూకల లింగమూర్తిగారు ఆర్థిక సహాయం అందజేశారు. థామస్‌గారు 'విద్వాన్' బి. ఏలియాగారి 'క్రీస్తు' ఖండకావ్యాన్ని అంకితం పొందారు. గుంటూరు జె.కె.సి. కళాశాల కరస్పాండెంట్ జాగర్లమూడి నరేంద్రనాథ్‌గారు డా॥ నల్లూరి రామారావుగారి 'కొసరాజు కవితావైభవం' రచనకు ఆర్థిక సహాయం అందించారు. ఏలూరు పట్టణ వైద్యులు డా॥ ఎం.వి. సదాశివరావుగారు కుందా భాస్కరరావుగారి కథా సంపుటి 'సువర్ణం'ను అంకితం పొందారు.

# కన్నెగంటి చిన లింగాచార్యులు



డా॥ చిటిప్రోలు సుబ్బారావు
రిటైర్డ్ తెలుగు రీడర్

'శ' తవధాన విధాన సమరాంగణమున కిరీటి కల్పులు పలనాటి కవులు' అని 'కళాప్రపూర్ణ' కొండవీటి వేంకటకవి గారు 1953 లో గుంటూరు పత్రికలో వ్రాశారు. దీనిని బట్టి సాహితీ ప్రపంచంలో పల్నాటి సోదరకవుల స్థానం తెలుస్తుంది.

సాహిత్యరంగంలో జంటకవులైన వారున్నారు. ఒకే కడుపున పుట్టిన వారిలో కొందరు జంటకవులుగా ఏర్పడి కవిత్వం చెప్పినవారున్నారు. కాని అందరూ కవులై సోదరకవులుగా ప్రసిద్ధులైన సన్నివేశం మృగ్యం.

పలనాటి గంగా యమునలుగా ప్రస్తుతిగన్న నాగులేరు చంద్రవంకలలో నాగులేటి సమీపంలో ఉన్న తక్కెళ్ల పాడులో (దాచేపల్లి దగ్గర) వీరు జన్మించారు. వీరి తల్లిదండ్రులు కోటమాంబా, రాజలింగాచార్యులు. ఈ సోదరత్రయం - ప్రభులింగాచార్యులు (1900-46), చినలింగాచార్యులు (1903-68), వీరభద్రాచార్యులు (1912-74) వీరి సోదరీ మణులు సంగీత రసపిపాసిని సుందరమ్మ, కవయిత్రి కమలాక్షమ్మ. వీరి మేనమామలు 18 తరాలుగా కవిత్వం రాస్తూవచ్చారు. సాహిత్య చరిత్రను పరిశీలిస్తే అడిదం సూరకవి వంశీయులు మాత్రమే తరతరాలుగా కవిత్వం వ్రాసే విషయంలో వీరిని అధిగమించారు.

పలనాటి సోదరకవులలో మధ్యముడైన చినలింగాచార్యులు గారు మన నరసరావుపేట పట్టణంలో ఉన్నారు. ఆయన వేంకటరంగ శతకం, సూర్యనారాయణ స్తవము, కయిమొర, లక్ష్మీప్రశంస, వేంకటరమణ శతకం, రాజరాజు, స్తోత్రమంజరి, వేంకటరమణ స్తుతి, క్రీస్తు సుప్రభాతం, బంగారుధార, ఆర్త నినాదము మొదలైన రచనలను చేశారు. ఇంతటి మహాకవి చినలింగాచార్యులవారు మన పట్టణవాసి కావడం మనకు గర్వకారణం.

గన్నమనేని లింగయ్యగారు చినలింగాచార్యులుగారిని పి.వి. రమణారెడ్డిగారికి పరిచయం చేశారు. ఆచార్యులుగారి వ్యక్తిత్వం, సాహిత్యం- వీటివల్ల ఆకృష్టులైన రెడ్డిగారు చిన లింగాచార్యులుగారిని నరసరావుపేట వాస్తవ్యులను చేశారు. ఆ తర్వాత చినలింగాచార్యులుగారి జీవితం గొప్ప మలుపు తిరిగినది. మరుగునపడిన వారి రచన లనేకం వెలుగు చూచాయి.



శ్రీసుబ్బరాయ & నారాయణ కళాశాలలో 15-12-1965వ తేదీన ఆనాటి సాంస్కృతిక శాఖామాత్యులు యం.ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన చినలింగాచారిగారికి షష్టిపూర్తి మహోత్సవం జరిగినది. అ సభలో కవిగారిని అనేక సంస్థలవారు ఘనంగా సత్కరించారు. సన్మాన సంఘాధ్యక్షులు కపలవాయి కాశీరామారావుగారు కవిగారిని సన్మాన సంఘం తరపున సత్కరించారు. కవికోకిల, నవయుగ కవిచక్రవర్తి గుఱ్ఱం జాషువాగారు సభను ప్రారంభిస్తూ 'ఇట్టి మహాకవుల వలన దేశం అభివృద్ధిలోనికి రాగలదనీ, దేశచరిత్రలో కవుల చరిత్ర అసాధారణమైన'దనీ పేర్కొన్నారు. 'రాజరాజు' కావ్యాన్ని ఆ సభలో కృతినందిన న్యాయవాది జొన్నలగడ్డ సుబ్బారావుగారు 3 సెంట్ల భూమిని గృహవసతికై ఇచ్చారు. ఆవుల గోపాలకృష్ణ మూర్తిగారు గ్రంథాన్ని ఆవిష్కరించారు. •

# సరిగమపదని...




పోలూరి వేంకట శివరామప్రసాదరావు
హెడ్ మాస్టర్


వీనులవిందైన సంగీతానికి సరియైన చిరునామా మా నరసరావుపేట. మా పేటలో ప్రతిరోజూ ఏదో ఒక చోట తీయని రాగం వినిపిస్తూనే ఉంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, ఈ నేలా, ఈ గాలీ సంగీత సౌరభాలను అందిస్తూనే ఉంటాయి. గీతామందిరంలోనో, భువనచంద్రలోనో, శంకర మఠంలోనో, వేంకటేశ్వర దేవాలయంలోనో, పాండురంగని సన్నిధిలోనో, భీమలింగేశ్వర ప్రాంగణంలోనో, ఏదో ఒక వేదిక మీద సంగీతం వినిపిస్తూనే ఉంటుంది. నెలవారీ సంగీత కార్యక్రమాలు, సంగీతపోటీలు, ఆరాధనోత్సవాలు, నిరంతరం సంగీతంతో నినదిస్తూనే ఉంటాయి.

**ఏల్చూరి విజయరాఘవరావుగారు :** ప్రముఖ భారతీయ



సంగీత కళాకారుడు, వేణుగాన విద్వాంసుడు, సంగీతదర్శకుడు, రచయిత, ఏల్చూరివిజయ రాఘవరావు గారు, ది.01-11-1925న ఏల్చూరి రామయ్య, సుబ్బాయమ్మ పుణ్యదంపతుల ద్వితీయ సంతానంగా జన్మించారు. 'రఘుపతి రాఘవ రాజారాం...' గీతాన్ని స్వరపరచిన సంగీత దర్శకుడు, విజయరాఘవరావుగారు. భారతదేశపు 'ఉక్కుమనిషి' పటేల్‌గారిచే ఆహ్వానింపబడిన ఘనత వీరిది. క్రీ.శ.1970లో ప్రతిష్ఠాత్మక అవార్డు 'పద్మశ్రీ'ని అందుకున్నారు. 1982లో సంగీత నాటక అకాడమీ అవార్డును సొంతంచేసుకున్నారు. జాతీయ, అంతర్జాతీయ స్వర్ణ పతక సమ్మానితులై ఖండఖండాంతరాలలో అఖండఖ్యాతి గడించారు. శ్రీమతి రుక్మిణీఅరండేల్‌గారి శిష్యులై భరత నాట్యం అభ్యసించి, అనేక దేశాలలో ప్రదర్శన లిచ్చారు. వేణు గాన విద్వాంసులైన వీరు ఒక్క 'హంసధ్వని' రాగాన్ని గంటన్నర సేపు ఆలాపించగా దానిని ప్రముఖసంస్థ 'సోనీ' వారు రికార్డు చేశారు. విజయ రాఘవరావుగారు ది. 30-11-2011న స్వర్గస్థులైనారు.

**షేక్ చినమౌలానా :** సాతులూరు గ్రామంలో 12-05-



1924లో జన్మించిన షేక్ చిన మౌలానా తమ తండ్రిగారైన ఆదం సాహెబ్‌గారి వద్ద 'నాదస్వరం' నేర్చుకున్నారు. 'పద్మశ్రీ' బిరుదముతో భారతప్రభుత్వం వీరిని గౌరవించింది. ఆంధ్రవిశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' బిరుద మిచ్చింది. తమిళనాడు ప్రభుత్వం 'కళైమామణి' అని గౌరవించింది. రాజమండ్రి రసికవిద్వాంస సభ 'గానగాంధర్వకళానిధి' అంటే, త్యాగరాజ సంగీతకళా సమితి 'సంగీత విద్వన్మణి' అని కీర్తించింది.

**కనపర్తి మస్తాన్‌సాహెబ్ :** వీరు సన్నాయి విద్వాంసులుగా అజరామరమైన కీర్తి గడించారు. దక్షిణాపథాన తన విజయ యాత్రను కొనసాగించి తమిళనాడు, కేరళ, కర్ణాటక రాష్ట్రాలలో ఎన్నో బహుమతులను ప్రశంసలను అందుకున్నారు.

**మహావాది వేంకటప్పయ్యశాస్త్రి :** వేంకటప్పయ్యశాస్త్రిగారు ది. 16-9-1911న జన్మించారు. గొప్ప ఫిడేల్ విద్వాంసులైన తమ తండ్రి రామమూర్తిగారి వద్ద, తరువాత బలిజేపల్లి సీతా రామయ్యగారి వద్ద సంగీతాభ్యాసం చేశారు. ఆ తరువాత చదలవాడ కుమారస్వామిగారి వద్ద ఫిడేల్ అభ్యసించారు. గాత్ర సంగీతమునందు స్వయంగా కృషిచేశారు. హిందూస్తానీ, కర్ణాటక సంగీతముల బాణీల సమ్మేళంతో క్రొత్తబాణీని సృష్టించారు. సంగీత నాటకఅకాడమీ వీరి సంగీతప్రతిభకు నీరాజనా లిచ్చింది. 6వ రాష్ట్రసంగీతోత్సవ మహాసభకు అధ్యక్షులైనారు. 'గాత్ర వాయులీన సంగీతవిద్వాన్', 'సంగీత సమ్రాట్',

'గానకళా ప్రపూర్ణ', 'సంగీత సాహిత్య భావసమ్మేళన చక్రవర్తి' వంటి ఎన్నో బిరుదములను అందుకొన్నారు.

పోలూరి సత్యనారాయణగారు డోలక్, డప్పు, తబలా, హార్మోనియంలను వాయించటంలో పేరుపొందినవారు. సి.ఆర్. దాసుగారు గొప్ప గాత్రసంగీతవిద్వాంసులు. వాణీ నాట్యమండలిని స్థాపించి 15 సం॥లు నడిపి ఎందరో కళా కారులను పౌరాణిక నటులుగ దిద్దారు. మంచి హార్మోనిస్టుగా కూడా ప్రసిద్ధిని పొందారు.

సి.ఆర్. దాసుగారి కుమారుడు సి. అమరేంద్రగారు బాల్యంలో తమ తండ్రిగారివద్ద సంగీతం అభ్యసించారు. స్వర ధర్మాన్నీ, రాగధర్మాన్నీ ఒంటబట్టించుకొని శాస్త్రపథం నుండి నూలువాసి కూడా ప్రక్కకు జరగకుండా కీర్తనల నాలపించటం వీరి ప్రత్యేకత. జొన్నలగడ్డ శ్రీరామమూర్తిగారు ది. 19-8-1952న జన్మించారు. సి.ఆర్. దాసుగారి వద్ద, పోలూరి లక్ష్మీకాంతారావు, రాజనాల వేంకట్రామయ్యగార్ల వద్ద గాత్ర సంగీతం నేర్చుకున్నారు. 40 సం॥లుగా సంగీతసేవ చేస్తూ 'నరసరావుపేట అన్నమయ్య'గా గౌరవించబడుతున్నారు. 1990 నుండి ఆల్ ఇండియా రేడియో లో బి గ్రేడ్ ఆర్టిస్టుగా ఉన్నారు. పొన్నూరులో 12 గంటల పాటు అన్నమయ్య శతకీర్త నాలాపన యజ్ఞాన్ని నిర్విఘ్నంగా నిర్వహించిన కీర్తి వీరికున్నది. తిరుమలలో పద్మావతీ అమ్మ వారి దేవాలయంలో కచేరి చేసి నరసరావుపేటకే కీర్తి తెచ్చారు. కీర్తనలోని భావాన్ని తాను అనుభవించి దానికి భక్తిపరీమళాన్ని అద్ది ఆ అనుభూతిని శ్రోతల కందించటం వీరి గాత్రంలోని ప్రత్యేకత. వై.ఆర్. ఎమ్.జి. నాగేశ్వరరావుగారు తల్లిగారి నుండి సంక్రమించిన సంగీతవారసత్వంతో అన్నమాచార్య కీర్తనల నాలాపిస్తూ ఆనందమయ జీవితాన్ని గడుపుతున్నారు. వీరి గాత్రంలోని మార్దవ మాధుర్యాలు శ్రోతలను మైమరపింప చేస్తున్నాయి.

శ్రీమతి పిల్లుట్ల సర్వలక్ష్మిగారు త్యాగరాజ సంగీత కళాశాలను స్థాపించి బాల బాలికలకు సంగీతం నేర్పుతున్న 'గానకళాకోవిదు'రాలు. ఆత్మీయులు ఆమెను స్వరలక్ష్మి అంటారు. అది స్వభావోక్తియే! ఈ సంగీతకళాశాల ప్రిన్సిపాల్ గా సంగీత సేవల నందిస్తున్న మౌలాలీగారు 'గానతుంబుర' బిరుదాంచితులు. వీరు ప్రధానంగా వేణువిద్వాంసులు. నాద స్వరం, హార్మోనియం, గాత్ర సంగీతాలలో కూడా అందె వేసిన చేయి. పోలూరి పుల్లారావుగారు గొప్ప హార్మోనిస్టు. అనేక నాటకపద్యాలను స్వరపరచి నటులకు నేర్పినవారు. దర్శి శేషగిరిరావుగారు మంచి సంగీత విద్వాంసులు.

డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణగారు షిరిడీసాయి సుప్రభాతం, గణేశ సుప్రభాతం, క్రీస్తురక్షకా మొదలగు సి.డి. లను కూర్చి విడుదలచేశారు. వీరు కేవలం గాయకులేగాక మంచి నటులు, సంగీత దర్శకులు కూడా. సాంబేలు సాంబ శివరావుగారు సినీ పరిశ్రమలో 'వినోద్'గా పరిచయ మైనారు. పెండ్యాలగారి ప్రోత్సాహంతో సినీరంగ ప్రవేశం చేసి దాదాపు 30 సినిమాలలో పాటలు పాడారు. వందలాది కచేరీలు చేశారు. చిన్నతనంలో ప్రఖ్యా ఆంజనేయులుగారి వద్ద సం గీతం అభ్యసించారు. సినీగాయకులు పిఠాపురంగారితో కలిసి స్టేజికచేరిలు చేశారు. కావలి కళాసంస్థ పోటీలో ప్రథమ బహుమతి నందుకొన్నారు. రామయ్యర్ విశ్వనాథ్గారు కళా శాల స్థాయిలో, విశ్వవిద్యాలయ స్థాయిలో, రాష్ట్ర, జాతీయ స్థాయి పోటీలలో పాల్గొని బహుమతుల నెన్నింటినో అందుకు న్నారు. ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, రామకృష్ణ, ఆనంద్ మొదలగు సుప్రసిద్ధులైన గాయకులతో కలిసి కచేరీలు చేశారు. మీనాక్షీ సుందరంగారి వద్ద శాస్త్రీయసంగీతం అభ్యసించారు. మద్రాసు ఎ.ఐ.ఆర్., హైదరాబాదు దూరదర్శన్లలో ఎన్నో కార్యక్రమాలు చేశారు. ఎన్నో లలిత, భక్తిరస గీతాలను పాడి క్యాసెట్లను విడుదల చేశారు. బాలరాజుగారు వందల కచే రీలు చేసి వేలాది ప్రేక్షకులను అలరింపజేశారు. ఈ టీవీ పోటీలలో లక్షరూపాయల బహుమతినందిన సలక్షణ గాయ కులు వీరు. కె. చంద్రపాల్గారు రెండువేలకు పైచిలుకు కార్యక్రమాలలో పాటలుపాడారు. వీరు పలువురు సినీగాయకు లతో కలసి కచేరీలు చేశారు. కేరళలోని కేలికట్ రిథమ్ ఆర్కెస్ట్రాలో పనిచేశారు. కొఠారి రంజిత్గారు 'మంజీరా మెలో డీస్' అధినేత. ఎన్నో కచేరీలు చేశారు. అయ్యప్ప భజనలు నిర్వహిస్తున్నారు. వీరుపాడిన సిడీలు ఎన్నో విడుదలై ప్రజా దరణను పొందాయి.

హిందీ పండితులైన శ్రీ రావిపాటి సుబ్బారావుగారు సంగీతశాస్త్ర నిష్ణాతులు. హార్మోనిస్టుగా గొప్ప పేరు పొందారు. మహావాది వేంకటప్పయ్యశాస్త్రిగారి ప్రియశిష్యులైన శ్రీ పి. కాళహస్తీశ్వరరావుగారు హార్మోనియం విద్వాంసులుగ ప్రసిద్ధులు. భజనపంతులు వెంకయ్యగారు సుమారు వంద భజన సంఘాలకు గురువుగారు. శ్రీ వేంకటేశ్వరరెడ్డిగారు వందల మంది శ్రోతలున్న సభలో నైనా మైకు లేకుండా పాడి నిలువ బెట్టగల గాత్రము కలవారు. శ్రీ ఎం. రఘునాయుడుగారు భజనలు చేసేవారు. ఏకాహమైనా, సప్తాహమైనా, నిర్విరామంగా హార్మోనియం వాయించటంలో వీరు అందె వేసిన చేయి. శ్రీ ఆరాధ్యుల లక్ష్మీకాంతారావు గారు మంచి డోలక్ విద్వాంసులు. 'కలియుగ నందీశ్వర', 'అభినవ భృంగి' అని పేరొందినవారు. శ్రీ కె. జాషువాగారు రాష్ట్ర స్థాయి సంగీత పోటీలలో పాల్గొని బహుమతులను పొందారు. కేవలం మగవారి పాటలోనే కాకుండా, శ్రీమతి భానుమతి, జిక్కీ గారల గాత్రాలను అనుకరించి శ్రోతలను రంజింపజేయగల సామర్థ్యం కలవారు వీరు. షహీదా సినిమా పాటలు పాడుతూ డాన్సులు చేస్తూ ఉండేవారు. ఆమె విశ్రాంతి తీసుకోవడానికి మధ్యమధ్యలో వీరి సోదరి వహీదా పౌరాణిక చారిత్రక నాటకాలలోని పద్యాలను శ్రావ్యంగా, శాస్త్రీయంగా ఆలపించేవారు. షహీదా 'వాతాపిగణపతిం భజేఽహం' కీర్తనను పాడడం అద్భుతంగా ఉండేది. ప్రముఖ సినీ గాయకులు 'మనో' షహీదాగారి కుమారుడు. వీరు తెలుగు చలనచిత్రాలలో ఎన్నో పాటలు పాడారు. వందల కొద్ది కచేరీలు చేశారు. ఎన్నో సిడీలను విడుదల చేశారు. ఈటివి వారి 'స్వరాభిషేకం' లో 'మనో' ప్రధాన పాత్రధారి. శ్రీ యల్లంరాజు త్యాగరాజుగారు స్వీయ ప్రతిభతో సంగీతసరస్వతి అనుగ్రహానికి పాత్రులైనారు. మన శృంగేరి శంకరమఠంలో ఎన్నో కచేరీలు చేశారు. వందల సంఖ్యలో సాయిభజనలు నిర్వహించారు. అచుంబిత కీర్తనలను ఆలపించడం వీరి అభీష్టం. శ్రీ భారతీతీర్థ మహాస్వామివారు రచించిన కీర్తనలను సేకరించి శ్రావ్యంగా ఆలపిస్తున్న ధన్యజీవి వీరు. శ్రీ ఎం.ఎస్. బాబుగారు కీర్తనా ఆర్కెస్ట్రా పేరుతో వందల కొద్ది పాటకచేరీలు చేసి శ్రోతలను ఆనందపరవశులను చేస్తున్నారు.

తెలుగు లెక్చరర్ డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తిగారు 'త్యాగరాజ యక్షగానాలు' గురించి పరిశోధన చేసి నాగార్జున విశ్వవిద్యాలయం నుండి ఎం.ఫిల్. పట్టానూ, 'సంగీత త్రిమూర్తుల కీర్తనలు' గురించి పరిశోధన చేసి పిహెచ్.డి. పట్టాను పొందారు. వీరి పిహెచ్.డి. సిద్ధాంతవ్యాసం ఉత్తమ సిద్ధాంతవ్యాసంగా ఎంపికై విశ్వవిద్యాలయంవారి స్వర్ణ పతకాన్ని పొందింది. వీరు 80కి పైగా సంగీతవ్యాసాలను వ్రాశారు.

శ్రీపురాణం ఆంజనేయులుగారు కూంబ్ వాద్యంలో గొప్ప ప్రతిభను ప్రదర్శించారు. దువ్వెన మీద పలుచని కాగితాన్ని పెట్టి నోటితో ఊదుతూ కీర్తనల నాలపించటం ఇందులోని ప్రత్యేకత. డా॥ లలితగారు మంచి గాయకురాలు. శ్రీమతి దోనెపూడి వరలక్ష్మమ్మగారు సంగీత అధ్యాపకురాలు. వీరు ఎందరో విద్యార్థినీ విద్యార్థులకు శాస్త్రీయసంగీతాన్ని నేర్పారు. శ్రీ ఘటం రామలింగశాస్త్రిగారు గొప్ప గాయకులు, సంగీతదర్శకులు, ఆకాశవాణి కళాకారులు. చందవరం దగ్గుపాటి రాములుగారు, చందవరం ఈమని శ్రీరాములు గారు మంచినైపుణ్యం కలిగిన డోలువిద్వాంసులు. శ్రీరాములు గారు ఆకాశవాణి కళాకారులు. శ్రీ అచ్చుల హనుమయ్యగారు మంచిగాయకులు. వీరు భజనపంతులుగా పేరునుపొందారు.

ఎస్. మహేష్ వేమన సాహితీ ప్రచారకులుగా 140 పద్యాలకు భావ సహితంగా క్యాసెట్లు రూపొందించారు. ఆయన మధుర కంఠం మన రాష్ట్రంలోనే కాకుండా కర్ణాటక, తమిళనాడు, మహారాష్ట్ర మొదలైన పొరుగు రాష్ట్రాలతో పాటు, వారణాసిలో కూడా మార్మోగుచున్నది. ఆచార్య ఎన్. గోపి, డా॥ సాయికృష్ణయాచేంద్ర, ప్రముఖ నటులు ధూళిపాళ్ల సీతారామశాస్త్రి, స్థానికులైన పి.వి. రమణారెడ్డి గారివంటి వారి ఆశీస్సులు వీరికి లభించాయి.

1997లో జరిగిన రాష్ట్రస్థాయి జన్మభూమి పాటల పోటీలో ప్రథమ బహుమతులుగా బంగారు పతకం, నారా చంద్రబాబు నాయుడుగారి ప్రశంసాపత్రం అందుకొన్న 20వ వార్డు మాజీ కౌన్సిలర్ చల్లగుండ్ల సతీష్ కుమార్ మన పట్టణానికి గర్వకారణం.

# అభిమానం పెరుగుతోంది




**కె. నాగమల్లేశ్వరరావు**

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, ప్రజారోగ్యశాఖ


నేను పదోన్నతిపై ప్రజారోగ్యశాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా 21-08-2013న నరసరావుపేట పట్టణంలో అడుగు పెట్టాను. నా విధుల్లో భాగంగా నేను పట్టణ ప్రజలను కలిసి మాట్లాడినపుడు, వారు ప్రజలకు మంచి నీటి సరఫరా పథకాన్ని మంజూరు చేయించి, త్వరితగతిన పూర్తి చేయించిన డా॥ కోడెల శివప్రసాదరావు గారిని, పథక నిర్మాణాన్ని చేసిన అధికారులను ఈ రోజుకు కూడ ఎంతో గౌరవించడం, ప్రేమించడం నాకు చాలా ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించాయి. మంచి నీటికి కటకట లాడుతున్న ప్రస్తుత పరిస్థితుల్లో కూడా ప్రతిరోజు సరిపడా మంచినీరు సరఫరా జరుగుచున్న తీరును చూస్తే డాక్టరుగారి ముందు చూపు మనకు అర్థమౌవుతుంది.

పట్టణ పౌరులు నాతో మాటల సందర్భంగా ఇంకా 30 సంవత్సరాల తర్వాతి అవసరాలకుకూడా నీరునిల్వ వుండే నకరికల్లు చెరువును గురించి, సత్తెనపల్లి రోడ్డులోని బురద గుంటలను, నీరు-మీరు పథకములో భాగంగా ఐదు అడుగుల మేర పూడ్చి 20 ఎకరాల సువిశాల క్రీడా ప్రాంగణాన్ని తయారు చేసిన విధానాన్ని, జన్మభూమిలో అన్నమో రామచంద్రా అని అలమటిస్తున్న చంద్రబాబు కాలనీలోని అన్నార్తులైన షుమారు 200 మంది వయసుమీరిన వారికి ఎ.ఎం.జి.వారి ద్వారా భోజనాన్ని ఏర్పాటు చేయించటాన్ని, మన డా॥ కోడెలగారిని, సంబంధిత అధికారులను ప్రశంసిస్తుంటే, పనిచేసేవారికి ఈ పట్టణప్రజలు ఇస్తున్న గౌరవంచూసి, ఈ పట్టణంపై నాకు ప్రేమ పెరుగుతోంది.

నాకు ఇప్పుడు ఇనుమడించిన ఉత్సాహం! ఎందుకంటే? డాక్టరుగారి సూచనల మేరకు ఆగిపోయిన భూగర్భ డ్రైనేజ్ స్కీము పూర్తి చేయటంలో భాగంగా మురుగు శుద్ధి కర్మాగారాన్ని క్రొంగ్రొత్త సాంకేతిక పద్ధతులతో నిర్మించే ఏర్పాటువలన 35 ఎకరాల విలువగల భూమిని పురపాలక సంఘానికి మిగులున్నట్లుగా చేయటమే కాకుండా, దోమల చెరువు నిర్మాణాన్ని ఆపివేయటం జరిగింది. ఈ భూగర్భ డ్రయినేజ్ స్కీము మరి రెండు సంవత్సరాలలో పూర్తి చేయటానికి జరుగుచున్న కార్యక్రమంలో నా పాత్ర ఉండటం నాకు చాల సంతోషాన్ని కలుగజేస్తున్నది.

డాక్టరుగారి నేతృత్వంలో నరసరావుపేట పట్టణానికి పదకొండు కోట్ల రూపాయలు అంచనావ్యయంతో మంచినీటి సరఫరా అభివృద్ధి పథకాన్ని, నాలుగు కోట్ల రూపాయలు వ్యయంతో స్టేడియంలో, స్విమ్మింగ్ పూల్ నిర్మాణ కార్యక్రమంలో నేను కూడ భాగస్వామిని కాబోతున్నందుకు, నాకు చాల సంతోషంగా ఉంది, అంతే కాకుండా ఈ పట్టణం అభివృద్ధిలో నాకు కూడ చోటు దొరకడం నా అదృష్టం!

ఈ శత వసంతాల వేడుకలలో భాగంగా డా॥ కోడెల శివప్రసాదరావు క్రీడా ప్రాంగణంలో జరుగుచున్న అనేక అభివృద్ధి పనులలో నా భాగస్వామ్యం సంతృప్తికరంగా ఉంది. ప్రజల అవసరాలను తీర్చే పథకాలలో భాగస్వామి కావడం నాకు ఈ పట్టణంపై ఇంకా, ఇంకా ప్రేమను కలుగజేస్తున్నది.

ఈ శత వసంతాల వేడుకలలో భాగంగా పునాది రాళ్లు వేయబోతున్న, అనేక అభివృద్ధి కార్యక్రమాలు అనగా ఆర్.యు.బి., కూరగాయల మార్కెట్లు, మునిసిపల్ కార్యాలయము మొదలగు పథకాలన్నిటిలోను నాతోపాటు అందరు అధికారులను సమన్వయపరచి, ప్రజలతో మమేక మయ్యేటట్లు చేయటం, డాక్టరుగారి "ప్రజల వద్దకు పాలన" పరాకాష్ఠ. అందువలననే నరసరావుపేట పట్టణ ప్రజలు పనిచేసే అధికారులను గుర్తించి అభిమానిస్తున్నారు. •

# వర్ణ చిత్ర మాలిక



## ఎస్. స్నేహలత,
కామర్స్ లెక్చరర్

**తైలవర్ణ చిత్రాలు** : నరసరావుపేట పట్టణంలో తైలవర్ణ చిత్రాలకు ఇస్మాయిల్‌గారు ఆద్యులు. వీరివద్ద రవ్వారపు వీరా స్వామిగారు విద్యనభ్యసించి 'వీరా ఆర్ట్సు' పేరుతో సైన్ బోర్డులు వ్రాసేవారు. వీరి కుమారులు ఆంజనేయులుగారు వీరా ఆర్ట్సునే కొనసాగిస్తున్నారు. 1975లో పాపయ్య దీక్షితులుగారు నరసరావుపేట వచ్చి 'మోనార్కు ఆర్ట్సు' పేరుతో దేవతామూర్తుల చిత్రాలు, సైనుబోర్డులు వ్రాసేవారు. బండారు రామకృష్ణగారు రాజకీయ నాయకుల కటౌట్లు, సినీతారల చిత్రాలు, దేవతా చిత్రాలు వేయడంలో మంచి నేర్పరి. వీరు చిత్రించిన 'నివేదన' అను చిత్రం పలు పోటీలలో అవార్డులు గెలుచుకున్నది. వీరు సర్వశిక్ష అభియాన్‌వారి కథల పుస్తకాలకు బొమ్మలు వేశారు.

జె. హెన్రిగారు నంద్యాలలో జరిగిన పెయింటింగు కాంటెస్టులో మొదటిబహుమతి సంపాదించారు. 2013లో తెనాలిలో జరిగిన రాష్ట్రస్థాయి పెయింటింగు పోటీలలోనూ, తెనాలిలో జరిగిన జాతీయస్థాయి పోటీలోనూ అవార్డు పొందారు.



జె. హెన్రీ

బండారు కోటేశ్వరరావుగారు, చక్రధర్, ఇస్రాయేల్, కాంతారావు, దాసు, బాషా మొదలగువారు వ్రాసిన సైన్ బోర్డులు ఎంతో అందంగా వుండేవి.

**మట్టి మరియు ప్లాస్టర్ ఆఫ్ పారిస్ బొమ్మల తయారి** : రాథోడ్ దేవా రాజస్థాన్ నుండి షుమారు 18 సంవత్సరముల క్రితం నరసరావుపేట వచ్చి రావిపాడు రోడ్డులో పరదాలతో నివాసం ఏర్పరచుకొని మట్టి మరియు ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో బొమ్మలు తయారుచేసి జీవనం సాగిస్తున్నారు. వీరి కుటుంబసభ్యులందరూ ఈ రంగంలోనేఉన్నారు. మన నరసరావుపేట పట్టణములో వీరొక్కరే ఇటువంటిబొమ్మలు తయారుచేస్తున్నారు.

**తోలుబొమ్మల తయారి** : గతంలో తోలుబొమ్మలాటలు జరుగుతున్నప్పుడు నరసరావుపేటలో తోలుబొమ్మల తయారీ కూడా ఉండేది. కాలక్రమేణ ఈ ప్రదర్శనలు కనుమరుగు అయినందున వాటి తయారీ కూడా ఆగిపోయింది.



**ఛాయాచిత్రాలు (ఫోటోలు)** : పి.వి. మాధవాచార్యులుగారు 1934 సంవత్సరములో మన పట్టణములో మొట్టమొదటి ఫోటోస్టూడియో 'ఛాయాచిత్రశాల'ను నెలకొల్పారు. వీరికి ఛాయాచిత్రాలపై ఎంత మక్కువంటే తమ కుమార్తెకు 'ఛాయ' అని నామకరణం చేసినారు. నరసరావుపేటలో కరెంటు లేనప్పుడు సూర్యరశ్మి ద్వారా 'సన్ లైట్ ఎక్స్‌పోజింగు' చేసిన ఘనత వీరికే దక్కుతుంది. వారి కుమారులు అనంత పద్మనాభం, మరియు నరసింహాచార్యులు (నరసప్ప)లు ఆ స్టూడియోను నిర్వహించారు.

భాగవతుల రాధాకృష్ణమూర్తిగారు 1945లో దుర్గా ఫోటో స్టూడియోను ప్రారంభించారు. 1949సంవత్సరములో అది 'దుర్గా ఎలక్ట్రికల్ ఫోటోస్టూడియో' గా రూపాంతరము చెందినది. రాధాకృష్ణమూర్తిగారి పెద్ద కుమారుడు భాగవతుల లక్ష్మీనారాయణ గారు ప్రస్తుతం స్టూడియోను నడుపుతున్నారు. వీరు 'దుర్గా



భాగవతుల రాధాకృష్ణమూర్తి



పేరయ్య దీక్షితులు

బాబు'గానే అందరికి సుపరిచితులు. బాబుగారి పెద్దతమ్ముడు లక్ష్మీ ప్రసాద్ (బుజ్జి) మంచిఫొటోగ్రాఫరు. చిన్న తమ్ముడు సత్యసాయి మోహన్ కుమార్ ఫ్రీలాన్సు ఫోటో గ్రాఫరు.

మేళ్లచెర్వు వేంకట పేరయ్యదీక్షితులుగారు తమ తండ్రి గారైన సాంబమూర్తిగారి సహకారంతో 1954లో మారుతీ ఎలక్ట్రిక్ స్టూడియోను స్థాపించారు. దీక్షితులుగారి నలుగురు కుమారులు కుమారస్వామి, సుమిత్రకుమార్, సుబ్రహ్మణ్యం, రామాంజనేయులు (రాము) కూడా ఈ రంగంలోనే స్థిరపడ్డారు. సుమిత్రకుమార్ 1986లో జిల్లా ఫోటో గ్రాఫర్సు అసోసియేషన్ తరపున జరిగిన పోటీలలో ప్రథమ స్థానం సంపాదించి జిల్లా ఎస్.పి. గారి చేతుల మీదుగా బహుమతి అందుకొన్నారు.

పాలపర్తి సుబ్రహ్మణ్యంగారు 1965లో తమ స్టూడియోను మలబారు హెూటల్ పై అంతస్తులో లక్ష్మీస్టుడియోను ఏర్పాటు చేసి 1985 వరకు నిర్వహించారు. శ్రీ గంగవరపు వేంకటేశ్వర్లుగారు 1971లో వేంకటేశ్వర ఫొటోస్టూడియోను స్థాపించి, 1995 వరకు స్టుడియోను నడిపారు. ప్రస్తుతం వీరు ప్రాణిక్‌హీలర్‌గా వైద్యసేవల నందిస్తున్నారు. ఏలూరు హనుమంతరావుగారు కృష్ణాస్టూడియోను ఏర్పాటుచేసి 1983 వరకు నిర్వహించారు. ఆ రోజులలోనే వీరు కలర్‌ల్యాబును కూడా నిర్వహించారు.

ప్రస్తుతము మన నరసరావుపేటలో మూడు పదుల సంఖ్యలో ఫోటోస్టూడియోలు నడుస్తున్నాయి. •

# పట్టణాభివృద్ధికి తోడ్పడుతున్న బ్యాంకులు



**అర్వపల్లి కృష్ణమూర్తి,** విశ్రాంత బ్యాంక్ ఉద్యోగి

మన నరసరావుపేట పట్టణములోని వివిధ సామాజిక వర్గములు సాధించిన ఆర్థిక అభివృద్ధిలో మన నరసరావుపేటలోని బ్యాంకులు పోషించిన పాత్ర చాలా కీలకమైనది, అనిర్వచనీయమైనది.

1950వ సంవత్సరంలో మన నరసరావుపేటలో స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా- గుంటూరువారి పర్యవేక్షణలో ఒక ఉపశాఖ ప్రారంభ మైనది. బ్యాంకులు ఏర్ప డిన మొదటి రోజులలో వ్యాపార వర్గాలకు, పారి శ్రామిక వర్గాలకు ఋణ సౌకర్యములు కల్పించి, వాణిజ్యపరంగా అభివృద్ధికి బాటలు వేశాయి. 1968 వ సంవత్సరములో బ్యాంకులు జాతీయము అయిన తరువాత ఋణవితరణకు అవకాశములు మెరుగైనవి. తద్వారా బ్యాంకులు చిన్నరైతులకు, సన్నకారు రైతులకు, చేతి వృత్తుల వారికి, చిరువ్యాపారులు మొదలైన వారికి ప్రభుత్వ పథకాలైన సి.ఎం.ఆర్.వై., ఇ.ఎం.ఆర్.వై. ద్వారా ఋణ సౌకర్యము కల్పించి, నరసరావుపేట పట్టణ అభివృద్ధికి ఇతోధికముగా సాయపడినవి.

వైద్యులు అధునాతన ఆసుపత్రులు నిర్మించుటకు, వైద్య పరి కరములు మొదలైన వసతులు కల్పించుకొనుటకు, బడుగు, బలహీన వర్గాలకు చెందిన విద్యార్థినీ విద్యా ర్థులు, ఆర్థికస్థోమతలేని అన్ని తరగతుల విద్యార్థినీ విద్యార్థులు పై చదువులు చదువుకొనుటకు విద్యా ఋణములు కల్పించినవి.

విద్యారంగము పట్ల ఆసక్తి కలిగిన వ్యక్తులు నరస రావుపేట పట్టణములో ఇంజనీరింగ్ కాలేజీలు, ఫార్మసీ కాలేజీలు, నర్సింగ్ కాలేజీలు, బి.ఎడ్. కాలేజీలు, డి.ఎడ్. కాలేజీలు మొదలైనవాటిని స్థాపించుటకు మన ఊరిలోని జాతీయ, ప్రైవేట్ బ్యాంకులు అన్నియు సాయ పడినవి.

బ్యాంకులు ఈ విధమైన ఋణ సౌకర్యమును కల్పించి నరసరావుపేట పట్టణప్రజల తలసరి ఆదాయం పెరుగుటకు, కొనుగోలు శక్తి పెరుగు టకు తొడ్పడినవి. నరసరావుపేట పట్టణములో ఆధునిక సౌకర్యములు కల్గిన రెస్టారెంట్లు, వ్యాపారకూడళ్లు, వినోద, చలనచిత్ర ప్రదర్శనశాలలు, పారిశ్రామికాభివృద్ధి, సులభరవాణా సౌకర్యములు, నూతన రవాణా వాహనములు, పెరుగుటవలన నరసరావుపేట జనసాంద్రత పెరిగి నూతన శోభ వచ్చినది.

ఈ విషయములో కూడా బ్యాంకుల ప్రత్యక్ష, పరోక్ష భాగస్వామ్యము తగినంత గానే ఉన్నది. ప్రస్తుతము నరస రావుపేటలో 44 బ్యాంకులు, ఆ బ్యాంకుల శాఖలుఉన్నవి. అవి అన్నియు యథాశక్తి ఋణ సౌకర్యములు కల్పించుచు పట్టణ సర్వతోముఖాభివృద్ధికి తొడ్పాటు నందించుచున్నవి. •

# శిల్పకళా సమీక్ష



## శివరాత్రి ఆంజనేయులు

విశ్రాంత సహాయ కార్మిక అధికారి

భారతీయ సంస్కృతికి శిల్పకళ ఒక గొప్ప ఆభరణం. శిల్పరీతులు పలురకాలు. అందులో ముఖ్యమైనవి రాతి శిల్పము, దారు (చెక్క) శిల్పము, సిమెంటు బొమ్మలు, రంగుల బొమ్మలు, ఛాయాచిత్రకళ, మట్టి మరియు ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌తో బొమ్మల తయారీ మొదలగునవి.

**రాతి శిల్పము :** నరసరావుపేటలో శిల్పకళకు పేరెన్నిక గన్నవారు కొత్తమాసు ప్రసాదుగారు. వీరు తెనాలి దగ్గర చావలి వాస్తవ్యులు. షుమారు 40 సంవత్సరముల క్రితము నరసరావు పేట వచ్చి 'కాకతీయ శిల్పనికేతన్' అను పేరుతో శిల్పశాలను ప్రారంభించి దేవాలయములకు కావలసిన వివిధ దేవతా మూర్తుల శిల్పాలను తయారుచేస్తున్నారు. దేవాలయాలను కడుతున్నారు. షుమారు 200 మంది పనివారు వీరివద్ద పని చేస్తున్నారు.

కొత్తమాసు ప్రసాదుగారి రెండవ కుమారుడైన శంకర్ గారు హైదరాబాదులోని 'శిల్పారామం'లో శిక్షణ పొందినారు. 'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫ్యాషన్ టెక్నాలజీ'లో మాస్టర్ డిగ్రీ పొందినారు. 10 సంవత్సరముల క్రితము నరసరావుపేట లోని సత్తెనపల్లి రోడ్డులో 'ప్రసాద్‌శిల్పశాల'ను నెలకొల్పి ఇప్ప టికీ కొనసాగిస్తున్నారు. వీరితోపాటు మరో 10, 15 మంది వర్కర్లు పనిచేస్తుంటారు. వీరు రాతిశిల్పాలే కాక సిమెంటు విగ్రహాలు, పంచలోహ, రాగి, వెండి, ఇత్తడి విగ్రహాలు, మకర తోరణాలు, కవచాలు, తొడుగులు, ప్రతిష్ఠాయంత్రాలు మొద లగునవి కూడా తయారు చేస్తు న్నారు.



వేంకట సాంబయాచారి

**దారు (చెక్క) శిల్పము :** నరసరావు పేట చుట్టు ప్రక్కల దారు శిల్పులలో పేరెన్నికగన్నవారు కొలగాని వేంకట సాంబయాచారిగారు. కోటప్ప



కొండపై గల త్రికోటేశ్వరస్వామి దేవాలయము,నకరికల్లు నరసింహ స్వామిగుడి, వేల్పూరు రామాలయ ములోని శిల్పాలు, కొప్పురావూరు వేణుగోపాల స్వామి గుడిలోని అద్దాల మహలు వీరి కళానైపుణ్యా నికి నిదర్శ నాలు. లింగంగుంట్ల అగ్రహారంలోని బ్రహ్మంగారి గుడి వీరి ఆధ్వర్యం లోనే రూపుదిద్దుకున్నది.

**సిద్దాబత్తుని సోదరులు :** సిద్దాబత్తుని సాంబశివరావు, జానకి రామయ్య సోదరులు 2006 నుండి నరసరావుపేటలో పాతపోలీసు స్టేషను రోడ్డులో 'శ్రీకాళహస్తి ఉడ్ కార్వింగు' పేరుతో దుకాణము నడుపుచున్నారు. వీరు చెక్కపై ఇండ్లకు మరియు దేవాలయములకు కావలసిన తలుపులు, దర్వాజాలు వివిధ ఆకృతులలో తయారు చేస్తున్నారు. వీరి గురువుగారు ఎన్.శేఖర్‌గారు శ్రీకృష్ణ తులాభారమును చెక్కతో తయారు చేసి అప్పటి ప్రధానమంత్రి అటల్ బిహారివాజ్‌పాయిగారి చేతుల మీదుగా 'జాతీయ పురస్కారము' పొందిరి.

**రబ్బాని :** మునుమాక వాస్తవ్యులైన షేక్ రబ్బాని నరసరావు పేటలోని పాత ఎల్.ఐ.సి. ఆఫీసురోడ్డులో $2\ ^1/_2$ సంవత్సర ములనుండి ఇండ్లకు, దేవాలయములకు కావలసిన తలు పులు, దర్వాజాలపై పలు దేవతామూర్తులు, పూలు, లతలు, జంతువులు తదితర బొమ్మలను సజీవశిల్పాలుగా మలుస్తు న్నారు.

**ఇంకొల్లు నాగేశ్వరరావు ఉడ్ కార్వింగు :** వినుకొండ వాస్తవ్యు లైన ఇంకొల్లు నాగేశ్వరరావుగారు గత 10 సంవత్సరముల నుండి నరసరావుపేటలోని పాతపోలీసుస్టేషను ఎదురుగా దుకాణము ప్రారంభించి వ్యాపారము సాగిస్తున్నారు. వీరి కుమారులు శ్రీనివాసరావు, వరప్రసాద్‌గార్లు కూడా తండ్రి

అడుగుజాడలలోనే పయనిస్తున్నారు.

**ఎమ్.డి. అస్లాం, వరాన్ షరీఫ్ వుడ్ కార్వింగు** : ఢిల్లీవాసి యైన ఎమ్.డి. అస్లాం తమ ముగ్గురు కుమారులతో కలసి నరసరావుపేట పాతపోలీసు స్టేషనురోడ్డులో గత 5 సంవత్సరములనుండి ఈ వ్యాపారము చేస్తున్నారు.

**సిమెంటు శిల్పము** : నరసరావుపేట పట్టణములో సిమెంటు బొమ్మల తయారీకి ఆద్యులు శివరాత్రి వేంకటకోటయ్య. రాజా కొండలరావుగారు వీరిని స్థలదానంతో సత్కరించారు. వారి కుమారులు శివరాత్రి కోటయ్య గాంధీబొమ్మలు, కృష్ణుని బొమ్మలు, ఇతర దేవతామూర్తుల శిల్పాలు, గృహాలంకరణ శిల్పకళలో సిద్ధహస్తులు.



నీలి సూర్యనారాయణగారు సిమెంట్ విగ్రహాలు చేయుటలో సిద్ధహస్తులు. పాతూరు ఆంజనేయస్వామి గుడి గోపురం, శ్రీరాంపురంలోని బ్రహ్మంగారిగుడి, గాంధీచౌక్‌లోని శివుని బొమ్మ వీరికళానైపుణ్యానికి ప్రతీకలు.

**శివరాత్రి వేంకటేశ్వర్లు** : శివరాత్రి వేంకటేశ్వర్లుగారు నరసరావుపేట పెద్దచెరువులో 'శివాశిల్పశాల'ను నెలకొల్పి గత 35 సంవత్సరముల నుండి సిమెంటుతో శిల్పాలు తయారు చేస్తూ జీవనంసాగిస్తున్నారు. వీరు మన పట్టణములోని అనేక దేవాలయములలో సిమెంటు విగ్రహాలు తయారుచేశారు.

**శివరాత్రి బాబూరావు** : శివరాత్రి బాబూరావుగారు పాతూరు ఆంజనేయస్వామిగుడి కుడ్యములపై ఆంజనేయస్వామి జీవిత చరిత్రను ఎంతో నేర్పుతో సిమెంటు బొమ్మలతో చేసి పేరు గడించినారు.

**రాళ్లపై అక్షరాల చెక్కుడు** : చల్లా కోటేశ్వరరావు, రామకోటేశ్వరరావు షుమారు 15 సంవత్సరముల నుండి నరసరావుపేట పల్నాడురోడ్డులో ఈశ్వర్ ఆర్ట్సు మరియు ఆర్.కె. ఆర్ట్సు పేరుతో సంస్థలను స్థాపించి ఈ కళలో వీరి ప్రావీణ్యమును చూపుచున్నారు.

ఈ విధంగా మన పట్టణము వివిధ శిల్పరీతులతో పరిఢవిల్లుతున్నది.

## ప్రకాశంగారి ప్రవాసం

'ఆంధ్రకేసరి' టంగుటూరి ప్రకాశంపంతులుగారు ముఖ్యమంత్రి పదవి నుండి వైదొలగిన తరువాత రాజకీయాలకు దూరంగా ఉన్నారు. ఆ తరుణంలో ఆర్థికసమస్యలతో సతమతమౌతూ సామాన్య జీవనాన్ని గడిపారు. అక్కడక్కడా ఉన్నారు. వారి నివాసంతో పునీతమైన తావుల్లో మన నరసరావుపేటను ముందుగా చెప్పుకోవాలి. ప్రకాశం పంతులుగారు నెలరోజుల పాటు ఇక్కడ మేళ్లచెర్వు కృష్ణమూర్తిగారి ఇంట్లో ఉన్నారు. కృష్ణమూర్తిగారి తల్లి వేంకటసుబ్బమ్మగారి చేతి అమృతాన్నాన్ని ఆరగించారు. వేంకట సుబ్బమ్మగారు ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు దోనెపూడి వేంకటసుబ్బయ్యగారి మేనత్త. ఆ నాటి ఆ కాంగ్రెస్ అనుబంధం కూడా ప్రకాశంగారు మన ఊరిలో ఉండడానికి కారణం కావచ్చు!








# పౌరాణిక నాటకం



## జన్నాభట్ల లక్ష్మీనారాయణ

ఆంధ్రోపన్యాసకులు

వంద సంవత్సరాల చరిత్ర గల్గిన మన నరసరావు పేట పట్టణానికి గొప్ప నాటకచరిత్ర ఉంది. మన పట్టణం ప్రధానంగా పౌరాణిక, జానపద, సాంఘిక పద్యనాటకాలకు నిలయం అనే ఖ్యాతి ఉన్నది.

బెల్లంకొండ సుబ్బారావుగారు మీసాల కృష్ణుడుగా పేరుగాంచారు. పట్టణంలోని కొందరు ప్రముఖులు 1890లో 'విక్టోరియా మెమోరియల్ థియేట్రికల్' అను నాటకసంస్థను స్థాపించారు. బెల్లంకొండ సుబ్బారావు, వంగల ఆంజనేయులుగార్లు ప్రధాన భూమికను పోషించారు. పోలూరి లక్ష్మీకాంతారావుగారు నాటి మేటి దుర్యోధన పాత్రధారులకు సవాలు విసిరి, సంగీతంలో కూడా ఎదురులేని దుర్యోధనునిగా 'వెండి గదను' బహుమతి నందుకొన్నారు. కనుకనే వీరిని సంగీత దుర్యోధను డన్నారు.



సుబ్బారావు



కాంతారావు

వీరు బొబ్బిలియుద్ధంలో రంగారాయుడిగా, జీవనజ్యోతి (బ్రహ్మంగారి చరిత్ర)లో బ్రహ్మంగా నటించి, విశేషఖ్యాతి నార్జించినారు. వీరి కుటుంబం అంతా కళానిల యమే! వీరి శ్రీమతి పోలూరి సీతారామమ్మగారు సంగీతాన్ని విద్యార్థులకు నేర్పి వారిని నిష్ణాతులుగా తీర్చిదిద్దారు.

అర్జున పాత్రనేకాక, విభిన్న పాత్రలను తనదైనశైలిలో ప్రదర్శించి, ప్రతి పాత్రకు వైవిధ్యం చేకూర్చిన అసమాన నటుడు చోరగుడి దాశరథి రావు. రాష్ట్ర నలుమూలలా తన ప్రదర్శనలు చేశారు. వీరు తిరుపతి వేంకట కవులచే "మేము సృష్టించిన అర్జున పాత్రకంటే మీరు నటించిన అర్జున పాత్ర ఎంతో మహోన్నతంగా ఉన్నది" అని ప్రశంసించబడ్డారు.



దాశరథి

నంద్యాల కోటిరెడ్డిగారు 'కలియుగ భీముడు'గా, మహా బలుడుగా కురుక్షేత్ర నాటకంలో తనకంటూ ఒక ప్రత్యేక బాణి నేర్పరచుకొన్న మహానటులు. వారు మేఘ గంభీరము వంటి స్వరముతో డైలాగు చెప్పితే హాలు, పరిసర ప్రాంతాలు ప్రతిధ్వనించేవి. భారతంలో భీముణ్ణి చూడకపోయినప్పటికీ ఆ భీముడు ఇలాగే ఉండేవా డనిపించేది ప్రేక్షకులకు. ఆలిండియా నాటక పోటీలలో ప్రొద్దుటూరులో 'వెండిగద'ను బహుమతిగా పొందారు. భక్త రామదాసులో తానీషాగా, బ్రహ్మంగారి నాటకంలో కక్కడుగా నటించారు.



కోటిరెడ్డి

కె.వి. రాఘవరావుగారు బాల్యంలోనే కాళిదాస నాటకంలో కాళిదాసు పాత్రను, తులసీ జలంధరలో నారద పాత్రను పోషించారు. ఆ తర్వాత కర్ణాటక సంగీతాన్ని అభ్యసించి, పలనాటి చరిత్ర నాటకంలో బాలచంద్రుని పాత్రను ఆ తరువాత శ్రీకృష్ణ, శ్రీరామ, బిల్వమంగళ, భవానీశంకర, జాను, క్రీస్తు పాత్రలను పోషించి అందరి మెప్పును పొందారు. మాజీ రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారు రాష్ట్రపతిభవన్‌లో వీరిని సన్మానించి, 'రాయలసీమ రత్న' బిరుదప్రదానం చేశారు.



రాఘవరావు

తమ్మిశెట్టి వేంకటకోటయ్యగారు అర్జునునిగా నటించి

మన పట్టణానికి వన్నె తెచ్చిన మహానటులు. శ్రుతిపక్వమైన గాత్రంతో ప్రొద్దుటూరు ఆలిండియా కాంపిటీషన్స్‌లో గెలుపొంది 'వెండిగాండీవాన్ని' పొందిన ఘనులు వీరు.

ఆ నాటితరంలో దర్శి శేషగిరి రావు, ఎస్.వి. చలపతి రావు, పిరాట్ల సూర్యనారాయణ, పాపరాజు రమణారావు, కొప్పరపు పురుషోత్తమరావుగార్లు నాటకరంగంలో ఘనకీర్తిని సంపాదించారు.

వి.వి. స్వామిగారు ఆ తదుపరి తరంలో లక్షలాది


వి.వి. స్వామి

ప్రేక్షకుల మన్ననలు పొంది హాస్య నటచక్ర వర్తి, హాస్యనట సార్వభౌమ బిరుదులను అందుకున్నారు. 1969 లో 'శ్రీలక్ష్మీ నాట్యమండలి'ని స్థాపించి శ్రీమతి లతాలక్ష్మితో చింతామణి నాటకానికి శ్రీకారం చుట్టి సుమారు 3,800 ప్రదర్శనలు ఇచ్చారు.

డా॥ పోలేపెద్ది లక్ష్మీకాంతంగారు 'విజయ ఆర్ట్స్


పోలేపెద్ది లక్ష్మీ కాంతం

థియేటర్స్'ను స్థాపించి వేంకటేశ్వర మాహాత్మ్యం నాటకాన్ని వ్రాయించి పలు ప్రదర్శనలిప్పించి అనేక బహుమతులను సాధించారు. అశ్వత్థామ, నారదుడు, నక్షత్రకుడు, రామదాసు పాత్రలను పోషించి ప్రేక్షకుల మెప్పును పొందారు.

సి.ఆర్. దాసుగారు కర్ణాటక, హిందూస్థానీ సంగీత సంప్రదాయ నిష్ణాతులు. నటులుగా జగత్ ప్రసిద్ధులు. ఏ పాత్రను తీసుకున్నా దాని తత్త్వాన్ని ఆకళింపు చేసుకొని ప్రేక్షకులను ముగ్ధులను చేయటం వీరి ప్రత్యేకత. వీరు 'తెలుగు తల్లి' నాటకంలో హీరోగా నటించిన సమయంలో పద్మశ్రీ డా॥ అక్కినేని నాగేశ్వరరావుగారు హీరోయిన్ పాత్రను పోషించారు. రామదాసు, కబీరు, శ్రీకృష్ణ, నారద, గయ పాత్రలను పండించారు. వీరు గొప్ప హార్మోనిస్టు. వీరి కుమారుడు డా॥ అమరేంద్రగారు మన నరసరావుపేటలోని ప్రముఖ శాస్త్రీయ సంగీతవిద్వాంసులలో ఒకరుగా రాణిస్తున్నారు.

శ్రీమతి లతాలక్ష్మిగారు చింతామణి పాత్రధారిణిగా,


లతా లక్ష్మి

హెచ్.ఎం.వి. కంపెనీ రికార్డిస్టుగా తన గాన మాధుర్యంతో దేశ, విదేశాల్లో లక్షలాది రసజ్ఞులను ఆనందాబ్ధిలో ఓలలాడించిన ధ్రువతార. 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు ఈమెకు అమృతవాహిని, కళాసరస్వతి బిరుదులను ఇచ్చి సత్కరించారు. ఈమె సుమారు 4,000 ప్రదర్శనలు ఇచ్చారు.

శ్రీమతి వనపర్తి ఈశ్వరీదేవి నాటకకళకే


వనపర్తి ఈశ్వరీదేవి

అంకితమైన సురభి కంపెనీకి చెందిన కళాకారిణి. ఈమె అనసూయ, సావిత్రి, చంద్రమతి, ద్రౌపది వంటి పాత్రలను ధరించి మంచి కీర్తిని సొంతం చేసుకొన్నారు. వీరి కుమారుడు కృష్ణబాబు మృదంగ ఆర్టిస్టుగా ఉంటున్నారు.

శ్రీమతి పరగటిచర్ల భానుమతి నేటికి తన నటనను గొప్పగా ప్రదర్శిస్తున్న పట్టణకళా కారిణి. కృష్ణుడు, రాముడు, హరిశ్చంద్రుడు వంటి పురుష పాత్రలనూ, చంద్రమతి, బాలనాగమ్మ, చింతామణి, రాధ, మేరిమాత వంటి స్త్రీపాత్రలను పోషించటంలో పెట్టింది పేరు.

శ్రీమతి మెట్టెల పరమేశ్వరి భాగవతారిణి కాలికి గజ్జెకట్టి, మెడలో ఒత్తైన పూలహారాన్ని అలంకరించుకొని, చేతిలో చిరతలు పట్టుకొని వేదిక మీదకు వస్తే శ్రోతలు అపర సరస్వతి అని భావించే వాళ్లు. ఈమె కొంత కాలం డాన్స్ ట్రూపుల్లో పద్యాలు, పాటలు పాడేవారు. ఉత్తర గోగ్రహణం, నర్తనశాల వంటి హరికథలను చెప్పటంలో ఈమెకు మంచి పేరున్నది.

తుర్లపాటి (గొర్రెపాటి) ఆదినారాయణగారు 'బాల సరస్వతీ నాట్యమండలి'ని స్థాపించి ఔత్సాహిక కళాకారులను తయారుచేసిన కళాకారులు. వీరు నాటి మేటినటుల సరసన, అర్జునునిగా, హరిశ్చంద్రునిగా, బిల్వమంగళునిగా నటించే వారు. పాండవుల సీనులో 'ధర్మరాజు' పాత్రకు వీరికి వీరేసాటి.

బోడపాటి నాగేశ్వరరావుగారు మన పట్టణంలో

'మాధురీ నాట్యమండలి'ని స్థాపించి ప్రదర్శన లిచ్చారు. వీరు హరిశ్చంద్రుడు, బిల్వమంగళుడు, శిబిచక్రవర్తి వంటి పాత్రలు పోషించేవారు.

పారావెంకయ్యగారు (భజన పంతులు) బృందావన భజన పితామహులు. నూటికి పైగా భజన సమాజాలకు గురుత్వం వహించిన కీర్తి వీరికి దక్కుతుంది. ఆలిండియా రేడియోలోకూడా వీరి భజన ప్రసారమైంది.



కాళహస్తీశ్వరరావు

పాతకమూరి కాళహస్తీశ్వరరావుగారు సంగీత సరస్వతి. సంగీతశాస్త్రంలోనూ, ప్రయోగంలోనూ కాకలు దీరిన హార్మోనిస్టు. మహావాది వేంకటప్పయ్యగారి ప్రియశిష్యులు. శిష్యవాత్సల్యం అధికంగా కలవారు. 1970 నుంచి అర్వపల్లివారి కంపెనీలో కొన్నివేల ప్రదర్శనలకు హార్మోనియం వాద్య సహకారాన్ని అందించారు. వీరు పలువురు వృత్తి కళాకారులకు, ఔత్సాహిక కళాకారులకు రంగస్థల శిక్షణ ఇచ్చి, వారిని గొప్పకళాకారులుగా తీర్చిదిద్దారు. నాటకస్వరబ్రహ్మ, నాటక స్వరార్ణవ బిరుదములతో సువర్ణకంకణంతో మన పట్టణ పౌరులు వీరిని ఘనంగా సత్కరించారు.

రావిపాటి సుబ్బారావుగారు మన మునిసిపల్ హైస్కూలులో హిందీ ఉపాధ్యాయులుగా పనిచేసేవారు. వీరు శాస్త్రీయసంగీతంలో తిరుగులేని ప్రతిభ కలవారు. కీర్తికాంక్ష నలుసంతైనా లేని విద్యా వినయ సంపన్నులు. స్కూలు నుండి ఇంటికి వచ్చినప్పటినుండి గాయకులను హార్మోనియం మీద పద్యాలుపాడించి వారికి సంగీతాన్ని నేర్పేవారు. సంగీత శిష్యులకు సుబ్బారావుగారు 'సంగీతవిద్యాదర్పణం' లాంటివారు.

పోలూరి పుల్లారావుగారు పోలూరి లక్ష్మీకాంతారావు గారి కుమారులు. ప్రముఖ హార్మోనిస్టు. ప్రఖ్యాత కళాకారులనేకులకు వాద్యసహకారం అందించారు. వీరి సోదరులు రాముగారు తబలా వాద్యంలో సిద్ధహస్తులు. డోలక్, మృదంగం, మద్దెల వంటి చర్మకట్టువాద్యాల ప్రయోగంలో నిష్ణాతులు. తబలా విద్వాంసులు బెజ్జంకి నాగయ్యగారు, డోలు విద్వాంసులు తంగటి కృష్ణమూర్తిగారు మన పట్టణవాసులే!

చిక్కాల సత్యనారాయణగారు పల్లెటూళ్లలో ఔత్సాహికులకు నాటకాలు నేర్పుతూ, అందరి గౌరవాన్ని పొందుతున్నారు. కొన్ని దశాబ్దాలు గ్రామాలలో నాటకాలు నేర్పి ఓపికతగ్గి మనపట్టణంలో తనఇంట్లో రిహార్సల్స్‌రూం ఏర్పాటు చేసి ఎంతోమందికి తర్ఫీదు ఇస్తున్న హార్మోనిస్టు వీరు.

మోదుగుల శ్రీనివాసరావుగారు (పలుదేవర్లపాడు శ్రీను) బాల్యం నుండి సంగీతం పట్ల మక్కువతో హార్మోనియం నేర్చుకొని, ఔత్సాహిక కళాకారులకు, వృత్తికళాకారులకు శిక్షణనిస్తూ మంచి పేరు సంపాదించుకుంటున్నారు. వీరు స్థాపించిన 'శృతిలయ సంగీత కళాసమితి' సురభి సమాజం మాదిరిగా గాయకులు, మేకప్ ఆర్టిస్టులు, హార్మోనిస్టులు, వాద్యకళాకారులు స్త్రీ పాత్రధారిణులు అందరికి ఒక సంగీత నృత్యకళాలయంగా విరాజిల్లుతున్నది.

చింతలచెర్వు శ్రీనివాసరావుగారు వెంగళరెడ్డి కాలనీలో ఉంటూ మొదట డాన్సుపార్టీలలో హార్మోనిస్ట్‌గా పద్యాలు, పాటలు పాడేవారికి వాద్యసహకారాన్ని అందించేవారు. తదుపరి షేక్ జమాల్ 'చింతామణి' నాటకసమాజాన్ని ఏర్పాటు చేసి కొన్ని వేల ప్రదర్శనలు చేయించారు. హార్మోనియం మెట్లమీద వేళ్లు నాట్యం చేసేవా! అన్నట్లుగా వాద్యాన్ని వాయించేవారు.

చింతా జక్రయ్యగారు డాన్సర్లలోనున్న ప్రతిభను గుర్తించి వారికి పద్యనాటకాలు నేర్పేవారు. వీరు మన పట్టణంలోనే ఉంటూ ప్రక్కనున్న జొన్నలగడ్డ వెళ్లివస్తుండేవారు. అందువలన అందరూ వీరిని జొన్నలగడ్డ జక్రయ్య అని పిలిచేవారు.

వంకాయల అంజిరెడ్డిగారు శ్రావ్యమైన గాత్రంతో, స్పష్టమైన ఉచ్చారణతో, ఆంగికాభినయంతో ప్రేక్షకులను మంత్ర ముగ్ధులనుచేయగల రంగస్థలకళాకారులు. ఉప్పలపాడులో పొలం పనులు పూర్తిచేసుకొని సాయంత్రానికి మన పేటకు వచ్చి, రిహార్సల్ చేసుకొని ప్రదర్శనలు ఇస్తున్నారు. జి.వి. నారాయణ చౌదరిగారు, గద్దె సంజీవయ్యగారు, ఎన్. మాణిక్యారావుగారు, గోవర్ధన్‌గారు, పచ్చా వీరయ్యా చౌదరి గారు– ఇలా ప్రతిఒక్కరు పద్యనాటక ప్రదర్శకులు ప్రతి నిత్యం వచ్చి పద్యాలు పాడుకొని వెళ్తూ నాటకాలు ఆడేవారు. ఏ ఊరు వెళ్లినా ఆ ఊరి వారు 'మీది ఏ ఊరు?' అంటే గర్వంగా

'నరసరావుపేట' అంటారు. మాష్టర్ ఫరీదు మన పట్టణంలోని రామిరెడ్డిపేటలో ఉంటూ నాటకరంగాన్నే నమ్ముకొని జీవనం సాగిస్తూ ఉన్న కళాకారుడు. దామోదరు డుగా, కేశవునిగా, సత్యకీర్తిగా, తలారిరాముడుగా, తిప్పడుగా వివిధ పాత్రలను పోషించి, తను నటించే పాత్రకు పూర్తి న్యాయం చేయగల హాస్యనటులు ఫరీదు.

ఎం. విజయభానుగారు నృత్యకళాకారిణిగా డాన్స్ పార్టీలలో రెండు దశాబ్దాలు ఆడి, పాడి, రంగస్థలనటిగా మారాలని పద్యనాటకాలవైపు వచ్చారు. శ్రీకాళహస్తీశ్వరరావు గారి వద్ద చింతామణి, చంద్రమతి, రాధ, సంగు, బాలనాగమ్మ వంటి పాత్రలు నేర్చుకొని కొన్ని వేల ప్రద ర్శనలు ఇచ్చారు. ప్రస్తుతం ఈమె దృష్టి ఆధ్యాత్మికం వైపు మళ్లింది.

శ్రీమతి జి. వరలక్ష్మి రికార్డు డాన్సుల నుండి మ్యూజికల్ డాన్సుఫీల్డుకు మారి సుమారు కొన్నివేల ప్రదర్శ నలు ఇచ్చారు. ఆ తర్వాత రంగస్థలనటిగా మారారు. చంద్ర మతి, చింతామణి, సంగు, ద్రౌపదివంటి పాత్రలు ధరించటం లో నేర్పరి. కొంతకాలం సొంతనాటక సమాజాన్ని నడిపారు.

శనివారపు నరసింహారెడ్డిగారు ఆచంట వేంకట రత్నంనాయుడుతో సరిదీటుగాదుర్యోధనపాత్రను ప్రదర్శించి వారి చేత సెహబాష్ అనిపించుకున్న గొప్ప కళాకారులు. వీరు జ్యోత్స్న ఆర్ట్స్ థియేటర్స్ అను కళాసంస్థను స్థాపించి ప్రదర్శనలు ఇచ్చారు. అందువలన వీరిని 'జ్యోత్స్నగారు' అంటారు. మేళ్లచెర్వు యజ్ఞనారాయణగారు సురభిళ నాట్యమండలి ఆధ్వర్యంలో శశిరేఖా పరిణయం నాటకంలో దుర్యోధన పాత్రను, సారంగధర నాటకంలో సారంగధర పాత్రను పోషించారు. గోదావరి, బన్నీ చిత్రాలలో నటించారు. వీరు కోర్టుమార్షల్ నాటకంలో ఆర్మీ ఆఫీసర్‌గా నటించారు. వై. శిఖామణి, ఎన్. వెంకుశ్రీ, రత్నకుమారి, అశ్విని గార్లు మన పట్టణ కళాకారిణులే!

**మేటి మేకప్ కళాకారులు :** నటీ నటులకు ఎంతచక్కని రూపం ఉన్నా, శ్రావ్యమైన గాత్రం ఉన్నా, స్పష్టమైన ఉచ్చారణ ఉన్నా ఆహార్యం లేనిదే రాణింపు ఉండదు. ఆ ఆహార్యాన్ని అందించేదే అలంకరణ. అటువంటి అలంకరణ సామాగ్రికి నిలయం



రెడ్డిమాసు శాంతయ్య

రెడ్డిమాసు శాంతయ్య డ్రస్ కంపెనీ. నాటకంలోని అన్ని పాత్రలకు కావలసిన డ్రస్‌లు, ఆభరణాలు, విగ్గులు, ఆయుధాలు, అన్నీ సమకూర్చుకొని, నాటకసమాజాలకు, కళాకారులకు తగినరీతిలో మేకప్ చేయగల రూపశిల్పి శాంతయ్యగారు. రవాణా సౌకర్యాలు లేని ఆ రోజుల్లో డ్రస్ పెట్టె, కర్టెన్ మూట నెత్తిన పెట్టుకొని వెళ్లి నాటకం ఆడించి వచ్చే శాంతయ్యగారు మంచి రూప శిల్పిగా కీర్తి గడించారు. మద్రాసులో సినీపరిశ్రమ ఉన్నప్పుడు అక్కడినుండి సామాన్లు తీసుకొచ్చి, కళాకారులకు ఆహార్యాన్ని దిద్దితీర్చేవారు. నాటకాలు కూడా ఆడించేవారు. కళాకారులను పోషించేవారు. మన పట్టణంలోనే కాదు, ఎక్కడకు వెళ్లినా 'నరసరావుపేట శాంతయ్య డ్రస్ కంపెనీ' అనేవారు. ఆ విధంగా రంగాలంకరణలో మన పట్టణానికి పెద్దపీట వేయించారు వారు.

మన పట్టణంలో వెంకటకోటయ్య డ్రస్ కంపెనీ, నీలి చంద్రయ్య డ్రస్ కంపెనీ, రెడ్డిమాసు శాంతయ్య డ్రస్ కంపెనీ, కొడవటి వెంకయ్య డ్రస్ కంపెనీ, శ్యాంబాబు డ్రస్ కంపెనీలు ఉన్నాయి. ఇన్ని కంపెనీలు ఉండబట్టే పలు గ్రామాల కళాకారులు 'నరసరావుపేట వెళితే ఖచ్చితంగా డ్రస్ దొరుకుతుం'దని నమ్మకంతో ఉన్నారు. ఒక్కొక్క కంపెనీలో ఒకేసారి ఐదారు నాటకాలకు సరిపోయే సామగ్రి ఉంటుంది. నిర్వాహకులు పోటాపోటీగా మంచి మంచి ఆభరణాలు, ఆయుధాలు, డ్రస్‌లు, కర్టెన్లు తీసుకొచ్చి ప్రేక్షకులను అబ్బుర పరుస్తారు.

మనఊరికి సుదూర ప్రాంతాలలో సైతం ఏ ఉత్సవం జరిగినా, ఏ తిరునాళ్ల జరిగినా, వేడుకలు జరిగినా ఆ నిర్వాహకులు 'నరసరావుపేట పట్టణం నాటక ప్రదర్శనలకు, నాటక సమాజాలకు, మహిళా కళాకారులకు, మేకప్, డ్రస్సులు, వాద్యాలు మొదలైనవాటికి ఆలవాల మైనదనీ భావించేవారు. వివిధ ప్రాంతాల నుండి ఇక్కడికి వచ్చి బుక్ చేసుకొనేవారు. నరసరావుపేట కళ అన్యత్ర దుర్లభమని సరసజనోక్తి!!

# అదిగో! ద్వారక....


డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణ

సినీ, రంగస్థల నటులు.




'కావ్యేషు నాటకం రమ్యం' అన్న ఆర్యోక్తి జగద్విదితం. అందునా భారతేతివృత్తాలైన నాటకాలంటే ఆంధ్ర ప్రజానీకానికి మరీ మక్కువ ఎక్కువ అని 'పాండవోద్యోగాలు' ఈ నాటికీ ఋజువు చేస్తున్నాయి. 'పాండవ విజయం' ప్రదర్శనలు బాగా తక్కువైనాయి గానీ, 'ఉద్యోగం' మాత్రం రోజూ ఏదో ఒక మారుమూలనైనా ప్రదర్శింపబడుతూనే వున్నది. కారణం తిరుపతి వేంకట కవుల రచనా నిర్మాణమే! అంతటి మహాకవులు, పుంభావ సరస్వతీమూర్తులు, అవధాని శేఖరులు ఈ పాండవోద్యోగాలను చక్కని వ్యవహారశైలిలో రచించారు. గ్రాంథిక, సరళ గ్రాంథిక శైలి, కొన్ని కొన్ని పద్యాలలో కనబడు తున్నా, మరి అదేమి విచిత్రమోగానీ ఆ పద్యాలన్నీ జన వ్యవహారంలో నేటికీ సజీవంగా నిలిచే వున్నాయి. పాడుకోవడానికి మరీ అనుకూలంగా శాశ్వతంగా ప్రజల నోళ్లలో నిలబడి పోయాయి. 'నిజానికి ఈ ఘనత అంతా 'కవిబ్రహ్మ' తిక్కన గారిదే!' అని కూడా తిరుపతి వేంకట కవులన్నారు. 'తిక్కనే గనుక మహాభారతం అంతటి గొప్పశైలిలో, నాటకీయంగా వ్రాసి వుండకపోతే మేం ఈ విధంగా వ్రాసి ఉండగలిగే వాళ్లంకాదు' అని కూడా అన్నారు. ఈ మాటలు అక్షరసత్యాలని మనం కూడా నమ్మాలి. అందుకే–

కం॥ చక్కని పదముల పొందిక
చక్కలదొర నుండి జారు సుధ యనగా, పెం
పెక్కిన రస ప్రసారము
తిక్కనకే గాని లేదు దేవున కేనిన్ !

అన్నారు ఈ జంట కవులు.

పాండవోద్యోగాలలో 'ద్వారక దృశ్యాని'కి ఉన్నంత ప్రాశస్త్యం, మరే ఇతర నాటకాలలో మనకు కనబడదు. ఈ దృశ్యాన్ని రకరకాల పేర్లతో పిలుస్తున్నారు. 'పడక సీను' అనే దుష్టసమాసం జనబాహుళ్యంలో శాశ్వతంగా నిలిచిపోయింది. దుర్యోధనుడు దుష్టుడేగదా, 'పడకసీను'లో వస్తాడు గదా అతని ఆలోచనలు అన్నీ దుష్టాలే గదా అందుకని ఈ 'దుష్ట సమాసం' అన్ని విధాలా సరిపోతుందని నేనే అనేక వేదికల మీద సరదాగా చెప్పాను. ద్వారక ఘట్టంలోనే దుర్యోధనుడి నోటి మీదుగా అద్భుతమైన గురుభక్తి పూర్వకమైన పద్యం చెప్పించారు తిరుపతి వేంకటకవులు. మన నటసోదరులు చాలామంది అది పక్కకు పెడతారు. కానీ ఆ పద్యం నిజానికి ఎంత అందమైన, గొప్ప పద్యమో మీరే చూడండి –

ఉ॥ నాకు గదా గురుండు భువనస్తవనీయ పరాక్రముండు సు
శ్లోకు డమాయికుండు రిపులోక భయంకరు డస్మదర్థ సం
ధాకుశలుం డుదారగుణధాముడు శ్రీబలరామదేవు డీ
పోకల వాడు గాడు వృథ పుచ్చడు మెచ్చ డతండు పార్థులన్!

ఈ పద్యంలో బలదేవుని సంపూర్ణ మూర్తిమత్త్వం, కీర్తిమత్త్వమే గాదు దుర్యోధనుని ప్రగాఢ గురుభక్తి గూడా ద్యోతకమౌతున్నది. అంతేకాదు; శ్రీకృష్ణుని కుహనాశీలత్వం, ఆశ్రితపక్షపాతం కూడా పరోక్షంగా వ్యక్తమయ్యేటట్లు దుర్యోధనుడి నోటి మీదుగా పలికించారు మహనీయులు తిరుపతి వేంకటకవులు. మరొక్క విషయం కూడా మనం గ్రహించాల్సి ఉంటుంది. శ్రీకృష్ణుడి సహాయం కోరి వచ్చిన దుర్యోధనుడు అక్కడ కూడా గురుస్మరణ మర్చిపోకుండా చేశాడు. జీవితంలో 'గురువు' ఆశీర్వచనం, ప్రేమ, వాత్సల్యాలు ఉంటే ఇక వానికి తిరుగు ఉండదన్న శాస్త్రధర్మాన్ని గ్రహించినవాడు దుర్యోధనుడు. అర్జును డేమో తన బాధ్యత సర్వస్వాన్ని శ్రీకృష్ణుడిపైనే వేసినవాడు. తాను నిమిత్తమాత్రుడనని అనుకున్నవాడు.

ఇక 'అర్జున' పాత్రలో చాలా విశేషాలు చెప్పవచ్చు. మా చిన్నతనంలో 'అర్జునుడు' అనగానే 'పులిపాటి వేంక

టేశ్వర్లు' గారి పేరే వినబడేది. దురదృష్టం, ఈ తరం వారికి ఈ పేరే తెలియదు. ఐందా కనకలింగేశ్వరరావుగారు శ్రీకృష్ణుడు, పులిపాటి వేంకటేశ్వర్లుగారు అర్జునుడు, మాధవపెద్ది వేంకట్రామయ్యగారు దుర్యోధనుడుగా ఉంటే ఆ రోజు కనకవర్షమే! ఒక రకంగా సమకాలికులయినా, మరో రకంగా తరువాతి తరం వారయిన పీసపాటి, షణ్ముఖి, రఘురామయ్య, అద్దంకి, సూరిబాబు, అబ్బూరి, ఏ.వి. సుబ్బారావుగార్లు – వీళ్ల యుగం వచ్చేటప్పటికి నాటక రంగంలో కొన్ని మార్పులు వచ్చాయి. ఈ తరం వారికి 'పీసపాటి నరసింహమూర్తిగారు' తెలుసునుగానీ, అదే తరం వాడైన అంతకుమించిన గొప్ప శ్రీకృష్ణ పాత్రధారి అయిన **పాపరాజు వేంకట రమణయ్యగారు (ఎల్లమంద గ్రామం, గుంటూరు జిల్లా)** చాలా మందికి తెలియదు. అతడు అకాల మృత్యువు పాలవడం దురదృష్టం. మహానటుడు చలన చిత్రరంగంలో తర్వాత సుప్రతిష్ఠితుడైన ధూళిపాళ సీతారామశాస్త్రిగారు గూడా మొదట మొదట రంగస్థల దుర్యోధనుడే!

'అర్జున' పాత్రతో ప్రారంభమయ్యే ఈ 'ద్వారక దృశ్యం' లో అద్భుతమైన పద్యాలు కనబడతాయి, వినబడతాయి. 'ద్రుపదుని పంపునన్ జనె పురోహితుడు...' అనే పద్యంతో అర్జునుడు రంగప్రవేశం చేస్తాడు. ఇది స్వగతం. నెమ్మదిగా, మెల్లగా తనలో తాను భావ వ్యక్తీకరణ చేస్తూ అభినయించవలసిన పద్యం. దురదృష్టం, ఈ పద్యాన్ని గూడా అవతలివాడి చెవులు గింగురు మనేంత శబ్దంతో నటులు పాడుతున్నారు. 'అదిగో ద్వారక; ఆలమంద లవిగో...'– చాలామంది ఈ పద్యాన్ని గుండెలవిసేలా అరుస్తున్నారు. ఇది చాలా కూడని పని.

ఇక శ్రీకృష్ణుడు కపటనిద్ర నుండి మేల్కొనిన తర్వాత అర్జునుని జూచి పాడే పద్యాలు అడ్డూ, అదుపూ లేకుండా పోతున్నాయి. 'ఎక్కడ నుండి రాక' అనే పద్యం ఒక్కటే ఐదు నిమిషాలు పాడితే... ప్రక్కన గదతో కూర్చొనిఉన్న దుర్యోధనుడి గతి ఏంకావాలి? ఎంతసేపు కాలుమీద కాలు వేసుకుని, లేదా కాలు మార్చుకుంటూ, లేదా గదను అటూ ఇటు త్రిప్పుకుంటూ లేదా తనలో తానే ఏదో నవ్వుకుంటూ, మీసాలు త్రిప్పుకుంటూ... ఎలా బ్రతకాలి? ఈ విషయాన్ని శ్రీకృష్ణ పాత్రధారి విధిగా ఆలోచించాలి. 'బావా! ఎప్పుడు వచ్చితీవు...' పద్యం గూడా త్వరగా ముగించాలి. లేకపోతే అర్జున పాత్రధారి నానా అవస్థల పాలవడానికి ఆస్కారం వుంటుంది. రంగస్థలం పైన ఉన్న నటుల సంగతి అలా వుంచితే చూడడానికి వచ్చిన ప్రేక్షకుల అవస్థ వర్ణనాతీతం అవుతుంది. అందుకే నటులు సంయమనంతో సరళ సుందరమైన సంగీతంతో చక్కని భాషణలతో ఈ దృశ్యాన్ని పండించాలి. లేకపోతే పండదు. ఎండిపోతుంది. ముఖ్యంగా పౌరాణిక నాటకాలలో జరుగుతున్న పెద్ద దోషం, అపచారం ఏంటంటే, పాడే నటుడి స్థాయిని మించి, హార్మోనిస్టు వాయిస్తున్నాడు. దీంతో నటుడు ఏం పాడుతున్నాడో తెలియని పరిస్థితి. ఇది పోవాలి.

ఇక చివరగా ద్వారక దృశ్యమే గానీ, లేక మరే దృశ్యమైనా గానీ ప్రదర్శన విషయంలో నటవర్గంలో మార్పులు రావాలి. పాతకాలంలో– 'మైకు' వ్యవస్థ అంతగాలేని రోజుల పరిస్థితి వేరు. కానీ ఇప్పుడు చక్కటి 'మైకు వ్యవస్థ' (సౌండు సిస్టమ్) వచ్చింది. కాబట్టి నటీ నటులందరూ, అర్థమయ్యే రీతిలో, మరీ పెద్దగా అరవకుండా సమశ్రుతులలో, స్థాయిలలో పద్యాలు గానీ, వచనం గానీ పలికినట్లయితే 'నటరాజమూర్తి'కి నిజమైన నివాళులర్పించిన వాళ్లవుతారు.

నేను ఈ ద్వారక దృశ్యంలో మూడు పాత్రలూ ధరించినవాణ్ణి! కాకపోతే ఎక్కువగా శ్రీకృష్ణ, అర్జున పాత్రలు ధరించాను. ప్రతి పాత్రకు భేదాన్ని చూపించగలిగినపుడే వాడు నిజమైన నటుడుగా వేదికపై కృతార్థుడౌతాడు. వీటన్నిటినీ మించి మంచి ఆహార్యం (మేకప్) ఉన్నప్పుడే పౌరాణిక నాటకం బ్రతుకుతుంది. పౌరాణిక నాటకం అంటే ఖర్చుతో కూడుకున్న పని. నిజంగానే 'కాళిదాస మహాకవి' చెప్పినట్లు అదొక యజ్ఞమే! ఎంతో క్రమశిక్షణ కావాలి. నటీనటులు గుణ శీలాలను కాపాడుకోవడం చాలా అవసరం. ఇంగువ గట్టిన గుడ్డ కాగూడదు నటుడు. కస్తూరీ పరిమళం కావాలి. అలా కావాలంటే ప్రజాదరణ, ప్రభుత్వాదరణ, మహారాజ పోషకుల ఆదరణ పుష్కలంగా కావాలి. అటువంటి ఆదరణ తప్పకుండా ఆంధ్రదేశానికి కూడా లభ్యమౌతుందని ఆశిద్దాం!

# సాంఘీక నాటకం,టి.వి., చలనచిత్ర రంగాలు



సుంకర కోటేశ్వరరావు

విశ్రాంత డి.సి.టి.ఓ.

నరసరావుపేటలో నాటకం 1966 ప్రాంతాలలో కళ్లు తెరిచి 1968-'69లో ఒళ్లు విరుచుకుని మెల్లగా నడుచుకుంటూ 1980 ప్రాంతాలకు షోకులు నేర్చుకుని పరిషత్తు పోటీల వైపు పరుగులెత్తడం ప్రారంభించింది. 1968 మే 15న కొందరు స్థానిక ఔత్సాహికులు సమావేశమై చర్చించి తీసుకున్న నిర్ణయం మేరకు ది.12-06-1968న నరసరావుపేట ప్రిన్సిపల్ జిల్లా మునసబు శ్రీ బి.కె.రాయ్ అధ్యక్షతన జరిగిన సభలో నాటి 'ఆంధ్రప్రభ' దినపత్రిక సంపాదకులు నీలంరాజు వెంకటశేషయ్యగారి ఆశీస్సులతో 'శ్రీ శ్రీనివాస కళాసమితి' పేరుతో ఓ సాంస్కృతికసంస్థ స్థానిక ప్రకాష్‌నగర్‌లో ఆవిర్భవించింది. దీని వ్యవస్థాపకాధ్యక్షులు నడింపల్లి వేంకట అప్పారావుగారు. ఈ సమితి వెంకన్న కాపురం, కీర్తి శేషులు, నటనాలయం మొదలగు నాటక ప్రదర్శన లిచ్చింది.

1968లో జె.వి.సుబ్బారావుగారు కొందరిని కూడగట్టుకుని 'ఫ్రండ్స్ డ్రెమెటిక్ అసోసియేషన్'ను నెలకొల్పి తన రచనలు విముక్తుడు, నేనోడిపోలేదు మొదలైన నాటికలను స్వీయదర్శకత్వంలో ప్రదర్శించారు.

అదే సమయంలో స్థానిక లాల్‌బహదూర్ కూరగాయల మార్కెట్ నుండి కొందరు ఔత్సాహికులు 'యువకళాకేంద్రం' అనే సమాజాన్ని స్థాపించి పూలరంగడు, రాముడు-రంగడు వంటి నాటకాలను ప్రదర్శించారు. 1969లో స్థానిక బరంపేట నుండి వి. సుబ్రహ్మణ్యాచారిగారు కొందరిని కూడగట్టుకొని 'కృష్ణభారతి కళామందిర్' సమాజాన్ని నెలకొల్పి తన దర్శకత్వంలో 'రక్తజ్వాల' మొదలైన నాటకాలను ప్రదర్శించారు. సూరిబాబు వురఫ్ సూర్యాచారిగారు, సుబ్రహ్మణ్యాచారిగారు, శోభారాణిగారు 'చంద్రా ఆర్ట్స్' అనే సంస్థను నెలకొల్పి 'కిన్నెర' నాటికను సూరిబాబు దర్శకత్వంలో ప్రదర్శించారు. 1969-'70లలో స్థానిక రామిరెడ్డిపేటప్రాంతంలో మళయాళీ శ్రీనివాస్ వురఫ్ కేంటీన్ శ్రీనుగారు రైల్వే డ్రెమెటిక్ అసోసియేషన్'ను స్థాపించి 'ఊబి' యండమూరి 'రంగులనీడ', దాసరి నారాయణరావు 'కట్నాలు-కన్నీళ్లు' నాటికలను ప్రదర్శించారు.

1970-'71లో వి. సుబ్రహ్మణ్యాచారిగారు, కె.వి. ప్రసాద్‌గారు 'లలితా ఎమెచ్యూర్స్' సంస్థను నెలకొల్పారు. తొలిగా కావ్యశ్రీ రచన 'కలెక్టర్' నాటకాన్ని, గణేశ్ పాత్రో రచన 'మృత్యుంజయుడు' నాటకాన్ని ప్రదర్శించారు. ఈ సంస్థ ప్రదర్శించిన 'అక్షింతలు'లో ఇండియన్ గేస్ సుబ్బారావుగారు స్త్రీపాత్ర ధరించగా, నటి భానుమతి 'డాక్టర్ ఫణి'గా మగ వేషం వేయడం విశేషం. తోటకూర వేంకటేశ్వరరావుగారు, జె.వి. సుబ్బారావుగారు, ఎ.ఆర్.కృష్ణ, ఫన్ డాక్టర్ చంద్రశేఖర్ గార్లను ఆహ్వానించి స్థానిక వేంకటేశ్వర ట్యుటోరియల్ కాలేజీ ఆవరణలో ఆర్టిస్ట్ వర్క్‌షాపును నిర్వహించారు. 1970లో అరవపల్లి సుబ్బారావుగారు ప్రముఖ సాంఘిక నాటక రచయిత కొడాలి గోపాలరావుగారిని కలిసి వి.వి. స్వామిగారి సహాయంతో 'శ్రీకన్యకా పరమేశ్వరీచరిత్ర'ను నాటకంగా వ్రాయించి గొప్పసెట్టింగులతో టికెట్‌నాటక ప్రదర్శనలిచ్చారు. 1973లో ఇక్కుర్తి నాగేశ్వరరావు, టెలిఫోన్స్ హనుమంతరావు మొ॥వారు 'నవ్యకళాభారతి' అనే సమాజాన్ని స్థాపించి కావ్యశ్రీ రచించిన 'స్నేహితుడు' మొ॥ నాటికలను ప్రదర్శించారు.

నరసరావుపేట ఆర్.టి.సి. డిపోశాఖ ఔత్సాహికులైన ఆర్టీసీ ఉద్యోగులతో కళారూపాలను నిర్వహించింది. వీటిలో ఆదంబాబుగారు, జాజం రంగారావు, షేక్ సర్దార్, ఇంకా మరికొంతమంది పాల్గొనేవారు. 1977-'78 ప్రాంతాలలో వి. అర్జునరావు తన కొలీగ్స్‌తో కలిసి తమ కూతురు పేరుపై 'కల్పనా కళానికేతన్'ను నెలకొల్పి మోదుకూరి జాన్సన్ రచన 'నటనాలయం' నాటకాన్ని తన దర్శకత్వంలో ప్రదర్శిం చారు.



కొప్పురపు ప్రసాద్

అందులో ఎ.ఆర్.పి.ఎస్. కృష్ణమూర్తి, కె.వి. ప్రసాద్, సుంకర కోటేశ్వరరావు, ఫణీంద్రప్రసాద్, ఎం.సి.కోటయ్య, ఎస్.ఎం బాషా, సమద్, పాషా, మొదలైనవారు పాల్గొన్నారు. అర్జునరావు బదిలీ అయి వెళ్లిపోగా పురపాలక శాఖోద్యోగి కె.వి. ప్రసాద్‌గారు సంస్థను నడిపారు. శ్రీ నాగరాజు గంధం వ్రాసిన 'వలస', 'నోట్ దిస్ పాయింట్, 'రంగులరాట్నం', 'శేషార్థం' నాటిక / నాటకాలనే గాక కె.వి.ఆర్. విజయ్ కుమార్ వురఫ్ రమణ రచించిన 'జీవని' నాటికనూ పరిషత్తులలో ప్రదర్శిం చారు. బాషాతో పాటు అతని కొడుకు మునీర్, వై. త్యాగ రాజు,



కె.కళ్యాణ రాజు

చంద్రశేఖర్, పురుషోత్తం మొదలైన వారు పాల్గొన్నారు. 1974–'75 ప్రాంతాలలో స్థానిక లింగంగుంట్ల కాలనీలో కె. కళ్యాణరాజు, పాలడుగు వేంకటేశ్వరరావు తదితరులు తమ ఇ.ఇ. చెరుకూరి వీరయ్య గారి సహాయ సహకారాలతో 'నాగార్జున కళాసమితి'ని స్థాపించారు. వీరు 'ఉలిపికట్టె' మొ దలగు నాటికలనే గాక వీరయ్య (ఇ.ఇ.) రూపొందించిన సంగీతరూపకాలనూ ప్రదర్శించారు.

'కళాసాగర్ ఎమెచ్యూర్స్' ఫణీంద్ర ప్రసాద్, సుంకర కోటేశ్వరరావు స్థాపించిన సంస్థ. ఇది కొర్రపాటి 'రాగశోభిత' నాటకంతో మొదలైంది. జంధ్యాల రచన 'ఓ చీకటి రాత్రి'ని ఫణిగారి దర్శకత్వంలోనూ ఎల్.బి. శ్రీరాంగారి రచన 'హంష్ కాకి' నాటికను సుంకరగారి దర్శకత్వంలోనూ ప్రదర్శించారు. ఫణి, సుంకర, ఎ.ఆర్.పి.ఎస్., చాగంటి శ్రీనివాస్, బి.వి. చంద్రశేఖర్, ఆర్.టి.సి రామారావు, ఘన్ శాస్త్రి మొదలగువారు పై ప్రదర్శనలలో పాల్గొన్నారు. నవరసనట సమాఖ్యను ఫణి, చంద్రశేఖర్‌తో కలిసి సుంకర కోటేశ్వరరావు నెలకొల్పారు. 1980 నుండి ఈ సంస్థ ఇప్పటికీ నడుస్తున్నది. అభివందన ఆర్ట్స్ (బి.వి), నటసమాఖ్య (ఆర్.టి.సి. రామారావు), కోడి రామకృష్ణ కల్చరల్ అసోసియేషన్ (రంజిత్), ఈ మూడు సమాజాలూ సభ్యుల పరంగా, కల్చర్ పరంగా ఏకమనో జన్యాలే! టెలికం శాఖోద్యోగి వాగిచర్ల వెంకటేశ్వర్లు 'బళ్లారి రాఘవ కళాసమితి'ని 1998 నుండి నిర్వహిస్తున్నాడు.

నరసరావుపేట నాటకరంగ చరిత్రలో 'నరసరావు పేట రంగస్థలి' పుట్టుక ఒక సువర్ణాధ్యాయం! 1979 నవంబరు, డిశంబరు మాసాలలో పట్టణ కళాకారులంతా ఓచోట కూడి ఈ సంస్థను వినూత్న పద్ధతులలో ప్రారంభించారు. నెలనెలా ఓ కార్యక్రమాన్ని ప్రజలముందుకు తేవాలనేది దీని సంకల్పం. ఈ సంస్థ 'నటీనట ప్రేక్షక సమాఖ్య'గా పట్టణంలో స్థాపించబడింది. తొలిగా 1980 జనవరిలో విజయవాడ 'ఎ.ఐ.ఆర్.' ఉద్యోగి ఎం. వీరభద్రరావుగారి (సినీరంగాన సుత్తి వీరభద్రరావు) దర్శకత్వంలో బి.ఆర్. రంగారెడ్డిగారి 'కృష్ణపక్షం' నాటకంతో ప్రదర్శనలు ప్రారంభ మయ్యాయి. 'రంగస్థలి' కార్యక్రమాల వలన ఇతర కళాకారులు స్ఫూర్తిని పొంది పరిషత్ పోటీలలో పాల్గొని 'నంది' బహుమతులతో సహా మరెన్నో బహుమతులను గెలుచుకుని తమను తాము నటులుగా, రచయితలుగా, దర్శకులుగా నిరూపించుకొన్నారు. అది మన నరసరావుపేట పట్టణానికి ఎంతో గర్వకారణం!

మన పట్టణంవారైన అనిసెట్టి వేంకటసుబ్బారావు 1940–'80 దశకాలలోనూ, బెల్లంకొండ సుబ్బారావు 1950–'60 దశకాలలోనూ, సుంకర కోటేశ్వరరావు 1970 నుండి 2014 వరకు, తుర్లపాటి ఫణీంద్రప్రసాద్ 1970–'80 దశకంలోనూ, శ్రీ నాగరాజు గంధం 2005 నుండి 2010వరకు, కె.వి. ఆర్. విజయకుమార్ (రమణ) 2004 నుండి రచనలు చేశారు; చేస్తున్నారు. ఇటీవల కొత్తకలాలు 'మేము సైతం...' అంటూ కత్తులు నూరుతున్నారు. వాళ్లల్లో కరీముల్లా, జాజం రవీంద్ర ఉన్నారు. 'కృషితో నాస్తి నవ్యనాటకం'- వీరందరూ విజయం సాధించాలనీ నవరసాల పేటగా మన పట్టణ కీర్తి ప్రతిష్ఠలను పెంపొందింపజేయాలనీ ఆశిద్దాం!



గంధం నాగరాజు



జాజం రవీంద్ర

వెండితెర, బుల్లితెరల ప్రపంచం ఒక ఇంద్రజాలిక ఆకర్షణల స్వప్నలోకం. మన నరసరావుపేట నుండి సినీ, టి.వి. రంగాలకు వెళ్లిన నటులను గురించి తెలుసు కుందాం!

**సి.ఎస్.ఆర్.** : చిలకలపూడి సీతారామాంజనేయులు పౌరాణిక నాటకరంగంలోనూ, సినీరంగంలోనూ మేటినటుడు. ఎన్నెన్నో హాస్య, విలన్, కేరెక్టర్స్‌తో సినీరంగంలో మేరునగ నటధీరునిలా వెలిగారాయన. కొన్ని వందల సినిమాలలో వందల వైవిధ్య సంపన్న పాత్రలలో తెలుగు ప్రేక్షకుల గుండెలలో నిలిచి పోయారు. మాయాబజార్ లోని శకుని పాత్ర ఒక్కటి చాలు ఆయన నటనాప్రతిభను అంచనా వేయడానికి. సి.ఎస్. ఆర్.గారు ఇక్కడనే పుట్టి పెరిగి మునిసిపల్ హైస్కూల్లోనే చదువుకున్నారు. కృష్ణుడు, అర్జునుడు, ధర్మరాజు మొదలగు పాత్రలలో చక్కని గాత్రంతో నాటకసంగీత ప్రియులను అలరించారు. ఈ ప్రదర్శనల వలన వచ్చిన రాబడి లో నుంచి వీరు నేతాజీ ఆజాద్ హింద్ ఫౌజుకు తెలుగు వీర నారి కెప్టెన్ లక్ష్మి ద్వారా కొంత సొమ్మును విరాళంగా ఇచ్చారు.


సీతారామాంజనేయులు

**ఎ.ఎల్. నారాయణ** : వీరు 1935 ప్రాంతాలలోనే మద్రాసు వెళ్లి దాదాపు 100కు పైగా సినిమాలలో నటించారు. 1935 ప్రాంతాలలో నిర్మించబడిన 'తెనాలి రామకృష్ణ' వీరి మొదటి సినిమా. ఆ తర్వాత పల్లెటూరిపిల్ల, బాలరాజు, సువర్ణ సుందరి, చెంచులక్ష్మి, పెళ్లినాటి ప్రమాణాలు, మావూరిగంగ, బాంధవ్యాలు, దేవత, నాదీ ఆడ జన్మే, నిండుమనసులు, చెల్లెలి కోసం, బంగారు మనిషి, కాడెద్దులు ఎకరంనేల మొదలైన చిత్రాలలో వేషాలు వేశారు.


ఎ.ఎల్. నారాయణ

**ఫణి : తుర్లపాటి ఫణీంద్రప్రసాద్** గారు నాలుగైదు హాస్యనాటికలను, ఒక హాస్య టివీ సీరియల్‌నూ (ఈ టివీకి) వ్రాశారు. వీరు అత్తగారి పెత్తనం, మొండిఘటం, వారాలబ్బాయి, కుర్రచేష్టలు, సర్పయాగం, చిన్న రాయుడు, మీ ఇంటికొస్తే ఏమిస్తారు? మా ఇంటికొస్తూ ఏం తెస్తారు?!, నువ్వు నాకునచ్చావు, బంగారులక్ష్మి మొ॥ సినిమాలలో వేషాలు వేశారు.


తుర్లపాటి ఫణీంద్రప్రసాద్

**శ్యాంబాబు** : శ్యాంబాబుగారు హైస్కూల్లో పిచ్చాసుపత్రి, గారడి వంటి హాస్యనాటికలలో నటించి పదోతరగతి కాగానే మద్రాసు వెళ్లారు. మనుషులు, మట్టిబొమ్మలు, మాంగల్యబలం, పంతులమ్మ, చిరంజీవి రాంబాబు, శ్రీ వీరబ్రహ్మంగారిచరిత్ర, కుర్ర చేష్టలు మొ॥ 60 సినిమాలలో హాస్యపాత్రలలో నటించారు.

**సాంబేలు వినోద్** : వినోద్‌గా కళా ప్రపంచానికి పరిచయమైన సాంబశివరావు ప్రముఖగాయకులు. వీరు రక్తబంధం, మగధీరుడు, తిరుగులేని తీర్పు, భక్త కబీరుదాసు సినిమాలలో నటించారు.


సాంబేలు వినోద్

**బి.బి. చంద్రశేఖరరావు** : వీరు 'వ్యవసాయశాఖ'లో ఉద్యోగిస్తూనే అనేక నాటకాలలో నటించి మంచి హాస్యనటునిగా నిరూపించుకున్నారు. రావుగారు సహనం, మెరుపు, తాతామనవడు,తోకలేనిపిట్ట, శుభవార్త, ప్రియరాగాలు మొదలగు దాదాపు 18 సినిమాలలో నటించారు. పోపులపెట్టె, అంతరంగాలు, లేడీడిటెక్టివ్, జీవన తీరాలు, మౌనరాగాలు, వాయిదాల పెళ్లి, మంజుల మొదలైన దాదాపు 40 టి.వి. సీరియల్స్, టి.వి. ఫిల్మ్స్‌లో నటించారు; నటిస్తున్నారు.


బి.బి. చంద్రశేఖరరావు

**కొఠారి రంజిత్‌కుమార్** : రంజిత్ కుమార్ పొదరిల్లు, అమ్మ ఎవరికైనా అమ్మ, బంగారు లక్ష్మి, గాజుబొమ్మలు, పగబట్టిన సింహం, మగధీరుడు, మొండి ఘటం, భక్త కబీరుదాసు, బెజవాడ పోలీస్ స్టేషన్, ఒట్టు ఈ అమ్మాయి ఎవరో తెలియదు సినిమాలలో నటించారు. అబద్ధాల పెళ్లిళ్లు, నా పెళ్లికి రండి, మాంగల్యానికి మరోముడి, కథ కాని కథ మొదలగు 13 టి.వి. సీరియల్స్‌లో


కొఠారి రంజిత్ కుమార్

నటించారు.



రామారావు

**ఆర్.రామారావు :** రామారావుగారు నాటకాలలో వేషాలు వేస్తూ ఒట్టు, ఈ అమ్మాయి ఎవరో తెలియదు, ఆహ్వానం సినిమాలలోనూ, పంజరం, అనగనగా ఒకరోజు టి.వి. సీరియల్స్‌లోనూ నటించారు.



శివాజి

**శివాజి :** శివాజిగారు హైదరాబాద్ సినీరంగాన కాలిడి హీరో పాత్రలలో రాణించారు. ఇంద్ర, మిస్సమ్మ (కొత్తది), భూలోకం టు యమలోకం, టాటా-బిర్లా మధ్యలో లైలా మొ॥ దాదాపు 60 సినిమాలకు పైగా నటించి మంచి పేరు తెచ్చుకున్నారు.



బాషా

**ఎస్.ఎం. బాషా :** బాషాగారు కొన్ని సినిమాలలో నటించారు. కొన్ని బుల్లితెర సీరియల్స్‌లో కూడా నటిస్తున్నారు.

ఈ నటులందరూ మన పేట కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింప జేయటానికి తమ వంతు కృషిచేయటం ముదావహం!!

పైన తెలిపినవారే కాకుండా ఇంకా అనేకులు కళాకారులు సినిమాలలో తమ ప్రతిభను చాటిన వారు, చాటుతున్న వారు ఉన్నారు. వారందరికీ అభినందనలు తెలియజేస్తూన్నాను. నటరాజు ఆశీస్సులు వారందరికీ పరిపూర్ణంగా లభించాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. ●

# కేతిగాడు-బంగారక్క



## వనపర్తి దుర్గారావు

తోలుబొమ్మలాట కళాకారుడు

ఇది దృశ్యకావ్యాలలో ప్రసిద్ధిగాంచిన జానపద కళారూపం. సాంకేతికపరిజ్ఞానం లేని ఆ పూర్వపురోజుల్లో ప్రజలకు ఆనందాన్ని కల్పించటానికి తోలుబొమ్మలాట ఉపయోగపడ్డది. అట్టి కోవకు చెందిన కళాకారులు మన పట్టణానికి సమీపంలోని ఎక్కలవారిపాలెంలో ఉన్నారు. రాష్ట్రంలోనే ఒక విశిష్ట స్థానాన్ని ఏర్పరచుకొని వారి ప్రతిభ ద్వారా మన పట్టణానికి కీర్తిని సంపాదించిపెడుతున్నారు.

అట్టముక్కలు, రంగుల కాగితాలతోనూ, వెదురు పుల్లలతోనూ బొమ్మలు తయారుచేసి తెల్లగుడ్డను చుట్టూ కట్టి, ఆ తెర లోపల లాంతరు పెట్టి లయబద్ధంగా బొమ్మలను ఆడిస్తూ ఉంటారు. రామాయణ, భారత, భాగవత కథలను తీసుకొని వాటిని ప్రదర్శించేవారు. ఇటువంటి కుటుంబాలు సుమారు 20 మన పట్టణంలో ఉన్నాయి. ప్రాచీనకళల పరిరక్షణకు వారు కృషి చేస్తున్నారు. వారు రాష్ట్రేతర ప్రాంతాలలో కూడా వీటిని ప్రదర్శిస్తున్నారు. రేఖనార్ హనుమంతరావు, వనపర్తి దుర్గారావు ఇంకా ఎందరో తోలుబొమ్మలాట కళాకారులు ఈ తరంవారికి, వారి పిల్లలకు శిక్షణనిస్తూ ఉన్నారు. హాస్యాన్ని జోడిస్తూ ప్రదర్శన మధ్యలో 'కేతిగాడు - బంగారక్క' అనేవారి బొమ్మలుకూడా ఆడిస్తూ చర్మకట్టువాద్యాలతో పాటలు పాడుతూ ప్రేక్షకులకు ఉల్లాసాన్ని కల్పిస్తారు.

సుప్రసిద్ధ సినీనటులు 'పద్మశ్రీ' అక్కినేని నాగేశ్వరరావుగారు గుడివాడ ప్రాంతంలో మన ఊరివారు ఆడిన తోలుబొమ్మలాటలను చూసి పరవశించారు. ఈ విషయాన్ని వారి కుమారులు ప్రసిద్ధ సినీనటులు అక్కినేని నాగార్జునగారు తమ 'ఎవరు మీలో కోటీశ్వరుడు' మా టి వి కార్యక్రమంలో చెప్పారు. ఇది మన పట్టణానికి గర్వకారణం! ●





# 'మీసాల' కృష్ణుడు



జె. లక్ష్మీనరసింహ హనుమత్ ప్రహ్లాద్
సాఫ్ట్‌వేర్ ఇంజనీర్

తెలుగు నాటకరంగంలో, పాండవోద్యోగ విజయ నాటకాలలో అనేకమంది మహానటులు కృష్ణపాత్రను అద్భుతంగా నటించి ఒప్పించారు. కానీ ఈ కృష్ణపాత్రకు తన సొగసైన మీసాలతో వైవిధ్యాన్ని సృష్టించి, తనదైన బాణితో ఆ పాత్రను అద్భుతంగా పోషించి, మీసాల కృష్ణుడుగా ఆంధ్రప్రేక్షక హృదయాలలో చెరగని ముద్రను వేశారు– బెల్లంకొండ సుబ్బారావుగారు. వీరి స్వస్థలం గుంటూరు జిల్లా, కారంపూడి. వీరి తండ్రి లక్ష్మీనారాయణగారు పిల్లల ఉన్నతవిద్య కోసం మన నరసరావుపేట పట్టణానికి వచ్చి స్థిరపడ్డారు. సుబ్బారావుగారు మద్రాసు వెళ్లి న్యాయశాస్త్రంలో పట్టభద్రులైనారు. గురజాలలోనూ, మన పట్టణంలోనూ, న్యాయవాదవృత్తిలో ఉంటూనే తన కళాజీవితాన్ని ప్రారంభించారు. సుబ్బారావుగారు గయోపాఖ్యానం నాటకంతో నాటకరంగంలోకి ప్రవేశించారు. తొలి ప్రదర్శనలోనే కృష్ణపాత్రలో ఉత్తమనటు డనిపించుకున్నారు.

వీరి పద్యపఠనం ఒక ప్రత్యేకతగలది. రాగం కంటే భావానికి ప్రాధాన్యాన్నిచ్చేవారు. పదవిభాగం చేసి, విరిచి విరిచి భావాన్ని కొట్టవచ్చేటట్లు ప్రేక్షకహృదయాలలో చొప్పించేవారు. దానికోసం పాడిన చరణాన్ని తిరిగి పాడుతుండేవారు. వన్స్ మోర్లతో పాడిన పద్యమే తిరిగి పాడవలసివచ్చేది. పద్యాలతోను, తోటిపాత్రలతోను చెడుగుడు ఆడినట్లు కవ్వించి నవ్వించేవారు. పీసపాటి నరసింహమూర్తిగారి వంటి కృష్ణపాత్ర ధారులెందరో పాండవోద్యోగ విజయాలలో ఈయన ఒరవడిని అనుసరించారు. ప్రస్తుత నటులు అనుసరిస్తున్నారు.

నాటి నటుల్లో విద్యావంతులు చాలా తక్కువ. బెల్లంకొండ వారివంటి విద్యావంతులు మరీ అరుదు. వీరి శ్రీకృష్ణపాత్రాభినయంలో రాజకీయ నటనా చాతుర్యం సాటిలేనిది. సుబ్బారావుగారు వందల పద్యాలను గంభీర భావ ప్రకటనతో అలుపూ సొలుపూ లేకుండా చదివేవారు.

పాండవోద్యోగంలో ప్రథమాంకంలో తన పాదాల దగ్గర ఉన్న అర్జునుని చూచి కుశలప్రశ్నలు వేసి తరువాత కన్నెత్తి తన తల ప్రక్కన ఉన్న దుర్యోధనుని పలకరించి 'ముందుగ వచ్చితీవు మునుముందుగ అర్జును నేను జూచితిన్ ...', 'బావా! ఎప్పుడు వచ్చితీవు...' అనే పద్యాలను చదువుతూ చమత్కారంగా నడుస్తూ ఆరంభంలోనే ప్రేక్షకులను ఆకట్టుకొనేవారు. 'ఆయుధమున్ ధరింప; నని కగ్గముగా; నొకప్రక్క నూరకే/ సాయము సేయువాడ...'నే పద్యం పాడి నేత్రాభినయంతో ఒక ప్రక్క అర్జునుని మీద అభిమానాన్ని కురిపిస్తూ, మరొక ప్రక్క దుర్యోధనుణ్ణి బుజ్జగిస్తూ అతివిశిష్టంగా అభినయించేవారు.

ద్వితీయాంకంలో పాండవుల దూతగా వెళుతూ వారి భావాలను పరీక్షిస్తూ నటించటం వీరి విశిష్టత. ద్రౌపదీ ధర్మరాజుల అభిప్రాయాలను గుర్తిస్తూ ఎవరికిచ్చే సమాధానం వారికి ఇచ్చేవారు. చివరికి భీముణ్ణి కోపోద్రిక్తుణ్ణి చేసి అతనితో ఆడుకుంటూ చేసే అభినయం వర్ణనాతీతం. ఈ విధంగా అడుగడుక్కి అభినయాన్ని పండించి మొత్తం నాటకానికి పరిపుష్టిని సమకూర్చి ప్రదర్శనను జయప్రదం చేసేవారు.

సుబ్బారావుగారు సారంగధర, చిత్రనళీయం, సత్యహరిశ్చంద్ర, ధరణికోట, బొబ్బిలి యుద్ధం, కోకిల మొదలైన ఎన్నో నాటకాలలో నటించారు. ఎన్నోపాత్రలు ధరించారు. అయినా ఆయనకు అశేషఖ్యాతిని ఆర్జించిపెట్టిన పాత్ర పాండవోద్యోగాలలోని కృష్ణపాత్రే!

మీసాల కృష్ణుడుగా ఖ్యాతిగాంచిన బెల్లంకొండ సుబ్బారావుగారు మన నరసరావుపేట కళానైపుణ్యాన్ని దశదిశలా విస్తరింపజేయడం మనకు గర్వకారణం!




# హాస్యవల్లి - అర్వపల్లి



ఎ.ఆర్.పి.ఎస్. కృష్ణమూర్తి
రంగస్థల కళాకారులు

నాలుగున్నర దశాబ్దాలు అప్రతిహతంగా సాగిన తన నటజీవితంలో హాస్యరసానికి నిర్వచనం చెప్పి తనకంటూ ఒక ప్రత్యేకతను సొంతంచేసుకొని 'హాస్యరత్నం'గా పేరు గాంచిన అర్వపల్లి సుబ్బారావుగారు ది. 20-12-1916న వినుకొండ తాలూకా కారుమంచి గ్రామములో జన్మించారు. నరసరావు పేటలో స్థిరపడ్డారు.

కళలకు కాణాచి అయిన నరసరావుపేటలో ఆనాడు పౌరాణిక పద్యనాటకాల ప్రాభవం హెచ్చుగా ఉండేది. సుబ్బారావుగారు 'మీసాల కృష్ణుడు'గా పేరుగాంచిన బెల్లంకొండ సుబ్బారావుగారు, 'కలియుగ కిరీటి'గా పేరుగాంచిన శ్రీ చోరగుడి దాశరథిగార్ల నాటకాలను చూసి, వాటివలన ప్రభావితుడై నాటకరంగం పట్ల అనురక్తి పెంచుకున్నారు. తన ఈడు ఉన్న వారితో చిన్న చిన్న నాటకములు ఆడారు. సహజంగా సుబ్బారావుగారు మంచి వాక్చతురులు. 'కృష్ణ తులాభారం'లోని వసంతకుడి పాత్ర వారికి మంచి పేరు తెచ్చిపెట్టింది. తర్వాత 'ప్రేమలీల' నాటకంలోని విభిన్నపాత్ర గఫూర్‌ఖాన్‌ను ప్రేక్షకులు ఆదరించారు. అలానే 'రంగూన్ రౌడి' నాటకంలో 'షేర్‌జి' పాత్ర.

సుబ్బారావుగారు తన జీవనయానంలో ఎన్నో ఎత్తు పల్లాలను చూశారు. అయితే మనోధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొని వాటిని అతిగమించారు. ఆ రోజులలో వారు 'చింతామణి' నాటకం చూశారు. దానికి ఆకృష్టులై తనకు అనువైన పాత్రగా 'సుబ్బిశెట్టి'ని ఎంచుకొన్నారు. ఆ పాత్రను నటించడమే కాదు; దానిని ఒంటపట్టించుకొని, స్వానుభవమును జోడించి పండించారు. ప్రతిప్రదర్శనలోనూ ఆనాటి సాంఘిక, రాజకీయ ఇతర పరిస్థితులను జోడించి మనసుకు చక్కిలి గింతలు పెట్టే ఆహ్లాదకరమైన 'డైలాగ్స్' చెప్పేవారు. ఇంకా విచిత్రమేమిటంటే పట్టణాల్లో చెప్పే డైలాగ్స్‌కు, పల్లెటూళ్లలో చెప్పే డైలాగ్స్‌కు చాలా తేడాలుండేవి. నాటక రచయిత వ్రాసిన సంభాషణలు తక్కువగా ఉండేవి. తన డైలాగులు ఎక్కువగా ఉండేవి. అదీ ఆయన ప్రత్యేకత. వీరి దర్శకత్వ ప్రతిభ ముందు, నటనాకౌశలం ముందు 'చింతామణి' నాటకంలోని పాత్రలన్నీ కనుమరుగై 'సుబ్బిశెట్టి, చింతామణి, శ్రీహరి, చిత్ర' పాత్రలు మాత్రమే మిగిలిపోయాయి. సుబ్బారావుగారు 1952వ సంవత్సరంలో మద్రాసు 'హిజ్ మాస్టర్ వాయిస్' సంస్థ చేత 'చింతామణి' నాటకం రికార్డు చేయించి గొప్ప పేరు ప్రఖ్యాతులు గడించారు. 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు వీరి నటనకు ముగ్ధులై 'హాస్యరస కల్పవల్లి ఈ అర్వపల్లి' అని ప్రశంసించారు.



చింతామణిలో అర్వపల్లి సుబ్బారావు, వసంతకుమారి, గంగారత్నం

సుబ్బారావుగారు ధనార్జనను ముఖ్యంగా భావించిన వారు కారు. వారు ఎంతోమంది కళాకారులను తయారుచేసి వారికి జీవనభృతిని కల్పించారు. బ్రతుకు పోరాటంలో ఎటువంటి కష్టాలు ఎదురైనా నవ్వుతూ బ్రతకాలని భావించి బోధించడమే కాదు- ఆచరించి చూపారు. కళాప్రపంచంలో తన స్థానాన్ని పదిలపరుచుకొన్నారు. కళాభిమానుల హృదయాల్లో తన ముద్రను సుస్థిరపరచుకొన్నారు. ఆయన మన పట్టణవాసి! అదే మనకు గర్వకారణం! కళాకారులకు, కళాహృదయులకు అర్వపల్లి ప్రాతఃస్మరణీయుడు!!

# నృత్య కళాకారిణులు



## గుంటూరు త్రిపురసుందరి

నృత్య ఉపాధ్యాయిని

1962, 1963 ప్రాంతాలలో మ్యూజిక్ డాన్సు పాట రంగంలో అవతరించిన ధ్రువతార కారుమంచి వసంత కుమారి. ఆమె గీతాలను ఆలపించే తీరు రసహృదయుల కితాబు నందుకొన్నది. గుడివాడ నుండి డాన్సు కోసం కారు మంచి వచ్చి, అక్కడ ఉండగానే గుర్తింపు పొందినందు వలన ఆమె కారుమంచి వసంత కుమారి ఐంది. ఆమె అసలు ఇంటిపేరు కొక్కిలిగడ్డ. ఆ రోజులలో ఏరువాక సాగారో (రోజులు మారాయి), బావలు సయ్యా! (ప్రచండభైరవి) నాజర్‌గారు వ్రాసిన పదవపాటలు– తొయ్యర పడవో! తొట్టిపడవో! పాటలు పాడి ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్నారు. ఈమె శాస్త్రీయ నృత్యం కూడా చేసేవారు. కాళహస్తీశ్వరరావుగారి వద్ద చింతామణి, సత్యభామ, చంద్రమతి, తార, మోహిని వంటి పద్యనాటక పాత్రలు నేర్చుకొని పద్యనాటక కళాకారిణిగా రాణించారు. ఈమె కుమార్తె కారుమంచి విజయలక్ష్మి కూడా డాన్సరే!.



కారుమంచి వసంత కుమారి

శివకుమారిగారిది చామనఛాయ. అయినా మేకప్‌లో రాత్రివేళ స్టేజీ ఎక్కితే రేరాణిగా ఉండేది. ఈమె 'మహాదేవ శంభో' అనే పాట ఎంతో గొప్పగా పాడేది. 'చిక్కావు లేరా! చక్కాని రాజా!' అనే రాజనందిని పాట ఈమె తప్ప మరొకరు పాడలేరు అనేవారు ప్రేక్షకులు. శివకుమారి సిస్టర్స్‌లో 'నర్సు' కుమారి ప్రముఖ నర్తకి. 'శివకుమారి పాట– నర్సుకుమారి ఆట' ఉన్నచోట ప్రేక్షకులు తండోపతండాలుగా ఉండేవారు. నర్సుకుమారి 'బావలు సయ్యా!' పాట, ఆట రెండు ఇట్టే ఆకట్టుకొనేవి. అప్పట్లో 'షహిదా–వహిదా'ల మాదిరిగా 'శివకుమారి–నర్సుకుమారి' నరసరావుపేట గడ్డ మీద 'మ్యూజి కల్ డాన్సుపార్టీలకు గర్వకారణం' అని చెప్పాలి.



శివకుమారి

కాకినాడ పాప సినిమా రంగంలో గుర్తింపు పొందిన సింధుజాకు తల్లి. సామర్లకోట నుండి నరసరావుపేట వచ్చి స్థిరపడింది. అసలు పేరు లక్ష్మి. కానీ కాకినాడ పాప పేరు పేటెంట్. ఈమె డ్యాన్సు ప్రోగ్రాముల నుండి నాటకరంగం లోకి వెళ్లి రాణింపు తెచ్చుకుంది.

జూనియర్ శివకుమారి ప్రత్యేకమైన నర్తకి. 'అల్లా యా అల్లా' పాట ఎన్.టి.ఆర్. గెటప్‌తో వచ్చి ప్రేక్షకులను మైమరపించేది. యన్.టి.ఆర్. గెటప్‌లో 'నేను పుట్టాను లోకం మెచ్చింది', కృష్ణ గెటప్‌లో 'తనివి తీరలేదే', రాజబాబు గెటప్‌లో 'సాకిరేవు కాడ' అనే పాటలతో ప్రేక్షకులను ఉత్తేజపరిచేది.

సీనియర్ కల్యాణి రెండవ తరానికి చెందినవారిలో పేర్కొనదగిన నర్తకి. సీనియర్ కల్యాణి అసలు పేరు ఖాసింబీ. 1954లో జన్మించిన ఈమె తమ బంధువైన వహీదా దగ్గర 7 సంవత్సరాల వయస్సు నుండే డాన్సు శిక్షణ పొందింది. ఆర్టిస్టులు అందరూ డాన్సపార్టీల నుండి రంగస్థల నాటకాల లోకి ప్రవేశిస్తారు. సీనియర్ కల్యాణి రంగస్థలం నుండి మ్యూజి కల్ డాన్స్ పార్టీలోకి మారింది. ఇది ఈమె ప్రత్యేకత.



సీనియర్ కళ్యాణి

# రంగస్థలి



## కిలారు వేంకటరావు

ప్రిన్సిపాల్ (రిటైర్డ్)

కళ కళ కోసమే కాదు! సామాజిక ప్రయోజనాల కోసం కూడ!! అని నిరూపిస్తూ సమకాలీన సమాజ సమస్యలను, పరిష్కారాలను కూడ ఆవిష్కరిస్తూ ఆలోచనాత్మక సందేశాలను ఇస్తూ ముందుకు నడుస్తున్న సంస్థ మన నరసరావుపేట 'రంగస్థలి'. అంకితభావం, క్రమశిక్షణ మూల స్తంభాలుగా కళాభిమానుల ఆదరణే పునాదిగా 1979 నవంబర్ నెలలో 'నరసరావుపేట రంగస్థలి' ఆవిర్భవించింది. ఈ నామకరణం చేసినవారు శ్రీ ఫణీంద్ర ప్రసాద్‌గారు. కె. కళ్యాణరాజుగారు వ్యవస్థాపక అధ్యక్షులుగా, సుంకర కోటేశ్వర రావుగారు వ్యవస్థాపక కార్యదర్శిగా, ఎం.సి. కోటయ్యగారు వ్యవస్థాపక కోశాధికారిగా, కె.వి. ప్రసాద్‌గారు సమన్వయ కర్తగా వ్యవహరించారు.

నాటకరంగం పట్ల అభిరుచిగలవారిని ప్రోత్సహించాలనే తలంపుతో 1999వ సం॥ములో ఎస్.ఎం. బాషాగారి ఆధ్వర్యంలో 'నటశిక్షణా శిబిరం' ప్రారంభమైంది. మన రాష్ట్రం నుండి, కర్ణాటకాది రాష్ట్రాల నుండి వచ్చిన పలువురు ప్రముఖుల చేత విద్యార్థినీ విద్యార్థులకు వివిధ కళాంశాలపై శిక్షణ ఇప్పించినారు. 2007 సం॥ములో అభినయ మరియు రంగస్థలి ఆధ్వర్యంలో ఎస్.ఎం. బాషాగారి పర్యవేక్షణలో థియేటర్ వర్క్‌షాప్‌ను నిర్వహించింది. 'కల్పనా, కళానికేతన్', 'భానూ ఆర్ట్స్', 'అభ్యుదయ కళాసమితి', 'నాగార్జున కళాసమితి', 'అభినందన ఆర్ట్స్', 'విద్యుత్ కళాభారతి', 'ఆర్.టి.సి.ఆర్.సి', "కృష్ణభారతి కళానికేతన్', 'చంద్రా ఆర్ట్స్', 'కళాసాగర్', 'ఎమెచ్యూర్స్ థియేటర్', 'లక్ష్మీ ఆర్ట్స్ థియేటర్', 'కోడి రామకృష్ణ కల్చరల్ అసోసియేషన్', నవరస నటనా సమాఖ్య మొదలగు సంస్థల సభ్యుల కలయికతో 1980లో 'నరసరావుపేట రంగస్థలి' కార్యవర్గం ఏర్పాటు అయినది.

'నర్సరావుపేట రంగస్థలి' 1980లో 'కృష్ణపక్షం'తో శుభారంభం చేసినది. పౌరాణిక, జానపద, సాంఘిక నాటకాలను, భరతనాట్యం, కూచిపూడి నృత్యం, అవధానాలు, సినిమా, లలిత సంగీత విభావరుల వంటి విభిన్న ప్రదర్శన లిప్పించింది. నెలవారి కార్యక్రమాల ప్రదర్శనలకు 2,000 మందికి పైగా ప్రేక్షకులు హాజరయ్యేవారు.

మన రంగస్థలికి ప్రస్తుతం 281 మంది శాశ్వత సభ్యులు ఉన్నారు. ఈ సంస్థ కార్యకలాపాలకు సంబంధించిన నిధుల వినియోగం గురించి ప్రతిసంవత్సరం చార్టర్డ్ అకౌంట్ చేత ఆడిట్ చేయించి ఆ నివేదికలను సర్వసభ్యసమావేశంలో పరిశీలనకు ఉంచి అందరిచే ఆమోదింపచేయటం జరుగుచున్నది.

1980లో మునిసిపల్ హైస్కూల్ ప్రాంగణంలో 'గురజాడ కళామందిర్' పేరుతో మంచి రంగస్థలం నిర్మించబడినది. ఈ ఓపెన్ ఎయిర్ థియేటర్‌కు విన్నకోట రామన్న పంతులుగారి చేతుల మీదుగా ప్రారంభోత్సవం జరిగినది. 2003 సం॥ లో భువనచంద్ర టౌన్‌హాల్‌లో అన్ని హంగులతో ఓపెన్ ఎయిర్ థియేటర్ నిర్మించబడినది. ప్రస్తుతం రంగస్థలి ప్రదర్శనలు అక్కడే కొనసాగుతున్నాయి.

'నర్సరావుపేట రంగస్థలి' వృద్ధులైన పేదకళాకారులను ఆదుకోవటంలోనూ ముందున్నది. ప్రతినెల దాతల సహకారంతో ఆరుగురు పేద కళాకారులకు పెన్షన్ అందజేస్తున్నది. రంగస్థలి అభివృద్ధికి కృషిచేస్తున్నవారికి 'రంగమిత్ర' అవార్డును అందజేస్తున్నది. ఎందరో కళాకారులను రంగస్థలి పురస్కారాలతో గౌరవించింది. నరసరావుపేట పట్టణ వాస్తవ్యులై, సమాజాభివృద్ధికి పాటుపడిన వారినెందరినో 'విశిష్ట వ్యక్తి' పురస్కారాలతో సన్మానించినది. నరసరావుపేట రంగస్థలి వ్యవస్థాపక కోశాధికారియైన ఎం.సి. కోటయ్యగారి స్మారక



డా॥ కోడెల గారి పర్యవేక్షణలో రంగస్థలి పురస్కార గ్రహీత
ప్రముఖ రంగస్థల మరియు సినీ నటులు
శ్రీ కోట శ్రీనివాసరావు గారికి సన్మానం

పురస్కారాన్ని వారి కుటుంబ సభ్యుల సౌజన్యంతో ప్రతిఏటా 'బంగారు పతక' రూపాన అందజేస్తున్నది.

ప్రస్తుతం కిలారు వేంకటరావుగారు అధ్యక్షులుగాను ఎమ్.డి.ఎస్. పాషాగారు కార్యదర్శిగాను, సి.హెచ్. గిరిధర్‌కుమార్ గారు కోశాధికారిగాను, కె.వి.కె. రామారావుగారు గౌరవఅధ్యక్షులుగాను, కవలవాయి విజయకుమార్‌గారు ఫైనాన్స్ కమిటీ అధ్యక్షులుగాను, ఎ.ఆర్.పి.ఎస్. కృష్ణమూర్తిగారు గౌరవ సలహాదారులుగాను ఉన్నారు. 35 వసంతాలు పూర్తిచేసుకుని 36 సంవత్సరంలోకి ప్రవేశిస్తున్న మన రంగస్థలి దాతలు, ప్రేక్షకులు, మీడియావారికి ఎంతగానో ఋణపడి ఉంది. •

# బ్లడ్ బ్యాంక్



**డా॥ ఎన్.కె. హరనాథబాబురెడ్డి,** బ్లడ్ బ్యాంక్ ఆఫీసర్

నేను 1966వ సంవత్సరంలో వైద్యరంగంలోకి ప్రవేశించి మన పట్టణప్రజలకు, పరిసర గ్రామప్రజలకు వైద్యసేవల నందిస్తున్నాను. ఇప్పుడు మన ప్రభుత్వ ఆసుపత్రిలో బ్లడ్‌బ్యాంక్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నాను. ప్రస్తుతం మన నరసరావుపేటలో దాదాపు 200 మంది వైద్యులు వృత్తి నిర్వహణం చేస్తున్నారు. ఈ నిర్వహణంలో రక్తంతో అవసరం బాగా ఏర్పడుతున్నది.

రక్తహీనత కలవారికి, రక్తం వాంతి ఐనవారికి, గర్భవతులకు, ఆపరేషన్ చేయించుకోబోయే వారిలో కొంత మందికి, యాక్సిడెంట్లు జరిగి, రక్తస్రావమైనవారికి, హెచ్.ఐ.వి. వంటి దీర్ఘకాలిక వ్యాధులు కలవారికి– ఇతరుల రక్తాన్ని ఎక్కించవలసి వస్తుంది. మరి కొంతమందికి జీవితాంతము నెలకొక పర్యాయం రక్తం అవసరమవుతుంది.

ఇంతకు ముందు రోజులలో ఒక రోగికి రక్తం అవసరమైనప్పుడు ఆ గ్రూపుకు చెందిన రక్తదాతను వెదకి అతని నుండి రక్తాన్ని సేకరించి వెంటనే ఈ రోగికి ఎక్కించేవాళ్లం. సరియైన సమయానికి రక్తదాత దొరకకపోయినట్లయితే రోగికి ప్రాణాపాయం జరిగేది. ఈ ఇబ్బందిని అతిగమించటానికి గుంటూరు, విజయవాడల వంటి పట్టణాలలో లాగానే మన ఊళ్లో కూడా బ్లడ్‌బ్యాంక్‌ను ఏర్పాటు చేసుకున్నాం.

గౌ॥ డా॥ కోడెల శివప్రసాదరావుగారు ఇదివరలో మంత్రిగా ఉన్న రోజులలో మన గవర్నమెంట్ ఆసుపత్రి పునర్నిర్మాణం జరిగింది. ఆ సందర్భంలో వారు ముందుచూపుతో బ్లడ్‌బ్యాంక్ భవనాన్ని నిర్మించారు. విదేశాల నుండి ఎ.సి. రిఫ్రిజిరేటర్ల వంటి పరికరాలను తెప్పించారు.

ఒకానొక సమయంలో మన ప్రభుత్వం వారు మన ప్రాంతానికి ఒక బ్లడ్ బ్యాంక్‌ను శాంక్షన్ చేశారు. గౌ॥ శ్రీ కాసు వేంకటకృష్ణారెడ్డిగారు తగిన చొరవను తీసుకొని ఆ బ్లడ్ బ్యాంక్‌ను రెవిన్యూ డివిజన్ కేంద్రమైన నరసరావుపేటకు రప్పించారు.

ప్రస్తుతం ఈ బ్లడ్ బ్యాంక్ నెలకు సుమారుగా 500 యూనిట్స్ రక్తాన్ని రోగుల కందిస్తూ ప్రాణదానం చేస్తున్నది. ఈ అవసరాల నిమిత్తం మన బ్లడ్ బ్యాంక్ ప్రతి సంవత్సరము 1800 యూనిట్స్ రక్తాన్ని లక్ష్యంగా పెట్టుకొని సుమారుగా 5,500 నుండి 7,000 యూనిట్స్ వరకు రక్తాన్ని సేకరిస్తున్నది. ఈ సేకరించిన రక్తాన్ని గుంటూరు, విజయవాడ, రేపల్లె, హైదరాబాద్ వంటి పట్టణాలకు పంపిస్తున్నది. ఆర్.సి.హెచ్. ప్రాజెక్టు క్రింద రాష్ట్రస్థాయిలో ప్రథమ స్థానాన్ని పొందింది. ఇప్పుడు నరసరావుపేట బ్లడ్ బ్యాంక్‌కు అనుబంధంగా సత్తెనపల్లి, మాచర్ల, వినుకొండ, బాపట్లలో బ్లడ్‌బ్యాంక్ సెంటర్లు నడుస్తున్నాయి.

రక్తదానం చేసిన వ్యక్తి నీరసపడిపోతాడనే విషయం కేవల అపోహ. రక్తదానం చేసిన వ్యక్తి ఒకటి రెండు రోజుల లోనే తాను ఇచ్చిన రక్తానికి సరిపడా క్రొత్తరక్తాన్ని పొంది ఆరోగ్యవంతు డవుతాడు. పూర్వతేజస్సుతో ప్రకాశిస్తాడు. ఈ సత్యాన్ని గమనించి అవకాశమున్న వ్యక్తులందరూ ఐచ్ఛికంగా రక్తదానం చేసి, ప్రాణదాతలు కావలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను. •

# 'కుస్తీ' మే సవాల్



## మేళ్లచెర్వు యజ్ఞనారాయణ

మేనేజర్, ఎల్. & టి.

రాజా మల్రాజు నరసింహారావుగారు నిజంగా మల్ల రాజే! ఆయన దబ్బపండు చాయతో కాంతులీనే స్ఫురద్రూపి. అనుదిన వ్యాయామంతోనూ మల్లయుద్ధ పరిశ్రమతోనూ పరిపుష్టమైన దేహం వారిది. ఆయన కాలంలో రాజాగారి కోట మల్లవిద్యాప్రదర్శనలకు రంగభూమిగా రాజిల్లింది.

ఆ రోజుల్లో మన పట్టణంలో చెప్పుకోదగిన మల్లుడు 1870 ప్రాంతంలోని లాల్‌ఫండ్‌గారే! అతడి సమవయస్కుడు, కేసానపల్లి నరసింహారావు అతడికి సమఉజ్జీ కూడ. ఆ తరువాత చెప్పుకోదగిన వస్తాదు తోపుడుబండ్ల ఖాసిం.

లాల్‌ఫండ్ తమ్ముడు నన్నెబచ్చేకీ తోపుడుబండ్ల ఖాసింకూ మధ్య మునిసిపల్ హైస్కూల్‌లో కాటాకుస్తీ జరిగింది. ఖాసిం శిష్యుడు అరకాల బజారుకు చెందిన వీరోజీ. ఏనుగుల బజారులో ఉండే అల్లీసాహెబ్ అనే వస్తాదుతో వీరోజీ కుస్తీ పట్టినట్లు తెలుస్తున్నది. జున్ను పహిల్వాన్, సింగరయ్య, రోశయ్య పేర్కొనదగ్గ మల్లయోధులు. ఆ తర్వాత చెప్పుకోదగిన వస్తాదు మీనా కోటయ్య. ఈయన జమీందారుగారి ఆస్థాన వస్తాదు. విజయవాడ నుండి వచ్చిన రేజ పహిల్వాన్‌తో తొలి సారిగా గోదాలో తలపడినట్లు తెలుస్తున్నది. కోటయ్య ప్రియ శిష్యుడు గాలిబ్. ఇతడు కూడా రేజా పహిల్వాన్‌తో తలపడ్డాడు. మీనా కోటయ్యగారి కుమారుడు వేంకటేశ్వర్లు పాతూరుకు చెందిన మోతుకూరి ఆంజనేయులుతో కుస్తీపట్టాడు.



మీనా కోటయ్య

ఈ వస్తాదులంతా గ్రామస్థాయి పోటీలలో పాల్గొన్న వారే తప్ప బయటకు వెళ్లినవారు కారు. వారు అనుసరించింది దేశవాళీ మల్లయుద్ధరీతి కావటమే దీనికి ప్రధాన కారణం.

నూరుద్దీన్ రాకతో 1939 నుండి నరసరావుపేట కుస్తీపోటీలలో నూతన తేజస్సు ప్రవేశించింది. నూరుద్దీన్ ముద్దు పేరు ఉమ్మర్. మల్లయుద్ధంలో ప్రపంచ విజేత అయిన గామా పహిల్వాన్ శిష్యవర్గంలో చేరి దేశం తిరిగి విద్య నేర్చినవాడు. ఆ తరువాత మన పాతూరులో స్థిర పడ్డాడు. ఇక్కడి వారికి ఉత్తరాది మల్లవిద్యా పాకాన్ని రుచి చూపిం చాడు. ఇక్కడి నుంచే కృష్ణా, గోదా వరి, గుంటూరుజిల్లాల మీద సవాలు చేశాడు. తన ప్రియ శిష్యుడైన మేళ్లచెర్వు శేషాచలాన్ని కేవలం రెండు సంవత్సరాల్లో ఒలంపిక్ పోటీలకు సిద్ధం చేశాడు. శిష్య సమేతుడై అనేక పట్టణాల్లో పలు ప్రదర్శనలిచ్చి మన పట్టణఖ్యాతిని ఇనుమ డింప చేశాడు.



నూరుద్దీన్

మేళ్లచెర్వు శేషాచలం (1921-1980) మన పాతూరి నివాసి. వీరి గురువుగారైన ఉమ్మర్‌గారు శేషాచలంగారి ఇంట్లోనే ఉండి వీరికి 8 సం॥ వాత్సల్యంతో విద్య నేర్పారు. 1942లో మద్రాసులో జరిగిన ఒలంపిక్ కుస్తీ పోటీలలో శేషాచలంగారు విజయం సాధించినప్పుడు ఆకాశవాణి, అన్ని పత్రికలు వీరిని ప్రశంసించాయి. ఆంధ్రాటైగర్ నెల్లూరు కాంతారావును శేషాచలం నెల్లూరులో జరిగిన పోటీలలో ఓడించారు. 1944లో తెనాలి నుండి వచ్చిన సోములు అనే వస్తాదును మన జమీందారు కొండలరావుగారి సమక్షంలో రసవత్తరంగా చిత్తుచేసి రాజావారి మన్ననల నందుకున్నాడు. ఏలూరులో మోతేవారి ఆధ్వర్యవంలో జరిగిన కుస్తీపోటీలో శేషాచలం చూపిన నైపుణ్యానికి ముగ్ధుడైన పోలీస్ సర్కిల్ ఇన్‌స్పెక్టర్



శేషాచలం

ప్రత్యేక బహుమతిగా తన చేతి ఉంగరాన్ని వ్రేలికి తొడిగి భుజం తట్టాడు. మేళ్లచెర్వు చెన్నకేశవులు శేషాచలంగారి అగ్రజులు.



చెన్నకేశవులు

ఈయనది దేశవాళి మల్లవిద్య. ఘట్నా కొట్టి ప్రత్యర్థిని మట్టి కరిపించటం ఈయనకు మంచినీళ్ల ప్రాయం. ఈ సోదరులు కుస్తీలతో పాటు కఱ్ఱసాములోనూ పేరుగాంచారు. శేషాచలం గారికి కఱ్ఱసాము విద్యాగురువు స్వర్ణపెద్దిరెడ్డిగారు (1851- 1951). శేషాచలం గారి మల్లవిద్యాశిష్యులు తొలితరంలో మోతుకూరి ఆంజనేయులు. ఈయన నరసరావుపేటలోనే కాక రాజమండ్రిలో జరిగిన కుస్తీపోటీల్లో మొదటి వరుసలో గెలిచాడు. గుంటూరు పోటీలలో పాల్గొన్నాడు. పెద్ద ఎత్తున బరువు లెత్తేవాడు.



ఆంజనేయులు

శేషాచలంగారి మలితరం శిష్యులు శనివారపుసత్యనారాయణ రెడ్డి, కొర్రపాటి శ్రీరామమూర్తి, మేళ్లచెర్వు భానుప్రసాదరావు. ఈ ముగ్గురూ ఈ మల్లవిద్యను ఉత్సహం కొద్దీ నేర్చుకున్నవారే!! ఈ కాటాకుస్తీ పోటీలన్నీ తరచుగా మన రాజాగారి కోటలో జరుగుతుండేవి.

**బరువులెత్తిన బలాఢ్యులు :** లింగంగుంట్ల వాస్తవ్యులు కటకం కోటిరెడ్డి 1917 ప్రాంతంలో రాజాగారికోటలోని ఫిరంగిని అవలీలగా ఎత్తాడు. రామిరెడ్డిపేట వాస్తవ్యులు కాకుమాను రామిరెడ్డి పది మణుగుల బరువు లెత్తేవాడు.



నీలిరాములు

నీలి రాములు పూర్వం ప్రతి శ్రీరామ నవమికి వరుసగా మూడు సం॥లు కోటలో ఉన్న 16 మణుగుల (సుమారు 160 కిలోలు) ఫిరంగిని ఔత్సాహికంగా ఎత్తి ప్రేక్షకుల ప్రశంసలను పొందాడు. అదే ఫిరంగిని లావుగా ఉన్న వైపు మోకాలిమీద పెట్టుకొని రంధ్రం ఉన్న మరొక వైపును క్రింద ఉంచి ఫిరంగి మీదుగా కుడిచేతిని క్రిందికి పోనిచ్చి పట్టి మోకాలి మీదికి లాగుకొని బలంగా ఎత్తి భుజం మీదుగా వీపువైపు త్రిప్పి వేయటం ఫిరంగిని ఎత్తే విధానం. పట్టుకోవడానికి వీలులేని 110 కిలోల రాతిగుండును ఒకే దమ్ములో తొమ్మిదిసార్లు ఎత్తి ప్రథమ బహుమతిని పొందాడు. అంత కంటే పెద్దబండ అక్కడ లేనందుకునిరుత్సాహపడ్డాడు. పూనూరులో చేటవంటి నల్లటి నున్నటి బండ ఉంది. దానికి పందిగుండె రాయి అని పేరు. అక్కడ దాన్ని ఎత్తి ప్రథమ బహుమతి పొందాడు. చిరుమామిళ్లలో గాదె చినవెంకయ్య గారి ఇంటి దగ్గర్లో వున్న బొడ్రాయిని అవలీలగా ఎత్తాడు. అందుకు మెచ్చుకొంటూ చినవెంకయ్యగారు అతనికి వెండి గంటను బహూకరించారు. ఆ రోజులు అలాంటివి!!



చిలకలూరిపేట రోడ్డు పై ఓవర్



# 'ఆట' పట్టు



డా॥ యక్కల మధుసూదనరావు
లెక్చరర్ - ఫిజికల్ ఎడ్యుకేషన్

షేక్ షమీర్
స్టార్ ఆఫ్ ఇండియా (6సార్లు)

విశ్వవిద్యాలయ, రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో క్రీడారంగంలో నాటినుండి నేటి వరకు నరసరావు పేటకు విశిష్ట స్థానం కలదు.

1940వ దశకంలోనే కొఠారి సర్వేశ్వరరావుగారు మద్రాసులో జరిగిన జాతీయ చెడుగుడు పోటీలలో పాల్గొని నారు. 1951వ సంవత్సరంలో ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో జరిగిన వాలీబాల్, బేస్‌బాల్ పోటీలలోనూ విజయం సాధించి నారు. అప్పట్లో సినీనటుడు ఎ.ఎల్. నారాయణ, ఆరికట్ల సుబ్బారావు, ఆలూరి నరసింహం, పులిజాల జగన్నాథం, డా॥ షేక్ ఫరీద్, చిట్టాపురం ఆచార్యులు, మేళ్లచెర్వు చెన్నకేశవులు, జాన్సన్, కృష్ణ, వై. హనిమిరెడ్డి, రహీం, మోటుపల్లి సుబ్బారావు తదితరులు మేటి ఆటగాళ్లు.

బొల్లయ్యగారు (నీలి బొల్లారావు) వాలీ బాల్ ఆటకు తన యావదాస్తిని అంకితం చేసిన మహనీయుడు. పూదోట శౌరయ్య 1957 వ సంవ త్సరం నుండి సుమారు 1965వ సంవత్సరం వరకు జాతీయస్థాయి పోటీలలో పాల్గొని అనేక విజయాలు సాధించినారు. శ్రీబొల్లారావుగారి టీంలో శౌరి, బి.ఆర్. విజయారావుగారు, పుల్లగూర ఆశీర్వాదంగారు, పి. బాలసుబ్రహ్మణ్యంగారు, పి. సుబ్బారావుగారు, బుక్కాపురం కంభంపాటి ఆంజనేయులుగారు తదితరు లుండేవారు. ఈ హెూమ్ టీము అనేక ఇన్విటేషన్ టోర్నమెంట్లలో గెలు పొందింది.

పుల్లగూర ఆశీర్వాదంగారు పల్నాడు జోనల్ ఆటల పోటీలలో వాలీబాల్ జూనియర్ మరియు సీనియర్స్ టీము లలో ప్రథమస్థానం సాధించారు. కె.సిహెచ్. మస్తాన్‌రెడ్డిగారు, అబ్బూరి లక్ష్మీనారాయణగారు, ఎ.బి. గణేష్‌రెడ్డి, ఎస్.జె.ఎం. జగన్, గల్లా వేంకటేశ్వర్లు, గోగుల వేంకటేశ్వర్లు, షేక్ సైదావలి, బి. చక్రవర్తి, యక్కల మధుసూదనరావు, ఆచార్య డా॥ గోగుల పేర్రాజుగారు, ఎం. రామాంజనేయులు, ఎస్. సురేష్, కె.వి. కృష్ణ మోహన్, కాపులపల్లి శ్రీనివాసరెడ్డి, ఎస్. లూర్ధురాజు, ఈదర ఆదిబాబు, ఆర్. స్వర్ణసింగ్, శివరాత్రి సుబ్రహ్మణ్యం, షేక్ గౌస్, పి. జయాదేవి, వి. ఉదయ్‌శంకర్, పి. మల్లికార్జున రావు, లక్కు కృష్ణారెడ్డి, ఎన్. కృష్ణారెడ్డి, ఇస్రాయెల్ ప్రసాద్‌గార్లు వివిధ టీములద్వారా పోటీలలో పాల్గొన్న ప్రసిద్ధులు.

నరసరావుపేటలో బాల్‌బాడ్మింటన్ ఆటను తోట కూర వేంకటేశ్వరరావుగారు, కె. హరనాథ్ బాబాగారు, కందిపాటి రామసుబ్బారావుగారు ఎంత గానో ప్రోత్సహించి అభివృద్ధిలోకి తెచ్చారు. షేక్ కరీమ్ జాతీయస్థాయి పోటీలలో పాల్గొని స్టార్ ఆఫ్ ఇండి యాగా ఎంపికైనాడు. 1985-'86లో సుబ్రహ్మణ్యం ఉరఫ్ (బుజ్జి) ఆంధ్ర టీముకు నాయకత్వం వహించి బంగారుపతకంతోపాటు స్టార్ ఆఫ్ ఇండియా అవార్డు గెలుపొందారు. ఆర్. మనోహర్ (రైల్వే ఎంప్లాయి) జూనియర్ నేషనల్ గోల్డ్‌మెడల్, సీనియర్ నేషనల్స్‌లో రైల్వే టీము తరపున 5 సార్లు ప్రాతినిధ్యం వహించి బంగారు, వెండిపతకాలు సాధించారు. ఎం. కుమార్ (రైల్వే ఎంప్లాయి) రెండుసార్లు జూనియర్ జాతీయ మరియు ఎ.ఎన్. యు.బి.బి. మేల్ టీమ్‌కు రెండుసార్లు ఎంపికై బంగారు, రజతపతకాలు సాధించినాడు; స్టార్ ఆఫ్ ఇండియాగా కూడా ఎంపికైనాడు.

బి. అనిల్‌తేజ 2007-'08, 2008-'09, 2009-'10 వరకు వరుసగా మూడుసార్లు ఎ.ఎన్.యు.బి.బి. మేల్ టీమ్‌కు ఎంపికై వరుసగా మూడుసార్లు ఆల్ ఇండియా ఇంటర్ యూని వర్సిటీ బాల్‌బాడ్మింటన్ టోర్నమెంట్‌లలో పాల్గొని బంగారు, వెండి, కాంస్యపతకాలు సాధించి చరిత్రసృష్టించి నాడు. అలాగే షేక్ షమీర్ 2005నుండి వరుసగా 13 సార్లు ఆంధ్రాటీముకు ఎంపికై జూనియర్ నేషనల్స్‌లో వరుసగా 12 బంగారు

పతకాలు, 1 రజతపతకం సాధించి, 6 సార్లు స్టార్‌ఆఫ్ ఇండి యా గా ఎంపికై చరిత్ర సృష్టించి నరసరావుపేట క్రీడారంగంలో బాల్‌బాడ్మింటన్ క్రీడకు ఒక ఒరవడిని సృష్టించినారు.

నరసరావుపేట నుండి అథ్లెటిక్స్‌లో డి. కాలేబ్ అబ్రహాం (డి.ఎస్.పి. 100 మీటర్స్), 200 మీటర్స్ రన్నింగ్, లాంగ్ జంప్ ఈవెంట్స్‌లో రికార్డు టైమ్ చేసిన ఘనతను సొంతంచేసుకొన్నాడు. ఆ తరువాత షేక్ రషీదాబి జావె లిన్‌త్రోలో సౌత్ జోన్, ఆల్ ఇండియా లెవెల్లో బంగారు, రజత, కాంస్య పతకాలు సాధించిన మొదటి మహిళగా గుర్తింపు పొందింది. ఆ తరువాత ఎస్. రాజు నరసరావుపేట చరిత్రలో అథెల్‌టిక్స్‌లో ఒక చరిత్ర సృష్టించాడు. షాట్‌పుట్ త్రో, డిస్కస్ త్రో, జావలిన్ త్రోలలో అనేకసార్లు, రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ విశ్వవిద్యాలయాల పోటీలలో పాల్గొని బంగారు, రజత, కాంస్యపతకాలు సాధించినాడు.

నరసరావుపేట నుండి అంతర్జాతీయ పోటీలలో



లక్కు అనితా రెడ్డి

పాల్గొన్న మొట్టమొదటి మహిళగా గుర్తింపు పొందిన క్రీడా కారిణి నరసరావుపేట ఎన్.ఇ.సి. కాలేజి ఫిజికల్ డైరెక్టర్ లక్కు కృష్ణారెడ్డిగారి పుత్రిక అనితారెడ్డి జిమ్నాస్టిక్స్‌లో 2006లో ప్రపంచ కప్ జిమ్నాస్టిక్స్ పోటీలలోను, ఆసియా జిమ్నాస్టిక్స్ పోటీలలోను పాల్గొని 7వ స్థానం సాధించినది. అలాగే వాలీ బాల్‌లో సీనియర్‌ల జూనియర్ నేషనల్స్‌లో తృతీయస్థానం, ఆల్ ఇండియా ఇంటర్ యూనివర్సిటీ జిమ్నాస్టిక్స్ టోర్నమెంట్స్‌లో వరుసగా 2 సార్లు కాంస్యపతకం సాధించి నరసరావుపేటకే తలమానికంగా నిలిచింది.

ఎస్. సంగీతరావు క్రికెట్ మినీ సౌత్ జోన్ పోటీలలో ఇప్పటి రిటైర్డు ఇండియా కెప్టెన్ ద్రావిడ్‌తో పాటు పాలుపంచు కున్నారు. కె.మస్తాన్‌రెడ్డి 3 సార్లు అంతర్ విశ్వవిద్యాలయాల క్రికెట్ టోర్నమెంట్స్‌లో పాల్గొని డబుల్‌సెంచరి కూడా సాధించాడు.

కొందరు వ్యాయామోధ్యాపకులు వై.సి. కృష్ణారావు నాయుడుగారు ఫుట్‌బాల్, హాకీ, వాలీబాల్‌లో ఎయుటిఎస్‌సి ఛైర్మన్‌గా వ్యవహరించారు. ఎస్. వెంకటరెడ్డి అనేక పై స్థాయి లలో ఆడి మంచి క్రీడాకారులను తయారుచేసి, అనేక టోర్న మెంట్లు నిర్వహించిన ఘనచరిత్ర కల్గిన వ్యక్తి. వాలీబాల్ నేషనల్, కె.సి.హెచ్. మస్తాన్ రెడ్డి (ఎస్.కె.ఆర్.బి.ఆర్. డిగ్రీ కాలేజి, నరసరావుపేట) వాలీబాల్ గేములో బాగా రాణించి క్రీడ అభివృద్ధికి బాగా కృషిచేసినారు. ఎస్. కృష్ణారెడ్డి (ఎస్.కె. ఆర్.బి.ఆర్. కాలేజి, నరసరావుపేట) వాలీబాల్, కబడ్డీ, కోసం చాలా కృషిచేసినారు. అబ్బూరి లక్ష్మీనారాయణ (కె.ఆర్. జూనియర్ కాలేజి, నరసరావుపేట), వాలీబాల్, బాల్ బాడ్మిం టన్, క్రికెట్ గేమ్స్‌ను అభివృద్ధిపథంలో నడిపారు. లక్కు కృష్ణారెడ్డి అన్ని క్రీడలను బాగా ప్రోత్సహించి అనేక మంది గొప్పశిష్యులను తయారు చేశారు. ఈయన ఆంధ్రా యూని వర్సిటీలో ప్రథమ స్థానం, ఎ.ఎన్.యు. అంతర్ కళాశాలల వాలీబాల్ పోటీలలో ప్రథమ స్థానం సాధించారు. ఆయన ఆడనిఆట, చెయ్యని అంపైరింగ్, తెలియని గేములేదు అనుటలో సందేహము లేదు. వై. మధుసూదనరావు క్రీడలకు మంచి ప్రోత్సాహం ఇచ్చి విశ్వవిద్యాలయ, అంతర్ విశ్వవిద్యా



డా॥ జి. పేర్రాజు

లయాల, రాష్ట్ర, జాతీయ, అంతర్జా తీయ క్రీడాకారులను తయారు చేసి కళాశాలకు నరసరావుపేటకు మంచి ఖ్యాతినందించాడు. ఆచార్య డా॥ గోగుల పేర్రాజు వాలీబాల్, చెస్, వెయిట్ లిఫ్టింగ్, కబడ్డీ, కోకో తదితర ఆటలను బాగా ఆదరించి ప్రోత్సాహించారు. అంతే కాక తల్లిదండ్రులు పేరు మీద ట్రస్టు ఏర్పాటు చేసి భారీ, మధ్యతరగతి క్రీడాకారులను ఆర్థికంగానే కాక ఇతరత్రా ఆదుకుంటున్నారు. ఎన్.లూర్దురాజు వాలీబాల్, బాల్‌బాడ్మింటన్, కోకో, అథ్లెటిక్స్ తదితర ఆటలు బాగా ప్రోత్సహిస్తున్నారు. ఈదర ఆదిబాబు వాలీబాల్, కబడ్డీ, కోకో, క్రికెట్ తదితర ఆటలలో రాణిస్తున్నారు. వి. శరత్‌చందు బాడ్మింటిన్, క్రికెట్, తదితర ఆటలను బాగా ప్రోత్సహిస్తు న్నారు. డా॥ ఎస్. రాజు అథ్లెటిక్స్, వాలీబాల్, కబడ్డీ తదితర ఆటలలో బాగా నేర్పరి. వాటిని ప్రోత్సహించి పోషిస్తున్నారు. పి. నాగేశ్వరరావు క్రికెట్, అథ్లెటిక్స్, బాల్‌బ్యాడ్మింటన్, బ్యాడ్మింటన్ ఆటలను బాగా ప్రోత్సహిస్తున్నారు. •

# యోగ భోగం



మువ్వాళ్ల మధుసూదనరావు
లైబ్రేరియన్ (రిటైర్డు)

నరసరావుపేట సర్వతోముఖాభివృద్ధిలో 'యోగము' గూడ ఒక ప్రధాన పాత్ర పోషించుచున్నది. చిత్తవృత్తి నిరోధకమే యోగం! ఏకాగ్రచిత్తానికి మార్గం యోగమే!! ఏ పనిని సాధించాలన్నా ఏకాగ్రత అవసరమే కదా! కనుకనే యోగమార్గాన్ని సాధారణ మానవునికి చేరువ చేయాలన్న మహదాశయంతో నరసరావుపేటలో ఎన్నో సంస్థలు, ఎందరో వ్యక్తులు నిరంతర కృషిచేస్తున్నారు. పతంజలియోగ, సిద్ధసమాధియోగ, సహజ యోగ, క్రియాయోగ, ప్రాణిక్ హీలింగ్, రేకి మొదలైనవాటిని అందరికీ అర్థమయ్యేలా ఆచరణ సాధ్యమయ్యేలా వీరు ఎంతగానో కృషిచేస్తున్నారు. 'యోగం అనగానే అది 'ఏ కొద్ది మందికో సాధ్యం అయ్యేది మాత్రమే! అందరికీ అందనిది!' అన్న భావం నుండి 'యోగా అందరిది, అందరికీ' అన్న భావనను కలిగించిన మన నరసరావుపేటలోని యోగాసెంటర్లను తెలుసుకుందాం!

**పతంజలి యోగాసెంటర్ :** భగవాన్ పతంజలి యోగ దర్శనాన్ని మనకు చేరువ చేసిన ఆధునికియోగి, రామదేవ బాబా. ఆయన మార్గంలో నరసరావుపేటలో 'పతంజలి యోగా సెంటర్' పేరుతో నిత్యసాధనాకేంద్రాన్ని స్థాపించారు మువ్వాళ్ల మధుసూదనరావుగారు. వీరు ఈ కేంద్రం ద్వారా ధ్యాన, ప్రాణాయామాదులను శిష్యగణంచేత అభ్యాసం చేయిస్తున్నారు. వీరికి నరసరావుపేటలోనే కాక చాగల్లు, కండ్లగుంట, ఉప్పలపాడు మొదలగు అనేక పరిసరగ్రామాలలో శాఖలున్నాయి.

**సిద్ధసమాధి యోగ :** నియమబద్ధమైన నిర్ణీత ఆహారం ద్వారా శరీరాన్ని నిత్యచైతన్యంగా ఉంచడానికి సిద్ధసమాధి యోగ ఉపయోగపడుతుంది. 'అమృతాహారం' అని ఆహారాన్ని అమృతంగా స్వీకరించే విధానాన్ని తద్వారా ఉత్కృష్టమైన 'సమాధి' స్థితిని పొందే రీతిని బోధించే ఈ 'సిద్ధసమాధియోగ'ను బోధించే గురువులు దాదాపు 30 మంది మన నరసరావుపేటలో ఉన్నారు. 12-4-1992 నుండి ఈ యోగ తరగతులు నిర్వహించబడుతున్నాయి.

**సహజయోగ :** 'అపర పతంజలి' అని పేరు పొందిన పూజ్య గురువు రామచంద్ర మహారాజ్‌గారి మార్గంలో సహజయోగా సెంటరును శ్రీమతి దొంతరాజు పద్మగారు అరండల్‌పేటలోని వారి స్వగృహంలో నిర్వహిస్తున్నారు. పది సంవత్సరాల క్రితం పాలడుగు వేంకటేశ్వరరావుగారు ఈ శాఖను ప్రారంభించారు.

**ప్రాణిక్ హీలింగ్ :** ప్రాణశక్తి సాయంతో సాధకుడు తనకు తాను ఆరోగ్యాన్ని చక్కదిద్దుకోవడమేగాక ఎక్కడో విదేశాల వంటి సుదూర ప్రాంతాలలో ఉన్నవారికి కూడ చికిత్స చేయు విధానము ప్రాణిక్ హీలింగ్. ఇది ఫిలిప్పైన్స్ దేశీయులైన గ్రాండ్‌మాస్టర్ చోవాకోక్‌సుయ్‌గారి అపూర్వసృష్టి. గంగవరపు వేంకటేశ్వరరావుగారు ఈ విధానాన్ని మన నరసరావుపేటకు పరిచయం చేసి కొన్ని వందలమందికి ప్రాథమిక, అడ్వాన్సు మొదలైన స్థాయిలలో తరగతులను నిర్వహిస్తున్నారు. ఈ చికిత్స ద్వారా, ఏ విధమైన ఔషధాలు లేకుండా కేవలం ప్రాణశక్తి ద్వారా, జలుబు, తలనొప్పి వంటి సాధారణ వ్యాధులే కాకుండా దీర్ఘకాలిక వ్యాధులనుగూడ తగ్గించగలుగుతున్నారు.

**రేకి :** రే అంటే విశ్వం అని, కీ అంటే ప్రాణశక్తి అని అర్థం. జపాన్ దేశస్థుడు డా॥ మికోవ్ ఉసూయి కనుగొన్న 'విశ్వ ప్రాణశక్తి'- రేకి ప్రాణశక్తి ద్వారా శరీరంలోని పంచకోశాలను, షట్‌చక్రాలను జాగృతం చేయడం ఈ విధానంలోని ప్రత్యేకత. దీనిని కనమర్లపూడి కృష్ణగారు నరసరావుపేటలో నిర్వహిస్తున్నారు.

**పిరమిడ్ ధ్యానయోగం :** 'శ్వాస మీద ధ్యాస' అనే నినాదంతో మాస్టర్ సుభాష్‌పత్రీజీ పిరమిడ్ ధ్యానయోగాన్ని, 'మైత్రేయ బుద్ధా పిరమిడ్ ధ్యానకేంద్రాన్ని 1996లో నరసరావుపేట

లోని రెడ్డినగర్‌లో స్థాపించారు. జి.వి. చంద్రశేఖర్, గొడవర్తి దేవరాజకిశోర్, శ్రీనివాసరెడ్డిగార్లు ఈ మార్గాన్ని మన పేటకు పరిచయం చేయడమే కాకుండా ఒక పెద్ద పిరమిడ్‌ను నిర్మించి క్లాసులు నిర్వహిస్తున్నారు. ఇప్పుడు మన పేటలో ఆరు పిర మిడ్‌లు ఉన్నాయి. శాకాహారం, మితాహారం ద్వారా మనస్సును ప్రశాంతంగా ఉంచుకోవడం, ధ్యానం ద్వారా ఆనందమయ జీవితాన్ని పొందడం వీరి ప్రధాన లక్ష్యాలు.

**బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వవిద్యాలయ సేవాకేంద్రం :** ఈ కేంద్రం నంబూరుబజారులో ఉన్నది. ఇదివరలో దేవర సెట్టి హరగోపాల్‌గారు దీనిని నిర్వహించారు. మౌంట్ అబూ, రాజస్థాన్‌లో ఈ బ్రహ్మకుమారి ఈశ్వరీయ ప్రధానశాఖ మన దేశంలో ఉంది. మద్య మాంసాలను వదలి నైతిక జీవనం ద్వారా ఆత్మస్పృహ కలిగి 'నేను ఈ దేహాన్ని కాదు' అని తెలుసుకోవడం వీరి ప్రధాన లక్ష్యం. భువి దివిగా మారాలన్న మహదాశయం వీరిది.

**ధరణి యోగ :** అవధానం యోగేశ్వరరావు, రేణుక మాతాజీ పుణ్యదంపతులచే ధరణియోగకేంద్రం మన నరసరావుపేటలో 10-10-2006న ప్రారంభించబడింది. అందరికీ ఆరోగ్యం వీరి ప్రధానలక్ష్యం. నరసరావుపేట పరిసరగ్రామాలలో కూడ ధరణియోగా కేంద్రా లున్నాయి.

**వేంకటేశ్వర యోగసేవా సమితి :** మంగళగిరి ప్రధాన కార్యాలయంగా గల ఈ సంస్థ బ్రాంచి మన పేటలో 2001న నాగసరపు రామారావుగారి దివ్యాశీస్సులతో ప్రారంభమైంది. కూనిశెట్టి వేంకటజనార్దన్ గురూజీ, వీరి శ్రీమతి కూనిశెట్టి అనూరాధ (ప్రియంవదయోగిని) దంపతులు ఈ యోగాకేంద్రాన్ని నడుపుతున్నారు.

**వేంకట రమణ యోగసేవా కేంద్రం :** ఈ కేంద్రం మిత్తింటి రాధాకృష్ణమూర్తి (త్రివిక్రమయోగి) గారిచే స్థానిక పాండురంగ స్వామి దేవాలయంలో స్థాపించబడి యోగవిద్యను ప్రజలకు మరింత చేరువ చేస్తున్నది.

**పతంజలి నిత్యసాధనా కేంద్రం :** బండ్లమూడి నాగేశ్వరరావు గురూజీగారి నిర్వహణలో ప్రకాష్‌నగర్‌లో ఈ యోగశిక్షణ ఇవ్వబడుచున్నది. వీరు నిత్యజీవితంలో యోగ ఆవశ్యకతను గురించి సత్సంగ తరగతులలో తెలియజేస్తారు. కుండలినీ ఉద్దీపనకు మార్గదర్శకాల నిస్తారు. ధ్యానంలో మెలకువలను నేర్పుతారు.

**ఓషో పిరమిడ్ ధ్యానకేంద్రం :** గుండిమెడ వెంకటసుబ్బయ్య గారి నిర్వహణలో రెడ్డినగర్‌లో ఈ కేంద్రం నడుపబడుతున్నది. సంపూర్ణ ఆరోగ్యం, మానసిక ప్రశాంతత, ఆత్మబంధం కలిగించడానికి ఈ కేంద్రం కృషిచేస్తున్నది. 'ధ్యానం సర్వరోగ నివారిణి, ధ్యానం సత్యజ్ఞానప్రసాదిని' అని ధ్యానప్రాధాన్యతను తెలుపుతూ ధ్యానమార్గాన్ని సాధారణ మానవులకు అందజేస్తున్నది ఈ ధ్యానకేంద్రం.

### సముచితమైన స్పందన

ఒక గొప్ప సూక్తిని విన్నప్పుడు, ఒక మధురమైన పాటను విన్నప్పుడు, తన భార్య ఒక విలాసచేష్టను ప్రదర్శించినప్పుడు... మనిషి వాటికి అనుగుణంగా స్పందించాలి. ఆ విధంగా స్పందించని వ్యక్తి సర్వసంగ పరిత్యాగి, భవబంధ విముక్తుడైన మహాత్ముడై ఉంటాడు. లేదా పశుతుల్యుడైన పరమ మూర్ఖుడై ఉంటాడు.

### మీసం పెంచని రావు గోపాలరావు

మహానటుడు రావు గోపాలరావుగారు 1950 ప్రాంతాల్లో నరసరావుపేటకు ఎక్కువగా వచ్చేవారు. వచ్చినప్పుడల్లా ప్రస్తుతం శివుడిబొమ్మ సెంటర్‌లో (ఆ నాటి గాంధీచౌక్) ఉన్న చింతలూరువారి ఆయుర్వేదం మందులషాపులో సాయంవేళలో కూర్చునేవారు. రచయితలు, నటులూ అక్కడకు చేరేవారు. పిచ్చాపాటీ మాట్లాడు కొనేవారు. షాపు యాజమాని ద్విభాషి వేంకట రాయశాస్త్రిగారు మంచి సాహిత్య ప్రియులు. అందరినీ స్వాగతించేవారు. అందరూ కబుర్లు చెప్పుకొనేవారు. రావు గోపాలరావు గారు అప్పటికే రంగస్థల నటులు. ఆయనకు మీసా లుండేవికావు. కారణం అడిగారు ద్విభాషివారు. రావు గోపాలరావుగారు 'నేను రంగస్థలనటుణ్ణి అయిన తరువాత కాదు మీసాలు తీసింది! నరసరావుపేటకు రావడం ప్రారంభమైన తరువాతే! మీసాల కృష్ణుడు బెల్లంకొండవారికే మీసాలు చెల్లు! మన కెందుకు?' అన్నారు మందహాసం చేస్తూ.



# మన ఊరు



ఆచార్య డి.ఎ.ఆర్. సుబ్రహ్మణ్యం
ప్రిన్సిపాల్ (రిటైర్డ్)

మన ఊరు అనగానే నా తల్లిదండ్రుల తర్వాత నాకు ముందుగా గుర్తుకు వచ్చేది నాకు అత్యంత ఇష్టమైనది గాంధీచౌక్‌లోని శ్రీరాంపురం, ఆ బజారులోని కూకుట్ల చిన్నమ్మ గారిల్లు. నేను ఆ ఇంట్లోనే పుట్టాను. ఆ బజారు అన్నా, ఆ బజారులో అపుడున్నవారన్నా నాకు చాలా ఇష్టం. అది ఒక వీథిలా కాకుండా ఒక కుటుంబంలా ఉండే రోజులు!

ఆ తర్వాత మరచిపోలేని అనుబంధం పట్టాభిరామ స్వామివారి దేవాలయము. మా అమ్మానాన్నలకు, మా కుటుంబ సభ్యులకు– ముఖ్యంగా నాకు చాలా ఇష్టమయిన దేవాలయము. ప్రధానంగా ధనుర్మాసంలోజరిగే అన్ని కార్య క్రమాలు బాగా ఇష్టమయినవి. గుంటూరులో ఉద్యోగం వచ్చిన తర్వాత కూడా చాలా సంవత్సరాలు ధనుర్మాసంలో ఎక్కువ రోజులు ఆ దేవాలయానికి వెళ్లేవాడిని. ముఖ్యంగా మన వూళ్లో జరిగే నగరఉత్సవాలు నాకు చాలా ఆనందాన్ని కలిగించేవి.

మరొక గొప్ప అనుబంధం సీతారామస్వామివారి దేవాలయంలో ఉన్న స్కూలు, ఆ స్కూలును నిర్వహించిన గొప్ప మాష్టారు దర్శి వేంకటేశ్వర్లుగారు. ఇప్పటికీ ఆయన రూపం, గొంతు, చెప్పిన చదువు కళ్ల ముందు మెదులుతూనే వుంటాయి; చెవుల్లో మోగుతూనే వుంటాయి. 1961లో వేదాన్తం రామకృష్ణమాచార్యులుగారు కొత్తగా రామకృష్ణ ఓరి యంటల్ హైస్కూల్ ప్రారంభించడం, ఆ స్కూల్‌కు విద్యార్థులు కావలసి రావడం, మమ్మల్ని కొందరిని అందులో చేర్చడం జరిగిపోయాయి. నా అదృష్టం ఏమిటి అంటే ఆ స్కూల్‌లో మొదటి బ్యాచ్ మొట్టమొదటి విద్యార్థిని నేను కావటం!

ఇంకొక గొప్ప అనుబంధం శ్రీసుబ్బరాయ & నారా యణ కళాశాల. (ఎస్.ఎస్. & ఎన్. కాలేజి). 1968లో అడుగుపెట్టి 1972 వరకు నాలుగు సంవత్సరాలు ఆ కళా శాలలో చదువుకునే భాగ్యం నాకు కలిగింది. ఎస్.ఎస్. & ఎన్. కళాశాల అంటే సరస్వతీ నిలయం. మహానుభావులు ఇలింద్ర రంగనాయకులుగారు. ప్రిన్సిపాల్‌గా వారి అకుంఠిత క్రమశిక్షణ, ప్రతిక్షణం విద్యార్థులను గురించి వారు పడే తపన చెప్పడానికి మాటలు చాలవు. అలానే గౌరవనీయులు కపలవాయి కాశీరామారావుగారు, నాగసరపు రామారావు గారు అధ్యక్ష కార్యదర్శులుగా ఆ కళాశాలకు, విద్యార్థులకు చేసిన సేవలు చిరస్మరణీయాలు. నాకు తెలిసి 50 సం॥లు అధ్యక్ష కార్యదర్శులుగా వీరుకాక మరెవ్వరూ ఉండిఉండరు. చదువుతోపాటు ప్రతి బుధవారం జరిగే డిబేటింగ్ సొసైటీలు, ప్రతి సంవత్సరం వారం రోజులు జరిగే అంతర్ కళాశాలల సాంస్కృతిక పోటీలు మరువలేనివి.

మల్లమ్మ సెంటర్, గాంధీచౌక్, శ్రీరాంపురం, వసంత విహార్, దుర్గాభవన్, ఉడిపి హోటల్స్, గురుమూర్తి హోటల్, దెయ్యం హోటల్, ఏంజల్ టాకీస్, నాగూర్‌వలి టాకీస్, సత్యనారాయణ టాకీస్, వేంకటేశ్వర పిక్చర్‌ప్యాలెస్– నరస రావుపేట అంటే ఇవే మాకు ఆ రోజుల్లో. ఈ ప్రదేశాల్లో మా కబుర్లు, కేరింతలు ఇప్పటికీ మరువలేము. శివరాత్రి వస్తే కోటప్పకొండ తిరునాళ్లు, ఎలక్ట్రిక్‌ప్రభలు, డ్యాన్సులు మరచిపోగలమా! చాలా దశాబ్దాల తర్వాత గత సంవత్సరం కొండకు వెళ్తే చాలా ఆనందం కలిగింది. నరసరావుపేటలో పుట్టిన వారందరూ డా॥ కోడెల శివప్రసాదరావుగారికి ధన్య వాదాలు చెప్పాలి. వారి కృషివలన కోటప్పకొండ గొప్ప పర్యా టక ప్రదేశమయినది. త్వరలోనే నరసరావుపేట కేంద్రంగా ఒక జిల్లా రావాలని, ఆ పట్టణానికి మరెంతో పేరు ప్రఖ్యాతులు రావాలని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను. ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం పాలకమండలి సభ్యునిగా ఉన్నపుడు (2004 – 2010), పట్టణంలోని పెద్దలు విశ్వవిద్యాలయం పి.జి. సెంటరు నర్సరావుపేటలో స్థాపించాలని అడిగినపుడు ఆ తీర్మానం చేయడం జరిగింది. ఈ ఉత్సవాల సందర్భంగా డాక్టర్ గారి చొరవతో ఆశీస్సులతో ఆ సెంటర్ రావాలని ఆకాంక్షిస్తున్నాను.



# ఓనమాల ఒడి నుండి...



**కె.వి. రామకృష్ణ**
వ్యవస్థాపకులు, సింధూ స్కూల్స్

**ఇ.ఎం. స్వామి**
వ్యవస్థాపకులు, స్వామి స్కూల్

ఒక వ్యక్తిని మంచివ్యక్తిగా తీర్చిదిద్దగల సాధనం విద్య. ఈ విద్యారంగంలో మన నరసరావుపేటకు సముచిత స్థానం ఉంది. మనఊరిలో రెండు శతాబ్దాలకు పూర్వం వీధి బడులు ఉండేవి. వీటికి పాఠ్యాంశాలు నిర్ణీతపు పనిగంటలు వంటి నిబంధనలు లేవు. కంఠస్థం చేయటం ద్వారా తాము నేర్చుకున్న విషయాలను గుర్తుంచుకొనేవారు. ఆనాడు తెలుగు, గణితము, సామాజిక శాస్త్రాలకు వీధిబడులు పెద్దపీట వేసాయి. ఈ రంగంలో పనిచేసిన ఉపాధ్యాయులలో కొందరు ప్రముఖులు అక్కిరాజు రామయ్యపంతులుగారు, కప్పగంతుల రామయ్యగారు, ములకలూరి గోపాలకృష్ణయ్య గారు, కొప్పరపు సుబ్బారావుగారు, శీనయ్యపంతులుగారు. ఈ వీధిబడులలో చదువుకొన్న విద్యార్థులనేకులు డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, లెక్చరర్లుగా, ప్రొఫెసర్లుగా వివిధరంగాలలో రాణిస్తున్నారు.

మిషనరీసంస్థచే 1880సం॥లో ఏర్పడిన ఎలిమెంటరీ స్కూల్ 1950 నుండి 1960 వరకు మిడిల్‌స్కూల్‌గా మరియు సెకండరీ ట్రైనింగ్ స్కూల్‌గా ఎదిగింది. 1966లో ఇది లూథరన్ ఉన్నతపాఠశాలగా మారింది. టి.వి. డేనియల్‌గారు 1966 నుండి 1969 వరకు ప్రధానోపాధ్యాయులుగా పనిచేశారు. ఆ తరువాత కాలములో కె. చార్లెస్‌పాల్‌గారు, ఎస్. పాల్‌గారు, జి. రాజారావుగారు, కె. లూథర్‌గారు మొదలైన ప్రముఖులు ప్రధానోపాధ్యాయులుగా పనిచేశారు. ప్రస్తుతము సిహెచ్. సాల్‌మన్‌రాజుగారు ప్రధానోపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. 1883లో ప్రస్తుతము హర్డ్ హైస్కూల్ ఉన్న ప్రాంతములో లోయర్ ఎలిమెంటరీ స్కూల్ ఏర్పాటయింది. అది 1904లో హయ్యర్ ఎలిమెంటరీ స్కూల్‌గా మారింది. 1920లో కుమారి ఎల్.ఎ. కీన్స్ ఈ సంస్థ నిర్వహణను చేపట్టి సమర్థతతో నిర్వహించి సంస్థ అభివృద్ధికి చక్కని బాట వేసారు. అది 1943లో మిడిల్‌స్కూల్‌గా మారింది. 1948లో హర్డ్ బాలికల ఉన్నతపాఠశాలగా ఎదిగింది. బొక్కా నాగయ్యగారు తొలిప్రధానోపాధ్యాయులుగా పనిచేసారు. ఈ పాఠశాల తరువాత సమర్థులైన ప్రధానోపాధ్యాయుల సారథ్యంలో దాదాపు 100 సం॥లు అగ్రసంస్థగా విరాజిల్లింది. హర్డ్ ఉన్నతపాఠశాలకు ఎమ్. బాలసుందరమ్మ తొలిప్రధానో పాధ్యాయురాలు. శ్రీమతి జి. ప్రభావతిగారు పనిచేసిన 1957–1988 మధ్యకాలంలో ఈ పాఠశాల దేదీప్యమానంగా వెలిగింది. ప్రస్తుతము హర్డ్ బాలికోన్నత పాఠశాలకు డి. సుజాతమ్మగారు ప్రధానోపాధ్యాయురాలు.

1881 సం॥లో నరసరావుపేటలో లోకల్ ఫండ్ ప్రాథమిక పాఠశాల ఏర్పడింది. ఇది పెద్దగా అభివృద్ధి చెందలేదు. 1950కి ముందునుండి ఏంజల్ టాకీస్ ప్రక్కన పెనుగొండ భ్రమరాంబ బాలికల పాఠశాల ఉన్నది. దానిని సినిమా హాల్ బడి అనేవారు. 1901 నుండి మునిసిపల్ హైస్కూల్ పనిచేస్తున్నది. ఈ సంస్థలో పనిచేసిన కొందరు ప్రముఖులు : మైలవరపు వేంకట్రామయ్యగారు, హరి అయ్యర్‌గారు, టి.వి.ఎల్. నరసింహారావుగారు, నాయని సుబ్బారావుగారు, ఎన్.సి. ఆంజనేయులుగారు, చెల్లపిళ్ల బంగారేశ్వరశర్మగారు, కె. పార్థసారథిగారు, గద్దం వేంకటేశ్వర్లుగారు, శ్రీమతి సుబ్బమ్మ, శ్రీమతి జ్యోతి, పొత్తూరి రామకోటిగారు, పెళ్లూరి మధుసూదనరావుగారు, బండారుపల్లి నాగేశ్వరరావుగారు మొదలైనవారు. ఇందులో తెలుగు మరియు ఇంగ్లీషు మీడియంలలో 700 మంది విద్యార్థులు విద్యను అభ్యసిస్తున్నారు. 2011లో నేటి క్రొత్తభవనం ఏర్పడింది.

1960 సం॥లో బాలికల ఉన్నత పాఠశాల ప్రారంభించబడింది. నాటి మునిసిపల్ ఛైర్మన్ శ్రీ రాజా మల్రాజు వేంకటరామకృష్ణకొండలరావు బహద్దర్‌గారు ఈ పాఠశాల

ఏర్పాటుకు కృషిచేశారు. దీనికి శ్రీమతి టి.ఆర్. రాజేశ్వరమ్మగారు తొలి ప్రధానోపాధ్యాయిని. తెలుగు మరియు ఆంగ్లమాధ్యమాలలో 300 మంది విద్యార్థులు చదువుకుంటు న్నారు. ఈ పాఠశాలకు 2006లో కొత్తభవనం ఏర్పడింది.

అబ్బురాజు హనుమంతరావు స్కూలు, శీనయ్య పంతులుగారి స్కూలు 1950 ప్రాంతంలో ప్రాథమికవిద్యను నేర్పుతుండేవి. మునిసిపాలిటీ ఏర్పడిన తర్వాత ఇవి మునిసి పల్ స్కూల్స్‌గా మార్చబడ్డాయి. బరంపేట హైస్కూల్ 1964లో యు.పి. స్కూల్‌గా ఏర్పడి 1983లో ఉన్నత పాఠశాలగా మారింది. రెండు మాధ్యమాలలో కలిపి 300 మంది విద్యా ర్థులు చదువుకుంటున్నారు. 2015లో బరంపేట హైస్కూల్‌కు కొత్త భవనం ఏర్పడింది.

శ్రీ రామకృష్ణ ఓరియంటల్ హైస్కూల్‌ను 1961లో వేదాన్తం రామకృష్ణమాచార్యులుగారు స్థాపించారు. అపుడు ఎం.వి. రాఘవాచార్యులు ప్రధానోపాధ్యాయులుగా పని చేసారు. రాజాగారి కోట గుమ్మం పైన 30 సం॥లకు పైగా పనిచేసిన ఈ పాఠశాలకు నేటి శాసనసభాపతి డా॥ కోడెల శివప్రసాదరావుగారి సహకారంతో బరంపేటలో సొంతభవనం ఏర్పడింది. సంస్కృతభాషా వ్యాప్తికోసం పనిచేస్తున్న పాఠశాల పలనాటి సీమలో ఇదొక్కటే. ఈ పాఠశాలలో చదువుచున్న 330 మంది విద్యార్థులలో అత్యధికులు ముస్లింలు కావటం గమనార్హం.

నరసరావుపేటలో మునిసిపల్ పాఠశాలలు మరియు ఎయిడెడ్ పాఠశాలలు 42 పనిచేస్తున్నాయి. వాటిలో తెలుగు మాధ్యమంగా 1,430 మంది బాలురు, 2,173 మంది బాలి కలు, మొత్తంగా 3,603 మంది చదువుకుంటున్నారు. ఆంగ్ల మాధ్యమంగా చదివే బాలురు 345 మంది, బాలికలు 318 మంది, మొత్తంగా 663 మంది చదువుకుంటున్నారు. ఉర్దూ మీడియంలో చదువుచున్న బాలురు 39 మంది, బాలికలు 55 మంది, మొత్తం 94 మంది. ఈ పాఠశాలలో చదువుచున్న మొత్తం విద్యార్థులు బాలురు 1,814 మంది, బాలికలు 2,546 మంది మొత్తము 4,360 మంది.

1965లో నరసరావుపేట పట్టణమందు లూథరన్ అంధుల పాఠశాల ఏర్పడింది. అది 1973లో ఉన్నతపాఠ శాలగా ఎదిగింది. అప్పటి నుండి 1986 వరకు శ్రీమతి ఎల్. హెచ్. భారతి ప్రధానోపాధ్యాయురాలుగా గణనీయమైన సేవ చేసారు. ప్రకాష్‌నగర్‌లోని ఎస్.కె.ఆర్.బి.ఆర్. ఎయిడెడ్ హైస్కూల్, కమలా మెమోరియల్ స్కూల్, రామిరెడ్డిపేటలోని సిద్ధార్థ విద్యాలయం (ఎయిడెడ్) సెయింట్ ఆన్స్ స్కూల్లో సుదీర్ఘకాలం నుండి విద్యాబోధన కొనసాగుచున్నది.

వ్యక్తులు లేక సొసైటీ పేరున ప్రైవేటు పాఠశాలలు 1960 నుండి పనిచేస్తున్నాయి. గడిపూడి మల్లయ్యగారి నాగా ర్జున ట్యుటోరియల్ కాలేజి (1960), ఎస్.వి. రావుగారి నవ్యాంధ్ర ట్యుటోరియల్ కాలేజి, తోటకూర వేంకటేశ్వరరావు గారి వేంకటేశ్వర ట్యుటోరియల్ కాలేజి (1963), జి. వేంకటేశ్వరరావుగారి ప్రతిభ ట్యుటోరియల్ కాలేజి మొదలైనవి మెట్రిక్యులేషన్ విద్యార్థులకు శిక్షణ నిచ్చేవి. 1977లో జి.వి. సుభాస్‌చంద్రబోస్‌గారు వాణి కాన్వెంట్‌ను స్థాపించారు. తదనంతరం భాను కాన్వెంట్, భారతి ట్యుటోరియల్స్ మొద లైన పాఠశాలలు స్థాపించబడ్డాయి. 1985 నుండి పనిచేస్తున్న స్వామి స్కూల్ పట్టణంలో అత్యధిక పర్యాయాలు స్టేట్ రాంకు లను పొందింది. పదవ తరగతిలో స్వామి స్కూల్ విద్యార్థిని సాధించిన 584 / 600 మార్కులు పట్టణ రికార్డు. హిందూ స్కూల్, పావులూరి సుబ్బారావు పబ్లిక్ స్కూల్, సిద్ధార్థ స్కూల్ వంటి పలుసంస్థలు మన ఊరి విద్యారంగంలో పనిచేస్తు న్నాయి. గత 20 సం॥ల నుండి చక్కని వసతులతో పనిచేస్తున్న సింధుస్కూల్ ఆధునిక విద్యను భారతీయ సంస్కృతితో మేళ వించి వినూత్న పంథాలో సాగుతున్నది. 1,000 మందికి పైగా విద్యార్థులున్న పాఠశాలల్లో కొన్ని- సెయింట్ జోసఫ్ స్కూల్, ఆక్స్‌ఫర్డ్ స్కూల్, టైనీటాట్స్ మొదలైనవి. నేటి నిబంధనల ప్రకారము పట్టణ పరిధిలోని దాదాపు 55 ప్రైవేటు పాఠశాలలు ప్రభుత్వ గుర్తింపు పొందాయి. వేలాది మంది విద్యార్థులు ఈ ప్రైవేటు పాఠశాలల్లో విద్య నభ్యసిస్తున్నారు. ప్రభుత్వ ఆర్థికసహకారం పొందకుండా ఇవి పనిచేస్తున్నాయి. గత కొన్నేండ్ల నుండి కార్పొరేట్ సంస్థలు శ్రీచైతన్య, నారాయణ, భాష్యం, రవీంద్రభారతి మొదలైనవి తమ శాఖలను పట్టణంలో ఏర్పరచి విద్యావ్యాప్తికి తోడ్పడుచున్నవి.

# కళాశాలల కళకళ!



డా॥ పి.ఎన్.వి.డి. మహేష్
ప్రిన్సిపాల్, ఎస్.ఎస్. & ఎన్. కళాశాల.

ఏ ప్రాంత అభివృద్ధి అయినా విద్యాభివృద్ధితోనే ముడిపడి ఉంటుంది. నరసరావుపేటలో 1881వ సంవత్సరంలో లోకల్ ఫండ్ ప్రైమరీ పాఠశాల స్థాపన విద్యారంగానికి పడింది. అది 1901లో మున్సిపల్ హైస్కూల్. 1950లో శ్రీ సుబ్బరాయ అండ్ నారాయణ కళాశాల స్థాపన కళాశాల విద్యకు నాంది పలికింది.

కర్నూలు నుండి గుంటూరు వరకు ఉన్నత విద్యా సౌకర్యం లేని ఆ రోజులలో, అటు రాయలసీమ ఇటు పల్నాటి ప్రాంతం విద్యార్థులు ఉన్నతవిద్య కోసం విజయవాడ, గుంటూరు వంటి నగరాలకు వెళ్లవలసి వచ్చేది. అటువంటి పరిస్థితులలో ఆ విద్యార్థులకు ఉన్నతవిద్యాసౌకర్యం కలిగించాలనే లక్ష్యంతో నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారి భూరివిరాళంతో, తాడేపల్లి వేంకటనారాయణశ్రేష్ఠిగారి సహకారంతో, రాజామల్రాజు వేంకటరామకృష్ణ కొండలరావు బహదూర్ జమీందార్‌గారి స్థలవితరణతో, కాసు బ్రహ్మానందరెడ్డిగారి ప్రోత్సాహంతో, కపలవాయి కాశీరామారావుగారి సౌజన్యంతో 1950లో శ్రీ సుబ్బరాయ అండ్ నారాయణ కళాశాల స్థాపింపబడింది. ప్రస్తుతం అది ఎం.ఎస్‌సి. కెమిస్ట్రీ; ఎం.సి.ఏ., ఎం.బి.ఏ., బి.ఏ., బి.కాం., బి.ఎస్సీ., ఇంటర్, డి.ఎడ్., డిప్లొమా ఇన్ అగ్రికల్చర్ మొదలగు కోర్సుల నందిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా తమ సేవల నందించిన కాసు బ్రహ్మానందరెడ్డిగారు, వారి సతీమణి శ్రీమతి కాసు రాఘవమ్మగారి పేరున 1972లో శ్రీమతి కాసు రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి జూనియర్ కళాశాల, 1974లో శ్రీమతి కాసు రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి కళాశాల 25 ఎకరాల స్థలంలో స్థాపించబడినై. కళాశాల పాలకవర్గ అధ్యక్షులు సర్దార్ కాసు వెంగళరెడ్డిగారు కళాశాలలను ఎంతగానో అభివృద్ధి చేశారు. ఈ కళాశాల ఇంటర్, డిగ్రీ, బి.ఏ., బి.కాం. బి.ఎస్‌సి. కోర్సుల నందిస్తూ విద్యార్థుల అభివృద్ధికి పాటుపడుతున్నది.

1984లో శ్రీ నందమూరి బసవతారకం అండ్ నల్లపాటి వేంకటేశ్వర్లు చౌదరి కళాశాల స్థాపించబడింది. ఈ కళాశాల బి.ఎస్‌సి., బి.కాం., బి.ఏ. మొదలగు కోర్సులను అందిస్తున్నది. కేంద్రమంత్రివర్యులు కొత్త రఘురామయ్యగారి పేరు మీద 1995 ఆగష్టు 4వ తేదీన కొత్త రఘురామయ్య జూనియర్ కళాశాల స్థాపించబడింది. ఇందులో సాధారణ గ్రూపులతో పాటు వృత్తివిద్యా కోర్సులు కూడా కలవు. పాలడుగు నాగయ్య చౌదరి అండ్ కొత్త రఘురామయ్య డిగ్రీ కళాశాల 1991లో స్థాపించబడి విద్యార్థులకు అనేక కోర్సులను అందిస్తోంది. 2008లో ఇందులో నర్సింగ్ కళాశాల కూడా స్థాపించబడ్డది.

వాసవీ డిగ్రీ కళాశాల , కృష్ణవేణి డిగ్రీకళాశాల, శ్రీ కృష్ణచైతన్య డిగ్రీకళాశాల, వాగ్దేవి డిగ్రీకళాశాల, భారతి డిగ్రీ కళాశాల, మదర్‌థెరిస్సా డిగ్రీకళాశాల, సెయింట్‌ఆన్స్ మహిళా జూనియర్ కళాశాల, హర్డు మహిళా జూనియర్ కళాశాల, శారదా జూనియర్ కాలేజి, వాగ్దేవి జూనియర్ కళాశాల, ఆదర్శ జూనియర్ కాలేజి, మార్గదర్శి జూనియర్ కాలేజి, భావన జూనియర్ కాలేజి, వికాస్ జూనియర్ కళాశాల, కృష్ణవేణి జూనియర్ కాలేజి, వాసవి జూనియర్ కళాశాల, శ్రీకృష్ణ చైతన్య జూనియర్ కళాశాల, భారతీ జూనియర్ కళాశాల, గాయత్రీ ఎడ్యుకేర్ జూనియర్ కళాశాల మొదలైనవి కళాశాలవిద్య నందిస్తున్నాయి. నరసరావుపేటలో కార్పొరేట్ కళాశాలల నిర్వహణం శ్రీ చైతన్య జూనియర్ కాలేజీతో ప్రారంభమైంది.

**ఇంజనీరింగ్ కళాశాలలు :** ప్రస్తుతం మన నరసరావుపేటలో 8 ఇంజనీరింగ్ కళాశాలలు ఎ.ఐ.సి.టి.ఇ. వారి గుర్తింపు

పొంది, జె.ఎన్.టి.యు. కాకినాడవారి అనుబంధ సంస్థలుగా నడుపబడుతూ 12,000 మంది విద్యార్థులకు బి.టెక్. మరియు ఎం.టెక్. కోర్సుల నందిస్తున్నాయి.

నరసరావుపేట ఇంజనీరింగ్ కళాశాల 1998లో స్థాపించబడినది. 2007లో నరసరావుపేట ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఫార్మాసూటికల్ సైన్సెస్ (నిప్స్), 2008లో నరసరావుపేట ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (నిట్) కళాశాలలు కూడా స్థాపించబడినై. ఈ కళాశాలలోనే రెండవ షిఫ్ట్ పాలిటెక్నిక్ కళాశాల నడుపబడుచున్నది. ఎ.ఎం. రెడ్డి ఇంజనీరింగ్ కళాశాల 2008లో స్థాపించబడినది. 2003లో ఎ.ఎం. రెడ్డి మెమోరియల్ కాలేజీ ఆఫ్ ఫార్మసీ, 2007లో ఎ.ఎం. రెడ్డి కాలేజీ ఆఫ్ ఎడ్యుకేషన్ కళాశాలల స్థాపన జరిగింది.

తిరుమల ఇంజనీరింగ్ కళాశాల 2008లోనూ, ఈశ్వర్ ఇంజనీరింగ్ కళాశాల 2008లోనూ, అమరా ఇంజనీరింగ్ కళాశాల 2008లోనూ, ఇ.వి.ఎం. ఇంజనీరింగ్ కళాశాల 2007లోనూ, కృష్ణవేణి మహిళా ఇంజనీరింగ్ కళాశాల 2008లోనూ స్థాపించబడి విద్యార్థులకు సాంకేతిక విద్య నందిస్తున్నాయి.

**ఫార్మసీ కళాశాలలు** : నరసరావుపేట, పరిసర ప్రాంతాలలో 5 ఫార్మశీ కళాశాలలు కలవు. ఇవి సుమారు 1,900 మంది విద్యార్థులకు బి. ఫార్మసీ, ఎం. ఫార్మసీ, ఫార్మ డి. వంటి కోర్సులలో అత్యున్నత స్థాయి విద్య నందిస్తున్నాయి. ఎ.ఎం. రెడ్డి ఫార్మసీ కళాశాల, శారదా ఇనిస్టిట్యూట్ ఆఫ్ పార్మాస్యూటికల్ సైన్సెస్ కళాశాల, ఎం.ఎ.ఎం. కాలేజి ఆఫ్ ఫార్మసీ, సిద్ధార్థ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఫార్మస్యూటికల్ సైన్సెస్ మొదలైనవి ఈ రంగానికి చెందినవి.

**అగ్రికల్చర్ పాలిటెక్నిక్ కళాశాలలు** : నరసరావుపేట పరిసర ప్రాంతాలలో దాదాపు 100 మంది విద్యార్థులకు అగ్రికల్చర్ పాలిటెక్నిక్ కోర్సులు కూడా అందుబాటులోకి రావడం ముదావహం. ఎస్.ఎస్. & ఎన్. కళాశాల మరియు ఎం.ఎ.ఎం. కళాశాలలో డిప్లొమా ఇన్ అగ్రికల్చర్ పాలిటెక్నిక్ కోర్సులున్నాయి.

**నర్సింగ్ కళాశాలలు** : నరసరావుపేటలో 2 నర్సింగ్ కళాశాలలు దాదాపు 450 మంది విద్యార్థులకు బి.ఎస్‌సి. (నర్సింగ్), జిఎన్ఎం. వంటి కోర్సులను అందిస్తున్నాయి. ఇక్కడ పి.ఎన్.సి. & కె.ఆర్. కాలేజీ ఆఫ్ నర్సింగ్‌తో బాటు కృష్ణవేణి కాలేజి ఆఫ్ నర్సింగ్ కాలేజ్‌లు ఉన్నాయి.

**డి.ఎడ్. / బి.ఎడ్. కళాశాలలు** : నరసరావుపేటలో 6 కళాశాలలు బి.ఎడ్. కోర్సులను, 11 పైగా కళాశాలలు డి.ఎడ్. కోర్సులను అందిస్తున్నాయి. ఎస్.ఎస్. & ఎన్. కళాశాల, ఎస్.కె.ఆర్.బి.ఆర్. కళాశాల, పి.ఎన్.సి. & కె.ఆర్. కళాశాల, డా॥ కోడెల శివప్రసాదరావు (కె.ఎస్.పి.ఆర్.) కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, సెయింట్ మార్కు ఎన్.టి.ఆర్. ఎలిమెంటరీ ఎడ్యుకేషన్ కళాశాల, ఎ.ఎం. రెడ్డి కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, లక్ష్మీనరసింహ కాలేజి ఆఫ్ ఎడ్యుకేషన్, డా॥ సర్వేపల్లి రాధా కృష్ణన్ డి.ఎడ్. కళాశాల, కృష్ణచైతన్య డి.ఎడ్. కళాశాల, ఆమన్‌షౌకత్ బి.ఇడి. కళాశాల, మస్తాన్ డైట్ కళాశాల, పుష్పావతి డి.ఎడ్. కళాశాల మొదలైనవి ఈ రంగంలో ముఖ్యంగా పేర్కొనదగిన కళాశాలలు.

**హోటల్ మేనేజ్‌మెంట్ కోర్సులు** : నరసరావుపేటలోని విక్టరీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హోటల్ మేనేజ్‌మెంట్, నరసరావుపేట ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హోటల్ మేనేజ్‌మెంట్ కళాశాలలు బ్యాచిలర్ ఆఫ్ హోటల్ మేనేజ్‌మెంట్ (బి.హెచ్.ఎం.) కోర్సుల ద్వారా విద్యార్థులకు హోటల్ మేనేజ్‌మెంట్ వృత్తి విద్యా కోర్సులు అందిస్తున్నాయి.

ఈ విధంగా పెక్కు విద్యాలయాలతో విలసిల్లుతున్న మన నరసరావుపేటలో కేంద్రీయ విద్యాలయం, వైద్యకళాశాల ఏర్పాటుతో సహా పి.జి. సెంటర్ రావలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. నవ్యాంధ్రప్రదేశ్ ప్రజారాజధాని అమరావతి అతి దగ్గరగా ఉన్నందున రానున్న కాలంలో నరసరావుపేట విద్యాపరంగా మరెన్నో సంస్థలకు నిలయంగా మారుతుందని ఆశిద్దాం! జె.ఎన్.టి.యు. రాబోతుంది. శుభపరిణామం. •

**విద్యా ధనం**

మనం సంపాదించిన విద్యను దొంగలు కాజేయలేరు. రాజులు స్వాధీనపరచుకోలేరు.
అన్నదమ్ములు పంచుకోలేరు. ఎంత చదివినప్పటికీ భార మనిపించదు. విశేష మేమిటీ అంటే...
ఖర్చు పెట్టిన కొద్దీ ఇది పెరుగుతూ ఉంటుంది. కనుకనే మనకున్న అన్ని ధనాల కన్న విద్యాధనమే గొప్పది!

# జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్శిటి (JNTU)



ఆచార్య డా॥ కె.వి.ఎస్.జి. మురళీకృష్ణ
ప్రిన్సిపాల్, జె.ఎన్.టి.యు., నరసరావుపేట.

నరసరావుపేట పురపాలకసంస్థ వంద వసంతాల పండుగ సందర్భముగా 2016 డిసెంబర్ 11న గౌ॥ ముఖ్య మంత్రి నారా చంద్రబాబునాయుడుగారు ఈ ఊరివారికి ఒక అద్భుతమైన వరాన్ని ఇచ్చారు. అదే జె.ఎన్.టి.యు. కాకినాడ వారి ఇంజనీరింగ్ కళాశాల. ఇందుకుగాను నరసరావుపేట నగర సివారుల్లో గల సుమారు 85 ఎకరాల స్థలం కూడా కేటాయించారు.

గత ఆరు నెలలుగా సభాపతి గౌ॥ డా॥ కోడెల శివ ప్రసాదరావుగారు, మానవవనరుల శాఖామంత్రి గంటా శ్రీని వాసరావుగారు ప్రభుత్వం వైపునుంచి కావలసిన వనరులు సమకూర్చటానికి శ్రమిస్తుండగా, జె.ఎన్.టి. విశ్వవిద్యాలయ ఉపకులపతి ప్రొఫెసర్ వి. ఎస్.ఎస్. కుమార్‌గారు, రిజిస్ట్రార్ ప్రొఫెసర్ జి.వి.ఆర్. ప్రసాదరాజుగారు, రెక్టార్ ప్రొఫెసర్ బి. ప్రభాకరరావుగారు తమవంతుగా శాయ శక్తులా కృషిచేశారు.

జూన్ 6న ప్రభుత్వం వారు జీ.ఓ. ఇవ్వగా, ప్రొఫెసర్ ప్రసాదరాజుగారు, గౌ॥ వి. ఎస్.ఎస్. కుమార్‌గారు వెనువెంటనే తాత్కాలికంగా తరగతులు నిర్వహించుటకు కావలసిన బిల్డింగ్ వనరుల సదుపాయాల కోసం వెదకి, పెట్లూరివారిపాలెంలోని ఏ.ఎం. రెడ్డి ఇంజనీరింగ్ కళాశాలను గుర్తించారు. జూన్ 9న ప్రొఫెసర్ కె.వి.ఎస్.జి. మురళీకృష్ణగారిని ప్రిన్సిపాల్‌గా నియమించారు. అలాగే ఇద్దరు ప్రొఫెసర్లు వైస్ ప్రిన్సిపాల్స్‌గాను, మరో ఐదుగురు ప్రొఫెసర్లు ఇక్కడ తరగతులు నిర్వహించుటకు ఇతరబాధ్యతలు చేపట్టు టకుగాను నియమితులైనారు.

ప్రకృతిఅందాల మధ్య సుందరమైన ఆవరణలో జె.ఎన్.టి. విశ్వవిద్యాలయానికి స్థలం కేటాయించటం ఒక విశిష్టతఐతే, ఈ విశ్వవిద్యాలయానికి నవ్యాంధ్రప్రదేశ్‌కు తలమానికంగా నిలిచే విశేషాలు మరెన్నో ఉన్నాయి.

సివిల్ ఇంజనీరింగ్‌లో అపారమైన అనుభవం కలిగి Construction and Infrastructural Engineeringలో అమెరికాలో పోస్ట్ డాక్టరేట్ పట్టభద్రులైన గౌ॥ విశ్వవిద్యాలయ ఉపకులపతి ప్రొ॥ వి.ఎస్.ఎస్. కుమార్‌గారు స్వయంగా కళాశాల ఏర్పాటుకు సంబంధించిన పనులను పర్యవేక్షిస్తు న్నారు. అధునాతన సాంకేతికతను ఉపయోగించి ఈ కళా శాల భవనాలను నిర్మించి ఒక సంవత్సరంలో నిర్ణీత ప్రాంగ ణంలో తరగతులు జరిపించటానికి అవసరమైన నిర్మాణపు పనులకు శ్రీకారంచుట్టగా, రిజిస్ట్రార్, రెక్టార్ మరియు ప్రిన్సి పాల్ ఇందుకు కావలసిన సహాయ సహకారాల నందించటంలో నిమగ్నులై వున్నారు.

జె.ఎన్.టి. విశ్వవిద్యాలయాలు సాధించిన ప్రగతిచరిత్ర దేశంలోని అతి తక్కువ సాంకేతిక (రాష్ట్రస్థాయి) విద్యాలయా లకు ఉంటుంది అనటంలో అతిశయోక్తి లేదు. ప్రస్తుతం మన దేశంలో అద్భుతాలు సృష్టిస్తూ ముందుకు దూసుకుపోతున్న అనేక జె.ఎన్.టి.యు. కాకినాడ విద్యార్థులే ఇందుకు నిదర్శనం!

**జె.ఎన్.టి.యు. ఆణిముత్యాలు :**

- ప్రపంచప్రఖ్యాత టైమ్ మ్యాగజిన్ పేర్కొన్న "Greatest Living Engineers"లో ఢిల్లీ మెట్రో నిర్మాణకర్త పద్మశ్రీ, పద్మభూషణ్, పద్మవిభూషణ్ గ్రహీత గౌ॥ డా॥ శ్రీధరన్ గారు
- పద్మశ్రీ, పద్మభూషణ్ గ్రహీత, మూడు ప్రఖ్యాతవిశ్వ

విద్యాలయాలకు 15 సంవత్సరాల పాటు ఉపకులపతిగా ఉంటూ సాంకేతికవిద్యకోసం ఎనలేని కృషిచేసిన గౌ॥ డా॥ కులందైస్వామిగారు

- ప్రపంచంలోని బయోటెక్నాలజీ సంస్థలో మూడవ స్థానంలో వున్న శాంతా బయోటెక్ సంస్థాపక అధినేత పద్మశ్రీ, పద్మభూషణ్ గౌ॥ శ్రీ కె.ఐ. వరప్రసాదరెడ్డిగారు.
- మారుతి ఉద్యోగ్ లిమిటెడ్ వ్యవస్థాపక ఇంజనీర్ గౌ॥ భాస్కర్‌గారు.
- బి.హెచ్.ఇ.ఎల్. ఎం.డి. గౌ॥ ఎం.వి. రావుగారు
- విశాఖ స్టీల్ బెస్ట్ సి.ఇ.ఓ. గౌ॥ శివసాగర్‌రావ్‌గారు
- ఎన్.ఎ.ఎస్.ఎస్.సి.ఓ.ఎం. ముఖ్యఅధ్యక్షులు, ఇన్‌ఫోటెక్ అధినేత గౌ॥ బి.వి. మోహన్‌రెడ్డిగారు
- ప్రస్తుతం రాష్ట్రంలోఉన్న ఆరుగురు ఐ.ఎ.ఎస్. అధికారులు మరియు కలెక్టర్‌లు-

వీరందరూ మన జె.ఎన్.టి.యు. విద్యార్థులే!

వీరు, వీరితోబాటుగా ఇంకా అనేకులు ఈ విశ్వ విద్యాలయంలో ఉన్నత విద్యాభ్యాసం చేసి, సమున్నతమైన పదవులలో రాణిస్తున్నారు.

**జె.ఎన్.టి.యు.లో అదనపు సౌకర్యాలు :**

- సంవత్సరానికి రూ. 10,000/-లు ఫీజు మాత్రమే చెల్లించవలసి ఉంటుంది.
- హాస్టల్ ఫీజు కూడా చాలా తక్కువ ఉంటుంది.
- వివిధ కేటగిరీలకు చెందిన అర్హత కలిగిన విద్యార్థులకు ఫీజులో రాయితీ ఉంటుంది.
- ప్రభుత్వేతర కాలేజీలు వసూలు చేసే అదనపు రుసుములు చెల్లించనవసరం ఉండదు.
- యూనివర్సిటి, ప్రైవేట ఇంజనీరింగ కాలేజిల పిల్లల కంటె క్యాంపస్ ప్లేస్‌మెంట్స్ ఎక్కువగా ఉంటాయి. బోధనా పద్ధతులు, స్వయంకృషిని ప్రోత్సహించే అధ్యాపకులు మొదటి సంవత్సరంనుండే పరిశ్రమలకు తగినటువంటి నైపుణ్యాన్ని పెంపొందించటం దీనికి కారణాలు.
- అత్యున్నత అర్హతలు కలిగిన ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు, ప్రిన్సిపాల్‌తో సహా అందరూ బోధనకు ప్రాధాన్యత ఇచ్చి విద్యార్థుల భవితను తీర్చిదిద్దేందుకు కృషిచేస్తారు.
- ప్రతిరోజూ క్రీడలకు ఒక గంట సమయం కేటాయించటం వలన మానసిక, శారీరక వికాసాలు లభిస్తాయి. జె.ఎన్.టి.యు. కళాశాలలు చాలా క్రీడలలో జాతీయ స్థాయిలో ఛాంపియన్‌షిప్‌లు గెలుచుకుంటున్నాయి. అదే పంథాలో నరసరావుపేటలో కూడా ఆసక్తి గల విద్యార్థులకు తగిన శిక్షణ ఇవ్వటం జరుగుతుంది.

ఇంతమంది ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన ఇంజనీర్లను దేశానికి అందించిన జె.ఎన్.టి.యు. నరసరావుపేటలో ఒక కళాశాల ప్రారంభించటం ఇక్కడి ప్రజలకు ఎంతో సంతోషాన్నిస్తున్నది.

5 ఇంజనీరింగ్ మరియు సైన్స్ డిపార్ట్‌మెంట్‌లకు 106 టీచింగ్, 188 నాన్‌టీచింగ్ పోస్టులకు వారి జీతముల నిమిత్తమై రూ. 17 కోట్లు అనుమతించవలసిందిగా యూనివర్శిటీ ఉన్నతాధికారులు ప్రభుత్వాన్ని కోరారు. ఇదేకాక విద్యార్థినీ విద్యార్థులకు వసతిగృహాలు ఏర్పాటు కూడా జరగాలని కోరారు.

ఇవన్నీ సఫలీకృతమై ఈ జెఎన్‌టియు నరసరావుపేటకే కాక ఈ చుట్టుప్రక్కల ప్రాంతాల అభివృద్ధికికూడా దోహదపడుతూ నవ్యాంధ్రప్రదేశ్ కీర్తిపతాకాన్ని సగర్వంగా ఎగురవేయబోతున్నది.



జె.ఎన్.టి.యు. కాకినాడ

# 'విద్యాకేంద్రం నరసరావుపేట'కు మరోమణిహారం



డా॥ జి.పి. రాజు
స్పోర్ట్సు కౌన్సిల్ సెక్రటరి, జె.ఎన్.టి.యు. నరసరావుపేట.

జులై 4, 2016 నరసరావుపేట విద్యారంగచరిత్రలో ఒక అపూర్వమైనరోజు. స్థానిక భువనచంద్ర టౌన్‌హాల్‌లో 'విద్యాకేంద్రం నరసరావుపేటలో మరో మణిహారం జె.ఎన్.టి.యు.' అనే అంశంపై రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ జరిగినరోజు. మేధాపరమైన చర్చకు, విద్యాకాంక్షకు అద్దంపట్టే సమావేశం అది.

విద్యావేత్తలు, రాజకీయ నాయకులు, వివిధ సంస్థల ప్రతినిధులు, విద్యార్థినీ విద్యార్థులు అధికసంఖ్యలో పాల్గొని 'నరసరావుపేట విద్యాకేంద్రంలో జె.ఎన్.టి.యు. మరో మణి హారం' అని తమ ఆనందాన్ని వ్యక్తంచేశారు. జె.ఎన్.టి.యు.-నరసరావుపేట ప్రిన్సిపాల్ డా॥ కె.వి.ఎస్.జి. మురళీ కృష్ణగారు స్వాగతం పలికిన ఆ సభకు వైస్ ఛాన్సలర్ డా॥ వి.ఎస్.ఎస్. కుమార్ అధ్యక్షత వహించారు.

సభాధ్యక్షులు తమ అధ్యక్షోపన్యాసంలో జె.ఎన్.టి.యు.ను నరసరావుపేటకు మూడు రోజులలో తెచ్చిన ఘనత నవ్యాంధ్రప్రదేశ్ తొలిశాసనసభాపతి డా॥ కోడెల శివప్రసాద రావుగారికే దక్కుతుందన్నారు. మంచినైపుణ్యంతో కూడిన సాంకేతికవిద్యను అందించడంతోబాటు అనేక బహుళజాతి కంపెనీలలో ఉద్యోగాలు పొందే విధంగా విద్యార్థులను తీర్చి దిద్దటమే దీని లక్ష్యంగా పేర్కొన్నారు. షుమారు 30 మంది అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బందితో ఏర్పాటు చేయబడిన ఈ కళాశాలలో విద్యార్థులు ఇంజనీరింగ్‌లో పట్టభద్రులు కావడమే కాకుండా, ఎంటర్‌ప్రెన్యూర్స్‌గా మారి పారిశ్రామిక రంగ అభివృద్ధికి కృషి చేసేలా తయారుచేస్తామని అన్నారు. ఇంక్యుబేషన్ సెంటర్స్‌ను ఏర్పాటుచేసి విద్యార్థులు తమకు ఆసక్తి ఉన్న రంగాలలో ఏవిధంగా అభివృద్ధి చెందాలో శిక్షణ ఇస్తామన్నారు. మూక్స్ (MOOCS) ద్వారా విద్యార్థులు అతి తక్కువ ఖర్చుతో, దేశ విదేశాలలోని విశ్వవిద్యాలయాలలో అనేక కోర్సులు చేసేవిధంగా సాయం అందిస్తామన్నారు.

ముఖ్యఅతిథిగా పాల్గొన్న నవ్యాంధ్రప్రదేశ్ తొలి శాసనసభాపతి డా॥ కోడెల శివప్రసాదరావుగారు తమ ప్రసంగంలో జె.ఎన్.టి.యు. మంజూరు కావడానికి ముఖ్య మంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడుగారి సహాయసహ కారాలే కారణం అని హర్షధ్వానాల మధ్య అభినందనలు తెలిపారు. మన పట్టణానికి ఈ ప్రతిష్ఠాత్మక విద్యాసంస్థ రావడానికి మరో ముగ్గురు కారకులన్నారు. దీనికి కృషిచేసిన రెండో వ్యక్తి కాసు వెంకటకృష్ణారెడ్డిగారు, మూడో వ్యక్తి జె.ఎన్.టి.యు. వైస్ ఛాన్సలర్ డా॥ వి.ఎస్.ఎస్. కుమార్‌గారు.



ప్రధానోపన్యాసం గావిస్తున్న గౌ॥ శాసనసభాపతి



ఆచార్య వి.ఎస్.ఎస్. కుమార్ గారి అధ్యక్షోపన్యాసం

ఈ కళాశాల స్థాపన విషయమై వారు ఎన్నో విలువైన సలహాలు ఇచ్చారని అభినందించారు. కాగా నాలుగవ వ్యక్తి తానని చెప్పడంతో సభ కరతాళధ్వనులతో మారుమోగింది.

నరసరావుపేట గొప్ప విద్యాకేంద్రం, ఒక ఎడ్యుకేషనల్ హబ్ అన్నారు. 58 పాఠశాలలు, 15 జూనియర్ కళాశాలలు, 8 డిగ్రీ కాలేజీలు, 8 ఇంజనీరింగ్, 5 ఫార్మసి, 2 నర్సింగ్, 12 డి.ఎడ్., 2 ఐ.టి.ఐ. కాలేజీలతో అలరారుతున్న పట్టణం ఇది. సుమారు 25 వేల మంది విద్యార్థినీ విద్యార్థులు గల గొప్పవిద్యాకేంద్రం అయిన మన పట్టణానికి మరో మణిహారం జె.ఎన్.టి.యు. రావడం అత్యంత ఆనందదాయకం అని సుదీర్ఘహర్షధ్వానాల మధ్య అభివర్ణించారు.

నాణ్యమైన అన్నిరకాల పోటీలలో నెగ్గగల విద్యనందించేదే అసలుసిసలైన విద్యావ్యవస్థ. అలాంటి సమర్థులను రూపకల్పన చేయగల గొప్ప విద్యాసంస్థ మన పట్టణానికి రావటం మనందరకు గర్వకారణం అన్నారు. మన ప్రాంతంలో విద్యావికాసానికి ఈ విద్యాసంస్థ అద్భుతంగా తోడ్పడుతుందనడం ఏమాత్రం అతిశయోక్తి కాబోదని హర్షధ్వానాల మధ్య ప్రకటించారు.

విద్యతోబాటు వ్యక్తిత్వ వికాసం జరగాలన్నారు. నైతిక విలువలు పెరగాలన్నారు. సంక్షోభాన్ని సవాలుగా తీసుకోవడం, సవాలును గొప్ప అవకాశంగా మార్చుకోగల నైపుణ్యాలను నేర్పే విద్యాసంస్థలే ఉత్తమ విద్యార్థులను తయారుచేయగలవన్నారు.

ప్రభుత్వం విద్యావిజ్ఞానాలు సమకూరుస్తుందే కాని అందరికీ ఉద్యోగాలు ఇవ్వలేదని, దానికి ప్రైవేటురంగంలో ప్రయత్నించాలన్నారు. అంతేకాకుండా బ్యాంకు ఋణాలు తీసుకొని సొంతంగా పరిశ్రమలను నెలకొల్పాలని సూచించారు. రాష్ట్రవిభజనవల్ల మనకు కొన్ని కొత్త అవకాశాలు కూడా వచ్చాయని, రైల్వే లైన్లు, రోడ్లు, విద్యుత్తు లైన్లు, ఎన్నో గ్రిడ్స్ రాష్ట్రానికి వస్తున్నాయని, వాటిని అందుకొని చక్కగా పురోగమించాలన్నారు. విద్యార్థులు సరదాలవైపు పోకుండా తల్లిదండ్రులు చెమటోడ్చి పంపే డబ్బులో ప్రతి రూపాయినీ పొదుపుగా వాడుకోవాలని హితవుచెప్పారు. అధ్యాపకులు పాఠాలతో పాటు జీవనమూల్యాలను ప్రబోధించాలని ఆయన కోరారు.

నరసరావుపేట జె.ఎన్.టి.యు.లో మెటలర్జీ, కెమికల్ ఇంజనీరింగ్ వంటి శాఖలు ఇంకా ఎన్నో రావాలని, వర్క్‌షాప్స్ అధికంగా నిర్వహించి అత్యాధునిక విద్యావిధానాలకు కేంద్ర బిందువుగా నిలవాలని ఆయన కోరారు. ఎనభై ఆరు ఎకరాల సువిశాల ఆవరణలో నిర్మాణం కాబోతున్న డెబ్బై, ఎనభై కోట్ల రూపాయల భవనాల శంకుస్థాపనకు త్వరలో ముఖ్యమంత్రి గారు, విద్యామంత్రిగారు వచ్చే అవకాశముందని హర్షధ్వానాల మధ్య ప్రకటించారు.

ఆ ప్రక్కనే 9.5 కోట్ల రూపాయల వ్యయంతో ముస్లిం మైనారిటీ ఐ.టి.ఐ. కళాశాల ప్రారంభమౌతుందని చెబుతూ దీనికి మైనారిటీ వ్యవహారాలశాఖ కేంద్రమంత్రివర్యులు నజ్మా హెప్తుల్లాగారు సహకారం అందించారన్నారు.

ఈ విధంగా నరసరావుపేట పెద్ద పట్టణమే కాకుండా, పెద్ద విద్యాకేంద్రం అయి, అందరికీ మార్గదర్శకం కావాలని ఆయన ఆశాభావం వ్యక్తపరిచారు.

రిజిస్ట్రారు ఆచార్య శ్రీ జి.వి.ఆర్. ప్రసాదరాజుగారు కాకినాడ, విజయనగరం కళాశాలలవలె ఈ కళాశాల ఒక విభాగ కళాశాలలా (Constituent College) పని చేస్తుందని చెప్పారు. అనతికాలంలో టెక్స్‌టైల్స్ ఇంజనీరింగ్ వంటి కోర్సులతో ఈ సంస్థ అభివృద్ధి చెందుతుందన్నారు. అతి తక్కువ ఫీజుతో ఇంజనీరింగ్ విద్యను అందుకునే అదృష్టం ప్రతిభా వంతులైన విద్యార్థులకు కలుగుతుందన్నారు.



ప్రసంగిస్తున్న ఆచార్య జి.వి.ఆర్. ప్రసాదరాజుగారు

జె.ఎన్.టి.యు. ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ ప్రొఫెసర్, యూనివర్శిటీ ఓ.ఎస్.డి. ఐన సిహెచ్. సాయిబాబుగారు వంద శాతం ప్లేస్‌మెంట్ ఒక్కటే లక్ష్యం కాకుండా, విద్యార్థులు స్వశక్తితో, తమ ప్రతిభాపాటవాలతో పరిశ్రమలు నెలకొల్పు కునే విధంగా కృషిచేస్తామన్నారు.



ప్రసంగిస్తున్న ఆచార్య సిహెచ్. సాయిబాబు

పురపాలక సంఘం ఛైర్‌పర్సన్ నాగసరపు సుబ్బరాయ గుప్తాగారు తమ ప్రసంగంలో స్పీకర్‌గారు పట్టణాభివృద్ధికి సకలసదుపాయాలు కల్పిస్తున్నారని, వీటిలో జె.ఎన్.టి.యు. కళాశాల గొప్పదని కొనియాడారు. జె.ఎన్.టి.యు. ఏర్పాటు ద్వారా విద్యారంగంలో నరసరావుపేట రూపురేఖలు మారుతా యని, ఇది మిగతా విద్యాసంస్థలకు మంచి స్ఫూర్తిదాయకం అవుతుందని అన్నారు. పల్నాడు, రాయలసీమ ప్రాంత విద్యార్థు లకు ఉన్నతవిద్యను అభ్యసించే అవకాశం 1950లోనే తమ తాతగారైన శ్రీ నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారు ఎస్.ఎస్.& ఎన్. కళాశాల స్థాపన ద్వారా కల్పించారని చెప్పారు. నాటి నుండి నేటి వరకు అనేక పాఠశాలలు, కళాశాలలతో నరస రావుపేట గొప్ప విద్యాకేంద్రంగా ఎదిగిందన్నారు.

పురపాలక సంఘం వైస్ ఛైర్‌పర్సన్ షేక్ మీరావలి గారు మాట్లాడుతూ త్వరలో 4.76 ఎకరాలలో మైనారిటీల ఐ.టి.ఐ. కళాశాల కూడా స్పీకరుగారి ఆశీస్సులవల్ల రాబో తున్నదని చెప్పారు. కమీషనర్ ఎ. భానుప్రతాప్‌గారు మాట్లా డుతూ జె.ఎన్.టి.యు. కళాశాల రాక వల్ల విద్యారంగంలో



ఛైర్ పర్సన్ శ్రీ నాగసరపు సుబ్బరాయగుప్తా ఉపన్యాసం

ఆరోగ్యవంతమైన పోటీ పెరిగి చక్కని విద్య లభిస్తుందని అన్నారు.

ఆర్డీవో జి. రవీందర్‌గారు విద్యారంగంలో అభివృద్ధి వస్తే అన్ని రంగాల్లో అభివృద్ధి వస్తుందని, ఇది చారిత్రక సత్యమని, అందని ద్రాక్ష అనుకొన్న జె.ఎన్.టి.యు. కళాశాల మనకు వచ్చిందని చెబుతూ, ప్రస్తుతం నరసరావుపేటలో అభివృద్ధి సుమాలు, విద్యాసుమాలు పరిమళాలను విరజిమ్ము తున్నాయని, స్పీకర్ కోడెలగారు ఈ ప్రాంత అభివృద్ధిని శ్వాసిస్తూ, స్వప్నిస్తూ ఉన్నారని అభినందించారు. ఈ సంస్థ ప్రక్కనే 10 ఎకరాల స్థలంలో త్వరలో కేంద్రీయ విద్యాలయం కూడా వస్తుందని అన్నారు.

ఆ తరువాత పురప్రముఖులు ఈ చర్చాగోష్ఠిలో పాల్గొ



ప్రసంగిస్తున్న ఆర్.డి.ఓ. శ్రీ జి. రవీందర్



అభినందనలు తెలుపుతున్న వైస్ ఛైర్ పర్సన్ శ్రీ షేక్ మీరావలి



ప్రసంగిస్తున్న కమీషనర్ శ్రీ భానుప్రతాప్



సభకు హాజరైన పురప్రముఖులు, విద్యార్థినీ విద్యార్థులు

న్నారు. ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం ఎకడమిక్ సెనేట్ పూర్వసభ్యులు రాజా కాశయ్యగారు ఈ సంస్థ ఏర్పాటుతో మనకు తీరదనుకొన్న కోర్కె నెరవేరిందని చెప్పగా, ఆంగ్లశాఖ పూర్వాధ్యక్షులు లంకా సత్యనారాయణగారు అందదనుకొన్న బంగారులేడిని పట్టుకువచ్చి శివప్రసాదరావుగారు మనముందు ఉంచారని కొనియాడుతూ డైరీ టెక్నాలజీ వంటి కొత్త కోర్సులు రావాలన్నారు. బి.జె.పి. నాయకులు వల్లెపు కృపారావుగారు జె.ఎన్.టి.యు. కళాశాల ఏర్పడడం పట్టణ విద్యారంగ అభి వృద్ధికి తోడ్పడుతుందన్నారు. విశ్రాంత ప్రిన్సిపాల్ ఎం.ఆర్.కె. మూర్తిగారు మాట్లాడుతూ విద్యార్థుల్లో వక్తృత్వ నైపుణ్యాన్ని, వ్యక్తిత్వవికాసాన్ని, నైతికతను, నిబద్ధతను, పరిసరాల పరిశుభ్రతపట్ల దీక్షను పెంపొందించాలని చెబుతూ భవిష్యత్తులో ఇదొక విశ్వవిద్యాలయం కావాలని ఆకాంక్షించారు. ప్రిన్సిపాల్ పి.వి.డి.ఎన్. మహేష్‌గారు జె.ఎన్.టి.యు. కళాశాల మన పట్టణంలోని తొలి ప్రభుత్వ కళాశాల అని కొనియాడారు. మెడికల్ ఎంట్రన్సుకు కూడా ఇక్కడ పరీక్షాకేంద్రాలు ఉండా లని, త్వరలో మెడికల్ కాలేజి కూడా ఏర్పడగలదన్న ఆశా భావం వెలిబుచ్చారు. షేక్ కరిముల్లాగారు మాట్లాడుతూ చిన్న చిన్న పరిశ్రమలు, భారీపరిశ్రమలు ఇక్కడ అధికంగా స్థాపించ బడాలని కోరారు. సంస్కృత పూర్వప్రవాచకులు డా॥ వేదాన్తం సత్యశ్రీనివాస అయ్యంగార్ గారు మాట్లాడుతూ ఉత్తమ విద్యార్థులనూ, పరిశోధకులనూ అందించాలన్నారు. ఛాంబర్ ఆఫ్ కామర్స్ అధ్యక్షులు మాజేటి వెంకటేష్‌గారు విద్యాభివృద్ధి వల్ల వివిధరంగాల్లో వైవిధ్యభరిత పరిణామం వస్తుందన్నారు. విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు డా॥ మడకా సత్యనారాయణ గారు జె.ఎన్.టి.యు. కళాశాల మన పట్టణానికి ఒక వర మని, దీనివల్ల నరసరావుపేటకు మహావైభవం వస్తుందని అన్నారు.

ఈ గోష్ఠిలో ఎందరో విద్యార్థినీ విద్యార్థులు ఉత్సాహంతో పాల్గొనడం మరో విశేషం. విద్యార్థినులు చాతుర్య, మీనా, హనీషా, టి. రాజు, ఎం.వి.ఎస్. రాజు, జె. ప్రశాంత్ తమ ప్రసంగాలలో కొత్తకోర్సులు రావాలని, సంగీతం, నాట్యం, స్పోకెన్ ఇంగ్లీషు మొదలైన వాటికి ప్రోత్సాహం కల్పించాలని, పట్టణంలో మెడికల్ కాలేజి ఏర్పడాలని కోరారు. జె.ఎన్.టి. యు. కళాశాల ప్రిన్సిపాల్ ఆచార్య కె.వి.ఎస్.జి. మురళీకృష్ణ గారి వందనసమర్పణతో కార్యక్రమం సమాప్తమైంది.



స్పందనను తెలుపుతున్న శ్రోతలలో కొందరు



ప్రసంగిస్తున్న ఆచార్య మురళీకృష్ణ

# ఉర్దూ-అరబ్బీ

**మహమ్మద్ అబ్దుల్ బాఖీ ఫారూఖీ,** ఉర్దూ భాషా ప్రచారకులు.



మన నరసరావుపేట పట్టణంలో మున్సిపాలిటీకి చెందిన 4 ఉర్దూ ఎలిమెంటరీస్కూల్స్ ఉన్నవి.

**1. గాలిబ్‌స్కూల్, రామిరెడ్డిపేట :** ఇది ఉర్దూ మరియు పర్షియన్ ప్రసిద్ధి గాంచిన కవి మీర్జా అసద్దుల్లా బేగ్‌ఖాన్ పేరు మీద వెలసింది.

**2. ఆజాద్‌స్కూల్, ఏనుగుల బజార్ :** ఇది భారతదేశ తొలి విద్యా మంత్రి భారతదేశ విద్యావిధాన రూపశిల్పి అయిన మౌలానా అబుల్‌కలాం ఆజాద్ వారి పేరు మీద వెలసింది.

**3. జాకిర్ హుస్సేన్‌స్కూల్, వరవకట్ట :** ఇది భారతదేశ మాజీ రాష్ట్రపతి గారి పేరు మీద ఉన్నది.

**4. బాబాపేట ఎలిమెంటరీ స్కూల్, బాబాపేట :** బాబా సాహెబ్‌గారి పేరుమీద ఈ పేట మహమ్మద్ అలీ మాజీ నరసరావుపేట అంజుమన్ ప్రెసిడెంట్‌గారి నాన్నగారైన బాబా సాహెబ్ పేరు మీద ఉన్నది.

ఉర్దూ భాష అభివృద్ధి కోసం శ్రమించిన వారిలో మహమ్మద్ అబ్దుల్ హై ఫారూఖిగారు ఒకరు. వారు 1975 నుండి ఇప్పటివరకు ఉర్దూభాష అభివృద్ధి కొరకు శ్రమిస్తున్నారు. వారు యంగ్ ముస్లిం అసోసియేషన్ స్థాపించినారు. చిన్న, పెద్దవాళ్లకి ఉర్దూ చెప్పారు. ఒక చిన్న లైబ్రరీ ఏర్పాటు చేశారు. వారి గురువుగారైన బుర్‌హాన్‌గారి పేరు మీద బుర్‌హాన్ ఉర్దూ ఎడ్యుకేషనల్ సెంటర్ స్థాపించారు. ఈ సంస్థ ద్వారా వక్తృత్వ పోటీలు, వ్యాసరచన పోటీలు మంచి దస్తూరి పోటీలు నిర్వహించి వారికి బహుమతులు ప్రదానం చేస్తున్నారు. మౌలానా అబుల్‌కలాం ఆజాద్‌గారి జయంతి నిర్వహిస్తున్నారు. ఉర్దూటీచర్స్‌ను సన్మానిస్తున్నారు.

ఉర్దూ అభివృద్ధి కోసం ఉస్మానియా స్టడీసర్కిల్ అనే పేరుతో జనాబ్ నిజాముద్దీన్ గారు ఒక సంస్థను స్థాపించి ఉర్దూ అభివృద్ధికి శ్రమించారు. అది గుంటూరు రోడ్డులో నాయబ్ బజారు మసీదు ప్రక్కన ఉండేది.



యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌తో మహమ్మద్ అబ్దుల్ హై ఫారుఖి

ఈ మధ్య వెంగళరెడ్డి కాలనీలో మంజర్‌ఖాన్ ఆధ్వర్యంలో సుప్ఫా ఇస్లామిక్ స్కూల్‌లో ఉర్దూఅరబ్బీలు నేర్పుతున్నారు. దాదాపు 88 మంది విద్యార్థులున్నారు. విద్యార్థినులు 114 మంది. అలాగే కొన్ని మసీదులలో కూడా ఉర్దూ అరబ్బీ భాషలు నేర్పబడుతున్నాయి. వివిధ కళాశాలలో 200 మంది ఉర్దూ విద్యార్థినీ విద్యార్థులున్నారు.

ఇటీవల మసీదులలో తెలుగులో ఖురాను ప్రవచనం చేస్తున్నారు. ఇది ముస్లిములకూ, ఇతరులకూ ఎంతో ఉపయోగ పడుతుంది. మత సామరస్యానికి దోహదం చేస్తుంది.

## వృత్తినే ప్రవృత్తిగా మార్చుకో!

**నీకు నచ్చిన పని దొరకలేదని వ్యధచెందేకన్న దొరికిన పనిని నచ్చేట్లుగా మలచుకోవడంలోనే నీ ప్రత్యేకత వుంది. ఫలానా పని రావాలన్నది పూర్తిగా నీ చేతుల్లో లేకపోయినా వచ్చిన పనిని పదిమంది మెచ్చేలా తీర్చిదిద్దుకోవడం నీ చేతుల్లోనే ఉంటుంది. ఈ విధంగా వృత్తిని ప్రవృత్తిగా మార్చుకో! చేసే పనిని ఒక ఆటలా, నీకు నచ్చిన పాటలా, నీకు ఇష్టమయిన బాటలా మార్చుకో!**

# పరిశోధనలకు పెద్ద పీట



యడవల్లి మనోరమ

తెలుగు లెక్చరర్

ఆదిమానవుడు ఆధునిక మానవుడుగా ఎదగటానికి శోధన, పరిశోధనలే మూలాధారా లయ్యాయి. భాష, శాస్త్రాలకు సంబంధించిన మన ఊరి విద్యావేత్తలు ఎందరో తమ పరిశోధనాంశాలతో అనుభవంతో వారు పనిచేస్తున్న విద్యా సంస్థల వన్నెలకు కొత్తచిన్నెలు తీర్చిదిద్దారు; దిద్దుతున్నారు.

**తెలుగు :**

డా॥ తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారు 'ఆంధ్ర మహాభాగవతము-భక్తితత్త్వోన్మీలనము' అనే అంశంపై పరిశోధించి పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ కొర్రపాటి శ్రీరామ



డా॥ శ్రీరామమూర్తి



డా॥ శ్రీనివాసాచార్యులు

మూర్తిగారు 'హనుమద్విశ్వరూపము-విశ్వనాథ సందర్శనము' అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని, 'సుందరకాండము వైశ్వనాథ సాత్యనారాయణీయము' అనే అంశంపై పిహెచ్.డి పట్టాన్ని పొందారు. డా॥ పల్లె శ్రీనివాసాచార్యులుగారు 'తెలుగులో అనేకార్థక కావ్యములు' అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని, 'అనేకార్థక కావ్యనిర్మాణములో సూరన రామరాజభూషణుల కైవాదము-తారతమ్య పరిశీలనము' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డిగారు 'ఆంధ్రమహాభారతం-పద్యశైలీ పరిష్కారం' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ నల్లూరి రామారావుగారు 'శ్రీ చిరుమామిళ్ల సుబ్బదాసు జీవితం- శతక సాహిత్యం' అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని, 'కొసరాజు సాహిత్యవైభవం' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. వీరు సువర్ణపతక స్వీకర్త. డా॥ మడకా సత్యనారాయణగారు 'కర్పూర వసంతరాయలు-కావ్యానుశీలనం' అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని, 'ఆధునికాంధ్ర సాహిత్యంలో చారిత్రక గేయకావ్యాలు' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. దండా హనుమంతరావుగారు 'వైజయంతీ విలాసము-కావ్యానుశీలనము' అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని పొందారు. డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తిగారు 'త్యాగరాజ యక్షగానాలు-సాహిత్యపు విలువలు' అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్నీ, కర్ణాటక సంగీతరత్నత్రయం అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్నీ పొందారు. నాగార్జున విశ్వవిద్యాలయంవారు వీరి పిహెచ్.డి. సిద్ధాంతవ్యాసాన్ని ఉత్తమసిద్ధాంతవ్యాసంగా ఎంపిక చేసి పోలేపెద్దివారికి సువర్ణ పతకాన్ని బహూక రించారు. డా॥ మేళ్లచెర్వు భానుప్రసాద రావుగారు 'శృంగార రసవాహిని - భోగినీ దండకము' అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాన్ని, 'పోతనభాగవతము-శృంగారము'అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ చిటిప్రోలు సుబ్బారావుగారు 'పల్నాటి సోదరకవుల జీవితము-సాహిత్యము' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ నలుకుర్తి రాంబాబుగారు 'ఎంకిపాటలు- అనుశీలనం' అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాన్ని, 'మొక్కపాటి నరసింహశాస్త్రి కృతులు-సమీక్ష' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ పి.వి.నారాయణగారు నరసరావుపేట తాలూకా జానపదగేయసాహిత్యం అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ కనుపర్తి వేంకటవసు రాజుగారు 'అస్పృశ్యతా నిరాసనం- మహాకవి జాషువ' అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాన్ని, 'జాషువా అస్పృశ్యతా నిరాసనాస్త్ర- సమగ్ర పరిశీలన' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ కూరపాటి వేంకట కోటయ్యగారు 'సత్తెనపల్లి తాలూకా జానపదగేయాలు' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. సాదుల



ఎస్.పి.వెంగళరెడ్డి

పెదవెంగళరెడ్డిగారు 'ఉన్నవ లక్ష్మీ నారాయణగారి నాయకురాలు నాటక పరిశీలనం' అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని పొందారు. డా॥ కంచెర్ల సుధాకర్‌గారు 'పంచమవేదం -దళితచైతన్యం' అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాన్ని, 'దండోర చైతన్యం-మాదిగ సాహిత్యం' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ కొడావత్ భానునాయక్ గారు 'రాయలసీమ ఫ్యాక్షన్ కథలు - పరిశీలన' అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని, 'గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాల గిరిజనసాహిత్య సంస్కృతుల సమగ్ర అధ్యయనం' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ పోలేపెద్ది వేంకట హనుమచ్ఛాస్త్రిగారు 'మహాభారతంలో విదురుడు' అనే అంశంపై పరిశోధన చేసి పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. యడవల్లి మనోరమగారు 'ఆధ్యాత్మిక శతకాలలో రాళ్లబండి విరచిత కాదంబిని స్థానం', వై. విద్యగారు 'బాంధవ్యాలు' నవల-అనుశీలనం', ఏ. ఇందిరా ప్రియదర్శినీ శైలజ గారు 'చేరెడ్డివారి ఇంద్రధనుస్సు - ఒక పరిశీలన' అనే అంశాల పై ఎం.ఫిల్. పట్టాల్ని పొందారు.

### సంస్కృతం :

డా॥ వేదాన్తం సత్యశ్రీనివాస అయ్యంగార్‌గారు 'సంస్కృతవాఙ్మయే చంద్రః', డా॥ కాసులనాటి నాగరాజశర్మ గారు 'శృంగారరస మణిమయపేటికా కమలినీ కలహంసమ్ - సంపాదనం అధ్యయనంచ', డా॥ నారాయణం రాంబాబు గారు 'అత్రిప్రోక్తస్య సమూర్తార్చనాధికరణస్య సమీక్షణాత్మకం అధ్యయనం' అనే అంశాలపై విద్యావారిధి (పిహెచ్.డి.) పట్టాలను పొందారు. డా॥ కంచెర్ల కామేశ్వరరావుగారు 'మత్తవిలాస ప్రహసన లటకమేలక ప్రహసనయోః తులనాత్మకం పరిశీలనం' అనే అంశంపై ఎమ్.ఫిల్ పట్టాన్ని, 'మహాకవి అశ్వఘోష విరచిత బుద్ధచరిత సౌందరనందయోః శ్రీ ఓగేటి పరీక్షిత్‌శర్మణస్య విరచిత 'యశోధరామహాకావ్యేచ సముపవర్ణితానాం బుద్ధోపదేశానాం పరిశీలనం' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు.

### హిందీ :

డా॥ పి.సి. వేంకటేశ్వరరెడ్డిగారు 'జయశంకర్ ప్రసాద్ ఔర్ విశ్వనాథ సత్యనారాయణ కే నాటకోంకా ఏక్ పరిశీలన్' అనేఅంశంపై, డా॥ కె. వసంత కుమారిగారు 'శివరాజభూషణ్ ఏవం శివభారతమ్ ఏక్ తులనాత్మక్ అధ్యయన్' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు. డా॥ ఏ. సరళాదేవిగారు 'అన్నారం సుధమ్మకా హిందీ ఉపన్యాస విశేష ఆలోచనా కే రూపలయతాత్విక్ విశేషణ్ అధ్యయన్' అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాన్ని, 'ఛాయావాది కవియోంకా ఆలోచనాక్రమ్' అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు.



డా॥ కె.వసంతకుమారి

### ఇంగ్లీషు :



డి.ఎన్. మురళీధరశర్మ

దేగర్లమూడి నాగమురళీధరశర్మ గారు Adivi Bapi raju's Narayana Rao - An English Translation, కె.వాణిగారు The Battle of Bobbili, బి.వి.ఎస్. కామేశ్వరశాస్త్రిగారు The problem of communication and The Value of Contact in the Plays of Edward Albee-A Select Story, వి. ఆనంద్ కుమార్‌గారు A Study of Theme and technique in Vikramchandra's Love and Long in Bombay, షేక్ జమురుద్దీన్‌గారు Women in the select novel of Anitha Desai, ఎం. విశ్వేశ్వరరావుగారు The problem of partition in the Novels of Chaman Nahal and Kushwanth Singh A trian to Pakistan అనే అంశాలపై ఎమ్.ఫిల్. పట్టాలను పొందారు. డా॥ పి.ఎన్.వి.డి. మహేష్ గారు History and Individual in the New Indian Novel in English అనే అంశంపై ఎమ్.ఫిల్.ను Memory/ History in ToniMorriSon's Trilogy- A Study అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. లంకా నటరాజ్ గారు Narrative technics adopted by Bhavani Bhattacharya in his Novel 'Music for Mohini' అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాను పొందారు. Narrative tech-

nics of Anne Baylor అనే అంశంపై పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించారు. డా॥ కె. నరసింహారావుగారు The dispersal of Indian Parsee Discourse in Rohinton Minstry's- A Fine Balance and Family Matters అనే అంశంపై ఎం. ఫిల్.ను, Understanding Native Canadian Resistance; A study of Tomson Highway's plays and Armond Garnet Ruffo's Poetic Cannon అనే అంశంపై పిహెచ్.డి.ని పొందారు.

**చరిత్ర :**

డా॥ పోలేపెద్ది వేంకట హనుమచ్ఛాస్త్రిగారు 'కోటప్ప కొండ క్షేత్రవైభవం'పై ఎమ్.ఫిల్.ను 'గుంటూరుజిల్లా ప్రముఖ శైవక్షేత్రాలు చరిత్ర - సంస్కృతి' అనే అంశంపై పిహెచ్.డి.ని పొందారు.

**గణితశాస్త్రం :**

డా॥ బైనీని సుశీలావతిగారు Mixed convective heat transfer flow of a viscous fluid through aporous medium in channels with radiation effect and heat sources అనే అంశంపై పిహెచ్.డి.ని పొందారు. ఇ.ఎం. స్వామిగారు Commutative BCK Alzebra అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని పొందారు. జి. నాగసురేష్‌గుప్తగారు టి.వి. శంకర్‌రెడ్డిగారు, ఎం. రమేష్‌గారు Alzebra లో ఎం.ఫిల్. పట్టాల్ని పొందారు.

**భౌతికశాస్త్రం :**

డా॥ పోతుకూచి దక్షిణామూర్తిగారు Investigations of Phase transitions in liquid crystal systems అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. డా॥ బి. వేంకటేశ్వరరావుగారు Development of Copper new ferrite maternials and study of their physical properties అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. పి.వి. శ్రీనివాసరావుగారు Ultrtasonic Investigation studies on N;N-Dimethyl acetamide in alchols at 303k temperature, ఎ. సుబ్బారావుగారు Ultrtasonic Investigation studies in Binary mixtures of alcholsndsters, ఎమ్. కృష్ణకిశోర్‌గారు Internal pressure and free volume of binary mixtures from Ultrasonic measurements, అనే అంశాలపై ఎమ్.ఫిల్. పట్టాల్ని పొందారు.

**రసాయనశాస్త్రం :**



డా॥ పిల్లుట్ల చంద్రమౌళి

డా॥ పిల్లుట్ల చంద్రమౌళిగారు EXTRACTION - SPECTROPHOTOMETRIC Studies on the Ternaty Complexes of $H_g$ (II) AND $Z_r$ (II).and Their Analytical Applications, డా॥ పి. శ్రీనివాస రావుగారు Physico-Chemical Properties of Solution in organic Solvents అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాన్ని, డా॥ జి.వి.ఎస్. వల్లీనాథ్‌గారు Studies in the Chemistry of metal complexes using Organic reagents, డా॥ ఎం.ఎస్. సుధీర్‌గారు, Defluoridation of water in Vinukonda Mandal by using absorbent derived from the waste products, అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాన్ని, డా॥ ఎం. మునిప్రసాద్‌గారు Synthesis and characterization of Supra-molecular liquid crystals, డా॥ వై.ఎ.ఎస్.జె. ప్రసన్నకుమారిగారు Thio semicarbazones RU(III), AU(III) complexes and their Biological activity అనే అంశాలపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు. Physico-Chemical properties of Binary Liquid mixtures అనే అంశంపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు. Development and validation of new analytical Methods for a few Pharmaceutical Drugs and Studies of Biological Activities of Novel 1,2,3-Benzotriazoles అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. పి. రజనీకుమారిగారు Kinetic Studies of mn+2 Iaons అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని పొందారు.

**వృక్షశాస్త్రం :**

డా॥ ఎస్.ఎం. సుభానిగారు Effect of Light and Darkness on Flowering of Rice varieties of BAM-11 & T-90 అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని, ఎస్. రామమోహనరావుగారు Studies on Alternaria

sesami pathogenic to sesamum అనే అంశంపై, ఆర్. వేణుమాధవ్‌గారు Aeriobiology of Narasaraopet అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాల్ని పొందారు.

**బయోటెక్నాలజీ :**

ఎ.వి.ఎన్. గుప్తగారు Isolation & Charecterization of starch De-grading eizyme producing aspergillus-and enzyme production studies under solid state అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని పొందారు. సుందరశెట్టి బాలసాయి జర్మనీలో Cancer Immunalogy అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు.

**బయోకెమిస్ట్రీ :**

బి.ఆర్. సుశీల్ కుమార్‌గారు Use of Liposomes in Drug Delivery Systems ఎం.ఫిల్. పట్టాన్నిపొందారు.

**వాణిజ్యశాస్త్రం :**

ఎస్.ఎస్. రాజమన్నార్‌గారు A study of agriculture credit flow through SWCCDS with refference to Narasaraopet branch of GDCCB Ltd. Tenali during 1980 - 1990, వి. వేంకటేశ్వరరెడ్డి గారు Indian Trade to Gulf Countries, ఎస్. మల్లయ్య గారు A study on market potential for tile adhesives in twin cities with reference to commix India private Limited అంశాలపై పరిశోధించి ఎం.ఫిల్. పట్టాల్ని పొందారు.

**రాజనీతిశాస్త్రం :**

డా॥ భారతుల శివధర్మశాస్త్రిగారు A Comparitive Study of the Speaker - India, Britan, and the USA,



డా॥ శివధర్మ శాస్త్రి



డా॥ ఎ.వి.రత్నారెడ్డి

డా॥ ఎ.వి. రత్నారెడ్డిగారు The Political Phylosophy of Swami Vivekananda అనే అంశాలపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు. ఎం.ఆర్.కె. మూర్తిగారు Governer's Role in the Constitution అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాన్ని, డా॥ జె.ఝాన్సీరాణిగారు, Political Awareness & Political Participation of Woman Regarding Narasaraopet town అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాన్ని, Political Awareness & Political participation of women అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు. వై. అప్పిరెడ్డిగారు Indo-Pak Relations : Security and Nuclear Aspects అనే అంశంపై ఎం. అనిల్‌కుమార్‌గారు Mitterand's role in European Integration అనే అంశంపై ఎమ్.ఫిల్ పట్టాల్ని పొందారు.

**ఆర్థికశాస్త్రం :**

పి.వి. మోహనరెడ్డిగారు. Indebtedness of Third World Countries అనే అంశంపై, ఎన్.రమాదేవి గారు Wasteland management in Karnataka State అనే అంశంపై, ఎస్. నరసింహారెడ్డిగారు Consumption pattern of Occupational groups A case study of Mulakaluru Village in Guntur District అనే అంశంపై, ఎం. నిర్మలకుమారిగారు A comparitive study of Financial Market Development and Economic Growth అనే అంశాలపై ఎమ్.ఫిల్ పట్టాల్ని పొందారు.

**గ్రంథాలయ విజ్ఞానం :**

పి. రామాంజనేయరెడ్డిగారు Reference collection Evaluation in Dr. B.R. Ambedkar Memorial Library, Acharya Ngarjuna University అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని పొందారు.

**వ్యాయామవిద్య :**

డా॥ వై. మధుసూదనరావుగారు Attitude of Head Masters of Secondary schools towards Physical Education అనే అంశంపై ఎం.ఫిల్‌ను, A study of Emotional competence, Achievement motivation and Socio economic status of Inter University Participants అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు.

**కంప్యూటర్‌విద్య :**

ఎం.ఇ. ప్రసాద్‌గారు Crytography and Net-

work Security అనే అంశంపై, కె.రాజశేఖర్‌గారు A study of Kerberos అనే అంశంపై, వి.ఎం.ఎస్. చారిగారు A study of on line job processing system అనే అంశాలపై ఎం.ఫిల్ పట్టాల్ని పొందారు.

**ఎలక్ట్రానిక్స్ :**

ఎస్. సురేష్‌గారు Studies on Field strength measurments in HF bank at Visakhapatnam అనే అంశంపై ఎమ్.ఫిల్ పట్టాన్ని పొందారు.

**సాంకేతిక విద్యాసంస్థల్లో పరిశోధనలు :**

CSE విభాగంలో వి.వి.ఎ.ఎస్. లక్ష్మిగారు A systematic approach to e-business security అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని పొందారు. Maths & Humanities విభాగంలో టి. ప్రసన్నకుమార్‌గారు Boolian Algebra and boolian Rings అనే అంశంపై, Physics & Humanities విభాగంలో ఎం. బాలచంద్రికగారు Luminescence అనే అంశంపై ఎమ్.ఫిల్. పట్టాల్ని పొందారు. ECE విభాగంలో డా॥ డి. వెంకట్రావుగారు Image Quality insides using weighted perceptual features, డా॥ ఎం. అరవింద్‌గారు Commerce and Management Studies అంశాలపై పిహెచ్.డి.పట్టాల్ని పొందారు.

**మైక్రో ఎలక్ట్రానిక్స్ :**

డా॥ బి.వి.రామ్మోహనరావుగారు Opto Electronics & Micro Electronics, డా॥ వి.వెంకట్రావుగారు Development of Multy polynomial minkowski function based navigation solution and the analysis of satellite clock and relactivistic error impact on the navigation solution for precise position application, డా॥ వి.ఇ. చంద్రశేఖర్ Signal Processing, డా॥ విజయన్ గురుమూర్తి అయ్యర్ Environmental Effects of Chrome rollers used in cotton roller ginning industries and design and development of an Eco-Friendly alternative, డా॥ జి. రెడ్డిబాబు Effect to metal ions in industrial waste water on compressive strength, Hrdening, setting times and Soundness of Cement, డా॥ సి. రామచంద్రుడు Some Studies on properties of Cementitious materials under various Chemical environments, డా॥ డి. సునీల్‌గారు Fabrication and tesing of a 356 nano composites with Ultrasonic cavitation assisted dispersion of sic nano particles అనే అంశాలపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు.

డా॥ హెచ్.ఎన్. సురేష్‌గారు Conjugate Analysis Drying of porous material using finite element method అనే అంశంపై, డా॥ డి. జగదీష్‌గారు Experimental and Theoritical studies on performance and emissions of C.I. engine using Biofuels, డా॥ పి. లక్ష్మణన్‌గారు Transient stability Improvement of power system using unified power flow controller, డా॥ వి. బాలకృష్ణారెడ్డిగారు Enhancement of dynamic and transient stability of power systems using fuzy and Ann controlled flexible transmission system, డా॥ ఎస్.ఎన్. తిరుమలరావుగారు Critical Evaluation of Memory mapped data mining Algorithm on single core and multi-core processors, డా॥ బి.ఝాన్సీవజ్రంగారు A new message Audhentication scheme for providing Anonymity in Mobile Ad Aoc networks, Sk. సాగర్ ఇమామ్‌బిగారు Global relevant prototype based classifier, a text mining approach for document classification, డా॥ ఎస్. వెంకటేశ్వర్లుగారు Ring Theory LP Spaces అనే అంశంపై ఎం.ఫిల్., Gamma Near Rings అనే అంశంపై పిహెచ్.డి., డా॥ ఎస్. శరవణ కుమార్‌గారు Computer Science Engineering, డా॥ యస్. వెంకటరమణగారు A Study on Mutual Funds in India అనే అంశంపై ఎమ్.ఫిల్., A comparative study on Retail banking products of banking Industry అనే అంశంపై పిహెచ్.డి., డా॥ ఎం.ఎస్. నారాయణగారు A Study on customer satisfaction in Commercial Banks అనే అంశంపై ఎం.ఫిల్., A study on social responsibilities of commerical banks in India అనే అంశంపై పిహెచ్.డి., డా॥ కె. పొన్నూరి లక్ష్మిగారు Body and Beyond the theme of love in Kamala

Das అనే అంశంపై ఎం.ఫిల్., An Oeuvre of Kamala అనే అంశంపై పిహెచ్.డి. డా॥ ఎ. మురుగేశన్‌గారు Afro-American literature అనే అంశంపై ఎం.ఫిల్., Highly commanded అనేఅంశాలపై పిహెచ్.డి.పట్టాల్ని పొందారు. డా॥ యస్.కె. మొహిద్దీన్‌షాగారు Fuzzy dimensions of a module over its sub module అనే అంశంపై ఎమ్.ఫిల్., Contributions to Ring Theory-2 అనే అంశంపై పిహెచ్.డి., డా॥ జి. ధర్మయ్యగారు Algebra అనే అంశంపై ఎం.ఫిల్., Some MHD Flews through porous medium అనే అంశంపై పిహెచ్.డి., డా॥ టి.వి.ఎస్.ఎం. మోహన్‌బాబుగారు Order - Disorder studies in Quasi -Binary $A_3B$ and AB type alloys, డా॥ టి. ఆంజనేయులుగారు Solar Energy(solar pond) అనే అంశంపై ఎమ్.ఫిల్., Effect of Zinc doping on the structural & magnetic properties Nano structured Ni and cu ferrite అనే అంశంపై పిహెచ్.డి., డా॥ కె. నీరజగారు Spectroscopic properties of molybenum doped Zn O-$ZnF_2$-$B_2O_3$ Glasses అనే అంశంపై ఎం.ఫిల్., Influence of modifier axides on electric and spectroscopic properties of $Sm^{3+}$/$Ho^{3+}$ tons in $V_2 0_5$ codoped $No_2o$ -$Sio_2$- $Zro_2$ glasses అనే అంశంపై పిహెచ్.డి., డా॥ పి.వి.నారాయణ్‌గారు Electro chemical Investigation of biologically Important compounds at chemically modified electrodes, డా॥ జె. సాయిచంద్రగారు Transition metal Ions doped L-histidine HydroChloride monohydrate crystal, డా॥ జె. శ్రీనివాసరావుగారు Studies in synthesis characterization and biological activity of some acridine and pyrinnidionen derivatives, అనే అంశాలపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు.

ఎస్. అజయ్ కుమార్‌గారు Fasting and Feasting with a critical Appreciation, డి. ఉమాశంకర్‌గారు Algebra, బి. నాగలక్ష్మిగారు Algebra, ఇ.ఆర్.ఎన్. సాయిగారు Algebra, ఎన్. నరసింహారావుగారు Mixed Alkali effect in Bismuth borate Glasses, పి. పట్టాభిరామ్‌గారు A study on Mutual Funds in India, టి. మల్లికార్జునరావుగారు Fund selection behaviour of Mutual Fund Investors, అనే అంశాలపై ఎం.ఫిల్. పట్టాల్ని పొందారు. డా॥ ఎం. రోజారాణిగారు Optimization of alkaline protease by aspergillus SP under submerged conditions అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని, Purification, characterization and structure prediction of alkaline protease from aspergillus flaves $AS_2$ అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని, డా॥ ఎ. లక్ష్మణస్వామిగారు Phylosophy అనే అంశంపై డా॥ పి. వెంకటచలపతిగారు Synthesis characterization Low-frequency dielectric Investigation on in Bent Liquid Crystals, అనే అంశాలపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు.

ఎం.ఎల్. నాగజ్యోతిగారు A study on customer preception on credit card services offered by HDFC Bank, ఎ.వి.ఎన్. అశోక్‌గారు Liquid Crystals, జె. మంగేశ్వరిగారు Mathematical interest in relation to achivement in mathematical interest, డా॥ జోజప్ప చౌడాగారు Second language Acquisition (English), కె. హరిశ్చంద్రప్రసాద్‌గారు Mathematics, డా॥ వై. జయపాల్‌గారు Mothering Dreams-Shades of imagination in Dylan Thomas short fiction అనే అంశాలపై ఎం.ఫిల్ పట్టాల్ని పొందారు. డా॥ జె. చంద్రశేఖర్‌గారు An efficient Approach for Trust management and cluster Head selection in Adverse Adhoc Networks, డా॥ వై.జయపాల్‌గారు Mothering Dreams-Shades of imagination in Dylan Thomas short fiction అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాన్ని, Multiculturalism and Diaspora short stories of Divakaruni and Jhumpa Lahari, అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని, డా॥ వై. శ్రీనివాసరావుగారు Modeling & control of windpower generation systems, డా॥ టి. సీతారామయ్యగారు Human Resource Management, డా॥ ఎస్. శ్రీకాంత్‌గారు Data mining, డా॥ జయపాల్‌రెడ్డిగారు Data mining, అనే అంశాలపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు. సి.హెచ్. చైతన్యగారు గణితశాస్త్రంలో, పి. వేమనగారు Computer Scienceలో, సి.హెచ్. నాగేశ్వరరావుగారు Financial Management Studies అనే అంశాలపై ఎం.ఫిల్. పట్టాల్ని పొందారు.

డా॥ కె.వి. మూర్తిరావుగారు Impact of Climate change on water sources and agriculture in Ananthapur district, డా॥ ఎస్.డి. ఖాసింగారు Improving software consistency by evaluating the efficiency of software testing techniques, అనే అంశాలపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు. డా॥ వి. పోతురాజు Commerceలో ఎం.ఫిల్.పట్టాన్ని, A study on CRM practices in Xerox Industry Study of Modi and canon Xerox companies అనే అంశంపై పిహెచ్.డి. పట్టాన్ని పొందారు.

జి. కరుణాకరబాబుగారు గణితశాస్త్రంలో, కె. శ్రీలక్ష్మి గారు Suitability of course book in technology & developing communication skills for Engineering colleges అనే అంశంపై ఎం.ఫిల్. పట్టాల్ని పొందారు. డా॥ వై.వి. నారాయణగారు సాంకేతిక విద్యలో పిహెచ్.డి.ని పొందారు. డా॥ కె. సైదయ్యగారు Investigation of spectral Efficiency & Energy Efficiency in massive Mimo networks, డా॥ కె.ఆర్. మోహనరెడ్డిగారు Surface Engineering by thermal spray coatings అనే అంశంపై, డా॥ దీన్‌కుమార్‌గారు Microwave assisted synthesis of Hetrocyclic compounds and its biosynthesis of Hetrocyclic compounds and its biological Activity, డా॥ ఆర్. గాంధిరాజుగారు Quality of service Enhanced mobile Adhoc Networks అనే అంశంపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు. డా॥ ఎం.వి. విజయ్ కుమార్‌గారు An Institu-tionic Fuzzy BF Algebra, బి. నారాయణగారు Aliana-tion of woman in Reja Rao's Novels Indian writing in English, టి. కిరణ్ కుమార్‌గారు Study of atmospheric acrozols over Indian sub continent using MODIS data, ఎన్. శ్రీనివాసరావుగారు A study on the topological properties of Dometue bass & fixed print theorm in metre & Dmetre space, ఏ. సావిత్రిగారు Translation studies, జి. శ్రీనివాస రావుగారు Algebraపై ఎం.ఫిల్. పట్టాల్ని పొందారు.

డా॥ డి.సి. ప్రేమ్‌చంద్‌గారు Newer method development and validation of analytical procedure in few multi component drugs in their formulation, డా॥ ఎస్. దైవమ్‌గారు Anti Cancer and Anti oridant Activity of poly herbal extract on mice, డా॥ షేక్ మస్తాన్‌గారు Study on the mechanisms of drug inter agents of selected anti Retroviral Drugs with glichodize in Animal models, డా॥ శరత్‌బాబుగారుSynthesis, Biological evalu-taion of some new hetrocyclics contineuing Oxyzen & Nitrozen, డా॥ రెడ్డి రాంబాబుగారు Synthesis & Evaluation of activities of new hetrocy-clic compounds, డా॥ ఎం. ప్రసాదరావుగారు Kinetic & Mechanism of avidation of some organic compound by chlorazimines-2, డా॥ రామకోటయ్య మొగిలిగారు Development and validation of Analytical methods for Quantification of New Drug molecules by using HPLC, డా॥ ముప్పనేని శ్రీకాంత్ గారు Phytochemical and biological evaluation of three traditional plant medicines, Musa rosacea, Acicennia Manina and Bombase Ceiba, డా॥ సి.హెచ్. అజయ్‌బాబుగారు Formulation & Evaluation of Immediate release and sustained release multi particulate systems of carvedilol by fluidized bed coating Technique అనే అంశాలపై పిహెచ్.డి. పట్టాల్ని పొందారు.

150కి పైగా ఉన్న విశ్వవిద్యాలయ పరిశోధనలనే కాక ఔత్సాహిక విశిష్ట పరిశోధనలు చేసిన పెద్దలు కూడా మన పట్టణంలో ఉన్నారు. వారిలో ముఖ్యులు:

కొండవీటి సామ్రాజ్యం, కైఫీయత్తులు, కోటప్పకొండ చరిత్ర, మొదలైన గ్రంథాలను రచించిన మద్దులపల్లి గురు బ్రహ్మశర్మగారు, మన పాతూరుశివాలయం చరిత్రను రచించిన భాగవతుల వేంకటసుబ్బారావుగారు, మల్రాజ వంశ వైభవం రచించిన విద్వాన్ బి. యేలియగారు మొదలైనవారు మనకు చిరస్మరణీయులు.

అభివృద్ధిపథంలో శరవేగంతో పురోగమిస్తున్న మన పట్టణంలో మరిన్ని రంగాలలో పరిశోధనలు జరగాలని, పరిశోధనారంగం మరింత విస్తృతమవటానికి నరసరావుపేట నుండి మరెందరో పరిశోధకులు దోహదం చేయాలని ఆకాంక్షిద్దాం! పరిశోధనాఫలాలు ఆయారంగాల భవిష్యత్తరాలకు అందేలా విద్యాలయాలు తోడ్పడాలని ఆశిద్దాం!! •

# గ్రంథాలయోద్యమం



## యన్నం వేంకట నర్సిరెడ్డి

మాజీ ఛైర్మన్, గుంటూరుజిల్లా గ్రంథాలయసంస్థ

భారత స్వాతంత్ర్యోద్యమంతో సమాంతరంగా గ్రంథాలయోద్యమం నడిచింది. జాతీయోద్యమం, సంఘ సంస్కరణోద్యమం, ఆంధ్రోద్యమం, గ్రామపునర్నిర్మాణం మొదలైన ఉద్యమాలన్నింటికి గ్రంథాలయోద్యమం చేయూత నిచ్చి వ్యవస్థాపరమైన మార్పుకు నాందిపలికింది. అన్ని ప్రజా ఉద్యమాలకు సాయపడింది గ్రంథాలయోద్యమమే!

మన నరసరావుపేట నుండి 'త్రివేణి' పత్రికా సంపాదకులు కోలవెన్ను రామకోటీశ్వర రావుగారు, బెల్లంకొండ రాఘవ రావుగారు, గుంటూరు జిల్లా పౌర గ్రంథాలయ సంఘ అధ్యక్షులు చిర్రావూరి నాగభూషణాచార్యులుగారు, మద్దూరి విశ్వనాథంగారు మొదలైన వారంతా గ్రంథాలయోద్యమంలో ఎంతో చురుకుగా పాల్గొనెడి వారు. వీరందరితో సాన్నిహిత్యం వలన నాకు గ్రంథాలయాలు, సాహిత్యం, సాంస్కృతిక రంగాల పట్ల అభిమానం ఏర్పడింది.



మద్దూరి విశ్వనాథం

గుంటూరు జిల్లాలోనే తొలిసారిగా ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ 8వ మహాసభలు పమిడిపాడు అగ్రహారంలో 1923వ సం॥లో మే 1 నుండి 3వ తేదీ వరకు నిర్వహించడం జరిగింది. ఈ మహాసభలకు బెల్లంకొండ రాఘవరావుగారు ఆహ్వానసంఘ అధ్యక్షులుగా వ్యవహరించారు. 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు సభాధ్యక్షులు. అనేక గ్రంథాలయాల నుండి ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

నరసరావుపేటలోని శాఖాగ్రంథాలయంలో తరచుగా సాహితీసభలు నిర్వహిస్తూ ఉండేవాళ్ళము. భువన విజయం, అష్టావధానం వంటి కార్యక్రమాలు ఏర్పాటు చేసేవాళ్లము. శాఖాగ్రంథాలయములో కె. నాగేశ్వరరావు, ఆళ్ల రాఘవయ్య,



నాగభూషణాచార్యులు



బెల్లంకొండ రాఘవరావు

ముప్పాళ్ల మధుసూదనరావుగార్లు గ్రంథాలయాధికారులుగా పనిచేసిన కాలంలో ఈ కార్యక్రమాలను నేను, మిత్రులు ప్రముఖ పత్రికా రచయిత కె. వాసుదేవరావుగారు, తోటకూర వేంకటేశ్వరరావుగారు, విలేకరి గన్నమనేని లింగయ్యగారు మొదలైన అనేక మంది మిత్రుల సహాయంతో ఏర్పాటు చేసే వాళ్లము. చాలా సభలకు కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు, బెల్లంకొండ రాఘవరావుగారు అధ్యక్షులుగా వ్యవహరించేవారు.

నాటికాలంలో రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక రంగాలలో నరసరావుపేట అగ్రశ్రేణిలో ఉండేది. 'భువన విజయం'ను శాఖా గ్రంథాలయంలో నిర్వహించాము. అందులో బెల్లంకొండ రాఘరావుగారు శ్రీకృష్ణదేవరాయలుగా, మద్దులపల్లి సత్యనారాయణశాస్త్రిగారు తిమ్మరుసుగా వ్యవహరించారు. ఇంకా శ్రీయుతులు లంకా సీతారామశాస్త్రి, భాగవతుల సుబ్బారావు, చెల్లపిళ్ల బంగారేశ్వరశర్మ, బీర్నీడి ప్రసన్న, పోలూరి రామకృష్ణయ్య, మానూరి శ్రీనివాసహనుమంతరావు మున్నగు విద్వాంసులు ఇందులో పాల్గొన్నారు.

శాఖాగ్రంథాలయములో మేము సి.వి. సుబ్బన్న శతావధాని, నరాల రామారెడ్డి, గాడేపల్లి కుక్కుటేశ్వరరావుగార్ల అష్టావధానాలను ఏర్పాటుచేశాము. జ్యోత్స్న ఆర్ట్స్ థియేటర్స్, ఉప్పలపాడు తరపున అనేక సాహిత్య కార్యక్రమాలు, నాటికలు ఏర్పాటు చేసేవాళ్లము. ధూళిపాళ, శనివారపు నరసింహారెడ్డి (జ్యోత్స్న) నూతలపాటి గోవిందరావు చౌదరి (సురభి ఆర్టిస్టు), పోలూరి లక్ష్మీకాంతరావు, డా॥ పోలేపెద్ది లక్ష్మీకాంతం మొద

లగు వారితో పౌరాణిక నాటకాలు, ఏకపాత్రాభి నయాలు నిర్వహించేవాళ్లము.

1950 నుండి ఇప్పటి వరకు గుంటూరు జిల్లా గ్రంథాలయసంస్థ అధ్యక్షులుగా 8 మంది బాధ్యతలు నిర్వ హించగా, అందులో ముగ్గురు వ్యక్తులు మన నరసరావుపేటకు చెందినవారే! నేను ది. 7-4-1973 నుండి 15-12-1982 వరకు, కాకుమాను పెదపేరిరెడ్డిగారు 4-7-1988 నుండి 3-7-1991 వరకు, అనిశెట్టి వెంకటకృష్ణారావుగారు 1-7-1999 నుండి 22-2- 2005 వరకు అధ్యక్షులుగా ఉన్నాము.

గ్రంథాలయాల ప్రచారానికి, గ్రంథాలయ ఉద్యోగు లకు సహకారం అందించేందుకు పత్రిక అవసరమని భావించి నా సంపాదకత్వంలో 1979 జులై నుండి 'గ్రంథాలయ జ్యోతి' అనే త్రైమాసిక పత్రికను నరసరావుపేట నుండి ప్రారంభించి విజయవంతంగా నడపగలిగాము.

ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ సంఘం పక్షాన ద్వితీయ ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ మహాసభలు నరసరావుపేట హర్డు హైస్కూల్‌లో 1980వ సం॥లో ఫిబ్రవరి 22 నుండి 24వ తేదీ వరకు అత్యంత జయప్రదంగా నిర్వహించాము. ఈ మహాసభలకు బెనారస్ విశ్వవిద్యాలయం నుండి ప్రొఫెసర్ పి.ఎన్. కౌలాగారు, ఆంధ్రవిశ్వవిద్యాలయం నుండి ప్రొఫెసర్ జి.వి.ఎస్.ఎల్. నరసింహరాజుగారు, ఉత్కళ్ యూనివర్సిటీ నుండి ప్రొఫెసర్ కె. శ్రీరామమూర్తిగారు, నాగార్జున యూని వర్సిటీ నుండి ఆచార్య తూమాటి దొణప్పగారు, డా॥ ఎం.ఏ. మజీద్‌ఖాన్, డా॥ వెలగా వెంకటప్పయ్యగారు చిర్రావూరు నాగభూషణాచార్యులుగారు, కె.వి. రమణయ్యగారు, కపల వాయి కాశీరామారావుగారు వంటి ప్రముఖులు అనేకమంది పాల్గొని ఈ మహాసభలను విజయవంతం చేశారు. •

## పెద్దచెరువు - జల (న) కళ!

మన నరసరావుపేట పేరు చెప్పగానే ముందుగా గుర్తుకు వచ్చేది పెద్ద చెరువు. దీని విస్తీర్ణం 105 ఎకరాలు. అటు రెడ్డినగర్ నుండి ఇటు పాతూరు దాకా, అటు మహాలక్ష్మినగర్ నుండి ఇటు పల్నాడురోడ్ దాకా ఇది విస్తరించి వున్నది. మన జమీందారుగారు మన ఊరి నీటివసతి కోసం దీనిని త్రవ్వించారు.

చాలా సంవత్సరాల క్రితం రాజావారి ఒంటెలు, ఏనుగులు ఇక్కడకు నీళ్లకు వచ్చేవి. రైతుల పశువులు కూడా వచ్చేవి. చెరువుకట్టమీద వృక్షసంపద విస్తారంగా కన్నుల పండుగ గా ఉండేది. దీని క్రింద బరంపేటరోడ్‌లోని పొలాలు పండు తుండేవి. ఈ చెరువు వల్లనే మన ఊరికి నీటి ఎద్దడి ఉండేదికాదు. చెరువు నిండా నీళ్లు పరవళ్లు తొక్కుతున్న రోజులలో మన ఊళ్లో నేలను కాలి బొటనవ్రేలితో మీటితే నీటి చెమ్మ తగిలేది. మన ఊరి పిల్లల ఆటలకు, పెద్దవారి షికారుకు, కవుల సమావేశాలకు ఇది కేంద్రంగా ఉండేది.

ఇప్పుడు విజయచాముండేశ్వరి ఆలయం ఉన్న ప్రాం తంలో చెరువుకు మెట్లు ఉండేవి. వాటికి రెండువైపుల రెండు వినా యకుడి విగ్రహాలు, మెట్లను ఆనుకొని అనిసెట్టి కోటిలింగం పార్కు ఉండేవి. ఎనిమిది దశాబ్దాల క్రితం పాతూరు శివాలయంలో జరిగే శివకల్యాణం సందర్భంగా ఉత్సవవిగ్రహాలకు తెప్ప తిరు నాళ్లు ఈ చెరువులోనే జరిగేవి. వినాయక చవితి మర్నాడు ఊరివారందరూ వినాయకుడి విగ్రహాలను ఈ చెరువులోనే నిమజ్జనం చేసేవారు. ఆ రోజున ఈ ప్రాంతమంతా పెద్ద 'తిరణాల' లాగానే ఉండేది.

ఎండలకాలంలో పశువులు నీళ్లలోకి దిగి సేదతీర టానికి వచ్చేవి. కుర్రకారు మొత్తం ఈతకు వచ్చేవాళ్లు. చెరువులో నీళ్లఎండిపోయిన కాలంలో కూడా చెరువు వైభవానికి లోటు ఉండేది కాదు. ఆ రోజులలో పిల్లల గాలిపటాలు, బిళ్లంగోడు, బెచ్చాలు, పిచ్చిబంతి, కబాడి, కోతి కొమ్మచ్చి లాంటి ఆటలతో కళకళలాడుతూ ఉండేది. జోరుగా వర్షాలు కురిసిన రోజున చెరువు నిండి రోడ్డుమీద రెండు అడుగుల ఎత్తున నీళ్లు నిలిచిన ఆ దృశ్యం గంభీర సముద్రాన్ని గుర్తుకు తెస్తూఉండేది. సరసులైన పెద్దవాళ్లు ఈ చెరువును మన ఊరి మానససరోవరమని చమత్క రిస్తూ ఉండేవారు. పల్నాడు రోడ్డు మీద నిలబడి చెరువు మీదుగా దానికి ఉత్తరవు ఒడ్డున ఉన్న మల్లెతోటను చూడటం ఆనాటి పౌరులకు ఒక మధురానుభూతి.

మన జమీందారు శ్రీ మల్రాజు నరసింహారావుగారు ఈ చెరువును మన పురపాలకసంఘానికి బహూకరించారు.

సుమారుగా యాభై సంవత్సరాల క్రితం ఈ చెరువు లోకి పాలశీతలీకరణ కేంద్రం వచ్చి జనావాసానికి నాంది పలికింది. ఆ తర్వాత కళాశాలలు, ప్రభుత్వ కార్యాలయాలు, ఇళ్లు మొదలైనవన్నీ ఒకదాని తర్వాత మరొకటి వచ్చి చెరువల్లా జనపదంగా రూపుదిద్దుకొన్నది.

ఎవరెన్ని చెప్పినా మన పెద్దచెరువుది ఆనాడు జలకళ! ఈనాడు జనకళ!! •

# పుస్తకాల 'కొలువు'లు



## పోలిరెడ్డి రామాంజనేయరెడ్డి

లెక్చరర్ - లైబ్రరీ సైన్స్

గ్రంథాలయాలు విజ్ఞాన జ్యోతులు, జ్ఞానసముదాయాన్ని నిలువచేసే విజ్ఞాన కేంద్రాలు.

**వైశ్య బాలమిత్ర గ్రంథాలయం :** జాతీయోద్యమం తీవ్రంగా ఉన్న రోజులలో ఈ గ్రంథాలయాన్ని ప్రారంభించారు. 87 ఏళ్ళ సుదీర్ఘ చరిత్ర కలిగి ఉత్తమంగా నిర్వహించబడుతూ వున్న ప్రైవేటు గ్రంథాలయం ఇది. మురారిసెట్టి నమశ్శివయ్యగారు చిలకమర్తివారి గ్రంథాలయ ప్రబోధమునకు ఉత్తేజితులై మండవ శేషగిరిరావు, కేతేపల్లి సత్యనారాయణ, దొడ్లా వేంకట కోటయ్య, నాగసరపు కృష్ణమూర్తిగార్ల సహాయంతో 1928 డిసెంబరు 21న శ్రీకన్యకా పరమేశ్వరి అమ్మవారి సత్రంలోని ఒక చిన్న గదిలో 240 గ్రంథాలతో దీనిని స్థాపించారు. 1945లో పెండ్యాల జగన్నాథంగారు గ్రంథ పాలకులైనారు. వీరు 'లైబ్రరీ జగన్నాం', 'లైబ్రరీ తాతయ్య'గా పిలువబడినారు. 'గ్రంథాలయ పితామహ' అయ్యంకి వేంకటరమణయ్యగారు 'గ్రంథాలయ సేవాధురీణ' అని, అడవి బాపిరాజుగారు 'గ్రంథాలయ యోగి' అని వీరిని ప్రశంసించారు. 1980లో నరసరావుపేటలో జరిగిన ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయ మహాసభలలో వీరికి ప్రొఫెసర్ పి.ఎన్. కౌలా అవార్డును బహుకరించారు. చాలా పురాతనకాలంనాటి భూర్జర పత్రాలు, తాళపత్ర గ్రంథాలు ఇందులో ఉన్నాయి.



పెండ్యాల జగన్నాథం

**మునిసిపల్ పబ్లిక్ గ్రంథాలయం :** నరసరావుపేటలోని మునిసిపల్ పబ్లిక్ గ్రంథాలయంలో తెలుగు, ఆంగ్లభాషలలో సాహిత్యమునకు సంబంధించిన ఉత్తమ గ్రంథాలు కలవు. అనేక నిఘంటువులు, విజ్ఞానసర్వస్వాలు వంటి అనేక రెఫరెన్సు గ్రంథాలు కలవు.

**శ్రీసుబ్బరాయ & నారాయణ కళాశాల గ్రంథాలయం :** 1950లో శ్రీసుబ్బరాయ & నారాయణ కళాశాల స్థాపించినప్పటినుండి అందులో మంచి గ్రంథాలయం కలదు. నేటికి 50,400 గ్రంథరాజములతో, 90 వివిధ దిన, వార, మాస పత్రికలు మరియు జర్నల్స్‌తో విశేష విస్తృత పరిశీలనోపయుక్త గ్రంథమండితమైన పఠన మందిరములతో గ్రంథాలయం పాఠకులకు ఎంతో ప్రయోజనకరంగా ఉంది. లైబ్రేరియన్‌గా కె.వి.కె. రామారావుగారు, అసిస్టెంట్ లైబ్రే రియన్‌గా కె. శివశాస్త్రిగారు గ్రంథాలయ అభివృద్ధికి ఎంతగానో కృషి చేశారు. ఇది ఆచార్యనాగార్జున యూనివర్సిటీనుండి 'ఉత్తమ గ్రంథాలయం' అవార్డును, రూ. 10,000 నగదు బహుమతిని పొందినది.

ఈ గ్రంథాలయంలో అన్ని ప్రముఖ ప్రచురణ సంస్థల 100కు పైగా నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వ సంపుటాలు, ఇతర రిఫరెన్సు గ్రంథాలు పెద్దసంఖ్యలో కలవు. ఎన్‌సైక్లోపిడియా ఆఫ్ బ్రిటానికా సంపుటాలు, ఎన్‌సైక్లోపిడియా ఆఫ్ అమెరికానా, ఛాంబర్స్ ఆఫ్ ఎన్‌సైక్లోపిడియా, ఫంక్ అండ్ వాగ్నల్స్ న్యూ ఎన్‌సైక్లోపిడియా, మెక్‌గ్రాహిల్ ఎన్‌సైక్లోపిడియా ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజి వంటి అనేక ప్రముఖ విజ్ఞాన సర్వస్వాలు కలవు. ఇంకా హర్వర్డ్ క్లాసిక్, షేక్‌స్పియర్ నాటకములు ఇంగ్లీషు భాషా సాహిత్యానికి సంబంధించిన అనేక ఉత్తమగ్రంథాలు కలవు. భారతి, త్రివేణి వంటి పత్రికల పాత సంపుటాలు అందుబాటులో కలవు. అంధ విద్యార్థులకు బ్రెయిలి లిపిలో గ్రంథాలు కలవు. గ్రంథాలయంలో డిజిటల్ గ్రంథాలయం అందుబాటులో కలదు. గ్రంథాలయంలోని గ్రంథములన్నియు ఇన్‌ఫ్లిబ్‌నెట్ వారి సోల్ (సాఫ్ట్‌వేర్ ఆఫ్ యూనివర్సిటీ లైబ్రరీస్) సాఫ్ట్‌వేర్‌ద్వారా గ్రంథాలయం పూర్తిగా కంప్యూటరీకరణ జరిగింది. పాఠకులకు ఆన్‌లైన్ పబ్లిక్ యాక్సిస్ కాటలాగ్ అందుబాటులో కలదు. గ్రంథాలయము

నందు ఇన్‌ఫ్లిబ్‌నెట్ వారి ఎన్‌లిస్ట్ (నేషనల్ లైబ్రరీ అండ్ ఇన్‌ఫర్మేషన్ సర్వీసెస్ ఫర్ స్కాలరీ కాంటెంట్) ప్రోగ్రామ్ ద్వారా 80,400 ఇ-బుక్స్, 3,828 ఇ-జర్నల్స్ ఆన్‌లైన్ ద్వారా అధ్యాపకులకు, విద్యార్థు లకు అందుబాటులో కలవు.

**సర్దార్ శ్రీకాసు వెంగళరెడ్డి మెమోరియల్ జిల్లాశాఖా గ్రంథాలయం :** ఇది 1954వ సంవత్సరములో స్థాపించబడినది. కొల్లిపర నాగేశ్వరరావుగారు 1954 నుండి 1963 వరకు, అళ్ల రాఘవయ్యగారు 10 సం॥లకు పైగా, ముప్పాళ్ల మధుసూదనరావుగారు 1975 నుండి 1992 వరకు ఈ గ్రంథాలయానికి లైబ్రేరియన్‌లుగా పని చేసారు. అనేక సాహితీ సంస్థలు, సేవాసంస్థలు తమ సమావేశాలను ఇక్కడ జరుపుతూ ఉండేవి. నరసరావుపేట శాఖాగ్రంథాలయంలో సంచార గ్రంథాలయం కూడా కలదు. 1981 నుండి 1995 వరకు నరసరావుపేట పట్టణంలో వివిధ ప్రాంతాలలో ఈ సంచార గ్రంథాలయం చేసిన సేవలు ప్రశంసాపాత్ర మైనవి. ఒక రిక్షాలో పాఠకులకు కావలసిన పుస్తకాలను తీసుకొని వెళ్లి పాఠకులకు వారి ఇంటి దగ్గరే అందించటం జరిగేది. ఈ గ్రంథాలయం 27-01-2009 నుండి పల్నాడురోడ్డులో గల సొంత భవనంలోకి మార్చబడినది. ప్రస్తుతం గ్రంథాలయంలో 38,000కు పైగా గ్రంథములు కలవు. 40కి పైగా దిన, వార, మాస పత్రికలు పాఠకులకు అందజేయబడుతున్నాయి. ప్రస్తుతం 6,700మంది సభ్యులుగా వున్నారు. ఈ గ్రంథాలయ సేవలను ప్రతిరోజు 250 మంది పాఠకులు వినియోగించుకుంటున్నారు. ఈ గ్రంథాలయంలో 3,000 పైగా పిల్లలకు సంబంధించిన పుస్తకాలు కలవు. ప్రస్తుతం గ్రంథాలయంలో కంప్యూటర్స్ అందుబాటులో కలవు. పాఠకులకు ఇంటర్‌నెట్ సౌకర్యం కల్పించే ఏర్పాటు జరుగుతున్నది.

**శ్రీమతి కాసు రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి డిగ్రీ కళాశాల గ్రంథాలయం :** 28-07-1972న మాన్యశ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారి జన్మదినోత్సవంనాడు జూనియర్ కళాశాల, 28-07-1974న బ్రహ్మానందరెడ్డిగారి జన్మదినోత్సవంనాడు డిగ్రీ కళాశాల ప్రారంభించబడినవి. 21-01-2000న డిగ్రీ కళాశాల గ్రంథాలయం నూతనభవనంలోకి మారింది. ఈ గ్రంథాలయానికి సువిశాలమైన రీడింగ్ రూమ్ మరియు దీనికి అనుబంధంగా సెమినార్ హాల్ కూడా ఉన్నవి. లైబ్రరియన్‌గా శ్రీ వి. రామకోటిరెడ్డిగారు దాదాపు మూడు దశాబ్దాలు పనిచేసి గ్రంథాలయ అభివృద్ధికి కృషిచేసారు. ప్రస్తుతం అసిస్టెంట్ లైబ్రేరియన్‌గా వై.సిహెచ్. పుల్లారెడ్డిగారు పనిచేస్తున్నారు. ఈ గ్రంథాలయములో 23,000 పైగా గ్రంథాలు కలవు. 50కి పైగా ప్రముఖ దిన, వార, మాసపత్రికలు వస్తున్నాయి. భారతి వంటి పాతపత్రికల సంపుటాలు ఇక్కడ భద్రపరిచినారు. ప్రస్తుతం ఇన్‌ఫ్లిబ్‌నెట్ (ఇన్‌ఫర్‌మేషన్ లైబ్రరీ నెట్‌వర్క్) వారి సౌల్‌సాఫ్ట్‌వేర్ ద్వారా గ్రంథాలయములోని గ్రంథాలకు కంప్యూటరీకరణ ప్రక్రియ జరుగుచున్నది.

**పాలడుగు నాగయ్యచౌదరి మరియు కొత్త రఘురామయ్య డిగ్రీ కళాశాల గ్రంథాలయం :** 1991లో స్థాపించబడిన ఈ గ్రంథాలయంలో 21,000 పైగా పుస్తకములు, 50కి పైగా జర్నల్స్ పాఠకులకు అందుబాటులో కలవు. లైబ్రేరియన్‌గా పనిచేసిన పి. ధనలక్ష్మిగారు, ప్రస్తుతం లైబ్రేరియన్‌గా పని చేస్తున్న వెంకయ్యగారు గ్రంథాలయ అభివృద్ధికి చేసిన సేవలు అభినందనీయం. గ్రంథాలయంలో డిజిటల్ గ్రంథాలయం కలదు. గ్రంథాలయంలోని పుస్తకాలకు పూర్తిగా కంప్యూటరీకరణ జరిగినది. గ్రంథాలయమునందు డెల్‌నెట్ (డెవలపింగ్ లైబ్రరీ నెట్‌వర్క్) మరియు ఎన్.టి.ఆర్. మెడ్‌నెట్ ద్వారా ఇ-బుక్స్ మరియు ఇ-జర్నల్స్ అందుబాటులో కలవు.





# పత్రికారంగం సాగిందిలా....




## కుందా భాస్కరరావు

విశ్రాంత డైట్ ప్రిన్సిపాల్


నరసరావుపేట పత్రికారంగం బ్రిటీషువారి పరిపాలనకు ముందు నుండి వైవిధ్య భరితమైన చిన్నా పెద్ద పత్రికలతో దేశ విదేశాల్లోని పాఠకలోకాన్ని అలరించింది! ఒక్కమాటలో చెప్పాలంటే 1927లో స్థాపించబడిన 'త్రివేణి' ఆంగ్లపత్రిక ఆ నాడు సంపాదకులకే సంపాదకుడుగా పేరొందిన కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి మానస పుత్రిక! నరసరావుపేట ద్వారా భారతదేశానికి, ప్రపంచానికి ఆయన అందించిన అపురూప కానుక! 'నేను కోటుకు పెట్టుకున్న ఎర్రగులాబీ లాగే 'త్రివేణి' పత్రిక నా చేతికి ఒక గొప్ప అలంకారం! ఆ పత్రిక నా చేతిలో వున్నందుకు నేను గర్వపడుతున్నాను' అనే వారట! జవహర్‌లాల్ నెహ్రూగారు.

మన వూరి మొట్టమొదటి పాత్రికేయుడు తొలి ఏజంట్ 'హిందూ' పత్రికకు రిపోర్టర్‌గా పనిచేసిన స్వామి నాయుడుగారు. ఆ తరువాత గన్నమనేని లింగయ్యాగారు. 1960 నుండి ఆయన జర్నలిస్టుగా ఉన్నారు. ఆయన 'ఆంధ్ర జ్యోతి', 'విశాలాంధ్ర' పత్రికలకు విలేఖరి. జిల్లా వర్కింగ్ జర్నలిస్ట్‌ల యూనియన్ అధ్యక్షులుగా కూడా పనిచేశారు. లింగయ్యగారికి వార్తలు అందించటానికి సహాయపడ్డవారు జవంగుల నాగేశ్వరరావుగారు. ఆ తర్వాత చెప్పుకోవలసిన వారు 'ఈనాడు' పత్రికకు రిపోర్టర్‌గా పనిచేసిన కె.వి.కె. రామారావుగారు. వీరు 1978 నుండి 1998 వరకు రెండు దశాబ్దాల కాలం ఈ రంగంలో పనిచేశారు. 'ఈనాడు' రామోజీరావుగారి నుండి ఉత్తమజర్నలిస్ట్ అవార్డుకూడా పొందారు. ముక్తినూతలపాటివారు 'ఆంధ్రపత్రిక'కు పనిచేశారు.

తర్వాత వచ్చినవారు నల్లూరి రామారావు, గోపరాజు నాగేశ్వరరావు, డి.వి.డి. నాగేశ్వరరావు, 'హిందూ'కు పాలపర్తి ఆంజనేయులు, 'ఆంధ్రప్రభ'కు అంజనీకుమార్, 'వార్త'కు రమణ, 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'కు లంకా సత్యనారాయణ, 'ఉదయం'కు నజీర్ అహ్మద్, 'ఆంధ్రభూమి'కి మడకా సత్యనారాయణ, మడకా లక్ష్మయ్య, ఈనాడుకు శరత్‌గార్లు కూడా పనిచేస్తున్నారు.

నరసరావుపేటలో చిరుదివ్వెలు వెలిగించిన చిన్నారి



ముక్తినూతలపాటి హనుమంతరావు



పాలపర్తి వీరాంజనేయులు

పత్రికలు ఎన్నో! వీటిలో ముందుగా చెప్పవలసింది- అన్నాప్రగడ కామేశ్వరరావుగారు నడిపిన 'అంకుశం' పత్రిక. ఆయన 1940 ప్రాంతంలో జీవించారు. నరసరావుపేట కేంద్రంగా ఆయన స్థాపించిన 'అంకుశం' పత్రిక విప్లవ రాజకీయాలతో ఆనాటి పాలకుల పాలిటి అంకుశంగా మారింది!

కల్పవల్లి-పత్తిపాటి రామకృష్ణయ్య, దమ్మాలపాటి శేషగిరిరావు, అభ్యుదయ-అనిశెట్టి సుబ్బారావు; సంధ్య- అనిశెట్టి సుబ్బారావు, గంగినేని వెంకటేశ్వరరావు; దేశభక్తి- నంద్యాల కోటిరెడ్డి; సత్యజ్యోతి-షేక్ మహమ్మూద్; ఆంధ్ర వెలుగు- బత్తుల వేంకటరత్నం; విశ్వాంధ్ర-ఆర్.వి. నారాయణ, శ్రీమతి ఆర్. భాస్కరదేవి; వాసవీస్రవంతి, వాసవీవాణి, చైతన్యచిత్ర-ఎం.ఆర్.కె.మూర్తి; విశ్వగురుప్రభ-మాతా చిద్విద్యా ప్రభావతి; రిలీఫ్-పెద్ది సాంబశివరావు; నాగార్జున- కె. సత్యనారాయణ; గ్రంథాలయజ్యోతి-వై.వి. నరిసిరెడ్డి; మన పాడిపంటలు-జి.వి. రామారావు; నైతికవిప్లవం-ఈదర గోపీ చంద్; విశ్వశిల్పి, పంచాయితీ రాజ్యం-చిర్రావూరు నాగ భూషణాచార్యులు; చైతన్యదీపిక, సువార్తదీపిక-పత్తిపాటి జాన్సన్; దేవుని ప్రేమ-బి. ట్రేసీబాబు, ఎం.ఎబినైజర్; రొటేరియన్-పి. సుబ్బారావు; విజయధ్వజ-ఎన్. వేంకటేశ్వర రావు; సాంబశివ ఆనందవాణి-ఐ.వి.సి.హెచ్.శాస్త్రి; ఈ పత్రికలను స్థాపించిన వీరు మనకు గౌరవార్హులు.

నేనూ (కుందా); మరికొందరు మిత్రులు నెమలూరి భాస్కరరావు; మద్దూరి లక్ష్మీనరసింహం (హ్యామ్); మిన్నెకంటి నాగేశ్వరరావు; లింగంగుంట జానకీరాం- ఇంకా ఒకరిద్దరు సాహితీ మిత్రులు కలసి ఆ నాటి జి.ఎల్.ఎల్.ఏ.; మునిసిపల్ గ్రంథాలయాలు వేదికలుగా లిఖిత పత్రికలను నడిపాము. అవి ఆ రోజులలో సంచలనం కలిగించాయి.

నేనూ తదితరులు సమాజం గుర్తించే స్థాయిలో కవులుగా, కథా రచయితలుగా, సాహితీవేత్తలుగా రాణించడానికి శ్రీసుబ్బరాయ & నారాయణ కళాశాల నడిపిన మ్యాగజైనులు కూడా ఒక కారణం! అలాగే శ్రీమతి కాసు రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి జూనియర్, డిగ్రీ కళాశాలలు నడిపిన 'ప్రతిభ' వార్షిక పత్రిక కూడా విద్యార్థుల్లో సాహిత్య, సామాజిక స్పృహను కలిగించింది.

2002లో ఉగాది పర్వదినాన నరసరావుపేటలో వినూత్న 'శ్రీలేఖ' మాసపత్రిక వెలసింది. ప్రతాప రవిశంకర్ గౌరవ సంపాదకులుగా, జాగర్లమూడి రామగోపాల్ ఎడిటర్ & పబ్లిషర్‌గా పనిచేశారు.

కోటప్పకొండ ప్రభలకంటే ఉన్నతమైన ప్రతిభకలిగిన కోలవెన్నువారి పెన్నుతో శ్రీకారం చుట్టబడిన మన పత్రికా రంగం; రాతినేలలో సైతం రాజనాలు పండించిన నాగార్జున సాగర్ జలాలకు మల్లే పరవళ్లు తొక్కుతూ ప్రజాహృదయ క్షేత్రాల్లో ఇప్పటికీ సాహిత్య సస్యసంపదను సృష్టిస్తూనేవుంది!

# సంక్షేమ పథకాలు




## డా॥ సానికొమ్ము నరసింహారెడ్డి

ఎకనమిక్స్ లెక్చరర్


నరసరావుపేట మునిసిపాలిటి క్రమముగా అభివృద్ధి చెందుతూ 1980 సంవత్సరంలో మొట్టమొదటి శ్రేణి మునిసిపాలిటీగా పేరుపొందినది. ప్రస్తుత మునిసిపల్ చైర్‌పర్సన్ నాగసరపు సుబ్బరాయగుప్తాగారు ఎన్నో సంక్షేమ పథకాలను అమలుచేస్తున్నారు. మన ప్రధానమంత్రి గారు ప్రతిష్ఠాత్మకముగా ప్రవేశపెట్టిన స్వచ్ఛభారత్ కార్యక్రమములో భాగంగా ప్రతిఒక్క వార్డుకు నగరదీపికలను ఎంపికచేసి తడిచెత్తను, పొడిచెత్తను సేకరించి పరిశుభ్రతకు మారుపేరుగా పట్టణాన్ని తీర్చిదిద్దుతున్నారు.

మన మునిసిపాలిటీ ప్రస్తుతకాలములో వాతావరణ పరిస్థితులలో వచ్చిన మార్పుల వలన సంభవించిన అనేక విషరోగాలకు ఒకే వ్యాక్సిన్‌ను ప్రజలకు అందుబాటులోనికి తెచ్చినది. ఎన్.టి.ఆర్. భరోసా పథకము క్రింద రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన వితంతు వృద్ధాప్య పెన్షనుపథకం, వికలాంగుల పెన్షనులను క్రమం తప్పకుండా ప్రతినెల 5వ తేదీలోపు ప్రజలకు పంపిణీ చేస్తున్నది. ప్రధానమంత్రి ప్రవేశపెట్టిన మిషన్ ఆకర్షణ పథకములో మన నరసరావుపేట పట్టణము ఎంపిక కావడము ఆనందదాయకము.

వెనుకబడిన ఎస్.సి., ఎస్.టి., బి.సి కులాలవారికి కార్పొరేషన్ రుణాలను సక్రమంగా పంపిణీ చేయడములో నరసరావుపేట పురపాలకసంఘం స్ఫూర్తిదాయకముగా నిలిచింది. ఈ పథకాల వల్ల వితంతువులు 2,085 మంది, వృద్ధులు 3,376 మంది, వికలాంగులు 801 మంది, చేనేతపనివారు, అభయహస్తం పథకం క్రింద 83 మంది లబ్ధి పొందుతున్నారు.

నరసరావుపేట పురపాలక సంఘములో మొత్తం 45 మురికివాడలు కలవు. అందులో నిరుపేద మహిళల్లో 1,408 స్వయంసహాయక సంఘాలు, 21 వికలాంగుల స్వయంసహాయక సంఘాలు ఏర్పడ్డాయి. మొత్తము 65 స్లమ్‌స్థాయి సంఘాలు ఏర్పాటైనవి. రెండు పట్టణ సమాఖ్య సంఘాలు కూడా ఏర్పడ్డాయి. ఇప్పటి వరకు 1,306 సంఘాలలోని 13,000 పై చిలుకు మహిళలకు బ్యాంకుల ద్వారా ఋణాలు మంజూరు చేయడము జరిగింది. ఇది వారి జీవనోపాధికి ఎంతో ఉపయోగకరముగా ఉంది.

# ఎన్.సి.సి., ఎ.సి.సి....




కెప్టెన్ బోయిన శ్రీ రామ కృష్ణం రాజు

ఎన్.సి.సి. ఆఫీసర్


దేశ పౌరులను మంచి క్రమశిక్షణ కలిగిన దేశభక్తి పరులుగా తీర్చిదిద్దాలనే సంకల్పంతో ఎన్.సి.సి. & ఎ.సి.సి. సంస్థలు స్థాపించబడినవి. కళాశాలల్లో ఎన్.సి.సి. ఉండేది. హైస్కూళ్లలో ఎన్.సి.సి. & ఎ.సి.సి. ఉండేవి. మన నరసరావు పేట ఎస్.ఎస్. & ఎన్. కాలేజీలో మొదట పి.వి. రమణారెడ్డి, లక్ష్మణస్వామి, మధురప్రసాద్, మాధవరావు, బలరామిరెడ్డి, జుజ్జూరి వేంకటేశ్వరరావు, జి.ఎస్.ఆర్. శర్మ, బాలకృష్ణారావు, కళ్యాణం కృష్ణమూర్తి, బ్రహ్మయ్య, ఎం.ఆర్.కె. మూర్తిగార్లు



మేజర్ ఎమ్.ఆర్.కె.మూర్తి

ఎన్.సి.సి. ఆఫీసర్లుగా ఉండి ఖ్యాతిగడించారు. మేజర్ కె.పి.ఎన్. రెడ్డిగారి పర్యవేక్షణ లో మన నరసరావుపేట పేరు గడించింది. సుబేదార్ మేజర్ రామస్వామి, జోసేఫ్, జి. వేంకటేశ్వర్లు సుప్రసిద్ధులు, అంకిత భావంతో పనిచేసిన అగ్రేసరులు. 1963లో నరసరావు పేటలోని రాజావారికోటలో 23వ ఆంధ్రా బెటాలియన్ ఎన్.సి.సి. ఆఫీస్ ఉండేది. మునిసిపల్ హైస్కూలులో గంగ్రకోట హనుమంతరావుగారు ఎన్.సి.సి. బాయ్స్‌వింగ్‌కు, కృపమ్మగారు, సుజనమ్మగారు గరల్స్‌వింగ్‌కు, పొత్తూరి రామకోటిగారు ఎ.సి.సి. బాయ్స్‌వింగ్‌కు, అప్పారావుగారు ఎన్.డి.ఎస్.కు ఆఫీసర్లుగాఉ ండి సంస్థలను చక్కని క్రమ శిక్షణతో నడిపారు.

శ్రీమతి కాసు రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి కళాశాలలో ఎం. కబ్బిరెడ్డిగారు ఎన్.సి.సి. ఆఫీసరుగా వ్యవహరించారు. కెప్టెన్ బి.ఎస్.ఆర్.కె. రాజు ఎస్.ఎస్. & ఎన్. కాలేజీ నుండి ఇంతవరకు 13 మందిని ఆర్.డి.సి.కి పంపారు. ఇది అభినం దించదగిన విషయం. 1962-'63లో రామసుబ్బారెడ్డిగారు, 1968-'69లో జగన్నాథంగారు ఆర్.డి.సి.కి వెళ్లారు.

ఎస్.కె.ఆర్.బి.ఆర్. కాలేజీలో వై. అంజిరెడ్డిగారు, పి.ఎన్.సి. & కె.ఆర్. డిగ్రీకాలేజీలో గంగవరపు వేంకటేశ్వర రావుగారు, ఎన్.బి.టి. &ఎన్.వి.సి. డిగ్రీ కాలేజీలో కోటేశ్వర రావుగారు ఎన్.సి.సి. ఆఫీసర్లుగా పనిచేస్తున్నారు.

ప్రస్తుతం మన నరసరావుపేట పట్టణమునందు ముగ్గురు సీనియర్, ఇద్దరు జూనియర్స్‌తో 23 (ఆంధ్ర) బెటాలియన్ ఎన్.సి.సి. చీరాల, గుంటూరు గ్రూప్‌లో పనిచేస్తున్నాయి. స్థానిక ఎస్.ఎస్.& ఎన్. కళాశాలలోని ఎన్.సి.సి. 200 మంది కాడెట్స్‌తో అతిపెద్ద కంపెనీగా రాణిస్తున్నది. పి.ఎన్.సి. & కె.ఆర్. డిగ్రీ కళాశాలలో 150 మంది, ఎస్.కె.ఆర్.బి.ఆర్. డిగ్రీ కళాశాలలో 150 మంది ఎన్.సి.సి. కాడెట్స్ ఉన్నారు. మునిసిపల్ హైస్కూల్‌లో చీఫ్ ఆఫీసర్ శ్రీరాములు ఆధ్వర్యంలో జూనియర్ వింగ్‌లో 100 మంది, జడ్.పి.హెచ్.ఎస్. శంకరభారతీపురం హైస్కూల్ సిహెచ్. శ్రీనివాసరెడ్డి ఆధ్వర్యంలో 100 మంది క్యాడెట్స్ వున్నారు. దేశరక్షణ కొరకు, సమాజశ్రేయస్సు కొరకు కావలసిన భావిభారత పౌరులను తయారుచేస్తున్న ఘనత మన ఎన్.సి. సి. ఆఫీసర్స్‌కు దక్కుతుంది.

స్వచ్ఛభారత్, పచ్చదనం - పరిశుభ్రత, రక్తదానం, మొక్కలు నాటుట, ట్రాఫిక్‌లో పోలీసువారికి సహకరించుట, తుఫాన్, భూకంపాలు, కరవు కాటకాలు మొదలైన విపత్కర పరిస్థితులలో ప్రజలను ఆదుకొనుటలో ప్రముఖపాత్రను పోషిస్తున్న మన ఎన్.సి.సి. క్యాడెట్స్ అభినందనీయులు.





ఎస్.ఎస్. & ఎన్. కళాశాల నుండి 2008 సం॥లో రెనాల్డ్ అనే ఎన్.సి.సి. క్యాడెట్ రిపబ్లిక్‌డే పెరేడ్‌లో పాల్గొన్నాడు. యూత్ ఎక్స్ఛేంజ్ ప్రోగ్రాం (వై.ఇ.పి.) క్యాంప్‌కి 'ఖజికిస్తాన్' దేశం వెళ్లిన మొట్టమొదటి జిల్లాక్యాడెట్ ఇతడు. 2010 సం॥లో జరిగిన రిపబ్లిక్ డే క్యాంప్‌లో దారా నాగార్జున, 2010 అంతర్ సైనిక్ క్యాంపునందు (టి.ఎస్.సి.) రవికుమార్ ఆప్టికల్ విభాగంలో బంగారు పతకం కైవసం చేసుకొన్నాడు. అదే సంవత్సరంలో కె. రాఘవేంద్ర కులుమనాలిలో జరిగిన మౌంటనీరింగ్ క్యాంపులో గోల్డ్‌మెడల్‌ను పొందాడు. 2011 సం॥ తన్నీరు శ్రీనివాసరావు రిపబ్లిక్ డే క్యాంప్‌లో పాల్గొని, ప్రస్తుతం ఇండియన్ ఆర్మీలో పనిచేస్తున్నారు. 2011 సం॥లో సిహెచ్. అనిల్‌కుమార్ రిపబ్లిక్ డే పెరేడ్ క్యాంప్‌లో పాల్గొన్నాడు. 2012 సం॥లో మంచాల శ్రీనివాసరావు రిపబ్లిక్ డే పెరేడ్‌లో పాల్గొన్నాడు. 2013 సం॥లో ఒకేసారి నలుగురు ఎన్.సి.సి. క్యాడెట్స్ రిపబ్లిక్ డే పెరేడ్‌లో పాల్గొనడం మన పట్టణానికి గర్వకారణం. ఎస్. అశోక్‌వర్ధన్, పి. కృష్ణ, వి. శ్యామ్, జె. శ్రీనివాసరాజులు 2014 సం॥ ఎన్.సి.సి. విభాగంలో దేశ వ్యాప్తంగా నిర్వహించిన స్పోర్ట్స్ గేమ్స్‌లో పాల్గొన్నారు. కొల్లి నాగమణి కబడ్డీక్రీడలో ఆంధ్రప్రదేశ్ డైరెక్టరేట్ తరపున పాల్గొన్నారు. 2015 సం॥లో జరిగిన రిపబ్లిక్ డే పెరేడ్‌లో పోలూరి సూర్యమణికంఠ డ్రిల్‌నందు మ్యూజికల్ ఇన్‌స్ట్రుమెంట్ వాయించాడు. ఇలా మన పట్టణ కళాశాలల యందున్న ఎన్. సి.సి. కాడెట్స్ పట్టణ పేరు ప్రతిష్ఠలను నలుదిశల వ్యాపింపచేస్తున్నారు.

ఎన్.సి.సి. ఆఫీసర్స్ ఉత్తమ ఎన్.సి.సి. ఆఫీసర్స్‌గానూ, ఉత్తమ సమాజసేవ అవార్డు గ్రహీతలుగానూ ఎంపికై పట్టణానికి, కళాశాలలకు పేరు ప్రఖ్యాతులను సాధిస్తున్నారు. •

# ప్రగతి పథంలో



గాలి సుబ్బారావు
ప్రిన్సిపాల్ (రిటైర్డ్)

నాకు తెలిసిన నరసరావుపేట చాలా చిన్నది. 1963 నుండి మధ్యలో రెండు సంవత్సరాలు తప్ప నేను ఇక్కడే ఉంటున్నాను. ఆనాటి నరసరావుపేట జనాభా 50,000 లోపే. నేటి పట్టణజనాభా 1,17,489. ప్రస్తుతమున్న చంద్రబాబు నాయుడు కాలనీ, బి.సి. కాలనీ, వెంకటరెడ్డినగర్, శివ సంజీవయ్య కాలనీ, ఎస్.ఆర్.కె.టి. కాలనీ, ఎన్.జీ.ఓ. కాలనీ, పెద్దచెరువు, కాకతీయనగర్, నవోదయనగర్, ప్రశాంతినగర్, బ్యాంక్‌కాలనీ, బాపనయ్యనగర్, శ్రీనివాసనగర్ మొదలైనవి ఆనాడు లేవు.

డాక్టర్ కోడెలశివప్రసాద్‌గారు కోటప్పకొండ అభివృద్ధికి విశేషకృషి చేసి ఘాట్‌రోడ్ నిర్మాణం గావించారు. సుమారు 20 కోట్ల వ్యయంతో మంచి శైవక్షేత్రంగానే కాకుండా, ప్రసిద్ధ పర్యాటక కేంద్రంగా చేయాలనేది వారి తపన. నరసరావుపేటలో ఆరోజు స్టేషన్ రోడ్డు ఒక్కటే సిమెంటు రోడ్డు. ప్రస్తుతం నరసరావుపేటలో సిమెంటురోడ్డు లేని బజారు లేదంటే ఆశ్చర్యం లేదు. శృంగేరి శారదాపీఠాధిపతులు శ్రీభారతీ తీర్థులవారి ఆశీస్సులతో ఈ పట్టణానికి శృంగేరి శంకరమఠం వచ్చింది. నకరికల్లు దగ్గర ట్యాంక్ నిర్మించి గ్రావిటీ మీద వాటర్ సప్లై కల్పించటం నరసరావుపేట చరిత్రలో అపూర్వమైన ఘట్టం. ప్రకాష్‌నగర్‌లో 'భువనచంద్ర' టౌన్‌హాల్‌ను నిర్మించటం, అందులో నెలకు ఒకటి, రెండు సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించటం కోడెలవారి కళాభిమానానికి నిదర్శనం.

శివప్రసాద్‌గారు సత్తెనపల్లిరోడ్‌లో స్టేడియం నిర్మించారు. ఇండోర్ గేమ్స్, ఆటలకు సౌకర్యాన్ని ఏర్పాటు చేశారు. పట్టణంలోని వల్లప్ప చెరువు, కత్తువ చెరువులను పూడిక తీయించి, లోతుచేశారు. దీనివల్ల చెరువుల్లో నీరు ఎక్కువగా నిలువవుండి రైతులకు ఉపయోగపడటమే కాకుండా పట్టణంలో కొన్ని ప్రాంతలలో భూగర్భ జలాలు పెరుగుతున్నాయి. కోడెల హయాంలో ఒకటి, కాసు కృష్ణారెడ్డిగారి హయాంలో మరొకటి ఓవర్‌బ్రిడ్జిల నిర్మాణం జరిగింది. ప్రకాష్‌నగర్ రైల్వేగేటు వల్ల ప్రజలకు ఇబ్బందులు కలుగుతున్నాయి. ఈ విషయాన్ని గమనించిన డాక్టర్‌గారు స్థానిక ఎం.పి. రాయపాటి సాంబశివరావుగారిని సంప్రదించి కొంత సెంట్రల్‌ఫండ్‌తోనూ, కొంత మునిసిపాలిటీ ఫండ్ తోనూ రైల్వే అండర్‌బ్రిడ్జి నిర్మాణము కావించే పనిలోవున్నారు.

నరసరావుపేటలో అనేక కళాశాలలు, పాఠశాలలు నూతనంగా వెలిశాయి. ఎనిమిది ఇంజనీరింగ్ కళాశాలల ఉన్నాయి. మంచి వైద్యాలయాలకు కూడా నిలయం నరసరావుపేట. డాక్టర్‌గారు మన ప్రభుత్వ ఆసుపత్రిని 300 పడకల ఆసుపత్రిగా మార్చే సంకల్పంతో ఉన్నారు. దీనితో పాటు మనఊరిలో దాదాపు 65 ప్రైవేటు ఆసుపత్రులున్నాయి.

మన ముఖ్యమంత్రిగారు మన స్పీకర్ గారైన కోడెల వారిని స్వచ్ఛఆంధ్రప్రదేశ్ కన్వీనర్‌గా నియమించటం ముదావహం. పట్టణంలోని అండర్‌గ్రౌండ్ డ్రైనేజి పనుల సెకండ్ ఫేజ్‌ను ప్రారంభించి పూర్తిచేయటానికి డాక్టర్‌గారు సన్నాహాలు చేస్తున్నారు. పరిశుభ్రతలో నరసరావుపేట పట్టణం జిల్లా, రాష్ట్ర, దేశస్థాయిలలో మంచిపేరు తెచ్చుకోవటం మన మునిసిపాలిటి ఉత్తమ పనితీరుకు నిదర్శనం. ప్రస్తుతం కోట్ల రూపాయలతో అన్నిమతాల శ్మశానవాటికల అభివృద్ధి జరుగుతున్నది.

కేంద్రప్రభుత్వంవారు ప్రకటించిన అమృత పట్టణములలో మన నరసరావుపేటకూడా ఉన్నది. దీని వలన కోట్ల రూపాయల ఫండుతో నరసరావుపేట అభివృద్ధిపథంలో నడవబోతున్నది. ●

# దాన వీరులు



## మురారిశెట్టి గోపాలబాబు

ధర్మకర్త, షిర్డిసాయి మందిరం

నరసరావుపేట దానకర్ణులలో ప్రథమంగా స్మరించు కోవలసిన మహనీయులు నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారు. వీరు 1946 సం॥లో పాతూరి శివాలయం వద్ద బావిని నిర్మించారు. అదే నాగసరపువారి బావి. అదే సంవత్సరం అపరకర్మలు నిర్వహించు కొనేందుకు సత్రం నిర్మించారు. 1946లో గడియారం స్తంభం సెంటరులో మంచినీటి చలి వేంద్రం ఏర్పాటు చేశారు. 1950వ సం॥లో ఇతర మిత్రులు, ప్రముఖుల సహాయ సహకారంతో శ్రీసుబ్బరాయ & నారా యణ కళాశాలను స్థాపించారు. ఈ కళాశాలకు 4 ఎకరాల స్థలం, రూ. 1,10,000/- నగదు ఇచ్చారు. సుబ్బరాయ శ్రేష్ఠిగారు ప్రభుత్వ ఆసుపత్రిలో ప్రసూతి కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. వీరు కోటప్పకొండకు వెళ్లే వారి సౌకర్యార్థం ఒక ఎకరం స్థలంలో కుంటను ఏర్పాటు చేశారు. వీరి మనుమడు నాగసరపు సుబ్బరాయగుప్తాగారు హిందూ శ్మశానవాటికల సుందరీ కరణకు 10 లక్షల రూ॥ల విలువగల స్వర్ణరథం ఇస్తున్నారు.

శ్రీతాడేపల్లి వేంకటనారాయణశ్రేష్ఠిగారు రూ. 50,000/- వితరణజేసి, సుబ్బరాయశ్రేష్ఠిగారితో కలిసి ఎస్.ఎస్. & ఎన్. కళాశాల స్థాపనలో ప్రముఖపాత్ర వహించారు. వీరు సత్తెనపల్లిరోడ్‌లో 1951వ సం॥లో శ్రీ తాడేపల్లి వేంకటనారాయణ వైశ్యవిద్యార్థి నిలయాన్ని నిర్మించారు.



తాడేపల్లి నారాయణ

1934వ సం॥లో కూనిశెట్టి లక్ష్మయ్య, కోటమ్మ దంపతులు సత్తెనపల్లిరోడ్‌లో పేదబ్రాహ్మణ, వైశ్యుల వసతి కోసం 18 గదులతో సత్రం నిర్మించారు. అదే కూనిశెట్టి వారి సత్రం!

1935 సం॥లో కాకుమాను హనుమయ్యగారు పల్నాడు రోడ్‌లోని ప్రభుత్వ ఆసుపత్రికి దగ్గరగా 40 సెంట్ల స్థలంలో 9 గదులతో ప్రభుత్వాసుపత్రి రోగుల సహాయకుల వసతి సౌకర్యార్థం 9 గదులతో వీరాంజనేయసత్రంను నిర్మించారు. వీరు ఎల్లప్పుడు శాంతంగా ఉండటం జూచి వీరిని ఆ రోజులలో అందరు శాంతయ్యగారు అని, వీరు నిర్మించిన సత్రమును శాంతయ్యగారి సత్రం అని పిలిచేవారు.

శ్రీ స్వర్ణ రామిరెడ్డి గారు 1940 ప్రాంతాల్లో మునిసి పల్ కౌన్సిలర్‌గా ఉంటూ బరంపేట లో రోడ్డు నిర్మాణం కోసం తన సొంత స్థలాన్ని మునిసిపాలిటికి అర్పించారు. 1936లో వచ్చిన పెనుతుఫానుకు నిరాశ్రయులైన వారికి తమ ఫ్యాక్టరీలో ఆశ్రయం కల్పించి ఆదుకొన్నారు. జానపహాడ్ సైదులు దర్గాకు 10 సెంట్లు స్థలాన్ని దానం చేశారు.



స్వర్ణ రామిరెడ్డి

శ్రీకపలవాయి మల్లయ్యగారు మండవ వేంకటరెడ్డి శ్రేష్ఠిగారి సహకారంతో 1910వ సం॥లో పనసతోటలో బావి త్రవ్వించారు. ఆ రోజులలో ఆ సమీప ప్రాంత ప్రజలకు ఈ బావి ఎంతో ఉపయోగకరంగా ఉండేది. మల్లయ్యగారి కుమా రులు కపలవాయి కాశీరామారావుగారు ఎన్నో దానాలు చేశారు. కాశీరామారావుగారి కుమారులైన విజయ కుమార్ గారు సత్తెనపల్లి రోడ్‌లోని వాసవి ఆర్య వైశ్య వానప్రస్థాశ్రమ నిర్మాణం నిమిత్తం రూ॥15లక్షలు, భూరివి రాళం ప్రకటిం చారు. గడియారం స్తంభం వద్ద గల మసీదు నిర్మాణానికి రూ. 1,50,000/- ఆర్థిక సహాయము అందించారు.

శ్రీకపలవాయి కాశీరామారావుగారి మూడవ కుమా రుడు శ్రీకపలవాయి రమేష్ చంద్రదత్తుగారు 1997వ సం॥లో

సత్తెనపల్లిరోడ్‌లోని వాసవీ ఆరామక్షేత్ర నిర్మాణమునకు ఆర్థిక సహాయం అందించినారు. 1995వ సం॥లో కోటప్పకొండ లోని ఆర్యవైశ్య అన్నదాన సత్రంలోని భోజనశాలను పునర్ని ర్మించారు. 2001 సం॥లో సత్తెనపల్లిరోడ్‌లోని అయ్యప్పస్వామి దేవస్థానంలో కూడా భోజనశాల నిర్మించారు. వినుకొండ రోడ్‌లో అత్యంత విలువైన స్థలాన్ని ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీకి వితరణ చేశారు. 2014 సంవత్సరంలో రోటరీ ఇంటర్ నేషనల్‌వారికి నరసరావుపేట రోటరీ కమ్యూ నిటీ హాల్ నిర్మాణ నిమిత్తం ఉచితంగా స్థలం ఇచ్చారు.

డా॥ ముండ్రు వరదరాజులుగారు వారి కుమార్తె స్మృతులకు గుర్తింపుగా రామిరెడ్డిపేటలో 'డా॥ ముండ్రు వకుళ మాధవి వృద్ధమందిరం' ఏర్పాటు చేసినారు. రావిపాడు రోడ్‌లోని శ్రీసత్యనారాయణస్వామి మందిరంలో కళ్యాణ మండపము మరియు 4 గదులు నిర్మించారు.

1983వ సం॥లో శ్రీవంకాయల మల్లయ్యగారు బరంపేటలోని సరస్వతీ శిశుమందిర్ పాఠశాల నిర్మాణానికి కావలసిన 1.5 ఎకరాల అత్యంత విలువైన భూమిని దానంగా ఇచ్చారు. శ్రీమిరియాల నాగప్రసాదు, శ్రీగుండా సాంబశివ రావు, శ్రీమిట్టపల్లి చంద్రమోహన్, శ్రీచిలకల శ్రీరామమూర్తి, శ్రీకాకుమాను వేంకట బదరీనారాయణ, శ్రీనాగసరపు రామారావు తదితర పెద్దలు పాఠశాల గదులను నిర్మిం చారు.

శ్రీమాజేటి సాంబశివ రావుగారు కోట్ల రూపాయల విలువ కలిగిన 2 ఎకరాల స్థలంను 102 మంది పేద ఆర్య వైశ్యులకు సొంత ఇళ్లు నిర్మాణం చేసుకొనే సత్సంకల్పం తో 'మాజేటి సాంబశివరావు, రాజ్యలక్ష్మి ఆర్యవైశ్య నగర్ - వాసవీ బృందావనం'గా నామకరణం జేసి ఉచితంగా ఇచ్చారు. చీతి రాల గురుపెద్దన్న, ఆత్మకూరి రాజేంద్రప్రసాదు, కూకుట్ల కృష్ణారావు, గొడవర్తి చంద్రశేఖర్‌గార్లు సత్తెనపల్లిరోడ్డులో కాళికా మాత ఆలయ సమీపంలో 42 సెంట్ల స్థలం ఆర్యవైశ్య వాన ప్రస్థాశ్రమానికి దానంగా ఇచ్చారు.

కాకుమాను గోవిందమ్మ, కాకుమాను వీరాంజనే యులు, శిఖాకొల్లి సుబ్బారావు, అర్వపల్లి ఆంజనేయులు, గ్రంధి శాంతారావు, అయినవోలు రాధాకృష్ణమూర్తి, గోనుగుంట్ల హనుమంతరావుగారి జ్ఞాపకార్థం జోగేశ్వరమ్మ, కన్యకాపరమే శ్వరి రైస్‌డాల్‌మిల్‌వారు బొలిశెట్టి రామమోహనరావుగారి ఆధ్వర్యంలో సిద్ధార్థ స్కూల్ తరగతిగదుల నిర్మాణం నిమిత్తం ఆర్థిక సహాయం అందించారు. శ్రీ మిట్టపల్లి వేంకటకోటేశ్వర రావుగారు హిందూ శ్మశానవాటిక సుందరీకరణ నిమిత్తం రూ. 15 లక్షల రూపాయలు, మార్చురి బాక్సు విరాళంగా ప్రకటించియున్నారు.

శ్రీ ఈదర రామకోటయ్యగారు 2002వ సం॥లో ఒక ఎకరం పొలంలో సుమారు 10 లక్షల రూ॥ల ఖర్చుతో ఒక హాలు, 6 గదులు నిర్మించి 'గాంధీవనము'గా నామకరణం చేసి 15 మంది పేదవిద్యార్థులకు కుల, మత, వర్గాలకు అతీతంగా వసతి సౌకర్యం ఏర్పాటు చేశారు. గాంధీవనానికి ఎదురుగా రూ॥ 30,000/- వ్యయంతో ఒక బస్‌షెల్టర్ కూడా ఏర్పాటుచేసి యున్నారు.

శ్రీపచ్చిపులుసు విజయసారథిగారు సత్తెనపల్లి రోడ్‌లో వాసవి ఆరామక్షేత్ర నిర్మాణానికి ఆర్థికసహాయం అందించారు. అందులోని గదులకు శ్రీచేబ్రోలుకోటయ్య, బత్తుల లక్ష్మీనారా యణ, అనుమోలు వేంకటేశ్వర్లు, జూలకంటి కాశీవిశ్వనాథం, కొత్త గురవయ్య, సముద్రాల సోమశేఖరరావు, తవ్వా గుర వయ్య, పి.జె. నరసింహారావు, కొత్తూరి నాగేశ్వరరావు, గొడవర్తి వేంకటఅప్పారావు తదితరులు ఆర్థికసహాయం అందించారు.

2003వ సం॥లో శ్రీభాగవతుల లక్ష్మీనారాయణ గారు వారి తల్లిగారైన శ్రీమతి నరసమ్మగారి జ్ఞాపకార్థం 'ద్వారకామాయి అమ్మఒడి' అను సేవాసంస్థను స్థాపించినారు. వీరు 150 ట్రై సైకిల్సును వికలాంగులకు ఉచితంగా అందించి నారు. 1900 సం॥ ప్రాంతంలో లాల్‌బహదూర్ కూరగాయల మార్కెట్‌వద్ద నిర్మింపబడిన పిల్లి నాగన్నసత్రం కాలాంతరంలో శ్రీరామాంజనేయ దేవస్థానంగా మార్పుచెందినది.

కాకుమాను ఫౌండేషన్‌వారు, ఇంకా పట్టణ ప్రముఖు లనేకులు తమ సంస్థల ద్వారా పట్టణంలోని పేద, బడుగు, బలహీనవర్గాల అభ్యున్నతికి తమ వంతు ఆర్థికసహాయ సహకారాలను అందిస్తూ ప్రజల మన్ననలను పొందుతూ నరసరావుపేట కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేస్తున్నారు. ఆ దానకర్ణుల కందరికీ వందనాలు!!

# సాంఘికోద్యమాలు



**ఈదర గోపీచంద్,** విశ్రాంత బీమారంగ ఉద్యోగస్థులు

కళ, రాజకీయాలలో లాగానే సాంఘిక ఉద్యమ రంగంలో సైతం మన నరసరావుపేట రాష్ట్రస్థాయిలోనూ, జాతీయస్థాయిలోనూ ప్రసిద్ధిని గాంచింది.

ఈ వ్యాసకర్త 1975లో మన నరసరావుపేటలోని బాలయ్యనగర్, వడ్డెరపాలెం, బాపనయ్యనగర్, లింగంగుంట్ల, అల్లూరివారిపాలెంలలో వయోజన విద్యాకేంద్రాలను స్థాపించి, అనేకమంది వయోజనులను విద్యావంతులను చేశారు. 'చదువుకుందాం రా!' మాసపత్రికను ప్రారంభించి ఈ ఉద్య మానికి బలాన్ని చేకూర్చారు. 'అక్షరదీప్తి' వాచకాలను ఎడిట్ చేశారు. ఈ వాచకాల వలన ఆరు లక్షలమంది వయోజనులు చదువరులైనారు.

మన పట్టణంలో ఉన్న గాంధీస్మారకసమితి గాంధీ తత్త్వానికి సంబంధించిన పుస్తకాల ప్రచురణ, వ్యాసరచన, వక్తృత్వపు పోటీలను నిర్వహించింది. ఈ కృషిని గుర్తించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఈ వ్యాసకర్తకు 2012 కీర్తిపురస్కారాన్ని ఇచ్చి గౌరవించింది.

1986 అక్టోబర్ 2వ తేదీన మన రామిరెడ్డిపేటలోని బాపూబాలవిహార్‌లో అశ్లీల ప్రతిఘటనా ఉద్యమసంస్థ ప్రారంభమైంది. ఈ సంస్థ మద్యనిషేధ ఉద్యమాన్ని చేపట్టింది. దీనితోబాటుగా అశ్లీలంగా ఉన్న సినిమా పోస్టర్లు, వీడియో ప్రసారాలు, పత్రిక- సినీయాడ్స్, కోటప్పకొండ తిరునాళ్ల ప్రభలమీది అశ్లీలనృత్యాలు మొదలైనవాటికి వ్యతిరేకంగా గొప్పఉద్యమాన్ని నడిపి, విజయాన్నిసాధించింది. డా॥ బొప్పన పూర్ణచంద్రరావు, ఈదర రామకోటయ్య, ఆళ్ల సుబ్బారెడ్డి, పెద్ది సాంబశివరావు ఈ ఉద్యమంలో ప్రధాన కార్యకర్తలుగా విశేషమైన కృషిచేశారు. 1989 ఫిబ్రవరి 2న విజయవాడలో ఏర్పాటైన రాష్ట్రస్థాయి కమిటీ ఈ వ్యాసకర్తను కార్యదర్శిగా ఎన్నుకొన్నది.

2004లో ఒక ప్రేమోన్మాది ఒక విద్యార్థినిని హత్య చేసిన సంఘటనకు చలించిపోయిన గోపీచంద్ జిల్లావ్యాప్తంగా అనేకానేక యాంటీర్యాగింగ్ సదస్సులను నిర్వహించారు. విద్యార్థినీ విద్యార్థులను చైతన్యవంతులను చేశారు.

1979 మేనెలలో ఎస్.వి.రావు అధ్యక్షులుగా, సయ్యద్ నశీర్అహమ్మద్ కార్యదర్శిగా నరసరావుపేట హేతువాద సంఘం ఏర్పడ్డది. ఈ సంఘం తరఫున 'హేతువాది' పత్రిక ఆరు సంవత్సరాలపాటు గొప్ప సర్క్యులేషన్‌తో నడిచింది. అనతికాలంలోనే ఇది రాష్ట్రహేతువాదసంఘంగా రూపుదిద్దు కొన్నది.

1991లో డా॥ ముక్కామల ఉమామహేశ్వరరావు మద్యనిషేధ ఉద్యమాన్ని చేపట్టి మన పట్టణంలోని వీధి వీధికి, గ్రామగ్రామాలకు తిరిగి మద్యపానం వలన జరిగే అనర్థాలను ప్రచారం చేశారు. అనేక కరపత్రాలనూ, పుస్తకాలనూ ప్రచు రించారు. మద్యపానానికి వ్యతిరేకంగా ధర్నాలు చేశారు.

'రావుత్రయం'గా పేరుపొందిన ఎస్.వి. రావు, డా॥ ముక్కామల ఉమామహేశ్వరరావు, తోటకూర వేంకటేశ్వర రావు, వీరితోబాటుగా వై. చెంచయ్య, సిహెచ్.ఎల్. కాంతా రావు, గన్నమనేని లింగయ్య, నాగశిరోమణి, బి.వి.ఆర్. పూర్ణానందం, డి. హరగోపాల్, కొప్పరపు సత్యనారాయణ మొదలైనవారు ఈ ఉద్యమానికి వెన్నుబలంగా ఉండి కార్య కర్తలను ఉత్సాహపరచి, వారిని ఉద్యమమార్గంలో నడిపారు.

ఈ కార్యకర్త లందరూ వ్యక్తిత్వ వికాసం, నైతికపు విలువలు, దేశభక్తి మొదలైన అంశాలకు సంబంధించిన వంద లాది సూక్తులను మనపట్టణంలో ప్రధానంగా కనిపించే గోడల మీద అందంగా వ్రాయించి, పట్టణ సుందరీకరణలోనూ పాలు పంచుకొన్నారు.

గాంధీమహాత్ముని 18 అంశాల కార్యక్రమంలో ఒకటైన ఆరోగ్యనియమావళి శిక్షణను గురించి మన నరస రావుపేటలో జరుగుతున్న కృషి అభినందించదగ్గది.

సాంఘికోద్యమ రంగంలో ఇంతటి ఘనచరిత్ర కలిగిన మన నరసరావుపేటకు చెందిన ప్రతి పౌరుడు ఈ ఉద్యమాల స్ఫూర్తితో ముందుకు సాగుతూ మన పట్టణాన్ని అదర్శపట్టణంగా తీర్చిదిద్దాలని కోరుతున్నాను. •

# సేవా భాగ్యం



## డా॥ రత్నాకరం రాము

లయన్స్ డిస్ట్రిక్ట్ చైర్మన్

సేవాభావాన్ని పెంచుకొన్న ఎందరో మహనీయులు వారి జన్మలను సార్థకం చేసుకుంటారు. అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన సేవాసంస్థలు లయన్స్‌క్లబ్, రోటరీక్లబ్, ఇన్నర్‌వీల్ రోటరాక్ట్ రెడ్‌క్రాస్ మొదలైనవి మన నరసరావుపేటలో పలు విధాల సేవలను అందిస్తున్నాయి. లయన్స్ క్లబ్ ఆఫ్ నరసరావుపేట 1966లో ప్రారంభమైంది. క్లబ్బు నుండి అనేకమంది జోన్, రీజియన్ పదవులను అలంకరించారు. లయన్స్ క్లబ్బు అనేక శుక్ల శస్త్రచికిత్సా శిబిరాలు నిర్వహించింది. నరసరావుపేట నడిబొడ్డున శివుని విగ్రహాన్ని స్థాపించింది. అప్పటినుండి ఆ ప్రాంతం శివుడిబొమ్మ సెంటరైంది. ఇప్పుడు ఈ క్లబ్బు ఆధ్వర్యంలో 'ధర్మస్థలి'లో శివుని విగ్రహాన్ని నెలకొల్పుతున్నారు.

లయన్స్ క్లబ్

అంతర్జాతీయ రోటరీ క్లబ్బుకు అనుబంధంగా రోటరీ క్లబ్ ఆఫ్ నరసరావుపేట 48 సం॥ల నుండి సేవల నందిస్తున్నది. ప్రతి సంవత్సరం పల్స్‌పోలియో చుక్కలు వేసే కార్యక్రమాన్ని పలు సంవత్సరాలు నిర్వహించింది. క్లబ్ చరిత్రలో ప్రథమంగా కె.పి. రంగారావు రోటరీగవర్నరుగా ఎన్నికయ్యారు. పాఠశాలలకు బల్లలు, నీటినిల్వ ట్యాంకులు, మినరల్ ప్లాంట్లు అందజేస్తున్నది. అనేకమంది ప్రముఖ కవి పండితుల ప్రసంగాల నేర్పాటు చేస్తున్నది. యువజన మాసోత్సవాల్ని నిర్వహిస్తున్నది.

రోటరి క్లబ్

వాసవీ క్లబ్స్ ఇంటర్నేషనల్ శాఖ వాసవీక్లబ్ గ్రేటర్ నరసరావుపేట అనే పేరుతో 2005లో ప్రారంభమైనది. వాసవీ వనిత, వాసవీ మిత్రమండలి, వాసవీ యూత్‌క్లబ్‌లు సేవా కార్యక్రమాల్ని నిర్వహిస్తున్నాయి. పేదలకు వస్త్రాలు, నిత్యావసర సరుకులు పంపిణీ చేస్తున్నాయి. విద్యార్థులకు పుస్తకాలు ఆర్థికసహాయం, ఉపకారవేతనాలు అందిస్తున్నాయి. వాసవీ వనితా క్లబ్బు మహిళల ఆరోగ్య పరీక్షాశిబిరాలను స్వయంఉపాధి శిక్షణ కార్యక్రమాల్ని ప్రతి సంవత్సరం నిర్వహిస్తున్నది. 'నేస్తం' సంస్థకూడా సేవా కార్యక్రమాలను చురుగ్గా నిర్వహిస్తున్నది.

వాసవి క్లబ్

ఈ సందర్భంలో శ్రీ కోడెల సంజీవయ్య చారిటబుల్ ట్రస్ట్, డా॥ కోడెల సత్యనారాయణ చారిటబుల్ ట్రస్ట్, సురేష్ చారిటబుల్ ట్రస్ట్, డా॥ వకుళమాధవీ వృద్ధాశ్రమం, రుక్మిణీ స్త్రీసమాజం, అమ్మ ఒడి, ఆర్.టి. కృష్ణమాచారి చారిటబుల్ ట్రస్ట్ పేర్కొనదగినవి. ఈ సంస్థలు మంచినీటి సరఫరా, వైద్య శిబిరాల నిర్వహణ, పేదలకు అన్నదానం, ప్రత్యేక శిక్షణా కార్యక్రమాలు వంటివాటిని నిర్వహిస్తున్నాయి.



డా॥ కోడెల సత్యనారాయణ

కొన్ని సాంఘికసేవతోపాటు సాహిత్యసేవను, ధార్మిక సేవను నిర్వహిస్తున్నాయి. అర్వపల్లి పాండురంగారావు - రామ లక్ష్మమ్మ ఛారిటబుల్ ట్రస్ట్, శ్రీనాథ సాహితీపరిషత్ కొండ వీడు కళాభారతి మొ॥ సంస్థలు ఈ కోవలో చెప్పుకోదగినవి.



శ్రీ శారదా సత్సంగం - ఆధ్యాత్మిక సేవా సంస్థ

ఆర్యసమాజ్, ప్రజాపిత బ్రహ్మకుమారీ సమాజం, పరతత్త్వబోధినీ ధార్మిక సంస్థ, వేదధర్మాన్ని సమాజసేవను మిళితం చేసి ముందుకు సాగుతున్నాయి.

ఆధ్యాత్మిక సత్సంగాలు కొన్ని సమాజంలో మంచిని పెంచడానికి కృషిచేస్తున్నాయి. శ్రీశారదా సత్సంగం, గాయత్రీ పరివారక సత్సంగ్, శ్రీ రమణ సత్సంగం, సాయిసత్సంగ్ వంటివి చెప్పుకోదగినవి.

వేదసాహిత్యాన్ని, లౌకిక సాహిత్యాన్ని ప్రచారం చేస్తున్న సంస్థలు కొన్ని ఉన్నాయి. పులుపుల సత్యనారాయణ వేదధార్మికనిధి ప్రతిసంవత్సరం వేదపరీక్షలను, వేదవిదుల ప్రసంగాలను నిర్వహించి వేదపండిత సన్మానాలు చేస్తున్నది. వ్యాసపీఠం సంస్థ ధార్మికగ్రంథ ప్రచురణ కావిస్తున్నది.

నరసరావుపేట సాహితీసంస్థలలో ప్రపథమంగా పేర్కొనదగింది నవ్యకళా పరిషత్. ఆ తరువాత అభ్యుదయ భారతి, వికాసతరంగిణి, నరసరావుపేట ఆధ్యాత్మిక తరంగిణి, గాయత్రీపరివారక సత్సంగ్, పమిడి చారిటబుల్ ట్రస్ట్ మొ॥వి పేర్కొనదగినవి. శ్రీ రామరాజు చెన్నకేశవరావుగారు నెలకొల్పిన ట్రస్టు అనేక ఆధ్యాత్మిక గ్రంథాలను వెలువరిస్తున్నది. శ్రీ ఇ.ఆర్.కె. రావుగారు రసతరంగిణి సంస్థను స్థాపించి అనితరసాధ్యంగా అనేకానేక ప్రవచనాలను నిర్వహించారు.


ఇ.ఆర్.కె.రావు

నాయకుల పేరుతో గాంధీస్మారక సంస్థ, అమరజీవి పొట్టిశ్రీరాములు సేవాసమితి వంటి సంస్థలు వెలిసాయి. అవి గాంధీసిద్ధాంతాలను ప్రచారంచేస్తూ సమాజసేవ చేస్తున్నాయి. అశ్లీలతా ప్రతిఘటనా సంస్థ కూడా చక్కగా పనిచేస్తున్నది.

త్యాగరాజగానసభ, సద్గురు కళాసమితి, శ్రీ అన్నమయ్య సంగీత అకాడెమి (సాసా) మొదలైన సంస్థలు ప్రజలలో సంగీతాభిలాషను పెంపొందిస్తున్నాయి.

నరసరావుపేట రంగస్థలి, రంగస్థల కళాకారుల ఐక్యవేదిక నాటక ప్రదర్శనలతో పాటు, వృద్ధనాటక కళాకారులకు ఎంతగానో సహకరిస్తున్నాయి.

**తృప్తి**

ధనాన్ని ధర్మమార్గంలోనే సంపాదించాలి.
ఎంత ఎక్కువ సంపాదించటానికి అవకాశం ఉన్నదో అంత ఎక్కువ సంపాదించాలి.
ఆ వచ్చినదానితో తృప్తిపడాలి. ఆనందంగా జీవించాలి.
ఆ విధంగా తృప్తిపడని వాడిని సప్తద్వీపాలకు అధిపతిని చేసినప్పటికీ తృప్తిచెందడు.
ఆ తత్త్వం మంచిది కాదు.

- భాగవతం, అష్టమ స్కంధం



మల్లమ్మసెంటర్

# వైద్యో నారాయణో హరిః



డా॥ పోలేపెద్ది వేంకట హనుమచ్ఛాస్త్రి
విశ్రాంత చరిత్ర అధ్యాపకులు

మన నరసరావుపేట వైద్యరంగం ఆయుర్వేద వైద్య విధానంతో ప్రారంభమైంది. తొలితరం వారైన తంబళ్ల కోటయ్య, పసుపులేటి లక్ష్మయ్య, సీతారామయ్య, సంజీవరావు, మందుల సుబ్బయ్యగా ప్రసిద్ధి చెందిన సాతులూరి సుబ్బయ్య, పుల్లయ్య (వసంతరావు), యాయవరపు హనుమంతరావు, యద్దగుంటపాటి నరసింహారావు, కాకాని రామయ్య, ఇల పావులూరి వేంకటసుబ్బయ్య, పల్లె హనుమత్‌శాస్త్రి, జర్రా లాజరస్‌గార్లు ఈ ఆయుర్వేద వైద్యరంగంలో ప్రముఖులు. వినుకొండ వేంకట రంగాచార్యులుగారు వనమూలికా విజ్ఞాన నిధిగా ప్రసిద్ధులు.

1917లో కోట వేంకటేశ్వర్లుగారు ఆయుర్వేద వైద్యునిగా ప్రాక్టీసు ప్రారంభించారు. వీరి తనయులు డా॥ కోట వేంకటహనుమంతరావుగారికి మంచి పేరున్నది. డా॥ ఆర్.టి. కృష్ణమాచార్యులుగారు మద్రాసు నుంచి ఎల్.ఐ.ఎం. లో డిప్లమో పొంది 1942 నుండి 1975 వరకు పలు ఆసుపత్రులలో వైద్యాధికారిగా విశిష్టమైన సేవల నందిం చారు. నకరికల్లు డాక్టర్‌గా పేదల మనసులలో నిలిచి పోయారు.

మలితరం ఆయుర్వేదరంగంలో డా॥ వేంకట రంగా చార్యులుగారు, వారి కుమారులు డా॥ హయగ్రీవాచార్యులు గారు ఆయుర్వేదప్రవీణ, భిషక్, వైద్యవిద్వాన్ కోర్సులలో ఉత్తీర్ణులై ఈ వృత్తిలో ప్రావీణ్యం గడించారు. 1990లో డా॥ రత్నాకరం వీరరాఘవాచార్యులుగారు ఆనువంశిక వైద్యు లైనారు. 1947 నుండి వైద్యవిద్వాన్, డా॥ పోలేపెద్ది లక్ష్మీకాంతంగారు చిన్నపిల్లల స్పెషలిస్ట్‌గానూ, దీర్ఘవ్యాధుల వైద్యనిపుణులుగానూ పేరు తెచ్చుకొన్నారు. చందవరం గ్రామా నికి చెందిన డా॥ చేరెడ్డి వేంకటేశ్వరరెడ్డిగారు నరసరావుపేటలో ఆయుర్వేద వైద్యసేవల నందించారు. 1961 లో డా॥ వేదాన్తం రామకృష్ణమాచార్యులుగారు ఆయుర్వేద గురుకుల విద్యాపీఠాన్ని నెలకొల్పి ఎందరో విద్యార్థులకు వైద్యశిక్షణ నిచ్చారు. తెలుగు ఉపాధ్యాయులు కనుపర్తి సంతోషంగారు ఆయుర్వేద వైద్యు లుగా కూడా రాణించారు. 1960లో 'వైద్యాచార్య' డా॥ నాతాని వేంకటసుబ్బారావుగారు ఆయుర్వేద ప్రాక్టీస్ ప్రారంభించారు. వీరి తనయులు డా॥ నాతాని రవీంద్రనాథ్‌గారు బి.ఎ. ఎం.ఎస్. చేసి ఆయుర్వేద వైద్యులుగా ప్రాక్టీస్ చేశారు.

**ఆయుర్వేద ఫార్మసీలు :**

1942లో డా॥హయగ్రీవాచార్యులుగారు 'ఆయుర్వేద నికేతన్ ఫార్మసీ' స్థాపించి సువర్ణరాజేశ్వరం మొదలైన మందులు తయారుచేశారు. డా॥ రత్నాకరం వీరరాఘవా చార్యులుగారు 1970 ప్రాంతంలో 'రత్నాకర్ ఫార్మసీ'ని స్థాపించి 'అజీర్ణాంధః ప్రభాకరం' అనే విరేచనాల మాత్రలను తయారుచేసి రాష్ట్రస్థాయిలో బహుళ ప్రచారాన్ని కల్పించారు. డా॥ ఆర్.టి. కృష్ణమాచార్యులుగారు 1960వ సం॥లో 'రత్నాకర్ కాటేజ్ ఇండస్ట్రీస్'ను ప్రారంభించి అనేక ఆయుర్వేద ఔషధాలు, పేటెంట్ మందులు తయారుచేసి బంగారు పతకం పొందారు. డా॥ పోలేపెద్ది లక్ష్మీకాంతంగారు 1959–'60 లో 'శ్రీకాంత్ ఫార్మా'ను ప్రారంభించి ఎన్నో ఆయుర్వేద మందులు తయారు చేశారు. డా॥ నాతాని వేంకటసుబ్బారావు గారు 1971లో 'సురానా ఫార్మా'ను ప్రారంభించి రాష్ట్ర మంతటా మందులను సరఫరా చేశారు. పచారీషాపు యజ మాని షేక్ మౌలాసాహెబ్‌గారు 'రత్నాకర్ ఫార్మా' అనే పేరుతో 'అజీర్ణ ప్రభాకర' అనే మాత్రలను రాష్ట్ర మంతటా ప్రచారం చేశారు. కొత్తపల్లి సాహెబ్‌లుగా పిలవబడే కొన్ని కుటుంబాల వారు మందులు తయారు చేసి, మహారాష్ట్ర మున్నగు దూర ప్రాంతాలకు వెళ్లి మొండిజబ్బులను నయం చేయడంలో సిద్ధ హస్తులు అనిపించుకున్నారు.

**అల్లోపతి వైద్యరంగం :**

నరసరావుపేటలో 1917 లో డా॥ పోపూరి గోపాల కృష్ణమూర్తిగారు అల్లోపతి వైద్యాన్ని ప్రారంభించారు. వీరు

కలకత్తా నుండి క్లినికల్ ప్రాక్టీస్ సర్జరీలో డిప్లమో పొంది, 1953 వరకు నరసరావుపేటలో అల్లోపతిక్ వైద్యవృత్తిని కొన సాగించారు. వీరి కుమారులు డా॥ పోపూరి రాధాకృష్ణమూర్తి గారు వైద్యడిప్లమో పొంది 1951వ సం॥ నుండి 1971 వరకు విశిష్టవైద్య సేవల నందించారు. 1952వ సం॥ లో డా॥ పి. కృష్ణదాస్‌గారు వైద్యాన్ని ప్రారంభించారు. రోగి కదలలేని పరిస్థితిలో ఉన్నట్లయితే వీరిద్దరు గుర్రపు బండ్లమీద రోగుల ఇండ్లకే వెళ్లి వైద్యం చేసేవారు. బెల్లంకొండ వైద్యులుగా పేరు పొందిన చింతల పాటి డాక్టర్లు నేత్రవైద్యులుగా నరస రావుపేటలో ప్రసిద్ధులయ్యారు. వీరి తరువాత డా॥ప్రకాశరావుగారు నేత్ర వైద్యుడిగా మంచిపేరు తెచ్చుకొన్నారు.



పోపూరి గోపాల కృష్ణమూర్తి



పి.కృష్ణదాస్

1956లో డా॥ ముక్కామల ఉమామహేశ్వరరావు గారు నరసరావుపేటలో మొట్టమొదటిగా 20 పడకల నర్సింగ్‌హోమ్‌ను ప్రారంభించారు. డా॥ బొప్పన పూర్ణచంద్ర రావు, డా॥ నంద్యాల కుసుమహరనాథబాబు రెడ్డి, డా॥ కమల, డా॥ అనిశెట్టి పద్మావతి, డా॥ పాలడుగు అన్నపూర్ణ, డా॥ మేదరమెట్ల శివలింగప్రసాద్, డా॥ కె. కరుణాకరరెడ్డి, డా॥ రామ్మోహనరావు, డా॥ ఫరీద్, డా॥ కోట సీతారామయ్య, డా॥కోడెలశివప్రసాదరావు, డా॥ మోపర్తి వేంకటేశ్వరరావు, డా॥ మట్టి పెద్దయ్య, డా॥ గజ్జెల బ్రహ్మారెడ్డి, డా॥ దొంతరాజు సాయిరామారావు, డా॥ ఎం. వరదరాజులు, డా॥ చాగంటి వేంకటేశ్వరరెడ్డి, డా॥ ఎం. రాధాకృష్ణమూర్తి, డా॥ కొల్లూరు వేంకటేశ్వరరావు, డా॥ గజ్జెల పరమేశ్వరరెడ్డి, డా॥ చదలవాడ అరవిందబాబు, డా॥ ఎ. రామలింగారెడ్డి, డా॥ ముంద్రు సుబ్బారావు, డా॥ యలవర్తి వరబాబు, డా॥ కేశవరావు, డా॥ పోపూరి గోపాలకృష్ణమూర్తి, డా॥ పువ్వాడ సూర్యనారాయణ, డా॥ కె. జగన్మోహనరెడ్డి గార్లు... ఇలా ఎందరెందరో వైద్యులు వైద్యవృత్తిని చేపట్టి, నేత్ర, దంత, ప్రసూతి, చర్మ, ఆర్థోపెడిక్, చెవి, ముక్కు, గొంతు, సర్జరీ, చిన్నపిల్లల, స్త్రీలవ్యాధుల నిపుణులుగా పేరు తెచ్చుకొన్నారు.



ఎం. వరదరాజులు

డా॥ ఎం. వరదరాజులుగారు 17 బంగారు పతకాలను, డా॥ చదల వాడ అరవిందబాబుగారు డా॥ యతిరాజులు స్మారక బంగారు పతకాన్ని పొంది నరసరావుపేట వైద్యరంగానికి అఖండ కీర్తిని తెచ్చారు.

1943 లో ప్రభుత్వ వైద్యశాల కుటుంబ సంక్షేమ కార్యక్రమాల అమలులో అనేక పర్యాయాలు అనేక బహుమతుల నందుకోవడం మన నరసరావుపేట వైద్యరంగా నికే గర్వకారణం.

కన్యల ఆసుపత్రి 20-25మందికి పైగా వైద్య, వైద్యేతర సిబ్బందితో వైద్యసేవల నందిస్తున్నది. ఇందులో పనిచేసిన వైద్యులలో డా॥ కేశవ రాజుగారు ప్రముఖులు.

**మందుల షాపులు :**

పులుసు కోటేశ్వరరావుగారిది మొట్టమొదటి మందుల షాపు. ఆ తర్వాత ముత్తరాజు రంగారావుగారి షాపు, డా॥ పోలేపెద్ది లక్ష్మీకాంతంగారి శ్రీలక్ష్మీ మెడికల్ స్టోర్స్, రామా మెడికల్ స్టోర్సు, రామలింగా మెడికల్ స్టోర్సు మంచి పేరు తెచ్చుకొన్నవి. ప్రస్తుతం 125 మందుల షాపులు, సుమారు 85 హెూల్‌సేల్ మందుల షాపులు, వివిధ వైద్య ప్రక్రియలకు సంబంధించిన మందులను, వైద్యపరికరాలను అందిస్తు న్నాయి. మననరసరావుపేట పట్టణప్రజలు వైద్యంకోసం ఇతర పట్టణాలకు వెళ్లే అవసరం లేకుండా మన డాక్టర్లు అధునాతన వైద్యసదుపాయాలతో విశేషమైన సేవల నందిస్తున్నారు.

1977లో ఇండియన్ మెడికల్ అసోసియేషన్‌కు డా॥ కేశవరాజుగారు అధ్యక్షుడుగా, డా॥ బొప్పన పూర్ణచంద్రరావు గారు కార్యదర్శిగా వ్యవహరించారు. ప్రస్తుతం డా॥ ఎ. రామ లింగారెడ్డిగారు అధ్యక్షులుగానూ, డా॥ కడియాల వెంకటేశ్వర రావుగారు కార్యదర్శిగానూ సేవలనందిస్తున్నారు. "సర్వే భవంతు నిరామయాః". •

# పశువైద్యం

డా॥ షేక్ షహిదా సాహెబ్
విశ్రాంత పశువైద్య సహాయ సంచాలకులు



నరసరావుపేట ప్రాంతంలో ప్రధానవృత్తి వ్యవసాయం. వ్యవసాయానికి తోడుగా పాడిపరిశ్రమ ప్రాచుర్యం సంతరించుకున్నది. ఒక మేలు జాతి గేదె/ ఆవు మీద వచ్చే ఆదాయం ఒక ఎకరం మీద వచ్చే ఆదాయానికి సమానం. గొఱ్ఱెలు, మేకలు, కోళ్లపెంపకం కూడా రైతు పురోభివృద్ధికి దోహదపడేవే! మన నరసరావుపేట రైతులు ఈ కృషిలో ఎంతగానో పురోగమిస్తున్నారు.

నేల తీరును బట్టి ఉష్ణోగ్రతను బట్టి పశువులకు ఆరోగ్యభంగం కలుగుతుంది. ముసరవ్యాధి కలరా వంటిది. గర్భకోశ వ్యాధి, గాలికుంటు వ్యాధి, గొంతువాపు, రేబిస్, క్షయ, యాంత్రాక్స్, గజ్జి, తామర, కుందేటివెర్రి మొదలైనవి ప్రమాదకరమైనవి. దూడలో ఏలకపాములు ఇబ్బంది కలిగిస్తాయి. సుద్దకట్టు రోగం రక్తవిరేచనాలు కూడ బాధాకరమైనవే. ఇటువంటి భయంకరమైన వ్యాధుల్ని నివారించడానికి అల్లోపతి, ఆయుర్వేదం, హోమియో మొదలైన వైద్యపద్ధతులున్నాయి.

నరసరావుపేటలో 1-11-1936న మద్రాస్ రాష్ట్రపరిధిలో ప్రైమరీ పశువైద్యశాల స్థాపన జరిగింది. ఈ పశువైద్యాధికారం రీజినల్ వెటర్నరీ ఆఫీసర్ భీమవరంవారి పరిధిలోఉండేది. ఆంధ్రరాష్ట్ర అవతరణ తరువాత పంచాయతీ సమితులు ఏర్పడిన తరువాత 1967లో నరసరావుపేట పంచాయతీ సమితి బ్లాక్‌డెవలప్‌మెంట్ ఆఫీసర్ పరిధిలోకి వచ్చింది. మన పట్టణ పశువైద్యశాల 1936 నుండి 1984 వరకు పశువైద్యశాల పశువుల ఆరోగ్య పరిరక్షణకు మాత్రమే ఉద్దేశింపబడింది. పశువైద్యం టీకాల వరకే పరిమితమైంది. 1985వ సంవత్సరంలో లైవ్ స్టాక్ సూపర్‌వైజర్ యూనియన్‌గా పరిణతిచెంది పశువైద్యం మరియు సంకరజాతి పశువుల ఉత్పత్తి కేంద్రంగా పరిణతి చెందింది. పశువైద్యుడి సేవలను విస్తరింపచేయడానికి ప్రభుత్వం ఆ పోస్టును సహాయ సంచాలకుడి పోస్టుగా మార్చింది. ఈ వైద్యశాలకు అనుబంధంగా వ్యాధినిర్ధారణ కేంద్రాన్ని కూడ ఏర్పరచింది. వివిధ గ్రామీణ పశువైద్యశాలల నుండి సేకరించిన క్షీర రక్త మల మూత్రాదుల నమూనాలను పరిశీలించి వ్యాధినిర్ధారణ కావించటం ఈ కేంద్ర విధి. ఇలా పశువైద్యం సులభతరమైంది.

నందమూరి తారకరామారావు గారు ముఖ్యమంత్రి అయిన తరువాత మండలవ్యవస్థ ఏర్పాటుచేసి ప్రతి మండలంలో ఒక పశువైద్యశాలను ఏర్పరచి పశువైద్యాన్ని మండల స్థాయిలో రైతులకు అందేట్లు చేశారు. పశుసంతతి అభివృద్ధి కొరకు గోపాలమిత్ర వ్యవస్థను ఏర్పాటు చేశారు.

ప్రస్తుతం ఉన్న పశువుల ఆసుపత్రి 1961 ప్రాంతంలో ఇప్పటి రైలురోడ్డులోని సాంఘిక సంక్షేమ వసతిగృహానికి వెనుక ప్రక్కన ఉండేది. తరువాత ఇప్పటి టౌనుహాలు ఉన్న స్థలంలో చాలాకాలం పనిచేసింది. ప్రస్తుతం పెద్దచెరువులోకి తరలించబడింది.

ఇది ఇలా ఉండగా మన దేశీయమైన పశువైద్యం కూడా ఒకవైపున కొనసాగుతున్నది. పశువైద్యాన్ని రాష్ట్ర స్థాయిలో ఒక ఉద్యమంగా చేపట్టిన వ్యక్తి 'అభినవసహదేవ' యేజెళ్ల శ్రీరాములుచౌదరిగారు. ఆయన తెనాలిలో ఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాలను స్థాపించి, వేలమంది శిష్యులను తయారుచేశారు. అందులో మాజీమంత్రి పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి వంటివారు ఉన్నారు. మన ప్రాంతంలో ఆ కళాశాలలో శిక్షణపొందిన వైద్యుడు డాక్టరు చేరెడ్డి వేంకటేశ్వరరెడ్డి. ఆయన పశువైద్య విశారద, పశువైద్యాచార్య, గ్రామపశుసేవక్ పట్టాలను పొందారు. 1950 నుండి 2000 వరకు మన పేట మరియు పరిసర గ్రామాల్లో పశువైద్య సేవల్ని అందించారు.

మానవవైద్యరంగంలో ఎంతో పురోభివృద్ధిని సాధించిన మన నరసరావుపేటలో పశువైద్యరంగం కూడా గణనీయమైన అభివృద్ధిని సాధించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఈ విషయంలో ప్రభుత్వం తగిన చొరవను తీసుకొంటుందని ఆశిద్దాం!!

# మన ఊరి ప్రాచీన శాసనాలు

నరసరావుపేట పూర్వం 'అట్లూరు' అనే గ్రామం. అట్టలూరు క్రమంగా అట్లూరు అయింది. మన పట్టణ ప్రాచీనతను తెలిపే శాసనాలు భీమేశ్వరాలయంలోను, పట్టాభిరామ స్వామివారి ఆలయంలో ఉన్నాయి. పట్టాభిరామస్వామివారి ఆలయంలోని శాసనం క్రీ॥శ॥ 1297 నాటిది. భీమేశ్వరాలయ శాసనాలు అంతకంటే ప్రాచీనమైనవి. క్రీ॥శ॥ 1159; 1244; 1264 నాటివి.

**మొదటి శాసనం :**

(శాసనం పైన ఉన్న వరుస ప్రకారం ఉన్న అక్షరాలు)



1) ........................
2) దేవర .... రాజులు
3) రికను .... గుండుబోయును
4) దే....... గుండియ
5) బోయును ముదవనబో
6) .... ను, మారియబోయు
7) నుం, గొమ్మనబోయును
8) నాకుల మారియబో
9) ____ చెలిసినవారు శ...
10) ____ ములు ౧౦౮౧ (1081)
11) విషువ సంక్రాంతిని మి...
12) ____మునన ఖండ దీప...
13) ____బెట్టిన గొఱియలు ౫౫...
14) నింజేకొని నూంకనబో...
15) డు. తన పుత్రాను పౌత్రిక
16) ము. నిత్య మా నెందు...
17) వోయం గలవాడు.

ఈ శాసనాన్ని బట్టి 1159 నాటికే ఆలయం వుందని తెలుస్తున్నది. అంటే అట్లూరు ఉన్నట్లు తెలుస్తున్నది. కాకతీయ రుద్రమహారాజు కోరగా, గుండుబోయ మొదలైనవారు నిత్యం మానెడు నేతితో అఖండ దీపాన్ని దేవాలయంలో ఏర్పాటు చేయడానికి ఏభై అయిదు గొఱ్ఱెలను ఇచ్చారు. నూకన బోయడు వాటిని తీసుకొన్నాడు. అతడు నిత్యం మానెడు నెయ్యి పోయాలి. పుత్రపౌత్ర పరంపరగా దీన్ని సాగించాలి.

**రెండవ శాసనం :**

(శాసనం పైన ఉన్న వరుస ప్రకారం ఉన్న అక్షరాలు)

1) ............ వరు
2) ......ం ఋ లు
3) ...౧౧౬౬ (1166)
4) నే ం టి ని
5) స్వ వ సు
6) స వ త్స
7) ర శ్రావ
8) ణ శుద్ధ
9) ౧౫ గు
10) వారానం
11) కోట బేత
12) య మ హా
13) రాజులకు
14) ధమా౯ థ౯
15) ముగ -
16) ట్ట లూరి శ్రీ
17) భీమేశ్వ
18) ర దు హా
19) దేవరకు
20) దీపము -
21) కు యిచ్చి -
22) గానువులు ౨



ఇది శాలివాహనశకం 1166 సంవత్సరం నాటిది. అంటే క్రీ॥శ॥ 1244 నాటిది. అప్పటి విశ్వావసు నామ సంవత్సర శ్రావణ శుద్ధ పూర్ణిమ గురువారం నాడు, కోట బేతయ మహారాజు, ధర్మార్థంగా 'అట్టలూరి భీమేశ్వర మహాదేవరకు' దీపం కోసం గానువులు 2 అని ఉంది. ఈ అట్టలూరు క్రమంగా అట్లూరు అయింది. బేతయ మహారాజు కాకతీయ చక్రవర్తి అయివుండవచ్చు.

**మూడవ శాసనం :**

(శాసనం పైన ఉన్న వరుస ప్రకారం ఉన్న అక్షరాలు)



1) స్వస్తి శ్రీ శక
2) పరుష...
3) లు ౧౧౮౬ (1186)
4) నేంటి ఉత్త ___
5) ణ సంక్రాంతి _
6) మిత్యంబు ___
7) సాని గుండ ___
8) రెడ్డి శ్రీ భీమే
9) శ్వర - మహా దే
10) వరకు అఖండ
11) దీపమునకుం బె
12) ట్టిన మేకలు ౫౫
13) వీనింజేకొని, సురగలి
14) మరే బో
15) యుండు తన
16) పుత్రాను పౌత్రి
17) కము, నిత్యమా
18) నెందు నెయ్యి బో
19) యం గలవాండు
20) శ్రీ .................

ఇది శాలివాహన శకం 1186 నాటిది. అంటే క్రీ॥శ॥ 1264 నాటిది. ఇది ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమైనది. సాని గుండయరెడ్డి శ్రీ భీమేశ్వ మహాదేవరకు అఖండ దీపం కోసం ఏభై అయిదు మేకల్ని ఇచ్చాడు. సురగలి మరిబోయడు వాటిని తీసుకున్నాడు. అతడు పుత్ర పౌత్ర పర్యంతం మానెడు నెయ్యి పోయాలి.

**(విద్వాన్ భాగవతుల వేంకట సుబ్బారావుగారు రచించిన 'శ్రీ భీమలింగేశ్వర స్వామివారి చరిత్ర' ఆధారంగా) - సంపాదక వర్గం**



# సస్యశ్యామలాం


డా॥ జబ్బర జ్యోతిప్రసాదరావు
అసిస్టెంట్ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్

డా॥ సి. అమరేంద్ర
జాయింట్ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్




నరసరావుపేట పట్టణ భౌగోళిక విస్తీర్ణం 3,656 హెక్టార్లు. అందులో వ్యవసాయభూమి 650 హెక్టార్లు. బంజరు భూమి 905 హెక్టార్లు. వ్యవసాయమునకు వాడకుండా మిగిలి ఉన్నది 890 హెక్టార్లు.

నాటి నరసరావుపేట రైతులు మట్టినే నమ్ము కొన్నారు. వారు 'మట్టే మా బ్రతుకు, మట్టే మా మెతుకు' అని మనస్ఫూర్తిగా భావించి జీవించారు. తొలికోడి కూయగానే మేడి పట్టి కోటేరును సరిచేసి, వలపట దాపట ఎడ్లను కట్టి సాలు తప్పకుండా కోండ్రవేసుకొని, సొంతంగా తయారు చేసు కొన్న జొన్న, సజ్జ, వరిగ, రాగి, కొర్ర, కంది, మినుము, పెసర, శనగ, వేరుశనగ విత్తనములను విసిరిసిరి చల్లి, కలుపు తీసి, యేటికి ఏతం పట్టి, వేయిపుట్లు పండించినారు. మన నరసరావుపేట పట్టణ, పరిసర గ్రామాల రైతులు 'మా భూమే మా బంగారు తల్లి! భూమి మా పాలిట మహాలక్ష్మి!' అని నేలతల్లిని నమ్మారు. రాయిరాయి పిండిగజేసి, మెరకా పల్లం చదునుగ చేసి, తమ రక్తమును, చెమట బిందువులను నీరుగా పారించి, వళ్లొంచి పనిచేశారు. ఆకలికడుపులకు అన్నం పెట్టి ఆదరించిన అన్నపూర్ణలకు, కళ్లం గట్టున ధాన్యం కొలిచి ఆదుకొనిన అన్నదాతలకు ప్రతీకలుగా నిలిచారు.

అర్థశతాబ్దమునకు పూర్వము రైతులు సహజపద్ధతు లతో వ్యవసాయం చేసేవారు. పొలములో సత్తువ పెంచడానికి పశువుల ఎరువు, ఆకులు, అలములు వ్యర్థపదార్థములు వేసేవారు. 'ఒకేబాట నడిస్తే నాచైనా మొలవదు. ఏకపంట సాగు వలన రూకైనా మిగలదు' అని సామెత. పలుపంటల సాగు వలన, అంతరపంటల వలన అస్థిరత తొలగునన్న సిద్ధాంతముతో ఆ నాటి నరసరావుపేట రైతులు పంటమార్పిడి, అంతరపంటల వ్యవసాయము చేసేవారు. రసాయనికపు ఎరువులు వాడకుండా సేంద్రియ ఎరువులు వేసినందువలన వానపాములు క్రింద మట్టిని పైకి, పై మట్టిని క్రిందకు తెచ్చి భూసారం పెరుగుటకు దోహదపడినవి. నేలలో దాగి వున్న బూజు, ఫంగస్‌కు సంబంధించిన సూక్ష్మజీవులు పంటలకు తెగులు సోకకుండా చేసినవి. చేలలో నీటికుంటలు వుండటం వలన ఆనాటి పంటలు మంచి రంగు, కమ్మని రుచి, సువాసన కలిగిఉండేవి.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చేనాటికి అధికంగా ఉన్న దేశజనాభా ఆ నాటినుండి పెరుగుతూ వచ్చింది. ఆహారపు పంటల, తదితరపు పంటల ఆవశ్యకము పెరిగినది. జనాభా పెరిగినంతగా సాగుభూమి పెరగలేదు. నీటి వసతులు సరిపడా లేవు. కనుక ఉన్న భూమిలోనే దిగుబడి పెంచవలసి వచ్చినది. అందువలన ఆనాటి పంటలతోబాటు వరి, మొక్క జొన్న, ప్రత్తి, మిరప, పసుపు, పొగాకు వంటి పంటల సాగు అవసరమైనది.

1957వ సంవత్సరములో నాటి ముఖ్యమంత్రి, మన నరసరావుపేట వాస్తవ్యు లయిన శ్రీ కాసు బ్రహ్మా నందరెడ్డిగారి అసమాన కృషివలన నాగార్జునసాగర్ బహుళా ర్థక ప్రాజెక్టు మొదలైనది. 1970 సంవత్సరములో పూర్తియైనది. ఇది భారతదేశములోనే అతిపెద్ద ప్రాజెక్టు. ఇరు ప్రక్కల కుడి, ఎడమ ప్రధానమైన కాలువలు కలిగి 8,95,547 హెక్టార్లకు సాగునీరు అందించడానికి నిర్దేశించబడినది. జవహర్‌కాలువ (కుడికాలువ) ద్వారా నరసరావుపేట పట్టణ ప్రాంత రైతులు 225 హెక్టార్లలో వరి, 350 హెక్టార్లలో ప్రత్తి మరియు 60 హెక్టార్లు మిరప ఆయకట్టు సాగు అగుచున్నది. నీటి వసతి ఉన్నందున నరసరావుపేట రైతులు ఎకరానికి 30-35 బస్తాల వరిధాన్యము, 8-15 క్వింటాళ్ల ప్రత్తి, 25-40 క్వింటాళ్ల మిరపపంట దిగుబడి సాధిస్తున్నారు. నరసరావుపేట పట్టణములో సాగునీరు సరిపడా అందించ

బడుతున్నది. దీనివలన మన పట్టణములో అన్ని ఎరువుల కంపెనీల కేంద్రీయ వ్యవస్థ ఏర్పాటు చేసుకొని రైతులకు సకాలములో ఎరువులను అందించుచున్నారు.

నరసరావుపేట మునిసిపాలిటి పరిధిలో 28 ఎరువుల, 35 పురుగుమందుల, 16 విత్తనముల విక్రయకేంద్రములున్నవి. దీని వలన రైతులకు అవి అన్నీ సకాలములో అందుచున్నవి. ఋణసదుపాయము కల్పించుటకు వాణిజ్యపు బ్యాంకులు, సహకార పరపతి సంఘములు ఉన్నవి. వారి వుత్పత్తులను అమ్ముకొనుటకు వ్యవసాయ మార్కెట్ కమిటీ ఉన్నది. వ్యవసాయపు పనిముట్లు తయారుచేయు కేంద్రములున్నవి. వ్యవసాయ మార్కెట్ కమిటిలోని వ్యవసాయశాఖ శిక్షణా కార్యక్రమములను ఏర్పాటుచేసి ఆధునిక వ్యవసాయమునకు సంబంధించిన విషయములను తెలియజేయుచున్నది.

నీటి వసతులు మెరుగైనందున 1970-2010 మధ్యకాలములో రైతులు రసాయనిక మందులను విచ్చలవిడిగా వాడుతున్నారు. దీనివలన భూకాలుష్యము, వాతావరణ కాలుష్యము, జలకాలుష్యము పెరిగి అనారోగ్య సమస్యలు వచ్చినవి. మేలుచేయు మిత్రపురుగులు తగ్గిపోవడంతో మనుష్యులతో బాటు పశుపక్ష్యాదులు, పెంపుడు జంతువులు, చేపలు చనిపోవుచున్నవి. వానపాములు, తేనెటీగలు, గణనీయముగా తగ్గినవి. పీల్చేగాలి, త్రాగేనీరు, తినే తిండి కలుషితమయ్యాయి. నేలకున్న ఉత్పాదకశక్తి క్షీణించినది.

ప్రస్తుత ప్రభుత్వం వారానికి రెండురోజులు 'పొలం పిలుస్తోంది' కార్యక్రమము చేపట్టి నరసరావుపేట పట్టణం లోని రైతులకు వ్యవసాయశాస్త్రవేత్తల ద్వారా సూచనలను అందిస్తున్నది. రూ. 1,50,000/-ల వరకు రైతులకు వాణిజ్యపు బ్యాంకుల నుండి ఋణవిముక్తిని కల్పించుచున్నది. వారికి అవసరమైన వ్యవసాయపు యంత్రములను రాయితీపై ఇచ్చుచున్నది. మన నరసరావుపేట, పరిసరగ్రామములకు చెందిన రైతులందరూ ఈ సౌకర్యములను సముచితమైన రీతిలో ఉపయోగించుకొని, అధిక దిగుబడులు సాధించి, రాష్ట్రపరిధిలో ఉన్నతస్థానమును సాధించెదరని ఆశించుచున్నాము.

**'రైతే ప్రగతికి మూలధనం! రైతే జగతికి జీవజలం!!'**



పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రశంసించిన ఆధునిక దేవాలయం - నాగార్జున సాగర్ డ్యామ్

# వర్తక వాణిజ్యాలు




## చలువాది బ్రహ్మయ్య
వ్యాపారస్థులు


మన నరసరావుపేట అటు రాయలసీమకు, ఇటు పల్నాడుకు, మరోవైపు గుంటూరు ప్రాంతానికి ముఖద్వారంగా కూడలి ప్రాంతంగా ఉండటంతో ఇక్కడ వర్తక వాణిజ్యాలు దినదినాభివృద్ధి చెందాయి. 1880లో మచిలీపట్నం నుండి బర్మా, గోవా వరకు నరసరావుపేటను కలుపుతూ రైలు మార్గం ఏర్పడటంతో సరుకు రవాణా సదుపాయాలు మెరుగయ్యాయి. అలాగే 1920 ప్రాంతం నుండి బస్సులు, ఇతర మోటారు వాహనాల రాకపోకలవల్ల పంటలు ఇతర తయారీల క్రయ విక్రయాలు ఊపందుకున్నాయి. నీలిమందు వ్యాపారం విశేషంగా జరిగింది. ఆరోజుల్లో నీలిమందును తయారుచేసే రాతితొట్లు గ్రామం వెలుపల, పొలాల సమీపంలో కనిపించేవి. ఇంగ్లాండ్‌కు చెందిన కొన్ని వ్యాపారసంస్థలు సబ్బులు అమ్ముతూ, నీలిమందు కొనుగోలు చేసేవారు. నరసరావుపేట కేంద్రంగా 1860 ప్రాంతంలో నీలిమందు వ్యాపారం బాగా జరిగిందని పెద్దలు చెబుతుంటారు. పల్నాడు, నరసరావుపేట, చిలకలూరిపేట ప్రాంతాలు ప్రత్తి, మిర్చి, పొగాకు పంటలకు ప్రసిద్ధి. ఇతర ప్రాంతాల ప్రత్తి కంటె ఇక్కడి ప్రత్తి నాణ్యమైనదని వాడుక. దీనితో రాలీస్, వాల్కాట్ కంపెనీలవారు నరసరావుపేటలో ప్రత్తి మిల్లులు పెట్టి, ప్రత్తివ్యాపారం చేశారు. ప్రత్తి బేళ్లను ఇంగ్లాండుకు ఇతర ప్రాంతాలకు పంపేవారు. స్విట్జర్లాండ్ నుండి వాల్‌కాట్, ఇటలీనుండి రాలీస్‌వారు వచ్చి ప్రత్తి, వేరుశనగగింజల వాణిజ్యం చేయటంవల్ల రైతులు, వ్యాపారులు ఈ పంటలను లాభసాటి పంటలుగా భావించేవారు. సజ్జ, జొన్న, వరిగ, కొర్ర ధాన్యాల కొనుగోలు అమ్మకాలకు నరసరావుపేట ప్రధానకేంద్రంగా ఉండేది.

నరసరావుపేటకు 1967లో నాగార్జునసాగర్ నీళ్లు రావటంతో మాగాణి పొలాలు అధికమయ్యాయి. వరిధాన్యం దిగుబడి పెరగటంతో క్రమంగా నరసరావుపేటలో 28 రైస్ మిల్లులు పెట్టి బియ్యం, నూకలు, తవుడు వ్యాపారం సాగించారు. 1930లో కూనిశెట్టి వరదరాములు, దేవరపల్లి వేంకట కోటయ్య, చిలకల జగన్నాథం తవుడు, బియ్యం వ్యాపారం చేసేవారనీ, అమృతసర్ నుండి తవుడు తెప్పించేవారని వ్యాపారులు గుర్తుచేసుకునేవారు. ప్రథమంగా కొడాలి నాగేశ్వరరావు, మేకా అంజయ్యగార్లు కోదండరామ రైస్ మిల్లు పెట్టారు. 1981లో మిట్టపల్లి వేంకటకోటేశ్వరరావుగారు కొంతమంది భాగస్వాములతో 'బాలాజీ పారాబాయిల్డ్ రైస్‌మిల్లు' స్థాపించి బియ్యంవ్యాపారంలో మరింత అభివృద్ధి సాధించారు.

గతంలో చిలకలూరిపేట, ఒంగోలు కంటే నాణ్యమైన కలప వ్యాపారంలో నరసరావుపేట అగ్రగామిగా ఉండేది. 1942 ప్రాంతంలో రెండవ ప్రపంచయుద్ధం సమయంలో తాడేపల్లిగూడెంలో నిర్మించిన విమానాశ్రయానికి నరసరావుపేటలోని జొన్నలగడ్డ శేషయ్యగారి కలప అడితి నుండి కలప కొనుగోలుచేయటాన్ని విశేషంగా నేటికీ చెబుతుంటారు. జొన్నలగడ్డ శేషయ్య, రెడ్డి రామసుబ్బయ్య బ్రదర్స్, దివ్వెల రాములు, చిలకల రామమూర్తిగార్లు, తదితరులు పెద్దఎత్తున కలప వ్యాపారం సాగించారు. గతంలో బర్మా నుండి నాణ్యమైన టేకు, కలప వచ్చేది. ప్రస్తుతం మలేషియానుండి దిగుమతి అయ్యే కలపను, అలాగే బలార్ష టేకును, ఇతర ప్రాంతాల్లోని పెద్ద టింబర్‌డిపోల కలపను కొనుగోలుచేసి విక్రయిస్తున్నట్లు కొందరు తెలిపారు. నరసరావుపేటలో పెద్దవి చిన్నవి కలిపి 14 టింబర్‌డిపోలు ఉన్నాయి.

వస్త్ర వ్యాపార విషయానికి వస్తే నరసరావుపేట పట్టణంలో వస్త్రదుకాణాలు, రెడీమేడ్ దుస్తుల షాపులు కలిపి సుమారు 200 వరకు ఉన్నట్టు అంచనా. వస్త్రవ్యాపార

అభివృద్ధి, కొనుగోలుదారుల సౌకర్యం కోసం పట్టణంలో 'మహాత్మాగాంధీ క్లాత్‌మార్కెట్'నిర్మాణం జరిగింది. బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, బెంగుళూరు, చీరాల, ధర్మవరం, హైదరాబాదు, విజయవాడల నుండి అన్నిరకాల క్లాత్ తెప్పిస్తున్నామని వస్త్ర వ్యాపారులు తెలిపారు. రెడీమేడ్ దుస్తులను కలకత్తా, బొంబాయి, ఢిల్లీ నుండి కొనుగోలు చేస్తున్నట్లు వివరించారు.

ఉప్పలపంచు వేంకటరత్నం, వేంకటేశ్వర్లు, వేంకటప్పయ్య సోదరులు 1916-'17లో ఆయిల్‌మిల్లు ఏర్పాటు చేసి నరసరావుపేటలో ఆయిల్ వ్యాపారం చేశారు. నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠి, గోనుగుంట్ల గోపాలకృష్ణయ్య, మిరియాల సుబ్బయ్య, వెంకటేశ్వర్లుగార్ల ఆయిల్ కంపెనీలు ఆయిల్ వుత్పత్తిలో అగ్రగాములుగా పనిచేశాయి. గుంటూరు మార్వాడీలు 1930 కల్పవల్లి దశకంలో నరసరావుపేటలో ఆయిల్ మిల్లు వ్యాపారం నిర్వహించారు. శనగనూనె ఉత్పత్తులను కలకత్తా, మద్రాసు నగరాలకు ఎగుమతి చేసి, నాణ్యమైన ఆయిల్ అమ్మకందారులుగా పేరు తెచ్చుకున్నారు. పట్టణంలో ప్రస్తుతం మూడు ఆయిల్‌మిల్లులు పనిచేస్తున్నట్టు నిర్వాహకులు తెలిపారు.

మెడికల్ పంపిణీ రంగంలో మేళ్లచెర్వు వీరాంజనేయులుగారి పేరు మొట్టమొదటగా చెప్పుకోవాలి. ఔషధ ఉత్పత్తుల రంగంలో సేఫ్ అగ్రగామిగా తనవంతు సేవల నందిస్తున్నది. ప్రస్తుతం నరసరావుపేటలో సుమారు వంద రిటైల్ మెడికల్ షాపులు, వంద హోల్‌సేల్ మెడికల్ షాపులు పని చేస్తున్నాయి.

ఈ పట్టణంలో ప్రింటింగ్ ప్రెస్‌లు, ఫ్లెక్సీ మేకర్స్ షాపులు కలిపి సుమారు 30 వరకు పనిచేస్తున్నాయి. 1930 దశకంలో పత్తిపాటి రామకృష్ణయ్యగారి కల్పవల్లి ప్రెస్, శ్రీనివాసరావుగారి శార్వాణీ ప్రెస్, శనివారపు సైదులురెడ్డిగారి కోటేశ్వర ప్రింటింగ్ ప్రెస్, నంద్యాల కోటిరెడ్డి గారి నలవేమా ప్రింటింగ్ ప్రెస్, మండా ఆంజనేయులు గారి వాణీ ప్రెస్ మన నరసరావుపేట ప్రజల మన్ననలు పొందాయి. జమ్ముల రాధాకృష్ణ బ్రదర్స్‌వారి మురళీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, పి. చంద్ర గారి లక్ష్మీ ప్రింటర్స్, నాగేశ్వరరావుగారి రాఘవేంద్ర ప్రింటర్స్ ఈ రంగంలో కాలానుగుణంగా వచ్చిన వినూత్న విధానాలను పాటిస్తూ, వినియోగదారులకు తమ సేవల నందిస్తున్నాయి. గతంలో గుంటూరు, విజయవాడకు వెళ్లాల్సిన పనులను కూడా ఇక్కడే వేగంగా, నాణ్యతతో నిర్వహిస్తున్నారు.

ఫోటోస్ అండ్ వీడియో స్టూడియోలు, ఎలక్ట్రికల్స్, ఫ్యాన్సీ, ఐరన్ అండ్ హార్డ్‌వేర్, రెస్టారెంట్స్, ఫుట్‌వేర్, బుక్స్ అండ్ స్టేషనరీ, ఫర్టిలైజర్స్ అండ్ పెస్టిసైడ్స్ బ్రాస్ అండ్ స్టీల్, వెండి, బంగారు డైమండ్స్ నగలదుకాణాలు తదితర అన్నిరకాల వర్తక వాణిజ్యవ్యాపారాలు నరసరావుపేటలో గణనీయంగా జరుగుతున్నాయి.

పట్టణంలోని వ్యాపార సంస్థలన్నింటినీ సంఘటితం చేస్తూ, బత్తుల పేరయ్యగారు అధ్యక్షులుగా, పొట్టిమూర్తి ఆంజనేయులుగారు కార్యదర్శిగా ఏర్పాటు చేసుకున్న నరసరావుపేట వాణిజ్యమండలి ఒక దశాబ్దకాలం పనిచేసింది. 1986 డిసెంబరు 14వ తేదీన నరసరావుపేట ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీని అన్ని వ్యాపార సంస్థల కలయికతో నెలకొల్పారు. దీనికి తొలి అధ్యక్షులుగా కపలవాయి రాజేంద్రప్రసాద్‌గారు, తొలి ప్రధాన కార్యదర్శిగా అత్తలూరి వేంకటేశ్వర్లుగారు బాధ్యతలు నిర్వహించారు. ఆ తరువాత ఊటుకూరి వేంకటసత్యనారాయణగారు, అత్తలూరి వేంకటేశ్వర్లుగారు అధ్యక్ష, కార్యదర్శులుగా పనిచేశారు. ప్రస్తుతం అధ్యక్షులుగా మాజేటి వేంకటేష్, ప్రధాన కార్యదర్శిగా కొత్తూరి హనుమంతరావు, కోశాధికారిగా మద్ది వేంకటరామహరగోపాల్ తమ సేవల నందిస్తున్నారు. మొత్తం 47 వర్తక వాణిజ్య సంఘాలు 'ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ'లో సభ్యత్వాన్ని కలిగి సంఘటితంగా పనిచేస్తున్నాయి.స్థానిక వినుకొండరోడ్‌లో 'ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ' సమావేశాలకు నూతన కార్యాలయ భవననిర్మాణం జరుగుతున్నది. మన ఊరి వర్తకులందరూ ప్రజలకు తగు సేవలు, ప్రజాహిత కార్యక్రమాలు నిర్వహించి అన్ని ప్రాంతాల వారికీ ఆదర్శంగా నిలవాలని కోరుకుందాం! •

# పారిశ్రామిక ప్రగతి



## ఎమ్. వేంకటేశ్వరరావు

ఎకనమిక్స్ లెక్చరర్ (రిటైర్డు)

చిన్న పట్టణస్థాయి నుండి ఎ గ్రేడ్ మున్సిపాలిటీ స్థాయికి కాలానుగుణంగా మన పట్టణము అభివృద్ధి చెందింది. కొంతమంది పారిశ్రామికవేత్తలు పరిశ్రమలు నెలకొల్పి పేరు ప్రఖ్యాతులు పొందిరి. కుటీరపరిశ్రమలు, వ్యవసాయ ఆధారిత పరిశ్రమలతో మొదట ప్రారంభము జరిగినది. గుంటూరు జిల్లా కాటన్ ప్రెస్, లక్ష్మీనరసింహ కాటన్ మిల్ నెలకొల్పి ఆధునిక పోకడలతో బొంబాయి కాటన్‌మిల్స్‌తో పోటీపడే స్థాయికి ఎదిగి ఆగిపోయినవి. పూనాటి లక్ష్మీనరసయ్యగారు జాడీల ఫ్యాక్టరీ నెలకొల్పటముతో పచ్చళ్లు, రసాయనాలు నిల్వఉంచుకొనుటకు అవకాశము కలిగినది. ఎక్కువగా రైస్ మిల్లులు, ఆయిల్‌మిల్లులు, ఆముదాల ఫ్యాక్టరీలు నెలకొల్పబడి కొంతమందికి ఉద్యోగాలు కల్పించినవి. అర్వపల్లి పాండు రంగారావుగారు, మురారిశెట్టి రామమోహనరావుగారు, మిట్టపల్లి వేంకటకోటేశ్వరరావుగారు కీలి పెస్టిసైడ్స్ ఫ్యాక్టరీ నెలకొల్పి కొంతకాలం కొనసాగించారు.

పావులూరి సుబ్బారావుగారు 1965లో శ్రీ బాలాజీ మొజాయిక్ టైల్స్ మాన్యుఫ్యాక్చరింగ్ కంపెనీ స్థాపించిరి. ఆ తరువాత 1973లో రైల్వే కోచ్ ఫ్లోరింగ్ మెటీరియల్ తయారుచేయు సంస్థను నెలకొల్పి బొంబాయిలోని సంస్థలతో పోటీపడి, నాణ్యత పెంచి, ధర తగ్గించి, సప్లయి చేసి సంస్థను విజయపథంలో నడిపించిరి. వీరి కుమారులు పావులూరి రవికుమార్, చంద్రకుమార్ సంస్థను ఉన్నత శిఖరాలకు తీసుకొని వెళ్లుచుండిరి. ఇది దేశంలోనే నాల్గవ కంపెనీగా పేరు పొందినది. బర్మా వంటి దేశాలకు ఎగుమతులు చేసిరి. రైల్వేలు, నౌకలు రెండింటికి ఫ్లోరింగ్ మెటీరీయల్ సప్లయి చేయు ఏకైకసంస్థగా రూపుదిద్దిరి.

నరసరావుపేట గర్వించదగు మిట్టపల్లి స్పిన్నర్స్ లిమిటెడ్ నూలుమిల్లును 2012 జనవరిలో మిట్టపల్లి వేంకట కోటేశ్వరరావుగారు ఆధునికయంత్రసామాగ్రితో 65 కోట్ల రూపాయల వ్యయంతో స్థాపించిరి. ఇది 20 టన్నుల సామర్థ్యము గల సంస్థ. 400 మందికి ఉపాధి కల్పించుచున్నది. చైనా, కొరియా, వియత్నాం, పోర్చుగల్ వంటి దేశాలకు ఎగుమతులు చేసి విదేశీ మారకద్రవ్యాన్ని కూడ సంపాదించు స్థాయికి తీసుకువెళ్లారు. ఉత్పత్తివ్యయాన్ని తగ్గించి నాణ్యత విషయంలో పోటీపడగల స్థాయికి సంస్థను అభివృద్ధిపరచిరి.

వల్లభ ఫీడ్స్ ప్రైవేటు లిమిటెడ్ సంస్థను 2010లో బొల్లా బ్రహ్మనాయుడు, శ్రీనివాసరావుగార్లు స్థాపించారు. ఇది గంటకు 12 టన్నుల పశువుల మేత తయారుచేయగల సామర్థ్యంతో 350 మంది కార్మికులకు పని కల్పించుచున్నది. గేదెలు, ఆవులు, కోళ్లు, చేపలకు దాణా తయారుచేస్తూ ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, కర్నాటకరాష్ట్రాలలో పశువుల దాణాకు మార్కెటు కల్పించే స్థాయికి అభివృద్ధిచేశారు. ఇది గుంటూరు జిల్లాలోనే అతి పెద్ద దాణాతయారీ సంస్థగా పేరుపొందినది.

తిరుమల డెయిరీ (పాల ఉత్పత్తులు) దక్షిణ ఇండియాలోనే ప్రథమస్థాయికి ఎదిగినది. గుజరాత్‌లోని కొరియన్ నెలకొల్పిన ఆనందడెయిరీ స్థాయికి అభివృద్ధిచెందినది. ఎక్కువమంది గ్రామీణప్రాంత రైతులకు, వ్యవసాయ కార్మికులకు ఉపాధి కల్పించి అతికొద్దికాలంలో సాటిలేని స్థాయికి విస్తరించినది. ఇటీవల యాజమాన్యం మారి క్రొత్త యాజమాన్యం ఈ సంస్థను నిర్వహిస్తున్నది. తిరుమల డెయిరీ ద్వారా ప్రతిరోజు 4 దక్షిణ రాష్ట్రాల్లో 13.5 లక్షల లీటర్ల పాలను సేకరించి విక్రయిస్తున్నారు. దక్షిణభారత ప్రయివేటు డెయిరీ రంగంలో తిరుమల అగ్రస్థానంలో ఉన్నదని తిరుమల డెయిరీ జి.ఎం. శ్రీనివాసరావుగారు తెలిపారు.

రాజధాని అమరావతికి దగ్గరగా ఉండటంతో భవిష్యత్తులో పారిశ్రామికాభివృద్ధి ఇతోధికంగా జరుగుతుంది.

# రవాణరంగం



స్వర్ణ పాండురంగారెడ్డి
శ్రీనాథ సాహితీ పరిషత్ అధ్యక్షులు

మన పట్టణంలో రైతుల పొలంపనులకు, వ్యవసా యోత్పత్తుల రవాణాకు మొదట రెండు చక్రాల ఎడ్లబండ్లు, నాలుగు చక్రాల పొట్టిబండ్లు ఉండేవి. మహాశివరాత్రికి కోటప్పకొండకు ప్రభను కట్టాలంటే నాలుగు రాతిచక్రాల గాన్ల బండ్లు ఉంటాయి. వాటికి చింతఇరుసులు అమర్చేదరు. ఆ రోజుల్లో ఎటు ప్రయాణము చేయాలన్నా రెండుచక్రాల సెగడా బండ్లు, టైరుబండ్లు ఉపయోగించేవారు. దూరపు ప్రయాణం చేయాలంటే ఆ బండ్లకు నాట్లు అమర్చి వాటిని వెదురుబద్ద లతో అర్ధచంద్రాకారంగా వంచి వాటిమీద ఈతచాపలను కట్టెదరు. ఈ విధంగా తయారుచేసిన బండ్లు ఎండ, వానల నుండి రక్షణగా ఉండేవి. ఆ బండ్లు నడుపుటకు ఎక్కువ శాతం ఎడ్లనే ఉపయోగిస్తారు. కొన్నిసార్లు దున్నపోతులను కూడా వాడేవారు.

ఆ రోజులలో మహారాష్ట్ర నుండి నరసరావుపేటకు వలస వచ్చిన 'అరకాలీలు' గుర్రపు బగ్గీలు నడిపేవారు. అవి ప్రయాణికులను చేరవేయడంలో కీలకపాత్ర వహించాయి. ఒక గుర్రపుబండి పేటలో తెల్లవారుజామున 3 గంటలకు బయలుదేరి కోర్టుసమయానికి గురజాల చేరుకుంటుంది. తిరిగి రాత్రి 9 గంటలకు పేట చేరుతుంది. జలసూత్రం పరమయ్యకు నాలుగు గుర్రపుబండ్లు ఉండేవి. అవి ప్రయాణికు లను గమ్యస్థానానికి చేరుస్తుంటాయి. అతనికి ఒక పందెపు గుర్రం కూడా ఉండేది. అత్యవసరంగా దూరప్రయాణం చేయా లంటే దాన్ని వాడేవారు. ఆ రోజుల్లో శ్రీ రాజా మల్రాజు రామకృష్ణ కొండలరావు క్రమంతప్పక గుర్రపుబండిపై (టాంగా) మునిసిపల్ హైస్కూలుకు వచ్చి చదువుకొనేవారు. పట్టణానికి చెందిన వైద్యవరేణ్యులు డా॥ కృష్ణదాసుగారు, డా॥ రాధాగారు గుర్రపుబండ్లపై రోగుల ఇండ్లకు వెళ్లి వైద్యం చేసే వారు.

సరుకు రవాణాకు తోపుడుబండ్లు, బల్లరిక్షాలు వచ్చినవి. మంగళగిరిలో తయారు చేయబడిన గూడురిక్షాలు వచ్చి ప్రయాణికులకు సౌలభ్యం చేకూర్చాయి. సైకిళ్లు కూడా బాగా ఉపయోగించేవారు. ఇప్పుడు ఆటోరిక్షాలు, జీపులు, వ్యానులు చుట్టుపట్ల గ్రామాలకు ప్రయాణికులను చేరవేస్తు న్నాయి. ట్రాక్టర్లు ఎక్కువగా వ్యవసాయానికి వాడుతారు. కొన్ని సందర్భాలలో ప్రయాణాలకు కూడా వాడేవారు.

ఆ రోజుల్లో శౌరయ్య బ్రదర్స్‌కు 50 బస్సులు, 16 లారీలు ఉన్నవి. ఎక్కువగా మిలటరీలో ఆక్షన్ వేసిన బస్సులు తెచ్చి మరమ్మత్తులు చేయించి తిప్పేవారు. గట్టి టైర్ల బస్సు గురజాల మీదుగా మాచర్ల వెళ్లేది. ఇంకో బస్సు వినుకొండ, గురజాల మరొకటి నరసరావుపేట, ఆరేపల్లి ముప్పాళ్ల మధ్య తిప్పేవారు. మొదట వైట్ పెట్రోలు, గ్యాసు, బొగ్గుబండ్లు వాడేవారు. క్రమేణ పెట్రోలు, డీజిల్ బండ్లు వచ్చినవి.

అవధానం బ్రహ్మయ్యగారికి పేట నుండి ఒంగోలు రూటు ఉండేది. పేట నుండి వినుకొండ, చిలకలూరిపేటలకు బస్సు సర్వీసులు నడిపారు. నర్సరావుపేట జమీందారుగారు పేట, సత్తెనపల్లి మధ్య ఫోర్డ్ ఇండియా బస్సు నడిపారు. పేటనుండి గుంటూరు వరకు కారుకొండయ్యగారు బస్సులు తిప్పారు. తుమ్మల రామరామకోటయ్యగారు అన్ని హంగులతో బస్సు రూట్లు నిర్వహించారు. ఆ రోజుల్లో జొన్నల వెంకయ్య గారు ఎక్కువగా 50 లారీలు, 50 బస్సులు నడిపేవారు. వారు, దొడ్డా బ్రహ్మారెడ్డి & సన్స్, ఎస్. శ్రీరాములుగారు చేజర్లకు బస్సులను త్రిప్పారు. శ్రీరాములుగారు మెకానిక్ కూడా! శ్రీరాములుగారు క్యాడార్జి బస్సు చేజర్లకు నడిపారు.

ఆ రోజుల్లో జూలకల్లు మన్నెం శివారెడ్డిగారికి కొన్ని సర్వీసులు ఉండేవి. వాటిని పేట నుండి మాచర్లకు త్రిప్పారు.

కేసానుపల్లి రామయ్యపంతులు గారికి 4 లారీలు ఉండేవి. వారికి పేటలో షెడ్ కూడా ఉండేది. స్వర్ణ పాండురంగారెడ్డి గారికి 4 లారీలు ఉండేవి. అందులో 2 లారీలకు వైట్ పెట్రోలు వాడేవారు. అందులో తెల్లకర్పూరం కూడా వేసేవారు. 2 లారీలకు గ్యాస్ ట్యాంకు అమర్చబడి ఉండేది. బొగ్గుకట్టెలతో బ్లోరుతో ఊదితేకాని అది ఎత్తుకొనేదికాదు.

ఆ రోజుల్లో ఆ వాహనాల డ్రైవింగు, మెకానిజమ్ నేర్చుకొనుటకై మద్రాసు వెళ్లి సింప్సన్ కంపెనీలో ట్రైనింగ్ అయి ఇక్కడ మెకానికల్ షెడ్లు పెట్టి ఎందరికో పని కల్పించిన వారిలో చినశౌరయ్యగారు, రాజావారి వద్ద పనిచేసిన లక్ష్మిశెట్టి కోటయ్యగారు, గడ్డం వేంకటేశ్వర్లుగారు, రాఘవరపు కోటేశ్వరరావుగారు, నాయర్‌గారు, గాలిరెడ్డిగారు, ఎం. పేర య్యగారు ఉన్నారు.

నరసరావుపేటలో తొలుత బస్సును నడిపిన ఘనులు రావిపాడు పొతకమూరి శౌరయ్య బ్రదర్స్. వారు 1916 సం॥ లో ఒక బస్సును తెచ్చారు. అప్పట్లో అది ఎంతో వింతగా ఉండేది.ఊరి జనమంతా వచ్చి చూచివెళ్లారు. పట్టణ వీధుల్లో ప్రదర్శనగా త్రిప్పినపుడు ఆ మోతకు భయపడి ప్రజలు ఇండ్లలోనికి పరుగులు తీశారు. వాటికి ఇప్పటిలా టైరు ట్యూబు లుండేవి కావు. చెక్క చక్రాలు చట్రానికి బిగించారు. ఆ విధంగా నడిచేది. తర్వాత మాగ్నటిజమ్‌తో నడిచేది. క్లచ్ క్రిందికి నొక్కితే ఫస్ట్ గేరులో నడిచి వదిలితే టాప్ గేర్‌లో పడి దాని ప్రయాణం సాగుతుంది. టార్చ్‌లైట్లు, సైకిల్ చైన్‌తో నడవటం ఆ బస్సు ప్రత్యేకత. చక్రాల బస్సు తర్వాత 1924లో డాడ్జి బస్సులు వచ్చాయి. వాటికి గాలిటైర్లు ఉండేవి. 1929లో చవర్లెట్, ఫోర్డులు వచ్చినవి. అవి బ్యాటరీలు సెల్ఫ్ స్టార్టర్ సహాయంతో నడిచేవి. 1944, రెండవ ప్రపంచ యుద్ధకాలంలో పెట్రోలు లభ్యం కాలేదు. దానికి ప్రత్యామ్నాయంగా 'సిమ్సన్' గ్యాస్ ప్లాంట్లు వచ్చాయి. బస్సు వెనుక భాగములో కొన్ని సీట్లు తొలగించి గ్యాస్‌ట్యాంక్‌ను అమర్చారు. ఆ ట్యాంకులో బొగ్గు నింపి బ్లోయర్‌తో రెండు గంటల పాటు ఎంతో యాతనపడి వెలిగించిన మరుక్షణం 'ధమ ధమ' శబ్దంతో ఇంజను స్టార్ట్ అయ్యేది. అలా బొగ్గు బస్సులను 1949 వరకు నడిపారు. తరువాత 1962 వరకు శౌరయ్య సోదరులు మామూలు బస్సులు నడిపి గుంటూరు జిల్లాలో పేరుగాంచారు. మొదట సైకిలును తెచ్చినది కూడా వీరే! ఇన్నయ్యగారి కుమారుడు చినశౌరయ్యగారు విమానం మెకానిక్‌గా కలకత్తా, ఇంగ్లాండు లలో పనిచేసి మొదట నరసరావుపేటకు రేడియో తెచ్చారు.

**మన నరసరావుపేట ఆర్టీసి :** ది. 01-08-1961లో 25 నుండి 30 సర్వీసులతో ప్రారంభింపబడినది. ప్రస్తుతం 85 ఆర్టీసి, 30 దాకా హైయ్యర్ సర్వీసులు వివిధ పల్లెపట్టణాలకు త్రిప్పుచూ ప్రజాసేవలో ఒక భాగంగా ఉన్నాయి. ప్రస్తుతం సూపర్ లగ్జరీ సర్వీసులు 17, డీలక్స్ సర్వీసులు 7, ఎక్స్‌ప్రెస్ సర్వీసులు 7, తెలుగువెలుగు సర్వీసులు 54, మొత్తం 85. అద్దెబస్సులు 30, మొత్తం 115 సర్వీసులు నడుస్తూ వున్నాయి. పేట అర్.టి.ఎ. వారి ఆఫీస్ సమాచారం మేరకు లారీలు 1,700, ట్రాక్టర్లు 3,200, బస్సులు 320, ఆటోలు 3,500, మోటారుసైకిళ్లు 80,000 ఉన్నాయి. పైన చెప్పిన వాహ నాలు సరుకు రవాణాకు, ప్రయాణికులకు స్కూళ్లు, కాలేజీలకు, విద్యార్థులకు ఉపయోగపడుతున్నాయి.

**రైల్వే రూటు :** 1880లో మచిలీపట్నం నుండి మర్మగోవా వరకు నరసరావుపేట మీదుగా రైలు మార్గం వచ్చినది. నరస రావుపేట మీదుగా మీటరుగేజ్ రైలు మార్గమున్నది. ఆ తర్వాత కోట్ల విజయభాస్కరరెడ్డిగారు సి.ఎం.గా, పి.వి. నరసింహారావు గారు ప్రధానిగా ఉన్న సమయంలో బ్రాడ్‌గేజ్‌గా మార్చినారు. ఇప్పుడు విద్యుత్‌లైను కూడా ఏర్పాటుచేస్తున్నారు. ఈ రూట్‌లో ప్యాసింజర్, ఎక్స్‌ప్రెస్ రైళ్లు, గూడ్స్ రైళ్లు ఎక్కువగా నడుస్తు న్నాయి. ఈ రైళ్ల వలన దూరప్రాంతాలు పోవువారికి ఎంతో సౌలభ్యం ఉన్నది.

**జల రవాణా :** ఈ నరసరావుపేటకు ప్రత్యక్షంగా జలరవాణా లేదు. అలా ఉపయోగపడే కాలువలు లేవు. నరసరావుపేటకు జలరవాణాలో వచ్చిన సరుకులను చినగంజాం, కొల్లిపర, విజయవాడ, పొందుగల మొదలగు రేవులనుండి బండ్ల మీద తెచ్చుకొనేవారు. ఒక్కొక్కసారి సరుకుల అమ్మకాలు, కొనుగోళ్లు అక్కడికక్కడే జరిగేవి. దాన్నే కోస్తావ్యాపారం అనేవారు.

ఆలా నరసరావుపేట రవాణారంగంలో వికాసాన్ని సాధించి ముందుకు పోవుచున్నది. •

# మన ఊరి బస్సు కథ



**బి. ఆంజనేయులు**

డిపోమేనేజరు, ఎ.పి.ఎస్. ఆర్టీసీ నరసరావుపేట డిపో

ఎంతో ఘనచరిత్ర కల్గిన మన నరసరావుపేటలో 32 బస్సులతో బస్సుడిపో ప్రారంభించడం జరిగింది. నరసరావుపేటకు దక్షిణంగా ఊరుచివర 1961 ఆగస్టు 1వ తేదీన 5 ఎకరాల 50 సెంట్ల విస్తీర్ణంలో గ్యారేజీ, ఇప్పటి బస్‌స్టాండు, మరియు స్టాఫ్‌క్వార్టర్స్ నిర్మించడం జరిగింది. అందులో పక్కా భవనాలు పరిపాలనకు, ప్లాట్‌ఫారమ్స్ మరియు ప్రయాణికుల కోసం రేకులషెడ్స్ నిర్మించారు. క్యాంటీన్, దేవాలయం కూడా ఇందులోనే ఉండేవి. పరిపాలనా భవనం ముందు చిన్న పార్కు ఉండేది. ఆ పార్కులో బుద్ధుని ధ్యానవిగ్రహం ఉండేది. అనంతరం బస్టాండు దక్షిణం వైపు ఉన్న ఎకరం యాభై సెంట్లు ఆర్టీసీ కొనడం జరిగింది. ఇందులో కోటప్పకొండ తిరునాళ్లకు ప్రత్యేక బస్‌స్టాండు ఏర్పాటు చేస్తారు. ప్రస్తుత డిపో ఏరియా మొత్తం 7 ఎకరాల 11 సెంట్లు.

**బస్‌స్టాండ్ నవీకరణ :**

నటరత్న నందమూరి తారకరామారావుగారు రెండవ సారి ముఖ్యమంత్రి అయిన తర్వాత ప్రయివేటు బస్సుల్ని జాతీయం చేశారు. ఆ సందర్భంగానే ప్రధాన పట్టణాల్లో బస్‌స్టాండులకు పక్కాభవనాలు నిర్మించారు. ఆ సమయంలోనే మన పట్టణడిపోకి కూడా రేకులషెడ్ల స్థానంలో పక్కా భవనాలు, చక్కనిప్లాట్‌ఫామ్‌లు కట్టించారు. 1987 సెప్టెంబరు 26వ తేదీన ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావుగారి చేతుల మీదగా అప్పటి హోం శాఖామాత్యులు డా॥ కోడెల శివప్రసాదరావుగారి అధ్యక్షతన బస్‌స్టాండు ప్రారంభించారు. ఈ బస్‌స్టాండు నిర్మాణం కోసం డా॥ కోడెల చేసిన కృషి మరువలేనిది.

**ఆర్టీసీ డిస్పెన్సరి :** డివిజన్ లో పనిచేస్తున్న సిబ్బందికి ఆరోగ్య సమస్యలు పరిష్కారానికి సంస్థ డిస్పెన్సరి ఏర్పాటు చేసింది. డివిజన్‌లో ఉన్న ఆరు డిపోల సిబ్బంది ఇందులో వైద్యసేవలు పొందుతున్నారు. క్వాలిఫైడ్ డాక్టరు, హెల్త్ స్టాఫ్ ఎల్లప్పుడు అందుబాటులో ఉంటారు.

**డివిజన్ హెడ్ క్వార్టర్స్ :** మన డిపోలోనే హెడ్ క్వార్టర్(డివిజన్) కార్యాలయాలు ఉన్నాయి. రన్నింగ్ సైడ్ డిప్యూటి ఛీఫ్ ట్రాఫిక్ మేనేజరు (DY. C.T.M.) గ్యారేజీసైడ్ డిప్యూటి చీఫ్ మెకానికల్ ఇంజనీర్, ఇద్దరు డివిజన్‌స్థాయి అధికారులు ఇక్కడే ఉంటారు.

**కోటప్పకొండ తిరునాళ్లు :** ప్రతి సంవత్సరం ఫిబ్రవరి లేదా మార్చినెలలో వచ్చే మహాశివరాత్రి సందర్భంగా కోటప్పకొండ తిరునాళ్లు జరుగుతుంది. స్పీకరుగారి కృషితో ఘాట్‌రోడ్ కూడా నిర్మించారు. నరసరావుపేట నుండి కొండపైకి 17 కి.మీ. దూరం. రెండు రోజులపాటు లక్షలాది ప్రయాణికుల్ని పేట నుండి కొండకి, కొండ నుండి పేటకి, పేట నుండి వారి గమ్యస్థానాలకు చేర్చేందుకు విశేషంగా కృషిచేస్తారు.

ప్రస్తుతం నరసరావుపేట డిపోలో 107 బస్సులు, రోజుకు సుమారు 40,000 కి.మీ. ప్రయాణిస్తాయి. 43, 800మంది ప్రయాణికుల్ని తమ తమ గమ్యస్థానాలకు చేరవేస్తున్నాయి. పట్టణ పరిసర గ్రామాలకు RTC సర్వీసులు ఉన్నాయి. హైదరాబాద్, బెంగుళూరు, తిరుపతి, శ్రీశైలం లాంటి దూరప్రాంతాలకు బస్సులు నడుపుతున్నాము. త్వరలో వైజాగ్‌కి కూడా బస్సుసర్వీసులు ప్రారంభించబోతున్నాము. పట్టణపౌరుల అవసరార్థం గత ఐదు సంవత్సరాల నుండి గుంటూరుకు నాన్‌స్టాప్ సర్వీసులు నడుపుతున్నాము.

ప్రయాణికు లందరూ 'ఇవి మాబస్సులు, మన బస్సులు' అని భావించడం వల్లనే ఆర్టీసీ సంస్థ మనుగడ సాగిస్తున్నది. అందుకే... 'ఆర్టీసీ ప్రజల కోసమోయి! ప్రగతి సాధనోయి! కాపాడరావోయి! కాపాడరావోయి!' ●

# పడక కుర్చీల పుట్టిల్లు



డా॥ పి.సి. వేంకటేశ్వరరెడ్డి
రిటైర్డ్ హిందీ రీడర్



అందమైన ఇంటికి ప్రధానమైన అలంకారం పడక కుర్చీలు, మడత మంచాలు. కొన్ని దశాబ్దాల క్రితం హైదరాబాద్, ముంబాయి, మద్రాసు, ఢిల్లీ, కలకత్తా మొదలైన ప్రధాన నగరాలలో ఫర్నీచర్ దుకాణాలలో నరసరావుపేట కుర్చీలు, క్యాంప్‌కాట్‌లు లభించు'నని బోర్డుపై ప్రత్యేకంగా వ్రాసి వుండేది. దీనిని బట్టి నరసరావుపేట కుర్చీలకు, మంచాలకు ఎంత పేరు వున్నదో తెలుస్తున్నది.

ఈ కుర్చీలు ఇంగ్లీషు వారి పరిపాలనలో పాలకుల మన్ననలను పొందాయి. ఒక దొరగారు ఈ కుర్చీని చూసి సంతోషించి, దానిని తయారుచేసిన వారికి బంగారు మెడలు ఒకటి బహూకరించారు. నాటి నుంచి ఈ కుర్చీకి నరసరావుపేట గోల్డు మెడల్ కుర్చీ అని పేరు వచ్చింది.

ఇది ముఖ్యంగా మధ్యతరగతి ఇండ్లలో కన్పిస్తుంది. ఇది విశ్రాంతి కావలసిన వారికి విశ్రాంతి నిస్తుంది. పిల్లలకు ఆటవస్తువుగా, చదువుకొనటానికి, వ్రాసుకొనుటకు, కాళ్లు చాపి నిద్రించటానికి చాలా అనుకూలంగా ఉంటుంది.

తక్కువ స్థలములో వేసుకొనే కాట్ నరసరావుపేట క్యాంప్ కాట్. అవసరము లేని సమయంలో దానిని మడచి ఒక మూల టేబుల్ మ్యాట్‌లా పెట్టుకొనవచ్చును. అవసరం అయినచో దీనిని ఎక్కడికైనా తీసుకొని వెళ్లి ఆనందంగా నిద్రించవచ్చును. అందుకే 'బారిష్టర్ పార్వతీశం' నవలలో రచయిత మొక్క పాటి నరసింహారావు వీటికి ప్రధాన స్థానం కల్పించారు.

ఇల్లాలి ముచ్చట్లు అనే వ్యాసంలో పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు ఈ కుర్చీతో హాస్యం పండించారు. తెలుగు సాంఘిక నాటకాలలో స్టేజీమీద నరసరావుపేట కుర్చీలు, మంచాలు ఎక్కువగా కనిపించేవి.

నరసరావుపేట కుర్చీలు, మంచాలు తయారు చేయటం 20వ శతాబ్దం మొదటి రోజులలో ప్రారంభమైంది. నరసరావుపేట రాజాగారు శ్రీ రాజా మల్రాజు గుండారావు బహద్దర్‌గారు యుద్ధానికి సంబంధించిన కత్తులు, కటార్లు తయారుచేయించుటకు తెలంగాణా ప్రాంతమైన హనుమకొండ నుంచి కొంతమంది పనివారిని పిలిపించారు. వారిలో షేక్ మదారు సాహెబ్ అనే వారు మొదటి బాబా సాహెబ్ బ్రదర్స్ అనే పేరుతో నరసరావుపేట కుర్చీలు, మంచాలు తయారుచేసి అమ్మేవారు. వీరు కుర్చీకి మంచాలకు కావలసిన ఇనుము తమ కార్ఖానా లోనే తయారుచేసుకొనేవారు. తరువాత వీరు కేరళ నుంచి ప్రత్యేకమైన చెక్కను తెప్పించుకొనేవారు. నాణ్యత, మన్నిక, అందం వీటి ప్రత్యేకత. వీరి తరువాత కందిపాటి హనుమయ్యగారు, కందిపాటి నారాయణగారు, కళ్యాణం నారాయణగారు మొదలైనవారు ఈ నరసరావుపేట కుర్చీలు, మంచాలు తయారుచేసి నరసరావుపేటకు మంచిపేరు తెచ్చారు.

కాలాంతరంలో ఇండ్లు చిన్నవైపోవటం వలన, ప్లాస్టిక్ సామానులకు ఆదరణ ఎక్కువ కావటం వలన జనం వీటిని కొనటం తగ్గించారు. ఇప్పుడు వీటిని సైజులు తగ్గించి ఇనుప సామాను లేకుండా చెక్కతో చిన్నవిగా అందంగా తయారుచేస్తున్నారు. దేశవ్యాప్తంగా మన నరసరావుపేటకు పేరును తెచ్చిపెట్టిన నరసరావుపేట క్యాంప్ కాట్, క్యాంప్ కుర్చీల కథ ఇది!



# చేతి వృత్తుల చేతాళం


జి.లక్ష్మి
టీచర్

కె. నాగపావని
టీచర్




**మే**దరవారు : వీరినే మహేంద్రకులంవారుగా పేర్కొంటారు. వీరు శివావతారంలో ఉన్న క్షేత్రయ్యను ఆరాధ్యదైవంగా కొలుస్తుంటారు. నరసరావుపేట పట్టణంలోని 'మేదరు బజారు' లో దాదాపు 200 కుటుంబాలవారు నివసిస్తున్నారు. దాదాపు 50 కుటుంబాలవారు కులవృత్తితో జీవనం కొనసాగిస్తు న్నారు. విసనకర్రలు, ధాన్యం నిల్వవుంచే గాదెలు, నిచ్చెనలు, తడికలు, తడికలతో చేసిన తలుపులు, తట్టలు, ఎడ్ల బండిపై సరుకులను రవాణా చేయడానికి జల్లలు, కావిడిబద్దలు, కావడి మట్లు, బట్టలబుట్టలు, దేవుడి బుట్టలు, పాముబుట్టలు, రైతులు ఎలుకలను పట్టుకొనే బుట్టలు, చేటలు, దేవరలను ఊరేగించే మేదరపెట్టెలు, పసిపిల్లల ఊయలలు, స్త్రీల అలంకరణ పెట్టెలు, పెండ్లికుమార్తెకు పంపించే ప్రదానం పెట్టె మొదలైన వాటిని తయారుచేస్తుంటారు. చేతులతో వీటిని అల్లుతారు. ఈ వృత్తికి కావలసిన వెదురు నల్లమల అడవులలో దొరుకు తుంది. ముడిపదార్థానికి ఎక్కువ మొత్తాన్ని వెచ్చించడం వల్ల వారికి లభిస్తున్న ఆదాయం అంతంత మాత్రమే! వీరికి ముడి సరుకు తేలికగా లభ్యం కావాలంటే ప్రభుత్వ స్థలాల్లోనూ, ఖాళీగా ఉన్నటువంటి ఎసైన్‌లాండ్, ఫారెస్ట్ లాండ్స్, చెరువు అంచుల వెంట, వాగుల అంచుల వెంట, కుంటల చుట్టూ వీటిని పెంచితే ఈ స్థలాలు ఆక్రమణకు గురికాకుండా ఉంటాయి. తద్వారా వీరి వృత్తిని ప్రోత్సహించి పర్యావరణాన్ని కాపాడినవా రవుతారు.

**కుమ్మరివారు :** వీరినే శాలివాహనులుగా పేర్కొంటారు. నరస రావుపేట పట్టణంలో దాదాపు 20 కుటుంబాలవారు అచ్చంగా ఈ వృత్తిమీద జీవిస్తున్నారు. ఒకప్పుడు నరసరావుపేట పట్టణ చెరువులోని నల్లమట్టిని, యడవల్లి మట్టిని సేకరించి నల్లకుం డలు, పిడతలు, మూకుడులు, రంధ్రాల మూకుడులు, సాంబ్రా ణి ఉద్ధనాలు, దీపప్రమిదలు, ముంతలు, కూజాలు, తాబేటి కూజాలు, బియ్యం, పిండి, పప్పుధాన్యాలు నిల్వఉంచడానికి గరిసెలు, డబ్బుల ముంతలు, నేతి ఉగ్గుగిన్నెలు తయారు చేసేవారు. ఎర్రకుండలు చేయడానికి సంగంజాగర్లమూడి నుండి, కొండవీడునుండి ఎర్రమట్టిని తెచ్చేవారు. ఈ వృత్తికి ప్రోత్సాహం లభించాలంటే వారికి కావలసిన ముడిపదార్థం 'మట్టి' కాబట్టి ఆ మట్టి దొరికే ఏర్పాట్లు చేయాలి.

**వడ్రంగివారు :** నరసరావుపేట పట్టణంలో వడ్రంగి పనిలో ఆరితేరినవారున్నారు. నరసరావుపేట జమీందారుగారి ఆస్థా నంలో పెదఖాసింసాహెబుగారు మంచిపనివాడుగా పేరుగాం చాడు. ఆయన తయారుచేసిన వస్తువులు లండన్‌కు కూడా వెళ్లాయి. ఆ రోజుల్లో పందిరి మంచాలు, ఈజీచైర్స్, కాంప్ కాట్, డైనింగ్ టేబుల్స్, ఛైర్స్, టీపాయ్స్, ఇంటిసామగ్రి, అల్మారాలు, బీరువాలు, టేబుల్ స్టాండ్సు మొదలైనవి అందంగా నీడ కనిపించేట్లుగా చేస్తారు. తలుపులు, దర్వాజాలు, దర్వాజాలపై అందమైన లతలు, నెమళ్లు, అశ్వాలు, ఏనుగులు మొదలైన బొమ్మలతో వాకిళ్లపై డిజైన్స్ చెక్కించేవారు. అడపా పానకాలు, బెల్లంకొండ హనుమయ్య, మీనా సుబ్బులు, బలుకూరి సత్యనారాయణ (పెద్దబ్బాయి)గార్లు, ఇంకా మరికొందరు ఈ వస్తువుల తయా రీలో నిపుణులుగా పేరుగాంచారు. షేక్ మౌలాలి, షేక్ పెద లాలు, జంగ్లీ, దస్తగిరి గాలీబు, సుభాని, కాయల సూరి, కొలగాని కోటయ్య మొదలైనవారు రాట్నాలు, బండ్లు చేయ డంలో సిద్ధహస్తులు. కళ్యాణం హనుమయ్యగారు, కందిపాటి హనుమయ్యగారు, పాటిబండ్ల ముత్తయ్యగారు కాంప్‌కాట్స్ చేయటంలో పేరుగాంచారు. పాటిబండ్ల ముత్తయ్యగారు కాంప్‌కాట్స్ కోసం 1930 ప్రాంతంలో బరంపేటలో కుటీర పరిశ్రమ పెట్టి కొంతమందికి ఉపాధి కల్పించారు. 1940లో గాల్‌సాహెబ్‌గారు కూడా కార్ఖానాను ఏర్పాటుచేశారు.

పెదఖాసిం, చినఖాసింగార్లు రెండుచక్రాల ఎద్దులబండి, ట్రైల్లబండి, చకడాబండ్లు, పీపాబండ్లు, ఒంటెద్దుబండ్లు, గుర్రపుబండ్లు, రాజాగారికి రెండు గుర్రాల బండ్లు, నాలుగు గుఱ్ఱాల బండ్లను ఎంతోనైపుణ్యంతో చేశారు. 1930 నాటినుండి 4 గుర్రాల బండ్ల వాడకం తగ్గించి రెండు గుఱ్ఱాల బండ్లను మాత్రమే వాడేవారు.

కాడిమాను, నాగలి, 4 చెక్కల గొర్రు, 6 చెక్కల గొర్రు, నాలుగు చెక్కల, 3 చెక్కల గుంటకలు, జడ్డిగం (విత్త నాలు పెట్టేది) కందిబుర్ర, చిన్నకోల, కాడిశిల, వార్నిపీట, విత్తనాల గొర్రులు రైతులకు ఉపయోగపడే వ్యవసాయ పని ముట్లు చేసేవారు. నన్నెసాహెబు, మీరాసాహెబుగార్లు ఇద్దరు సోదరులు వ్యవసాయపు పనిముట్లను తయారుచేసేవారు.

30 సంవత్సరాల క్రితం వరకు నరసరావుపేట పట్ట ణంలో నీటిని చెక్కపీపాలతో సరఫరా చేసేవారు. ఆ చెక్క పీపా నిర్మాణం ఒక అద్భుతం. నీటిని ఒక్క చుక్క కూడా నీరుపోకుండా తయారుచేయడం గొప్పవిషయం. ఆరు అంగు ళాల టేకుబద్దతో వాటికి గాడిని అమర్చి రెండువైపులా ఇనుపపట్టాలతో బిగిస్తారు. నీళ్లు పోయడానికి తుప్పులేకుండా ఉండడానికి చెక్కతో చేసిన గరాటును వాడుతారు. బ్యాక్టీరియా, ఫంగస్‌లను నిరోధించడానికి వేపాకులను వేడినీటిలో మరి గించి కషాయం తయారుచేసి ఆ నీటితో పీపాను శుభ్రం చేసేవారు. పాత వేంకటేశ్వర్లు, గోగుల హనుమయ్యగార్లు చెక్కపీపాలను తయారుచేసేవారు. గోగుల హనుమయ్యగారు కలపతో ఇంటినిర్మాణం చేసేవారు.

షేక్ సైదాగారు, రాఘవరపు వేంకటేశ్వర్లుగారు దేవ స్థానం తలుపులను కలపతో అందంగా చేసేవారు. రాఘవరపు వెంకటేశ్వర్లుగారు ట్రక్కులకు, లారీలకు బాడీలను కలపతో కట్టేవారు. చలమయ్యగారు ఇంటి ఫర్నీచర్, హోటల్ ఫర్నీ చర్, మంచి విలువైన కలపవస్తువులను చేసేవారు. గాసి సుబ్బారావుగారు డైనింగ్ టేబుల్స్, చైర్స్, ఇంటిఫర్నీచర్ చేయ డంలో నైపుణ్యం కలవారు.

**మత్స్యకారులు** : నరసరావుపేట పట్టణంలో 800 కుటుంబాల వారు చేపలు పట్టడం, చేపలును విక్రయించే వృత్తిపై ఆధార పడిఉన్నారు. మన పట్టణంలో మత్స్యకారవృత్తిని యానాది కుటుంబాలకు చెందినవారు కులవృత్తిగా అవలంబిస్తున్నారు. ఈ వృత్తిపై పరోక్షంగా దాదాపు 2,000 కుటుంబాలు ఆధారపడి వున్నాయి. నరసరావుపేట మునిసిపాలిటీ ఈ సంఘానికి స్థలాన్ని ఏర్పాటుచేసి మార్కెట్‌ను నిర్మించింది. మత్స్యశాఖవారు ఈ సంఘానికి దాదాపు రూ. 10,00,000/ – వ్యయంతో రెండు వరుసలలో 8 షాపులు కట్టించారు. ఫిషరీస్ డిపార్ట్‌మెంట్‌వారు 98% సబ్సిడీతో 94 సైకిళ్లను,1980 ప్రాంతంలో స్థలాలను వీరికి ఇచ్చారు. ఇంకనూ బిల్డింగ్ రిపేరు కోసం 5 లక్షల రూపాయలు వెచ్చిం చారు. ప్రస్తుతం 15 లక్షల వ్యయంతో వీరి కోసం కమ్యూ నిటీహాల్ కట్టే ఆలోచనలున్నాయి. ఇక్కడ బొచ్చె, రాగండి, కొర్రమీను, బొమ్మిడాలు, వాలుగ వంటి చేపలు బయట చెరు వులు, వాగులు, చుట్టుప్రక్కల నుండి తెచ్చి, పట్టణంలో అమ్ము కుని జీవనం సాగిస్తున్నారు. ఇక్కడ రొయ్యలు, ఎండుచేపలు కూడా విక్రయిస్తున్నారు. ఈ సంఘంలో సభ్యులకు ప్రతి వ్యక్తికి 3,000 చొప్పున రెండు సార్లు 'లోన్స్' ఇచ్చారు. అదేవిధంగా 2008 సం॥లో 200మంది మహిళలు కలసి ది నరసరావుపేట గిరిజన మత్స్యకార మహిళాసహకార సంఘం లి. 93 ఏర్పడింది. ఈ సంఘం డ్వాక్రా మహిళలతో నడుపుతున్నారు. ప్రస్తుతం మార్కెట్‌లో చేపలు నిల్వచేయ డానికి, ప్రోసెస్ చేయడానికి 7 ఐస్‌బాక్సులు ఉన్నాయి. వాటి సంఖ్య పెరిగితే మంచి ఫలితాలు ఉంటాయి.

**కమ్మరులు** : వీరినే బయటకమ్మరులు అంటారు. దాదాపు 4 తరాల నుండి నరసరావుపేట పట్టణంలో 10 కుటుంబాల వారు నివసిస్తున్నారు. వీరి వృత్తి కమ్మరం. చెంచు, కోయ, లంబాడీవారి మాదిరిగా వీరికి 'మరుగు' అనే భాష కలదు. దీనికి లిపి లేదు. వీరు గడ్డపలుగులు, కొడవళ్లు, నాగలి, కఱ్ఱులు, చెలగపారలు, గొడ్డళ్లు, కత్తిపీటలు, దోకుడుపారలు, కట్టర్లు, శ్రావణాలు మొదలైన ఇనుపపనిముట్లు తయారు చేస్తారు. వీరికి మొదటిలో పెద్దచక్రంతో కొలిమి వుండేది. ఇప్పుడు చిన్నకొలుములు ఏర్పాటు చేసుకుంటున్నారు. ఈ కొలుములకు ఇంధనంగా వరిపొట్టు, సెనగపొట్టు, పిడకలు, కర్రబొగ్గు, రైలుబొగ్గును వాడుతుంటారు. వీరు పెద్దకూర

గాయల మార్కెట్ వద్ద కొలుములు పెట్టుకుని జీవిస్తున్నారు. 'కమ్మరి తెగ (ఎస్.టి.) గిరిజన సంక్షేమసేవాసంఘం' 465 వీరి సేవ నిమిత్తం ఉంది. ప్రభుత్వపరంగా కొలిమిలోకి ఇంధనంగా రైలుబొగ్గును కేటాయించాలని వీరు కోరుకుంటున్నారు.

**స్వర్ణకారులు** : నరసరావుపేట పట్టణంలో స్వర్ణకార వృత్తికి సంబంధించిన అన్ని విభాగాలలో నిపుణులు ఉన్నారు. పట్టణంలో దాదాపు 100 కుటుంబాలవారు స్వర్ణకారవృత్తితో జీవిస్తున్నారు. ఒకప్పుడు గృహాల వద్దే ఈ వృత్తిని నిర్వహించేవారు. ప్రస్తుతం మెయిన్‌బజారులో ఈ పనిని నిర్వహిస్తున్నారు. చెక్కుడు పని, రాళ్లబిగింపు పని ప్రముఖులలో సుంకర షణ్ముఖాచారిగారు ఒకరు. వారు శుభలేఖలు చెక్కడంలో ప్రసిద్ధులు. వారిని మాచర్లలో స్వర్ణకంకణంతో సన్మానించారు. తీగల మిషను, కుంపటి, బోర్లు, పట్టెడ, పట్టకార్లు, శ్రావణాలు, జవగారు, బొమ్మల అచ్చులు, ధర్మకాటా, కటింగ్ మిషన్, ఎనామిల్ మిషన్- ఇవి వారికి వృత్తికి కావలసిన ముఖ్య సామాగ్రి. ఆ రోజుల్లో నంద్యాల, త్రిపురాంతకం, మార్కాపురం, చిలకలూరిపేట, సత్తెనపల్లి, పొదిలి, దర్శి, పలనాడు, ఎర్రగొండపాలెం, దోర్నాల తదితర ప్రదేశాలనుండి నగిషిపని కోసం సిద్ధు వేంకటాచారిగారి వద్దకు వచ్చేవారు. ప్రముఖ సినీనటుడు, మాజీ ముఖ్యమంత్రి నందమూరి తారక రామారావుగారికి కిరీటం రూపొందించి వారిచే సన్మానం పొందారు.

డైమిషన్ వర్క్‌లో బొమ్మలు దింపడంలో ఆ రోజుల్లో నరసరావుపేటకు పలనాడు, రాయలసీమ జిల్లాలనుండి పెక్కు మంది పనివారు వస్తూఉండేవారు. తాటికొండ అన్నప్పగారి కుమారులు ఆంజనేయులుగారు, ఈ బొమ్మలు దించడం డై వర్క్‌లో ప్రథములు.

ఈ విధంగా శ్రమైకజీవనులైన చేతివృత్తులవారు మన పట్టణానికి వెన్నెముకగా ఉన్నారు. ●

# నవ్వుతున్న బియ్యం



**వూరా భాస్కరరావు,** ఉపాధ్యక్షులు, ఆం.ప్ర. రాష్ట్ర రైస్‌మిల్లర్స్ అసోసియేషన్

నేను గుంటూరు జిల్లా అసోసియేషన్‌కు ప్రస్తుతము అధ్యక్షుడుగా ఉన్నాను. మన పట్టణ ప్రముఖులైన డా॥ కోడెల శివప్రసాదరావుగారు, కాసు వేంకటకృష్ణారెడ్డిగారు మా ఇండస్ట్రీకి సంబంధించిన పౌర సరఫరాలశాఖల మంత్రులుగా వుండటం మనకు గర్వకారణం.

మా రైస్‌మిల్ ఇండస్ట్రీ కేవలం లాభార్జన కొరకే కాకుండా సేవాకార్యక్రమంలో కూడా ముందంజలో ఉంది. 6 సంవత్సరముల క్రిందట కర్నూలునందు తీవ్రమైన వరదలు వచ్చినపుడు బాధితులకు సుమారు 15 లక్షల రూపాయల బియ్యం, బట్టలు పంపిణీ చేయటం జరిగింది. ఇటీవల ఉత్తరాంధ్రలో హుదూద్ తుఫాన్ సమయంలో బాధితుల సహాయార్థం మన స్పీకర్‌గారి పిలుపు మేరకు షుమారు 22 లక్షల రూపాయల బియ్యం మరియు ఆహారపు పొట్లాలు రాష్ట్ర మంత్రివర్యులు ప్రత్తిపాటి పుల్లారావుగారిద్వారా పంపిణీ చేయటం జరిగింది. ది. 2-10-2015న గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రి అభివృద్ధి నిమిత్తం మన రాష్ట్రముఖ్యమంత్రి గౌ॥ నారా చంద్రబాబు నాయుడుగారికి 10 లక్షల రూపాయల చెక్కును జిల్లా కలెక్టర్ శ్రీ కాంతిలాల్‌దండే మరియు మంత్రివర్యులు ప్రత్తిపాటి పుల్లారావుగారు జిల్లా ప్రజాప్రతినిధుల సమక్షంలో అందజేయుట జరిగింది. గోదావరి పుష్కరాల సందర్భముగా భక్తులకు అన్నదానం నిమిత్తం ఉచితంగా బియ్యం పంపించుట జరిగింది. కోటప్పకొండలో గత 6 సంవత్సరాల నుంచి శివరాత్రి పర్వదిన సందర్భముగా భక్తుల సౌకర్యార్థం ఉచితంగా మజ్జిగ పంపిణీ చేయుట జరుగుతున్నది.

నరసరావుపేట మున్సిపాలిటీ శతజయంతి ఉత్సవాలు జరుగుచున్న సందర్భముగా నవ్యాంధ్ర తొలిసభాపతి డా॥ కోడెల శివప్రసాదరావుగారి దార్శనికత్వంలో శాసన సభ్యులు డా॥ గోపిరెడ్డి శ్రీనివాసరెడ్డిగారు, చైర్మన్ నాగసరపు గుప్తాగారి ఆధ్వర్యంలో శ్మశానవాటికలో నరసరావుపేట రైస్ మిల్లర్స్ వారిచే బాత్‌రూమ్‌లు నిర్మించుట జరిగింది.

రైతులు పండించినధాన్యానికి గిట్టుబాటుధర చెల్లిస్తూ వినియోగదారులకు నాణ్యమైన బియ్యం సరసమైన ధరలకు విక్రయించి ప్రభుత్వంవారికి పన్నుల రూపంలో అధిక మొత్తములో ఆదాయం సమకూరుస్తున్నాము. అనేక వేలమందికి ప్రత్యక్షంగా పరోక్షంగా ఉపాధి కల్పిస్తున్నాము, పేదప్రజలకు ప్రజాపంపిణీనిమిత్తం సకాలంలో ప్రభుత్వంవారికి లెవీబియ్యం అందిస్తున్నాము. సుమారు 350 మంది సభ్యులతో వందల కోట్ల రూపాయల లావాదేవీలతో విరాజిల్లుతున్న గుంటూరు జిల్లా రైస్‌మిల్లర్స్ అసోసియేషన్‌కు నరసరావుపేట ప్రముఖులు సారథ్యంవహిస్తూ బాధ్యతలు ఎంతో సమర్థవంతంగా నిర్వహిస్తూ మన పట్టణానికి ఎనలేనిఖ్యాతి తెస్తున్నారు. ●

# బీమాతో ధీమా



## మేడం రామచౌడారెడ్డి

చీఫ్ లైఫ్ ఇన్సూరెన్స్ అడ్వయిజర్

భారతీయ బీమాసంస్థ (ఎల్.ఐ.సి.) మన పట్టణము లో ది. 01-06-1961న ఉపకార్యాలయముగా స్థాపించ బడినది. కాలక్రమేణ అభివృద్ధి చెందుచు 1974లో సంపూర్ణ వసతులు గల శాఖాకార్యాలయముగా ఏర్పడి అసంఖ్యాకులైన పాలసీదారులకు అవసరమైన సేవల నందించుచున్నది. మన ఎల్.ఐ.సి. సంస్థనుండి 1984 లో గురజాలలోనూ, 1986లో చిలకలూరిపేటలోనూ, 1988లో వినుకొండలోనూ కార్యాలయములు ఏర్పాటైనవి.

మన నరసరావుపేట పురపాలక సంఘానికి మాజీ చైర్‌పర్సన్ పదవి నలంకరించిన శ్రీమతి జి. జోగేశ్వరమ్మగారు ఎల్.ఐ.సి. ఏజంట్ రత్నమే! మన నరసరావుపేట, పరిసర ప్రాంతప్రజలకు కావలసిన రక్షిత మంచినీటి తటాకములు నకరికల్లులోను, శాంతినగర్‌లోను నిర్మించబడినవి. ఈ తటాకముల నిర్మాణమునకు మన ఎల్.ఐ.సి. సంస్థ 5 కోట్ల రూపాయలు స్వల్పమైన వడ్డీతో ఋణముగా నిచ్చినది. నరసరావుపేట ద్విశతాబ్ది ఉత్సవాలలో పట్టణ సుందరీకరణకు రూ. 50,000/-లు విలువగల ట్రీ గార్డ్సు పంపిణీ చేశారు. ఎల్.ఐ.సి. ఏజంట్లు పట్టణములోని అనాథ శరణాలయాలకు ప్రతి సంవత్సరము విరాళాలు ఇస్తున్నారు. ప్రకృతి వైపరీత్యాలు జరిగినపుడు చందాలతో బాధితులను ఆదుకుంటున్నారు. ఎల్.ఐ.సి. గోల్డెన్ జూబ్లి ద్వారా వికలాంగులకు, ఆసుపత్రులకు, పాఠశాలలకు ఆర్థిక వస్తు సహకారం మరియు బీద విద్యార్థులకు ఉపకార వేతనములు అందజేస్తున్నది.

మన ఊరి ఎల్.ఐ.సి. బ్రాంచి కార్యాలయము ది. 12-08-1993 తేదీన సొంతభవనముల లోనికి మార్చబడినది. ప్రస్తుతము నరసరావుపేట, నకరికల్లు, రొంపిచర్ల, ముప్పాళ్ళ మండలములలోని 51 గ్రామములలో ఎల్.ఐ.సి. పట్టాదారులు కలరు. ఈ సంస్థ సుమారు 457 మంది ఏజంటు మిత్రులతో 50 మంది కార్యాలయ అధికారులు మరియు సిబ్బందితో 2,73,575 మంది పాలసీదారులకు విశిష్టమైన సేవల నందించుచున్నది.

2014-2015 ఆర్థిక సంవత్సరంలో 1102 కోట్ల రూపాయలు బిజినెస్ చేయుట జరిగినది. ఈ మొత్తమును 7509 పాలసీల ద్వారా సేకరించుట జరిగినది. పరిష్కరించిన డెత్ క్లైమ్‌లు 442, వీటికి చెల్లించిన మొత్తము రూ. 4,69,36,743/-లు. మెచ్యురిటీ క్లైమ్‌లు 6565, వీటికి చెల్లించిన మొత్తము రూ. 17,01,01,361/-లు.

"ప్రజల డబ్బు - ప్రజల కొరకు" అనే నినాదంతో ప్రారంభమైన ఎల్.ఐ.సి. అవినీతి లేకుండా భారతదేశ ఆర్థిక ప్రగతికి, పంచవర్ష ప్రణాళికలకు పెట్టుబడి పెట్టి, దేశాభివృద్ధిలో పాలుపంచుకుంటున్నది. ఈ స్ఫూర్తితోనే మన నరసరావుపేట బ్రాంచి కూడా ముందుకు సాగుచున్నది. ●



ఎల్.ఐ.సి. ఆఫీస్ భవనం

# ఇంపైన వంటకంబు

నంద్యాల జగన్‌మోహన్‌రెడ్డి,
వార్త స్టాఫ్ రిపోర్టర్, నరసరావుపేట



"ముద్దపప్పు... గొడ్డుకారం... గడ్డ పెరుగు...
చికెన్ వేపుడు... మటన్ పులుసు... రొయ్యల కర్రీ...
నోరూరించే గోంగూర... జీరా అనిపించే అవకాయ...
ఇడ్లీ... సాంబారు... పూరి... చపాతి... హాట్ పొంగలి...
పులిహోర... చిట్టి గారెలు... నేతి మిఠాయిలు...
ఆప్యాయతలకు వేదికలు –
నరసరావుపేట ఫలహార శాలలు,భోజనశాలలు.."

నరసరావుపేటకు రాజకీయ ప్రత్యేకత, ఆధ్యాత్మిక, చారిత్రక ప్రాధాన్యతతో పాటు భోజన, ఫలహారశాలల ప్రత్యేకతలోనూ మంచి పేరు ప్రతిష్ఠలు ఉన్నాయి. పూటకూళ్ళ కాలం నుండి నేటి రెస్టారెంట్‌లు, హోటల్స్ వరకు అద్భుతమైన అవ్వారే అనిపించే తినుబండాలకు, ఫలహారాలకు మంచి వేదికలుగా కొనసాగుతున్నాయి. విద్యకై రైలు దిగివచ్చే రాయల సీమ బిడ్డలకు ఆనాటి రాజకీయ అవసరాలు, అవకాశాలు ఉద్యోగాల కోసం తలపండిన కాసు సోదరుల ఆశీస్సులకు వేచి చూసే వివిధ జిల్లాల వారికి ఇక్కడి పూటకూళ్ళు, హోటల్స్ అద్భుతమైన ఆతిథ్యాన్ని అందించేవి. మంచి రుచితో పాటు శుచిగా కూడా ఉండేవి. ఎటువంటి గ్రైండర్లు, మిక్సీలు లేని కాలంలోనూ రోళ్ళు, పొత్రాలు ఉపయోగించి రుబ్బి ఇచ్చే పిండితో తయారు చేసే ఇడ్లీ, పులిహోర, చపాతిలు, పూరీలు, చిట్టి గారెలు, ఉల్లి, పెసర దోసెలకు ప్రముఖులు కూడా గులాంలు అయ్యేవారు. కొన్ని హోటల్స్, భోజన శాలలకు ఇప్పటికి అభిమానులుగా కొనసాగుతున్నారంటే వీటికి ఎంత పేరు ప్రఖ్యాతులు ఉన్నాయో మనకు తేలికగానే అర్థమవుతుంది.

**నరసరావుపేట ఫలహార, భోజన శాలలకు ఘనమైనచరిత్ర :**

1950వ దశకం నుండి పల్నాడు ముఖ ద్వారమైన నరసరావు పేటలో కమర్షియల్, చెప్పుకోతగిన ఫలహార, భోజనశాలలు ప్రారంభమైనట్లు అప్పటి పెద్దలు చెప్తుంటారు. పూర్తిగా శాఖాహారంతో పాటు మంచి మంచి రుచికరమైన వెరైటీలతో మాంసాహారాన్ని కూడా అందించే హోటల్స్ పట్టణంలో ప్రత్యేకంగా ఉండేవి. అప్పటి రోజుల్లోనే (1960) నరసరావుపేటలోని ఫలహారశాలల్లో స్థానికులతో పాటు కర్ణాటక, కేరళ, పంజాబ్, రాజస్థాన్‌ల నుండి వలస వచ్చిన అనేక మంది వంట మాస్టార్లు ఇక్కడి హోటల్స్‌లో ఆహార తయారీలో ప్రధాన పాత్ర పోషించేవారు. ఇతర జిల్లాలు, రాష్ట్రాల వారి భాగస్వామ్యాన్ని వినియోగదారుల అభిరుచికి అనుగుణంగా తయారుచేశారని చెప్పుకోవడం సముచితం. ప్రస్తుతం (2000-16) ఊరి శివార్లలో వెలసిన దాబా హోటల్స్‌ను నేటి పంజాబ్, రాజస్థాన్‌కు చెందిన వారు పూర్తిగా నిర్వహిస్తున్నారు. అదే విధంగా పట్టణంలోని కొన్ని కాఫీ, టీ పాయింట్‌లు కూడా వారి నిర్వహణ లోనే అక్కడక్కడ నడుస్తున్నాయి. ప్రాంతాలు, కుల,మతాలు లేని ఈ రంగం 1950 నుండి పూర్తి స్థాయిలో ప్రారంభమై నేటికి అనేక మార్పులు, చేర్పులతో, హంగులు హైటెక్ సోకులతో రుచిలో, శుచిలో ఆ నాటి వాసనలను నాటికి నేటికి నిలుపుకుంటూ ఆహార ప్రియుల మదిలో పదిలంగా కొనసాగుతున్నాయి.

1958లో కేరళ పాలఘాట్ జిల్లా నుండి వచ్చిన మహలక్ష్మమ్మ చేతితో ప్రారంభమైన వసంతవిహార్ 60 సంవత్సరాలకు పైగా నేటికీ కొనసాగుతున్నది. అభ్యుదయ వాదులు, సామాజికవేత్తలు, ప్రజా సంఘాల నాయకులకు కేరాఫ్ అడ్రస్‌గా అప్పట్లో ఉన్న వేణు కేఫ్, మణికేఫ్, మెడ్రాస్ కేఫ్‌లు వేదికలుగా నిలిచేవి. సామాన్యులకు అందుబాటులో ఉండే విధంగా పుట్టయ్య హోటల్ నిలిచింది. ఆప్యాయతలను, అనురాగాన్ని పంచిపెట్టేది. శాంతినివాస్, చాలా మందికి అర్ధరాత్రి నుండే అందించే దెయ్యం హోటల్, రైలు ప్రయాణికు లతో పాటు పట్టణంలోని విద్యావేత్తలకు, అధ్యాపకులకు ఆతిథ్యం ఇచ్చిన రైల్వే క్యాంటీన్‌ను ఇప్పటికీ మరువలేరు. సాంప్రదాయ ఫలహారశాలగా పేరుగాంచిన మూర్తికేఫ్, మూర్తి విలాస్‌లతో పాటు చిన్న, పెద్ద అందరిని ఆదరించిన కోదూరు

వెంకమ్మ పూటకూళ్ళతో పాటు వేళాపాళా నియమంలేని 24 గంటల హోటల్స్‌గా కేరళ కాకా హోటల్, మల్బార్ హోటల్ నేటికి అందరి మదిలో ఉంది. నాన్‌వెజ్ ప్రియులకు ఆతిథ్యం ఇచ్చిన కేరళ, మలాంజి హోటల్స్, మడికట్టుకొని మరీ శుచి, శుభ్రతలతోఫలహారాలనుఇంటింటికి అందించిన హనుమత్ శాస్త్రి; చేపలు, మటన్, రొయ్యలు, చికెన్ కర్రీలతో మరుపురాని విధంగా ఉండే మాయమస్తాన్ హోటల్, తెనాలి చౌదరిగారి భోజనశాల, కుటుంబసభ్యులకు ఆతిథ్యం ఇచ్చిన మనోరమ హోటల్స్ అద్భుతం. వి.వి. గిరి, డిజిపి నాయక్, సినీనటులు రావు గోపాలరావు, రాజనాల, జగ్గయ్య, సూర్యకాంతం, మాజీ ముఖ్యమంత్రులు ఎన్టీఆర్, బ్రహ్మానందరెడ్డి వంటి వారికి ఎన్.ఎస్.పి. గెస్ట్‌హౌస్‌లో ఫలహారాలను అందించిన కేరళ వాసి నారాయణ నాయర్‌ను ఇక్కడ ప్రస్తావించడం అవసరం. పోలీస్ స్టేషన్ ఎదుట ఉన్న బ్రహ్మయ్య అల్పాహారశాల చట్నీ రాష్ట్రఖ్యాతి గాంచింది. మల్లమ్మసెంటర్‌లో వెంకటప్పయ్య హోటల్ అల్పాహారానికి పెద్ద పేరుగా నిలిచింది. రామిరెడ్డి పేటలోని ఆంజనేయస్వామి దేవాలయం వద్ద నిర్వహించిన పేరమ్మ మెస్ అప్పట్లో అన్ని వర్గాలలోనూ మంచి పేరును కలిగి ఉండేది. ఎస్ఎస్ఎన్ కళాశాలలోని గోపాల్ క్యాంటిన్ వందలాది మంది విద్యార్థుల ఆకలిని తీర్చడంతో పాటు సమీప ప్రాంతాల వారు ఇక్కడ తయారయ్యే అల్పాహారాలకు అభిమానులుగా ఉండేవారు. 1967 ప్రాంతంలో గల్లా పిచ్చమ్మ ప్రత్యేకంగా విద్యార్థుల కోసం భోజనశాలలను నిర్వహించే వారు. కోట సెంటర్‌లో ఉన్న చలమయ్య హోటల్ అద్భుతంగా ఆహార ప్రియులను ఆకర్షించేది. అదే విధంగా వీరితో పాటు మార్కెట్ సెంటర్‌లో బంగారయ్య హోటల్, సుకుమంచి మాణిక్యమ్మ, కూకట్లపల్లి కృష్ణారెడ్డి హోటల్, గారెల కోటయ్య, ఇడ్లీల వెంకయ్య, బుల్లెమ్మ హోటల్స్, ప్రస్తుతం అరండల్‌పేట లోని శ్రీనిధి హోటల్, సవేరా రెస్టారెంట్ తదితర ఆహార శాలల ఆతిథ్యం, ఆప్యాయత, ఆహారాలు ఎప్పటికీ మరుపు రానివి... మరువలేనివి...

**ఫుట్‌పాత్ టిఫెన్ బండ్లతో హోటల్స్‌కు గడ్డుకాలం :**

నరసరావుపేట పట్టణంలో అల్పాహార శాలలు రోడ్డుపైకి రావడం 1990 నుండే ప్రారంభమైంది. అతి కొద్ది సంఖ్యలోనే అప్పటి రోజుల్లో వీటిని నిర్వహించేవారు. తోపుడుబండ్లపై ప్రారంభమైన ఫుట్‌పాత్ అల్పాహారశాలలను ప్రారంభంలో పెద్దగా ఆదరించేవారు కాదు. అంతంత మాత్రంగానే వీరి వ్యాపారం కొనసాగింది. 1995 నుండి 2000 సంవత్సరం అటు తర్వాత స్ట్రీట్ ఫుడ్‌కు గిరాకీ పెరగడం ప్రారంభించింది. గతంలో ఫుట్‌పాత్‌పై అల్పాహారాన్ని తీసుకోవడం కుటుంబ సభ్యులు, ఉద్యోగులు కొంత బెరుగ్గా, అసౌకర్యంగా భావించేవారు. మారిన పరిస్థితులలో అన్ని వర్గాలవారిని స్ట్రీట్ ఫుడ్ ఆకర్షించడం, అలవాటు పడటం జరిగింది. హోటల్స్‌తో పోలిస్తే అల్పాహార ధరలు తక్కువగా లభించడం, కళ్ళ ముందే వేడివేడిగా ఆహార పదార్థాలను అందించడం, తీరికగా కూర్చోని తినే ఓపిక, సమయం లేకపోవడం, స్ట్రీట్ ఫుడ్‌కు కాలానుగుణంగా మార్పులతో పాటు ఆదరణ పెరిగింది. బఫే పద్ధతికి పూర్తిగా ఆహార ప్రియులు అలవాటుపడి పోవడంతో స్ట్రీట్ ఫుడ్ నిర్వాహకులు హోటల్స్‌కు దీటుగా వీటిని నిర్వహించే పరిస్థితి వచ్చేసింది. నరసరావుపేట పట్టణంలో కమర్షియల్ ప్రాంతమైన అరండల్‌పేట వంటి ప్రాంతంలో సుమారు వంద వరకు స్ట్రీట్ ఫుడ్ సెంటర్లు వెలిశాయంటే వీటి డిమాండ్ మనకు తేలికగానే అర్థమవుతుంది. వందల సంఖ్యలో ఏర్పాటైన ఫుట్‌పాత్‌లపై అల్పాహారశాలలు అత్యధికంగా అరండల్‌పేట, పల్నాడురోడ్డు, బస్టాండ్ సెంటర్, గుంటూరురోడ్డు, కోట సెంటర్, మల్లమ్మసెంటర్, గాంధీ క్లాత్ మార్కెట్, కుసుమహరనాథ్ దేవాలయం సెంటర్, ప్రకాష్ నగర్ తదితర ప్రాంతాలలో వందల సంఖ్యలో ఏర్పాటై విజయవంతంగా నడుస్తున్నాయి. ఒక్కొక్క ఫుట్‌పాత్ సెంటర్ డిమాండ్‌ను బట్టి ప్రతి రోజు రూ. 5వేలకు పైగానే విక్రయాలు సాగిస్తున్నారు. అదే విధంగా ప్రత్యక్షంగా, పరోక్షంగా పది మంది వరకు ఉపాధి సైతం పొందుతున్నారు. హోటల్స్‌కు పెట్టే పెట్టుబడిలో 25 -50 శాతం సరిపోవడం, వీటి విస్తరణకు మరింత ఊపు తెచ్చింది. ఫుట్‌పాత్ అల్పాహార శాలల వలనే అట్టు, పూరీ, చపాతి, పుల్కా మాస్టర్లకు డిమాండ్ రెట్టింపు అయ్యింది. చివరకు హోటల్స్ నిర్వహణ యజమాను లకు సవాల్‌గా మారింది. ఫుట్‌పాత్ అల్పాహార శాలలతోనే కొన్ని హోటల్స్‌ను నిర్వహించలేక నిలిపివేయడం, లాడ్జిలుగా మార్చడం జరిగింది. వీటి పోటీని తట్టుకొని నరసరావుపేట పట్టణంలో వ్రేళ్ళమీద లెక్కించే విధంగా పది సంఖ్యలోపే హోటల్స్ మనుగడ సాగిస్తున్నాయి.

# కాటన్ ప్రెస్‌లు




## చయికం వెంకటరమణారెడ్డి

జర్నలిస్ట్


వంద ఏళ్ల చరిత్రగల నరసరావుపేట పురపాలక సంఘం చరిత్రకు 1890లో కాటన్ ప్రెస్‌ల ఏర్పాటు ఓ పూర్వరంగం. నాగార్జునసాగర్ నిర్మించక ముందు పలనాడు, నరసరావుపేట ప్రాంతాల రైతులు తమ పొల్లాల్లో పండించిన ప్రత్తిని దేశం నలుమూలలకు చేరవేసిన ఘనత ఈ కాటన్ ప్రెస్‌లదే. అప్పటి నరసరావుపేట జమీందారుగారు, నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారు, కపలవాయి మల్లయ్యగారు, ఇంకా పలువురు వ్యాపారులు భాగస్వాములుగా రైల్వే స్టేషన్‌కు సమీపంలో రొంపిచర్లకు వెళ్లే మార్గంలో కాటన్ ప్రెస్‌లను ఏర్పాటు చేసుకోవటంతో నరసరావుపేట పట్టణం మరికొంత విస్తరించింది. కాలక్రమేణ ప్రత్తిపరిశ్రమలో ఆధునిక సాంకేతిక పద్ధతులు వచ్చి, ఎక్కడి కక్కడ కాటన్ ప్రెస్‌లు ఏర్పాటు కావటంతో ఇక్కడి కాటన్ ప్రెస్‌ల వ్యాపారం సన్నగిల్లింది. క్రమేణ ప్రెస్‌లు పనిచేయని పరిస్థితి వచ్చింది.

1950లో ఎస్.ఎస్. & ఎన్. కళాశాల స్థాపించి నపుడు కూడా ఇక్కడే కొన్ని సంవత్సరాలు తరగతులు జరిగాయి. ఆ తరువాత ఇప్పుడున్న సొంత భవనాలకు కళాశాల తరలి వెళ్లింది.





ఏర్పాటు చేశారు. రైతుల వద్ద నుంచి సేకరించిన ప్రత్తిని శుభ్రంచేసి ఆ రోజుల్లో వస్త్ర పరిశ్రమలకు నిలయమైన ముంబై, కలకత్తా నగరాలకు ఎగుమతి చేసేవారు. దీని వలన పలనాడు, నరసరావుపేట ప్రాంతాల రైతులు ఆర్థికంగా నిలదొక్కుకునేందుకు ఈ కాటన్ ప్రెస్‌లు దోహదం చేశాయి. ఆ రోజుల్లోనే ఈ ప్రెస్‌లలో రెండు షిఫ్టులుగా, 200 మందికి పైగా కార్మికులు పనిచేసే వారు. కాటన్ ప్రెస్‌లు బాగా పని చేస్తుండటంతో కార్మికులు, ప్రజలు ప్రెస్‌ల చుట్టూ నివాసాలు

అనంతరం మన ప్రాంతంలో దొర పొగాకు పండించిన సందర్భంగా పొగాకు కొనుగోలు కేంద్రంగా ఇవి రూపుదిద్దు కొన్నాయి. గోల్డెన్ టొబాకో కంపెనీవారు ఇక్కడ పొగాకు చెక్కులను కొనేవారు. ప్రస్తుతం వీటిలో విద్యాసంస్థ లను నిర్వహిస్తున్నారు.

ప్రస్తుతం ఈ ఆస్తికి మున్సిపల్ ఛైర్ పర్సన్ శ్రీ నాగసరపు సుబ్బరాయగుప్తా మేనేజింగ్ డైరక్టర్‌గా వ్యవహ రిస్తున్నారు.

# పుర...పాలన



ఎ. భానుప్రతాప్
కమీషనర్, నరసరావుపేట పురపాలక సంఘం.

నరసరావుపేట మునిసిపాలిటి 1,17,489 జనాభాతో 34 వార్డులుగా విభజింపబడి 7.56 కి.మీ. పరిధిలో విస్తరించి ఉంది. ఈ క్రింద తెలిపిన అంశములలో అత్యధిక గ్రేడ్స్‌తో/ మార్కు లతో స్వచ్ఛభారత్ సర్వేలో 2014-15 సంవత్సరము నకు గాను భారతదేశంలో 59వ స్థానమును పొందింది. నవ్యాంధ్ర ప్రదేశ్‌లో రెండవ స్థానమును మరియు గుంటూరు జిల్లాలో ప్రథమ స్థానమును కైవసం చేసుకున్నది. ఇది నరసరావుపేట పట్టణ వాసులంతా గర్వించదగ్గ విషయం. ఇది ఏ ఒక్కరి స్వయంకృషి కాదు. ఇది పట్టణ పౌరులందరి సమష్టి కృషి.

పట్టణంలోని 34 వార్డులలో ప్రణాళికా బద్ధంగా ఇంటింటి చెత్త సేకరణ కార్యక్రమం నిర్విరామంగా జరుగు తున్నది. నగర దీపికలను నియమించుట ద్వారా పట్టణ మహిళలలో చైతన్యం తెచ్చి తడిచెత్త, పొడిచెత్త వేరుచేస్తూ ఇంటింటి చెత్తను సేకరిస్తున్నారు. పొడిచెత్తను ప్రైవేట్ ఏజన్సీకి రీసైక్లింగ్ నిమిత్తం అమ్ముటద్వారా రోజుకు సుమారు రూ. 3,000/-లు చొప్పున వస్తాయి. ఇలా సంవత్సరానికి పురపాలక సంఘానికి చెత్తనుండి రూ. 36,000/-లు నెలకు లభిస్తుంది! తడిచెత్తను కంపోస్టు యార్డుకు తరలించి వర్మి కంపోస్టు తయారీకి ప్రణాళికా పరంగా రంగం సిద్ధం చేయడం ద్వారా బయోగ్యాస్‌ప్లాంట్ మరియు కరెంట్ ఉత్పత్తికి ఆలోచన చేయడం జరిగింది. అంతేకాక నిద్రావస్థలో వున్న గ్రౌండ్ డ్రైనేజి సిస్టమ్‌ను మెరుగుపరిచి అందుబాటులోకి తేవాలనే సదుద్దేశంతో గౌరవ స్పీకరుగారి సూచనలు స్వీకరించి రూ. 1360 కోట్లతో త్వరలో అభివృద్ధి చేయడం, తద్వారా పురపాలక సంఘ ప్రజలకు మెరుగైన మురుగు నీటి పారుదల వ్యవస్థను అందించడం జరుగుతుంది.

## పబ్లిక్ టాయిలెట్స్ :

పట్టణములో జనాభాకు అసౌకర్యము కలుగకుండా పే అండ్ యూజ్ పబ్లిక్ టాయిలెట్స్ ప్రైవేట్ భాగస్వామ్యంతో నిర్వహించుటకు మరియు పట్టణ ప్రజలకు ఐ.హెచ్.హెచ్. ఎల్. ద్వారా వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణమునకు సర్వే చేయించి పట్టణ జనాభాలో కేవలం 0.7% అనగా 800 మందికి మాత్రమే, వ్యక్తిగత మరుగుదొడ్లు లేవని గుర్తించారు. ఐ.హెచ్.హెచ్.ఎల్. మరియు స్వచ్ఛభారత్ ప్రోగ్రామ్ క్రింద వారిలో 600 మందిని అర్హులుగా గుర్తించి వ్యక్తిగత



నాడు



నేడు

మరుగుదొడ్ల నిర్మాణమునకు సంకల్పించుట జరిగినది.

శతాబ్ది ఉత్సవాల సందర్భముగా వ్యక్తిగత మరుగు దొడ్లు నూటికి నూరు శాతము పూర్తిచేసి ఓపెన్ డెఫోకేషన్ ఫ్రీ టౌన్‌గా నరసరావుపేటను గుర్తించేలా చేయాలనే, స్పీకర్ గారి సంకల్పమును గుర్తెరిగి సిబ్బంది శ్రమిస్తున్నారు.

**రక్షిత త్రాగునీటి సరఫరా :**

పట్టణములో ప్రజలకు అవసరమైన త్రాగునీరు రోజూ రెండు పూటలా సరఫరా చేయుటయేకాక, నీటి సర ఫరా పైప్‌లైన్‌లేని ప్రాంతాలకు కూడా మున్సిపల్ ట్యాంకర్ల ద్వారా రక్షిత త్రాగునీటి సరఫరా నిరంతరాయంగా కొనసాగించుట జరిగినది.

**గ్రీనరీ అభివృద్ధి :**

పట్టణములో వివిధ ప్రభుత్వ పథకాల క్రింద మొక్కల పెంపకం, సంరక్షణ మొదలగు కార్యక్రమాలను అప్పటి గౌరవ శాసనసభ్యులు, మంత్రివర్యులు, ప్రజాప్రతినిధుల సహ కారంతో పట్టణ మహిళల, విద్యార్థినుల కృషితో పట్టణంలో గ్రీనరీ అభివృద్ధిపరచుటకు అంకురార్పణ గావించబడినది. నాటి మొక్కలే నేటి వృక్షాలుగా రూపాంతరం చెంది పట్టణాన్ని గ్రీష్మతాపము నుండి కాపాడుట జరుగుచున్నది. జిల్లాలో ఏ మున్సిపాలిటీలో కూడా ఇంతగా విస్తరించిన గ్రీనరీ లేదనుట అతిశయోక్తికాదు.

పైన తెలిపిన ముఖ్య సూచికలందు పట్టణము గుర్తింపు పొంది భారతదేశములో 59వ స్థానమును, ఆంధ్రప్రదేశ్‌లో 2వ స్థానమును మరియు గుంటూరు జిల్లాలో ప్రథమ స్థాన మును సంపాదించి "స్వచ్ఛ నరసరావుపేట" అను నామమును సార్థకము చేసుకొన్నది. ఇదే ఆశయంతో ఇంకా ముందుకు కొనసాగుతూ నరసరావుపేటను బహిరంగ మూత్ర విసర్జనరహిత నగరంగా తీర్చిదిద్దడానికి ఎంతో సమయం పట్టదు.

ఈ శతాబ్ది ఉత్సవాలలో భాగంగా గౌరవ స్పీకరు గారి ఆదేశములతో గౌరవ కౌన్సిల్ సహకారముతో పట్టణములో పలు అభివృద్ధి కార్యక్రమాలకు శ్రీకారం చుట్టడం జరిగింది. అవి ఈ క్రింద తెల్పిన విధముగా నున్నవి.

1. పట్టణంలోని అన్ని హిందూ శ్మశాన వాటికల అభివృద్ధి - రూ. 166.35 లక్షలు
2. క్రిష్టియన్ శ్మశాన వాటిక అభివృద్ధి - రూ. 9.80 లక్షలు
3. ఖబరస్తాన్ అభివృద్ధి - రూ. 18.70 లక్షలు
4. మున్సిపల్ పాఠశాలల అభివృద్ధి - రూ. 27.20 లక్షలు
5. మున్సిపల్ పాఠశాలల అభివృద్ధి - రూ. 27.20 లక్షలు
6. పట్టణ సుందరీకరణ - రూ. 68.35 లక్షలు

ఈ పనులతోపాటు పట్టణములోని 34 వార్డులలో కాలువలు, కల్వర్టులు మరియు రోడ్ల నిర్మాణములకు గాను సుమారు రూ.154.45 లక్షలు గౌరవ ఛైర్‌పర్సన్‌గారి ఆధ్వర్యములో అభివృద్ధికి కౌన్సిలువారు మంజూరు చేశారు.

సదరు కార్యక్రమాలన్నీ గౌరవ సమాఖ్య అతిథుల చేతుల మీదుగా ప్రారంభించడం జరుగుతుందని శతాబ్ది ఉత్సవాల నిర్వహణ సమయంలో కమీషనరుగా ప్రజలకు సేవ లందించడం నా భాగ్యంగా భావిస్తూ అందరికీ నా హృదయ పూర్వక నమస్కారములు తెలియజేస్తున్నాను.

నరసరావుపేట పురపాలక సంఘముగా 1915న ఏర్పడింది, రెండవశ్రేణి పురపాలక సంఘముగా 1960న గుర్తింపబడింది, మొదటిశ్రేణి పురపాలకసంఘముగా 28-04-1980 నుండి అప్‌గ్రేడ్ అయింది. ఈ పురపాలక సంఘము 34 ఎలక్షన్ వార్డులతో 2011 జనాభా లెక్కల ప్రకారం 1,17,489 మంది జనాభా, వారిలో స్త్రీలు 59,424 మంది, పురుషులు 58,065 మంది.

పురపాలక సంఘ ప్రస్తుత పాలక వర్గము 03-07-2014 నుండి పరిపాలించుచున్నది. పాలకవర్గములో ఛైర్‌పర్సన్ మరియు 32 మంది వార్డు సభ్యులు ఒక ఎక్స్ అఫిషియో సభ్యునితోపాటు ముగ్గురు కో-ఆప్షన్ సభ్యులతో నడుపబడుచున్నది.

అధికార వర్గము మొత్తం ఈ క్రింద తెలిపిన 7 ప్రధాన విభాగపు అధికారులతో ఎగ్జిక్యూటివ్ అథారిటీ అయిన కమీషనరు పర్యవేక్షణలో పనిచేయుచుందురు.

## 1. పరిపాలనా విభాగము :

ఈ విభాగమునకు మేనేజరు పర్యవేక్షణాధికారిగా

వుందురు. ఈ విభాగములో ఉపాధ్యాయ, ఉపాధ్యాయేతర సిబ్బంది జీతభత్యములు, సెలవులు, ఇంక్రిమెంట్లు, అపాయింట్‌మెంట్లు, సిటిజెన్స్ ఛార్టరు (పౌర సేవలు) గ్రీవెన్స్‌లు, ఫిర్యాదులు వగైరా కార్యక్రమములు నిర్వహించబడును. ఈ విభాగములో మొత్తము 29 మంది సిబ్బంది ప్రస్తుతము పనిచేయుచున్నారు.

**ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత విద్య :**

పురపాలక సంఘ ఆధ్వర్యములో మొత్తము 21 ప్రాథమిక, 5 ప్రాథమికోన్నత, 3 ఉన్నత పాఠశాలలు వెరసి మొత్తము 29 పాఠశాలలు. బాలబాలికలు నమోదు మొత్తము 3,573 కాగా హాజరు 3,215 అయివున్నది.

ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలో మొత్తం 180మంది ఉపాధ్యాయులకుగాను ప్రస్తుతము 152 మంది ఉపాధ్యాయులు పనిచేయుచున్నారు.

## 2. అకౌంట్స్ విభాగము :

ఈ విభాగమునకు అకౌంట్సు ఆఫీసరు అధిపతిగా నుందురు. వీరి అధీనములో ఒక సీనియర్ అకౌంటెంట్ ఒక జూనియర్ అకౌంటెంట్ పనిచేయుచున్నారు. ఈ విభాగములో పురపాలక సంఘమునకు రోజువారి, నెలవారి మరియు సంవత్సరవారీ ఆదాయ, వ్యయములు లెక్కలు సరిచూడబడును. వివిధ సంస్థలకు చెల్లించవలసిన జీతపు రికవరీలు, ఇన్‌కంటాక్స్, సర్వీస్‌ట్యాక్స్ వగైరాలు చెల్లించబడును. మరియు పురపాలక సంఘ కాంట్రాక్ట్ వర్కర్ల జీతభత్యములు, ఆఫీసు మెయిన్‌టెన్స్, వర్కు బిల్లుల చెల్లింపు ఇతర చెల్లింపులు ఈ విభాగము నుండి జరుగును.

2014-2015 సంవత్సరమునకు పురపాలక సంఘ ఆదాయము రూ. 1119.54 లక్షలు కాగా, ఖర్చు రూ. 1039.91 లక్షలు కాగా, మిగులు బ్యాలెన్సు రూ. 79.63 లక్షలు అయివున్నది.

2015-16 సంవత్సరమునకు పురపాలక సంఘ ఆదాయము రూ. 1274.56 లక్షలకు గాను ఖర్చు రూ. 1230.80 లక్షలు, కాగా మిగులు బ్యాలెన్స్ రూ. 43.76 లక్షలుగా అంచనా వేయడమైనది.

## 3. ఇంజనీరింగ్ విభాగము :

ఈ విభాగమునకు మున్సిపల్ ఇంజనీరుగారు అధిపతి. వీరి ఆధ్వర్యములో ఒక డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, ఇరువురు మున్సిపల్ అసిస్టెంట్ ఇంజనీర్లు మరియు ఇతర టెక్నికల్ సిబ్బంది 23 మంది పనిచేయుచున్నారు. పురపాలక సంఘపరిధిలో ప్రజలకు నిత్యావసరాలైన రక్షిత త్రాగునీరు, రోడ్లు, కాలువలు, కల్వర్టులు, కమ్యూనిటీ భవనములు, ఇతర అభివృద్ధి పనులు ఈ విభాగము ద్వారా చేపట్టబడును.

ఇప్పటి వరకు పూర్తి అయిన సి.సి.రోడ్లు 139.85 కి.మీ,. పక్కా డ్రైన్లు 2.34 కి.మీ. మరియు రక్షిత త్రాగునీటి సరఫరా కొరకు 10 ఇ.ఎల్.ఎస్.ఆర్.ఎస్. ఉన్నవి. ఇంటింటి కుళాయి కనెక్షన్లు 15,955 మరియు పి.ఎస్.పి.లు 425 వున్నవి. ఇవికాక హ్యాండ్ బోర్స్ 573 ఉన్నవి. పైప్‌లైన్ పొడవు 130 కి.మీ. విస్తరించియున్నది.

వీధి దీపములు మొత్తం 5301 కలవు. ప్రస్తుతము పురపాలక సంఘ శతాబ్ది ఉత్సవాలను పురస్కరించుకొని పట్టణములోని వీధిలైట్లు అన్నింటినీ ఎల్.ఇ.డి. బల్బులతో రీప్లేస్ చేయుట జరిగినది. తద్వారా పురపాలక సంఘమునకు నెలకు 50% కరెంటు బిల్లు ఆదా వచ్చే అవకాశమున్నది.

## 4. రెవిన్యూ విభాగము :

ఈ విభాగమునకు రెవిన్యూ ఆఫీసరు అధిపతి. వీరి ఆధీనములో ఒక రెవిన్యూ ఇన్‌స్పెక్టరు 7గురు బిల్ కలెక్టర్లు పనిచేయుచున్నారు. పురపాలక సంఘ పరిధిలో నిర్మితమైన ఇండ్లకు ఆస్తిపన్ను, ఖాళీ స్థలం పన్ను, నీటి పన్ను వగైరాలను విధించుట మరియు వసూలు చేయుట వీరి ప్రధాన విధి. మరియు పురపాలక సంఘ పరిధిలోని మున్సిపల్ మార్కెట్లు, షాపు రూములకు సకాలములో పాటలు నిర్వహించి లీజుకు ఇచ్చుట ద్వారా పురపాలక సంఘ ఆదాయము మదింపు చేయుట కూడా వీరిదే బాధ్యత.

2014-15 సంవత్సరమునకు ఆస్తిపన్ను డిమాండ్ 521.75 లక్షలు కాగా, వసూలు రూ. 478.25 లక్షలు అయివున్నది. 91% వసూలు పర్సంటేజ్ అయివున్నది. 2015- 16 సంవత్సరమునకు డిమాండ్ రూ. 532.00

లక్షలు, కాగా వసూలు రూ. 498.00 లక్షలు రాగలదని అంచనా వేయడమైనది.

ఈ పురపాలకసంఘ అధీనములో 7 షాపింగ్ కాంప్లెక్స్ లు కలవు. వాటిద్వారా నెలకు అద్దెల ద్వారా 6 లక్షలు ఆదాయము సమకూరును.

కూరగాయల మార్కెట్టు, సండ్రీ మార్కెట్టు వగైరాల ద్వారా 2014-15 సంవత్సరమునకు రూ. 30 లక్షల ఆదాయము లభించగా, 2015-16 సంవత్సరమునకు అది రూ. 39 లక్షలు కాగలదని అంచనా.

ఎంటర్‌టైన్‌మెంట్ ట్యాక్స్ ద్వారా 2014-15 సంవత్సరమునకు రూ. 32.00 లక్షలు ఆదాయం వచ్చినది. 2015-16 సంవత్సరమునకు రూ. 35.00 లక్షలు రాగలదు.

స్టాంపు డ్యూటీ క్రింద 2014-15 సంవత్సరమునకు రూ.140.00లక్షలు వచ్చినది. 2015-16 సంవత్సరమునకు రూ.150.00 లక్షలు రాగలదని అంచనా వేయడమైనది.

### 5. ప్రజారోగ్య విభాగము :

ఈ విభాగమునకు శానిటరీ సూపర్‌వైజరు అధిపతి. వీరి అధీనములో నలుగురు శానిటరీ ఇన్ స్పెక్టర్లకుగాను ఇద్దరు శానిటరీ ఇన్‌స్పెక్టర్లు, మేస్త్రీలు ఆరుగురు, ప్రజారోగ్య శాఖ వర్కర్లు 85 మంది పనిచేయుచున్నారు. ప్రస్తుతము రెండు శానిటరీ ఇన్‌స్పెక్టరు పోస్టులు ఖాళీగా వుండుటవలన వారి స్థానములో ఒక హెల్త్ అసిస్టెంట్ మరియు ఒక ఎన్విరాన్‌మెంట్ ఇంజనీర్ (ఔట్‌సోర్సింగ్) ఇన్‌చార్జిగా పనిచేయుచున్నారు. ప్రస్తుతము సదరు విభాగ ములో 95 మంది పనిచేయుచున్నారు.

ప్రజారోగ్యమునకు సంబంధించిన పనులు అనగా రోడ్లు, కాలువలు శుభ్రపరుచుట, ఇంటింటి తడిచెత్త, పొడిచెత్త సేకరణ, కుక్కలను, కోతులను, పందులను పట్టించుట, అనాథ శవాలకు అంతిమ సంస్కారము చేయుట, దోమల నివారణ చర్యలు చేపట్టుట వగైరా పనులు ఈ విభాగములోని సిబ్బంది ద్వారా చేపట్టబడుచున్నవి. ఈ విభాగములో రెగ్యులర్ వర్కర్లకు అదనంగా ఔట్‌సోర్సింగ్ పద్ధతిలో 4 డివిజన్లలో ప్రతి డివిజన్ కు షుమారు 65మంది చొప్పున 263 మంది పనిచేయు చున్నారు. వీరు కాక ఇంటింటి చెత్తసేకరణ కార్య క్రమము 60 పుష్ కార్ట్స్ ద్వారా నిర్వహించుటకు 68 మంది నగర దీపికలను ఔట్ సోర్సింగ్ పద్ధతిలో నియమించి వారి సేవలను, పురప్రజలను పరిశుభ్రత విషయంలో చైతన్యపరుచుటకు వినియో గించుట జరుగుచున్నది.

### 6. పట్టణ ప్రణాళికా విభాగము :

ఈ విభాగమునకు టౌన్‌ప్లానింగ్ అధికారి శాఖాధిపతి. వీరి అధీనములో ఇరువురు పట్టణ టౌన్ ప్లానింగ్ సూపర్ వైజర్స్, 4గురు టౌన్‌ప్లానింగ్ బిల్డింగ్ ఓవర్సీర్స్ మరియు టి.పి. చైన్‌మెన్‌లు పనిచేయవలసివుండగా, ఒక టౌన్‌ప్లానింగ్ సూపర్‌వైజర్, ఒక టౌన్‌ప్లానింగ్ బిల్డింగ్ ఓవర్సీర్సు మాత్రమే ప్రస్తుతము పనిచేయుచున్నారు. వీరితో పాటు ఒక టౌన్ సర్వేయరు కూడా పనిచేయుచున్నారు.

ఈ విభాగము ద్వారా పట్టణ పరిధిలోని భవనముల నిర్మాణములకు మరియు లే అవుట్లకు అనుమతులు, అనధి కార కట్టడముల గుర్తింపు, తొలగింపు, తాత్కాలిక ఆక్రమణల లైసెన్స్, అడ్వర్టైజ్‌మెంట్ ట్యాక్స్ వసూలు, వగైరా పనులు అమలు పరచబడును.



గడియారం స్తంభం

2014-15 సంవత్సరమునకు ఈ విభాగములో వివిధ పద్దుల క్రింద వసూలైన మొత్తము రూ.51.32లక్షలు.

2015-16 సంవత్సరమునకు సదరు మొత్తము రూ. 60.00 లక్షలు ఆదాయమురాగలదని అంచనావేయడమైనది.

## 7. మెప్మా విభాగము :

ఈ విభాగమునకు అధిపతి టౌన్ మిషన్ కో-ఆర్డినేటర్ (టి.ఎం.సి.). ఈ విభాగములో ఒక టి.ఎం.సి. ముగ్గురు సి.ఓ.లు, ఒక డి.ఇ.ఓ. పనిచేయవలసి వుండగా కేవలం ముగ్గురు సి.ఓ.లు ఒక డి.ఇ.ఓ. పనిచేయుచున్నారు.

ఈ విభాగపు ప్రత్యేక విధి పేదరిక నిర్మూలన. సదరు కార్యక్రమంలో భాగంగా మహిళా పొదుపు సంఘాల ఏర్పాటు, ఉపాధి శిక్షణా అవకాశములు మెరుగుపర్చుట, డ్వాక్రా గ్రూపుల ద్వారా స్వయంసమృద్ధి సాధించుట. మురికివాడలలో నివసించు మహిళలను అన్నిరంగాలలో అభివృద్ధి పథములో నడిపించుటకు రిసోర్స్ పర్సన్స్, వార్డు వారీగా కృషి చేయుట జరుగుచున్నది.

ప్రస్తుతము పట్టణములో 1410 మహిళా పొదుపు సంఘాలు వున్నాయి. సదరు సంఘాలలో మొత్తము 14,336 మంది సభ్యులయివున్నారు. ప్రభుత్వము నుండి మంజూరు కాబడిన లింకేజి మొత్తము రూ.5368.56లక్షలు, వడ్డీలేని రుణాల క్రింద రూ.157లక్షలు.

పట్టణములో ప్రస్తుతము యన్.టి.ఆర్.భరోసా పథకము క్రింద 3,376 మంది వృద్ధులకు, 2,085 మంది వితంతువులకు, 801మంది వికలాంగులకు ఇరువురు చేనేత కార్మికులకు, 83 మందికి అభయహస్తం పింఛన్లు పంపిణీ చేయబడుచున్నవి. నెలవారీగా చెల్లిస్తున్న పింఛన్ల మొత్తము రూ. 70,66,000/-లు అయివున్నవి.



నరసరావుపేట - తూర్పు ప్రాంతం

# ఆబ్కారీ శాఖ




రామరాజు చెన్నకేశవరావు

సూపరింటెండెంట్ (రిటైర్డ్), ప్రొహిబిషన్ & ఎక్సైజ్


నేటి ఆబ్కారీశాఖ స్వాతంత్ర్యానికి పూర్వము సాల్టు లేక ఎక్సైజు డిపార్టుమెంటుగా కేంద్రప్రభుత్వ ఆధీనంలో ఉండేది. అపుడు నరసరావుపేటలో ఒక అసిస్టెంటు ఇన్‌స్పెక్టరు ఆధ్వర్యంలో ప్రస్తుతపు నరసరావుపేట రెవిన్యూ డివిజన్ మొత్తము ఉండేది. మాచర్ల, గురజాల, వినుకొండ, సత్తెనపల్లి ప్రాంతాలు వీరి ఆధీనములో ఉండేవి. ఇచట ఒక సబ్ ఇన్‌స్పెక్టరు, 10 మంది గార్డులు, సిబ్బంది ఉండేవారు. ప్రభుత్వ మద్యం సామర్లకోట డిస్టిలరీ నుండి జాడీలలో గుఱ్ఱముల ద్వారా పైన తెల్పిన ప్రదేశములలోని ఏజంట్లకు సరఫరా అయ్యేది. విదేశీ మద్యము సాధారణ ప్రజలకు నిషేధము. ఆరోగ్యరీత్యా, సమాజములోని హోదారీత్యా పర్మిట్‌దారులకు మాత్రము మదరాసునుండి సరఫరా అయ్యేది. కాపుసారాయి కృష్ణాతీర ప్రాంతాల గ్రామాలలో నాటి నైజాంపాలిత ప్రాంతాల నుండి దొంగచాటుగా వచ్చేది. దానిని అప్పటి సిబ్బంది సమర్థతతో కట్టడి చేసేవారు.

స్వాతంత్ర్యానంతరము అవిభక్త మద్రాసు రాష్ట్రములో మద్యనిషేధ చట్టము 1948నుండి అమలు ఐంది. ఎక్సైజు కేంద్ర ప్రభుత్వ పరిధిలోనికి, మద్యనిషేధ చట్టము రాష్ట్రపరిధిలోనికి వచ్చాయి. దానితో నియంత్రణలో మార్పులు వచ్చాయి. అపుడు కూడా నరసరావుపేటలో ఒక అసిస్టెంట్ ప్రొహిబిషన్ ఆఫీసరు, ఒక సబ్ ఇన్‌స్పెక్టర్, ఒక పెట్టీ ఆఫీసరు (నేటి హెడ్ కానిస్టేబులు), అసిస్టెంట్ ప్రొహిబిషన్ ఆఫీసరు ఉండేవారు. ఈ ఆఫీసరు వద్ద ముగ్గురు గార్డులు ఉండేవారు. వినుకొండ, మాచర్ల, సత్తెనపల్లిలో స్టేషన్‌లు, ఒక ఎస్.ఐ., ఒక పి.ఓ., ఏడుగురు గార్డులు ఉండేవారు. 1948లోనే ఈ శాఖకు మొట్టమొదటిసారిగా ప్రత్యేక సిబ్బందిని ప్రభుత్వం నియమించింది. ప్రొహిబిషన్ డిపార్టుమెంటును 1956లో పోలీసుశాఖలో విలీనం చేసి, మద్యనిషేధ చట్టాన్ని వారి ద్వారా అమలుచేయించారు. ఈత, తాటి చెట్ల కల్లుగీతకు లైసెన్సులు ఇచ్చి, నామమాత్రపు సిబ్బందితో దాని అజమాయిషి చేయించారు. దానిని ఆబ్కారీ శాఖ (స్టేట్ ఎక్సైజు)గా పిలిచేవారు. 1956 నుండి 1961 ప్రాంతంలోనే అప్పటి ప్రభుత్వం హైదరాబాదు రాష్ట్రంలోని ఎక్సైజుచట్టాన్ని ఆంధ్ర ప్రాంతానికి కూడ వర్తింపచేసింది. కొంతకాలము ప్రభుత్వమే సారాయి తయారుచేసింది. సామాజిక అభివృద్ధి కార్యక్రమాలకు కావలసిన ఆర్థికవనరులను సమకూర్చుకొన్నది.




నేటి భువనచంద్ర ఆడిటోరియమ్, ఆర్.&బి. బిల్డింగ్స్, ప్రస్తుతము ఉన్న ఆబ్కారీ కార్యాలయము, ఎన్.జి.జి.ఓ. హాల్ ఉన్న ప్రదేశము కూడ నాటి అసిస్టెంట్ ఇన్‌స్పెక్టరు ఆఫ్ ఎక్సైజు వారి ఆధీనములోని ప్రాంతమే! అచట గుర్రపు శాలలు, డిపో, సిబ్బంది వసతి ఉండేవి. ఒక ఆంగ్లో ఇండియన్ ఆఫీసరు ఉండేవారు. 1948లో వచ్చిన మార్పులతో ఆ స్థలం అంతా నాటి పి.డబ్ల్యూ.డి. ఆధ్వర్యంలోకి వెళ్లింది. వివిధ కార్యాలయాలు ఆ స్థలంలోనే వెలసినై. ఆబ్కారీశాఖ మాత్రము అద్దెభవనములోనే కొనసాగేది. అప్పటిదాకా జ్యుడిషియల్‌శాఖ ఆధ్వర్యంలో ఉన్న భవనము ఆబ్కారీశాఖ స్వాధీనంలోకి వచ్చింది. ●

# సబ్ రిజిస్ట్రార్ కార్యాలయం

**పి.వి.జి.కె. సత్యనారాయణశాస్త్రి,** రిటైర్డు సబ్ రిజిస్ట్రార్



ప్రభుత్వానికి ఆదాయం చేకూర్చే శాఖలలో రిజిస్ట్రేషన్ మరియు స్టాంపుల శాఖ ఒకటి. క్రయ విక్రయాలు, దఖలు దస్తావేజులు, దానపత్రాలు, తాకట్టు దస్తావేజులు, పార్టీషన్ దస్తావేజులు, దత్తస్వీకార పత్రములు, సవరణ దస్తావేజులు, పవర్ ఆఫ్ అటార్నీలు, వీలునామాలు మొదలైన దస్తావేజులు రిజిస్టర్ చేయబడతాయి. ఈ విధంగా స్టాంప్ డ్యూటీ మరియు రిజిస్ట్రేషన్ రుసుముల రూపేణ ప్రభుత్వానికి భారీగా ఆదాయం సమకూర్చే శాఖ ఇది. భారత స్టాంపు చట్టం మరియు రిజిస్ట్రేషన్ చట్టముల అనుబంధంగా ఈశాఖ పనిచేస్తుంది. నరసరావుపేట సబ్‌రిజిస్ట్రార్ ఆఫీసు పరిధిలో 2011-2012 వార్షిక సంవత్సరంలో 22,144 దస్తావేజులు రిజిస్టర్ కాగా, సుమారు 7.20 కోట్ల రూ॥లు ఆదాయం వచ్చింది.

నరసరావుపేట సబ్-రిజిస్ట్రార్ ఆఫీసు 11-03-1865 తారీఖున ప్రారంభించబడింది. అప్పట్లో మన గ్రామము పేరు "రాజాపేట" గా ఉన్నట్లుగా రికార్డుల ద్వారా తెలుస్తూ వుంది. అయితే 1869 వ సంవత్సరంలో నవంబర్ నెలలో గ్రామము పేరు 'రాజా పేట' ను 'నరసరావు పేట' గా మార్చినట్లు ఉన్నది. ఈ నరసరావుపేట సబ్-రిజిస్ట్రార్ కార్యాలయ పరిధిలో 62 గ్రామాలు ఉన్నాయి.

నరసరావుపేట సబ్‌రిజిస్ట్రార్ ఆఫీసు ది.1-7-1961 తేదీ నుంచి జిల్లా రిజిస్ట్రారు ఆఫీసుగా అప్‌గ్రేడ్ చేయబడింది. 16 సబ్‌రిజిస్ట్రార్ కార్యాలయాలు దీని పరిధిలోనికి వచ్చాయి. అవి : 1. అద్దంకి, 2.అమ్మనబ్రోలు, 3.చిలకలూరిపేట, 4. కంభం, 5. గిద్దలూరు, 6.గురజాల, 7. క్రోసూరు, 8. మాచర్ల, 9. మార్కాపురం, 10. నరసరావుపేట, 11.ఒంగోలు, 12. ఫిరంగి పురం, 13. పిడుగురాళ్ల, 14. సంతనూతల పాడు, 15. సత్తెన పల్లి, 16. వినుకొండ. తరువాత ప్రకాశంజిల్లా ఏర్పడినపుడు ది. 4-1-1975న 7 ఆఫీసులు ప్రకాశం జిల్లా రిజిస్ట్రార్ పరిధిలోనికి బదిలీ చేయబడినవి. అవి :1. అద్దంకి, 2. అమ్మనబ్రోలు, 3. కంభం, 4. గిద్దలూరు, 5. మార్కాపురం, 6. సంతనూతలపాడు, 7. ఒంగోలు. ఇదే సందర్భంలో గుంటూరుజిల్లా రిజిస్ట్రార్ పరిధి నుండి 3 కార్యాలయాలు నరసరావుపేట జిల్లా రిజిస్ట్రార్ పరిధి లోనికి బదిలీ చేయ బడినవి. అవి : 1. అమరావతి, 2. బాపట్ల, 3. కాకుమాను. తర్వాత 1982వ సంవత్సరములో పెదకూరపాడు గ్రామంలో నూతనంగా సబ్‌రిజిస్ట్రార్ పరిధిలో 13 సబ్ రిజిస్ట్రార్ కార్యా లయాలు పని చేస్తున్నవి.

నరసరావుపేట జిల్లా రిజిస్ట్రారు కార్యాలయం ఏర్పాటు చేసినపుడు తొలి జిల్లా రిజిస్ట్రారుగా శ్రీ కె. గోపాలరెడ్డి నియమితులైనారు. తదనంతరకాలంలో వారు రిజిస్ట్రేషన్ శాఖకు అత్యున్నత అధికారిగా, ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా చాలా కాలం సేవలు అందించారు. తదుపరి కాలంలో శ్రీ కె. వేంకటరాములు, ఎమ్.ఎన్. శేషాద్రిశాస్త్రి, ఎం.ఏ. రషీద్‌ఖాన్, పి.ఎల్. ప్రసాదరావు మొదలైన ప్రతిభావంతులెందరో జిల్లా రిజిస్ట్రారులుగా పనిచేసి సబ్ రిజిస్ట్రార్‌లకు మరియు ప్రజానీకానికి మార్గదర్శనం చేశారు. ఈ శాఖ గ్రామ పంచాయితీలకు, జిల్లాపరిషత్‌లకు, మునిసిపాలిటీలకు తాను వసూలు చేసే ఆదాయంలో కొంతమొత్తం సర్‌చార్జీ పేరుతో జమ చేస్తున్నది. ప్రస్తుతం ఈసీలు, దస్తావేజులనకళ్లు మొదలైనవి 'మీ సేవ'ద్వారా పొందేవిధంగా ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది. ఈ శాఖ ప్రజల ఆస్తులకు సంబంధించిన పత్రములను భద్రపరచటానికి ఎన్నో విధములైన చర్యలు తీసుకొంటున్నది.

ప్రస్తుతం అన్ని శాఖలలో వలెనే ఈ శాఖలో కూడా కంప్యూటరీకరణ జరిగినది. CARD (Computer Aided Administration of Registration Department) ద్వారా పాతరికార్డులు ఎక్కువభాగం కంప్యూటరీకరించినారు. ప్రస్తుతం కొన్ని పురాతనమైన నకళ్లు జారీచేయటానికి ఫోటోపద్ధతి ద్వారా స్టాంపులపై ఫోటోలు తీయటానికి నూతనమైన టెక్నాలజీని ఉపయోగిస్తున్నారు.

ప్రజల ఆస్తులకు సంబంధించిన దస్తావేజులను పరిరక్షిస్తూ, ప్రభుత్వానికి రావల్సిన ఆదాయాన్ని సమకూరుస్తూ ఈ శాఖ నిరంతరం శ్రమిస్తున్నది. ●

# ఎర్ర డబ్బా కథ





కొమ్మోజి మాణిక్యరావు
రిటైర్డ్ సూపరింటెండెంట్, పోస్టల్ డిపార్ట్‌మెంట్

నరసరావుపేట సర్వతోముఖాభివృద్ధిలో తపాలాశాఖ పాత్ర ఎంతో ఉన్నది. ఈ సంస్థ దేశంలో వస్తున్న ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అందిపుచ్చుకొని నగరంలోని ప్రజలకు బ్రహ్మాండంగా సేవ చేస్తున్నది. మన ఊరి తపాలాసంస్థ మూడు దశలలో అభివృద్ధిని సాధించింది.

**మొదటి దశ-ఏప్రిల్ 1, 1965కు పూర్వం :**

అప్పుడు పట్టణప్రజల తంతి తపాలావసరాలు చాలా తక్కువగా ఉండేవి. దీని కనుగుణంగానే అప్పటి తంతి తపాలా ఆఫీసు లోయర్ సెలెక్షన్ హోదాలో పనిచేసింది. ఒక సబ్‌పోస్టు మాస్టరు, ఏడుగురు గుమస్తాలు, ఐదుగురు పోస్టుమ్యాన్లు మాత్రమే ఉండేవారు. పోస్టాఫీసు మరియు టెలిఫోను ఎక్స్చేంజ్, వరవకట్ట పాతపోలీసుస్టేషన్లున్న అద్దె పెంకు టింటిలో పనిచేశాయి.

**రెండవ దశ - 1 ఏప్రిల్ 1965 నుండి :**

కాలక్రమంలో పట్టణ జనాభా పెరగటం వలన ప్రజలకు తంతి తపాలా అవసరాలు పెరిగాయి. ప్రజావసరాలను దృష్టిలో ఉంచుకొని ఏప్రిల్ 1, 1965న నరసరావుపేట శాఖ హయ్యర్ సెలక్షన్‌గ్రేడు స్థాయికి పెరిగింది. రైల్వేస్టేషన్ రోడ్డులో కోర్టుభవనాల కెదురుగా ఉన్న నిమ్మరాజు వేంకటేశ్వర్లుగారి భవనంలో నెలకు రూ.700/- అద్దె చొప్పున చాలా కాలం ఉన్నది. సిబ్బంది సంఖ్య బాగా పెరిగింది. ఒక పోస్టు మాస్టర్, 22 మంది గుమస్తాలు, 11 మంది పోస్టు మ్యాన్లు ప్రజల సేవార్థం నియమింపబడ్డారు.





1993 సంవత్సరంలో అద్దెఇంటి కొరత తీరింది. అప్పుడు సూపరింటెండెంట్‌గా పనిచేస్తున్న ఈ వ్యాస రచయిత యూనియన్ నాయకులు, స్థానిక రాజకీయ నాయకుల సహాయ సహకారాలను తీసుకొని ప్రధాన తపాలా ఆఫీసు భవన నిర్మాణానికి స్థలాన్ని సేకరించారు.

నగర పురపాలకసంస్థ నగరం నడిబొడ్డున ఉన్న తన 1,104.44 చ.గ. (22.8 సెంట్లు) స్థలాన్ని తపాలాశాఖ స్వాధీనం చేసింది. 24-07-1993న సొంత భవనానికి కేంద్రమంత్రి రాజేష్ పైలట్‌గారు భూమిపూజ నిర్వహించి, శంకుస్థాపన గావించారు. కొత్త భవనంలో నరసరావుపేట ప్రధాన తపాలా ఆఫీసు అభివృద్ధి పథంలో వేగంగా పరుగులు తీస్తున్నది. పూర్తి కంప్యూటరీకరణ చేయబడి, సెంట్రల్ బ్యాంకింగ్ సర్వీసు, సుకన్యయోజన, మొబైల్ మనియార్డర్ సర్వీసు మీసేవ, టి.టి.డి. దర్శన టిక్కెట్ల అమ్మకం, ఇన్‌స్టెంట్ మనియార్డరు బుకింగ్, ఇంటర్నేషనల్ మనీ ట్రాన్సఫర్ సర్వీసు, మై స్టాంప్, ఫిలేటలీ, వరల్డ్ నెట్ ఎక్స్‌ప్రెస్ మొదలైన సేవలను అందిస్తున్నది.

మన తపాలాశాఖ ప్రకాష్ నగర్, ఎన్.ఎస్.పి. కాలనీ, అరండల్‌పేట, క్లాత్‌మార్కెట్‌లలో నాలుగు ఉప తపాలా కార్యాలయాలను ఏర్పాటు చేసి తన సేవల నందిస్తున్నది.

# ట్రింగ్..ట్రింగ్...హలో..హలో....




పి.వి. సుబ్రహ్మణ్యశాస్త్రి

రిటైర్డు ఆఫీసర్, టెలికాం.




'నరసరావుపేట' పురపాలక సంఘానికి నూరు వసంతాలు పూర్తయిన శుభసందర్భంలో ఆ నాటి టెలిఫోన్ సేవలను గురించిన కొన్ని విశేషాలను గుర్తుకు తెచ్చుకుందాం!

**ఎస్.ఏ.ఎక్స్. ఏర్పాటు :** 1953-'54 ప్రాంతంలో గుంటూరు ఎక్స్చేంజికిఅనుబంధంగా శ్రీరాంపురంలో నున్న సబ్-పోస్టాఫీసు బిల్డింగ్‌లో రెండు ట్రంక్ వైర్లతో, 50 వైర్ల కెపాసిటీతో ఎస్.ఎం.ఎ.సి.సి ఆటోఎక్స్చేంజ్ ప్రారంభమైనది. అది 1958-'59 ప్రాంతంలో మాన్యువల్ ఎక్స్చేంజ్‌గా మారింది. 100 లైన్ల టి 32 బోర్డు ఏర్పాటుతో గుంటూరుకు రెండు డైరెక్టు లైన్లు, చిలకలూరిపేటకు ఒక లైనుతో ఐదుగురు ఆపరేటర్లతో ప్రారంభం కావటం, 'నెంబర్ ప్లీజ్'తో పాటు ట్రంక్‌కాల్సు సేవలు మొదలైనాయి. ఆ మాన్యువల్ ఎక్స్చేంజ్‌లో దాదాపు 95 లోకల్ కనెక్షన్లు ఉండేవి. రోజుకు సరాసరిన 110 నుంచి 120 ఔట్ గోయింగ్ కాల్సు, 90 లోకల్ కాల్సు ఉండేవి.

**డైరెక్టు లైన్ :** కొన్నేండ్ల తర్వాత విజయవాడకు డైరెక్టు లైన్ ఏర్పడింది. ఆ నాటి చందాదారులను గుర్తుకు తెచ్చుకుంటే పేటకి చెందినవి 20, 22, 24, 34, కేంద్రప్రభుత్వానికి 53, 67, రాష్ట్రప్రభుత్వానికి చెందిన వాటిలో 23, 30, 33, 39, 69 లాంటివి. మున్సిపాలిటీ నెంబరు 1గానూ, రాజాగారి నెంబరు 36గానూ వుండేది. ఆ కాలంలో ఆర్మీ అవసరాలకు భారతప్రభుత్వంవారు దొనకొండలో ఏర్పాటు చేసిన ఏరోడ్రోమ్‌కు ఇక్కడినుంచి లోకల్ నెంబరుగా ఇవ్వటం బహుశా దేశంలోనే లాంగ్ డిస్టెన్స్ లోకల్ కనెక్షన్‌లో ఇదొకటిగా చెప్పుకోవచ్చు.

**ఎక్స్చేంజ్ షిఫ్టింగ్ :** బిల్డింగ్ బాగా పాతది అవ్వటంతో 1962-'63 ప్రాంతంలో పోస్టాఫీసు రామిరెడ్డిపేటకు మారింది. సెంటర్లో ఉన్న శౌరయ్యగారి బిల్డింగ్‌లో ఎక్స్చేంజ్ ఏర్పాటు ఐంది. పెరుగుతున్న టెలిఫోన్ వాడకం దృష్ట్యా విస్తరణలో భాగంగా 200 లైన్లతో సి.బి-నాన్ మల్టిపుల్ బోర్డులతోపాటు, ట్రంక్‌బుకింగ్ ఔట్‌గోయింగ్ మరియు లోకల్ కాల్సును ఆపరేట్ చేయుటకు ప్రత్యేకంగా టి.32 ట్రాక్‌బోర్డును ఏర్పాటు చేయటమైనది. పెరిగిన బోర్డులు, కనెక్షన్ల వల్ల ఆపరేటర్లను పెంచటంతో చందాదారులకు మెరుగైన సర్వీస్ ఇవ్వటానికి వీలైనది. కనెక్షన్లు దాదాపు 190 వరకు పెరగటం, వ్యాపారాభివృద్ధి కావటంతో ఈ ట్రంకాల్సు కూడా సరాసరిన 230 నుంచి 240 వరకు, అలాగే లోకల్ కాల్సు 200 వరకు పెరిగినవి. నర్సరావుపేటకు అనుబంధంగా వినుకొండలో 50 లైన్ల ఎస్.ఎ.ఎక్స్. నెలకొల్పబడింది.

పాలనా దృష్ట్యా చూస్తే ఆ కాలంలో గుంటూరు టెలిగ్రాఫ్ డివిజన్ నెల్లూరు జిల్లా వరకు ఉండేది. సబ్ డివిజన్ పరంగా చూస్తే ఎస్.డి.ఓ టెలిగ్రాఫ్స్ గుంటూరు పర్యవేక్షణలో ఉండేది. టెలిఫోన్, టెలిగ్రాఫ్ లైన్లే గాక రైల్వే కంట్రోల్స్ కూడా డి.ఇ.టి. పరిధిలో ఉండేవి. ఈ ఘట్టాన్ని ముగించే ముందు కొన్ని విశేషాల్ని చూద్దాం!

నేడు శ్రీరాంపురంలో నున్న 'సింధూస్కూలు' ఉన్న స్థలంలోనే ఆనాటి పోస్టాఫీసు, ఎక్స్చేంజ్‌లు ఉన్నట్లు ఎక్కువ మందికి తెలియకపోవచ్చు. అలాగే ఆ కాలంలో ఆపరేటర్లుగా పనిచేసి ఆ పై మళ్లీ ఇక్కడకు వచ్చి ఇక్కడే రిటైరై ఆ నాటి జ్ఞాపకాలకు నిదర్శనంగా నేడు 80 ఏండ్లు దాటి ఉన్నవారు ఎమ్.ఎస్. మూర్తి, ఎస్.కె. మౌలాలీగార్లు మాత్రమే!

**ప్రకాష్‌నగర్‌లో ఎక్స్చేంజ్ ఏర్పాటు :** 1968-69 ప్రాంతంలో ఎస్.ఎస్.&ఎన్. కాలేజీ లెక్చరర్ జి.ఎస్.ఆర్. శర్మగారి బిల్డింగ్‌లో 200 లైన్లుగల సి బి నాన్‌మల్టిపుల్ ఎక్స్చేంజ్ ప్రారంభమైనది. ట్రంక్ బుకింగ్, రెండు ఓ.జి., రెండు సి.ఐ.టి. బోర్డులను ఇన్‌స్టాల్ చేయటమే గాక

చిలకలూరిపేట,గుంటూరుకు లైన్లను పెంచటం, తెనాలి, ఒంగోలు, నంద్యాల, చీరాల, హైద్రాబాద్‌లకు డైరెక్ట్ లైన్లు, విజయవాడకు డయలింగ్ సర్క్యూట్ రావటం వల్ల చందా దారులకు మెరుగైన సేవలందించుటకు అవకాశం ఏర్పడ్డది. ట్రంక్‌కాల్సు సరాసరిన 700 వరకూ పెరిగాయి. నరసరావుపేటకు అనుబంధంగా సాతులూరు, ఫిరంగిపురం, నకరికల్లులలో ఎస్.ఎ.ఎక్స్.లు ఏర్పాటైనాయి.

వినుకొండలో 100 లైన్లు సి.బి. నాన్ మల్టిపుల్ ఎక్సేంజ్ పనిచేయటం మొదలైంది. హైద్రాబాద్‌కు డయలింగ్ సర్క్యూట్, సత్తెనపల్లి, పిడుగురాళ్లకు డైరెక్ట్ ట్రంక్‌లైన్లు ఏర్పడ్డాయి. ట్రంక్‌సేవలలో గణనీయమైన అభివృద్ధి జరిగింది.

**సి.బి. మల్టిపుల్ ఎక్సేంజ్ :** మంచి సేవలందించాలన్నా, అధిక ఆదాయం పొందాలన్నా లోకల్ ఎక్సేంజ్ విస్తరించవలసి ఉంది.ఫలితంగా అదే బిల్డింగులో 1977-'78 మధ్య 4 సి.బి. మల్టిపుల్ బోర్డులతో 480 లైన్లు గల ఎక్సేంజ్‌ని ఇన్‌స్టాల్ చేయటమైనది. ఉచిత కాల్సు దాటిన తార్వాత లోకల్ కాల్‌కు ఛార్జిచేయటం ఫలితంగా స్టాఫ్‌కు కొంత ఒత్తిడి తగ్గటం, ట్రంక్, లోకల్ రెవెన్యూ వసూళ్లు గణనీయంగా పెరిగాయి. ట్రంక్ కాల్సు కూడా దాదాపు 1200 వరకు పెరిగాయి.

అయితే నాటి అవసరాలకు తగినంతమంది ఆపరేటర్లు లేకపోవటంతో కొన్ని నెలలపాటు ఉన్నవారే రోజుకు 3 నుంచి 6 గంటలు ఓవర్‌టైమ్ చేయటమేగాక వారం శలవులలోనూ సర్వీసు చేయటం దాదాపు ఒక ఏడాదిపాటు ఇలా సర్వీసు చేయటం ఒక్క నరసరావుపేటలోనే జరిగింది. పై అధికారులు కూడా మా సమస్యలను అర్థం చేసు కొని పరిష్కరించేవారు. ఆ పై షార్ట్‌డ్యూటీ ఆపరేటర్లను నియమించారు. ఈ సమయంలో ఎక్సేంజ్ అభివృద్ధికి, మంచి సర్వీసు ఇవ్వటానికై, అలాగే డైరెక్టు ట్రంక్ లైన్ల అవసరాన్ని, స్టాఫ్‌ని పెంచాల్సిన అవసరాన్ని, మల్టిపుల్ ఎక్సేంజ్‌గా మార్చాల్సిన అగత్యాన్ని- ఇలా ఎన్నింటికో అవసరమైన సమాచారాన్ని అంకెలతో సహా అందచేయటం, పలుమార్లు పై అధికార్లతో చర్చించటం, వారికి నచ్చచెప్పటంలో యూనియన్‌లు విశేషంగా కృషిచేసినవి. ఆ సమయంలో నేను ఒక కార్యకర్తగా, కార్యదర్శిగా ఉన్నాను. నరసరావుపేట ఎక్సేంజ్ అభివృద్ధి చేయుటలో ఆ నాటి డి.ఇ. టెలిగ్రాఫ్స్ బి. అచ్యుతరావుగారిని, ఎస్.డి.ఓ.టి., గుంటూరు ఎ. పెరుమాళ్ళుగారిని గుర్తుకు తెచ్చుకోవటం అవసరం.

1976లో నరసరావుపేట టెలిగ్రాఫ్స్ సబ్‌డివిజన్‌గా రూపొందింది. రాజమండ్రికి చెందిన అంజనేయులుగారు తొలి ఎస్.డి.ఓ.టి.గా బాధ్యతలు తీసుకొన్నారు. ట్రంక్ ఆటోమాటిక్ ఎక్సేంజ్ ప్రారంభం కావటం, టెలికాంలో ఓ గొప్ప మార్పుకు కారణమైనదిగా చెప్పుకోవచ్చు. దేశంలో ఉన్న ఆటోఎక్సేంజ్‌లు అన్నింటికి కొద్దినిమిషాలలో బుక్ చేసిన ట్రంక్ కాల్సును ఇచ్చే అవకాశం లభించింది. 1979-'80లో రాజాగారికోటలో స్థలం కొనడం, ఆనాటి జనరల్ మేనేజర్ ఆంధ్రా సర్కిల్ టి.హెచ్. చౌదరిగారిచే శంకుస్థాపన చేయించటం, బిల్డింగ్ నిర్మాణం ప్రారంభం కావటం జరిగినై. ఎన్నో ఏండ్లుగా ఎదురుచూస్తున్న 'ఎర్రాప్రగడ టెలిఫోన్ భవన్'ను నాటి కమ్యూనికేషన్స్ మంత్రి శ్రీపి.వి.రంగయ్యానాయుడుగారు 17-6-1983 న ప్రారంభించారు. ఎర్రాప్రగడ క్రీ.శ.14 శ.కి చెందిన మహాకవి. తెలుగు కవిత్రయంలో ఒకరు. మన టెలిఫోన్ భవన్‌కు ఆయనపేరు పెట్టినందుకు అందరూ ఆనందించారు. ముందుగా ఎస్.డి.ఓ.టి. ఆఫీసు లాంటివి అక్కడ కూడా ఏర్పాటు చేయటం, ఆటోఎక్సేంజ్ బదులుగా మాన్యువల్ ఎక్సేంజ్ ఇన్‌స్టాలేషన్ మొదలైంది.

1983లో 9 సి.బి. బోర్డులతో 1,080 లైన్లతో మల్టిపుల్ ఎక్సేంజ్ ప్రారంభమైనది. ట్రంక్‌ఎక్సేంజ్ కూడా విస్తరించటం, ఏలూరు, రాజమండ్రి, నెల్లూరు, గుంటకల్, మద్రాసులకు డైరెక్టు లైన్లు రావటం, ట్రంక్ ట్రాఫిక్ రోజుకు 1,800 వరకు పెరగటం జరిగినవి. ట్రంక్, లోకల్ రెవెన్యూలు వృద్ధియైనవి. రొంపిచర్ల, కుంకలగుంట, దేచవరం, సంతమాగులూరు, పాలపాడులలో ఎస్.ఏ.ఎక్స్. ఏర్పాటైనవి.

సాంకేతికంగా జరిగిన కొన్ని విషయాలకు వస్తే- ప్రత్యేకంగా గుంటూరు కాల్స్‌కు కావలసిన చందాదారులను లైన్లోనే ఉంచి ఇచ్చుటకు వీలు కల్గించే రెండు లైన్లతో ఎస్.డి.ఎస్. ముందుగా నర్సరావుపేటకు రావడం, ఈ సర్వీసులో

దాదాపు 170 నుంచి 180 కాల్సు ఉండటం జరిగింది.

**ఎస్.టి.డి.-పి.టి.ఎస్.** : పబ్లిక్ టెలిఫోన్‌లకు సబ్‌స్క్రైబర్ ట్రంక్‌డయలింగ్ కల్పించటంతో స్వంత ఫోన్లు లేనివారే గాక, రెండు మూడు కనెక్షన్‌లు కలిగిన వారున్నూ, ఈ.ఎస్.టి.డి.-పి.టి.లకొచ్చి అవసరమైన చోట్లకు మాట్లాడుకోవటంతో వీటి సంఖ్య గణనీయంగా పెరిగింది. దాదాపు 120 నుంచి 130 ఎస్.టి.డి.- పి.టి.లు ఉండేవి.

**ఎమ్.ఎస్.టి.డి. సౌకర్యం** : మాన్యువల్ ఎక్స్ఛేంజ్ అయిన మన పట్టణానికి చెందిన చందాదారులకు ట్రంకు డయలింగ్ కలిగించబడటం- అదే మాన్యువల్ సబ్‌స్క్రైబర్ ట్రంక్ డయలింగ్ కావటం.. బోర్డుకు రెండు చొప్పున మొత్తం 18లతో ఈ సర్వీసు ప్రారంభమైనది. ఈ ఎమ్.ఎస్.టి.డి. సర్వీసు తీసుకున్నవారు దేశంలో ఉన్న అన్ని ఆటోఎక్స్ఛేంజ్‌లకు మాట్లాడుకొనే అవకాశం ఏర్పడింది. ఆంధ్ర సర్కిల్‌లో మొదటి సారిగా ఈ సౌకర్యం మన పట్టణానికి కలిగించటం విశేషం!

నరసరావుపేట టెలిగ్రాఫ్ డివిజన్‌గా ఆపై ఫోన్సు డివిజన్ రావటంతో రెండు డివిజన్లకు హెడ్ క్వార్టర్ కావటమైనది. కంపా చెన్నకేశవరావుగారు మొదటి డి.ఇ.టి.గా పని చేశారు. గుంటూరు టెలికాం డిస్ట్రిక్ట్‌గా ఆపై జనరల్ మేనేజర్ టెలికాంగా స్థాయిపెరగటం, టి.డి.ఎం. రామకృష్ణారావుగారు, జి.ఎమ్.టి.గా ఎం. రామచంద్రన్‌గారి హయాంలో టెలికాం రంగం అద్భుతమైన అభివృద్ధిని సాధించటమేగాక వరుసగా 8, 9 ఏండ్లు దేశంలోనే ఉత్తమ టెలికాం జిల్లాగా ప్రభుత్వంచే గుర్తించబడటం ఓ విశేషం!!

**ఆటో ఎక్స్ఛేంజ్** : ఎన్నో ఏండ్లుగా కనెక్షన్ల కొరకు ఎదురు చూస్తున్న వేలాదిమంది సుదీర్ఘ నిరీక్షణ 1994-'95లో ఫలించింది. అదే దాదాపు 6,000 కనెక్షన్లతో ఆటోమాటిక్‌గా మారి, దేశంలో నున్న ఆటో ఎక్స్ఛేంజ్‌లతో అనుసంధానమైనది. ఈ మార్పులోనూ ఓ ప్రత్యేకత ఉన్నది. అప్పటికి అంటే ఆటోఎక్స్ఛేంజ్‌గా మార్చినప్పుడు దేశంలోనే 1,080 లోకల్ లైన్ల కెపాసిటీ కలిగిన మాన్యువల్ ఎక్స్ఛేంజ్ మన నరసరావుపేట ఒక్కటే కావటం ఆ ప్రత్యేకత. ఆ పై ఎన్నో ఏండ్ల నుంచీ ట్రంక్ సేవలందించి ట్రంక్ఎక్స్ఛేంజ్ కొద్ది రోజుల లోనే క్లోజ్ కావటమైనది. 'నెంబర్ ప్లీజ్', 'ఎక్స్ఛేంజ్ ప్లీజ్', నో రిప్లయి సార్, ట్రంక్ బుకింగ్, ట్రంక్ ఎంక్వయిరీ, బియాండ్ ఆన్‌లైన్ సార్ లాంటి ఎన్నో మాటలు గతకాలపు చిహ్నాలై నాయి. క్రమంగా 13,000 కనెక్షన్లు కలిగిన పెద్ద ఆటో ఎక్స్ఛేంజ్ కావటం, ప్రకాష్‌నగర్‌లో మరో విభాగం ఏర్పాటు చేయటం జరిగింది.

**బి.ఎస్.ఎన్.ఎల్. ఆవిర్భావం** : 2000 అక్టోబర్ 1న డిపార్టుమెంట్ ఆఫ్ టెలికాం ప్రభుత్వ సంస్థ అయిన భారత్ సంచార్ నిగమ్ లిమిటెడ్‌గా మారింది. టెలికాం రంగంలో ప్రయివేటు ఆపరేటర్లు, మొబైల్ ఫోన్స్ రావటం, సునామీలాగా వచ్చిన ఆ పరిస్థితి వలన ప్రయివేటు సంస్థలతో బి.ఎస్.ఎన్.ఎల్. పోటీ పడలేకపోవటం, లాండ్‌లైన్ వాడకం క్రమంగా తగ్గిపోతుండటం - ఇలాంటి ఎన్నో కారణాలవలన వేలకోట్ల రూపాయల లాభంలోఉన్న సంస్థ నష్టాల బాటలోకి నడిచింది. ఇది ఓ పట్టణానికో, రాష్ట్రానికో కాదు. దేశానికి సంబంధించిన సమస్య. భవిష్యత్‌లో బి.ఎస్.ఎన్.ఎల్. మళ్లీ తన పూర్వ వైభవాన్ని సంతరించుకోగలదని ఆశిద్దాం!! ●





# 'పవర్'...




సుందరశెట్టి సామ్రాజ్యం
టీచర్




ఈనాటి ఎల్.ఇ.డి. ల్యాంప్స్

మన నరసరావుపేటకు విద్యుత్‌కాంతులను చూపిన గొప్పతనం వావిలాల వాసుదేవశాస్త్రిగారిది. వీరు మన మునిసిపాలిటీ కన్నా ముందే 1906లో జన్మించారు. ఆయన మచిలీపట్నంలో చదివిన తరువాత జర్మనీలో ఇంజనీరింగ్ విద్యను అభ్యసించిన మేటి. 1928లో జయపూర్ విక్రమవర్మ సంస్థానంలో వాసుదేవశాస్త్రిగారు ఇంజనీరుగా ఉద్యోగిస్తూ మాచ్‌ఖాండ్ మొదలైన జలవిద్యుత్ కేంద్రాల ఆవిర్భావానికి ఆద్యుడైనాడు.

ఆరోజులలో ఆంగ్లేయప్రభుత్వం మున్సిపాలిటీల పరిధిలో డీజిల్ జనరేటర్‌ల ద్వారా కరెంటును ఉత్పత్తి చేసి పరిశ్రమలకు, ఇళ్లకు, ఇతర అవసరాలకు సరఫరా చెయ్యడానికి అర్హులైన ఇంజినీర్లకు అనుమతి ఇచ్చేది. ఆ రోజుల్లో నరసరావుపేటలో ఇటలీ వారి రాలిస్ కంపెనీ, స్విట్జర్‌లాండ్ వారి ఓల్కాట్ కంపెనీ, బ్రిటీషువారి లివర్ బ్రదర్స్ కంపెనీ



ఆ నాటి వీధి దీపం

ఉండేది. ఆముదం, నీలి మందు, ప్రత్తి, వేరుశనగ మొదలైన పైర్లు ఇక్కడ పండేవి. వాటి విశిష్టవిక్రేతలందరూ ఇక్కడి వారే! అందువల్ల 1935 లోనే ఇక్కడ విద్యుత్‌సంస్థ ఏర్పడింది. 1959లో జాతీయం అయ్యేవరకు అంతరాయం లేకుండా సాగింది. ఈ ప్రాంతాన్ని నిన్న మొన్నటివరకు పవర్‌హౌస్ అని పిలిచేవారు. అదే ఇప్పటి కరెంట్ ఆఫీస్ ఉన్నచోటు.

ఆయన నాలుగు దూర్జి కంపెనీ జనరేటర్లను మొదటే తెచ్చారు. అవి జర్మనీ దేశానికి చెందినవి. వాటిని చెన్నపట్నం రేవులో దింపుకున్న తర్వాత అక్కడి నుండి సంగంజాగర్లమూడి వరకు బకింగ్‌హామ్ కెనాల్‌లో నాటుపడవలమీద తీసుకువచ్చారు. అక్కడనుండి వీటి కోసం ప్రత్యేకంగా తెచ్చిన ఇనుప చట్రం మీద నరసరావుపేటకు చేర్చారు. వీటి రవాణాకు సంగంజాగర్లమూడి నుండి ఎనిమిది జతల ఎడ్లు అవసరమై

నాయి. దీనికి ఆ రోజులలో అయిన ఖర్చులు అక్షరాలా మూడు లక్షలు.

వాసుదేవశాస్త్రిగారు జాతీయోద్యమ భావస్ఫూర్తి కలవారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 1930లో మాజీ రాష్ట్రపతి వి.వి. గిరిగారితో పాటు శ్రీకృష్ణజన్మ స్థానాన్ని అలంకరించారు. బ్రిటీష్ వ్యతిరేకతను భావించిన తీరు గమనార్హం. ఆయన జర్మనీ నుండి జనరేటర్లను, బెల్జియం నుంచి కారఫ్ కండక్టర్లను, జకోస్లేవేకియా నుండి కరెంటు మీటర్లను తెప్పించారు. ఫ్రాన్సు నుండి ఇటలీ నుండి ట్రాన్స్ ఫార్మర్లు, జర్మనీ నుంచి 400 గొట్టపు వీథిస్తంభాలు తెప్పించారు. బెంగాల్ లాంప్‌వర్క్స్ నుంచి, మైసూర్ లాంప్ వర్క్స్ నుంచి బల్బులు తెప్పించారు. ఇంగ్లండు నుండి ఒక్కటీ తెప్పించలేదు.

శాస్త్రిగారు 140 సర్వీసు కనెక్షన్లను ఇచ్చారు. 100 కాండిల్ బల్బులతో 180 వీథిదీపాలను ఏర్పాటు చేశారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఆ రోజుల్లో మన పట్టణాన్ని అధ్యయన కేంద్రంగా చేసి, కరెంటును గురించి విద్యార్థులకు అవగాహన కల్పించింది. ఈ ఘనచరిత్ర మనకెంతో గర్వకారణం. మన పురపాలక సంఘానిదే నరసరావుపేటలోని తొలివిద్యుత్ కనెక్షను. ఆ తరువాత కనెక్షన్ కపిలవాయి మల్లయ్యగారిది. అప్పుడు రవాణారంగంలో పేరుపొందిన పొతకమూరి శౌరయ్య అంతయ్యగార్ల మొదటి ఎయిర్ కండీషనర్, మొదటి సీలింగ్‌ఫ్యాను, మొదటి టేబుల్ ఫ్యాన్. ఆ నాటి మద్రాస్ రాష్ట్రంలోని పరిశ్రమల రంగంలో ఎక్కువ విద్యుత్ వినియోగించిన పట్టణాలలో నరసరావుపేట ఒకటి. అడపావారి మల్లె తోటకు ఏర్పరచిన మొదటివ్యవసాయపంపుకనెక్షన్‌ను ఆచార్య ఎన్.జి. రంగాగారు ఆసక్తితో పరీక్షించారు.

అప్పటి ప్రభుత్వ లైసెన్సు నింబంధనల ప్రకారం కరెంటు సరఫరాలో రెండు నిమిషాలకు మించి అంతరాయం కలిగితే వెయ్యి రూపాయలు జరిమానా, వినియోగదారులకు నష్టపరిహారం చెల్లించాలి. వాసుదేవశాస్త్రిగారిని ప్రోత్సహించిన ప్రముఖులు పొతకమూరి థామస్‌గారు, ఆయన సోదరులు శౌరయ్యగారు, అంతయ్యగారు, ప్రముఖవ్యాపారి మండవ శేషగిరిరావుగారు, త్రివేణి పత్రిక సంపాదకులు, ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు. ఇలా వీరి విజ్ఞానరోచిస్సులు విద్యుద్రూపంలో నరసరావుపేటను వెలిగింపచేస్తున్నది. •

## ప్రముఖ రక్తదాత - కొక్కు బాబురావు

ప్రముఖ రక్తదాత కొక్కు బాబురావుగారు మన పట్టణంలోనే జన్మించారు. 1976లో పోలీసుశాఖలో కానిస్టేబుల్‌గా ఉద్యోగంలో చేరారు. ఎస్.ఐ.గా మన పట్టణంలోనే రిటైరైనారు. పల్లెటూళ్ల కొట్లాటల సమయంలో దెబ్బలు తగిలి సమయానికి రక్తం దొరకక ప్రాణాలను కోల్పోయిన అనేక మందిని సర్వీసు ప్రారంభంలోనే చూశారు. తాను స్వయంగా మంచి ఆరోగ్యవంతుడు కనుక తనది 'ఓ పాజిటివ్ రక్తం' కనుక 'రక్తదానం చేసి వీరిని ఆదుకొంటే బాగుండు'నన్న ఆలోచనతో అప్పటి రోజులలో రక్తదానంలో ఉన్న అపోహలను



లెక్కచేయకుండా రక్తదానం చేయటం ప్రారంభించారు. 2011 నాటికి 50 పర్యాయాలు రక్తదానం చేసి అనేకుల ప్రాణాలను నిలబెట్టారు. సమాజంలో చాలమందికి చాలమంది పోలీసులపట్ల ఉన్నటువంటి దురభిప్రాయాన్ని పోగొట్టి వారు కూడా ప్రజా శ్రేయోభిలాషులే అనే ఉద్దేశాన్ని కలిగించటానికి యూనిఫాంలోనే రక్తదానం చేసేవారు. 25వ సారి రక్తదానం చేసినప్పుడు అప్పటి మన రాష్ట్రగవర్నర్ రంగరాజన్‌గారు వీరిని తమ రాజభవన్‌కి ఆహ్వానించి సత్కరించారు. బాబురావుగారు తమ తండ్రి మరణించిన సందర్భంలో వారి అంత్యక్రియలను కొద్దిసేపు వాయిదావేసి, ప్రాణాపాయస్థితిలో ఉన్న ఒక రోగికి రక్తదానం చేసి అందరిని ఆశ్చర్యచకితులను చేశారు. బాబురావుగారు తమ 58వ పుట్టినరోజు సందర్భంగా 50వ సారి రక్తదానం చేసిన సందర్భంలో 'బాబురావుగారికి ప్రజాసేవ పట్ల ఉన్న అంకితభావం ప్రశంసనీయం! అందరికి ఆదర్శ ప్రాయం!' అని గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రి సూపరింటెండెంట్ డా॥ ఫణిభూషణరావుగారు వీరిని మెచ్చుకొన్నారు! •

# మంచి 'నీటి' బావులు




స్వర్ణ వేంకటేశ్వరరావు

ఉప సంపాదకులు - 'విశ్వశిల్పి'


సకల జీవసముదాయానికి నీరే ప్రాణాధారం. అందుకే మన పూర్వులు చెరువులు, బావులు ఏర్పాటు చేయ దాన్ని పవిత్రకార్యంగా భావించారు. సప్తసంతానాలలో జలాశయ నిర్మాణాల్ని ప్రధానమైనదిగా పరిగణించారు.

మన ఊరిలో ఉన్న ఇళ్లలోని బావుల విషయాన్ని అలా ఉంచి, ప్రజా బాహుళ్య ప్రయోజనార్థం దాతలు త్రవ్వించిన బావులను గురించి పరిశీలిద్దాం.

నరసరావుపేటలోని బావులలో మొట్టమొదట పేర్కొనదగినది నార్నెబావి. ఇదే నారన్న బావి. మన కోట ఏర్పడక ముందు అట్లూరు గ్రామంలో ముఖాసాదారు అయిన కటికల నారన్న త్రవ్వించిన బావి ఇది. ఇది పాతూరి శివాలయానికి ఈశాన్యం వైపున ఉండేది. 1967 దాకా ఈ బావి నీరు వాడకంలో ఉంది. ఆ తరువాత పాడుపడిన రూపంలో 2000 సంవత్సరం వరకు ఉంది. అనంతరం ఈ పెద్ద దిగుడుబావిని పూడ్చి రోడ్డు వేశారు. ఇటువంటి పెద్ద దిగుడుబావి బరంపేట మసీదుకు దక్షిణం వైపున ఒకటి ఉండేది. దాన్ని బుచ్చిబాపన్న బావి అనేవారు. రాజాగారి కోట వాయవ్యం వైపున మానికల బావి ఉండేది. దాని నీటిని కోట అవసరాలకు వాడేవారు. పాతశివాలయానికి ఉత్తరాన చెరువుకు తూర్పుగా నాగసరపు వారి బావి ఉండేది. దీనిని నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారు త్రవ్వించారు. నీటి ఎద్దడి రోజుల్లో ఈ బావి ఊరు మొత్తాన్ని ఆదుకుంది. దానికి ఎదురుగా బోడిబావి ఉండేది. పాతూరు శివాలయానికి ఈశాన్యంలో ఉన్న వేంకటేశ్వరస్వామిగుడి లోపల మఠంబావి ఉండేది. శివాలయం నైరృతిలోను, తోట లోను ఉన్న బావుల నీటిని కిరసనాయిల్ డబ్బాలతో తోడుకొని, పీపాలతో బండ్లమీద తీసికొని వెళ్లి ప్రజలు వాడుకున్నారు. కరెంట్ ఆఫీస్ రోడ్‌లో మద్ది రాఘవులు బావి ఉండేది. ఈ నీటిని మేళతాళాలతో పాతూరు శివాలయానికి తీసికొని వెళ్లి స్వామివారి అభిషేకానికి ఉపయోగించేవారు. పాత శంకర మఠానికి ఎదురుగా ఉన్న బావులకు మూడుబావులు అని పేరు. పనసతోటలోని పెద్ద మంచినీటి బావి ప్రసిద్ధి కలది.

ఎస్.ఎస్. & ఎన్. కళాశాల దక్షిణం వైపున మేడిచెట్టు బావి ఉండేది. రావిపాడు రోడ్డులోని కొండపల్లి ఆసుపత్రి ప్రాంతంలో శౌరయ్యగారి బావి ఉంది. ఆర్.డి.ఓ. ఆఫీసులో దొంగల బావి ఉండేది. జైలులో ఉన్న దొంగలు ప్రతిరోజు స్నానానికి వచ్చినపుడు నీళ్లకోసం వచ్చిన మహిళలకు నీళ్లు చేదిపోసి తమలో దాగి ఉన్న పరోపకార బుద్ధిని ప్రకటించుకొనేవారు. రెండవ రైలుగేటు దగ్గర న్యాయాధికారుల బంగళా ఆవరణలో మునసబుగారి (కోర్టు మునిసిఫ్) బావి ఉండేది. రైల్వే టర్నింగ్ బ్రిడ్జికి సమీపంలో ఉన్న లింగంగుంట్ల బావి నీటిని మున్సిపాలిటీవారు పంపుల ద్వారా పట్టణానికి సరఫరా చేసేవారు, చేస్తున్నారు.

ఠాగూర్ మున్సిపల్ ఎలిమెంటరీ స్కూల్ దగ్గర ఉన్న ఓట్లబావి, ఆర్డీఓ ఆఫీస్ ఎదురుగా ఉన్న 'బడాయిగడ్డ' బావి, పాత పోలీస్ స్టేషన్ వెనుక ఉన్న కొత్తబావి, ఏంజెల్ టాకీసుకు దక్షిణంగా ఉన్న సినిమాహాలు బావి, అరండల్‌పేట, చింతల పాటివారివీథిలోని జంగాలపల్లివారిబావి, రామిరెడ్డిపేట చౌడమ్మగుడి దగ్గర ఉన్న జెండాచెట్టు బావి, పుల్లెల దశరథ రామయ్యగారి ఇంటి దగ్గర నాలుగు రోడ్ల కూడలిలోని గిలకల బావి పేర్కొనదగినవి.

బైపాస్ రోడ్డులో సరస్వతీ శిశుమందిర్ వెళ్లే మలుపులో మూడు బావులు ఉండేవి. అదే ఇప్పటి మూడు బావుల సెంటర్. అక్కడి పెద్దబావిని రాజాగారి బావి అనేవారు.

'నుతజల పూరితంబు' లైన ఈ నూతులకు, బావులకు దోసిలొగ్గి నమస్కరిద్దాం! •

# మహత్తర అవకాశం!




## నాగసరపు సుబ్బరాయగుప్తా

మునిసిపల్ ఛైర్ పర్సన్


'నరసరావుపేట పురపాలకసంఘం శతవసంతాల వేడుకలలో భాగంగా ప్రచురించబడుతున్న ప్రత్యేక సంచికకు ఒక వ్యాసం వ్రాయ'మని సంపాదకులవారు అడిగినపుడు నా కెంతో ఆనందం వేసింది. నేను పుట్టి పెరిగిన ఈ పట్టణానికి పురపాలకసంఘం ఛైర్‌పర్సన్‌గా ఎన్నిక అవడం అందునా పురపాలకసంఘం శతవసంతాల పండుగ జరుపుకునే సమయంలో ఈ అవకాశం అదృష్టం కలగడం నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను. నిజానికి ఛైర్మన్‌గా పోటీచేయడానికి ప్రోత్సాహ ప్రోద్బలాలు అందించింది నవ్యాంధ్రప్రదేశ్ తొలి శాసనసభాపతి, స్ఫూర్తిప్రదాత డా॥ కోడెల శివప్రసాదరావు గారు. నరసరావుపేట ఆధునికతను సంతరించుకుని అద్భుత పట్టణంగా ఎదగడం, పట్టణంలో రెండుపూటలా మంచినీటి సౌకర్యం డాక్టరుగారి నేతృత్వంలో జరిగిన ద్విశతాబ్ది ఉత్సవాల నుండే అనడం స్వభావోక్తి. రోడ్ల విస్తరణ, సెంట్రల్ లైటింగ్, టౌన్‌హాల్, స్టేడియం నిర్మాణం ఒక ఎత్తు అయితే కోటప్ప కొండను ప్రఖ్యాత శివక్షేత్రంగా తీర్చిదిద్దడానికి వారు చేసిన కృషి, అక్కడ గావించిన విశేషమైన ఏర్పాట్లు, కొండపైకి రోడ్డు వేయించడం... ఇలా దానినొక పవిత్రక్షేత్రంగా రూపొందించడానికి వారు ఇంకా ఎన్నో ఆలోచనలతో ముందుకు సాగడం మరొక ఎత్తు. ఇవి నాకెంతో ఆనందాన్నీ, ఆశ్చర్యాన్నీ కల్గిస్తాయి.

నరసరావుపేట పట్టణం అంటేనే నాకెంతో ఆనందం వేస్తుంది. మా తాతగారు నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారు వైస్‌ఛైర్మన్‌గా, ఛైర్మన్‌గా సేవలందించిన పట్టణం ఇది. ఆయన ఎంతో ముందుచూపుతో పల్నాడుప్రాంతంలో ఎక్కడా కళాశాలలు లేని రోజులలో 65 సంవత్సరాలకు పూర్వం సువిశాల ప్రదేశంలో పూర్తివసతులతో దాదాపు రూ. 1,25,000/-లు ఆర్థికసాయం అందించి శ్రీ సుబ్బరాయ& నారాయణ కళాశాలను నెలకొల్పిన వదాన్యులు. ఎకరం రూ. 150/-లు అమ్మే ఆ రోజులలో అంత పెద్దమొత్తంలో విరాళం అందించడం ఆ మహనీయుడికే చెల్లింది. అంతేకాదు; ఆయన మనిషి పుట్టినప్పటి నుండి మరణించేదాకా అవసరమైన ఎన్నో సేవలు పట్టణానికి చేసిన గొప్పదాత. ఆస్పత్రిలో ప్రసూతికేంద్రం నిర్మాణం, ఎండాకాలంలో బాటసారులకు మంచినీళ్లు ఇవ్వడానికి చలివేంద్రం, మరణానంతరం అపరకర్మలు చేసుకోవడానికి అన్ని వసతులతో కూడిన సత్రం, పట్టాభిరామస్వామి వారి దేవస్థానము, నాగసరపు బావి... ఇలా పట్టణప్రగతికి అనేకానేక సదుపాయాలు, సౌకర్యాలు ఏర్పరచిన మహనీయుడు మా తాతగారు. మా నాన్నగారు నాగసరపు రామారావుగారు మా తాతగారు అప్పగించిన బాధ్యతలను- ఎస్.ఎస్. &ఎన్. కాలేజికి సెక్రటరీ & కరస్పాండెంట్‌గా, పట్టాభిరామస్వామి దేవస్థానము ధర్మకర్తగా, చలివేంద్రం ట్రస్టీగా, శ్రీవేంకటేశ్వర కళ్యాణమండపం సెక్రటరీగా, కర్మసత్రం ట్రస్టీగా, షుమారు 55 సంవత్సరాలు సమర్థతతో నిర్వహించినారు.

గత సంవత్సరం పురపాలకసంఘానికి జరిగిన ఎన్నికలలో నేను డా॥ కోడెలగారి ఆశీస్సులతో పోటీచేసి కౌన్సిలర్‌గా ఎన్నిక అవడం, అనంతరం ది. 3-7-2014న చైర్‌పర్సన్‌గా బాధ్యతలు స్వీకరించడంతో నా జీవితంలో ఒక వినూత్న అధ్యాయం ప్రారంభమయింది. ఉత్సాహంతో ప్రజలందరి ప్రోత్సాహాలతో కార్యరంగంలోకి దిగాను. వార్డు వార్డుకు అవిశ్రాంతంగా తిరుగుతూ పట్టణప్రజల ప్రగతికి అంకితభావంతో కృషిచేయ నిర్ణయించుకున్నాను. ఆరు కమ్యూనిటీ హాల్స్ ఏర్పాటు, పుష్‌కార్డులతో, వార్డుకు ఇద్దరేసి నగర దీపికలు ప్రతిఇంటికి వెళ్లి చెత్త సేకరించటం, పట్టణ ప్రజలసమస్యలను నేరుగా ప్రతి గురువారం నిర్వహిస్తున్న

డయల్ యువర్ ఛైర్‌పర్సన్ కార్యక్రమానికి వచ్చే ఫోన్ల ద్వారా తెలిసికొని వాటిని పరిష్కరించడానికి కృషిచేస్తున్నాను. స్వచ్ఛమైన పాలనను, పారదర్శక పాలనను అరువ నిశ్చయించుకున్నాను. 'లంచాలు ఇవ్వడం, తీసుకోవడం నేరం' అంటూ పురపాలకసంఘ కార్యాలయములో బోర్డు పెట్టించాను.

ఇటీవల భారత ప్రభుత్వంవారు నిర్వహించిన జాతీయ స్థాయి సర్వేలో మన పురపాలకసంఘానికి జాతీయస్థాయిలో 59వ స్థానం, రాష్ట్రంమొత్తంలో ద్వితీయస్థానం, జిల్లాలో ప్రథమ స్థానం రావటం నా ఉత్సాహాన్ని మరింత ఇనుమడింపజేసింది. దాదాపు ఇదే సమయంలో స్పీకరు డా॥ కోడెల శివప్రసాద రావుగారు నరసరావుపేట పురపాలకసంఘం శతాబ్ది ఉత్సవాలు 'నభూతో నభవిష్యతి' అన్న రీతిలో నిర్వహింప తలపెట్టడం నిజంగా నా కొక వరంగా భావిస్తున్నాను. సుదీర్ఘ పురపాలక సంఘచరిత్రలో ఇదొక చారిత్రాత్మక అపూర్వ ఘట్టంగా పట్టణాన్ని శోభాయమానంగా తీర్చిదిద్దడానికి ఎంతో ఆలోచనాత్మకంగా చేపట్టడం ముదావహం.

షుమారు రూ॥ 350కోట్ల వ్యయంతో ఈ వేడుకలలో నిర్వహించనున్న కార్యక్రమాలు మన పట్టణాన్ని రాష్ట్రంలోనే ఒక ఆదర్శపట్టణంగా తీర్చిదిద్దుతాయనడం అతిశయోక్తి కాబోదు. పట్టణంలో స్వర్గపురి పేరున హిందువులకు, ముస్లింలకు, క్రైస్తవులకు సంబంధించిన శ్మశానవాటికలను అధునాతన రీతిలో నిర్మించడం, పదివేల మరుగుదొడ్ల నిర్మాణంతో బహిఃప్రదేశంలో మలవిసర్జన లేని పట్టణంగా (open defocation free town) రూపొందించడం, కుల మత రహితంగా పట్టణంలోని నిరుపేదలకు 1,504 గృహాల నిర్మాణం గావించడం, అర్హులందరికి దీపం కనెక్షన్లు ఇవ్వడం, నూరుశాతం కట్టెలపొయ్యిలు లేని గృహాలు ఉండే విధంగా చూడడం, రోడ్లవిస్తరణ, రైల్వే అండర్ బ్రిడ్జ్ ఏర్పాటు, పురపాలకసంఘం ఆఫీసు నిర్మాణం, మునిసిపల్ బంగళా, హోల్‌సేల్ కూరగాయల మార్కెట్, మాంసం, చేపల మార్కెట్ భవనాల నిర్మాణం, పార్కుల ఆధునీకరణ, పబ్లిక్ టాయిలెట్స్ ఏర్పాటు, స్టేడియంలో అత్యాధునిక స్విమ్మింగ్‌పూల్ నిర్మాణం, పట్టణంలో పూర్తిగా ఎల్.ఇ.డి. లైట్స్, సి.సి.కెమేరాలు ఏర్పాటు చేయడం మొదలగు కార్యక్రమాలతోపాటు మధ్యలో ఆగిపోయిన భూగర్భ డ్రెయినేజి స్కీమును పూర్తిచేయటం, పురపాలకసంఘం బాలికోన్నత పాఠశాలలో గురజాడ కళావేదిక పునర్నిర్మాణం... ఇలా అనేక ప్రజాహిత కార్యక్రమాలు చేపట్టదలచాము.

ప్రతిఇంటికీ మంచినీటి కుళాయి, ప్రతిఇంటికీ మరుగుదొడ్డి ఏర్పాటుచేస్తున్నాము. పట్టణప్రజలకు అన్ని మౌలిక వసతులను ఏర్పాటు చేస్తున్నాము. పట్టణప్రజలను నేను కోరేది ఒకటే! మన నరసరావుపేటను స్వచ్ఛ నరసరావుపేటగా రూపొందించడానికి ప్రజలు అందరూ ముఖ్యంగా పరిశుభ్రతను పాటిస్తూ పచ్చదనంకోసం ప్రతిఒక్కరూ చెట్లను నాటి పర్యావరణాన్ని పరిరక్షించటానికి తోడ్పడాలని, దృఢ సంకల్పంతో పట్టణ అభివృద్ధిలో అందరూ భాగస్వాములు కావాలని కోరుతున్నాను. ఇదొక చారిత్రాత్మక సమయం. ఇలాంటి అద్భుత సమయంలో పురపాలకసంఘం ఛైర్ పర్సన్‌గా సేవలందించే భాగ్యం నాకు కలిగించిన ప్రజలందరకూ నమోవాకాలు తెలుపుతున్నాను.





పట్టణానికి వన్నె తెచ్చిన ఫ్లై ఓవర్లు

# చైర్‌పర్సన్‌గా నా అనుభవాలు

వనమా సుబ్బారావు, పురపాలక సంఘ పూర్వ అధ్యక్షులు



నేను మాన్యశ్రీ డా॥ కోడెల శివప్రసాదరావుగారి ఆశీస్సులతో మన నరసరావుపేట పురపాలకసంఘ అధ్యక్ష పదవిని చేపట్టాను. వారి మార్గదర్శకత్వములో మేము మన పట్టణంలో సిమెంటు రోడ్లు వేయించుట, గాంధీపార్కును అధునాతనముగా తీర్చిదిద్దుట, షాదీఖానా, శివా గెస్ట్‌హౌస్, భువనచంద్ర టౌన్‌హాల్, స్టేడియం మొదలగు నూతన నిర్మాణములు చేపట్టాము. పట్టణపురోభివృద్ధికి అహర్నిశలు కృషి చేశాము. మన పట్టణప్రజల దాహార్తి తీర్చుటకై 20 కోట్ల రూపాయల ఖర్చుతో మంచినీటి పథకమును ఏర్పాటు చేశాము. పట్టణ ప్రజలకు వేసవితో సహా అన్ని రోజులలోనూ రెండు పూటలా మంచినీటి వసతి కల్పించాము. ఇది రాష్ట్రంలోనే రికార్డు.

1997వ సం॥లో నరసరావుపేట పట్టణ ద్విశతాబ్ది ఉత్సవముల సందర్భమున గవర్నమెంట్ హాస్పిటల్ 100 పడకలు గల నూతనభవనమును నిర్మించాము. పట్టణములోని రోడ్లను వెడల్పు చేశాము. రోడ్ డివైడర్స్ మరియు సెంట్రల్ లైటింగ్ మొదలైన ఏర్పాట్లు చేశాము. సత్తెనపల్లి రోడ్డులోని వీరముష్టి కాలనీని చంద్రబాబు నాయుడుకాలనీగా మార్చి వృద్ధి చేశాము. సత్తెనపల్లిరోడ్‌లో షాపింగ్ కాంప్లెక్స్ నిర్మించాము.

200 సంవత్సరాల మన నరసరావుపేట పట్టణ చరిత్రను సేకరించి 'సావనీర్'ను ప్రచురించాము. ద్విశతాబ్ది ఉత్సవములను విజయవంతముగా నిర్వహించాము.

1965 సంవత్సరములో క్లాత్‌మర్చంట్స్ అసోసియేషన్ అధ్యక్షులుగా ఏకగ్రీవముగా ఎన్నికైనాను. 28 సం॥లు నిరాతంకముగా ఆ పదవి బాధ్యతలు నిర్వహించాను. ఇప్పుడు కూడా అసోసియేషన్ అభివృద్ధికి యథాశక్తి కృషి సల్పుతున్నాను. వస్త్రవ్యాపారములో అపారమైన అనుభవము గడించి ఉన్న నేను రజతోత్సవ కమిటీకి కూడా అధ్యక్షులుగా ఏకగ్రీవముగా ఎన్నికైనాను. క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ రజతోత్సవములను దిగ్విజయముగా జరిపినాను. దీనికి గుర్తింపుగా అసోసియేషన్‌వారు నన్ను వెండికిరీటముతో సన్మానించినారు.

నేను 1972వ సం॥లో శ్రీకుసుమమరనాథ్ షోరూమ్‌ను ప్రారంభించి వస్త్రవ్యాపార రంగంలో నూతనాధ్యాయం ప్రారంభించాను. చైతన్యచిత్ర, రంగస్థలి, సద్గురుకళా సమితి మొదలగు సంస్థలలో ముఖ్యమైన పదవులు నిర్వహించి వాటి పురోభి వృద్ధికి తోడ్పడినాను. స్వచ్ఛంద సేవాసంస్థయైన రోటరీక్లబ్‌కు కోశాధికారిగా ఆ సంస్థకు ఆర్థికపరిపుష్టిని కల్పించాను. ఇటువంటి సేవలకు గుర్తింపుగా ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం నాకు ప్రతిభాపురస్కార ప్రదానము చేశారు.

ఈ కార్యక్రమములనన్నింటినీ మన మునిసిపల్ కార్యాలయఉద్యోగుల, నాయకుల, అభిమానుల, వివిధ సంస్థల సభ్యుల సహాయసహకారాలతో విజయవంతముగా నిర్వహించాను. వారికి నా కృతజ్ఞతలు. •

## స్త్రీ గౌరవం

ఎక్కడైతే స్త్రీలకు గౌరవం లభిస్తుందో అక్కడ దేవత లందరూ ఆనంద నృత్యం చేస్తారు.
స్త్రీలకు మర్యాద లభించని చోట ఎవ్వరు ఏ పనులను తలపెట్టినప్పటికి అవి అన్నీ విఫలాలే అవుతాయి.

- స్మృతి కర్త మనువు.

# అందరిలో ఒకడినై

## నంద్యాల కోటిరెడ్డి సంపాదకులు, దేశభక్తి పత్రిక



నేను మన మునిసిపాలిటీ కన్న 13 సంవత్సరాలు చిన్నవాడిని. నేను చిన్నతనంలో వామపక్ష అభిమానిని. 1935 ఎన్నికలలో శిస్తుకట్టేవారికి, పన్ను చెల్లించేవారికే ఓటు హక్కు ఉండేది. 9 ఏళ్ళ వయస్సు ఉన్న నేను ఆ రోజుల్లో గుర్రబ్బండి లో కార్యకర్తగా ఎన్నికల ప్రచారానికి వెళ్లేవాడిని. ఆ రోజుల్లో నరసరావుపేట మునిసిపాలిటీ జనాభా 10,000 ఉండేదేమో!

ఆ రోజుల్లో త్రివేణి సంపాదకులు కోలవెన్ను రామ కోటేశ్వరరావుగారు ఇక్కడే ఉండేవారు. నేనూ, ప్రముఖ న్యాయ వాది కాకుమాను సూర్యనారాయణరెడ్డిగారు వారిని తరచు కలుస్తూ ఉండేవాళ్లం.

మన పట్టణానికి ఎలక్ట్రిసిటీ వచ్చిన తొలిరోజులలో బిల్లులు గుంటూరులో కట్టవలసి వచ్చేది. మేము కొందరం కలసి మంత్రి ఎ.సి. సుబ్బారెడ్డిగారిని కలసి విజ్ఞాపనపత్రాన్ని సమర్పించాము. త్వరలోనే మా ప్రయత్నం ఫలించింది.

ఆ రోజుల్లో తహసీల్దారు ఆఫీసు ఆవరణలో జైలు, ట్రెజరీ, ఫస్ట్‌క్లాస్ మెజిస్ట్రేట్ కోర్టు ఉండేవి. ఫస్ట్‌క్లాసు మేసిస్ట్రేటు కోర్టులోనే స్పెషల్‌కోర్టు పేరుతో బెంచికోర్టు ఉండేది. స్పెషల్ కోర్టు ఉదయం 8 నుండి 10-30 గంటల వరకు వుండేది. ఆ తరువాత ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేటుకోర్టు పనిచేసేది. ఈ స్పెషల్ కోర్టులో పల్లెల్లోని చిన్న చిన్న కేసులు మునిసిపాలిటీ అను మతి లేకుండా వెలసిన కట్టడాల కేసులు, లైటు లేకుండా సైకిల్ మీద వెళ్లే వారి మీద పోలీసులు పెట్టిన కేసులు పరిష్కార మయ్యేవి. పల్నాడు, వినుకొండ, చిలకలూరిపేట ప్రాంతాల కేసులన్నీ ఈ స్పెషల్‌కోర్టు పరిధిలో ఉండేవి. అప్పటి సీనియర్ న్యాయవాదులు కూడా ఇక్కడ వాదించేవారు. ఈ స్పెషల్ కోర్టు మేజిస్ట్రేట్‌గా సూరుకుచ్చి ఆంజనేయశాస్త్రి, దోనెపూడి వేంకటసుబ్బయ్య, శేషాచలంగార్లు పనిచేశారు. వారి తరువాత నేను 1971 వరకు ఆనరరీ ఫస్ట్‌క్లాస్ బెంచిమేజిస్ట్రేటుగా పనిచేశాను. మాతోపాటు కొంతమంది సభ్యులుగా ఉండేవారు. 1971లో క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్ మారిన తరువాత ఈ బెంచికోర్టులు రద్దయినాయి.

సంస్కృత కవీంద్రులు బెల్లంకొండ రాఘవరావుగారు, భావకవివరేణ్యులు నాయని సుబ్బారావుగారు, అభ్యుదయ కవులు అనిసెట్టి, ఏల్చూరి, రెంటాల, బెల్లంకొండ రామదాసు, గంగినేని వేంకటేశ్వరరావు మొదలైన వారి సాహచర్యంతో నా సాహిత్యాభిరుచి పెంపొందింది. నయాగరా కావ్యాన్ని, అగ్ని వీణ, బిచ్చగాళ్లపదాలు కావ్యాల్ని మా సర్వోదయ ప్రెస్‌లోనే ముద్రించాము. A Tale of Two Cities అనే ఆంగ్ల నవలను నాయని-అనిశెట్టి గార్లచేత ఆత్మబలి పేరుతో అనువాదం చేయించి, చెల్లపిళ్ల బంగారేశ్వర శర్మగారిచేత ప్రబంధశ్రీ అనే గ్రంథాన్ని వ్రాయించి వాటిని ప్రచురించాను. మా ప్రచురణలను ఉమ్మడి మద్రాసురాష్ట్ర విద్యాశాఖ పాఠ్యాంశాలుగా నిర్ణయించింది. అప్పటి మా సర్వోదయ ప్రెస్సే తదనంతరం నలవేమా ప్రింటింగ్‌ప్రెస్‌గా మారింది. ఈ ప్రెస్ నుండి నేను సంపాదకుడిగా దేశభక్తి అనే పత్రికను ప్రచురించాను. ఆ రోజుల్లో డైమండ్ జూబ్లీ రీడింగ్ రూమ్ సభ్యుడిగా ఉండేవాణ్ని.

సహకార రంగంలో ఉన్నత పదవుల్ని నిర్వహించి రైతులు పేదప్రజల మేలుకోసం ఎంతగానో కృషిచేశాను.

ఆ నాడు నరసరావుపేటలో ప్రజానాట్యమండలివారు విక్టోరియాహాలు మొదలైన చోట్ల మా భూమి నాటకం ప్రద ర్శించేవారు. నా కుర్రతనంలోనే మాభూమి నాటకంలో నేను దాదా పాత్రను వేసేవాడిని. ఆ రోజుల్లో పాండవోద్యోగ విజయాలలో ధర్మరాజు పాత్రను, బొబ్బిలి యుద్ధంలో బుస్సీ దొర పాత్రను పోషించాను.

సేవారంగం మీద ప్రీతితో లయన్స్‌క్లబ్ అధ్యక్షుడిగా దివ్వెల కాశీరత్నం పాఠశాల నిర్మాణం, వైద్యసేవా శిబిరాలు, నీటికుళాయిలు, కాసు శాయమ్మ టి.బి. వార్డు నిర్మాణం వంటి సేవా కార్యక్రమాల్ని నిర్వహించాను.

ఇలా నరసరావుపేట ప్రజలలో ఒకడిగా అందరి సంక్షేమం కోసం యథాశక్తి కృషిచేయగలిగినందుకు ఎంతో సంతోషంగా ఉన్నది. •

# నా అనుభవాలు



రావిపాటి సీతారామారావు, కెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్ హెడ్ (రిటైర్డ్)

సుమారు 100-125 సంవత్సరాల క్రితం సంగతి. ఇప్పుడు శివుడిబొమ్మ ఉన్న ప్రాంతంనుండి రైల్వేస్టేషన్ వరకు జనసంచారం బహుస్వల్పంగా ఉండేది. చీకటి పడ్డ తర్వాత స్టేషనుకు ప్రయాణికులు ఒంటరిగా వెళ్లడానికి భయపడేవారు. మొదటి రైల్వేగేటు సమీపంలో మోసగాళ్లు నవారు ఆటతో అమాయిక ప్రయాణికులను దోచుకొంటుండటం నాకు గుర్తే!

రైల్వే స్టేషన్ ప్రాంగణంలో ప్లాట్‌ఫాంకు దూరంగా రైల్వే ఇంజన్‌ను గుండ్రంగా తిప్పే 'టర్నింగ్ బ్రిడ్జి' ఒకటి ఉండేది. దాని సహాయంతో అంత బరువున్న ఇంజన్‌ను కేవలం నలుగురు మనుష్యులు నెమ్మదిగా సులువుగా గుండ్రంగా తిప్పగలగటం చూడటానికి తమాషాగా ఉండేది. స్నేహితునితో చేయి చేయి కలిపి పట్టుకుని రైలుపట్టాల మీద నడవటం కూడా ఒక చక్కని అనుభూతి.

ఒకసారి రైల్వే స్టేషనుకు స్నేహితులతో కలిసి వెళ్లాం. అక్కడి నుంచి చూస్తే ఒక కొండ దగ్గరలో ఉన్నట్లు తోచింది. అదే కోటప్పకొండ. అక్కడికి వెళదామనే ఆలోచన వచ్చింది. పొలాలకు అడ్డంపడి కొంతదూరం పరుగెత్తిన తర్వాత వెనక్కి తిరిగి చూస్తే స్టేషన్ దూరంలో ఉంది. కొండ దూరమవు తున్నట్లు దగ్గరలో లేనట్లు గ్రహించాము. విసుగుతో కాళ్లీడ్చు కుంటూ తిరుగుముఖం పట్టాము. ఇది మా అమాయకత్వం నుండి జనించిన అనుభూతి.

ఇప్పుడు గాంధీపార్కు ఉన్న ప్రదేశం 1940కి ముందు ఖాళీగా ఉండి టూరింగ్ సినిమాలు, సర్కస్‌లు ఆడటానికి ఉపయోగపడేవి. 1938లో నిర్మాణమయిన ఏంజల్ టాకీస్ నిర్మాణదశలను మేము ఆసక్తితో గమనించేవాళ్లము.

ఇప్పటి పువ్వాడ హాస్పిటల్ సమీపంలో పల్నాటి రోడ్‌కు ఒక ప్రక్క చిన్న గది ఉండేది. దాని ఎదురుగా కూర్చో వటానికి రాతి అరుగు ఉండేది. బరువులు మోసుకొని వచ్చే ప్రయాణికులు అక్కడ కొంచెము సేపు కూర్చొని సేదతీరి భారాన్ని తిరిగి భుజాలపైకి మార్చుకొని వెళ్లేవారు. ఈ ఏర్పాటు చేసిన ఆ దాతకు అందరూ చేయెత్తి నమస్కరించాలి. పల్నాటి రోడ్డు, స్టేషన్ రోడ్ల కలయిక ప్రదేశం వద్ద కీ.శే. నాగసరపు సుబ్బరాయశ్రేష్ఠిగారు ఏర్పరచిన చలివేంద్రం దాహార్తులకు ఎంతో ఉపయోగపడేది. ఆ రోజులలో వేసవిలో నీటి ఎద్దడి తీవ్రంగా ఉండేది. మంచినీటిని పాతూరులోని పాతశంకర మఠానికి ఎదురుగా ఉన్న మూడు బావులనుండి తెచ్చు కొనేవారు.

నరసరావుపేట పట్టణంలో రాజాగారి కోట ఒక దర్శనీయ స్థలం. పాటిమట్టిలో బెల్లపు నీళ్లు కలిపి ఏనుగులతో తొక్కించి జిగురు వచ్చిన తర్వాత దానితో కోటగోడలను కట్టారట. ఆ గోడలు మూడు, నాలుగు అడుగుల మందం ఉండేవి. ఇరవై సంవత్సరాల క్రితం వరకు కోట ముఖద్వారం బాగానే ఉండేది. దానికి ఇరువైపులలోను, పై అంతస్తులోను ఓరియంటల్ హైస్కూల్ ఉండేది.

1940-'70 ప్రాంతంలో పట్టణ ప్రజలకు విశేష వైద్యసేవల నందించినవారు డాక్టర్ పోపూరి గోపాలకృష్ణ మూర్తిగారు, డాక్టర్ కృష్ణదాసుగారు, డాక్టర్ ఆర్. ఎస్. కేశవరాజుగారు. వారు ఆర్థిక విషయాలకంటె సేవలకే ప్రాధా న్యాన్ని ఇచ్చేవారు.

1940-42 లో నేను 8,9 తరగతులు చదివే రోజులలో శ్రీ టి.వి.ఎల్. నరసింహారావుగారు మన మునిసి పల్ హైస్కూల్‌కు ప్రధానోపాధ్యాయులుగా ఉండేవారు. ఆయన క్రమశిక్షణకు మారుపేరు. సాయంత్రం డ్రిల్ చేసే విద్యార్థులతోనూ, వాలీబాల్ వంటి ఆటలు ఆడే విద్యార్థుల తోనూ ఆవరణం నిండుగా, సందడిగా ఉండేది. వాలీబాల్ టీమ్‌కు మంచి పేరుండేది.

సమీప భవిష్యత్తులో రాష్ట్ర రాజధాని అయిన అమరావతికి సాటిలైట్ నగరంగా సర్వాంగ సుందరంగా నరసరావుపేట అభివృద్ధి చెందాలని నా ఆకాంక్ష.

# అమృతపు వూట!




## ఏల్చూరి విజయరాఘవరావు

ప్రపంచ ప్రఖ్యాత వేణువిద్వాంసుడు


మా సంగీత, సాహిత్యాల కనవరతం జయభేరి మ్రోగించిన కంచుకోట! స్వయం చనుబాలిచ్చి నా జీవనాడిని సజీవం చేసిన మాతృశ్రీ!! అట్లాంటి నరసరావుపేటకు నివాళిగా సాక్షాత్ ఏడుకొండల వేంకటరమణుడి సమక్షంలో జరిపించే బ్రహ్మోత్సవాల్లాగా, దివ్యంగా 'ద్వి శతాబ్ది మహోత్సవాలు' జరిపించబోతున్నారని విని మహదానందం కలిగింది!

మధురాతి మధురమైన నాబాల్యం ఆ బంగారుభూమి ఉచ్ఛ్వాస నిశ్వాసల్లోనే. నా 'స' 'రి' 'గ' 'మ' లకు, 'స' 'భ' 'ర' 'స' 'మ' 'య' 'వ'లకూ, యతిప్రాసలు నేర్పి, సహజంగా నానుడి దిద్దిందో, లేక భగవదనుగ్రహమో చెప్పడం కష్టం! ఐనా వొకటి మాత్రం నిజం. మా నరసరావుపేట నభోవీథుల్లో కారుమబ్బులు కమ్ముకున్నా సరే, కవిత్వం కురిసే రోజులవి!! కమలా మనోహరిరాగం సన్నాయి వాద్యాల్లోంచి ప్రతిధ్వనిస్తుంటే సునాదమైన సుప్రభాతాలతో వీనుల విందు చేసుకునేవాణ్ణెన్నో సార్లు మా కనతి దూరంలోని దేవాలయంలో! ... మా యింటి పక్కగానే ఆ చెరువుకట్ట పొలిమేరల్లో కాకి కూసినా గండుకోయిలల కాకలీస్వర నిక్వాణంలా భ్రాంతి కలిగేది!

కీర్తిశేషులైన అనిశెట్టి సుబ్బారావు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, కుందుర్తి ఆంజనేయులు, బెల్లంకొండ రామదాసు ప్రభృతుల 'నయాగరా కవిబృందం' మధ్య నాంది పలికిన నా సాహిత్య ప్రణవం, నాలోనే, 'భవిష్యత్తులో మొలకెత్తిన Fresh Air and Free Thinkingకు ప్రాణవాయువులా పరిణమించి తీరింద'ని అతివినయంతో గర్విస్తున్నా!

నేను చదువుకున్న Municipal High Schoolలో కవివర్యులు కీ॥శే॥ నాయని సుబ్బారావుగారు మాకు 'చరిత్ర' పాఠాలు చెబుతుంటే స్వయం 'సౌభద్రుని ప్రణయయాత్ర' మాకు పాడి వినిపించినట్టు సంభ్రమభరితులమైన రోజులూ అవే! ఎన్నెన్నో రీతుల్లో మహాకవులెందరో మహిమాతి మహిమతో తమ తమ జన్మభూమిని గురించి పొగడ్తలు రాశారని తెలిసికూడా మాకు 'కాశీ' 'రామేశ్వరము' అయిన మా నరసరావుపేటని తలుచుకున్నప్పుడల్లా కవిత్వపు కైపులో మైమరచి 'నా నోటిమాటలే యీ మహాకవులెలా లాగేశారు చెప్మా!' అని కలవరించే అజ్ఞానినీ నేనే!!

ఆ రోజుల్లో సాహితీప్రియులైన మా మిత్రుల ముఠా సాయంత్రమయ్యేసరికి నరసరావుపేట రైలుకట్ట చేరుకొని ఒకరి రచనలు మరికరికి జబర్దస్తీగా వినిపించేవాళ్లం! ఆ నాటి ఎన్నో కథలూ, కవితలు, 'ఆరిపోతూ ఆరిపోతూనే అనంత విశ్వాన్నావిర్భవించాయన'డం ప్రగల్భం కాదని మనవి ... మచ్చుకు–

ఈ నా గేయం 'కవి హృదయం' పేరుతో చిన్నప్పుడు నరసరావుపేటలో రాశా... అనేక కవిసమ్మేళనాల్లో పాడాను కూడా... కాలాంతరంగా ఇలాంటి ఇంకెన్నో గేయాలు వివిధ ప్రపంచభాషల్లోకి స్వేచ్ఛానువాదం చెయ్యబడ్డాయి! నాకే ఆశ్చర్యం కలిగిస్తుంది తలుచుకుంటే! అంటే అదీ ఆ నరసరావుపేట మహిమే నేమో! వినండి మీరు కూడా...

కాలమానం
లోకగతుల మార్పించునట !
కాలమానమె మార్చ
కదలి వస్తున్నాను !!
సృష్టిలో అణువునై
సృజియింపబడితినట !
సృష్టికై పునః సృష్టి సూత్రాలు వ్రాస్తాను!!
రథ, గజ, పదాతులే
గవిసి గెలువని పోరు
కలము పోటుల
పరిష్కార మొనరిస్తాను !

ప్రభువు లంటక
తుప్పుపట్టి తంత్రులు తెగిన
ప్రజల హృదయ విపంచి
పలికించి వేస్తాను !!
అజ్ఞాన జీమూతము
లలముకొన్న జగాన
విజ్ఞాన చంద్రికలు
వెదజల్లి పోతాను !
కాలమానం లోకగతుల
మాన్పించునట !
కాలమానమె మార్చ
కదలి వస్తున్నాను ! ....

ప్రఖ్యాత సాహితీ పత్రిక "TRIVENI" సంస్థాపకులు కీ॥శే॥ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి దర్శనం చేసుకొని అదేరోడ్డు ఆఖరు వరకు Angel Talkies Tentలో వెలిసిన మూకసినిమాహాలు! దాటి రైలుస్టేషన్ వేపు సైకిల్ షికారు కొడ్తుంటే 'మన' సువిఖ్యాత రాజకీయ నాయకుడు కీ॥శే॥ కాసు బ్రహ్మానందరెడ్డిగారు Tennis ఆడుతూ ఇప్పటికీ నా కళ్లకద్దినట్టు కనబడుతుంటారు! స్టేజినాటకాల్లో అపర గంధర్వఖ్యాతి గడించిన కీ॥శే॥ అద్దంకి శ్రీరామ్మూర్తి, బెల్లం కొండ సుబ్బారావుగార్లు జ్ఞాపక మొచ్చినప్పుడల్లా ప్రపంచమే మహానాటకమౌతుంది! దాదాపు అయిదు దశకాలైంది నరసరావుపేట నన్ను విరహావస్థలో ముంచి!... 'కోటప్పకొండకు, భక్తి శ్రద్ధలతో, తళుకు బెళుకులతో, ప్రభలు కదలిపోతున్నట్టు మా వూరి కోట బురుజులపై కోటికట్ల కవులూ, గాయకులూ, భావరాగతాళాత్మకంగా భరతం పట్టినట్టూ 'దేశ విదేశాలు' తిరుగుతూ తిరుగుతూనే కలలు గంటుంటా!

ఇవ్వాళ Washington నుంచి Hyderabad చేరుకొని వొక గంటైనా కాలేదు... ఇప్పుడే అందిందీ శుభవార్త... 'మానవీయులైన ఆ వూరి మహానుభావు లెందరో కలిసి ఆ నగరపు నవనూత్న ప్రగతి కిప్పుడు బ్రహ్మరథం పడుతున్నారని! అప్పుడైన మా అనిసెట్టి కృష్ణ, ప్రియమిత్రులు కె.వి.కె. రామారావుగారితో సహా కాకతాళీయంగా మా ఇంటికొచ్చి ఆప్యాయంగా, ఆహ్వానించడంతో ప్రవరుని కౌగిట్లో వరూథిని గుచ్చుకుపోయినట్టు గగుర్పొడిచింది ఈ దేహం!

ఈ శుభావసరం సందర్భంగా మా నరసరావుపేటలోని యింటిల్లిపాది నరనారీ గణాలకు శుభాకాంక్షలు తెల్పిన పూర్వం వొక యక్షప్రశ్న వేస్తున్నా...

'దొరకునా యిటు వంటి సేవ?!'

(నరసరావుపేట ద్విశతాబ్ది ఉత్సవ ప్రత్యేకసంచిక సౌజన్యంతో...) ●

## కురవని మేఘం

ఆనాడు మన పట్టణంలోని పాతూరులో ఉన్న గంగా పార్వతీ సమేత భీమలింగేశ్వరస్వామి ఆలయంలో కార్యక్రమాల అనంతరం భోజనాలు. ఆకాశంలో చేటంత మబ్బు కనిపించింది. కొంచెంసేపట్లో 'ఇంతింతై వటు డింతయై' అన్నట్లు ఆ మేఘశకలం పెరిగి పెరిగి సకలాకాశాన్ని ఆక్రమించింది. అకాలాంధకారం ఆవరించింది.



స్వామివారికి హారతి ఇస్తూ గోపన్నగారు బయటికి వచ్చివర్షం కురవదులే! నిదానంగా భోజనం చెయ్యండి, అన్నారు. అందరూ 'ఇదేమిటి?!' అనుకొన్నారు. కొంచెం సేపట్లోనే క్రమంగా వర్షవాతావరణం పల్చబడింది. అందరూ హాయిగా ఆకంఠంగా భోజనం చేశారు. గోపన్నగారి మహిమకు ఆశ్చర్యపోయారు. 'వశ్యవాక్కు' అని అందరూ మెచ్చుకున్నారు. భోజనాల అనంతరమే కుంభవృష్టి ఆగకుండా కురిసింది. ●

# ఆకాంక్ష



**ఆచార్య దావులూరి రామకోటయ్య**
**మాజీ వైస్ ఛాన్సలర్**

మాది కారంపూడి మండలం కాకానివారిపాలెం. నేను 1953లో కారంపూడి హైస్కూలు నుండి ఎస్.ఎస్.ఎల్.సి. ఉత్తీర్ణుడనైనాను. 'ఇంటర్మీడియట్ ఎక్కడ చదివితే బాగుంటుంది?' అని కొందరిని సలహా అడుగగా వాళ్లు 'నరసరావుపేటలో ఎస్.ఎస్. & ఎన్. కాలెజి కొత్తగా పెట్టినారని, అచ్చట విద్యాబోధన బాగుంటుందని, ఆ కాలెజి ప్రిన్సిపాల్ శ్రీ ఇలింద్ర రంగనాయకులుగారు లెక్కలు బోధించుతారని, ఆయనకు విశేష అనుభవముం'దని చెప్పారు. గుంటూరు లాంటి పట్టణంలో పిల్లలకు వ్యాపకాలు ఎక్కువని, వాళ్లు చెడిపోవడానికి ఎక్కువగా అవకాశ ముంటుందని కూడా చెప్పారు. దీని నంతటిని దృష్టిలో పెట్టుకొని మా నాయన నన్ను ఎస్.ఎస్. &ఎన్.కాలేజిలో ఎం.పి.సి. గ్రూప్‌లో చేర్చారు.

నరసరావుపేటలో పల్లెటూరు వాతావరణమే వున్నప్పటికి మాకు మాత్రం ఇది పెద్ద పట్టణం. ఎందుకంటే మేము కాలేజికి వెళ్లిన మొదటిరోజు సాయంత్రం తిరిగి వచ్చేటపుడు మా రూమును కనుక్కోవడానికే చాలా ఇబ్బంది పడ్డాము. ఆ రోజుల్లో ఇక్కడ ఏంజల్ టాకీస్ అనే సినిమాహాలు ఒకటి ఉండేది. ఇదే మాకు వినోదం కల్పించే స్థలం. 1955లో ఇంటర్‌మీడియట్‌లో ఉత్తీర్ణుడనైన తర్వాత పై చదువులకు నరసరావుపేటను వదలివెళ్లాను.

15 సంవత్సరాల తరువాత గుంటూరులో ప్రారంభించిన ఆంధ్రవిశ్వ విద్యాలయ స్నాతకోత్సవ కేంద్రమునకు (Andhra University Post Graduate Centre) నేను గణిత అధ్యాపకుడుగా వచ్చాను. మా మిత్రులు, బంధువర్గం నరసరావుపేటతో ఎక్కువగా సంబంధాలు పెంచుకొన్నారు. అప్పటికే ఎస్.ఎస్. & ఎన్. కళాశాల రంగనాయకులుగారి ఆధ్వర్యంలో చాలా అభివృద్ధి చెందింది. ఈ కాలేజి విద్యాపరంగా పల్నాటికి, రాయలసీమకు విశేషసేవల నందించింది. అది మరువరాని విషయం. పల్నాడు, రాయలసీమలో చాలా మంది చదువులో శ్రద్ధతీసుకొనుట వలన, నరసరావుపేటలో మరికొన్ని కాలేజీల ఆవశ్యకం ఏర్పడినది. ఫలితంగా శ్రీమతి కాసు రాఘవమ్మ బ్రహ్మానంద రెడ్డి జూనియర్, మరియు డిగ్రీ కాలేజీలు స్థాపించబడినవి. డా॥ కోడెల శివప్రసాదరావు మరియు శ్రీ నల్లపాటి శివరామచంద్రశేఖరరావుగార్ల ఆధ్వర్యంలో నందమూరి బసవతారకం కాలేజి, డా॥ ఎం. శివలింగ ప్రసాదరావుగారి ఆధ్వర్యంలో పాలడుగు నాగయ్యచౌదరి, కొత్త రఘురామయ్య జూనియర్, డిగ్రీ కాలేజీలు కూడా వచ్చినవి. ఈకాలేజీలో ఉద్యోగ సంబంధిత కోర్సులు, ప్రస్తుత సమాజానికి అవసరమైన కోర్సులు వచ్చినవి. ఎప్పటికప్పుడు ఈ కళాశాలలన్నియు కొత్త కొత్త కోర్సులను ప్రారంభిస్తున్నాయి.

వీటికి తోడు ఈ మధ్య మరికొన్ని డిగ్రీకళాశాలలు, ఇంజనీరింగ్ కళాశాలలు, ఫార్మశీ కళాశాలలు కూడా వచ్చాయి. కొత్తగా వచ్చిన కాలేజీలలో విద్యావ్యవస్థను ప్రామాణికం చేస్తే పల్నాడుకు, రాయలసీమ విద్యార్థులకు మరికొంత మేలు జరుగుతుంది. దీనికితోడు వైద్యకళాశాలలు, వృత్తివిద్యా నైపుణ్యాభివృద్ధిసంస్థలు, స్త్రీల అభివృద్ధి, నైపుణ్యాభివృద్ధి కేంద్రం కూడా ఈ పల్నాడుకి వచ్చినట్లైతే బాగుంటుందని భావిస్తున్నాను. ఆ రోజులలో మాకు యాత్రా స్థలం కోటప్పకొండ. ప్రతి శివరాత్రికి మా ఊరి నుంచి ప్రభ ఒకటి కోటప్పకొండకి వస్తుండేది. అందుకని కోటప్పకొండకి శివదర్శనానికి వెళ్లేవాళ్లం. ప్రస్తుతం ఇది శివప్రసాదరావుగారి ఆధ్వర్యంలో పర్యాటక కేంద్రంగా రూపుదిద్దుకొని చాలా ఆహ్లాదకరంగా ఉంది.

గోల్డెన్ Quadrangle NDA పథకం తర్వాత చాలా పట్టణాల రోడ్లను వెడల్పు చెయ్యడం జరిగింది. నరసరావుపేటలో కూడా వెడల్పు రోడ్లను వెయ్యడం జరిగింది. ఇప్పుడు నరసరావుపేటలోకి కొత్తకాలనీలు కూడా వచ్చాయి. ఈ కాలనీలను ప్రణాళికాబద్ధంగా కట్టడం జరిగింది. మంచి బస్‌స్టాండ్ కూడా వచ్చింది. నరసరావుపేటకు చెందిన వ్యక్తులందరూ పరస్పర సహకారంతో ఈ చారిత్రాత్మక పట్టణాన్ని స్మార్ట్ పట్టణంగా రూపుదిద్దుకునేట్లు చేయాలని ఆకాంక్షిస్తున్నా!! •

# నా అదృష్టానికి మలుపు

ఆచార్య వి. బాలమోహన్‌దాస్
మాజీ వైస్ ఛాన్సలర్



మా అమ్మగారి తండ్రిగారు పెనుగొండ వెంకటప్పయ్య గారిది నరసరావుపేట. దీనికి సమీప గ్రామము నుండి నాకు పదమూడు సంవత్సరముల వయసులో ఇక్కడకు వచ్చి స్థిరపడ్డాము. అప్పటినుండి నేను నరసరావుపేట వాసిగానే భావిస్తాను. సీతారామస్వామిగుడివీధిలో స్వంతయింటిలో నివాస ముండేవారము. ఇప్పుడయితే ఆ వీధి గూడా రణగణ ధ్వనులతో మారుమోగుతున్నదిగానీ 1960వ దశకంలో ప్రశాంతంగా ఉండేది. రాత్రి ఎనిమిది గంటల తర్వాత అందరూ వీధిలో అరుగుల మీద, ఇండ్ల ముందు మంచాల మీద పడకలు వేసేవారు. అందరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నిద్రకు ఉపక్రమించేవారు. మరల అలా నిద్రపోవాలనుకుంటే అది తీరని కోరికే!

నాకు పదమూడవ సంవత్సరం వరకు మా పల్లెటూళ్లో అల్లరి చిల్లరి పిల్లవాడిగా పరిగణింపబడి, పదవ సంవత్సరములో ఆరవ తరగతి మధ్యలో స్కూలు మానివేసిన డ్రాప్ అవుట్ విద్యార్థిగా నరసరావుపేటలో అడుగుపెట్టాను. అప్పటి వరకు నాకు ఇంగ్లీషు అక్షరాలు కూడా రావు. వ్యవసాయ పనులు, ఇంటిపనుల్లో మాత్రమే ప్రావీణ్యం. నరసరావుపేట రాకుండా ఉంటే నా జీవితం ఆ వ్యాపకాల్లోనే ఉండేదేమో? నరసరావుపేటకు రావడం, మా నాన్నగారు విశ్వనాథుని వేంకటేశ్వర్లు, మా అన్నయ్య ఉమామహేశ్వరరావు ఏంజల్ టాకీస్ దగ్గర మెట్రిక్ పరీక్షలకు పాఠాలు చెప్పే లాయర్ ములకలూరి గోపాలకృష్ణయ్యగారి దగ్గర చేర్పించటం నా జీవితంలో మరపురాని మలుపు. నా లాంటి అల్లరి పిల్లల జీవితాలను తీర్చిదిద్దిన మహావ్యక్తి ఆయన. ఉదయం ఎనిమిది గంటల నుండి రాత్రి వరకు అన్ని సబ్జక్టులను ఏకబిగిన ఆయనే చెప్పేవారు. ఇంగ్లీషుకు ఆయన ఎంతో ప్రాధాన్యం ఇచ్చేవారు. లెక్కలపరీక్ష రోజు కూడా ఆయన మాకు ఇంగ్లీష్ గ్రామర్ బోధించేవారు. ఎబిసిడిలు కూడా రాని నేను ఆంధ్ర మెట్రిక్‌పరీక్షలో పదకొండు నెలల శిక్షణతోనే సెకండ్ క్లాస్‌లో పాసవడం యూనివర్సిటీ మొత్తం మీద ఇంగ్లీషు సబ్జెక్ట్‌లో అత్యధిక మార్కులు సంపాదించటం నా జీవితంలో మరిచిపోలేని సంఘటన. గోపాలకృష్ణయ్యగారి దగ్గర పాఠాలు చదువుకుంటూ స్టేషన్‌రోడ్‌లో ఉన్న పార్కులో విశ్రాంతి తీసుకోవడం యిప్పటికీ తీపి గుర్తు.

తరువాత ప్రతిష్ఠాత్మకమయిన ఎస్.ఎస్. & ఎన్. కళాశాలలో ఒకసంవత్సరం పి.యు.సి. కోర్సు, మూడు సంవత్సరాల బి.కామ్. కోర్సు చదవడం నా రెండవ అదృష్టం. అప్పటి ప్రిన్సిపాల్ ఇలింద్ర రంగనాయకులుగారు, అధ్యాపకులు సుబ్రహ్మణ్యంగారు, కె.వి.ఎల్.ఎన్. ప్రసాదుగారు, అన్నంభొట్ల సూర్యనారాయణగారు, పి.వి. రమణారెడ్డిగారు, ఎకనామిక్స్ శాస్త్రిగారు ఇప్పటికీ నా మనఃఫలకము మీద నడయాడుతున్నవాళ్లే! అచ్చట నేను పొందిన శిక్షణే ఈ రోజున నేను ఇంతటి వాడిని అవడానికి పునాది అని ఘంటాపదంగా చెప్పగలను. ఆ అధ్యాపకుల ప్రేరణే నేను ఉపాధ్యాయవృత్తిలో చేరి స్థిరపడటానికి ముఖ్యకారణం. భారతదేశంలోనే 31వ సంవత్సరములో ఆంధ్రవిశ్వకళాపరిషత్‌లో ఆచార్యపదవిని పొందడం, యంగెస్ట్ ప్రొఫెసర్ ఆఫ్ ఇండియాగా రికార్డు నా స్వంతం చేసుకోవడం నరసరావుపేటలో నేను పొందిన శిక్షణ, క్రమశిక్షణల ఫలితం.

అనుకోకుండా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు నా ప్రతిభను గుర్తించి ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్‌గా (2005-'08 సంవత్సరాలకు) నన్ను నియమించడం, ఆ విశ్వవిద్యాలయానికి ఉన్న దాదాపు 500 కళాశాలలో నరసరావుపేట ఎస్.ఎస్. & ఎన్. కళాశాల ఉండటం నా కెంతో సంతోషాన్ని కలిగించింది. నరసరావుపేటలో ఎన్నోసార్లు నా అభిమానులు నాకు సన్మానాలు

చేశారు. ముఖ్యంగా నేను, నా మిత్రులతో చిన్నప్పుడు నడయాడిన గాంధీచౌక్‌లోనే మొదటి సన్మానం. నిజంగా నా అంత అదృష్టవంతుడు ఉండడు. ఇదంతా నరసరావుపేట పుణ్యమే! అందుకే నేను వైస్‌ఛాన్సలర్‌గా కాకుండా ఒక పూర్వ విద్యార్థిగా మా కాలేజీకి నాక్ బృందం గ్రేడింగ్ కోసం వచ్చినపుడు పూర్వవిద్యార్థుల సంఘములో పాల్గొన్నాను. బహుశా భారతదేశంలో ఒక వైస్ ఛాన్సలర్ ఒక కళాశాల నాక్ విజిట్‌లో ఒక పూర్వవిద్యార్థిగా పాల్గొనడం ఇంత వరకు జరగలేదు. ఎంతో వినమ్రంగా నేను ఈ పని చేసినందులకు ఇప్పటికీ గర్వపడతాను. సంతోషిస్తూ ఉంటాను.

మా కుటుంబ సభ్యులు, మిత్రులు కలసి స్థాపించిన వసంత మోహన ఫౌండేషన్ కార్యక్రమాల్లో నరసరావుపేటకు భాగస్వామ్యము కల్పించాము. మేము ప్రతి ఏట అయిదుగురికి సేవాపురస్కారాలు అందచేస్తాము. మా యూనివర్సిటీ సెలబ్రేషన్స్‌లో రొటీన్ పద్ధతిలో ఒక సంవత్సరం విశాఖపట్టణంలో, ఒక సంవత్సరం గుంటూరులో, ఒక సంవత్సరం నరసరావుపేటలో ఈ కార్యక్రమాలు చేస్తున్నాము. నరసరావుపేటతో మా అనుబంధం నిరంతరంగా కొనసాగాలి అన్న ఆలోచనే దీనికి ప్రాతిపదిక.

ఈ రోజు నరసరావుపేట అన్ని రంగాల్లో ప్రముఖ పాత్ర వహిస్తూ ఉన్నది. ఎన్నో విద్యాసంస్థలు నెలకొల్పబడ్డాయి. పారిశ్రామికంగా, వ్యాపార పరంగా, సంస్కృతీపరంగా ఎంతో అభివృద్ధి చెందినది. మనకున్న ప్రముఖ దేవాలయాలు ఈ ప్రాంతంలో లేవనేది అందరికి తెలిసిన విషయం. కోటప్ప కొండలో నెలకొని ఉన్న కోటీశ్వరుడు మన కెప్పుడూ దీవెనలు అందచేస్తూనే ఉంటాడు. మునిసిపాలిటీ సర్వతోముఖాభివృద్ధి సాధించింది అనడంలో ఏ మాత్రం సందేహం లేదు. ఒకానొకపుడు మంచినీళ్లకు ఎంతో ఇబ్బంది పడేవాళ్లం. ఆ సమస్యను అధిగమించాం. ఒకప్పటి ఉప్పుల గొంది ఈ రోజు బంగారు షాపులతో శోభాయమానంగా ఉన్నది.

నేను వైస్‌ఛాన్సలర్‌గా ఉన్నపుడు 'మన నరసరావుపేటకు నేను ఏమి చేయగలను?' అని ప్రశ్నించు కుంటూ కొంతమంది అర్హులైన ప్రముఖులను యూనివర్సిటీ అకడమిక్ సెనేట్‌లో సభ్యులుగా నియమించడం, నేనే ప్రారంభించిన యూనివర్సిటీ ప్రతిభాపురస్కారాల పథకం ద్వారా ప్రతి సంవత్సరం ఒకరికి పురస్కారం అందేలాగా నా చిరకాల మిత్రుడు యూనివర్సిటీ బోర్డ్ ఆఫ్ మేనేజ్‌మెంట్ సభ్యులుగా ఉన్న ప్రొఫెసర్ డి.ఎ.ఆర్. సుబ్రహ్మణ్యంగారి సహకారంతో చేయగలిగాను. రాజకీయాలకు అతీతంగా అటు కాసు వేంకటకృష్ణారెడ్డిగారు, ఇటు డా॥ కోడెల శివప్రసాదరావుగారు నాకు సహకరించారు.

నా చిరకాల మిత్రులు మండవ సీతా రామాంజనేయులుగారు, గొడవర్తి అప్పారావుగారు ఇంకా ఎంతోమంది ఇప్పటికీ కుశలప్రశ్నలు, సమాధానాలు అంద చేసుకుంటూనే ఉంటాము. బంధు మిత్రులు, శ్రేయోభిలాషులు చాలా మందే ఉన్నారు. 'కపలవాయి కాశీరామారావుగారు, నాగసరపు రామారావుగారు ఈ ఉత్సవాలకు లేరే!' అని బాధవేస్తుంది. కానీ రామారావుగారి అబ్బాయి సుబ్బరాయగుప్తాగారు మునిసిపల్ ఛైర్మన్‌గా, మనకు గర్వకారణమైన అసెంబ్లీ స్పీకర్‌గానే కాకుండా స్వచ్ఛభారత్ కార్యక్రమంలో దేశంలోనే గర్వించదగ్గ పద్ధతిలో విజయాలు సాధించిన కోడెల శివప్రసాద రావుగారి ఆశీస్సులతో ఈ ఉత్సవ కార్యక్రమమునకు పూనుకున్నారని తెలిసి సంతోషించాను. వారికి, వారి ద్వారా నరసరావుపేట ప్రజలందరకు నా అభివందనాభినందనలు!!

## పూర్ణాలు



చాలా యేండ్ల క్రితం నరసరావుపేట తాలూకా ఆఫీసుకో, కోర్టుకో ఇంగ్లీషు అధికారులు వచ్చారు. డిన్నర్ ఏర్పాటు చేయాలి. ప్రఖ్యా పాపయ్యగారిని వంటకు పిల్చారు. 'వంట అద్భుతంగా ఉండా!'లన్నారు– పిల్చినవాళ్లు. పాపయ్యగారు పిండివంటగా పూర్ణాలు చేశారు.

భోజనాలు మొదలైనై. పాపయ్యగారు వడ్డిస్తున్నారు. దొరలు పూర్ణాలను కొరికారు. పైన డిప్ప, లోపల ఇంతపెద్ద ముద్ద. 'ఈ డిప్పకు చిల్లి గానీ, అతుకులు వగైరాలు గానీ ఏమీ లేవుగదా! మరి ఈడిప్పలోకి ఈముద్ద ఎట్లావెళ్లింది?' అని ఆశ్చర్యపోయారు. 'వంటాయన్ని పిలవ!' మన్నారు. సందేహాన్ని చెప్పారు. 'ఇందులో రహస్య మేమిటి?' అని అడిగారు.

పాపయ్యగారు మంచి చమత్కారి. 'దొరవారూ! అదేనండీ మా వంటలోని విశేషం! ఇటువంటి విశేషాలు మా దగ్గర చాలా ఉన్నై! అన్నారు' భళ్లున నవ్వుతూ. దొరలూ శ్రుతి కలిపారు. భోజనాలైపోయినై.

# చిన్ననాటి ముచ్చట్లు




## ఆచార్య జుజ్జూరు విష్ణుప్రభాకరరావు

మాజీ వైస్ ఛాన్సలర్


నరసరావుపేట పురపాలకసంఘం శతాబ్దిఉత్సవాలు జరుపుకొంటున్న సందర్భంగా మీ చిన్ననాటి జ్ఞాపకాలు వ్రాసి పంప'మని నిర్వాహకులు కోరినప్పుడు నేను దాదాపు ఐదు దశాబ్దాల తర్వాత జ్ఞాపకాల దొంతరలోకి వెళ్లాను.

నా చిన్నతనం అంతా నరసరావుపేటలోనే గడిచింది. 1969లో పై చదువులకు విశాఖపట్నం వెళ్లిందాకా సుమారు 19 సం॥లకు నరసరావుపేటలోనే పెరిగాను.

నరసరావుపేట అనగానే నాకు గుర్తుకు వచ్చేది పట్టాభి రామస్వామివారి దేవాలయం, సీతారామస్వామివారి దేవాలయం, రాజాగారి కోట. సెలవులలో, ఆదివారాలలో ఎక్కువగా గడిపింది రాజాగారి కోటలో. కబడ్డీ, కోకో, బొంగరాల ఆటలతో రాజాగారి కోటలో చాలాసమయం గడిపేవాళ్లం. కోటలో అప్పుడప్పుడు పద్యనాటకాలు ప్రదర్శించేవారు. అవి చూస్తూ రాత్రంతా మేలుకొని గడిపేవాళ్లం.

ఆ రోజులలో నా విద్యాభ్యాసం అంతా మార్కెట్ వద్ద ఉన్న వీధిబడిలోనే జరిగింది. వీధిబడి అయినప్పటికీ చక్కటి విద్యను అందించారు. ఆ వీధిబడి పునాదే తర్వాత జీవితంలో నాకు చాలా ఉపయోగపడింది. ఆ రోజుల్లో ఊరి మొత్తము మీద ఎక్కడా ఇంగ్లీషు మీడియం స్కూలు లేదు. ఇంగ్లీషు మీడియంలో చదవని లోటుమాత్రం జీవితంలో చాలాసార్లు కనబడ్డది.

నరసరావుపేట ఎస్.ఎస్. అండ్ ఎన్. కాలేజి కూడా చాల పేరు ప్రఖ్యాతులున్న కాలేజి. శ్రీకాకుళం నుంచి నెల్లూరు దాకా వున్న కాలేజీలలో, లయోలా కాలేజి తర్వాత స్థానంలో ఇదే ఉండేది. కర్నూలు, కడప జిల్లాల నుంచి కూడా వందల మంది విద్యార్థులు విద్యకోసం నరసరావుపేట ఎస్.ఎస్.అండ్ ఎన్. కాలేజీకి వచ్చేవారు. ఒక రకంగా ఆ రోజుల్లో నరసరావుపేట రాయలసీమ విద్యార్థులకు ముఖద్వారంగా వుండేది.

రాజకీయంగా నరసరావుపేట కూడా చాలా క్రియాశీలంగా వుండేది. కాసు బ్రహ్మానందరెడ్డిగారు అప్పటికే మంత్రిగా, తర్వాత ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉండటం నరసరావుపేటకు చాలా గౌరవంగా ఉండేది. ఆంధ్రా యూనివర్శిటీలో చేరినప్పుడు కూడా పై రాజకీయ కారణాలవల్ల నరసరావుపేట అందరికీ సుపరిచితమే!

నేను వైస్ చాన్సలర్‌గా కర్నూలులో పనిచేస్తున్నప్పుడు నన్ను అక్కడ అందరూ విశాఖపట్నం నుంచి వచ్చిన వ్యక్తిగా భావించారు. కాని ఒకరోజున రాయలసీమ యూనివర్శిటి క్రింద వున్న 100 కాలేజీల ప్రిన్సిపాల్స్ / సెక్రటరీస్ మీటింగులో మీలో ఎంతమంది నరసరావుపేట కాలేజీలో చదివారని అడుగగా, సుమారు 30శాతం చేతులెత్తారు. అప్పుడు నాకు చాలా ఆనందం వేసింది. నేనుకూడా నరసరావుపేట విద్యార్థినే అని వారికి అప్పుడే తెలిసి వారు కూడా చాలా సంతోషించారు.

ప్రస్తుత మున్సిపల్ చైర్మన్ నాగసరపు సుబ్బరాయగుప్తా తండ్రిగారైన నాగసరపు రామారావుగారు మా ఇంటి ప్రక్కనే వున్నందువల్ల వారితో నాకు చాలా అనుబంధ ముండేది.

పురపాలకసంఘ శతాబ్ది సందర్భంగా మరల ఒకసారి నా చిన్ననాటి సంగతులు జ్ఞప్తికి తెచ్చుకొనే అవకాశం నాకు కల్పించినందుకు నిర్వాహకులకు నా కృతజ్ఞతలు. ఈ శతాబ్ది ఉత్సవాలు దిగ్విజయంగా జరగాలని ఆశిస్తున్నాను!!

# మరచిపోలేను!




చేబియ్యం రామకృష్ణ

జనరల్ మేనేజర్ (రిటైర్డ్), రైల్వేస్


నేను నరసరావుపేటలో పుట్టాను. నా బాల్యం అంతా ఈ ఊరులోనే గడిచింది. ఈ ఊరులోని మున్సిపల్ హైస్కూల్ లోనే నేను ఎస్.ఎస్.ఎల్.సి. వరకు చదువుకున్నాను. నేను చదువుకున్నప్పుడు ఎక్కువ సంవత్సరాలు నాయని సుబ్బారావుగారు హెడ్‌మాస్టర్‌గా ఉన్నారు. వారు సుప్రసిద్ధ సాహితీ వేత్తలు, కవి. స్కూలును చాలా సమర్థవంతంగా ఉదాత్తభావనలతో నడిపారు. వారి ఉద్యోగవిరమణ అనంతరం హైదరాబాదులో ఆకాశవాణిలో పనిచేస్తున్నప్పుడు కలవటం ఒక మధుర అనుభూతి. వారి కుమార్తె ప్రముఖ కవయిత్రి శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు. సుబ్బారావుగారు వ్రాసిన 'సౌభద్రుని ప్రణయయాత్ర' చాలా ప్రసిద్ధి చెందినది.

మా క్లాసు టీచర్‌గా బొప్పూడి వెంకట్రావుగారు చాలా దక్షతతో పాఠాలు చెప్పేవారు. సుప్రసిద్ధులైనవారు తెలుగు మాష్టారులు- లంకా సీతారామశాస్త్రిగారు ద్విభాషా పండితులు. వారు తెలుగులోను, సంస్కృతంలోను పాఠాలు చెప్పడమే గాక అనేక రచనలు చేశారు. పదవీ విరమణ తర్వాత వారిని 1980-'85 సంవత్సరాలలో హైద్రాబాదులో తరచూ కలియటం చాలా ఆనందదాయక అనుభూతి. అలాగే భాగవతుల సుబ్బారావుగారు చక్కగా తెలుగు పద్యాన్ని చదివి విద్యార్థులను ఆనందపరిచేవారు. కురుగంటి నరసింహశాస్త్రి గారు మాకు ఇంగ్లీషు మరియు మాథమాటిక్స్ చెప్పేవారు. ఈ సబ్జెక్ట్సను టీచ్ చేయటంలో వారు సిద్ధహస్తులు. వారు శ్రోత్రియులు. వారి గృహం ప్రక్కనే వుండటం వలన వారు ఇంటర్‌వల్‌లో వారి ఇంటి నుంచే కాఫీ తీసుకొనిరమ్మని చెప్పేవారు. వారికి వేడి కాఫీ స్టీలు మరచెంబులో తీసికొని వచ్చేవాణ్ణి. అలాగే చెల్లపిల్ల బంగారేశ్వరశర్మగారు మాథ్స్ టీచ్ చేసేవారు. వారు మాథ్స్‌లో దిట్ట. నాయని సుబ్బారావుగారి పదవీ విరమణ అనంతరం ఎన్.సి. ఆంజనేయులుగారు హెడ్ మాస్టర్‌గా వచ్చారు. వీరందరూ చాలా పేషన్స్‌తోను, కమిట్‌మెంటుతోనూ చక్కగా టీచ్ చేసేవారు. అటువంటి టీచర్స్ ఈ రోజుల్లో చాలాఅరుదు. ప్రతి సంవత్సరం యాన్యువల్ స్కూల్ డేస్‌కు ముందు అనేక లిటరరీ, కల్చరల్, డ్రామా కాంపిటీషన్స్ జరిపేవారు. నేను ఆ పోటీలలో పాల్గొనేవాణ్ణి. ముఖ్యంగా ఎలక్యూషన్ కాంపిటీషన్, ఎస్సే రైటింగ్ లాంటి పోటీలలో అనేక ప్రైజులు పొందిన ఆనందం అనేకసార్లు పొందేను. గంధ్రకోట హనుమంతరావుగారు, జాన్సన్ మాష్టారులు ఆటల పోటీలు హైజంప్, పోల్‌వాల్ట్, లాంగ్‌జంప్‌లాంటి క్రీడలను ఎంతో సమర్థవంతంగా నిర్వహించేవారు. స్కూల్లో ప్రతిరోజు ప్రేయర్ మరియు అసెంబ్లీ నిర్వహించేవారు. రోజుకు ఒక విద్యార్థి ఈ ప్రార్థనాగీతాన్ని పాడాలి. ఈ సత్సంప్రదాయాన్ని చాలాచక్కగా నిర్వహించేవారు. ఆనాటి ఉపాధ్యాయులు, ఆ నాటి అనుభూతులను నెమరవేసుకుంటేనే ఎంతో ఆనందం కలుగుతుంది. మళ్లీ విద్యార్థిగా మా స్కూల్లో చదువుకుంటే ఎంత బాగుంటుందో! అనిపిస్తుంది. అవి మరుపురాని, మరచి పోలేని అద్భుత అనుభూతులు!!

మా స్కూలు మునిసిపాలిటీ నిర్వహణలో చాలా సమర్థవంతంగా నిర్వహింపబడేది. ఆర్థికవనరుల మేరకు విశాలమైన క్లాస్ రూమ్స్‌తో పాటు చక్కగా పాఠాలు చెప్పే ఉపాధ్యాయులతో విరాజిల్లేది. 1953 ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు ప్రథమశాసనసభ స్పీకర్‌గా మా ఊరి నుంచి ఎన్నుకోబడిన ఎమ్మెల్యే నల్లపాటి వెంకట్రామయ్యచౌదరిగారు అయ్యారు. మా అందరికీ అది ఎంతో గర్వకారణం! మరల 62 సంవత్సరాల తర్వాత క్రొత్తగా ఇప్పుడే ఏర్పడిన ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రానికీ మా ఊరి నాయకులైన కోడెల శివప్రసాదరావుగారు స్పీకర్ అవటం కాకతాళీయమైన ఆనందం!

నరసరావుపేట సుప్రసిద్ధులైన కళాకారులను, నటు

లను దేశానికి ఇచ్చింది. మీసాల కృష్ణుడుగా సుప్రసిద్ధులైన బెల్లంకొండ సుబ్బారావుగారు, చింతామణి నాటకంలో సుబ్బిశెట్టి పాత్రధారిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న అర్వపల్లి సుబ్బారావుగారు మా వూరి వారేనని చెప్పుకోవటం మాకు గర్వకారణం. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా అనేక సంవత్సరాలు పనిచేసిన కాసు బ్రహ్మానందరెడ్డిగారు మా వూరివారే! ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని చాలా క్లిష్టపరిస్థితుల్లో సమర్థవంతంగా పరిపాలించారు కాసువారు.

ఆధ్యాత్మిక రంగంలో దక్షిణామ్నాయ అద్వైతపీఠం అయిన శృంగేరిపీఠాధిపతులవారు మా వూరివారు అని చెప్పుకోవటం మాకు చాలా గర్వకారణం. కొన్ని దశాబ్దాల తర్వాత నరసరావుపేటలో వారి గౌరవార్థం శృంగేరి శంకరమఠం సుమారు 1990 ప్రాతంలో నిర్మించగలగటం ఒక మరచిపోలేని ఆనందానుభూతి. ఈ మఠంలో ఎన్నో ఆధ్మాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్విఘ్నంగా నిర్వహిస్తున్నారు. ఇది చాలా సంతోషించవలసిన విషయం.

పత్రికారంగంలో చాలా ప్రసిద్ధి పొందిన ఆంగ్లపత్రిక త్రివేణి. ఈ పత్రికకు వ్యవస్థాపక సంపాదకులు కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు మా ఊరివారే అని గర్వంగా చెప్పుకుంటాను. భారతదేశపు ప్రైంమినిస్టర్ జవహర్‌లాల్ నెహ్రూ, భారతరాష్ట్రపతి అయిన డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు, దేశం గర్వించదగ్గ పత్రికా సంపాదకులు అయిన ఎం. చలపతిరావు గారు, కుందుర్తి ఈశ్వరదత్తు, కాసాసుబ్బారావు, ప్రొ॥ కె.ఆర్. శ్రీనివాస అయ్యంగార్‌గార్లు తదితరులు ఈ త్రివేణిపత్రికలో వ్యాసాలు వ్రాసేవారు. పత్రికారంగంలో ఉన్నత ప్రమాణాలతో నిర్వహింపబడిన ఆంగ్లపత్రిక త్రివేణి. కోలవెన్నువారు, మా నాన్నగారు చాలా ఆప్తమిత్రులు. ఇంటర్మీడియేట్ పూర్తి చేసిన తర్వాత నేను ఎక్కడ, ఏమి చదవాలి అనే మీమాంసలో వున్నప్పుడు స్పష్టమైన సలహా ఇచ్చి నేను ఇంగ్లీష్ లిటరేచర్‌లో ఆంధ్రయూనివర్సిటీలో చేరటానికి కారణభూతులు రామకోటీశ్వరరావుగారు. వారి పరిచయం ఒక గొప్పవరం.

కోటప్పకొండ త్రికూటేశ్వరస్వామి మాకు చాలా ఇష్టమైన దైవం. ఆస్తికులు, భక్తులు ప్రభలు కట్టుకొని మ్రొక్కులు చెల్లించుకుంటూ కొండకు వస్తారు. మా కాలంలో మెట్లు ఎక్కి ప్రయాసతో కొండమీదికి వెళ్లవలసి వచ్చేది. తర్వాత కోడెల శిప్రసాదరావుగారు రాష్ట్ర హోంమినిస్టర్ అయినప్పుడు ఎంతో ఇంట్రస్ట్ తీసికొని కొండమీదికి ఘాట్‌రోడ్డు నిర్మాణం చేయటం జరిగింది. ఇది ప్రజలకు ఎంతో ఉపయోగకరమైన సదుపాయం. కొండ మీద కూడ అనేక సదుపాయాలు కలిగించారు. ఇవి ఎవరూ మరచిపోలేని విషయాలు. కోడెలగారికి సదా కృతజ్ఞతలు. మా ఊరిలోని శివాలయం ఎంతో సుప్రసిద్ధమైనది. ప్రాచీనమైనది.

నర్సరావుపేట పట్టణం గత దశాబ్దకాలంలో స్థానిక సంస్థల నిర్వహణలో ఎంతో పురోగతిని సాధించింది. పట్టణ వికాసానికి నరసరావుపేట మున్సిపాలిటీ పాత్ర ఎంతోవున్నది. ఆంధ్రదేశంలో చాలా సమర్థవంతంగా పరిపాలన చేస్తున్న ఈ మున్సిపాలిటీ శతజయంతి సందర్భంగా వారికి సహస్ర అభినందనలు!

## మద్రాసు రౌడీ

డెబ్బై ఎనభై ఏళ్లనాటి సంగతి. ఒకడు మద్రాసు నుండి వచ్చి నరసరావుపేటలో ఉన్నాడు. అతని చేతిలో బ్యాట్ వుండేది. అందరినీ అదిరిస్తూ బెదిరిస్తూ ఉండేవాడు. మద్రాసు రౌడీగా పేరుపొందాడు. 'బస్తీమే సవాల్!' అన్నట్లు ఉండేది అతగాడి వ్యవహారం. నరసరావుపేట యువకులకు అతని ప్రవర్తన దుర్భరంగా ఉండేది. అప్పుటి పొలిమేరగా చెప్పుకొనే పాండురంగస్వామి గుడి వద్ద మన యువమండలికి తారసపడ్డాడు మద్రాసు రౌడీ. వారిలో ఉన్న ఆలూరి నరసింహం ఆశ్చర్యంగా 'ఏదీ నీ బ్యాట్ చూద్దాం! బాగుంది! కాస్త ఇస్తావా?!' అని అడిగాడు. రౌడీ ఇచ్చాడు. నరసింహం బ్యాట్‌ను అమాయికంగా ఒక్కసారి అటూ ఇటూ చూచాడు. సింహంలా విజృంభించాడు. 'నువ్వు మద్రాసు రౌడీవి నరసరావుపేటకు కాదు! నీ దిక్కు ఉన్న చోట చెప్పుకో! పో!' అని అతన్ని చితకబాదాడు. దానితో తోక ముడిచాడు ఆ రౌడీ. మూటా ముల్లే సర్దుకొని నరసరావుపేట నుంచి నిష్క్రమించాడు.



# గుర్తుకొస్తున్నాయి...




## ఇలింద్ర సదాశివగుప్త

ఐ.ఎన్.జి. వైశ్యా బ్యాంక్ చైర్మన్ (రిటైర్డ్)


అది 1950వ సంవత్సరం. మే నెలలో గుంటూరు నుండి నరసరావుపేటకు మేమందరం వచ్చాం. అప్పుడే నరసరావుపేటలో కాలేజీ మొదలైంది. మా నాన్నగారు ఇలింద్ర రంగనాయకులుగారు ఆ కాలేజికి ప్రిన్సిపాల్‌గా చేరడం జరిగింది. మేము రామిరెడ్డిపేటలోని కాలేజి - రైల్వేస్టేషన్ రోడ్‌లో ఉండేవారం.

అప్పట్లో నరసరావుపేట చాలా చిన్న ఊరు. పల్లె వాతావరణం అధికంగా కనిపించేది. నేను, నాసోదరులు అందరం చాలా త్వరగా ఆ వాతావరణానికి అలవాటుపడ్డాం. ఇప్పటికి 65 సంవత్సరాలైనా అక్కడ గడిపిన కాలం ఇంకా జ్ఞాపకం వస్తూనే ఉంది.

పల్నాడురోడ్డులోని చెరువు నాకు బాగా జ్ఞాపకం. సాయంకాలాలలో చెరువుగట్టు మీద నడవడం, చల్లని గాలి పీల్చటం మర్చిపోలేను. అప్పట్లో ఒకటే సినిమాహాలు వుండేది. దాని పేరు ఏంజల్ టాకీస్. ఆ తర్వాత నాగూర్‌వలి టాకీసు, సత్యనారాయణ టాకీసు మొదలయినవి వచ్చాయి.

నేను మున్సిపల్ హైస్కూల్‌లో థర్డ్ ఫారంలో చేరాను. మా హెడ్‌మాస్టర్ నాయని సుబ్బారావుగారు. ఆజానుబాహువు. ఎప్పుడూ తెల్లనిపంచ, లాల్చీ ధరించి చాలా గంభీరంగా వుండేవారు. మాకు నీతిశాస్త్రాన్ని బోధించటానికి వచ్చేవారు. వారు నాన్నగారికి చాలా సన్నిహితంగా ఉండేవారు. తర్వాత ఎన్.సి. ఆంజనేయులుగారు హెడ్‌మాస్టర్‌గా వచ్చారు. అప్పట్లో మాకు పాఠాలు చెప్పిన వారిలో కస్తల వేంకటేశ్వరరావుగారు, చెళ్లపిళ్ల బంగారేశ్వరశర్మగారు, లంకా సీతారామశాస్త్రిగారు, టి.ఆర్. రాజేశ్వరమ్మగారు జ్ఞాపకం ఉన్నారు.

ఆ రోజుల్లో నేను, మిత్రుడు హనిమిరెడ్డి మరికొందరు మిత్రులతో కలిసి కోటప్పకొండ తిరునాళ్ల రోజు కొండకు నడచివెళ్లి, నడచివచ్చేవారము. తిరిగివచ్చి ఉదయాన్నే హనిమిరెడ్డి ఇంట్లో ముఖాలు కడుక్కుని ఇడ్లీ తిని ఇంటికి వెళ్లేవాళ్లం.

అన్నిటి కన్నా చెప్పుకోదగ్గ విషయం. వినాయకచవితి రోజు ఉదయమే మిత్రులతో కలిసి రాజాగారికోటకు పత్రి కోసం వెళ్లేవాళ్లం. చెట్లెక్కి కోసుకోవడం చాలా సరదాగా ఉండేది.

విక్టోరియాహాల్‌లో నాటకాలు తెల్లారే వరకు చూడటం మరపురానిది. కృష్ణరాయబారం పద్యాలు ఇప్పటికి చెవుల్లో గింగురుమంటున్నాయి. మన ఊరికి వచ్చిన ప్రతి సినిమా చూసేవాడిని. నాన్నగారు ఏమీ అనేవారు కాదు. ఎందుకంటే నేను చదువును ఎప్పుడూ అశ్రద్ధ చేయలేదు.

మేము హైస్కూల్‌లో కబడ్డీ, కోకో ఆడేవాళ్లం. డ్రిల్‌మాస్టర్ అగ్నిగుండాల ఆంజనేయులుగారు చాలా సరదాగా ఉండేవారు. 1954లో ఎస్.ఎస్.ఎల్.సి. అయిన తర్వాత కాలేజిలో 1954-'58 వరకు ఇంటర్మీడియట్, బి.ఎ. చదవటం జరిగింది. కాలేజీలో విశాలమైన మైదానాలు వున్నాయి. 1955లో క్రికెట్ ప్రారంభించాం. కస్తల శివప్రసాద్ గారు ఇంగ్లీషు లెక్చరర్‌గా వుండేవారు. వారి ప్రోత్సాహంతో 1956లో టెన్నిస్ కోర్టును నిర్మించారు. వారే ఆటకూడా నేర్పేవారు. తర్వాత వారు వేరే ఊరు వెళ్లిపోయారు.

కాలేజిలో పాఠాలు చెప్పిన లెక్చరర్స్ అందరూ పోటీ పడి చెప్పేవారు. నేను ఇంటర్మీడియట్‌లో ఎం.పి.సి., బి.ఎ. డిగ్రీలో మ్యాథ్స్ చేసాను. అన్నంభొట్ల సూర్యనారాయణగారు, మద్దులపల్లి సత్యనారాయణ శాస్త్రిగారు, జి.వి. కృష్ణారావుగారు, గర్నెపూడి సీతారామశర్మగారు, విశ్వేశ్వరయ్యగారు, చల్లా వేంకటేశ్వర్లుగారు, ఆర్. సీతారామారావుగారు, పబ్బతి సుబ్రహ్మణ్యంగారు, పి.వి. కృష్ణస్వామిగారు, గుబ్బా బాలనర

నయ్యగారు పేరున్న లెక్చరర్లుగా నా మదిలో నిలిచిపోయారు. అప్పుడే గ్రంథాలయాన్ని ఎలా ఉపయోగించుకోవాలో బాగా నేర్చుకున్నాను. తర్వాత ఆ అనుభవం నా ఉద్యోగపర్వంలో బాగా ఉపయోగపడింది.

రైల్వేస్టేషన్ క్యాంటిన్‌ను ఎప్పుడూ మర్చిపోలేను. ప్రొప్రయిటర్ రామయ్యర్‌గారు చాలా మంచి కాఫీ ఇచ్చేవారు. అలాగే పరీక్షలప్పుడు ఏంజల్ టాకీస్ దగ్గర నాయర్ టీ త్రాగటం ఇప్పటికీ జ్ఞాపకం. తర్వాత స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియాలో చేరడం జరిగింది. అప్పుడు ఒకే బ్రాంచి ఉండేది. అది కూరగాయల మార్కెట్టు దగ్గరలో అనిశెట్టివారి ఇంట్లో ఉండేది. ముఖ్యంగా మా తమ్ముడు ప్రసాద్ క్లాస్‌మేట్స్ అందరూ నాతో చాలా సఖ్యతగా ఉండేవారు. వారిలో కె.వి.కె. రామారావు ఒకరు. ఇప్పటికీ రామారావుగారి ద్వారా నరసరావుపేట విషయాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటున్నాను. హైదరాబాదు వచ్చినప్పుడల్లా కలుస్తూ కాలక్షేపం చేస్తుంటాము. అప్పటి ముచ్చట్లను మళ్లీ మళ్లీ జ్ఞాపకం చేస్తుంటాడు. అలాగే హనిమిరెడ్డి కూడా ఎంతో ఆప్యాయంగా అభిమానంగా ఉంటాడు. నా క్లాస్‌మేట్స్ చాలామంది రాయలసీమ నుండి వచ్చినవారు కావటంతో ఇప్పుడు ఎక్కడున్నది తెలియటం లేదు. కాని తలచుకున్నప్పుడల్లా ఏదో తెలియని ఆనందానుభూతి కలుగుతోంది.

ఇక కాలేజీ విషయానికి వస్తే మేము కాలేజి భవనాలతో పాటు ఎదిగాం అనిపిస్తుంది. ఏ మూల చూసినా నాన్నగారు చేసిన శ్రమ జ్ఞాపకం వచ్చి కళ్లు చెమరుస్తాయి. 1974లో నాన్నగారు పుట్టపర్తి వెళ్లిపోయిన తర్వాత నేను నరసరావుపేట రావటం బాగా తగ్గిపోయింది. కాలేజీలో ఫంక్షన్స్‌కు రెండుసార్లు, అలాగే హనిమిరెడ్డిగారి కుమార్తె వివాహ సందర్భంలో ఒకసారి, కె.వి.కె. రామారావుగారి కోరిక మీద నరసరావుపేట రంగస్థలి రజతోత్సవ సందర్భంగా సన్మానం చేసినప్పుడు మరోసారి రావటం జరిగింది.

నాన్నగారితో కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి ఇంటికి వెళ్లి వారి మాటలు వినటం నా అదృష్టం అనుకుంటాను. అలాగే మా ఫ్యామిలీ డాక్టర్ పి. కృష్ణదాస్‌గారు మా పట్ల ఎంతో ప్రేమతో ఉండేవారు. ఇలా తలుచుకుంటూ పోతే ఇంకా ఎన్నో విషయాలు గుర్తుకొస్తున్నాయి. ●

## కమ్మని గరిక పచ్చడి

నరసరావుపేట రాజావారు వేరే ప్రాంతం నుంచి వస్తూ తిరుగు ప్రయాణంలో చిలకలూరిపేట దగ్గరి యనమదల గ్రామంలో ఆగారు. అది భోజనవేళ. ఒక గృహస్థుడు– పోలేపెద్ది వేంకటప్పయ్యగారు 'భోజనం చేసి ప్రయాణంకండి!' అని సవినయంగా ప్రార్థించారు. రాజావారు అంగీకరించారు. వేంకటప్పయ్య ఇంటికి వెళ్లి చెప్పాడు. ఆ ఇల్లాలు యజ్ఞమ్మ కూడ 'సరే!' అంది. ఇంటిలో కూరగాయలు తక్కువగా ఉన్నాయి. మిద్దె గోడమీద మొలిచి ఉన్న గరికతో పచ్చడి చేసింది. తక్కిన పదార్థాలు సిద్ధం చేసింది. గృహస్థుడు రాజావారిని తోడ్కొని వచ్చాడు. భోజనాలు పూర్తిఅయినాయి.



వెంటనే రాజావారి ఉద్యోగులు ఆ గృహస్థుడితో 'రేపు రాజావారి కోటకు రండి!' అని చెప్పారు. గృహస్థుడి కుటుంబానికి భయం పట్టుకొన్నది– 'ఏ శిక్ష అనుభవించాల్సి వస్తుందో!' అని. అయినా రాజాజ్ఞ అనుల్లంఘనీయం కదా!

మరుసటి రోజు ఉదయానికి కోటకు చేరుకొన్నారు. రాజదర్శనం చేసుకున్నారు భయంతో. రాజాగారు నిన్నటి పచ్చడిని గురించి అడిగారు. క్షమించమని ప్రార్థిస్తూ ఉన్న సంగతి చెప్పారు ఆ ఇంటివారు. 'మీ భోజనానికి మేము చాలా సంతోషించాం! మీకు మాన్యాన్ని ఇస్తున్నాం!' అని ప్రకటించారు రాజావారు. ఆ గృహస్థులు పరమానందభరితు లయ్యారు. ఆ 'గరిక మాన్యం' ఇటీవలిదాకా ఆ కుటుంబం అధీనంలోనే ఉంది. ●

# అనుభవ పాఠం



ఆచార్య నాయని కృష్ణకుమారి
మాజీ వైస్ ఛాన్సలర్

1930లో నేను జన్మించాక నరసరావుపేటతో భౌతికంగా కూడా నాకు దాదాపు పాతికేళ్లపాటు అనుబంధం కొనసాగింది. మా నాన్నగారు నాయని సుబ్బారావుగారు 1955లో పదవీవిరమణ చేసేవరకూ ఆ ఊరికి నాకు రాక పోకలు సాగుతూనే ఉండేవి. మా నాన్నగారు 1929లో నరస రావుపేట మున్సిపల్ హైస్కూల్‌లో టీచరుగా ఉద్యోగం సంపా దించుకున్నారు. నేను 1930లో జన్మించాను. ఆసుపత్రి సౌకర్యం పేటలో లేని కారణాన గుంటూరు జనరల్ ఆసుపత్రి లో మా అమ్మ పురుడు పోసుకుంది. రికార్డుల్లో జన్మస్థలం గుంటూరు అని ఉంటుంది. కానీ పెరిగింది పేట ఒడిలోనే. అదే నా జన్మభూమి.

నా చిన్నప్పుడు నే నెరిగిన నరసరావుపేట ఒక సెగల గుండం. ఇప్పటిలాగా అప్పుడు ఏ నాగార్జునసాగర్ నీళ్లూ లేవు. వేసవిలో వడగాలి ఆ చెవి నుండి ఈ చెవికి దూసుకు పోతుండేది. ఆ రోజుల్లో వడదెబ్బల చావులు ఎవరికీ ఆశ్చ ర్యాన్ని కలిగించేవి కావు. మా ఇళ్లలో ఆ గాలికి అడ్డంగా నవారు మంచాలు నిలువుగా ఎత్తిపెట్టి వాటిమీద తడి కోకలు వేలాడవేసి రెండోవైపు చాపల మీద పెద్దవాళ్లు దొర్లుతుండే వాళ్లు. మరీ భరించలేని సెగకు కింద నేలమీద నీళ్లు పోసి ఆ నీళ్లలో శరీరం తడుపుకుంటూ సేదతీరేవాళ్లు. అదంతా ఎవరికివారు అమర్చుకున్న కూలింగ్ సౌకర్యం. బెట్టవల్ల పిల్లలం మాకు ఒళ్లంతా పేలిపోయేది. ఈ పేలుడుతీరును 'చెమటకాయ'లని పిలిచేవారు. మొహం మీద చిన్న చిన్న సెగగడ్డలు మొలచుకొచ్చేవి. ఆ రోజుల్లో తాగడానికి సరిగా నీళ్లు దొరకని ఊరు మా ఊరు. అక్కడి బావుల్లో తోడగా తోడగా ఎక్కడో పాతాళంలో నీళ్లు మిలమిలా మెరుస్తూ ఊరించేవి. అసలు ఆ తాలూకా కంతటికీ అప్పుడు నీటిఎద్దడి మామూలు విషయమే! కొండవీటి చాంతాడు అనే నుడికారం ఈ లోతు నూతుల ఉనికి వల్ల భాషలో చొరబడింది. నీళ్లలో మట్టి తగిలితే ఆ మట్టి నిండా అభ్రకం. నాకు బాగా జ్ఞాపకం. నూతిలో పూడికలు తీయించే సమయంలో పనివాళ్లు నూతిలో దిగి మట్టిని పళ్లికల్లో నింపి పైకి పంపుతుండేవారు. వాళ్లు కింద నీళ్లల్లో నాని నాని పని ముగించుకుని పైకి వచ్చేసరికి చేవదేరి నల్లగా వాళ్ల ఒళ్లు తళుక్కు తళుక్కు మంటుండేది. ఏవో చిన్నచిన్న చెమ్కీ బిళ్లలు నేర్పుగా తాపడం చేసినట్లు ఒళ్లంతా ఒకటే మెరుపులు. ఉండలు ఉండలుగా పేర్చి ఎర్రగా కాల్చి తయారుచేసినట్లు అక్కడి రాళ్లన్నీ బంగారురంగులో మెరిసే బొంతరాళ్లు. అవి ఇటుకల్లాగా కట్టడపు పనికి ఉప యోగపడుతుండేవి. ఇక నేలమీద ఎక్కడ చూసినా పలుగు రాళ్లు. వీటిని చెకుముకిరాళ్లని కూడా పిలిచేవారు. ఒకదానితో మరొకదాన్ని కొడితే నిప్పులు రాల్చడం వీటి ప్రత్యేకత. గ్రామస్థులకు ఆ రోజుల్లో జేబుల్లో అగ్గిపెట్టె లుండేవి కావు. ఇంత దూది లేదా చిన్న జాటీముక్క తలపాగాల్లో ఇరికించుకుని దారిప్రక్కన రెండు రాళ్లేరుకుని అవసరమైన ప్పుడు నిప్పురాజేసుకునే దృశ్యం సర్వసాధారణ దృశ్యం. ఆ నిప్పుతో పొడుగాటి చేబ్రోలు పొగాకు చుట్టలు టార్చిలైట్లై గుప్పుగుప్పున రైలింజను పొగవదుల్తూ వెలిగి యజమానుల్ని కలల ధూమలోకాలకు పట్టించేవి. చిన్నచిన్న పలుగురాళ్ల ముక్కల మీద సూర్యకాంతి ప్రతిఫలనం చెంది నేల నంతటినీ వజ్రస్థగిత కుట్టిమంలాగా మార్చేసేది. మా ఊళ్లో వెన్నెల రాత్రుల కుండే అందాన్ని మరెక్కడా చూడలేదు. ఈ ప్రతిఫలన శోభవల్లనే నరసరావుపేటలో వెన్నెలకుండే సౌందర్యం అనన్యం. అది అనుభవించి గ్రహించదగ్గది మాత్రమే.

మా ఊళ్లో మా చిన్నప్పుడు పెద్దబజారువీథి తప్ప మిగిలిన రోడ్లన్నీ మట్టిరోడ్లే! ఊరి కంతటికీ ఒకటే సినిమా హాలుండేది. దానిపేరు ఏంజల్ టాకీస్. ఎప్పుడన్నా టూరింగ్ వాళ్లు ఆరుబయట గుడారాలు వేసుకుని సినిమాలు ఆడేవాళ్లు వాటిని డేరా సినిమాలని పిలిచేవారు. అక్కడ సాధారణంగా హిందీ సినిమాలు ఆడేవి. వాటికి తప్పనిసరిగా అనువాదకు డుండేవాడు. ఆ సినిమాలు కూడా వాడియావారి నాడియా

నటించిన సినిమాలు తుఫాను మెయిలు, పంజాబు మెయిలు ఇట్లాంటివే! సినిమాల ప్రచారానికి ఒక ఎద్దుబండిలో డప్పు వాద్యం. మధ్యాహ్నం పూట ఎర్రటి ఎండలో డప్పు మోగించు కుంటూ బండి బయలుదేరేది. సినిమా గొప్పతనాన్ని వర్ణిస్తూ ఒకడు గొంతుచించుకుని అరుస్తుండేవాడు. మరొకడు ఆట వివరాలను తెలియచేసే రంగురంగుల కాగితాలను గాల్లోకి విసురుతుండేవాడు. మేము ఆ బండి రేపే దుమ్ములో పడి దాని వెంట పరుగులెత్తుతూ కాగితాలు ఏరుకునేవాళ్లం. అవి కాగితాలా? మా పాలిటి కరెన్సీనోట్లుగాని! ఆ కాగితాల్లాగే ఆ దుమ్ము కూడా మా కంత ప్రియంగా ఉండేది. నోరంతా తెరచి ప్రాణాలన్నీ కేంద్రీకరించి ఆ దుమ్మును ఆప్యాయంగా పీల్చే వాళ్లం. మట్టి! ఆ మట్టివాసన, దాని స్పర్శ, అది మా ఊపిరిలో లీనం కావడం ఇదంతా తాదాత్మ్యంతో కూడిన పని! ఎంతగొప్ప పని!

మా యిల్లు రామిరెడ్డిపేటలో ఉండేది. ఇంటినుండి స్కూలుకు రెండు పూటలా నాలుగుసార్లు తిరిగేవాళ్లం. అప్పుడు స్కూలుకెళ్లే దారి పక్కన పెద్దచెరు వుండేది. అప్పుడు పిల్లలం మాకు చెప్పులుండేవి కావు. దారిపొడుగునా పరుచుకున్న పలుగురాళ్ళు మమ్మల్ని బాధించిన జ్ఞాపకాలు లేవు. స్కూలు హెడ్మాస్టరుగారు మా నాన్నగారే! హెడ్మాస్టరుగారి అమ్మాయిని గనుక నాకు ముందే పేపర్లు తెలిసిపోతాయని ఏ ఒక్కరూ అనుకోలేదు. మా తమ్ముడు ఆరో క్లాసు తప్పితే 'హెడ్మాస్టరు గారి అబ్బాయి తప్పడమా!' అని ఎవరూ ఆశ్చర్యపోనూ లేదు. అది ఆ కాలం సంస్కారం. ఆ కాలానికి చెందిన చదువూ సంస్కారం నేర్చుకున్నందుకు నన్ను నే నెప్పుడూ అభినందించు కుంటుంటాను. మా మేష్టార్లలో ఆంజనేయులు మేస్టారుగారు మాకు జాగ్రఫి చెప్పేవారు. జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తెలుగు చెప్పేవారు. ఆయన కొడుకు కృష్ణమూర్తిగారు లెక్కలు చెప్పేవారు. ఇంగ్లీషు వేమూరి శ్రీరాములుగారు, అప్పుడప్పుడు మా నాన్నగారు చెప్పేవారు. నాన్న హిస్టరీ కూడా చెప్పేవారు. అప్పుడు హిస్టరీ జాగ్రఫీలకు కలిపి ఒకటే పేపరు. హిస్టరీకి 60 మార్కులు, జాగ్రఫీకి 40 మార్కులు పంపకం ఉండేది. ఆంజనేయులు మేస్టరుగారు మా యింటిమనిషి కిందే లెక్క. మా అమ్మకు ఆయన అనుంగుతమ్ముడు. నోరారా మా అమ్మను అక్కయ్యా! అని పిలిచేవారు.

అప్పటి స్కూలు చదువు పదకొండేళ్ల చదువు. ఎస్.ఎస్.ఎల్.సి. అనేవాళ్లు. ఈ నాటి చదువు ఎస్.ఎస్.సి. పదేళ్లే! అప్పటి పదోతరగతిని ఫిఫ్త్‌ఫారమ్ అని పిలిచేవాళ్లు. ఈ తరగతిలోనే ఐచ్ఛిక విషయాన్ని ఎన్నుకోవాలి. నేను 6వ తరగతి పూర్తిచేసిన సంవత్సరం నాన్నకు బదిలీ వంటిది వచ్చింది. పదోతరగతి సగంలో ఉండగా అక్కడినుండి నరస రావుపేటకు చేరుకున్నాము. అక్కడ నా ఐచ్ఛికవిషయం రసా యనశాస్త్రం మాత్రమే ఉన్నందువల్ల నేను దానికి మారవలసి వచ్చింది.

ముందు మా స్కూలును గురించి కొంత చెప్పుకో వాలి. నేను పదో క్లాసుకు వచ్చాక మా స్కూలు మొత్తం మీద ఆడపిల్లల సంఖ్య పదహారు. ఈ లెక్క ఆనాటి బాలికా విద్యా పురాణాన్ని గురించి చెప్తుంది. క్లాసు కంతటికీ నే నొక్కదాన్నే ఆడపిల్లను. టీచర్లు నన్ను అల్లారుముద్దుగా చూసుకునేవారు. అందుకు నేను హెడ్మాస్టరుగారి అమ్మాయిని అన్నది గాక చదువు మీద నేను చూపించిన శ్రద్ధ కారణం అనుకుంటాను. మా లెక్కల మాస్టారు లెక్కల్లో ప్రశ్న లడిగి క్లాసులో ఎవరూ చెప్పలేనపుడు నన్నడిగి నేను చెప్తే 'ఆడపిల్ల చెప్తుందిరా! సిగ్గు లేదా?' అని వాళ్లను ముక్కచీవాట్లు పెట్టేవాళ్లు. మా ఫిజిక్స్ మాష్టారు కురంగేశ్వరరావుగారు గొప్ప హరికథా భాగవతార్. సంవత్సరం మధ్యలో వచ్చాను గనుక నేను చేయవలసిన ఫిజిక్స్ ప్రయోగాలను మధ్యాహ్నం కూటివిడుపు సమయంలో చేయించేవారు. ఒక పెద్ద బీకరులో కాఫీ తెప్పించి దాన్లో కొంత ఒక చిన్న బీకర్లోపోసి నన్ను తాగమనేవారు. ఆ కాఫీలో ఆయన రంగరించిన వాత్సల్యపు తీయదనాన్ని నేను మర్చిపో గలనా? 'ఏరా అమ్మడూ!' అంటూ నోరారా ఆయన పిలిచే పిలుపు ఇప్పటికీ నా చెవులలో ప్రతిధ్వనిస్తూనే ఉంది. ఆయన చూపించిన వాత్సల్యం ఆయనమీద భక్తితోపాటు ఆయన చెప్పిన విషయం మీద ఆసక్తిని పెంచింది. ఇంటరులో బై.పి.సి. గ్రూపులో మొత్తం ఎ.సి. కాలేజీకే నాది రెండో స్థానం. మా టీచర్ల వల్లనే నేను ప్రస్థానంలో మైలురాళ్లను స్థాపించుకో గలిగినాను. మా స్కూల్లో, శ్రీకాకుళం వెళ్ళక ముందు, చిన్నక్లాసులలో ఉన్నప్పుడు మా క్లాసు గది పెద్ద చింతచెట్టు పక్కన ఉండేది. చుట్టూ సున్నం గోడలు. అవీ అడ్డ గోడలు, పైన గడ్డి కప్పు. నాపరాళ్లు పరిచిన అరుగు

మీద లోపల మాస్టరుగారి కుర్చీ. దాని ముందు టేబులూ వెనుక నల్లరంగు పులిమిన గోడబోర్డు. గంట కొట్టి ఇంకా మాస్టరుగారు రాని వ్యవధానంలో క్లాసంతా మానిటరు అధీనంలో ఉండేది. వాడు మాలాగే చిన్నవాడు. కానీ అధికారం దత్తమైనవాడు కదా! ఎక్కడా లేని దర్పం చూపిస్తూ చేతుల్లోని చింతబరికను ఝుళిపిస్తూ అందరినీ అదిలించేవాడు. 'బెంచెక్కు బెంచెక్కు' అంటూ ఆడపిల్లలమైన మాకు శిక్షలు విధిస్తుండేవాడు. ఇప్పటికీ ఖంగు మంటూ ఆ గొంతు చెవుల్లో మోగుతూనేఉంది. రూపం మసగ్గా గుర్తున్నా పేరు మాత్రం అసలు గుర్తులేదు. వాడి దర్పానికి భయపడి మూతి బిగించి పెదాల మీద చూపుడు వేలుంచుకుని మాస్టారుగారు వచ్చే దాకా ద్రావిడ ప్రాణాయామం చేసేవాళ్లం. ఇప్పుడు అతడు కూడా విశ్రాంత జీవనంలోని హాయిని అనుభవిస్తూ ఎక్కడో అక్కడ ఉండే ఉంటాడు.

మా స్కూలు జీవితంలో గుర్తుపెట్టుకోదగినవి మేము చేసిన విజ్ఞానయాత్రలు. పిల్లలందర్నీ కూడగట్టి తక్కువ దూరాలయితే నడిపించి ఏదో ఒక ప్రసిద్ధస్థలానికి తీసుకుపోయి రాయిరప్పా చెట్టూ పుట్టా, గుడీగుట్టా అన్నీ చూపిస్తూ కథలు చెప్తూ మా మనసులలో ఆనందపు మొలకల్ని నాటేవారు మా మాస్టార్లు. ఆ మొలకలే మాలో వేళ్లూనుకున్న నేటి సంస్కృతి మహావృక్షాలు.

మా ఊరు చుట్టూ ఎన్నెన్నో గ్రామాలు. ప్రతి గ్రామంలో గుళ్లూ, దేవుళ్లూ, వాళ్ల చుట్టూ కథలు, చరిత్ర– అన్నీ సంస్కృతి పూర్ణ పరిమళసుమాలు. ఒకసారి మమ్మల్ని పేటకు 3 మైళ్ల దూరంలో ఉన్న ఇక్కుర్తికి తీసుకుపోయారు. అక్కడి కొండ బోడకొండ. కొండ మీద శివాలయం. గుడి చాలా ప్రాచీనమైనదనీ ఎప్పుడో 12వ శతాబ్దంలో కట్టబడిందనీ చెప్పడానికి ఆధారాలున్నాయి. అక్కడ పెద్దబండ, కత్తి పెట్టి చీలిస్తే చీలినట్లుగా ఉండి అందులో నీళ్లున్నాయి. ఆ నీళ్లు ఎప్పుడూ ఇంకిపోవట. శివుడి కొకసారి బాగా దాహం కలిగిందిట. ఆయన దాహం తీర్చటానికి శక్తి తన చేతుల్లో ఉండేకత్తితో కొట్టి నీరు తెప్పించిందట. అందువల్ల దాన్ని 'శక్తి దొన' అని కూడా పిలుస్తారు. ఇవన్నీ ఆ నాడు నేను విన్న కథలైనా ఇప్పటికీ నాలో పచ్చగా బ్రతికే వున్నాయి.

మరొకసారి మా ఊరికి పదిహేను మైళ్ల దూరంలో ఉన్న చేజర్లకు మమ్మల్ని తీసుకువెళ్లారు. ఎడ్లబండి మీద సాగిన ఆ ప్రయాణం ఆహ్లాదాన్ని పంచింది. అక్కడ దేవుడు కపోతేశ్వరుడు. ఆలయం ఆ పేరు మీదిదే. ఆ ఊరి నిండా కోటి శివలింగా లుంటాయట. అక్కడ నాలుగో శతాబ్దానికి చెందిన ఆనందగోత్రికుల శాసనాలు దొరికాయట. శిబిచక్రవర్తిని పరీక్షించడానికి అగ్ని, ఇంద్రుడు పావురంగా డేగగా మారి ఆయన దాతృత్వాన్ని మెచ్చుకున్న కథ. ఈ కథ అక్కడే జరిగిందని స్థానికుల నమ్మకం. మరో చెట్టుకథ కూడా అక్కడ చెప్పారు. ఒక చెట్టు ఎన్నో ఏళ్లుగా అక్కడ ఉండేదనీ దానికి 12 సంవత్సరాలకు ఒక్కటంటే ఒక్క పండు మాత్రమే పండేదనీ దాన్ని దేవతలువచ్చి శివుడికి అర్పించేవారని కథ. నీలగిరి కొండల్లో 12 సంవత్సరాల కొకసారి కురుంజీ మొక్కలు పూయగాలేనిది ఈ పండు ఆ వ్యవధిలో పండడంలో నిజానికి ఆశ్చర్యం లేదు. కానీ ఒక్క పండే అన్న చోట అతిశయోక్తి కనిపిస్తుంది. ఈ కథలన్నీ మసక మసక జ్ఞాపకాలలో మునిగిపోయి ఉన్నా అప్పుడు జూజూసున్నం మార్చిమార్చి నిలువుగీతలుగా పూసిన దేవాలయపు గోడల పక్కన బండల మీద కూర్చుని మా మాస్టారుగార్లు వడ్డిస్తుంటే కమ్మటి పులిహోర తిన్న సంఘటన బాగా జ్ఞాపకముంది.

మరొక యాత్ర కొండవీడుకు. ఇది కుటుంబయాత్ర. నేను వాల్తేరులో చదువుకుంటూ సెలవులకు ఇంటికి వచ్చినప్పుడు చేసిన యాత్ర యిది. ఇది కూడా కొంతమేర ఎడ్లబండ్లపైనే సాగింది. కొండవీడులో మేము చూచిన కత్తుల బావి, కన్నెకల మంటపం నేతికొట్టు మొదలైన వాటిని మా నాన్నగారు వివరించి చెప్పారు. తర్వాత ఉస్మానియా తెలుగు శాఖలో పనిచేస్తున్నప్పుడు మా విద్యార్థినీ విద్యార్థులను విజ్ఞాన యాత్రకి తీసుకువెళ్లాను. అమరావతి, మొగల్రాజపురం గుహలు, ఉండవల్లి గుహలు అన్నీ చూచుకుని కొండవీడుకు ప్రయాణం కట్టాము. మాకు దిక్ప్రదర్శన చేసినవాడు 'కొండ ఎక్కితే చదరపు ప్రదేశం వస్తుంది. పో!'మ్మని ఒక నిలువు కొండను చూపించాడు. మాలో చాలామందిమి ఎక్కలేక పోయాము. ఉత్సాహమున్న మగపిల్లవాళ్లు మాత్రం ఆ దారినే ఎక్కి చూసి వచ్చారు. ఈ కొండవీటి ప్రయాణం చిన్నప్పటి ప్రయాణాన్ని బాగా జ్ఞాపకం తెచ్చింది.

మరొక యాత్ర గురించి తప్పకుండా చెప్పాలి. అది కోటప్పకొండ జాతర. కోటప్పకొండ మా ఊరికి ఆరు మైళ్ల దూరంలో ఉంది. ఇక్కడి దేవుడు కోటీశ్వరుడు. ఈయన

నెలవైన కొండకు మూడు శిఖరా లుండడం చేత త్రికూటాచలం అనే పేరు వచ్చింది. మా ప్రాంతమంతా ఈ దేవుడి పేరు మీదే కోటయ్యలు, కోటమ్మలు, కోటప్పలు ఉం టుంటారు. మా చెల్లెలిపేరు కూడా కోటీశ్వరే! మా చిన్న ప్పుడు కొండమీదకు మెట్లదారి మాత్రమే ఉండేది. దారిలో గొల్లభామగుడీ దానికో కథా ఉంది. మరొకచోట పెద్ద రాళ్ల గుట్ట ఉంది. ప్రతిభక్తుడు ఒక్కొక్క చిన్నరాయిని గుట్ట మీదకు విసరాలి. దానికీ ఒక కథ ఉంది. కొండమీదకు పోవడానికి దాదాపుగా 700 మెట్లు ఎక్కవలసి వుండేది. అలసట పోగొట్టు కోవడానికి 'చేదుకో కోటయ్యా!' అని కేకలు పెడుతూ దేవుడి చేయూతను కోరుతూ సాగిపోతుండడం ఇక్కడ విశేషం. నేను పదేళ్ల వయసులో ఉండగా ఒకసారి నేనూ, అమ్మా, నాన్నా, తమ్ముడూ పైనుంచి కిందికి దిగుతున్నాం. నేను పట్టుపరికిణి కట్టుకున్నాను. తమ్ముడు నిక్కరుగాడు. వాడు చురుగ్గా దిగు తుంటే నేను పంతానికి పోయాను. మెట్టు మీద నుండి మెట్టు మీదకు దూకబోయి పరికిణి తట్టుకుని గాలిలో ఎగిరాను. ఆ ఎగిరిన అనుభవం నాకు ఇప్పటికీ జ్ఞాపకం. తర్వాత నేను చాలా మెట్ల మీద నుండి దొర్లి ఒక వెడల్పు మెట్టు మీద ఆగి పోయాను. అమ్మా వాళ్లు నన్ను చేరేలోపు మెట్ల పక్కన కూచున్న వాళ్లు నా మొహాన నీళ్లు కొట్టి సేదతీర్చారు. కనుబొమ్మల కింద ముక్కుదూలం ఆరంభంలో అప్పుడు తగిలిన దెబ్బ వల్ల ఏర్పడిన మచ్చ ఆ నాటి సంఘటనకు సాక్షిగా ఇప్పటికీ ఉంది. కొండకు తరుచూ పోకపోయినా ప్రతి శివరాత్రికీ జరిగే ప్రభల ఊరేగింపు అంటే మాకు ప్రాణం. ప్రభ కట్టడం అనేది భక్తులు చెల్లించుకునే ఒక రకం మొక్కు. ఇది గ్రామ దేవతలకూ శివుడికీ చెల్లిస్తారు. వైష్ణవానికి లేదు. తెలంగా ణలో కూడా ఈ ఆచారం కనిపిస్తుంది. పాలకుర్తిలో సోమేశ్వరుడికీ మొక్కు చెల్లిస్తారు. కానీ యిక్కడి ప్రభలు ఎత్తు తక్కువవి. నరసరావుపేట చుట్టుపక్కల గ్రామాల నుంచి వచ్చే ప్రభలన్నీ ఉత్తాల తాలంగా కనిపించేవే. 'గణపవరం ప్రభ లాగా మంచి ఎత్తరి' అనడం కద్దు. మా నాన్నకు అభిమానులు పెట్టుకున్న ముద్దుపేరదే! అని నా కిటీవలే తెలిసింది. ఆయన ఆజానుబాహువు. ఎర్రని మేని ఛాయ, గుబురు మీసాలతో అంత ఎత్తు మనిషి, అందరిలోనూ భయభక్తులను సునా యాసంగా కలిగిస్తుండేవారు. ప్రభల్ని రంగురంగుల అలం కారాలతో ఎడ్లబండ్లపై కుదురుగా నిలిపి ముందుకు సాగించే వారు. ప్రభల ఊరేగింపు చూడడానికి మేమంతా త్వరత్వరగా భోజనాలు ముగించుకుని రాజాగారి కోటకు చేరేవాళ్లం. ఆ దృశ్యం మనోహరమైనది. కానీ ఈ ఊరేగింపులు ఎన్నో తగా దాలకూ పితూరీలకూ కారణా లవుతుండేవి. వాటి వల్ల అసా ముల మధ్య పగలు రేగేవి. ఒకరి ప్రభ మరొకరి ప్రభను మించకుండా చూచే పట్టుదల వల్ల ముఠాతగాదాలు చెలరేగేవి. ప్రభుత్వోద్యోగులకూ, పోలీసులకూ, ముఠాదార్లకూ ఘర్షణలు జరగడంవల్ల అమాయిక యాత్రికులు కష్టాలపాలు అవుతుండే వారు. ఇటువంటి సంఘటనలన్నీ సమకాలీన సామాజిక చరిత్ర నిర్మాణానికి తోడ్పడేవే. మా ఊరును గురించి వ్రాసే టప్పుడు కోటప్పనూ ఆయన కొండనూ తలవకుండా ఉండ లేము. ఒక్క మా ఊరికే కాదు; చుట్టుపక్కల నున్న గ్రామస్థులకీ ఈ కొండ తిరుపతికొండంత పెద్దది. దేవుడు వెంకన్న అంత దొడ్డదేవుడు.

ఇంతకూ ఈ విజ్ఞానయాత్రలు మనుషులతో అను బంధాలను పెంచాయి. కలిసికట్టుతనాన్ని నేర్పాయి. నా మటుకు నాకు మానవసంబంధాల విలువల్ని తెలియజేశా యనిపిస్తుంది. ఇది నా అనుభవం నేర్పిన విలువైన పాఠం. మా ఊళ్లో నేను జీవితానికి పనికివచ్చే ప్రథమపాఠాలు నేర్చుకున్నాను. సాహిత్యం మీదా సంస్కృతి మీదా అభిమానం పెంచుకున్నాను. నేను ఆరోతరగతిలో ఉన్నప్పుడు మిరప కాయలు, ఉప్పు, ఉల్లిపాయ, చింతపండు, వేరువేరు వస్తువు లైనా అన్నీ కలిసి అమ్మ చేతుల్లో రుచికరమైన సాంబారుగా మారిందనీ, కలిసికట్టుతనమే ఆమోదకరమైన విషయంగా మారుతుందని ఒక కథ వ్రాశాను. అదే నా తొలి కథ. నా సాహిత్యసృజన ఈ కథ ద్వారా మా ఊళ్లోనే తొలిసారిగా జరిగింది.

మా నాన్న గొప్ప కవి. మంచి మనిషి. అజాత శత్రువు. కవి పండిత వర్గంలో ఏ గుంపుకు చెందినవారైనా నాన్నను అభిమానించినవారే! ఇంచుమించు అందరూ ఏదో ఒక సందర్భాన మా స్కూలుకు వచ్చి మా యింట ఆతిథ్యం స్వీకరించినవారే! పుత్రికానిర్విశేషంగా నన్ను మన్నించి ఆశీ స్సులు కురిపించినవారే! అటువంటి అదృష్టం ఎందరికి కలుగుతుంది? మానాన్న సాహిత్యశేముషి, మానవతా పరిమళం నాకు వారసత్వంగా వచ్చిన సిరిసంపదలు. ఇట్లా ఎంతని వ్రాయను? ఇక ఆపేస్తాను.

(నరసరావుపేట ద్విశతాబ్ది ఉత్సవ సంచిక సౌజన్యంతో) ●

# ద్విశత నమస్కారాలు



డా॥ చేకూరి రామారావు
ప్రొఫెసర్ (రిటైర్డ్)

నరసరావుపేటలో నా నివాసం నాలుగేళ్లే (1946–'50). అయినా అర్ధశతాబ్దకాల అనుబంధం పెనవేసుకొని వుంది. నరసరావుపేట అనగానే ఎన్నెన్నో సంఘటనల మైలు రాళ్లు ఎదురవుతాయి. జ్ఞాపకాల జల్లులు కురుస్తాయి. అను భవాల చిరుగాలుల మృదుస్పర్శలు పులకింపజేస్తాయి.

సాహిత్యవేత్త లెందరినో కడుపులో దాచుకుని ఆదరిం చింది ఈ పట్టణం. భావకవితా భవనమూల స్తంభాల్లో ఒకరైన నాయని సుబ్బారావుగారు మొదలుకొని ఈ నాటి దళితాగ్రకవి మద్దూరి నగేష్‌బాబు వరకు నరసరావుపేట ఆశ్రయం పొందిన వారే! ఇక అభ్యుదయ కవితా చైతన్య రథసారథులు అనిసెట్టి సుబ్బారావు, కుందుర్తి ఆంజనేయులు, గంగినేని వెంకటేశ్వర రావు, రెంటాల గోపాలకృష్ణ నరసరావుపేట వీథుల్లో నడయా డినవారే! నలభయ్యేళ్లనాడు నాయని సుబ్బారావుగారు అంటుం డేవారు 'మీ అభ్యుదయకవులంతా నా శిష్యులేనోయ్' అని. అందుకేనేమో అనిసెట్టి సుబ్బారావుగారి కవిత్వంలో ఆ సౌకు మార్యం! కుందుర్తీ అంతే! కవిత్వ విలువల కోసం తెగ తపన పడేవాడు. ఈనాడు కుందుర్తి ఆంజనేయులుగారిని వచన కవితా పితామహు డంటారు. ఆ బిరుదుల మాటకేం గాని వచన కవితామార్గాన్ని సుగమం చేసిన కీర్తి ఆయనదే. ఇప్పు డంతగా ఎవరూ మాట్లాడటం లేదు గానీ గంగినేని వేంకటేశ్వర రావు తక్కువ చేశాడా? అటు కవిత్వంలోనూ ఇటు వచనం లోనూ సవ్యసాచిలా వీరవిహారం చేశాడు. తెలంగాణా విప్లవో ద్యమం తొలిదశను కుందుర్తి మహాకావ్యబద్ధం చేస్తే మలిదశను ఖండకావ్య కుసుమాలుగా వికసింపచేశాడు గంగినేని. తెలంగాణాలో ఊరూరా తిరిగి అమరవీరుల గాథలను సంగ్ర హించి ఎర్రజెండాలుగా ఎగురవేశాడు. అంతేకాదు అభ్యుదయ కవిత్వానికి గేయం ప్రధానవాహికగా ఉన్న రోజుల్లో ధైర్యంగా కావ్యస్థాయి తగ్గకుండా వచనకవితా మార్గాన్ని విస్తరింపచేసిన కవులలో గంగినేనికి సముచితస్థానం ఇయ్యాలి. సాహిత్య చరిత్రకారులు విస్మరించగూడని విషయం ఇది.

పులుపుల శివయ్యగారిది వినుకొండ పక్కన నర గాయపాలెం అయినా ఆయన కమ్యూనిస్టుపార్టీ నిర్మాణకార్య క్రమాల్లో తరచు నరసరావుపేటలో ఉండేవారు. ఆయన ఎంత పటిష్ఠ రాజకీయ కార్యాచరణచణుడో అంతటి కవితా నిర్మాణ చతురుడు. ఆయన పేరు చెపితే 'పలనాడు వెలలేని మాగా ణిరా...!' అనే పాట గుర్తురాక తప్పదు.

> బాలచంద్రుని కదన
> కౌశలము కథలల్లి
> శ్రీనాథ కవిరాజు
> చంద్రవంకకు చెప్ప
> ఎద కరిగి ప్రవహించెరా
> పలనాట ఎత్తిపోతల దూకెరా!

అన్న పాదాల్లో ఊహ ఎంత ప్రౌఢమైనది! చంద్రవంక అనే ఏరు ఎత్తిపోతల అనే జలపాతంగా దూకే చోటు చూసినప్పుడే భావకవులకు గుర్తువచ్చే కవితాచరణ మిది.

రెండు శతాబ్దాల నరసరావుపేట చరిత్ర రాయించాలే గానీ ఎన్నెన్ని అపూర్వ విషయాలు, చరిత్ర కెక్కాల్సినవి, బయట పడతాయో? ఆంధ్రభాషా సంస్కృతులను విశ్వవిజ్ఞాన వీథుల్లో విహరింపజేసిన (చేస్తున్న) త్రివేణి పత్రిక స్థాపకులు కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు నరసరావుపేటవారు. కందుకూరి వీరేశలింగంపై సమగ్రపరిశోధన చేసిన అక్కిరాజు రమాపతిరావు నరసరావుపేటవారు. ఇంకా ఇతర రంగాలలో ఎందరెందరు మహానుభావు లున్నారో!!

నా జీవితంలో నే నేర్పరచుకున్న కొన్ని అభిరుచులకు, ఆలోచనలకు బీజం నరసరావుపేటలోనే పడిందనుకుంటా.

పురపాలకోన్నత పాఠశాలలో పైతరగతులు చదివాను. అప్పుడు మాకు పాఠాలు చెప్పిన తెలుగు పండితులు లంకా సీతారామశాస్త్రిగారు గొప్ప సంస్కృతపండితులు. ఆయన తరువాత పండితులు భాగవతుల సుబ్బారావుగారు. వీ రిద్దరూ తెలుగు సాహిత్యంపై ప్రేమ, శబ్ద సౌష్ఠవంపై గౌరవం నాలో కలిగించారు.

నరసరావుపేట మునిసిపల్ లైబ్రరీలో 1949లో మొదటిసారి ఆనందవాణి సంచికలు చూశాను. అందులో ఆ సంవత్సరమే అచ్చయిన అనిసెట్టి అగ్నివీణ, ఆరుద్ర త్వమేవాஉహమ్, సోమసుందర్ వజ్రాయుధం అనే కావ్యాలపై ఒక వ్యాసం చదివాను. ఆ తరువాత ఆ మూడు పుస్తకాలు కొనుక్కొని చదివాను. ఆధునిక సాహిత్యంలో అదే నా పరిచయం. దాన్ని అభిమానించటం ప్రారంభించాను.

అదే రోజుల్లో (1950) హైస్కూలు వార్షికోత్సవం సందర్భంగా ఫ్యాన్సీ డ్రెస్ పోటీల్లో అప్పటి ఎం.ఎల్.ఏ. కాసు బ్రహ్మానందరెడ్డిగారి సమక్షంలో వేషం కట్టి నటించాను. అందులో బహుమతిగా లభించిన తిక్కన నిర్వచనోత్తర రామాయణం పూర్తిగా చదవటం వల్ల ప్రాచీన సాహిత్యంపై ప్రేమ కలిగింది.

అదే సంవత్సరం హైస్కూలులో సైన్సు ప్రదర్శనలో ఒక అనుభవాన్ని గీతపద్యాల్లో పెట్టడానికి ప్రయత్నించాను. అవేవీ గుర్తులేవు. 'సరస సద్గుణశీల సుశీల యనియె' అనే యతి కుదరని పాదం ఒక్కటే గుర్తు. ఈ పాదాన్ని బట్టి విషయం స్థాయి ఊహించుకోవచ్చు. బహుశా ఇదే నా మొదటి రచన కావచ్చు. కవితోహల ప్రారంభం నరసరావుపేటలోనే జరిగిం దన్నమాట!

అప్పుడు నరసరావుపేటలో 1946-1949 సంవత్సరాల మధ్య మా మేనత్త కొడుకు నీరుకొండ వెంకయ్యగారుండేవారు. ఆయన ఇంట్లో ఉండి చదువుకునేవాణ్ణి. ఆయన దినపత్రిక ప్రజాశక్తి వేయించుకునేవాడు. నేను క్షుణ్ణంగా చదివేవాణ్ణి. తెలంగాణ పోరాటగాథలు చదువుతుండేవాణ్ణి. రామిరెడ్డిపేట నుండి మునిసిపల్ హైస్కూల్‌కు ఏంజల్ టాకీసు (అది ఒక్కటే అప్పుడు సినిమాహాలు) మీదుగా వెళ్లేదారిలో కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు ఉండేది. తరచుగా ఆఫీసుకు వెళ్లి 'బాలసంఘ సభ్యులం, భరతమాత పుత్రులం...' అని పాటలు నేర్చుకునేవాళ్లం. అదే ఆఫీసు నుంచి ఏవేవో పుస్తకాలు తెచ్చుకొని చదువుకుంటుండేవాణ్ణి. అదే లైనులో ఉన్న కాజ సుబ్బారావు అని ఒక ఓవర్సీర్‌గారి కుటుంబంతో పరిచయం అయింది. అది కమ్యూనిస్టు కుటుంబం. ఆ కుటుంబం వారితో కమ్యూనిస్టు రాజకీయాలు మాట్లాడటం అలవాటయింది. 1949లో అనుకుంటా. వారి అల్లుడు దండా నారాయణస్వామిగారని చిలకలూరిపేట కమ్యూనిస్టు నాయకుడు అప్పుడు అజ్ఞాతవాసంలో ఉన్న కుటుంబంతో నా కున్న సాన్నిహిత్యం వల్ల నాతో మాట్లాడేవారు. ఆయన నాకు అర్థమయ్యే భాషలో భౌతికవాద దృక్పథానికి, మార్క్సిస్టు ఆలోచనా విధానానికి, వామపక్ష రాజకీయాలతో సంబంధాలకు బీజాలు నరసరావుపేటలోనే పడ్డాయి.

అప్పటి హైస్కూలులో ఇంతకు ముందే పేర్కొన్నవారు గాక బొప్పూడి వేంకట్రావుగారు, అన్నంభొట్ల సూర్యనారాయణ గారు, హరికథకులైనా సైన్సు బోధించిన కురంగేశ్వరరావు గారు, రాయలసీమ యాసలో జాగ్రఫీ పాఠం చెప్పిన ఎన్.సి. ఆంజనేయులుగారు మా ఉపాధ్యాయులు. వారు మాపై ఎంత శ్రద్ధ వహించారో మాకు ఎంత ప్రేమానురాగాలు పంచేవారో ఇప్పటి వారికి చెప్పినా అర్థంకాదు. ఒక చిన్న ఉదాహరణ : కురంగేశ్వరరావుగారి భార్య పొద్దుచూడనిదే అన్నం తినేవారు కాదు. అంట్ల గిన్నె అంటుకున్నానన్న అనుమానంతో రోజుకు అరడజను సార్లు స్నానం చేసేవారు. వారితోపాటు ఒకసారి కోటప్పకొండకు వెళ్లాను. అంతటి నిష్ఠాపరురాలు కొండమీద బ్రాహ్మణులకు మాత్రమే ఏర్పాటయిన సత్రంలో బ్రాహ్మణేతరుణ్ణయిన నన్ను తన పిల్లలతోపాటు పక్కన కూర్చోబెట్టుకొని అన్నం తినిపించారు. అవీ ఆనాటి గురుశిష్యానుబంధాలంటే!

నా వ్యక్తిత్వవికాసానికి బీజావాపం చేసిన నరసరావుపేట నా జీవితగమనానికి మూలశక్తి. అందుకు కృతజ్ఞతా పూర్వక నమస్కారాలు. ద్విశత నమస్కారాలు.

(నరసరావుపేట ద్విశతాబ్ది ఉత్సవ ప్రత్యేకసంచిక సౌజన్యంతో...)

# అనుభూతి, అనుభవాలు



## జి.వి.ఎల్. నరసింహారావు

బి.జె.పి. పార్టీ జాతీయ అధికార ప్రతినిధి

ప్రస్తుతం భారతీయ జనతాపార్టీ జాతీయ అధికార ప్రతినిధిగా ఉన్న నేను ఓనమాల దగ్గరినుంచి ఇంటర్మీడియట్ వరకు నరసరావుపేటలోనే విద్యాభ్యాసం చేశాను. ఉద్యోగరీత్యా మా నాన్నగారు గుంటుపల్లి వేంకటేశ్వరరావుగారు ఇక్కడ ఎస్.ఎస్. & ఎన్. కళాశాలలో తెలుగు అధ్యాపకులుగా కొన్ని దశాబ్దాలపాటు పనిచేసి స్థిరపడ్డారు. పై చదువుల నిమిత్తం రాష్ట్రం బయటకు వచ్చి గత 26 సంవత్సరములుగా నేను ఢిల్లీలో స్థిరపడినప్పటికీ నాకు ఆత్మీయ అనుబంధం మాత్రం నరసరావుపేటతోనే!

నేను ప్రముఖపత్రికలైన 'టైమ్స్ ఆఫ్ ఇండియా', 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్', 'ఇండియా టుడే', 'ఈనాడు'లలో లోక్‌సభ, అసెంబ్లీ ఎన్నికల ఫలితాలను ఒపీనియన్ పోల్స్ ద్వారా అంచనా వేసి, దేశస్థాయిలో ఎన్నికల విశ్లేషకుడిగా గుర్తింపు సాధించాను. అలాగే దూరదర్శన్, జీ న్యూస్, ఇంకా అనేక ప్రైవేట్ ఛానళ్లలో ఎన్నికల అంచనాలు, విశ్లేషణ చేసి మంచి పేరు పొందాను. 'మింట్' అనే పత్రికలో రాజకీయ విశ్లేషకుడిగా రెండు సంవత్సరములు ప్రతివారం వ్యాసరచన చేసేవాడిని. ఈ నేపథ్యంలో శ్రీ లాల్‌కృష్ణ అద్వాని, శ్రీనరేంద్ర మోడి, శ్రీ వెంకయ్యానాయుడు, శ్రీచంద్రబాబు నాయుడు వంటి రాజకీయ ప్రముఖులతో పరిచయాలు ఏర్పడ్డాయి. 2009 నుండి మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శివరాజ్‌సింగ్ చౌహాన్‌గారికి మీడియా సలహాదారుగా రాష్ట్రమంత్రి హోదాలో పనిచేస్తున్నాను. అలాగే అసెంబ్లీ, లోక్‌సభ ఎన్నికల నిర్వహణలో పార్టీలో ప్రముఖపాత్ర నిర్వహించాను. ప్రతిరోజూ జాతీయ టి.వి. ఛానల్స్‌లో పార్టీ అభిప్రాయాలను ఆలోచనా ధోరణిని ప్రజల ముందు ఉంచుతున్నాను.

1964 సంవత్సరములో జన్మించిన నేను ఐదవ తరగతి వరకు సిద్ధార్థ ప్రాథమిక పాఠశాలలో, పదవ తరగతి వరకు మున్సిపల్ హైస్కూలులో, తర్వాత ఇంటర్మీడియట్ వరకు ఎస్.ఎస్. & ఎన్. కళాశాలలో చదివాను. మా కళాశాల నుంచి అగ్రికల్చర్ బి.ఎస్‌సి.లో బాపట్లలో నాకు ఒక్కడికే సీటు లభించింది. బాపట్లలో చదువుతున్న నాకు ఇంక చదవవలసినది, చేయవలసినది చాలా ఉన్నది అని అర్థం అయ్యింది. ఈ దృక్పథంతో పై చదువులపై దృష్టి సారించి నేను గుజరాత్‌లోని ఇర్మా (ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రూరల్ మేనేజ్‌మెంట్)లో ఎం.బి.ఎ.లో సీటు సాధించాను. అంత మంచి సంస్థలో చదువుతున్నాను కాబట్టి జీవితంలో స్థిరపడినట్లే అని మిత్రులు ప్రశంసించారు. నేను మాత్రం ఎప్పుడూ సంతృప్తి చెందలేదు. ఆ ప్రస్థానం ఇంకా కొనసాగుతూనే ఉన్నది.

చదువుతో పాటు నాటకరంగంలో నాకు మంచి ఆసక్తి ఉండేది. జంధ్యాలగారు రచించిన 'ఏక్ దిన్ కా సుల్తాన్' మరియు 'గుండెలు మార్చబడును' వంటి హాస్యనాటికలలో ప్రధానపాత్ర పోషించి ప్రథమబహుమతి సాధించాను. పాఠశాల నుండి విశ్వవిద్యాలయం వరకు అనేక నాటకాలలో ముఖ్య పాత్రధారుడిగా నటించడమే కాకుండా నిర్దేశన ముఖ్య అభిరుచిగా ఉండేది. పాటలు పాడటం, మిమిక్రీ వంటివి కూడా అభిరుచులుగా ఉండేవి. నాటకరంగంలో పేరొందిన 'రంగస్థలి' మన ఊరిది కావటం గర్వించతగిన విషయం. నా బాల్యమిత్రులైన రమణ, భాషా, మీరయ్య కూడా ఇందులో ప్రముఖపాత్ర పోషించారు. అదే సంస్థవారు నాకు జరిపిన సన్మానం నిజంగా మరువలేనిది. నా సతీమణి మైథిలి, మా పిల్లలు విశాల్, వినీల్‌లతో కలిసి అనేకసార్లు నరసరావుపేట రావడం జరిగింది. మా పిల్లలకి నేను చదివిన స్కూలు, కళాశాల చూపించి గత స్మృతులను గుర్తుచేసుకోవడమే కాకుండా కుటుంబంతో సహా 'రంగస్థలి' కార్యక్రమానికి రావటం జరిగింది. మా నాన్నగారు గుంటుపల్లి వేంకటేశ్వర

రావుగారు మంచిమనిషిగా, విద్యావేత్తగా ఊరి పెద్దలందరికీ సుపరిచితులే! ఆయన తన స్వంతగ్రామం బల్లికురవ పంచాయితీకి నిరవధికంగా మూడు దశాబ్దాలపాటు పంచాయితీ ప్రెసిడెంట్‌గా బాధ్యతలు నిర్వర్తించారు. సంతమాగులూరు సమితి ప్రెసిడెంట్‌గానూ కొంతకాలం పనిచేశారు. నాకు ఐదుగురు అన్నదమ్ములు, ముగ్గురు అక్కచెల్లెళ్లు. మాది చాలా పెద్ద కుటుంబం. మా కుటుంబసభ్యులందరూ మా అమ్మగారితో సహా హైదారాబాద్‌లోనే స్థిరపడ్డారు. నే నొకొక్కడినే చదువురీత్యా, ఉద్యోగరీత్యా ఢిల్లీ వెళ్లి స్థిరపడుట జరిగింది.

ప్రస్తుతం నివసించే ఢిల్లీలో మాట్లాడే భాష హిందీ. చిన్నతనంలో జరిగిన కొన్నివిషయాలు గుర్తుకొచ్చినప్పుడల్లా నవ్వు తెప్పిస్తాయి. చిన్నతనంలో కూడా నాకు హిందీ మీద కొంత ఆసక్తి ఉండేది. కాని నా తరగతిలోని అనేకమంది విద్యార్థులకు హిందీ అంటే భయం. మిగతా సబ్జక్టులలో 35% పాస్ మార్కులైతే హిందీలో కేవలం 20% మాత్రమే! పాసవడం కోసం కొంతమంది విద్యార్థులు పడేపాట్లు ఇప్పటికీ మర్చిపోలేనివి. పరీక్షపేపరులో 20 మార్కులకు వ్యాసం వుండేది. అందులో దాదాపు ప్రతిసారి దీపావళి మీదనో, ఆవు మీదనో వ్యాసం రాయమని అడిగేవారు. ఒకసారి పేపరులో 'దీపావళి', 'ఆవు'లపై వ్యాసం అని కాకుండా 'ఏక్ త్యోహార్' 'ఏక్ జానవర్' (ఒక జంతువు)లపై వ్యాసం రాయమని అడిగారు. చాలామంది ఏదో తెలియని, క్రొత్త వ్యాసం అడిగారని వదిలేసి వచ్చారు. 'అరేయ్! 'దీపావళి' కానీ, 'ఆవు' కానీ పేపర్‌లో వచ్చిందా?' అని కొంతమంది వెనుకనుంచి అరిచేవారు. ఈ విషయాలు జ్ఞాపకం వచ్చినపుడల్లా నవ్వు వస్తుంది.

నాకు సినిమాలంటే చిన్నప్పటి నుంచి చాల ఆసక్తి. అన్నయ్యలతో బాల్యమిత్రులతో కలిసి తరచూసినిమాలకి వెళ్లేవాడిని. నరసరావుపేటలో నాలుగు దిశల్లో ఏంజల్‌టాకీస్, సత్యనారాయణటాకీస్, నాగూర్‌వలి టాకీస్, వేంకటేశ్వర పిక్చర్ ప్యాలెస్ అని నాలుగు సినిమాహాళ్లే ఉండేవి. నా కాలేజీ చదువు పూర్తి అయిన తర్వాతే క్రొత్త సినిమా హాళ్ల నిర్మాణం జరిగింది. చిన్నతనంలో గాంధీపార్కు ఫౌంటెన్ దగ్గర ఆడుకుంటూ ఉంటే తగిలిన గాయం గుర్తు ఇప్పటికీ మచ్చగానే మిగిలి ఉంది. నేను కాలేజీ చదువుకునే రోజుల్లో ఇక్బాల్, రామారావు, పానకాలుతో కలిసి ప్రతిరోజు ఊరి సెంటర్‌కు, గడియార స్తంభం వరకు నడచి వెళ్లి మిగతా మిత్రులందరితో కలిసి పిచ్చాపాటి మాట్లాడుకునే వాళ్లం. ఆ రోజులన్నీ చాలా ఆనందంగా గడిచిపోయాయి. అతిసన్నిహితుడైన రామారావు 2 సంవత్సరాల క్రితం అనారోగ్యంతో కాలంచేయటం ఒక బాధాకరమైన విషయం.

మన ఊరికి మరో మకుటం రైల్వేస్టేషన్. 1990 సం॥ తర్వాత మన ఊరికి మొదటిసారి అమరావతి ఎక్స్‌ప్రెస్ రావటం జరిగింది. పెద్దసంఖ్యలో ప్రజలు, విద్యార్థులు, అధ్యాపకులు రైలు ఎలా ఉంటుందో, అందులో బెర్తులు ఎలా అమర్చి ఉంటాయో చూడటానికి వెళ్లారు. అనేక దశాబ్దాలపాటు నరసరావుపేట అభివృద్ధి చెందకపోవటానికి కారణం మన రైల్వేలైనును బ్రాడ్‌గేజ్ చేయకపోవటమే! అందుకే రైలు రాకపోకలు పరిమితంగా ఉండేవి. కొత్తరాష్ట్రం ఏర్పడ్డాక, కొత్తరాజధాని అమరావతి స్థాపించే సమయానికి మన రైల్వే అభివృద్ధి చెందుతుందని ఆశిస్తాను.

కన్నతల్లి, సొంత ఊరు జీవితకాలంలో మరువలేనివి. మన పైన తల్లిదండ్రుల ప్రభావం ఎంత ఉంటుందో, పీల్చిన గాలి, నడచిన నేల, మన పరిసరాలు మన పైన అంతే ప్రభావం చూపిస్తాయి. మన ఆత్మీయులను చాలకాలం తర్వాత చూస్తే ఎంత ఆనందం కలుగుతుందో అదే అనుభూతి ప్రతిసారి మన ఊరిలో అడుగుపెట్టినప్పుడు నాకు కలిగేది. చాలా కాలం తర్వాత మన ఊరికి వచ్చిన ప్రతిసారి ఊరిలో ప్రవేశిస్తూనే ఆతృతగా అన్ని పరిసరాలు గమనించేవాడిని. శతాబ్ది వేడుకలు జరుపుకుంటున్న మన ఊరు నరసరావుపేట దేదీప్యమానంగా అభివృద్ధి చెందాలని మరెన్నో వేడుకలు జరుపుకోవాలని ఆశిస్తున్నాను.

# నందామ శరదశ్శతమ్...



డా॥ అక్కిరాజు రమాపతిరావు
తెలుగు అకాడమి డిప్యూటీ డైరెక్టర్ (రిటైర్డ్)

'నందామ శరదశ్శతమ్'- ఇది వేదవాక్కు. ఉపనిషత్ప్రతిపాదిత హృదయస్పృక్కు మానవుడు ఉపాసించాల్సిన ఋక్కు. నూరేళ్లు జీవించటం కోరుకోవాలి అని భావం.

నరసరావుపేటను తలచుకొంటే అది నాకు అందమైన కల. స్వప్నపులకిత భావోద్విగ్న హృదయ నిమగ్నత. అక్కడి కోటప్పకొండ తిరునాళ్లు, శ్రీరామనవమి ఉత్సవాలు, కోటబజారు, రైల్వేస్టేషన్, పల్నాటి రోడ్డు, చవితి వేడుకలు, పాతూరి శివాలయం, ఆ శివాలయంలో అమ్మవారి అవతారాలు- ఎవరైనా మరచిపోగలరా?

చాలా ఊళ్లకంటే నరసరావుపేటకు ముందుగా విద్యుత్ ప్రసారసౌకర్యం కలిగింది. చాలా చోట్లకంటే అక్కడికే ముందుగా ఉన్నతపాఠశాల వచ్చింది. అది వేల సంఖ్యలో ప్రతిభావంతులను సృష్టించింది.

నేషనల్ హెరాల్డ్ సంపాదకుడు శ్రీ ఎం. చలపతిరావు, శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు గారిని చూడటానికి నాతో ఢిల్లీలో ప్రస్తావించారు. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు నరసరావుపేటకు రావటం, స్వాతంత్ర్యోద్యమ సభలలో ప్రసంగించటం నేను మూడు నాలుగు సార్లు చూశాను. నా చిన్నతనంలో - అంటే నాకు తొమ్మిది పదేళ్ల వయసున సుభాస్ చంద్రబోస్ ముఖ్య అనుయాయులు ఎవరో మన ఊరు వచ్చి రహస్య సమావేశం ఇక్కడి యువకులతో జరుపుతున్నాడని ఒక సంచలనాత్మక వార్త విని వాళ్లెవరో చూడాలని తహతహ చెందటం నా కింకా బాగా గుర్తుంది. వీరు అన్నాప్రగడ కామేశ్వరరావుగారే మరి!

ఒకసారి మన హైస్కూల్లో గొప్పకవి సమ్మేళనం జరిగింది. మహామహులెందరో వచ్చారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, దీపాల పిచ్చయ్యశాస్త్రి, 'కవికోకిల జాషువా, ఇంకా కొందరు స్థానికకవులు అందులో పాల్గొన్నారు. కొప్పరపు కవులకూ, తిరుమతి వేంకటకవులకూ మధ్య జరిగిన సాహిత్యసమర వివాదాలలో నరసరావుపేట ప్రధానభూమిక నిర్వహించింది. అదంతా ఒక కమనీయ పురాగాథ. గుడిపాటి వేంకటచలం అనే సమాజ సంచలనాత్మక రచయిత నరసరావుపేటలో విద్యాశాఖాధికారిగా కొంతకాలం పనిచేశాడు. చావలివారివీథిలో బుల్లెమ్మ హోటల్ అని ఒక బ్రాహ్మణభోజన వసతి సౌకర్యనిలయం ఉండేది. అక్కడ చలం భోజనం చేసేవాడు.

'వెంచాశా' అనే పేరుతో స్వాతంత్ర్య పూర్వం రెండు దశాబ్దాలు, స్వాతంత్ర్యానంతరం రెండు దశాబ్దాలు ప్రతిభావంతుడైన కథారచయితగా గుర్తింపు పొందిన వీరు నరసరావుపేట మునిసిపల్ హైస్కూల్‌లో చదువుకున్నవారే! నా చిన్నతనంలో మన హైస్కూలు విశాలావరణంలో రాజకీయ సంచలనసభలు, స్వాతంత్ర్యోద్యమ సన్నాహక ప్రబోధాలు చేయటానికి అఖిల భారతస్థాయి ప్రముఖులెందరో వచ్చేవారు. ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు పి.సి. జోషి ఒకసారి నరసరావుపేటకు వచ్చారు. అప్పుడు హైస్కూలు ముందో, ఆవరణలోనో బహిరంగసభ జరిగింది.

ఇక మా కుటుంబం నుంచి, విస్తృత కుటుంబ బంధువుల నుంచి నూరుగురైనా మన మునిసిపల్ హైస్కూలులో చదువుకొని ఉంటారు. ప్రపంచంలోని ఐదు ఖండాలలోని మూడు ఖండాలలో వేణునాద ప్రజ్ఞావైభవాన్ని కనబరచి, ఎన్నో సంగీతకచేరీలు నిర్వహించిన ఏల్చూరి విజయరాఘవరావు మన హైస్కూలు ప్రఖ్యాత విద్యార్థి! వీరి అన్నగారే సుబ్రహ్మణ్యం గారు. మహాత్మాగాంధీ హత్య దిగ్భ్రమవేళ ఢిల్లీ ఆకాశవాణి నుంచి విషాద నివాళి రూపకల్పన చేసింది మన విజయరాఘవరావుగారే! 'భువన్‌షోమ్' అనే ప్రసిద్ధ ప్రయోగాత్మక

చలనచిత్రానికి సంగీత దర్శకత్వం విజయరాఘవరావు గారిదే!

ఈనాటి అభ్యుదయకవులలో విశిష్టుడు అనిసెట్టి సుబ్బారావు మన ఊరి మహనీయుడే! 'వచ్చాను వచ్చాను వ్యాససంతతివాణ్ణి' అని తన సంప్రదాయ భారతికి నివాళ్ళు లర్పించినవాడు. 'నిదురపోరా తమ్ముడా!... అనే సినిమాపాట ఈయన రాసిందే! లతామంగేష్కర్ ఆ పాట పాడింది. మెప్పులందుకుంది. ఈ సుబ్బారావు ఎంతో ప్రేమాభిమాన పూర్వకంగా 1972లో ఒక లేఖ రాశాడు మద్రాసు నుంచి. అప్పుడు అభ్యుదయ సాహిత్యఉద్యమంలో ఏవో చీలికలు వచ్చాయి. 'మనం ఒకటి' అని ఆయన నాకు రాసిన జ్ఞాపకం.

శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు మన స్కూల్లో చదివినవారే! నన్ను తమ్ము డంటుంది. ఆమె, మేము నాయని సుబ్బారావుగారి శతజయంతి హైదరాబాద్‌లో ఉత్తేజకరంగా నిర్వహించాము. ఈమె ఉత్తరాలు కూడా నా దగ్గర రెండో మూడో ఉండవచ్చు. నాయని సుబ్బారావుగారి కుమారుడు మోహనరావు నాకు హైస్కూలులో ఐదారు సంవత్సరాలు సహపాఠి. మేష్టారి ఇంకా ముగ్గురు పిల్లలు కూడా మన స్కూల్లోనే చదివారు.

అసలు ఆ రోజుల్లో నిఖిలాంధ్రదేశంలోనూ నాయని సుబ్బారావుగారి వంటి హెడ్‌మాస్టర్ గారెవరూ లేరని, ఉండరని చెప్పాలి. చేకూరి రామారావు కూడా మన హైస్కూల్లో కొన్ని తరగతులు చదివినవాడే!

మన హైస్కూలుకు కొన్ని సంవత్సరాలు హెడ్ మాష్టర్‌గా పనిచేసిన శ్రీ ఎన్.సి. ఆంజనేయులుగారు నన్ను చూడటానికి ఖైరతాబాదులో మేముంటున్న మా ఇంటికి వచ్చారు. ఆ ప్రేమాభిమానాలు, ఆప్యాయతలు, అనురాగాలు ఇప్పుడు ఈ తరం వారికి ఉన్నాయో లేవో?

మన నరసరావుపేట మునిసిపల్ హైస్కూలు గుర్చి తలచుకున్నప్పుడు ఇటువంటి భావోద్వేగం కలుగుతుంది. మన ఊరి శ్రీరామనవమి ఉత్సవాలు, పీర్లపండుగలు మన మునిసిపాలిటీ రాజకీయాలు, చెప్పాల్సివస్తే ఇంకా పెద్ద చరిత్ర ఈ సంతోషవేళ రాయాల్సి ఉంటుంది. ఇప్పటికిది చాలు. మన స్కూలు, మనందరి స్కూలు ఇంకో వెయ్యేళ్లు వర్ధిల్లుగాక!!

## గారెల వీరులు

ఇప్పుడు మల్లమ్మసెంటర్‌లో మండవ వేంకటరెడ్డిశ్రేష్ఠిగారిల్లు ఉన్నది గదా! దాని 'గృహప్రవేశం' నాటి ముచ్చట.

శ్రేష్ఠిగారు బంధుమిత్రాదుల్ని భోజనాలకు పిలిచారు. బేతనభొట్ల సుబ్బయ్యగారు వంట. పోలేపెద్ది మాచమ్మగారు, ఆమె తమ్ముడు ప్రఖ్యా పాపయ్యగారు, కప్పగంతుల హనుమయ్యగారు సుబ్బయ్యగారికి సహాయంగా వచ్చారు.



వంట పూర్తైఇంది. పిండివంట గారెలు. ఒక్కొక్కటీ అరచేతి మందాన వుండి ఘుమఘుమ లాడుతున్నై. రావలసినవా రందరూ ఇంకా రాలేదు. 'ఒక గంట ఆగుదా!' మన్నారు శ్రేష్ఠిగారు. అక్కడ మొదలైంది గమ్మత్తు. పాపయ్య, హనుమయ్య గారెల గంగాళం దగ్గర కూర్చొన్నారు. హనుమయ్యా! ఎన్ని తింటా?' వన్నాడు పాపయ్య. 'వంద' అన్నాడు హనుమయ్య.'నేను నూటపాతిక!'అన్నాడు పాపయ్య. అంకెలు పెరుగుతున్నై. హనుమయ్య నూటడెబ్బై, పాపయ్య రెండు వందలు తిన్నారు!

'వడ్డన ప్రారంభించవచ్చు...' నంటూ శ్రేష్ఠిగారు వంటింట్లోకి వచ్చారు. గంగాళం ఒకటి ఖాళీగా వుంది. జరిగింది విన్నారు. 'మీరు కమ్మగా తిన్నందుకు నాకు తృప్తి!' అన్నారు. మనస్ఫూర్తిగా ఆనందించారు. ఐంతికి మరేదో పదార్థం చేయించారు. కార్యక్రమం చక్కగా ముగిసింది.

దీనికి కొసమెరుపు ఏమిటీ అంటే... 170 తిన్న హనుమయ్య అరిగించుకోవటానికి నానాయాతనలు పడ్డాడు. 200 తిన్న పాపయ్య వడ్డనపని గూడా పూర్తిచేసి ఆడుతూ పాడుతూ ఇంటికి వెళ్లాడు.

# సరదా సరదాగా...



ఆచార్య పోతుకూచి దక్షిణామూర్తి

ప్రొఫెసర్, జె.ఎన్.టి.యు., కాకినాడ.

నేను 1958వ సంవత్సరంలో జన్మించాను. 1966 సం॥లో 5వ తరగతి ప్రవేశంతో పెనుగొండ భ్రమరాంబ ప్రాథమిక పాఠశాలలో (దీనినే సినిమాహాల్ బడి లేదా భ్రమరాంబ స్కూల్ అనేవాళ్లు) మొదలైన నా విద్యాప్రస్థానం మేరీ టీచరుగారి పెద్దక్క వాత్సల్యాన్ని, రుక్మిణమ్మ, పిచ్చయ్య శాస్త్రిగార్ల శిక్షణాసౌరభాలను రుచిచూసింది. 6వ తరగతి కోసమై పురపాలకోన్నత పాఠశాలలో ప్రవేశం, జాలారెడ్డి మాష్టారి ఆంగ్లవ్యాకరణ సుశిక్షణా తరగతులు, గోపరాజువారి ప్రస్ఫుట శాస్త్రవిజ్ఞాన బోధనలే భవిష్యత్ విద్యాప్రణాళికా బీజాలై సంతరించాయి. హయ్యర్ క్లాసుల్లో గడ్డం వేంకటేశ్వర్లుగారి శిష్యవాత్సల్యపూరిత గణితశాస్త్ర శిక్షణారీతులు వైజ్ఞానిక శాస్త్ర అధ్యయనం వైపు పురికొల్పాయి. మిత్రులతో ఆ నాటి హైస్కూలు చింతచెట్టు క్రింద ఇసుక మైదానంలో ఆడిన 'గుఱ్ఱా లాట', 'వంగుడు దూకుళ్లూ' ఆ నాటి క్రీడా శిక్షణాత్రయమైన ఆశీర్వాదం, బాలు, వేంకటేశ్వరరావు మాస్టార్ల కఠోరదీక్షయే ఈ దేహంలో మిగిలిన దారుఢ్యానికి కారణభూతమై నిలిచింది. 1971-'72 విద్యాసంవత్సరంలో 4వ బ్యాచ్, 10వ తరగతి పరీక్షల్లో స్కూలు 2వ ర్యాంకు పొందడానికి కూడా ఆ తరం ఉపాధ్యాయుల అకుంఠితదీక్షయే కారణం.

తర్వాత జరిగిన శ్రీసుబ్బరాయ & నారాయణ కళాశాలలో విద్యాభ్యాస, శిక్షణ సమయాలలో చల్లా వేంకటేశ్వర్లు గారి అనితరసాధ్యమైన సులభతర భౌతికశాస్త్ర బోధనలు, మోహనరావుగారి సృజనాత్మక రసాయనశాస్త్ర పాఠ్యాంశాల చర్చలు, ఆ యా శాస్త్రాల్లో ఉన్నతవిద్యాభ్యాసానికి దారి చూపించాయి. పాఠశాల విద్యాభ్యాస కాలంలో ఆస్వాదించిన ఏలియా మాష్టారి పద్య పఠనా వైదుష్యం, కళాశాల విద్యాభ్యాస కాలంలో అనుభవించిన మద్దులపల్లివారి మృదుమధుర పద్య పఠనా శైలి, గడియారం వేంకట జోగారావుగారి ఆంగ్లనాటక పాఠ్యాంశాల ఆవిష్కరణలు మధురస్మృతులు.

మా పెదనాన్నగారైన వేంకటశాస్త్రిగారు నన్ను భారతీయ తత్వశాస్త్ర భావాలవైపు మళ్లించారు. ఆ తర్వాత కాలంలో జరిగిన కళాశాల బి.ఎస్‌సి. భౌతికశాస్త్ర విద్యాభ్యాసాలలోను, నాగార్జున విశ్వవిద్యాలయంలో కమ్యూటర్‌గా సాగించిన ఎమ్.ఎస్‌సి., పిహెచ్.డి. విద్యాభ్యాసాలలోనూ ఈ తత్వశాస్త్ర సైద్ధాంతిక విధానలే ఎంతగానో ఉపకరించాయి.

కోటిలింగంగారి పార్కు (ప్రస్తుతం చెరువు మీద నిర్మించిన విజయచాముండేశ్వరీ దేవస్థాన ప్రదేశం) మూడు బావులలోని బొక్కలబావిలో తాగాణీ మీద నుంచి దూకిన ఈతలు, ఎన్.ఎస్.పి. కెనాల్ వచ్చిన కొత్తలో థర్డ్ డ్రాప్ దగ్గర ఈతలు జ్ఞాపకాల్ని సంతరించుకున్నాయి. శెలవుల్లో ఎక్కువ కాలం రామిరెడ్డిపేటలోని మా వీథిలో ఉన్న ఆంజనేయస్వామిగుడి బండ సమావేశాల్లోనూ, దగ్గర్లో ఉన్న ఎస్.ఎస్.&ఎన్. కాలేజీ క్రీడాప్రాంగణంలోనూ గడిపేవాళ్లం. అన్నట్లు చెప్పడం మరిచాను. ఆ రోజులలో హైస్కూల్లో నా కొక చమత్కారి మిత్రుడు బిజిలి అనే అత నుండే వాడు. ఒక రోజున పాతఇనుము కొని మిఠాయి ఇచ్చే వ్యాపారి వచ్చాడు. వానితో ఈ చమత్కారి చాలాసేపే బేరసారాలు చేసాడు. మధ్యలో వస్తువు చాలా పెద్దది, అందుచేత ఎక్కువ ఎత్తులు మిఠాయి ఇవ్వమని ప్రలోభపెట్టి కాస్తంత రుచి చూసాడు కూడా! తీరా బేరం కుదిరాక వస్తువు ఏంటా అని అందరం ఎదురుచూస్తోన్న సమయంలో అక్కడే పడివున్న చాలా పెద్ద విద్యుత్‌స్తంభం చూపటం జరిగింది. అవాక్కయిన ఆ వ్యాపారి వెనక్కి చూడకుండా ఉడాయించాడు. కాలేజీ క్రీడాప్రాంగణంలో ఆనాటి 'లైట్ మేకప్' కార్యక్రమాలు, అందుకై తయారు చేయబడిన దేశవాళీ రంగులు తల్చుకుంటే నవ్వొస్తుంది. ఈ 'లైట్‌మేకప్' కార్యక్రమాల నేపథ్యంలో ఉద్భవించిన ఫ్రాంక్లీ, ఫటస్థలి, జింగిర్లు, లటస్థర-లాంటి పడికట్టు పదాలు, లాడ్డా, డోజిగ్, రవ్వూఫ్‌లాంటి వ్యక్తీకరణలు మర్చిపోలేని జ్ఞాపకాలు.

ఆర్.డి.ఓ. ఆఫీసు ఎదురుగా కుడివైపు బాటమీద ఎత్తైన ప్రదేశం బడాయిగడ్డ. దీని ప్రస్తావన ముదావహమైనది.

ఎన్నిచెప్పినా ఆనాటి నరసరావుపేటమండల ప్రాంతం రైతాంగానికి గరువు నేలల్లో వర్షాభావ పరిస్థితుల వల్ల ఏర్పడిన బాధలు, ఆ 'బ్రహ్మ'దేవుడి చతురతతో తోడ్కొచ్చిన నాగార్జున సాగరు పంటపొలాల జలాలు, మంచినీళ్లకు ఇబ్బందిపడిన ఈ ప్రజానీకాన్ని ఆంధ్రరాష్ట్రంలో నిర్విరామంగా మంచినీటి సరఫరా చేసే ఏకైక మున్సిపాలిటీగా నరసరావుపేటను తీర్చిదిద్దిన ఈ 'శివదేవుడి' కార్యదీక్షల నభినందించాల్సిందే!

ఖాళీగా ఉన్న రోజుల్లో సాయంత్రం వేళల్లో ఆ నాటి అరవ లక్ష్మమ్మగారి మనవలచే ప్రస్తుతం నడుపబడుతున్న 'వసంత విహార్' హొటల్లో చర్చించబడే క్లుప్తమైన ప్రాదేశిక, సంగీత, సాహిత్య గోష్ఠులు అనుభవైకవేద్యాలు. ఆ నాటి పోలీస్ స్టేషన్, వరవకట్ట ప్రాంతంలో సుబ్రహ్మణ్యం బజ్జీల బండి నరసరావుపేట కుర్రకారుకి ఒక మరువలేని అఖండ కావ్యం.

భౌతికశాస్త్రాధ్యయనంలో, శాస్త్రపరిశోధనల్లో, అధ్యాపక వృత్తిలో ఉంటూ, వందకు పైచిలుకు శాస్త్ర పరిశోధనా వ్యాసాల్ని, అంతర్జాతీయ ప్రచురణల్ని సాధించినా, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక విజేత (2012) ఐనా దేశవిదేశాలలో వైజ్ఞానిక పరిశోధనా సదస్సులలో ప్రసంగించినా- విలువల్ని ప్రతిష్ఠించిన మాతాపితరులు స్వరాజ్య విజయలక్ష్మీ వేంకట్రామశర్మగార్లు, సహకరించిన తోబుట్టువులు, మిత్రులున్నూ, మించి సాక్షాత్తు కారణభూతులైన అధ్యాపకులు నా మదిలో మెదలుతున్నారు.

ఇన్ని నా కిచ్చిన ఈ పేటకు- ఈ గడ్డకు ఏమి ఇచ్చి ఈ ఋణం తీర్చుకుంటానా! అనే ఆలోచన వెంటాడుతుంటే సుమారు (1990-1995) అర్ధ దశాబ్ద కాలంపాటు ఎస్.ఎస్ & ఎన్. కాలేజిలో నేను చేసిన ఉచిత, తాత్కాలిక భౌతికశాస్త్ర అధ్యాపకవృత్తి కొంత ఊరట కల్గిస్తున్నది. •

# నా మదిలో ఆనాటి నరసరావుపేట

**బేతపూడి సుందరాచారి,** సీనియర్ టెక్నీషియన్



నరసరావుపేట పట్టణంలో ప్రజల ఆదరాభిమానాలవల్ల నేనొక స్థాయికి ఎదిగినందుకు సంతోషిస్తున్నాను. తల్లిదండ్రులు నాకు పెట్టిన సుందరాచార్యులు అనే పేరుకన్న ప్రజలుపిలిచే సుందరమే నాకు సుందరాతిసుందరం.

మన వూళ్లో ఆంధ్రాబ్యాంక్ ఆవిర్భవించిననాడు మొదటి ఖాతాదారుడిని నేనే! మన పట్టణంలో మొట్ట మొదట కూరగాయల మార్కెట్ ఇప్పటి శివుడుబొమ్మ దగ్గర ఉండేది. అంతకుముందు కాలంలో మున్సిపల్ ఆఫీసు ముందేవుండేది. ఇప్పటి ఏంజిల్ టాకీస్ మొదట్లో టూరింగ్ టాకీస్.

1934, 35 సంవత్సరాలలో నరసరావుపేటలో మేదరబజారులో కలరావచ్చింది. రోజుకు 60నుండి70 వరకు ప్రజలు చనిపోయారు. వినాయకచవితి మరుసటి రోజు నుండే ఈ ఘోరకలి మొదలైంది. అప్పుడు మునిసిపాలిటీ వారి సలహా ప్రకారం రైలు బొగ్గు ఏరుకొని వచ్చి పగులకొట్టి పొగవేశారట.

ఆ రోజుల్లోనే వావిలాల వాసుదేవశాస్త్రిగారు జర్మనీ నుండి జనరేటరు తెప్పించి కూరగాయల తోటలో- అంటే ఇప్పటి బరంపేట దారిలోని కరెంటు ఆఫీస్ వద్ద ఏర్పాటు చేశారు. అప్పట్లో హనుమాన్ ఫౌండ్రి అనేది అరండల్ పేటలో వుండేది. కిరోసిన్ ఇంజన్‌తో లేత్‌మిషన్ పని మేము చేసేవాళ్లం. చాకలిస్తోబు ఎదురుగా పొగాకు కొట్టు ఉండేది. దాని ఎదురుగా బందరు పల్లెకారు ఉండేది. కానీ మే తీన్ మజా అని అరుస్తూ ఒక కానికి ఒక స్వీటు, ఒక హాటు, ఒక ముంత కింది పప్పు ఇచ్చేవాడు. ఆ రోజుల్లో నరసరావుపేటలో పత్తి జిన్నింగ్ మిల్లులు, శనక్కాయల మిల్లులు ఏర్పడ్డాయి. కాకుమాను హనుమయ్యగారు వీటికి మొదటి వ్యవస్థాపకులు.

1955 డిసెంబర్ 10వ తేదీన జవహర్‌లాల్ నెహ్రూగారు నాగార్జునసాగర్ శంకుస్థాపన నిమిత్తం వచ్చారు. అప్పుడు మాచర్లలో విద్యుత్తు లేదు. నెహ్రూగారి విశ్రాంతి గృహానికి ,శంకుస్థాపన ప్రదేశానికీ జనరేటర్ ద్వారా సరఫరా చేసిన అదృష్టం ఈ వ్యాసకర్తకు దక్కింది!! •

# నరసరావుపేట 'నాది'...




కె.వి.కె. రామారావు

లైబ్రరీ సైన్స్ లెక్చరర్ (రిటైర్డ్)


'మీది ఏ ఊరు?' అని ఎవరైనా అడిగితే... 'నాది నరసరావుపేట!' అనే వాడిని. అయితే నాకు ఊహ పెరిగే కొద్దీ నా ఆలోచనల్లో మార్పు వచ్చింది. జన్మభూమి కన్న తల్లితో సమానం అనుకున్నదే తడవుగా నరసరావుపేట 'నాది' అయింది. నా వంతుగా నేను నా ఊరికి మంచి చేయా లనిపించింది.

1979 చివర్లో ఈనాడు విలేఖరిగా నాకు ఓ అవకాశం లభించింది. ఆనాటి నుంచి నరసరావుపేటలో ఏ మూల ఏం జరిగినా అధికారుల దృష్టికి, ప్రజల దృష్టికి తీసుకు వెళ్లి ఆయా సమస్యల పరిష్కారం కోసం పనిచేశాను. అయినా ఏదో అసంతృప్తి నన్ను వెంటాడుతూనే ఉంది! ఇంకా ఏం చెయ్యాలి? ఇలా ఎన్నో ఆలోచనలు. 1985 ప్రాంతంలో నరసరావుపేట చరిత్ర రాసేందుకు జరిపిన ప్రయత్నంలో ఈ పట్టణానికి అప్పటికే 188 ఏళ్ల చరిత్ర వున్నట్లు గమనించడం యాదృచ్ఛి కంగా జరిగింది. నరసరావుపేటలో పుట్టి పెరిగిన నాకు ఈ అంశం ఎంతో ఆసక్తిని కలిగించింది. పట్టణ పూర్తి పాతాలను మరింత విపులంగా తెలుసుకోవటానికి పూనుకున్నాను.

వెయ్యేళ్ల చరిత్ర గలిగిన అట్లూరు గ్రామంలో రాజా మల్రాజువేంకట గుండారాయణింగారు 1797లో కోట, కోటంత పేట నిర్మించినట్లు గమనించి అదే అంశాన్ని వెంటనే డైరీలో రాసి పెట్టుకున్నాను. ఇలా ఏడాదికేడాది ద్విశతాబ్ది ఉత్సవాలను నిర్వహించుకోవలసిన అవసరం గురించి, పట్టణ భవిష్యత్‌ను బాగుచేసుకునే ప్రతిపాదనలను ఎరుక పరిచాను. అన్నిరంగాలవారికి నచ్చిన ఫలితంగా లభించిన స్పందనతో, 200 ఏళ్ల కార్యక్రమం ఊరుమ్మడి పండగలా జరిగింది.

ముఖ్యంగా చెప్పుకోవలసిన వ్యక్తి ఆనాటి రాష్ట్ర పంచాయితీరాజ్‌శాఖ మంత్రి డాక్టర్ కోడెల శివప్రసాదరావు అన్నింటా తానై ప్రతి కార్యక్రమాన్ని నడిపించారు. అంతేకాదు, ఆ ఉత్సవాలను జన్మభూమి కార్యక్రమాలతో మిళితంచేసి మరింత వన్నెతెచ్చారు. నా కలలకు ప్రతిరూపంగా నరసరావుపేట పట్టణం సరికొత్త అందాలను సంతరించుకుంది. ఎన్నో వసతులు అమిరాయి. భవిష్యత్తులో మరిన్ని సౌకర్యాలకు పునాదులు ఏర్పడ్డాయి.

ప్రఖ్యాత వేణుగాన విద్వాంసుడు ఏల్చూరి విజయ రాఘవరావు ద్విశతాబ్ది ఉత్సవాల సందర్భంగా సన్మానాన్ని అందుకుని సాక్షాత్తు ఏడుకొండల వేంకట రమణుని సమక్షంలో జరిపించే బ్రహ్మోత్సవాల్లాగా దివ్యంగా జరిపించారని 'దొరకునా ఇటువంటి సేవ!' అంటూ కొనియా డటం ఎంతో మధురానుభూతిని కలిగించింది.



విజయ రాఘవరావు

ఈనాడు పత్రిక ప్రధాన సంపాదకులు రామోజీరావు 'జన్మభూమికి జయహే' అంటూ ప్రగతి ప్రస్థానానికి ఉద్యుక్త మౌతున్న నరసరావుపేట ప్రజానీకాన్ని అభినందించారు.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అప్పటి వైస్ ఛాన్సలర్ నాయని కృష్ణకుమారి నరసరావుపేట అందాలకు మురిసిపోయారు. అప్పటికి ఇప్పటికీ పోలికే లేదు. తాను 1930లో జన్మించానని, అప్పుడు ఇక్కడ ఆసుపత్రి సౌకర్యం కూడా లేక పోవటంతో గుంటూరు జనరల్ ఆసుపత్రిలో మా అమ్మ పురుడు పోసుకుందని కృష్ణకుమారి అన్నారు.



నాయని కృష్ణకుమారి

ఆనాటి ద్విశతాబ్ది ఉత్సవాల సందర్భంగా పెద్దల

మనోభావాలు ఇలా పెల్లుబికాయి! అందరూ ఒకరి నొకరు ఆప్యాయంగా పలకరించుకున్నారు!! తీపిగుర్తులతో తరలి వెళ్లిపోయారు!!!

## నా నరసరావుపేట ఎలా ఉండేది...

1885 నుంచి పంచాయితీగా వున్న నరసరావుపేట 1915లో మునిసిపాలిటీ స్థాయికి ఎదిగినప్పటికీ ఒక మంచి దశకు చేరుకోవటానికి చాలా కాలం పట్టింది. అనేక సంవత్సరాలు పల్లెవాసాన్నే గడిపింది.

రాజాగారి కోటలో ప్రతి రోజు మూడుసార్లు నగారా వాయించేవారు. పోలీస్ స్టేషనులో గంటకోసారి టైం ప్రకారం గంటలు మోగించేవారు.

1915 జనాభా 6,700. 1980లో ఫస్ట్ గ్రేడ్ మునిసిపాలిటీ అయినప్పటి జనాభా 67,026. ఇక 2011



అప్పటి నాగసరపు సుబ్బరాయ శ్రేష్ఠి చలివేంద్రం సెంటర్



అప్పటి ఆర్.టి.సి.బస్టాండ్ రోడ్

సెన్సెస్ ప్రకారం అప్పటి జనాభా 1,17,489గా ఉంది.

ఇక్కడ తొలుత 1881లో లోకల్ ఫండ్ ప్రైమరీ పాఠశాల ఏర్పడింది. ఆ తరువాత 1901లో హైస్కూలు, 1950 లో ఎస్.ఎస్.ఎన్. కళాశాల స్థాపించటం జరిగింది.

1886లో ఈ పట్టణం మీదుగా బందరు నుంచి గోవాకు రైలుమార్గం ఏర్పడింది. 1993 ఫిబ్రవరి 16వ తేది నుంచి బ్రాడ్‌గేజి అయింది.

1890లో విక్టోరియా మెమోరియల్‌హాలు (ప్రస్తుత గీతామందిరం) ఏర్పడిన నాటి నుంచి నరసరావుపేట నాటకాలకు నాంది పలికింది. 1892లో కారంపూడి నుంచి డిస్ట్రిక్ట్ సబ్‌కోర్టు, 1896లో వినుకొండ నుంచి డిప్యూటి కలెక్టరు ఆఫీసు వచ్చాయి.

1910 నుంచి తయారైన నరసరావుపేట కేంప్ ఫర్నీచర్ దేశవిదేశాల ఖ్యాతిని ఆర్జించింది. కేరళ నుంచి తెప్పించిన వైడ్‌సిడ్డర్ కలప ఉపయోగించి బాబాసాహెబ్ సోదరులు, కందిపాటి హనుమయ్య, నారాయణ, కళ్యాణం నారాయణ లాంటివారు మడత మంచాలు, పడక కుర్చీలు తయారుచేస్తూ ఎంతో పేరు గడించారు.

ఒకప్పుడు నరసరావుపేటలో అన్నదాన సత్రాలు వుండటంతోపాటు నిత్యాన్నదాన కార్యక్రమాలు జరిగేవి. విశిష్ట ధర్మసంస్థల నిర్వహణకు గుర్తింపుగా కొప్పురావూరి వెంకటప్పయ్య 1911లో అప్పటి ఐదవ జార్జిచక్రవర్తి చేతుల మీదుగా ఘనసన్మానం పొందారు.

1916కు పూర్వం నరసరావుపేట వాసులు ఎంత దూరం వెళ్లాలన్నా కాలినడకే గతి. లేదా ఎడ్ల బండ్లమీద ప్రయాణం సాగేది. అలాంటి తరుణంలో శౌరయ్య సోదరులు ఒక బస్సు తెచ్చారు. ఆ వింతను చూసేందుకు ఎడ్ల బండ్లు కట్టుకుని ప్రజలు వచ్చారని చెప్పుకునేవారు. 1924లో గాలి టైర్లు కలిగిన బస్సులు వచ్చాయి. 1944లో రెండవ ప్రపంచ యుద్ధం కాలంలో పెట్రోలు లభ్యం కాకపోవటంతో బస్సు వెనుక భాగంలో కొన్ని సీట్లు తొలగించి సిమన్స్ గ్యాస్ ట్యాంకును ఏర్పాటు చేసి బొగ్గుతో నింపి రెండు గంటలపాటు బ్లోయర్లతో శ్రమించి ఇంజను స్టార్ట్ చేసేవారు. తరువాత పెద్ద మోత పెడుతూ బస్సు కదిలి వెళ్లేది. ప్రజలు మునిసిపల్ హైస్కూలు ముందు పలనాడురోడ్డులో గుంపులుగా చేరి ఈ తతంగాన్ని చూసేవారు. అలా 1949 వరకు బొగ్గుబస్సులు నడవటం చూశాం. నరసరావుపేటకు మొదట సైకిల్, రేడియో తెచ్చింది కూడా శౌరయ్య సోదరులే!

1919లో కూడా పార్కు ఎదురుగా ఉండే సత్రం (ప్రస్తు తం కాసుబ్రహ్మానందరెడ్డి మార్కెట్) తప్ప ఇళ్లుండేవి కావు. రాత్రి వేళల్లో రైలు దిగి ఊళ్లోకి రావాలంటే భయపడేవారు. మట్టిరోడ్లు, తుమ్మచెట్లతో అడవిలా ఉండేది.

1935 వరకు విద్యుత్ సరఫరా లేదు. వీధుల్లో కొయ్య స్తంభాలు పాతి వాటిమీద దీపాలను కిరోసిన్‌తో వెలిగించేవారు. ప్రస్తుతం విద్యుత్‌శాఖ కార్యాలయం ఉన్నచోట నాలుగు జనరేటర్లు పెట్టి వావిలాల వాసుదేవశాస్త్రి కరెంటు ఇచ్చారు.

100 క్యాండిల్ బల్బులతో 180 వీధిలైట్లను మొదట వెలిగించారు. వాటికి తోడు ఇళ్లకు 140 కనెక్షన్లు ఇచ్చారు.

1938లో ఏంజిల్ టాకీస్ ఒక గుడారంగా ఉండేది. నేల అణా కాణి, బెంచి బేడా, కుర్చీ పావలాతో సినిమాలు ఆడించేవారు. తొలుత అన్నీ మూకీ సినిమాలే! బెంచి గేటు వద్ద ఓ వ్యక్తి కథాగమనాన్ని ప్రేక్షకులకు వివరించేవాడు.

1943లో తొలిసారి నరసరావుపేటలో పది టెలిఫోన్లు మోగాయి. 1983లో కోటలో స్వంత భవనంతో పాటు కనెక్షన్లు వేల సంఖ్యకు చేరాయి.

1951లో ప్రకాష్ నగర్ రైల్వేగేటు అవతల సాయంత్రం 6 గంటలు దాటితే జనసంచారం అంతగా వుండేది కాదు. 1955లో మహారాష్ట్ర నుంచి వచ్చిన కళాకారులు 'కవాకీ' డ్యాన్సు ప్రోగ్రాము నిర్వహించి వినోదాన్ని అందించేవారు. దాంతో మ్యూజికల్ డ్యాన్సు పార్టీలకు నరసరావుపేట కేంద్రస్థానం అయింది. కోటప్పకొండ తిరునాళ్ల ద్వారా అనేక మందికి జీవనోపాధి లభించింది. రికార్డింగ్ డ్యాన్సుల పేరుతో రాష్ట్రవ్యాప్తంగా పేరు గడించారు.

నరసరావుపేటకు శాంతినగర్ రిజర్వాయరు ద్వారా మంచినీటిని సరఫరా చేసే పథకం 1972లో మాజీ ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి సహకారంతో అమలు అయింది. పెరిగిన జనాభాకు సరిపడా రెండు పూటల నీరు అందించేందుకు మరొక కొత్త పథకం కోసం 1996లో పనులు ప్రారంభించారు. నకిరికల్లు దగ్గర 268 ఎకారల్లో ఒక తటాకాన్ని ఏర్పాటు చేయించి నీటిని నరసరావుపేట తరలించటానికి కోడెలవారు కృషి చేశారు. సాధారణంగా నీటి పథకాల కోసం వివిధ దశల్లో మోటార్లు వాడవలసి వుంటుంది. అయితే గ్రావిటీ మూలంగా పైసా ఖర్చు లేకుండా నీరు నరసరావుపేటకు నడిచి వస్తోంది.

ద్విశతాబ్ది ఉత్సవాల సందర్భంగా ప్రజలకు ఎన్నో వసతులు సమకూరాయి. స్థానిక బరంపేటలో సుమారు 20 ఎకరాలలో కోడెల శివప్రసాదరావు స్టేడియం నిర్మాణం జరిగింది. 42 ఎకరాల విస్తీర్ణంలో వున్న వల్లప్పచెరువు బాగు పడింది. ఎకరం విస్తీర్ణంలో భువనచంద్ర టౌన్‌హాలు, డాక్టర్ కోడెల శివప్రసాదరావు ఓపెన్ ఎయిర్ థియేటర్ నిర్మాణాలు జరిగాయి. వాటికి సమీపంలో ముస్లింసోదరుల కోసం షాదీఖానా ఏర్పాటు చేశారు. మురికి నీటి నిలయంగా వుండే వస్నారు కుంటను ఓ చక్కటి పార్కులా తీర్చిదిద్దారు. అన్నింటినీ మించి పట్టణంలోని ప్రధాన వీధులను వెడల్పు చేసి, రోడ్ల మధ్య డివైడర్లు ఏర్పాటు చేసి, ఫ్లోరసెంట్ లైట్లతో విద్యుత్ స్తంభాలు నిర్మించి వీధు లన్నింటినీ దేదీప్యమానం చేశారు. తారు రోడ్లు, మట్టిరోడ్ల స్థానంలో సిమెంటు రోడ్లు వేయటంతో నరసరావు పేట నగర శోభను సంతరించుకుంది.




మాజీమంత్రి కాసు వెంకటకృష్ణారెడ్డి సహకారంతో గాంధీ పార్కు ఎదురుగా ఉన్న పురాతన కట్టడాలను తొలగించి కాసు బ్రహ్మానందరెడ్డి మార్కెట్ పేరుతో పెద్ద భవనసముదాయం నిర్మించటం జరిగింది. రైల్వే మొదటిగేటు సమీపంలో పెద్ద పోస్టాఫీసు కోసం నూతన భవనాలను ఏర్పాటు చేయించారు. అంతేకాకుండా పట్టణంలో పెద్దఎత్తున భూగర్భ డ్రైనేజ్ నిర్మాణం జరిపించారు. ప్రస్తుతం నరసరావుపేట మున్సిపల్ వంద సంవత్సరాల వేడుకలను పురస్కరించుకొని దానిని పూర్తిచేయ తలపెట్టారు.

అయితే నరసరావుపేట జనాభా ఇంకా ఇంకా పెరుగుతూనే ఉంది. ఇంతవరకు ఎందరో మహానుభావులు ఈ పట్టణ అభివృద్ధికోసం, ప్రజల అవసరాలను తీర్చేందుకు పాటుపడ్డారు. ఇంకా కొనసాగించవలసిన కార్యక్రమం మరెంతో వుంది.

ఇప్పుడు నరసరావుపేట పురపాలక సంఘం వందేళ్ల పండుగ రూపంతో పట్టణ అభివృద్ధికి మరో మంచి అవకాశం లభించింది. ఊరికి ఉపకారం ఇంకా జరగాలి.

అందుకే అందరూ నరసరావుపేట 'నాది' అనుకోవాలి. అప్పుడే పుట్టి పెరిగిన నేల తల్లికి న్యాయం జరుగుతుంది. •

# పాత కాలపు జ్ఞాపకాలు



జమ్ముల బాపయ్య
రైస్ ట్రేడర్

మా చిన్నతనములో అప్పుడు గవర్నమెంటు కార్యాలయాలన్నింటికి అమావాస్య రోజున సెలవు. అనగా నెలకు ఒకరోజు మాత్రమే సెలవు ఇచ్చేవారు. ఆ రోజున వ్యాపారస్థులు, స్థానికులు అందరూ బజారు కొట్టువద్ద వున్న బండలపై కూర్చొని పేకాట ఆడేవారు. పెద్దచెరువులోని నీళ్లు గలీజు చేయకుండా మున్సిపాలిటీవారు పనివారిని కాపలా పెట్టేవారు. పూర్వం రాజాగారి ఏనుగులను కడగడానికి, వాటి తాగునీళ్లకి ఉపయోగించేవారు. ఈ చెరువులో నీళ్లు నిండిన తరువాత చిన్నచెరువుకు వదిలేవారు. సత్తెనపల్లి రోడ్డులో ఉన్న చెరువును చిన్నచెరువు అనేవారు.

అప్పుడు వీధి లైట్లు లేవు. మున్సిపాలిటీవారు గానుగ నూనెగానీ, నువ్వులనూనెగానీ పోసిన గిన్నెలో లాంతరు వత్తులు పెట్టి వెలిగించేవారు. నాలుగు వైపుల అద్దాలు పెట్టి ఉండేవి. వాటిని నాలుగు బజార్ల మధ్యన ఇనప స్తంభం మీద పెట్టేవారు. ఆరు సంవత్సరాలు కరెంటు ఇంజిన్ పాడై పోవడం వలన పెట్రొమాక్స్ లైట్లును ఉపయోగించారు. నా చిన్నప్పుడు ఏ కొద్దిమందికో వాచీలు ఉండేవి. కొత్తూరి వెంకటేశ్వర్లుగారు ఛైర్మన్‌గా ఉన్నపుడు సైరన్ యంత్రాన్ని తీసుకొని వచ్చారు. దానిని ఉదయం 5 గంటలకి, మరల 8 గంటలకి, మధాహ్నం 12 గంటలకి, సాయంత్రం 6 గంటలకి మోగించేవారు. అంతకు ముందు రాజాగారి కోటగుమ్మం వద్ద నగారా మేళం మోగించేవారు. వీటిని బట్టి పట్టణ ప్రజలకి సమయం తెలిసేది.

ఆ రోజుల్లో కోటసెంటర్, కోమటిసెంటర్ అనే రెండు సెంటర్లు ఉండేవి. కోమటిసెంటర్‌ని పెద్దసెంటర్ లేక పెద్ద బజార్ అనేవారు. అదే ఇప్పటి మల్లమ్మ సెంటర్. 'కోట ఎంతో–పేట అంత' అన్నట్లు మన ఊరు చిన్నదిగా వుండేది. నా చిన్నతనంలో మున్సిపాలిటీ అధికారులంటే కొంచెం భయం ఉండేది. కొన్ని సందర్భాలలో దొంగతనం చేసినా లేదా ఏదైనా ప్రభుత్వ ఆస్తిని నష్టపరచినా వారిని ఆఫీసు ముందు చెట్టుకు కట్టివేసి కొట్టేవారు. మున్సిపాలిటీ శానిటరీ ఇన్స్‌పెక్టర్స్ ఇద్దరు ఉండేవారు. పట్టణములోని తినే పదార్థాల బండ్లు, హోటల్స్ అద్దాలు లేకుండా ఉంటే కేసులు పెట్టేవారు. పాడైపోయిన పదార్థాలున్నా కేసులు పెట్టేవారు. వీరు ఇంటింటికి వచ్చి కుటుంబ ఆరోగ్యం గురించి విచారించేవారు. ఎవరైనా పిల్లల్ని కన్నా లేదా ఎవరైనా చనిపోయినా దానిని మునిసిపాలిటీకి తెలియజేయవలసిందే! తెలుపకపోయినట్లయితే వారిపై కేసులు పెట్టేవారు. తాలూకాకోర్టులో మున్సిపాలిటీ కోర్టు ఉండేది. దీనిని 'మున్సిపాలిటీ బెంచ్' అనేవారు. ఈ కేసులన్నీ బెంచి దగ్గర విచారించి దోషులకు అపరాధరుసుము వేసేవారు.

త్రాగునీటి పంపులు రాకముందు ప్రజలు నీటి కోసం చాలా ఇబ్బంది పడ్డారు. కేవలం బ్రాహ్మణుల ఇళ్లలో మాత్రమే బావులు ఉండేవి. అక్కడక్కడ ఉప్పునీటి బావులుండేవి. మంచినీటి కోసం నాగసరపువారి బావి, పెద్దచెరువులో మూడుబావులు, ఆవులసత్రం ఎదురు బావి మాత్రమే ఉండేవి. ప్రతినెల మున్సిపాలిటీవారు వాటిలో మందు చల్లేవారు. 1936, 1962, 1977 సంవత్సరములలో పెద్ద తుఫాన్లు వచ్చాయి. అప్పుడు మున్సిపాలిటీ ఆఫీసులో బియ్యం పంచారు. పాండురంగస్వామిగుడి ఎదురుగా 'బందెలదొడ్డి' దానికి ఎదురుగా 'మున్సుబ్ కచేరి' ఉండేవి.

మన నరసరావుపేట జమీందారుగారు ఛైర్మన్‌గా వున్నప్పుడు వీథుల్లో చెత్త తియ్యటానికి ట్రాక్టర్ తీసుకొని వచ్చారు. మొదటి డ్రైవర్ లక్ష్మీశెట్టి విజయరామయ్య. అంతకు ముందు చెత్తను ఒంటెద్దుబండిపై తీసుకువెళ్లేవారు. ఆ రోజుల్లో అనిశెట్టి కోటిలింగం, నాగసరపు కృష్ణమూర్తిగార్ల మధ్య ఛైర్మన్

పదవికి పోటీ జరిగింది. అప్పుడు 13 వార్డులు ఉండేవి. ఆ కాలంలో 3 సంవత్సరాల కొకసారి ఎన్నికలు జరిగేవి. అప్పుడు మురికికాలవలు ఉండేవి కావు. పెద్దబజారులో మాత్రమే ఉండేవి. అప్పుడప్పుడు దొంగతనాలు జరిగేవి. అందువల్ల రాత్రివేళల్లో కొంతమంది కర్రలతో, కారంతోను గస్తీ తిరిగేవారు. పగలు మల్లమ్మసెంటర్, కోటసెంటర్, నెహ్రూ చౌక్ (ఇప్పటి గడియారంస్తంభం సెంటర్), ఇప్పటి కూర గాయల మార్కెట్ సెంటర్‌లలో ఒక్కొక్క పోలీసు కానిస్టేబుల్ ఉండేవారు.

గాంధీగారు రెండుసార్లు నరసరావుపేటకు వచ్చారు. ఆరేపల్లి ముప్పాళ్ల గ్రామప్రజలు గాంధీగారితో 'మీరు మా ఊరికి వస్తే మీరు ఎంత బరువున్నారో అంతబంగారం ఉద్య మానికి ఇస్తాం!' అనిచెప్పి ఆయనను తీసుకెళ్లి ఊరివారం దరూ కలసి బంగారాన్ని సేకరించి ఇచ్చారు. మన ఊరికి మొట్టమొదటి మహిళా కౌన్సిలర్ మన్నేపల్లి సావిత్రమ్మగారు. అప్పటి చైర్మన్ పాటిమళ్ల సుబ్బారావుగారు. ఈయన స్వాతంత్ర్య సమరయోధుడు. వీరు రెవిన్యూ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేశారు. గాంధీగారి పిలుపుమేరకు ఉద్యోగానికి రాజీనామా చేసి ఉద్యమబాట పట్టారు. వీరి ఇంటికి ఎన్.జి.రంగా, బెజవాడ గోపాలరెడ్డి, నూజివీడు ఎమ్.ఎస్. అప్పారావు, వావిలాల గోపాలకృష్ణయ్య, టంగుటూరి ప్రకాశంపంతులుగార్లు వచ్చే వారు. స్వాతంత్ర్య ఉద్యమ నాయకులు మన ఊళ్లో ఆవుల సత్రం వద్ద, రైల్వేస్టేషన్ వద్ద, కోటప్పకొండ వద్ద రహస్య సమావేశాలు జరిపేవారు. అపుడు గస్తీ తిరుగుతున్న పోలీసుని పాటిమళ్ల సుబ్బారావు, పల్లె బిందుమాధవాచార్యులు, స్వస్తిక్ అప్పారావు, రాఘువరపు కోటయ్య, గాసె సైదులు, క్రోసూరి పుల్లయ్య, కుంకలగుంట కోటయ్య, లక్ష్మిశెట్టి వీరభద్రయ్య కొట్టారు. అందుకు వీరిని అరెస్టు చేశారు. జమీందారుగారు వీరిని విడిపించారు. పట్టణంలోని దేవాలయా లన్నింటిమీద ఎండోమెంటు ఆఫీసర్‌గా గోగుల సూర్యరావుగారు ఉండేవారు. వీరు మొట్టమొదట కోటప్పకొండ ఈ.ఓ.గా వచ్చారు.

శ్రీరామనవమి ఊరిపండుగగా ఉండేది. ఆ ఒక్కరోజు మాత్రమే ప్రజలను కోటలోనికి రానిచ్చేవారు. చూడ నిచ్చే వారు. ఆ రోజు అందరూ గుళ్ల నుండి బెల్లం పానకం కుండల నిండుగా ఇంటికి తీసుకువెళ్లేవారు. ఆ తర్వాత రోజున స్వామి వారి రథయాత్ర చేసేవారు. తెలంగాణ రజాకార్ల బారినుండి తప్పించుకుని కొన్ని కుటుంబాలవారు మన ఊరికి వచ్చేవారు. వారిని మన ఊరివారు ఆదరించేవారు.

ఆ రోజుల్లో ర్యాలీ, హంబర్ కంపెనీల సైకిల్ ఉంటే చాలా గొప్పగా ఉండేది. పాతూరి భీమలింగేశ్వరస్వామి గుడిలో ఒక ఏనుగు ఉండేది. శివరాత్రి రోజు దానిపై స్వామి వారిని ఊరేగించేవారు. ఆ మరుసటి రోజున రథం ఊరే గింపు ఉండేది. రాజాగారి కోటలో ఇప్పుడున్న 3 హాస్పటల్స్ వద్ద డ్రామాలు, నాటికలు, కుస్తీపోటీలు జరిపేవారు. ఈ కుస్తీపోటీలలో మీనా కోటయ్య, అల్లీసాయిబు, బాషా మొదలైన వస్తాదులు ఉండేవారు. గాంధీచౌక్ (ఇప్పటి శివుడు బొమ్మ వద్ద), కోటసెంటర్ వద్ద, మార్కెట్ సెంటర్ ఈ మూడు చోట్లలో కూరగాయలు అమ్మేవారు. కొన్ని సంవత్సరాల తరవాత శ్రీరాంపురం వద్ద, ఆ తరవాత మూడోగేటు వద్ద పెద్దమార్కెట్ ఏర్పాటుచేశారు. పల్నాడుకు, తెలంగాణా ప్రాంతాలకు సారాయి తయారుచేయటానికి తాడేపల్లివారు బెల్లం, తాటిబెల్లం పంపేవారు. బస్‌స్టాండ్ మొదట కూర గాయల మార్కెట్ వద్ద ఉండేది. అక్కడ దిగి ఎద్దుల బండి, మనిషి లాగే బళ్లమీద ఇంటికి వెళ్లేవారు. అపుడు రైల్వే స్టేషన్‌లో గుఱ్ఱపు బండ్లద్వారా తమ తమ ఇళ్లకు వెళ్లేవారు. అపుడు మూడు రైళ్లు ఉదయం, మధ్యాహ్నం, రాత్రి వచ్చేవి. అప్పట్లో స్టేషన్ ఊరి బయట ఉండేది. దొంగల భయం అధికంగా ఉండేది. రాత్రిపూట స్టేషన్ నుండి ఇంటికి వెళ్లా లంటే భయం వేసేది. పదిమంది గ్రూపుగా వెళ్ళేవారు.

1909-'30 వరకు వైదికులు, నియోగుల మధ్య గొడవలు జరిగేవి. ఈ రెండు కాని వారిని బిల్ కలెక్టర్‌గా పంపించేవారు– జిల్లా కలెక్టర్. అపుడు పట్టణములో మూడు భోజన హోటళ్లే ఉండేవి. ఒకటి కోడూరి వెంకమ్మ హోటల్– ఇది చర్చిసెంటర్ కోర్టుసెంటర్ ఎదురుగా ఉండేది. రెండవది మల్లమ్మసెంటర్‌లో అర్వపల్లి నరసింహారావు హోటల్. మూడవది మల్లమ్మ సెంటర్‌లో అనిశెట్టి రత్తమ్మ మిలటరీ హోటల్.

రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు తెల్ల పెట్రోల్,

ఎఖ్ఖపెట్రోల్, తెల్లకిరసనాయిల్, ఎఖ్ఖకిరసనాయిల్ అనేవి నాలుగు రకాలుగా ఉండేవి. ఒక పెట్రోల్ బంకు నరసరావుపేట జమీందారుగారిది. ఇది కోటసెంటర్‌లో వుంది. మరొక పెట్రోల్ బంకు శౌరయ్యగారిది. ఇది గడియార స్తంభం సెంటర్ చలివేంద్రం పక్కన ఉండేది. రెండవ ప్రపంచయుద్ధం వల్ల పెట్రోల్ దొరకలేదు. అపుడు బొగ్గుబండ్లు తీసుకొచ్చేవారు. బస్సుల్లో, లారీల్లో బొగ్గువేసి నడిపేవారు. యుద్ధంలో బ్రిటీష వారు వాడిన లారీలను శ్రీ సీతారామాంజనేయ మోటారు స్టోర్స్‌వారు తీసుకొచ్చేవారు. వాటిని బస్సులుగాను, లారీలుగాను, మార్చి ఉపయోగించేవారు. ఈ యుద్ధం తరువాత బ్రిటిషువారు రేషన్ షాపు మొట్టమొదటగా ప్రారంభించారు. ఇందులో బియ్యం, జొన్నలు, బంగాళదుంప, బొరుగులు ఇచ్చేవారు. రాజాగారివి 30 బస్సులు, శౌరయ్య గారివి 24 బస్సులు, తుమ్మల రామకోటయ్యగారివి 4 బస్సులు, ఖాసిం సాయిబుగారిది1 ఉండేవి. నీలం సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రిగా ఉన్నపుడు బస్సులన్నీ జాతీయం చేశారు. స్థానిక పట్టాభిరామస్వామిగుడి వెనక, నైరుతి వైపు నేలపై 5 అడుగుల పోతురాజు విగ్రహం కలదు. ఈ విగ్రహానికి కుడికన్ను దగ్గర నుండి చూస్తే కోటప్పకొండ పాతకోటయ్య స్వామిగుడి కనబడుతుండేది. శివరాత్రి రోజు, ఆ మరుసటి రోజు నరసరావుపేట పట్టణప్రజలకు, వచ్చిన భక్తులకు మున్సిపాలిటివారు చేసే సేవలు చెప్పుకోదగ్గవి. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా ఉన్నాయి. నాకు గుర్తుకువచ్చినవి కొన్ని మీ ముందుంచాను.

## విద్య



మనం నేర్చుకున్న ఏ విద్యయైనా సరే! బయటకు కనపడకుండా మనలోనే అదృశ్యరూపంలో ఉండే సంపద. మనిషికి శాశ్వతమైన సౌందర్యం. అదే మనకు మంచి కీర్తిని తెచ్చిపెడుతుంది. సమస్త భోగాలను కలిగిస్తుంది. మనలోని అజ్ఞానాన్ని పారద్రోలి విజ్ఞానాన్ని ప్రసాదించే గురువు. ఇతర ప్రాంతాలకు వెళ్లినప్పుడు ఆత్మీయబంధువులాగా సహాయపడుతుంది. విద్య మన ఇష్ట దైవం. దానికి సమానమైన ధనం ఈ ప్రపంచంలో ఎక్కడా లేదు. విద్య రాజ్యపాలకుల వద్ద, అధికారుల వద్ద మనకు గౌరవాన్ని కల్గిస్తుంది. కనుకనే ఇన్ని విధాల విశిష్టత కలిగిన విద్యను ప్రతిమనిషి నేర్చుకొనితీరాలి.

– భర్తృహరి సుభాషితం

## దొంగలు తెచ్చిన దూలం

ప్రఖ్యాలక్ష్మమ్మగారు శివరాత్రి సందర్భంగా జమీందారుగారి విడిదిలో వంట చెయ్యటానికి కోటప్పకొండకు వెళ్లారు. వంటపని పూర్తి అయింది. డబ్బులు తీసుకొని చీరకొంగున ముడి వేసుకొన్నది. 'వెళ్లివస్తా!' నన్నది. 'అవ్వా! వంట బాగా చేశావు. బహుమానం ఏమి కావాలో కోరుకో!' అన్నా రొక ఉద్యోగి. కొండ క్రింద వినాయకుని గుడి ఎదురుగా ఒక పెద్ద దూలం పడిఉంది. 'బాబుగారూ! మిద్దె కట్టుకొంటున్నాం. ఆ దూలా న్నిప్పించండి' అన్నది. 'సరే! తీసుకొనివెళ్లు' అన్నారాయన.



ఆ రాత్రి లక్ష్మమ్మగారు దూలానికి తల ఆనించి నిద్రపోతున్నది. ఒక రాత్రివేళ ఏదో అలికిడి వినబడింది. లక్ష్మమ్మ కళ్లుతెరిచి చూసింది. నలుగురు మనుషులు డబ్బుల కోసం తడుముతున్నారు. 'ఎవర్రా మీరు?" అన్నది లక్ష్మమ్మ. 'దొంగలం' అన్నారు వాళ్లు ధీమాగా! 'నాయనా! మీకు పుణ్యముంటుంది. ఈ దూలాన్ని మా యింటికి చేర్చండి. కమ్మగా భోజనం పెడతా!' నన్నది లక్ష్మమ్మ. ఏ కళ నున్నారో! దొంగలు 'సరే!' అన్నారు. 'మేము పగటిపూట రాముగానీ అవ్వా!' రాత్రికి వస్తాం!' అన్నారు.

మర్నాడు రాత్రి పన్నెండు, ఒంటిగంట అవుతుండగా నలుగురు దొంగలూ దూలాన్ని మోసుకొంటూ నరసరావుపేటకు వచ్చారు. అరండల్‌పేట చింతలపాటివారివీథిలో ఉన్న స్థలానికి చేర్చారు. 'అవ్వా! వెళ్లివస్తాం!' అన్నారు. 'ఉండండ్రా అబ్బాయిలూ! చక్కగా స్నానాలు చెయ్యండి. అన్నం వండిపెడతా!' నన్నది లక్ష్మమ్మ. 'అట్లాగే!' నన్నారు దొంగలు. లక్ష్మమ్మ రాచ్చిప్ప నిండా పప్పులుసు పెట్టింది. మిరపపండ్ల గోంగూర పచ్చడి వేసింది. నేతిముంత పక్కనే పెట్టింది. దొంగలు నలుగురూ కమ్మగా భోజనంచేశారు. లక్ష్మమ్మకు నమస్కారంచేసి వెళ్లారు. నిన్న మొన్నటి దాకా ఆ దూలం ఆ యింటికి ఉండేది.

